చుండెను. అశ్వికసైన్యములు తెరలు తెరలుగా తాకుటచే యుద్ధసంబంధమైన వర్ణనలలో వీనిని తరంగములుగా రూపించుచుండిరి. సైంధవ వధ నాడు అర్జునుని విజయము ప్రధానముగ అతని సారథి రథవాహనములపై ఆధారపడి యుండెను. శ్రీకృష్ణుడు అశ్వహృదయమును చక్కగా నెరిగినవాడు ఆజంతువుల యవసరములను ఎట్టి భయానకసమయము లందును ఏమరడు – సైంధవవధ సమీపించుచుండగా ఆతడు గుఱ్ఱములను సేదదేర్చినవిధము ప్రశంసనీయము. అలుగులు పెరికి, మేను గలయ నిమిరి. అర్జునుని దివ్యాస్త్రములతో వెడలిన నీటిని త్రావించి, ఖాణము మేపి అశ్వములను నూలుకొల్పెను (ద్రోణ-3-159-165) శత్రుసైన్యమును వెనుకనుండి తాకుటకు అశ్వికబలము ఎక్కువగా ఉపయోగించును. భారతయుద్ధము నందు శల్యుడు మరణించిన తరువాత కూడ కౌరవులు మొండి పట్టుదలతో యుద్ధము చేసిరి. "సుబలసూనుండు ప్రబలతురంగదళసహస్రంబులతో వేగంబు మెఱయ వైరిసేన వెనుకఁగిట్టి" (శల్య-1-337) విజృంభించెను. అప్పుడు ధర్మరాజు తనచిన్నతమ్ముడైన సహదేవుని ఐదువేలగుఱ్ఱములతో శకునిని తాకుటకై పంపెను.

అశ్వదళము చేయవలసిన కార్యములను కౌటిల్యు డిట్లు వివరించెను. "అగ్రామగు ప్రదేశమును నివేశమును అరణ్యములను శోధించుట; విషమముకాని ప్రదేశమును, నీటిని, రేవును గాలిని, వేడిని గుర్తించుట; శత్రువును తరుముట; మొదటిదెబ్బ కొట్టుట; శత్రుసైన్యము ప్రవేశించి చీల్చికొని పోవుట; కోశమునుగాని రాజకుమారునిగాని తప్పించి తీసికొని పోవుట; వెనుక భాగమందును కొనలందును శత్రువుపైపడుట – ఇవి అశ్వదళము చేయవలసిన కార్యములు". ఈప్రకరణమునందే మఱియొకచోట కౌటిల్యు డిట్లు వచించెను. "కావలసినన్ని గుఱ్ఱములులేని రాజు గుఱ్ఱములను ఎద్దులను రథములకు కట్టవలెను." మహమ్మదీయులు భారతదేశమును ప్రవేశించు వరకును అశ్వికసైన్యములు అంతగా వృద్ధిగొందినట్లు కాన్పించదు. హిందూరాజ్యలను జయించుటకు అశ్వికదళములే మునల్మాను విజేతలకు ఎక్కువగా తోడ్పడెను. వారికి అశ్వపతులను బిరుదు సార్థకమయ్యెను. విజయనగరచక్రవర్తులు ఉత్తమాశ్వములను విదేశములనుండి కొనుటకై ధనము విస్తారముగా వ్యయము చేయుచుండిరి. అశ్వాధ్యక్షుని విధులను గూర్చి కౌటిల్యుడు అర్థశాస్త్రమునందు వివరముగ సూచన లిచ్చియున్నాడు. యుద్ధాశ్వములను ఎన్నుకొనుటలో వానివయస్సు శుభలక్షణములు పాటింపబడుచుండెను. కాకతి గణపతి దేవుని గజాధ్యక్షుడు జాయపసేనాని. ప్రతాపరుద్రుని వద్ద సాహిణి మారయ అశ్వాధ్యక్షుడు.

## పదాతులు

'సర్వదేశకాలములందు ఆయుధముల ధరించుట; సైనికవ్యాయామము – ఇవి పదాతులు చేయవలసిన కార్యములు' అని పదాతుల ధర్మములను కౌటిల్యుడు సంగ్రహముగా నిర్దేశించినను విష్టి (కార్మికులు) చేయవలసిన పనులను పదాతుల విధులలోనే చేర్చదగియున్నవి. అవి యేవన – శిబిరములను మార్గములను సేతువులను కూపములను తీర్థములను శోధించి శుభ్ర

పరచుట; యంత్రములను, ఆయుధములను ఉపకరణములను గ్రాసమును మోయుట; యుద్ధరంగమునుండి ఆయుధములను, ఆవరణములను గాయపడినవారిని తీసికొనిపోవుట మున్నగునవి వీరికి సంబంధించి యున్నవి. పత్త్యధ్యక్షుని (పదాతుల యధిపతి) మెలకువలు అర్థశాస్త్రము నందు మరొకచో నిరూపింప బడినవి. "మూలబలము; భృతబలము; శ్రేణీబలము; మిత్రబలము; శత్రుబలము; ఆటవికబలము - వీటిగుణదోషములు, జలములందు, ఎత్తైనప్రదేశములందు చేయవలసిన యుద్ధకర్మలు; ప్రకాశయుద్ధము, కూటయుద్ధము; గోతులలో కాని ఆకాశమందుండి కాని చేయుయుద్ధము; పగటియందు కాని రాత్రిపూటగాని చేయవలసిన యుద్ధము - వీటి నన్నిటిని ఎరిగియుండ వలెను. దీనినిబట్టి పదాతుల కార్యములు కొన్ని తెలియవచ్చుచున్నవి. ఉదాహరణకు మహాభారతమున ద్రోణాచార్యుని నాల్గవనాటి యుద్ధమున రాత్రిసమరముసాగెను. చీకటి దట్టముగా ఆవరించియున్నను ఉభయపక్షమువారును వెనుదీయక ఆవేశముతో పోరుచుండిరి. "అక్కురుభూపాలుండు దమకాలు బలంబుల నెల్ల నాయుధంబులు వెట్టి దివియలు పట్ట నియోగించిన ... యప్పదాతి వర్గంబులుదివియలు దెచ్చిన నద్ధరణీవరుండు రథంబున కైదును. గరికి మూఁడును దురంగంబున కొండును నియతంబుగాఁ బట్టించి" (ద్రోణ-5-144.)

ఆశ్రమవాసపర్వము నందు ధృతరాష్ట్రుడు ధర్మరాజునకు సప్తాంగమైన రాజ్యమును గూర్చి యుపన్యసించుచు ఆరువిధములైన సైన్యములను పేర్కొనెను.

మూలబలంబును మొత్తాలవారును
మిత్రబలంబును శత్రుబలముఁ
గానసంబు బలముఁ గైజీతగాండ్రును. (ఆశ్ర-1-73.)

భారతములో చెప్పబడిన మొత్తాలవారు కైజీతగాండ్రు అనుసైన్యవిభాగములు అర్థశాస్త్రమునందు భృతబలము, శ్రేణీబలముగా కాన్పించుచున్నారు. భృతబలము అనగా అప్పటికి జీతమిచ్చి కూర్చుకొనబడువారు (Mercenaries) అని అర్థము చేయబడినది. శ్రేణీబలము అనగా రాజ్యమునందలి ఆయావృత్తి వ్యాపారసంఘములు సమకూర్చు సైనికులు. మహాభారత కాలమునకును అర్థశాస్త్ర కాలమునకును సాంఘికవిధానమునందు కొంతమార్పు వచ్చియుండవచ్చును. వర్తకసంఘములు కార్మికసంఘములు శ్రేణులని పిలువబడును. రాజ్యవ్యవస్థ యందు ఇట్టి శ్రేణులకు కొంత ప్రాధాన్య మేర్పడినది. ప్రభుత్వమున కవసరమైన సమయములలో వీరు సైనికులను సమకూర్ప వలసిన బాధ్యత కలిగియుండిరి.

## సైన్య సేకరణ - శిక్షణ

సంజయుడు ధృతరాష్ట్రుని పంపున యుద్ధరంగమునకు పోయి సంగ్రామవార్తలు తెచ్చుచుండును. అతడు కౌరవులకు పరాజయమును, పాండవులకు విజయమును తరుచు తెల్పుచుండెను. ఇట్టి సమావేశము లందొకనాడు చీకురాజు తమసైన్య పరాజయమునకు వాపోవుచు సంజయునితో ఇట్లు పలికెను.

ఏవం బహుగుణం సైన్య మేవం బహువిధం పరం
వ్యూఢిహా మేతద్యథాశాస్త్ర మమోఘం చైవ సంజయ
నాతి వృద్ధమబాలంచ నకృశం నచపీవరం
లఘు వృత్తాయత ప్రాయం సారగాత్ర మనామయం
ఆత్త సన్నాహ శస్త్రంచ బహుశస్త్ర పరిగ్రహం
అసియుద్ధేనియుద్ధేచ గదాయుద్ధేచ కోవిదం
ప్రాసర్ష్టి తోమరేష్వాజౌ పరిఘేష్వాయసేషుచ
భిండి పాలేషు శక్తిషు ముసలేషు కృతశ్రమం
శస్త్రగ్రహణ విద్యాసు సర్వాసు పరనిష్ఠితం
ఆరోహే పర్యవస్కందే సరణే సాంతర ప్లుతే
సమ్యక్ప్రహరణే యానే వ్యపయానేచ కోవిదం
నాగాశ్వరథయానేషు బహుశస్సు పరీక్షితం
పరీక్ష్యచ యథా న్యాయం వేతనే నోపపాదితం
నగోష్ఠ్యా నోప కారేణన సంబంధః మిత్తతః"

అట్టి బహుగుణోపేతమైన సైన్యము, బహువిధమైన బలము; శాస్త్రోద్దిష్ట విధానమున తీర్చబడినదయు అమోఘమునైన వ్యూహము; దేనియందు అతిబాలురు వృద్ధులు, బక్కచిక్కినవారు, స్థూలకాయులు కాన్పించరో; లఘుశరీరము, యుక్తవయస్సు, బలమైన కాయము, నీరోగమైన ఆరోగ్యములుగల సైనికులే చేర్చబడుచుందురో; ఏసైనికులకు సంసిద్ధములైన ఆయుధములు కలవో, అనేక విధాస్త్రపరిగ్రహము కలదో, ఎవరు ఖడ్గయుద్ధ మందు, ఆయుధములేని రణము నందు, గదాసంచరమందు ప్రాసము మున్నగు ఆయుధప్రయోగము లందు కోవిదులో సర్వశస్త్రాస్త్రము లందుపరినిష్ఠులో, ఎవరు ఆరోహము, పర్యవస్కందము సరణము, సాంతర ప్లుతము, యానము, వ్యపయానము మున్నగు యోధకర్మలయందు నేర్పరులో, ఏసైనికులు ఏనుగులు గుఱ్ఱములు రథములు-వీని యుద్ధము లందు అనేక పర్యాయములు సుపరీక్షితులై నిరూపిత సామర్థ్యము కలవారో, ఎవరు అట్లు పరీక్షలలో కృతకృత్యులై యథార్హమగు వేతనముల పొందు చున్నారో ఎవరి నియామకము గోష్ఠిచేత గాని (సఫారసు కావచ్చును) ఉపకారముచేత గాని బాంధవ్యనిమిత్తముచే కాని చేయబడదో - అట్టి సర్వసంపన్నము సమర్థము అయిన సేనావాహిని ఓడిపోవుట దైవదుర్విపాకమున కదా అని ధృతరాష్ట్రుడు సంజయునితో వాపోవును.

పై వాక్యములను బట్టి మహాభారత కాలమున సైన్య నియామకము శిక్షణ, వారి నేర్పు, వారి వేతన పద్ధతి మున్నగునవి చక్కగా భాసించుచున్నవి. సంగ్రామము నందు వీర మరణము నొందిన సైనికుల కుటుంబములకు భోజనాచ్ఛాదనముల లోటు రాకుండ రాజు ఏర్పాటు చేయవలెనని నారదమహర్షి ధర్మరాజును హెచ్చరించుచున్నాడు (సభా - 1 - 40) సేనాధ్యక్షుడు నానావిధ రణము లందు నిపుణుడై, అవార్యవీర్యుడై, రాజునకు హితుడును నమ్మదగి వాడును అయియుండవలెనని ఆ మహర్షియే బోధించెను. మహాభారత యుద్ధము నందు ప్రదర్శింపబడిన అతిలోక శౌర్యము, అసాధారణ మాత్సర్యము, మహాబీభత్సము వర్ణనాతీతములు. మహార్ణవ మంత సైన్యము కృశించి కృశించి గోష్పాద మంతయైనను సుయోధనుడు తనచలమును వీడక పోరాడు చుండుట కృష్ణార్జునులకు ఆశ్చర్యము కలిగించెను. (శల్య-1-348) ఎట్టి మహాత్ములైనను సత్వబుద్ధిగలవారైనను యుద్ధము నందు మత్సరగ్రస్తులగుట క్షమ ధర్మాత్ముడైన యుధిష్ఠిరుని చరిత్రనుండియే మనము ఉదాహరింపవచ్చును. కర్ణుడన్న ధర్మనందనునకు సింహస్వప్నమయ్యెను. అట్టి దుర్దాంతుడైన కర్ణుడు సంహారింప

బడుట విని ధర్మరాజు దివిటీలు వేయించుకొని వెళ్లి కర్ణుని మృతశరీరమును కండ్లార చూచుకొని తృప్తిపడలేదు. (కర్ణ-3-395).

ఆకాలమునను సైన్యమునందు క్రమశిక్షణ ప్రాముఖ్యము గుర్తింప బడెను. బహు నాయకత్వము వలన దేవతలు పరాజితులై ఈశ్వరునకు తమతమ యంశములు సమర్పించి ఆయన నేతృత్వమునకు అంగీకరించిన వృత్తాంతము త్రిపురాసురసంహార కథయందు కలదు. ఎంతటి వీరుడైనను సైన్యాధ్యక్షుని యాజ్ఞలను శిరసావహించుటగాంతుము. సైంధవవధ పర్వమున అర్జునుడేమయ్యెనో యని యుధిష్ఠిరుడు చింతాక్రాంతుడై భీముని పార్థునకు సహాయముగ బొమ్మనెను. ధర్మరాజ రక్షణమును వీడి తానటు పోవుట ప్రమాదమని వాయునందనుడు భావించియు ధృష్టద్యుమ్నునితో నిట్లనెను "కుంభసంభవుని బలిమియు నతని ప్రతిజ్ఞ తెలంగును నెఱుంగుదు వేమఱ కుండుము. నాకుంబోక కర్జంబుగాదు గాకున్న నేలినవాని యానతి నడవ వలయు" భీముని యంత మహావీరుడు ఆజ్ఞాబద్ధుడగుట గమనింప దగినది.

సైన్యముయొక్క సమరస్థైర్యము (morale) అత్యంతావశ్యకమని యానాటి ధీమంతు లెరుగుదురు. ఒకప్పుడు కృష్ణద్వైపాయనుడు ధృతరాష్ట్రునితో నిట్లు చెప్పెను. "కుమారా! యుద్ధమునందు సైనికుని స్థైర్యమే విజయమునకు మూలము. భీరువై యొకడు పలాయితుడైనచో సైన్యమంతయు కలగుండు వడును. మహారథులుకూడ పారిపోవు సైన్యముతో అపయానము చేయుదురు. నిబిడ వ్యూహము ఒక్కమారు భగ్నమైనచో ఎంతటి యోధులును దానిని నిలువరింప జాలరు. కావున ఈ యంశమును చక్కగా మనమునందుంచుకొని సామదాన భేదములతో కార్యము సాధించు కొనుము." ద్రోణుడు కౌరవసేనానులలో మిక్కిలి దృఢవ్రతుడు. అతడు అచ్చపు సైనికుడు. దుర్యోధనుడు అడుగడుగునకును తన సైన్యము తెగుచుండుటను జూచివికలుడై యాచార్యుని వద్దకుపరుగెత్తి నీవుపాండవపక్షపాతివి అని నిందించుచుండును. జయద్రథవధ సందర్భమున అర్జునుడు వానిని సమీపించుచుండుట కార్తి చెంది రారాజు ద్రోణుని వద్దకు పోయి అడ్డుపడుమని కోరెను. అంతట యాచార్యు డిట్లనెను. "సేనాముఖంబు విడచి యేనర్జును వెనుకం బోయినం బాండవ బలంబు లురలం దోంతెంచు. మన యొద్దుగలంగిన సైంధవుం గాచుట రిది (ద్రోణ-3-114) ఈ సమయముననే ద్రోణుడొక అభేద్య కవచమును దుర్యోధనున కిచ్చెను.

## వీరుల అంత్యక్రియలు

స్త్రీపర్వ మంతయు గాంధారి శోకవచనములలో గడచినది. దానిని గాంధారీ పర్వమన్నను చెల్లును. సంగ్రామ బీభత్స చిహ్నము లిందు అశేషముగా కనవచ్చును. మృతవీరులకు అంతిమసంస్కారము చేయుటకును ఒక్కొక్క యెడ అవకాశము లేకుండె ననిపించును. ద్రోణాచార్యుని శవమును జూచి గాంధారి విలపించుచు వినయాన్వితులైన శిష్యులు నిత్యము ప్రణమిల్లెడు ద్రోణుని వీర పద ద్వయమును నక్కలు చెడదిన్నవి అని యామె శోకించెను.

ఎంత కరుణాత్మక సన్నివేశము! ఆచార్యుని కగ్ని సంస్కార మిట్లుజరిగెను. "ద్రోణుని భార్య కృపుని తోబుట్టువైన కృపి దైన్యమును, విరియబోసిన జుట్టును ముఖముపై మసుగు వడ వల వించుచుండెను. బహుశిష్యులు అయ్యతిరథోత్తముని యస్త్రశస్త్రములు, రథమును ఆయన యవయవములతో చితి యందుంచిరి. వారందరు సామగానము చేయుచుండిరి. కృపి మున్నగు వారు అపసవ్యముగ సొదకు ప్రదక్షిణించిరి. రెండవ యగ్నినివోలె ద్రోణుని వహ్ని కర్పించిరి. శోకార్తములైన యొడళ్ళతో వారు గంగాస్నానమున కరిగిరి. భూమి ఆచార్యుని మరణముతో అపగత శరవిద్య యయ్యె" (స్త్రీ-2-24,25) అసంఖ్యాకులుగా నిహతులైన వీరులకును సైనికులకును యథావిధిగా అగ్నికార్యము నిర్వర్తించువారు లేరైరని ధర్మజుడు చింతించెను. భగ్నరథావయవములు విండ్లు ధ్వజములు మున్నగు వానితో సొంపేర్చి వీరులను అగ్ని కర్పించిరి. రాజులను ప్రోవులుగా పెట్టించి దహించిరి.

## మహాభారతము - వ్యూహములు

మహాభారతకాలమునకు భారతీయుల యుద్ధ విజ్ఞానము పరాకాష్ఠ నందె ననుటకు అప్పటి వ్యూహజ్ఞానమే ముఖ్యనిదర్శనము. మహాభారత యుద్ధము నందు ఆయాసేనాధిపతులు ఎన్నియో వ్యూహములను పన్నినట్లు చదువుదుము. వ్యూహ శబ్ద మిట్లు నిర్వచింప బడినది. "వ్యూహస్తు బల విన్యాసః" సైన్యముల విశిష్టరచన లేక ఏర్పాటు వ్యూహ మగును. దీనికి మరియొక నిర్వచనము చెప్పబడినది. "విశేషేణ ఊహ్యతే ఇతి వ్యూహః" దీర్ఘముగ ఆలోచింప బడునది. ఈరెండర్థములును వ్యూహనిర్మాణము నందు ఇమిడియే యున్నవి. సేనాధ్యక్షుడు తన సైన్యమును మోహరించుటకు ముందు నిశితముగ ఆలోచించును. ఆలోచించి విజయము తనకు కలుగు రీతిని తన వాహినిని పన్నించును. వ్యూహములను ఆంగ్లములో **Military Tactics** అనుచున్నారు. దీనికి సంబంధించినదే యుద్ధయుక్తి **(Strategy)** ఆంగ్ల విజ్ఞాన సర్వస్వములో ఈరెండింటిని ఇట్లు నిర్వచించియున్నారు. **"Strategy is the art of Protected movement from which tactics, the art of protected offensive action is developed. Whilst the one places an army in the best position to over come the enemy's resistance; the other has for its object the economical development of pressure so that movement in the desired direction may be maintained"** యుద్ధయుక్తి అనగా సంరక్షితయానము. దీనినుండి సంరక్షిత విక్రమవిధానము అనబడు వ్యూహము పరిణమించుచున్నది. మొదటిది శత్రువు యొక్క నిరోధశక్తిని కుంచించుటకు ఉపయోగించును. రెండవది తనసైన్య శక్తిని పొదుపుగా వాడు కొనుచు ఉద్దిష్టదిశ యందు విజృంభణమును నిర్వహించుటకు ఉపయోగించును. వ్యూహమును గూర్చి ఈ గ్రంథమే మరియొకచోట ఇట్లు వివరించినది "శత్రువినాశమునకై త్రివిధసైన్యమును-పదాతులు, అశ్వికదళము, శతఘ్నులు వీటిని అత్యంత శక్తివంతముగా ప్రయోగించుటయే వ్యూహోద్దేశము. వీనిలో ఒక్కొక్క దానికిని విశిష్టయుద్ధశక్తి కలదు. ఒక్కొక్క అంగము తన గరిష్ఠ శక్తిని విజృంభింప చేయవలెనన్నచో తదితర ద్వయము యొక్క సహాయము అవసరము.

భారత యుద్ధకాలము నందు శతఘ్నులు ఉన్నను అవి యీనాటి శతఘ్నిదళముతో పోల్చుట తగియుండవు. ప్రాచీనకాలపు శతఘ్నులు దుర్గసంరక్షణము నందే యెక్కువ వినియోగపడెడివి. క్షేత్రయుద్ధము నందవి వినియోగపడెనో లేవో తెలియదు ప్రాచీన యుద్ధాంగములలో శతఘ్నుల స్థానమున రథగజదళములను మనము ఉంచుకొనవలెను ఇట్లు చేసి చూచినచో ఆధునికయుద్ధవిజ్ఞానమునకు దీటు కాగల భావములును వ్యవస్థయు ప్రాచీన భారతము నందుండెననుట సత్యము అసలు వ్యూహముల అవసర మెట్లేర్పడెను. ఎవరి యందు తలచూపెను అను ప్రశ్నలు మనకు కలుగును. ఇది మొదట దేవతల యందును వారి ప్రతీకలైన ఆర్యులందును కలిగినట్లు కాన్పించును. అల్పసంఖ్యాకమైన సైన్యముకలవారు ఆ బలమును గరిష్ఠ ప్రయోజన వంతముగా ప్రయోగించుటలోనే వ్యూహభావన ఏర్పడినది. దేవగురువైన బృహస్పతి యిట్లు శాసించెను.

"సంహతాన్ యోధ యేదల్పాన్
కామం విస్తరయేద్బహూన్"

అల్పసైన్యమును సుసంశ్లిష్టముగా కూర్చవలెను. బహుళసైన్యమున్నచో దానిని విస్తరింప చేయవచ్చును సైన్యమును పొదుపుగను గరిష్ఠ శక్తివంతముగను ప్రయోగించుటలోనే వ్యూహములు ఏర్పడినవి ఈ వ్యూహములకు తరుచు పశుపక్ష్యాదుల యొక్కయు, విశిష్ట వస్తువుల యొక్కయు పేర్లు ఉంచుట కాన్పించును. గరుడ, శ్యేన, క్రౌంచ, కూర్మ మకర, శకట సూచి, శృంగాటక, అచల మున్నగు పేర్లు వ్యూహములకు పెట్టబడినవి. ఆయా పక్షులును, మృగములును తమలో తాము కలహించు నప్పుడు అవలంబించు సన్నద్ధాకారములను గమనించి వ్యూహముల కా నామములు ఉంచబడి యుండును. వస్తువుల ప్రత్యేక ధర్మములను బట్టియు పేర్లు కల్పించియుందురు. అచల వ్యూహము పర్వతమువలె స్థిరమైనదిగా భావింపబడి యుండును. శృంగాటకము ముమ్మొనవాలు వంటిది. మకరముయొక్క తుండము భయంకరము. కూర్మముయొక్క వీపు దుర్భేద్యము. శ్యేనము నేత్రములు మిక్కిలి చురుకైనవి. క్రౌంచము ముక్కు వజ్రసన్నిభమైనది. ఇట్టి లక్షణములను దృష్టియందుంచుకొని సారవంతమైన దళమును ఆయా స్థానములందు నిల్పుచుండిరి.

ఏ యే వ్యూహములనే యే సన్నివేశములలో తీర్చవలెనో శుక్రనీతిసారము సూచనప్రాయముగ ఇట్లు చెప్పుచున్నది. "నద్యాద్రివనదుర్గేషు యత్ర యత్ర భయంభవేత్ సేనాపతి స్తత్రతత్రగచ్ఛేద్ వ్యూహకృతైర్బలైః యాయాద్వ్యూహేన మహతా మకరేణ పురోభయే శ్యేనేనోభయపక్షేణ, సూచ్యా వాధీర వక్త్రయా పశ్చాద్భయేతు శకటం పార్శ్వయోర్వజ్ర సంజ్ఞకం సర్వతస్సర్వతో భద్రమ్ చక్రక్ వ్యాళమథాపివా" నదుల యందుగాని అడవులందుగాని, దుర్గములందుగాని, ఇతరస్థలములందుగాని భయము తటస్థించినప్పుడు సేనాపతి తన సైన్యమును వ్యూహ రచన చేసి నడిపించవలెను. ముందు భాగమున ప్రమాదము కలిగినప్పుడు మకరవ్యూహముతో ఎదుర్కొనవలెను. ఉభయపక్షములందు విషమస్థితి ఏర్పడినచో శ్యేన

వ్యూహము ప్రన్నవలెను. లేదా విప్పారిన ముఖముగల సూచీ వ్యూహము నమర్పవలెను. వెనుకభాగమున ప్రమాదమైనచో శకటముగా మోహారింపదగును. పార్శ్వము లందైనచో వజ్రవ్యూహము. నాలుగు ముఖములనుండి ఆపత్తు ఎదురైనచో సర్వతోభద్రముకాని. వ్యాళము, చక్రము కాని పన్నుకొనవలెను.

## వ్యూహ విభజనము

వ్యూహ నిర్మాణసూత్రములను కామందకుడు ఇట్లు సూచించెను.

తిర్యగ్వృత్తి స్తుదండస్స్యాత్
భోగోఽన్వా వృత్తిరేవ చ
మండలస్సర్వతో వృత్తిః
పృథగ్వృత్తి రసంహతః

దండము, భోగము, మండలము అసంహతము, అను నాల్గును వ్యూహములలోని ప్రధాన భేదములు. అందు ప్రదరదృఢకాదులు 17 దండ భేదములు. గోమూత్రికా, హింసక, సంచారిక, శక, పతంతకములైదును భోగ భేదములు. సర్వతోభద్ర దుర్జయములు. మండల భేదములు. అర్ధచంద్ర, ఉద్ధానాదులు అసంహత భేదములు. వ్యూహమునకు వెనుకనుండి చెదరిపోయిన సైనికులను కూర్చుకొని వచ్చు సేనా భాగమును వ్యూహపార్ష్ణి యందురు. దీనికే ప్రత్యాసారమనియు పేరు. 'భగ్నానాత్మీయాణ్ ప్రత్యాపరతీతి ప్రత్యాసారః' అని- దీని నిర్వచనము. ప్రతిగ్రహమని పేరుగల మరియొక సైన్య విభాగమున్నది. రాజు దీనియందు నిభృతుడై యుండి తన సైన్యముగాని చెందకుండునట్లు నడిపించుకొని వచ్చును. ప్రతిగ్రహము ప్రధానసైన్యమునకు ఇన్నూరు విండ్లదూరమున వెనుక భాగమున ఉండును. ప్రతిగ్రహమనగా ప్రమాదము నెదుర్కొనుటకు ప్రత్యేకింపబడిన సైన్యమని కౌటిల్యుని అర్థశాస్త్రమున నుడువ బడెను (పుట 528)

సైన్యమును యుద్ధభూమియందు నాలుగు విధముల నిలుపవచ్చును. అడ్డముగా నిలుపుట దండము. సేనాంగములను ఒకదానివెనుక నొకటి నిలుపుట భోగము. వలయాకారముగా, అన్నిమూలల రక్షణ కనువుగా తీర్చుట మండలము. వేర్వేరు సంఘాతములుగా పన్నుట అసంహతము. ఈ ప్రధాన స్థితులనుండి ఆయా వ్యూహము లేర్పడుచున్నవి. *పక్షకక్షోరస్యములు సమముగా యుద్ధముచేయు నట్లమర్చబడినది దండవ్యూహము. ఇది వెనుకకు తిరిగి కొట్టుటకు వీలుకలది. శ్యేనవ్యూహము, సూచీవ్యూహము దీనిలోని భేదములు. ఏకపంక్తియందుండు దండము సూచీవ్యూహము. ఇవి భారతయుద్ధమునందు వచ్చినవి. భోగవ్యూహమునే సర్పవ్యూహ

---

* కౌటిల్యుని అర్థశాస్త్రము- సాంగ్రామికమను పదియవ అధికరణము, పుట 528.

మందురు. పక్షకక్షోరస్యములు విషమముగా ఉండునది శకటవ్యూహము దీనిభేదము. దీనికి విరుద్ధ మగునది మకరవ్యూహము. పక్షకక్షోరస్యములు ఏకమగుట మండలవ్యూహము. సర్వతోభద్రము దీనిలోని భేదము. పక్షకక్షోరస్యములు కలియక వేరుగనుండుట అసంహతము. వజ్రవ్యూహము దీనిభేదము. పదాతులు, గుఱ్ఱములు, రథములు, ఏనుగులు–ఇవి యొకటివెనుక మరియొకటి ఉండుట అచలవ్యూహము.

సైన్యాంగ విభాగములకు సంఘటితమగుటకు, విడియుటకు, యానముచేయుటకు వెనుకకు తిరుగుటకు, మార్కొనుటకు నాయకుడు తూర్యఘోషములతోను, ధ్వజములతోను, పతాకములతోను సంజ్ఞలను ఏర్పరుపవలెనని కౌటిల్యుడు. వ్యూహములలోకొన్ని శత్రువుపై దెబ్బకొట్టుటకును, కొన్ని దెబ్బకాచుకొనుటకును అనువైనవని యూహింపవలెను. శ్యేనమకరాదులు విక్రమవ్యూహములుగా కన్పించును, కూర్మసర్వతోభద్రాదులు సంగతక వ్యూహములుగా కన్పించును. మిశ్రవ్యూహములనేకములు. అక్షౌహిణీపరిగణనము ఆదిపర్వమునందే చేయబడినది. (ఆది–1–81), పత్తి, సేనాముఖము, గుల్మము, గణము, వాహిని, పృతన, చమువు, అనీకిని, అక్షౌహిణియనునవి ఉత్తరోత్తరాధికములగు సేనావిభాగములు కౌరవపక్షమునందు పదియక్షౌహిణులు మితబలము. ఒకయక్షౌహిణి కౌరవబలము. (భీష్మ–1–85) మహాభారత యుద్ధమునందు ఆంధ్రులను పేర్కొనుట ఒక్కమారే జరిగినది. (కర్ణ–2–3.7) వీరు కౌరవపక్షమునుండిరి. "రారాజు పురికొల్పి రాధేయునకుం బ్రాపయి పుళిందబాహ్లీక చేంకణాంధ్ర భోజానీకంబుగవిసినం గాంగేయ బలంబునకు శిరంబగుటయు." భారతదేశమునందలి సమస్త జాతులవారను కురుక్షేత్ర సంగ్రామమునందు పాల్గొనిరని తోచును. అందు ప్రధానముగా ప్రాచ్యదేశీయులు కౌరవపక్షమునుండిరి. ఇట్టివారు మాగధులు, కాళింగులు, ఆంధ్రులు, భోజులు, పుళిందులు, చేంకణ (తమిళ) దేశీయులు. భారతవర్షమునందలి జనపదములలో ఆంధ్రదేశము పేర్కొనబడినది. (భీష్మ–1–40).

## మహాభారతమునందలి వ్యూహములు

ప్రముఖ సేనానులందరును మహాభారత యుద్ధమునందు వ్యూహముల నేర్పరచి సంగ్రామ మొనర్చిరి. అందును కౌరవపక్షము నందలి సేనానులు భీష్మద్రోణులు దేవదానవులను కూడ సమరముఖమున లెక్కసేయని మహావీరులు. అట్లయ్యును కౌరవులు నిశ్శేషముగా ఓడిపోయిరి. దీనికేమి సమాధానము. ఇచ్చట మనము మహాపతివ్రతయగు గాంధారి పలుకులను స్మరించవలెను. సుయోధనుడు కురుక్షేత్రమునకు పోవుచు తల్లి దీవన లర్థించెను. అప్పుడా పార్థివి యిట్లుచెప్పెను. "కొడుక ! ఎక్కడనుండు ధర్మమక్కడకు జయమునేరు" (స్త్రీ–1–151). ధర్మము పాండవపక్షమున నుండుటచే వారు జయించిరని కృష్ణద్వైపాయన మునీంద్రుడు పరిష్కరించెను. వ్యూహపటిష్ఠత మాత్రమే విజయసాధనము కాదనుట భారతీయుల విశ్వాసము.

అదియట్లుండె. భీష్ముడు రణరంగమునుచేరి కురుపతి కోరికమేరకు 'నిబిడచారు సన్నాహంబుగా' వ్యూహము మర్చెను "అందు తాను ద్రోణుండును తాళధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలుచుండ ముందట నిలిచి...నడుమ కురుకుమార సమేతంబుగా నమ్మహీనాథుడు నిలుచునట్లుగా నియమించి. తగనయ్యె సైన్యంబుల కేనుంగులు, నేనుంగుల కరదంబులు, నరదంబులకుం దురగంబులు దురగంబులకు విండ్లవారు, విండ్లవారికి నద్దాయుధులు నడ్డంబగు తెఱంగున నిలువ నియోగించి మానుష వ్యూహంబు సమకట్టిన" ఒక సేనాంగమునకు మరియొకటి వెనుకనుండు నట్లమర్చుట అచల వ్యూహమని కౌటిల్యుడు భీష్ముని ప్రథమవ్యూహము నందీ విధానమే కన్పించుచున్నది. భారతములో దీనినే మానుష వ్యూహమనిరి. పదాతి సైన్యము ముందు నిలుచుటచే దీనికీపేరు వచ్చియుండును. దీనికి ప్రతిగా పాండవులు అచల వ్యూహమునే పన్నిరి. ఇందు భీముడగ్రేసరుడై యుండెను. భీముని సైన్యము పదాతి భూయిష్ఠమని ఇదివరలో చదివి యున్నాము. రెండవనాడు పాండవులు ప్రథమావకాశము తాము తీసుకొని క్రౌంచ వ్యూహమును పన్నిరి. క్రౌంచముయొక్క ముక్కు వజ్రసన్నిభమైనది. కావున ఫల్గునుడు చంచువు నందు నిలిచెను. కుంతిభోజుడును, శైబ్యుడును చక్షు స్థానములందే దేజరిల్లిరి. దీనికి భీష్ముడు మాఱొడ్డనము కల్పించెను. కాని దానిపేరు లేదు కౌరవులు మూడు మోహరంబు లయిరి అనుటచే ఇది అసంహాత భేదమైన వ్యూహమని చెప్పనొప్పును.

మూడవదినమున భీష్ముడు గరుడవ్యూహము నమర్చగా పాండవులు అర్ధేందు వ్యూహముగా మోహరించిరి. గరుడ వ్యూహమునకు గంగానందనుడు స్వయముగా ముక్కై నిలిచెను. అర్ధేందువ్యూహమునే కాబోలు కౌటిల్యుడు అర్ధచంద్రక మనెను. మూడు దళములు అసంహతములుగా నుండుట అర్ధచంద్రకము. పాండవుల యర్ధచంద్రవ్యూహమందు భీమార్జును లిరువురును రెండుకొమ్ముల పన్నిరి. శుండాల మాలికా భీలంబుగా యుధిష్ఠిరుడు మధ్య ప్రదేశమున నిలిచెను. గరుత్మంతుని ముక్కున నిలిచిన భీష్ముని ధాటికాగలేక పాండవ సైన్యములు చెల్లాచెదరగుచుండిరి. అర్జునుని ఉద్దీప్తుని చేయుటకై శ్రీకృష్ణుడు చక్రము ధరించి భీష్ముని మీదికి లంఘించెను పార్థుడు దీనితో విజృంభించెను. నాల్గవ దినమున కురు పాండవులు ప్రత్యేక వ్యూహములు పన్నినట్లులేదు. గత దివసమందలి యేర్పాటునే అనుసంధించి యుందురు. ఐదవ దినమున గాంగేయుడు మకరవ్యూహము సంధించెను. మకర వ్యూహము శకటమునకు విరుద్ధమని కౌటిల్యుడు. ఇది భోగ వ్యూహశాఖకు చెందినది. దీనికి ప్రతిగ, పాండవులు శ్యేనవ్యూహమును దీర్చిరి. అందు ముఖంబున భీముండును, శిరంబున సాత్యకియు, కంఠంబున కిరీటియు నుండిరి.

కౌరవ పక్షమందొక గొప్ప లోపముండెను. భీష్ముని పదిదినముల యుద్ధమునందును కర్ణుడు పాలికలనికి రాలేదు. ఆతడు భీష్మునిపై అలిగియుండెను. భీష్మ ద్రోణుల తిలోకవీరులయ్యును వారు సహజముగనే పాండవులయెడ ఈషన్మార్దవము కలిగియుండిరి. దుర్యోధనుడు వారిని విశ్వసింపక ఏ కొంచెము విపర్యాసమయ్యెను ఆ వృద్ధ వీరులను నిందిరిచుచుండెను. ఇది వారికి బాధాకరమయ్యెను. ఐదవనాటి యుద్ధమున దుర్యోధనుడు ఆచార్యుని పెద్దకేగి యిట్లు విమర్శించెను.

"పట్టి పాలార్చెదరు మీరు పాండుసుతుల
నీవు భీష్ముండు నలిగిన దేవతలకు
నైన మార్కొనవచ్చునే సేన నరుఁడు
నొంపఁగా నిట్టులొప్పరికింపఁదగునె.

అనిన విని కుంభసంభవుండు గటకటంబడి యతనితో నిట్లనియె.

"ఎన్నఁడును మున్నువారల యేపునోపఁ
గానమెట్లు సముద్రంబులోన బుట్టి
నైవఁ గొన్నంతఁ గొనుఁగాక వారిగెల్వ
మాకు శక్యంబె చవిగాని మాటలేల" (భీష్మ-2-282.)

దుర్యోధనుడు మహామహుడైన గాంగేయుని కూడ ఇట్లే నొవ్వపలికెడివాడు.

రెండు పక్షజనములును రాత్రులందు వివిధ హృద్యసంగీతములతోను. సాహిత్య మధురలలితగోష్ఠి వినోదములతోను ప్రొద్దుపుచ్చెడివారట. ఆరవనాడు పాండవులు మకర వ్యూహముగా మోహరించగా భీష్ముడు క్రౌంచవ్యూహము బన్నెను. క్రౌంచ మొగ్గరమున దానును ద్రోణాచార్యుడును చంచువున నిలిచిరి. ఆరవనాటి రాత్రి దుర్యోధనుడు భీష్ముని స్కంధావారమున కేగి తమ సైన్యనష్టములకై యాతని నధిక్షేపించెను. ఇంతవరకును శాంతనవుడు విక్రమవ్యూహములను పన్నుచు మొదటి దెబ్బకొట్టు స్థితిలో సైన్యముల నడపు చుండెను. కురురాజు మాటలకు నొచ్చి కాబోలు ఆతడప్పటి నుండియు సంరక్షణ వ్యూహ ములు నాశ్రయించెను. ఏడవనాడు భీష్ముడు మండలవ్యూహ మొనర్చెను. ధృష్టద్యుమ్నుడు పాండవసేనను వజ్రవ్యూహముగా తీర్చెను. ఐదు సైనికదళము లసంహతములుగా అమ ర్చుట వజ్రవ్యూహములేక గోధావ్యూహమని కౌటిల్యుడు. ఎనిమిదవనాడు కౌరవులు కూర్మవ్యూహము క్రిందను, పాండవులు శృంగాటకవ్యూహము క్రిందను మహారణమొనర్చిరి. ఆనాటి రాత్రి కురురాజు తనమామ శకునిని, ఆప్తమిత్రుడగు కర్ణుని రావించి వారితో రహస్య ముగ మంతనము సలిపెను. భీష్ముడు పాండవపక్షపాతియనియు, ఆతని నింక యుద్ధమునకు తేవలదనియు, సర్వము తానే చూచుకొందుననియు సూతనందనుడు సలహా ఇచ్చెను. (భీష్మ-3-166) వెంగలియగు దుర్యోధను డా మాటపట్టి ప్రవర్తించె.

నవమదివసయుద్ధమున గాంగేయుడు సర్వతోభద్రమను మోహరమును దీర్చి పాండ వులను వేలకుగోలకు తెచ్చెను. ధర్మరాజు చాలాఖిన్నుడయి ఆరాత్రి రహస్యప్రకారమున పితా మహుని పాలి కరిగి యాతని వధోపాయమ్ము తెలిసి కొని వచ్చెను పదవనాడు కురు పాండవులేవ్యూహములు పన్నిరో తెలియదు. భీష్ముడు ప్రచండభానుని వలె పాండవసైన్యమును దహించి, క్షీవరక్షు క్షత్రధర్మముపై విసువు గొనెను. (భీష్మ-3-363) ఆనాడు అంశుమంతుడు శాంతించు సమయమునకు దేవాసురాతి వీరుడైన శాంతనవుడు శరతల్పగతు డయ్యెను.

# ద్రోణుని వ్యూహములు

భీష్ముని తరువాత కౌరవసేనాపతి యైన ద్రోణుడు వ్యూహవిజ్ఞానము నందు సాటిలేని యోధుడు. శంతననందనుడు మహావీరుడయ్యును సత్వస్వభావముకలవాడు. కుంభసంభవుడు బ్రాహ్మణుడయ్యును రాజసస్వభావుడు. అదియుగాక పాంచాలుర యెడ ఆచార్యునకు కోప మధికము. దీనిచే ఆయన సేనాధ్యక్షుడుగా నుండిన ఐదుదినములలో పెక్కుమహావీరులు మడిసిరి. సేనాపతిత్వము నందభిషిక్తుడై ద్రోణుడు దుర్యోధనుని వరము కోరుకొనుమనెను. ధర్మరాజును ప్రాణములతో పట్టితెచ్చి తనకు ఒప్పింపు మని కురురాజు కోరెను. యుధిష్ఠిరునిచే తిరిగి జూద మాడించి పాండవులను అరణ్యములకు పంపుట వాని యుద్దేశము. గురుడు వానిదుశ్చింతనకు రోసి కొన్ని నిబంధనలతో దాని కొడంబడెను.

ద్రోణుని మొదటిదినము యుద్ధమున పాండవులు క్రౌంచవ్యూహమును బన్నిరి దీనికి ప్రతిగ ఆచార్యుడు శకటవ్యూహము నమర్చెను. 'పశ్చాద్భయేతు శకటం' అని శుక్రనీతి. భీష్ముని పతనానంతరము కౌరవులయుద్ధశక్తి కొంత సడలినది. పాండవసైన్యము నుండి వెనుక భాగమున ప్రమాదము నేమైన ద్రోణుడు శంకించెనేమో. ఇప్పటినుండియు కర్ణుడు రణదీక్షితు డగుటచే కౌరవులకు కొంతయూరటకలిగెను. సంశప్తకులు అర్జునుని సంగ్రామమునకు పిలుచు టచే అతడు వారి నెదుర్కొనుటకుపోయెను, సంశప్తకప్రయోగము ద్రోణుని యుద్ధయుక్తిగా భావించవలెను. అట్లు స్వల్పముగా న్యూనబలమైన పాండవసైన్యమును రెండవనాడు ద్రోణుడు గరుడవ్యూహముతో ఎదిర్చెను. ధృష్టద్యుమ్నుడు మండలార్ధవ్యూహమును సంధిం చెను. ఆచార్యుని ధాటికి తాళలేక యుధిష్ఠిరుడు రణరంగము నుండి తొలగిపోయెను. పారి పోవుచున్న పాండవసేనలను చూచి కురురాజు కలకల నవ్వెను.

మూడవనాడు కుంభసంభవుడు పద్మవ్యూహమును పన్నెను దీనినే చక్రవ్యూహ మనియు అందురు. అర్జునుడు సంశప్తకులతో భయంకరరణ మొనర్చుచు దూరమున నుండెను. ధర్మరాజాదు లావ్యూహమును భేదించుట యెరుగమిచే యువకుడగు అభిమన్యుని వ్యూహమున మార్గముచేయుటకై ప్రోత్సహించిరి. ఆతడు ఏకాకియై చాలసేపు యుద్ధముచేసి కౌరవుల వంచనచే పద్మవ్యూహము నందు నిహతుడయ్యెను. ఇది దారుణపరిణామములకు దారితీసెను. అర్జునుడు జయద్రథుని సంహరించుటకు ప్రతిజ్ఞచేసెను. ఆతని శపథమును వమ్ముచేయుటకై ద్రోణాదులు గొప్పప్రయత్నముచేసిరి. సైంధవుని కాచుటకై ఆచార్యుడు బ్రహ్మాండమైనవ్యూహము నమర్చెను. "భారద్వాజుండు ద్వాదశగవ్యూతి దీర్ఘంబును బంచగవ్యూతి విస్తృతంబుగా శకట వ్యూహంబు సమకట్టి, దానికిఁ బశ్చిమార్ధంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబు పన్నించెను." అచ్చటినుండి సేనాముఖంబువరకు సూచీవ్యూహమ్ము నేర్పరిచెను. సూచీమూలస్థానమున మూడుయోజనముల దూరమున కర్ణాదులచే పరివృతుడై సింధురాజు నిలిచెను. ఇట్లు దుర్భేద్య మైన వ్యూహము నిర్మించి సేనాముఖమున ద్రోణుడు దండధరునివలె మెరసెను. ఇంతచేసినను కౌరవులు సైంధవుని కాపాడలేకపోయిరి. అర్జునుని యలౌకికపరాక్రమము, శ్రీకృష్ణుని సార

ధ్యుము, భీమసాత్యకుల దుస్సాధ్యవిక్రమము ఇన్నియు కలిసి పాండవులకు ఆనాడు జయమును చేకూర్చెను. జయద్రథవధతో కౌరవులయుద్ధస్థైర్యము విస్తారముగా దెబ్బతినెను.

భారతయుద్ధము పదునేనవదివసము ప్రవేశించెను. వృద్ధుడగుటచే ద్రోణుడు అలిసి పోవుచుండెను. దీనికితోడు దుర్యోధను డాతనిని పోటుమాటలచే నొప్పించుచుండెను. ఆచార్యు డంత విసివి యోగముచే దేహమును చాలింప నిశ్చయించుకొనెను. అశ్వత్థామ మరణించెనని యసత్యవార్త ప్రకటించి పాండవులు గురుని నిశ్చయమునకు దోహదముచేసిరి. శరశరాసన ములను త్యజించి యోగనిష్ఠచే ద్రోణాచార్యుడు అసువులను వీడగా ధూర్తుడై ధృష్టద్యుమ్ను డాతని శిరస్సు ఖండించెను.

## అనంతరయుద్ధము

ద్రోణుని యస్తమయముతో కౌరవుల జయాశ లడుగంటియుండవలెను. కర్ణుని ప్రగల్భోక్తులకు లోబడి దుర్యోధను డింకను జయాశను వీడలేదు. కర్ణుడు మొదటినాడు మకర వ్యూహమును పన్నించెను. పాండవులు దీనిని అర్ధచంద్రవ్యూహముతో నెదుర్కొనిరి. కర్ణుని రెండవనాటి సమరమున ధర్మరాజు బృహస్పతిమతంబైన దుర్జయవ్యూహమును ఏర్పరపించెను. ఈనాడు సూతనందనుడు కల్పించిన వ్యూహము పేరు తెలియదు. కర్ణమరణానంతరము శల్యుడు కౌరవసేనాధీశుడయ్యెను. కౌరవులు వేర్వేరుగా కాక ఏకముఖముగా పాండవులపై బడి వారిని నిర్జింపవలెనని నిశ్చయించుకొనిరి. మహావీరు లందరును రణభూమికి బలియై సైన్యమంతయు పల్చబడినను దుర్యోధనుడు తనపట్టుదల వీడలేదు. శల్యుడు సర్వతోభద్ర వ్యూహమును సంఘటించెను. భయంకరమైన గజసైన్యమును వారుముందు నిలబెట్టిరి. గజ ములకు ముందు చతురంగములతో శకుని నిలిచెను. పాండవులు మూడు మొగ్గరములుగా మోహరించిరి. మద్రేశ్వరుడు సంహరింపబడిన తరువాత గూడ సుయోధనుడు చలము వీడలేదు. అశ్వికబలసహాయముతో శకుని తుదిప్రయత్నముగా పాండవసేనను వెనుకనుండి తాకి చీకాకుపరచెను. పదునెమిదవనాటి యపరాహ్ణమునకు శకునియు సంగ్రామమున పడెను. అంత నిస్సహాయుడై ఏకాదశాక్షౌహిణీ నాథుడైన రారాజు గదాకలితభుజుడై ఒక్కడును రణరంగము నుండి వెడలిపోయెను.

కర్ణుడు తెగినరాత్రి శిబిరమున నిద్రించుట క్షేమము కాదని కృపాచార్యుడు మున్నగు వారు దుర్యోధనునకు బోధించిరి. (శల్య-1-74) అంత వారందరును సరస్వతీనది వంకకు నడచి బయట విశ్రమించిరి. పదునెనిమిదవనాటి రాత్రి పాండవులీపద్ధతి నవలంబింపవలసి యుండెను. కాని శత్రువులందరు నశించిరని వారు విశ్వాసముతో నుండి రథికత్రయమును – కృప, కృతవర్మ, అశ్వత్థామలను – ఏమరిరి. తత్ఫలితముగ పాంచాలురును ద్రౌపదేయులును అశ్వత్థామపైశాచిక విహారమునకు గురియయి దుర్మరణము పాలయిరి. కౌంతేయులును కృష్ణ

సాత్యకులును తప్పవిడిదలలకుపోక కౌరవశిబిరంబున విశ్రమించుటచే వారు ఆపదకు తక్కిరి. (శల్య. 2-332).

భారతీయయుద్ధ విజ్ఞానమును లోతుగ తెలియదలచినవారు, ఈ క్రింది యాధారము లను అనుబంధగ్రంథములను చూడవచ్చును.

(1) అథర్వవేదము
(2) మహాభారతము
(3) కౌటిల్యుని అర్థశాస్త్రము
(4) అగ్నిపురాణము
(5) నీతి ప్రకాశిక
(6) శుక్ర నీతి
(7) కామందక నీతి
(8) శివవ్యాస ధనుర్వేదము
(9) కోదండమండనము
(10) సమరాంగణ సూత్రధార-భోజుడు
(11) యుక్తికల్పద్రుమము-భోజుడు
(12) విష్ణు ధర్మోత్తరము
(13) హరిహర చతురంగము
(14) మానసోల్లాసము
(15) అశ్వాయుర్వేదము
(16) శాలిహోత్రము
(17) లక్షణప్రకాశిక
(18) శివతత్త్వరత్నాకరము

14-10-1970

ఖండవల్లి లక్ష్మీరంజనం

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మ - ద్రోణ పర్వములు

— (౦) —

### శ్రీ మహాభారతము - ఇతిహాసము - తత్సందేశము

I

భారతదేశ వాఙ్మయముననే కాక సమస్త ప్రపంచ వాఙ్మయమందును శ్రీమద్రామాయణ, శ్రీ మహాభారతము లగ్రగణ్యములు. అందు శ్రీ మహాభారతము పంచమ వేదమని ప్రసిద్ధికెక్కినది, ఇహపరములకు సంబంధించిన సమస్త విషయములు భారతమున కలవు. భారతమున లేనిదేదియు ఇతరత్ర లేదు. అందుకే శ్రీ మహాభారతము ధర్మశాస్త్రమని వేదాంతమని నీతిశాస్త్రమని మహాకావ్యమని సర్వలక్ష్య సంగ్రహమని బహు పురాణ సముచ్చయమని ఇతిహాసమని—ఈ విధముగా లోకమున ప్రశస్తి కెక్కినది. పాశ్చాత్య వాఙ్మయమున ఇలియడ్, ఒడిస్సీ, బైబిల్ గ్రంథములు పరిమాణమున పెద్దవి. ఇలియడ్, ఒడిస్సీలు రెండు కలిపిన వానికన్న మహాభారతము ఎనిమిది రెట్లెక్కువ; బైబిల్‌కన్న మూడున్నర రెట్లెక్కువ. మహాభారతము లక్ష గ్రంథ పరిమితము. ఇంత గొప్ప యితిహాస మితర భాషలందు లేదు. మహాకావ్యము, ఇతిహాసము పురాణము—ఈ మూడును ఒక కోవలోనివి. వీనికి రసభావముల సంస్పర్శ యున్నది. మిగిలిన ధర్మశాస్త్రాదికముల కీ లక్షణము లేదు. అందువలన వాని దింకొక కోవ. ఆయా లక్షణములు మాత్ర మీ భారతమం దున్నవి.

మహాభారతము కావ్యము కాదు. భారతీయాలంకారికు లందరును ఏదో విధముగా కావ్యస్వరూపమును నిర్ణయించినవారే. వారెవ్వరును ధర్మశాస్త్రాదికములను కావ్యధర్మములుగా పేర్కొనలేదు. ఒక కథ—ఒక నాయకుడు—ఒక రసము—ఈ సంపుటిని రమణీయముగా నిర్వహించుట రూపముననే వారు కావ్యలక్షణమును విచారించిరి. కనుక మహాభారతము కావ్యము కాదు.

మహాభారతము, పురాణమును కాదు. పురాణము పంచలక్షణి. విశేషమిగా దశలక్షణి కూడ. ౧. సర్గము—సృష్టి; ౨. ప్రతిసర్గము—మరీచి మొదలుగాగల నవబ్రహ్మలొనర్చిన సృష్టి. ౩. వంశము—సూర్యచంద్ర వంశముల యుత్పత్తి. ౪. మన్వంతరము—స్వాయంభువు మొదలైన

మనువుల కాలమున గల ధర్మపద్ధతులు. ౫. వంశాను చరితము—పూర్వాపూర్వ వంశస్థుల సుప్రసిద్ధములగు చరిత్రములు. పురాణములందుండు ఈ యైదు లక్షణములును మహాభారత మందును కొంతలో కొంత యున్నవి. అయినను ఇది పురాణము కాదు. ఏలయన భారతమున నివి ప్రధాన విషయములు కావు. కురుపాండవుల చరిత్ర యొక్కటే ప్రధానము. అట్టిపరమార్థ భూతమైన కథ యొక్కటే ఆద్యంతములు వ్యాపించి యుండుట పురాణ లక్షణము కాదు. అందువలన మహాభారతము పురాణము కాదు.

భోజు డారు కావ్య ప్రభేదములను చెప్పెను. ముం దాతని బుద్ధికి తోచినవి అచ్చమైన కావ్య భేదములు మూడు మాత్రమే. ౧. కావ్యము. ౨. శాస్త్రము. ౩. ఇతిహాసము. ఈ మూడింటి లక్షణములను ఆదాన ప్రదాన రూపమున కలయగలుపగా మరొక మూడు భేదములేర్పడినవి. ౪. కావ్యశాస్త్రము. ౫. కావ్యేతిహాసము, ౬. శాస్త్రేతిహాసము. ఈ విధముగా కావ్యభేదము లారైనవి.

కావ్య ప్రభేదములలో ఇతిహాస మొకటి. అది కావ్యేతిహాసమని శాస్త్రేతిహాసమని రెండు విధములు, భోజు డితిహాసమును నిర్వచించి చెప్పలేదు. గతించిన విషయము ప్రధానముగా గలది యితిహాసమని మాత్రము చెప్పెను. గత కాలము విషయమే అతీతార్థము. అది చారిత్రకమును కావచ్చును.

ఇతిహాసమునం దితివృత్తము దేవాసుర సంబంధ నిబంధితము. ఇతిహాసమున పారంపర్యోపదేశముండును. అదే ఇతిహాసము. పురావృత్తము—అనగా పూర్వచరిత్ర నిబంధన ప్రాయమైనది ఇతిహాసమని యమరసింహుడును విద్యారణ్యుడును ఇతిహాస శబ్దార్థమును వివరించిరి. పరిక్రియ, పురాకల్పమని ఇతిహాసము రెండు విధములుగా నుండునని రాజశేఖరుడు కావ్యమీమాంసలో రామాయణ మహాభారతముల నందుకు వరుసగా నుదాహరణము లొసంగెను. అభినవగుప్తుడు నాట్యశాస్త్ర వ్యాఖ్యానమున కర్మఫల సంబంధముగల సర్వార్థములను ప్రత్యక్షముగా చూపునది యితిహాసమని నిర్వచించెను. ఆనందవర్ధనుడు మహాభారతమును గూర్చి చెప్పినది యితిహాసమును గూర్చి చెప్పినట్లే యున్నది. ఆయన మాటలలో మహాభారతము శాస్త్రరూప కావ్యచ్ఛాయాన్వయిని, అనగా మహాభారతమున కొంత శాస్త్రమున్నది. అది పరమ పురుషార్థమైన మోక్షమును ప్రతిపాదించునది. మహాభారతమున కావ్యమున్నది. కావ్యము కథనాశ్రయించుకొని యుండును. కథ నాయకపురుషు నాశ్రయించుకొని యుండును. భారతకథయందు తృష్ణాక్షయ సుఖ పరిపోషణమున్నది. తృష్ణాక్షయమనగా శమము. శమ, శాంత, మోక్ష శబ్దము లొకయర్థమునే భిన్నముఖముల నుండి ప్రతీతము చేయును. అనగా భారతమునందలి శాస్త్రమే మోక్షవిషయమును ప్రతిపాదించుచున్నదో యందలి కథయు క్రమముగా నందే పర్యవసించుచున్నది. ఈ సందర్భమున ఆనందవర్ధనుల యభిప్రాయ మిట్లు గ్రహింపవలయును. మహాభారతమందలి శాస్త్రము చూచుటకు శాస్త్రముగా కనుపించును. అది పరమార్థముగా కావ్యముతో నన్వయించుకొనిపోవుచు దానిని దీప్తము చేయుచున్నది. అందువలన మహాభారతము పై చూపు

లకు శాస్త్రమువలె నుండి లోచూపులకు కావ్యచ్ఛాయాన్వయముగలది. అనగా శాస్త్రగ్రంథము కావ్యగ్రంథముతో నన్వయము పొంది మహాభారతమైనదని తాత్పర్యము. ఈ విధముగా శాస్త్రమె కావ్యచ్ఛాయాన్వయినిగా నుండుటే యితిహాస లక్షణము.

ఇంతవరకు పేర్కొన్న నిర్వచనములను అభిప్రాయములను మననమొనర్చి ఇతిహాస శబ్దార్థమును మన మీవిధముగా నిష్కర్షింప వచ్చును.

౧. ఇతిహాసమున కథ చారిత్రకమై యుండవలెను.

౨. కథకవసరమై కొంతశాస్త్రము ప్రవర్తింపవలెను.

౩. ఆకథకు దేవాసుర సంబంధ ముండవలెను.

౪. అది పారంపర్యోపదేశ విషయాత్మకముగా నుండవలెను.

౫. కథాపురుషుల కర్మఫలానుభవము సర్వము ప్రత్యక్షముగా వర్ణింపబడవలెను కర్మఫలానుభవము ఇహ పర భేదముచేత రెండువిధములు. ఇతిహాస మీరెండింటిని వర్ణించవలెను.

ఈ లక్షణము లన్నియు మహాభారతమున కెట్లన్వయించుచున్నవో పరిశీలింతము.

భారత కథయంతయు కౌరవ పాండవులకు సంబంధించినది. కౌరవ పాండవు లిరువాగుల చీలిపోయి యుద్ధ మొనర్చిరి. యుద్ధము చారిత్రక సత్యము. ఆ యుద్ధము జరిగినకాలమును గూర్చి వివాదము లుండుగాక. అది వేరువిషయము. చారిత్రక సత్యమైన కథ కలిగి మహాభారత మితిహాసమైనది.

శాంత్యనుశాసనిక పర్వములందును మరియు నక్కడక్కడ భారతమున శాస్త్రము లెన్నగా ప్రవర్తించినది. అఖిల జ్ఞాతి జనవధమువలని నిర్వేదరూపమైన ధర్మరాజు చిత్తవృత్తి యీ శాస్త్రము ప్రవర్తించుట కాలంబనమై యవకాశము కల్పించినది. శాస్త్రప్రవర్తనమువలని ఫలితము ధర్మజునియందు ప్రకాశమునకు వచ్చినది. ఈ ప్రకారముగా మహాభారతమున శాస్త్రమును, కథయును అన్యోన్య ముత్కర్షా పాదకములై యున్నవి భారతకథకు దానియందు ప్రవర్తించిన శాస్త్రమంతయు నవసరమైనదే. పాశ్చాత్యులకును వారి ననుసరించిన కొందరు భారతీయులకును శాస్త్రభాగము చాలాభాగము ప్రక్షిప్తము. అది వేరువిషయము.

భారతమున ప్రధానభూమికలు నిర్వహించిన ధర్మరాజాదు లందరును దేవతల యంశములుగా నవతరించిరి. కౌరవులు రాక్షసాంశములతో పుట్టినారు. శ్రీ కృష్ణావతారము పరమేశ్వరుని సంపూర్ణావతారము. అట్టి శ్రీకృష్ణునికి భారతకథతో నెడతెగని సంబంధమున్నది. ఇది యంతయు భారతమునకున్న దేవాసురసంబంధము. కొందరు పాశ్చాత్యులకు శ్రీకృష్ణపాత్రము ప్రక్షిప్తము. కాని నిజము విచారించిన శ్రీకృష్ణుడు లేని భారతము ప్రాణములేని శరీరము.

భీష్ముడు ధర్మరాజునకు చేసిన మహోపదేశమంతయు నెంతో కాలమ్మునుండి ఆయా వ్యక్తులమధ్య సంవాదముగా ఆ యావిషయములు ఆ యాకాలములలో సందర్భించి పరంపరగా వచ్చుచున్నట్లే యున్నది. శ్రీకృష్ణభగవానుడు పార్థున కుపదేశించిన గీతార్థములు అంతకు ముందు నుండి వచ్చుచున్నవే. కర్మఫల సన్న్యాసాత్మకమైన జ్ఞాననిష్ఠ యొక్కటే యోగము. వేదవిద్యా ప్రతిపాదితమైన ఆ యర్థమునే భగవానుడు పదునెనిమిది ముఖములనుండి వివరించి నాడు. ఆ యర్థము సూర్యునకు, సూర్యుని నుండి మనువునకు, మనువునుండి ఇక్ష్వాకువునకు— ఈ విధముగా పరంపరగా ప్రాప్తించుచు వచ్చుచున్నది. ఈ విధముగా గీతార్థమంతయు పారంపర్యోపదేశ లక్షణలక్షితము.

భారతకథాపురుషుల కర్మఫలానుభవమంతయు నిహపరములయందు రెంటను వర్ణింప బడినది. శ్రీకృష్ణుడు దేహము చాలించి వ్యూహస్వరూపుడుగా వైకుంఠము చేరుట చెప్పుట జరిగినది. ధర్మరాజు తనువుతో స్వర్గము చేరుటను నిర్వహించి యాతని స్వర్గలోకానుభవ చిత్తవృత్తి గూడ చూపుటయైనది. అతడు నాయకపురుషుడు కనుక నాతని విషయమున నట్టిప్రత్యేక నిరూపణ కవసరమున్నది. భారతమున స్వర్గారోహణ పర్వముండుటే దాని ఇతిహాసలక్షణము.

ఈ విధముగా ఇతిహాసమున కవసరమైన లక్షణములన్నియు మహాభారతమునకు పట్టు చున్నవి. కనుక మహాభారత మితిహాసము.

భారతీయాలంకారికులు స్పృశింపని యితిహాసలక్షణ మింకొకటి భారతమునందున్నది. అది యుద్ధము. ఇతిహాసలక్షణములందు పాశ్చాత్యులు యుద్ధమును ప్రధానముగా పేర్కొని యున్నారు. ప్రాచీనములైన కావ్యభేదములందు ఇతిహాస మొకటిగా పాశ్చాత్యులు గుర్తించి నారు. అరిస్టాటిల్ నుండి ఇతిహాస కావ్యప్రక్రియను గూర్చిన మీమాంస జరుగుచునే యున్నది.

ఇప్పుడిక మొత్తము మీద ఇతిహాసస్వరూపము నిట్లు భావింపవచ్చును. ౧. సుదీర్ఘమైన కథ:- ధీరోదాత్త ధీరోద్ధత ప్రకృతులైన పురుషుల వీరకృత్యములతో సంబంధించి యుండ వలెను. ౨. ఉపాఖ్యానములు:- ప్రధానకథ దీర్ఘమై యుండుటవలన నేర్పడు విసుగుదలను తొలగించుటకును, ప్రధానకథకు బలము చేకూర్చుటకును, అనేకములైన ఉపాఖ్యానములు మధ్యమధ్యన చేరియుండును. ౩. దైవశక్తి :- ఇతిహాసకథాపురుషులను వారి కృత్యములను దైవశక్తి పాలించుట యనివార్యముగా నిరూపించవలెను. కొంతవరకు దైవశక్తి ప్రత్యక్షముగా ప్రాధాన్యము వహించి యుండుట చూపవలెను. ఇతిహాస మిట్లెందుకుండవలె ననగా నది మానవుని యౌన్నత్యమును నిరూపించుటకును, కర్తవ్యమిదియని బోధించుటకును, విధ్యేతరములైన సర్వశక్తులును సాధ్యములని ప్రత్యక్షముగా చూపుట కుద్దేశించినది కనుక, మానవుని ప్రయోజకత్వమంతయును విధికి లోబడి యుండవలసినదేగాని తద్వ్యతిరిక్తముగా నేమియు సాధింపలేదు. ఈ నిరూపణ మీతిహాసమందు ముఖ్యము. ఈ విధముగా దైవశక్తితో నీతిహాసమునకు సంబంధ మున్నందున నాదైవమును ఏయే జాతు లేయేవిధముగా భావించినవో అయావిధము లాయాజాతుల యితిహాసములందుండును. ౪. తాత్త్విక

విషయము :- ద్వైతము ననుసరించి తాత్త్వికచింతనము, ఆయా దర్శనములును దృక్పథము లును ఇతిహాసములందుండును. ౫. అమానుషలక్షణము :- మనుషులతోపాటు దేవదానవులును ఇతిహాసమున పాత్రలగుటవలన వారి వారి క్రియాకలాపములందలి మానుషలక్షణములు కనబడు చుండును. ౬. ధర్మము :- నానాప్రకారమైన ధర్మప్రపంచము బహుముఖములుగా మధ్య మధ్య ప్రవేశించుచుండును. సాంఘికరాజకీయములను, ఇహపరములను, పుణ్యాపాపములను, మంచి చెడ్డలను—ఈ మొదలగు బహువిధద్వంద్వములను చుట్టుకొని ధర్మము ప్రపంచితమై యుండును.

ప్రపంచమందలి యన్ని భాషలందున్న యితిహాసములును ఒక సుదీర్ఘమైన కథ-యుద్ధము-ఉపాఖ్యానములు-ఆయా దేశకాలములందలి మతతాత్త్వికదృక్పథములు-ఇత్యాదుల పడుగు పేకల నిబిడబంధము గలవిగా నున్నవి.

ఈ లక్షణము లన్నియును మన మహాభారతమునందున్నవి కనుక శ్రీ మహాభారత మితిహాసమన్నదే నిష్కర్ష.

## II

పరిక్రియా పూర్వకల్పము లనెడు ఇతిహాసభేదములు రెండింటిని రాజశేఖరుడును, కావ్యేతిహాస శాస్త్రేతిహాసములను రెండుభేదములను భోజుడును పేర్కొన్నారు. రామాయణ మహాభారతములను దృష్టిలో పెట్టుకొని వారట్లు విభజించియున్నచో రామాయణము కావ్యేతి హాసమును పరిక్రియయును, మహాభారతము శాస్త్రేతిహాసమును పురాకల్పమును కావలయును. కాని రాజశేఖరునివలె భోజుడు స్పష్టముగా నట్లు రామాయణభారతములను పేర్కొనలేదు. అందువలన భోజుని కావ్య-శాస్త్రేతిహాస ప్రభేదములు రామాయణమహాభారతములకే సంబం ధించినవని గట్టిగా చెప్పుటకు వీలులేదు. రామాయణమహాభారతములు తప్ప మరివేరే యితి హాసములు లేవు. భోజు డితిహాసము రెండు విధములనుటను బట్టియు, రామాయణ మహాభార తములు రెం డితిహాసము లుండుటను బట్టియు, రాజశేఖరు డారెండింటిని రెండువిధములైన యితిహాసములని చెప్పియుండుటను బట్టియు, భోజుడు చెప్పిన యితిహాస భేదములు రామాయణ మహాభారతములను దృష్టిలో పెట్టుకొనియే జరిగియుండునని యూహింపవచ్చును. కాని కావ్యేతిహాసమును గూర్చి భోజుడు చెప్పిన వైఖరినిబట్టి చూడగా ఆయనదృష్టిలో రామాయణ మితిహాసభేదముగా నుండినట్లు చెప్పుటకు వీలుకాకున్నది. 'కావ్యేతిహాసోయథా' యని శిశుపాల వధ కావ్యమునందలి, "స సంచరిష్ణుర్భువనాంతరేషు" అను శ్లోకము నుదాహరించి "అత్ర ప్రాగుక్తస్యైవ ఇతిహార్థస్య కావ్యేనాభిధానాత్ కావ్యేతిహాసోఽయం" అనెను. ప్రాగుక్త మనగా అతీతార్థ ప్రాధాన్యాత్ అనునది. అతీతార్థమైన శిశుపాలునివధ యీ గ్రంథమునందు న్నందున నిది యితిహాసము, కావ్యాభిధానమువలన దానికి కావ్యేతిహాసమని పేరువచ్చినది. కావ్యేతిహాసమును భోజుడు వివరించిన తీరిట్టిది. ఇతిహాసగతమైన యొక కథను గ్రహించి దానిని వర్ణనాదులతో పుష్టమొనర్చి రసాత్మకముగా రచించినచో నది కావ్యేతిహాసమగునని

భోజుని తాత్పర్యముగా కనుపించుచున్నది. ఇదియే భోజుని సరియైన తలంపైనచో మన కావ్య వాఙ్మయము దాదాపంతయు నితిహాసమయము కావలసివచ్చును. భారతదేశమందలి వాఙ్మయ మెక్కువగా రామాయణమహాభారతముల మీద నాధారపడి యున్నది. పంచకావ్యములుగా ప్రసిద్ధిపొందిన వానికి మహాభారతమాధారము. అందువలన నవియన్నియును కావ్యేతిహాసములు కావలసియుండును. అయినచో కావ్యమునకును కావ్యేతిహాసమునకును భేదముండదు. లేనప్పుడు కావ్యమన్న పదముండగా కావ్యేతిహాసమను మరొక శబ్దము నేల కూర్చవలసివచ్చినదో బోధ పడుటలేదు. భోజుడు కావ్యేతిహాసమను భేదమును కల్పించుట ఆతరువాత దానికి లక్ష్యమును పేర్కొనుట రెండును అన్వయమగుటలేదు.

రాజశేఖరుడు స్పష్టముగా రామాయణ మహాభారతములను లక్ష్యముచేసియే ఇతిహాసభేదములను పేర్కొనెను. కాని యాతడు చెప్పినదానిలోగూడ నొకచిక్కున్నది. రామాయణము నేకనాయకముగను భారతమును బహునాయకముగను ఆతడు చెప్పెను. కావ్య మెప్పుడును ఏకనాయకమే. బహునాయకత్వము కావ్యమునకుండదు. కావ్యేతిహాస ప్రక్రియలందేకాదు ఇతరములైన సాహిత్య ప్రక్రియలయందు దేనియందును బహునాయకులుండరు. మరి రాజశేఖరు డావిధముగా చెప్పుటయందలి యాంతర్యము నిట్లూహించుకొనవలెను. రామాయణమున కథ యంతయు శ్రీరామచంద్రుని చుట్టుకొనియున్నది. రామాయణము నందున్నంత స్పష్టప్రతిపత్తిగల ఏకనాయకలక్షణము భారతమునలేదు. రామాయణమున లక్ష్మణాదులతో కథ సాగదు. కాని మహాభారతమున భీమార్జునులతోడను, భీష్మద్రోణ కర్ణాదులతోడను కథ సాగుచున్నట్లు స్ఫురించును. భీమార్జునాదులు ప్రతిజ్ఞలు చేయుట – ఆ ప్రతిజ్ఞలు నెరవేర్చుకొనుటయందు బద్ధబుద్ధులై మెలగుట–ఇట్టి వ్యవహారము భారతమం దధికముగా నుండుటచే ఆయాపరిధులందు వారే నాయకులా యన్నట్లు తోచుట కవకాశమున్నది. కర్ణద్రోణాశ్వత్థామలు కొన్ని పట్టులందు దుర్యోధనుని వెనుకకు నెట్టి తాము విజృంభించుటచేత వారి వారి ప్రాధాన్యము కొట్టవచ్చినట్లు కనుపించుచున్నది. అందువలన భారతము బహునాయకమను భ్రాంతికి వీలుకలిగించుచున్నది. ఇట్టి భ్రాంతిలోనై రాజశేఖరుడు మహాభారతము బహునాయకమనెనో యేమో, భారతమునకు ధర్మరాజొక్కడే నాయకుడు కనుక రాజశేఖరుని మాటను పైన వివరించిన యర్థమునవే గ్రహింపవలయును.

ఈ విషయమున మరియొక విధముగా నిట్లు విచారింపవచ్చును. రామాయణము వ్యక్తి ప్రాధాన్యముగల యితిహాసము. మహాభారతము క్రియాప్రాధాన్యముగల యితిహాసము. రామాయణ ప్రారంభ మిట్లైనది :

"కోన్వస్మిన్సాంప్రతం లోకే గుణవాన్ కశ్చవీర్యవాన్
ధర్మజ్ఞశ్చ కృతజ్ఞశ్చ సత్యవాక్యో దృఢవ్రతః
ఏతదిచ్ఛామ్యహం శ్రోతుం, పరం కౌతూహలం హిమే,
మహర్షే త్వం సమర్థోఽసి, జ్ఞాతుమేవ విధం నరమ్"–

అయా లక్షణలక్షితుడైన వ్యక్తి యెవరని వాల్మీకి నారదు నడిగినాడు. అట్టివాడు శ్రీరామచంద్రుడని నారదుడు చెప్పినాడు. రామకథయే రామాయణమైనది. శ్రీరామచంద్రుని సర్వోదాత్త లక్షణములు నిరూపించునుద్దేశముతో రామాయణము పుట్టినది. మరి భారతము విషయము వేరు.

> "కురూణాం పాండవానాంచ భవాన్ ప్రత్యక్షదర్శివాన్
> తేషాం చరితమిచ్ఛామి కథ్యమానం త్వయా ద్విజ.
> కథం సమభవద్భేద స్తేషామక్లిష్ట కర్మణాం,
> తచ్చ యుద్ధం కథం వృత్తం భూతాంతకరణం మహత్"

అని జనమేజయుడు కౌరవపాండవుల చరిత్రమును గూర్చి వ్యాసుల వారి నడిగినాడు. ' కౌరవ పాండవులు మొత్తము నూటైదుగురు. అందులో ఎవరు ప్రధానులు? ఎవరునుకాదు. అందరును ఒకటియే. భారతయుద్ధమువలన వారందరును చరిత్రకెక్కిరి. యుద్ధమునకు కారణము జ్ఞాతి వైరము. అందుకే జనమేజయుడు 'తేషాం చరిత మిచ్ఛామి' యని వెంటనే "కథం సమభవద్భేదః తేషాంచ యుద్ధం కథం" అన్నాడు. అనగా కౌరవ పాండవులలో నెవరికి ప్రాధాన్యము వచ్చినను ఆభేదము పుట్టుటకు వలసిన క్రియాపరత్వమువలన రావలెను. ఆ యుద్ధ మట్లగుటకు తగినయుద్యమ క్రియాపరత్వమువలన రావలెను. మొదటి దాని విషయమున దుర్యోధనుడు ప్రధానుడు; రెండవదాని విషయమున ధర్మరాజు ప్రధానుడు. వారు ప్రధానులనుట వారి వెనుక వారివంటి వారు మరికొందరున్నారని యర్థము. కర్ణశకుని దశ్శాసనులు దుర్యోధనుని వెనుకనున్నారు. శ్రీకృష్ణార్జునులు ద్రౌపది మొదలైనవారు ధర్మరాజు వెనుకనున్నారు. రామాయణమున శ్రీరామునకు వెనుక మరియొక డట్టివాడులేడు. శ్రీరాముడు స్వయంసంపూర్ణుడు. అతని మహోదాత్తతను నిరూపించుటకు శ్రీమద్రామాయణము పుట్టినది. కౌరవపాండవుల ప్రవృత్తిని నిరూపించి స్థాపించుటకు మహాభారతము పుట్టినది. అందువలన రామాయణము వ్యక్తిప్రాధాన్యము కలదనియు, మహాభారతము క్రియాప్రాధాన్యము కలదనియు చెప్పవచ్చును. వ్యక్తి ప్రాధాన్యముగల గ్రంథమున వ్యక్తి ప్రకాశమునకు వచ్చినట్లు క్రియాప్రాధాన్యముగల గ్రంథమున వ్యక్తి ప్రకాశమునకురాదు. క్రియాప్రపంచము బహుప్రకారము. అని బహుజనముల నాశ్రయించియుండును. భారతమునందట్లేయున్నది. అందువలననది బహునాయకమన్న భ్రాంతినికలిగించుట కనువుగానున్నది. రామాయణమునందట్టి భ్రాంతికలుగుట కవకాశమేలేదు. కనుక నది యేకనాయకమని స్పష్టముగా కనుపించుచున్నది. ఈ విధముగా రాజశేఖరుని యాంతర్యము నర్థముచేసికొన్నగాని, యాతడుచెప్పినది సమన్వయముకాదు.

మరియొక శంక. రాజశేఖరుడు రామయణమునుగూర్చి యే పరిక్రియాశబ్దమును వాడెను. మరి క్రియాప్రాధాన్యము రామాయణమునందే కలదా? మొత్తముమీద ఈపరిక్రియా పురాకల్పశబ్దముల కర్థము సరిగా తెలియుటలేదు. రాజశేఖరు డితిహాసము నుపవేదములలో కలిపి చెప్పినాడు. ఇతిహాసమును అర్థవాదముగా చెప్పుటకూడ కలదు.

భోజుడు శాస్త్రేతిహాసమును నిర్వచించినది స్పష్టముగానున్నది. అది మహాభారతమున కన్వయించుచున్నది కూడ. ధర్మార్థకామమోక్షరూప చతుర్విధపురుషార్థములను వినివేశింప జేసినచో నది శాస్త్రేతిహాసమగునను తాత్పర్యము నాతడు స్పష్టముగా ప్రకటించినాడు. శాస్త్ర మనగా శాసించునది, శాసింపబడునది బుద్ధి. బుద్ధియొక్క ప్రవృత్తిని ధర్మార్థకామమోక్షము లందు శాసించునది శాస్త్రము. ఇతిహాసమునందట్టి శాస్త్రమునకు ప్రమేయముకలిగినచో నది శాస్త్రేతిహాసము. ఇతిహాసమున ప్రమేయమనగా ప్రధానేతివృత్తమున కుపబలకముగానని యర్థము. ప్రధానేతి వృత్తము ప్రధాన పురుషునిబట్టి యుండును. అతడే నాయకుడు. మహాభారతమున నాయకుడు ధర్మరాజు. ధర్మరాజుబుద్ధి, ధర్మార్థకామమోక్షములందు శాస్త్రమగుట మహాభారతమున ప్రత్యక్షముగానున్నదిగనుక అది శాస్త్రేతిహాసము. రామాయణమున నిట్టి శాసనములేదు. ఎందుకనగ రాముడు శ్రీమహావిష్ణువు ఆయనయే సర్వమును శాసింపగలవాడు. ఆయనను శాసించుటలేదు. ధర్మరాజు యముని యంశమున పుట్టిన మానవుడు. మానవులకు రాగద్వేషము లుండును. రాగద్వేషములతోడి ప్రవృత్తికలవారి బుద్ధులను శాసించుటకే శాస్త్రము పుట్టినది. భారతమునగల శాస్త్రమధిముగా ధర్మరాజుబుద్ధిని శాసించునదియే.

ద్రోణపర్వమున అభిమన్యుడు మరణించినంత వాని యందలి యనురాగమున ధర్మరాజు దుఃఖపరీతచేతస్కుడగును. యుద్ధక్రియనుండి నివృత్తుడు కాగోరును. అతడటుల కాకుండ చేయుట కచట కొంత శాస్త్రము ప్రవేశించినది. యుద్ధమైపోయినంత అఖిలజ్ఞాతివధయే ఫలితముగా కనిపించుటతో ధర్మరాజు రాజ్యమొల్లనివాడై తిరిగి యడవులకు పోగోరును. అతని నాప్రయత్నము నుండి నివర్తింపజేయుటకు శాంత్యనుశాసనాది పర్వముల రూపమునకొంత శాస్త్ర గ్రంథము పుట్టినది. అరణ్యపర్వమందును ధర్మరాజు చిత్తమును శాసించుటకే శాస్త్రగ్రంథము పుట్టినది. మహాభారతనాయకుడైన ధర్మరాజు చిత్తవృత్తులను శాసించుటకే భారతమున అటనట శాస్త్రము పుట్టినది. అందువలన మహాభారతమును శాస్త్రేతిహాసముగా చెప్పవచ్చును. పరిశేష న్యాయమున రామాయణమును కావ్యేతిహాసమనవచ్చును.

రాజశేఖరుడొనర్చిన విభజనకంటెను పెట్టిన పేర్లకంటెను భోజుడితిహాసమును విభజించి పెట్టిన పేర్లు రెండును స్పష్టముగానున్నవి. మిక్కిలి యర్థవంతములుగానున్నవి కూడ. అందువలన నితిహాసము కావ్యేతిహాసము - శాస్త్రేతిహాసమని ద్విధాభూతము. రామాయణ మహాభారతములందుకు క్రమముగా నుదాహరణములు.

## III

పాశ్చాత్యులు కూడ ఇతిహాసమును రెండు విధములుగానే విభజించిరి. 1. Authentic Epic 2. Literary Epic. వీనికే 1. Primary Epic 2. Secondary Epic అనియు 1. Epic of growth 2. Epic of Art అనియు మరికొందరు పెట్టిన పేర్లు.

పాశ్చాత్యులు నిర్వచించిన మోటి తీరు ఇతిహాసము లక్షణమిది. అది సంపూర్ణముగా నొక రచయిత యొకసారి వ్రాసిన గ్రంథముకాదు అది కొంతకాలమూరక వినిపించుటవలననే

ప్రచారమునను౦డును. అందువలన కాలక్రమమున దానిలో ననేక విధములైన మార్పులు కూర్పులు జరుగుచుండును. ఆ తరువాతి కాలమున నెప్పుడో దానికి లిఖితరూప మేర్పడును. ఒకవేళ దానికొక వ్రాతప్రతియున్నను అది శ్రావ్యమగుటయే దాని లక్షణము. ఇట్టి లక్షణము మహాభారతమందున్నది ఆ లక్షణమున కంటే ప్రమాణ వాక్యములున్నవి. వ్యాసుడు వైశంపాయ నాదులకు భారతమును చెప్పినాడు. వారాయా లోకములకుపోయి తాము గురుముఖత విన్నదానిని వినిపించినారు జనమేజయునకు వైశంపాయనుడు భారతమును వినిపించినాడు. వినుపించుచుండగా ఉగ్రశ్రవసుడు వినిపోయి శౌనకాదులకు వినిపించినాడు. ఆ తరువాత ఎప్పుడో మహాభారతము లిఖితరూపమెత్తినది వ్యాసుడేమి చెప్పినాడో వైశంపాయనుడేమి వినిపించినాడో, ఉగ్రశ్రవసుడేమి విన్నాడో శౌనకాదుల కేమి వినిపించినాడో ఇదమిత్థముగా చెప్పుట అంత సులభముకాదు. వైశంపాయనుని వలన కొంతగ్రంథము భారతమున చేరినది. ఉగ్రశ్రవసునివలన మరికొంత గ్రంథము చేరినది. వీరుగాక మరియు నెవరెవ రెంత గ్రంథము పెంచినారో మనకు తెలియదు. పెంచినది మాత్రము నిజమనుట కవకాశములున్నవి. కనుక మహాభారత మొకరి చేతిమీదుగా వ్రాయబడినది కాదు. అది వ్రాయకపూర్వము రెండుచోట్ల వినిపింపబడినది. భారతమందున్న గణేశ వృత్తాంతము భారతమును వ్యాసుడు వ్రాయలేదనుటకు నిదర్శనము. అది వ్రాయబడకపోవుట వలననే తరువాత తరువాత పెరిగి బృహద్గ్రంథమైన దనియు, విషయ విన్యాసమందును మార్పులు కలిగినవనియును, భారతమును వల్లెవేసి జ్ఞాపకమును పురస్కరించుకొని పలుమంది పలుతావుల వినిపించుటవలననే విషయమున మార్పులు కూర్పులు కలిగినవనియు డాక్టరు సూక్తంకర్ గారు వ్రాసినారు. వీని నన్నింటినిబట్టి చూడగా మన సంస్కృత మహాభారతము **Primary Epic** అగుచున్నది.

పాశ్చాత్యులు పేర్కొనిన **Secondary Epic** లక్షణ మిట్లున్నది అది వినుటకుగాక చదువుట కుద్దేశించినది. అది ఏకకర్తృకము దానిలో కావ్యశిల్పరూపమైన నిబిడబంధముండును. మిగిలిన లక్షణము లన్నియు **Primary Epic** లో నెట్లో ఇందును అట్లే. మహాభారతమును **Primary Epic** అన్నాము కనుక రామాయణమును **Secondary Epic** అనవచ్చునా? రామాయణముకూడ ఒక్క వాల్మీకియే వ్రాసినది కాదని కొందరందురు ఐనను భారతమున కంటె రామాయణము నిబిడరచనాబంధము కలది. ఇతిహాస లక్షణమగు సుదీర్ఘకథ, పెద్ద యుద్ధము, ధర్మ సంస్థాపనము, మొదలైన వన్నియు రామాయణ మందున్నవి. అందువలన రామాయణ మితిహాసమే. **Secondary Epic** కు మరియొక పేరు **Epic of Art.** ఈ యర్థము భారతముకంటె ఎక్కువగా రామాయణమునకే పట్టుచున్నది. నిర్మాణ వైదగ్ధ్యమును బట్టి చూచినచో రామాయణమును కావ్యేతిహాస మనవచ్చును. నిజమునకు భోజుడు రామాయణమును కావ్యేతిహాస మనకపోయినను సమన్వయ దృష్టిని విషయ విచారణ చేసినచో అనవచ్చుననియే తోచుచున్నది. అందువలన పాశ్చాత్యుల విభజననుసరించి మహాభారతము **Primary Epic** రామాయణము **Epic of Art.**

కావ్యేతిహాసము **Primary Epic** ఆదర్శముగాగొని నిర్మితమగుననుభావమ్మే పాశ్చాత్యుల కున్నది. ఆ దృష్టితో చూచినచో ఆంధ్రమహాభారతమును సంస్కృత మహాభారతము

ననుసరించి వ్రాసిన దగుటచేత -కావ్యేతిహాస మనవచ్చును. వ్రాసినంతవరకొక్కో కవి వ్రాయుట-కావ్యశిల్ప మధికముగా గలిగి నిబిడబంధముతోనుండుట మొదలైన Epic of Art కావ్యేతిహాస లక్షణములు ఆంధ్రభారతమునకు పట్టుచున్నవి. ఐనచో సంస్కృత రామాయణము ఆంధ్రభారతము ఒక జాతి గ్రంథములా ? ఇదియు నందరకు సమ్మతముకాదు.

మొత్తముమీద పర్యవసానము నిట్లు తేల్చి చెప్పవచ్చును. ఇతిహాసము నొక కావ్య ప్రభేదముగా భారతీయులును పాశ్చాత్యులును భావించుచున్నారు. ఇరువురును ఇతిహాసమును రెండు విధములుగానే విభజించినారు. భారతీయాలంకారికుల వచనము ననుసరించి భారతము శాస్త్రేతిహాసము. పాశ్చాత్యుల పద్ధతి ప్రకారము భారతము Primary Epic. వారి వారి వాక్యముల ననుసరించి ఒక్క రామాయణమునే స్పష్టముగా కావ్యేతిహాసమని కాని Epic of Art అని కాని చెప్పుటకు వీలగుటలేదు. రామాయణము మాట యెట్లున్నను భారతము మాత్రము నిస్సందేహముగా శాస్త్రేతిహాసము. ఆంధ్రమహాభారతము ప్రయత్నముమీద కావ్యేతిహాసముగా రచితమైనది. సంస్కృత భారతమునన్న దానికంటె అధికకావ్య నిర్మాణ శిల్పమును ప్రవేశపెట్టి శాస్త్రేతిహాసమును కవిత్రయము వారు శ్రద్ధాళువులై కావ్యేతిహాసముగా మలచుటకు యత్నించినారన్నమాట. ఇట్లనుట సంస్కృత మహాభారతమునకంటె ఆంధ్ర మహాభారతము శ్రేష్ఠమైనదని యర్థముకాదు. ఆ రెండింటికిని నిర్మాణమునందు భేదమున్నదని మాత్రమే యర్థము. అందువలన సంస్కృత మహాభారతము శాస్త్రేతిహాసము; ఆంధ్రమహాభారతము కావ్యేతిహాసము. కవిత్రయమువారును అప్పకవివంటి లాక్షణికులును మహాభారతమును ఇతిహాసముగానే పేర్కొన్నారు.

## IV

మహాభారతముయొక్క శాస్త్రేతిహాసమహనీయతకు దోహదము చేసినవి సాధారణమైన ఉపమా రూపకాద్యలంకారముల వినియోగము, ప్రవాహవేగముగల శైలి, అనుష్టుప్ఛందము, నాతిదీర్ఘములైన సమాసములు, శబ్ద చిత్రములు, శ్రవణసుభగత్వము, మీదుమిక్కిలి రక్తమాంసములతోకూడిన చైతన్యవంతమైన సజీవ వాస్తవిక పాత్రలు. ఇతిహాసకర్త మహాభారత మందలి పాత్రలనెట్లు సర్వాంగ సుందరములుగా మలచినాడో యించుక పరిశీలింతము. ధర్మాధర్మములకు క్రమముగా ప్రతినిధులైన పాండవులొక తీరువారు; కౌరవులింకొక తీరువారు. పాండవులందొక్క భీముడుతప్ప తక్కిన వారందరొక తీరువారు. భీముడు కొంచెము మోటు; తొందరపాటెక్కువ. ఈర్ష్యాసూయలు మూర్తీభవించినవారు కౌరవులు. మొత్తము మహాభారతమున పేర్కొనదగిన పాత్రలు భీష్ముడు, ధృతరాష్ట్రుడు, శకుని, ద్రోణుడు, కర్ణుడు, దుర్యోధనుడు, ధర్మరాజు, ద్రౌపది మొదలైనవారు. ధర్మరాజు ఆత్మసంయమనము కలవాడు. భీముడు వెనుక ముందాలోచనలేనివాడు. అర్జునుడు మహావీరుడు. కర్ణుడు దురహంకారి మరియు దానగుణము కలవాడు. దుర్యోధనుడు ఈర్ష్యాసూయలతో కూడిన స్వాభిమానము, స్వోత్కర్ష గలవాడు ధృతరాష్ట్రుడు వెన్నెముక లేనివాడు. ద్రౌపది ముఖ్యముగా పతివ్రత; ధైర్యసాహసములు కలది; మర్యాద తెలిసినది.

ఈ యందరిదొక యెత్తు భీష్ముని దొకయెత్తు. మానవత్వము సంపూర్ణముగా పరిపక్వమునకు వచ్చినప్పుడు భీష్మునివంటి వాడొక డుద్భవిల్లును. భీష్ముడు మహాభారతమునకు మూలస్తంభము. ఆతడు రాజ్యాధికారము కలవాడు; గొప్ప యుద్ధవీరుడు. ధర్మాధర్మములు రాజనీతి ఆతకిని తెలిసినంతగా ఇతరులకు తెలియవు. ఆతని జీవితము మహాభారతమున విచిత్రమైన అననుకూల పరిస్థితులలో సాగినది. రాజ్యము విషయమునను ఆతడు స్వార్థమును త్యజించియే నడచినాడు. తండ్రికి వివాహముచేయుటకు తా నాజన్మ బ్రహ్మచారి యైనాడు. పాండవులతో కౌరవుల పక్షమున యుద్ధముచేసి పాండవులందలి ప్రీతిభావమునకు బలియైనాడు పాండవుల యందలి ప్రీతియనగా ధర్మమునందలి ప్రీతి.

ధృతరాష్ట్రుడు విచిత్రమైన వ్యక్తి. ఆతనియందు మంచి చెడ్డలు రెండును కలగాపులగముగా నున్నవి. రాగద్వేషముల కతీతుడు కాడు. మనోనిశ్చయము లేనివాడు. మంచిని విడువలేడు; చెడు చేయకుండ నుండలేడు. ఆతనిలోని మంచి చాల దుర్బలమైనది పాండవుల కన్యాయము జరుగుచున్న ట్లాతనికి అంతరాంతములందు తెలియును తన కుమారుల యనుచిత ప్రవర్తనము ను తెలియును కాని తానా యనుచితము నడ్డలేడు. మహా ప్రళయమువలె యుద్ధము ముంచుకొనిరాగా విధివిలాసమని విలపించును. మంచి చేయవలయునన్న అభినివేశము కలవాడుకాడు. చెడుగు నెదుర్కొన వలయునన్న పట్టుదల కలవాడును కాదు. అందువలన కొడుకుల నేమనలేక పోయెను. తనకున్న కుమారులపై వాత్సల్యము లేనివాడును కాదు పాండవులు వారణాసిలో లాక్షాగృహమున మరణించినారని విని ఆత డెంతగానో విలపించెను. భీష్మ ద్రోణ విదురాదులు పాండవుల కన్యాయము జరుగకుండ చూడవలసినదిగా నెంతచెప్పినను ధృతరాష్ట్రుడు వినడు. తా నా పని చేయజాలననికూడ చెప్పును. ఆతనికి పాండవులందు భీముడన్న భయము. భీమునికిగూడ ధృతరాష్ట్రునిపై అంతకోపమే. ఈ యిరువురకున్న పరస్పర ద్వేషము స్త్రీపర్వమునను ఆశ్రమవాస పర్వమునను ఇతిహాసకర్త వ్యక్తీకరించినాడు. తానొనర్చిన తప్పిదమును భీముడు క్షమించడని ధృతరాష్ట్రునకు తెలియును. తన నూర్గురు కొడుకులను చంపినాడన్న కోపము భీమునిపై కలదు. అందుకే భీముని తన కౌగిలిలోనలిపి చంప ప్రయత్నించినాడు. తన కొడుకులుచేసిన దుర్మార్గమాతని మనస్సును పట్టుకొని పీడించుట యట్లేయున్నది.

విదురుడు ధృతరాష్ట్రుని సోదరుడుగా చెల్లుచున్నను ఆతని జన్మాదికము కర్ణుని జీవితమువంటిది. కాని కర్ణుడు తన జీవితమున నెట్టి కష్టముల నెదుర్కొన్నాడో విదురుడు తన జన్మాదిక లక్షణముచేత నట్టి కష్టపరంపర నెదుర్కొనవలసిరాలేదు. విదురుడు నిర్భయుడు మరియు ధర్మమున బద్ధబుద్ధి. పాండవులు ధర్మమార్గవర్తనులనియు వారిపక్షమున న్యాయమున్నదనియు విదురుడు గాఢముగా నమ్మినవాడు. అవకాశము లభించినపుడెల్ల ఆ విషయమాతడు ధృతరాష్ట్రునికి చెవినిల్లుకట్టుకొని బోధించినాడు. విదురుడు కూడ యమధర్మరాజు అంశమున పుట్టినవాడే. ఆశ్రమవాస పర్వమందాతడు శరీరమును త్యజించి తేజోరూపమున ధర్మరాజులో ప్రవేశించినాడు. చిత్రమేమన ధృతరాష్ట్రుడు విదురుని మాటలు పాటింపకున్నను మాటిమాటి కాతని పిలిపించుకొని కాలక్షేపము చేయజూచును. విదురుడు ధృతరాష్ట్రుని నిందించి పలికి కూడ ధర్మోపదేశము చేయును.

కర్ణుడు మరొక చిత్రమైనవ్యక్తి. ఏ మార్గమున తనకు నాశనమున్నదని తెలియునో ఆ మార్గముననే అతడు ప్రయాణము చేయును. పాండవులతో యుద్ధము కూడదన్ని అతనికి తెలియును. ఆ యుద్ధములో పాండవులు గెలుతురనియు తెలియును. దుర్యోధనుడు చేయునది న్యాయవిరుద్ధమనియు తెలియును. అయినను దుర్యోధనుని పక్షమాతడు విడువడు. అతని నామార్గమునుండి తప్పించుటకు శ్రీకృష్ణుడు ప్రయత్నము చేసినాడు. కుంతియు ప్రయత్నించినది. ఆ యిరువురును మహాప్రళయ ఝుంఝుల వంటివారు. కాని కర్ణుడు మహామేరువువలె నచలుడుగా తనను తాను నిలువద్రొక్కుకొనెను. ఒకవిధముగా కర్ణుడు విధివంచితుడు. తల్లిచేత కూడ వంచితుడు. తెలిసి తెలిసి మిత్రుని కొరకు మృత్యువును వరించిన స్నేహశీలియాతడు.

ఇట్లే మహాభారతమున మిగిలిన పాత్రలన్నియును రక్తమాంసములతో చైతన్యవంతములై కనిపించును. ధర్మరాజు - ద్రౌపది ఒకరిని మించినవారు మరొకరు కావ్యపరిభాషయందు భారతమునకు వారు నాయకత్వము వహించువారు.

## V

మహాభారతము దేశీయులను విదేశీయులను చాల కాలమునుండి ఆకర్షించుచున్నది. అది కేవలమొక సింహాసనము కొరకు జరిగిన యుద్ధము మాత్రమేనా? అట్టి యుద్ధకథ యందింత కాలము అభిరుచి నిలిచియుండునా? మహాభారతమందలి పాత్రలు చిత్రములైనందువలన ఇంతకాలమిందరు దానియందు ప్రీతిగలవారై యున్నారా? ఇంతకన్న ముఖ్యమైనదేమైన కలదా? లేనిచో నది సార్వజనీనము సార్వకాలికము కాగల్గునా?

ఆదిపర్వములో మహాభారత పాత్రలేయే దేవాసురాంశలతో జన్మించినారో చెప్పబడినది. దేవాసురులు తమతమ యంశలతో మానవులను జన్మింపజేసి వారిచేత ఇంతఘోరమైన యుద్ధము చేయించి వారిని నాశనము చేయింపవలసి వచ్చిన యవసరమేమి? భూలోకమున రాజులు దుర్మార్గులైనారు. ప్రజలు అపవిత్రులైనారు. అధర్మము పెచ్చుపెరిగినది. అందువలన భూదేవి ఆర్తినిపొంది శ్రీ మహావిష్ణువును ప్రార్థింపగా నా పరాత్పరుడు భూభారమును మాన్పుటకును దుష్టులను శిక్షించుటకును శిష్టులను రక్షించుటకును అవతరించెను. తనపనికి సహాయభూతులుగా నుండుటకు దేవాసురులను తమతమ యంశములతో మానవులుగా జన్మించునట్లు చేసెను. ఇది మహాధర్మ సంస్థాపనార్థము జరిగిన కథ. అట్టి కథ నీ మహాభారతము చెప్పుచున్నది అందువలన దీనిని కేవలము హస్తినాపుర రాజ్యసింహాసనమునకై పోరాటముగా మాత్రమే భావించరాదు. దీని వెనుక దేవతలు, మహర్షులు, రాజర్షులు, రాక్షసులు మొదలైన అతిమానుష శక్తులుగలవారున్నారు. సాక్షాత్తు శ్రీమహావిష్ణువు శ్రీకృష్ణుడుగా జన్మించి ఈ మహానాటకమున నొక కీలకపాత్ర నిర్వహించినాడు. ఆయనతన భగవల్లక్షణమును మహాభారతమున రెండు మూడుసార్లు ప్రత్యక్షీకరించి చూపినాడు. దుష్టులైన కౌరవులను వారి పక్షమువారిని హతమార్చుటకును, శిష్టులైన పాండవులను వారి పక్షమువారిని సంరక్షించుటకును శ్రీకృష్ణుడు

తాను భగవంతుడన్న విషయము పూర్తిగా తెలిసినవాడై మెలిగినాడు. ఆయన విధానమును మహాభారతము వివరించుచున్నది.

ఒకవిధముగా మహాభారతమందలి సంఘర్షణము ఒకకాలమునకు ఒకదేశమునకు పరిమితమైనది కాదు. ఈ సృష్టియందు ఆద్యంతముగా ఒకరి యాస్తిని మరియొకడు కాజేయ జూచు భావము వ్యాపించియున్నది. ధర్మరాజాదుల రాజ్యభాగమును దుర్యోధనుడు కాజేయ వలెనని సంకల్పము కలవాడు. అట్లుకానిచో నీ కథయేలేదు. ఈ ప్రపంచకథ మూడువంతులకు పైగా పరపీడన పరాయణత్వముతో నిండియున్నది. భారతకథ ద్వాపర యుగాంతమునాటిది. కలియుగమున మానవుల యందిట్టి ప్రవృత్తిని మనము చూచుచునే యున్నాము. అందువలన మహాభారతమున సంఘర్షణకు మూలభూతమైన భావలక్షణమేది కలదో అది త్రికాలాబాధ్యమైన సత్యము. అది నిన్నయుండినది నేడున్నది. రేపును ఉండును.

భారతమునకు నాయకుడైన ధర్మరాజు ధర్మమాకారము దాల్చినవాడు. మహాభారతమందాతడు ధర్మరాజు ధర్మసుతుడు, ధర్మసూనుడు మొదలైన పేర్లతోడనే ఎక్కువగా వ్యవహృతుడు. ఆతనికి యుధిష్ఠిరుడను పేరున్నను దాని వాడుక తక్కువ. ఇతిహాసకర్త తానే ముఖ్యప్రయోజనమును మహాభారత రచనద్వారా సాధింప నిశ్చయించుకొన్నాడో ఏతత్ప్రయోజనమైన ధర్మ సంస్థాపనమునకు మూలస్తంభముగా నిలిపిన నాయకపురుషుని ధర్మశబ్దముతో కలిపి పేర్కొనుటయే సముచితముగా భావించినట్లు కనిపించుచున్నది. ధర్మరాజు యక్షప్రశ్నలకు సమాధాన మిచ్చుటకూడ ఆయన ధర్మమయత్వమునకే నిదర్శనము. పాండవులలో మిగిలినవారి కట్టి ధర్మప్రపంచజ్ఞానము లేదు. వ్యాసుడు ధర్మప్రతిపాదనార్థము రచించిన భారతేతిహాసము నాయకపురుషుని ధర్మరాజనుటలో గల విశేషము నిట్లే భావింపవలయును.

ఇంకొక దృష్టితోకూడ మహాభారతమును పరిశీలింపవచ్చును. దేవాసుర వైరమ సృష్ట్యాదినుండియు కలదు. ఈ యితిహాసమున సంఘర్షించిన యిరుపక్షములును దేవాసురాంశలతో పుట్టినవారు. దేవాసుర సంఘర్షణమే మహాభారత యుద్ధము. అరణ్యపర్వమున ఘోషయాత్రా సందర్భమున దైత్యులు రాక్షసులు రాజవంశములలో పుట్టి దుర్యోధనునకు సహాయము చేయనున్నారనియు దానవులును అందుకొరకే భూమినవతరించిరనియు చెప్పియున్నది. మంచి-చెడ్డలు. పుణ్య-పాపములు దేవాసురలక్షణములు పరస్పరము సంఘర్షింపగా భారతమైనది. ఇతిహాసమున నిరుపక్షముల వారికిని పెట్టినపేర్లను పరికించినచో ఇతిహాసకర్త ఈ సృష్టివైచిత్ర మును ప్రదర్శించుట కెంత జాగ్రత్తపడినది తెలియును.

భగవదవతారమైన శ్రీకృష్ణుడుండుటవలన మహాభారతము గౌరవమెక్కువైనది. శ్రీకృష్ణుని భగవల్లక్షణమును మహాభారత మాద్యంతములు జాగ్రత్తగా కాపాడుకొనుచునే యున్నది. భగవంతుడున్నాడు కనుకనే ధర్మసంస్థాపనము జరిగినది. ఆయన అందుకొరకే యవతరించుచుండును.

"యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం.
పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే."—

కలికల్మషము నీవిధముగా భగవంతుడు తొలగించినాడు. నిజమునకు భారతయుద్ధమంతయు చేసినది భగవంతుడే. కాని ఆయన చేసినట్లు కనిపించడు. అందువలన అర్జునుడు మహాభారత యుద్ధము చేసినవాడైనాడు.

భారతము నాయకుడు ధర్మరాజు. ధర్మరాజు ధర్మము భగవంతు నాశ్రయించి యుండును. ధర్మరాజు యుద్ధము చేసినది తక్కువ. ద్రోణపర్వములో నొకమారు శల్యపర్వములో నొకమారాతడు యుద్ధమొనర్చినాడు. ఆయన యుద్ధమునకు దిగినది త బలమునుగాని తన తమ్ముల బలమునుగాని చూచుకొని కాదు. భగవద్బలమును నమ్ముకొని దిగినాడు. యుద్ధములో ధర్మరాజు జయించినాడు. అనగా ధర్మము జయించినది, భూభారము తగ్గినది. ప్రపంచమును ధర్మము పాలించుట కవకాశ మేర్పడినది. ధర్మరాజు అశ్వమేధము చేయుట కదియే యర్థము. అధర్మమును జయించి ధర్మము సార్వభౌమాధికారము నెరపుటకు అశ్వమేధ ముపలక్షకము.

మహాభారతము ధర్మముతోబాటు అర్థకామమోక్షములను గూడ వ్యాఖ్యానించి ది. పురుషార్థములలో మోక్షము పరమైనది. ఈ పరమార్థమును నిరూపించుటవలననే మహాభారతమున శాంతిరస మంగిరసమైనది. యుద్ధమైనప్పటినుండి పాండవులు మోక్షాభిముఖమైన ఉపశమిత చిత్తవృత్తులు కలవారైనారు. పరమేశ్వరుడైన భగవంతుడు మోక్షోపాయముగా గీతల నుపదేశించినాడు. భగవంతు డొనర్చిన యుపదేశము అర్జునుని తత్కాలమున యుద్ధోన్ముఖుని చేసినది. ఆ తరువాత మోక్షపథగామిని చేసినది. వాసుదేవ పరబ్రహ్మము శ్రీకృష్ణుడుగా నింతయుపదేశము చేయుటచేత భారతపరమార్థము మోక్షప్రదర్శనమే యని చెప్పవలెను. మానవజీవితము పరిపూర్ణము కావలెనన్నచో అన్ని పురుషార్థములు అవసరమైనంత సాధింపబడవలెను. మానవజీవితము కర్మరూపమున కొనసాగుచున్నది. కర్మాపేతమై మనుగడలేదు. అట్టికర్మ మానవునకు బంధహేతువు కాకుండచేసి చూపుటకు భగవద్గీత – మహాభారతము తీవ్రముగా కృషిచేసినది. బంధహేతువు కాని కర్మయే ధర్మము. ఈ యర్థమును ప్రపంచించి చూపుటకే వనపర్వము శాంతిత్రయము సాగినవి. ఈ పరమార్థమును గ్రహింపనివారు అవి ప్రక్షిప్తములనియు అధికపాఠములనియు తరువాతి కాలమున చేరినవనియు అందురు. అది నిజముకాదు సకలపురుషార్థసాధనముగా వ్యాసభగవానుడు భారతమును తీర్చిదిద్దినాడు. మానవజీవితముయొక్క ఇహపరములు రెండును మహాభారతమున ప్రదర్శితమైనవి. ఇహము సంఘర్షణ పరము మోక్షము; ఇహమును కాదని పరమును సాధించుటను మహాభారతము చెప్పదు. ఇహమునుండియే పరము. సంఘర్షణము నుండియే మోక్షము.

# VI

ధర్మాధర్మములనే నీతి యవినీతి యనవచ్చును. మహాభారతము అవినీతి రూపుమాసి పోవుటను నీతివిజయమును నిరూపించినది. భారతేతిహాసము పాఠకులను లేదా శ్రోతలను సత్యమునకు న్యాయమునకు నీతికి మంచికి అభిముఖులుగా చేయుటకై యొనర్చిన ప్రయత్నము చాల గొప్పది. ఏ యుపకథ చెప్పినను, ఏ పాత్రకదలిక చూపినను ఏ ధర్మముపదేశించినను పాఠకుల విషయమున నీ ప్రయోజనమును సాధించుటను ఇతిహాసకర్త విస్మరించలేదు.

శ్రీకృష్ణార్జునులను జాగ్రత్తగా అర్థముచేసి కొనవలయును వారు నరనారాయణులు, శ్రీకృష్ణుడు నారాయణుడు, అర్జునుడు నరుడు, నారాయణుడు పరమేశ్వరుడు; నరుడు మహర్షి; అనగా మనుష్యుడు, మనుష్యుడు జీవాత్మ. పరమేశ్వరుడు పరమాత్మ: పరమాత్మసన్నిధి జీవాత్మకు విజయహేతువు. శ్రీకృష్ణుని సహాయమర్థించుటకు దుర్యోధనార్జును లేక కాలమున పోయిరి. కాని దుర్యోధనుడు సైన్యమును అర్జునుడు శ్రీకృష్ణుని కోరుకొన్నారు. పరమాత్మ డర్జునుని పక్షమున చేరుటతో విజయమర్జునునకు కలిగినది. అర్జునుడు పురుషకారము. శ్రీకృష్ణుడు దైవసహాయము. అందుకే యాపురుషకారము ఫలించినది.

మహాభారతముననే దైవీ ఆసురీ శక్తుల సంఘర్షణము ప్రపంచితమైనదో అది వ్యక్తుల మధ్యనే కాక వ్యక్తి నిష్ఠమైకూడ ఉండును. అంతశ్శత్రువులు - కామక్రోధలోభ మోహామద మాత్సర్యము లెప్పుడును సత్వమును అణగద్రొక్కుటకే ప్రయత్నించును. ఈ సంఘర్షణము నిత్యము సాగుచునేయున్నది. సత్వమనగా ఆత్మ, ఆత్మ - ధర్మము ఆత్మ-సత్యము. ఆత్మ-విజ్ఞానఘనము. అట్టిది నిరంతరము కామక్రోధాదులతో జీవాత్మరూపమున ఘర్షణపడవలసివచ్చి యున్నది. ఈ ఘర్షణమే మహాభారతము. అందువలననే ఆత్మస్వరూపమును మహాభారత మావిష్కరించినది. కామక్రోధాదుల లక్షములను వివరించినట్లుగానే ఆత్మపదార్థ లక్షణ వివరణమును భగవద్గీత ముఖమున మహాభారతముచేసినది. కామక్రోధాదులు ప్రవృత్తిలక్షణము. ప్రవృత్తి దుఃఖహేతువు. దానికి విరుగుడు నివృత్తి. ఈ ప్రవృత్తిని వృత్తులను మహాభారతము కథారూపమున, ఉపాఖ్యానముల రూపమున, వేదాంత విషయరూపమున, ధర్మవిషయరూపమున ప్రతిపాదించినది.

మానవజాతి నావరించియుండు నిరంతర సంఘర్షణ లక్షణమును మహాభారత మితిహాసవస్తువుగా స్వీకరించినది. త్రికాలాబాధ్యమైన యా సత్యమును విస్పష్టముగా వివరించినది. మానవ జీవితమే యొక సంఘర్షణ. అందులోపరిత ప్తులైనప్పుడే మోక్షమున కర్హతగల వారగుదురు. ధర్మార్థకామ మోక్షములలో నేదియు తక్కువకాదు అన్నింటి నావరించి ధర్మముండవలెను. ధర్మబద్ధమైన యర్థకామముల యనుభవమునుండి విరమించుటయే మోక్షము.

మహాభారతము కావ్యకళావిలాసములను ప్రదర్శించుటకు మాత్రమే పుట్టినదికాదు. ప్రపంచమునకొక యాదర్శమును, ఒకనైతిక మార్గమును చూపవలెనను ప్రగాఢాభిప్రాయముతో

తీర్చబడినదా యితిహాసము. ప్రపంచమనగా జీవితము. జీవితసమస్యలను బహుముఖములుగా పరిశీలించి పరిష్కార మార్గములను సూచించినది. భారతేతిహాసము. ఆదర్శప్రాయమైన మానవజీవిత లక్ష్యమెట్లుండవలెనో నిరూపించినది భారతేతిహాసము. మహాభారతము చూపించిన పరిష్కార మార్గములలో ప్రధానమైనది కర్మమార్గము. అది స్వార్థములేని కర్మ నిష్కామ కర్మ —

అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతం గమయ

బి. రామరాజు

———

# విషయసూచిక

## భీష్మపర్వము – ప్రథమాశ్వాసము


| విషయము. | | పుట. |
|---|---|---|
| ధృతరాష్ట్రునికడకు వేదవ్యాసుండు వచ్చుట | 6-2-1 | 1 |
| సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట | 6-5-9 | 4 |
| సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతవర్షంబునం గలవిశేషంబులు చెప్పుట | 6-10-1 | 7 |
| ధృతరాష్ట్రుఁడు భీష్మమరణంబు విని విలపించుట | 6-14-1 | 10 |
| సంజయుఁడు ధృతరాష్ట్రునకు భారతయుద్ధంబు సెప్పఁ బూనుట | 6-16-7 | 16 |
| భీష్ముఁడు నిజయోధులకెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట | 6-17-7 | 19 |
| పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట | ... | 20 |
| ధర్మజునకు నర్జునుఁ డుత్సాహంబు గలిగించుట | 6-1-93 | 25 |
| ధర్మరాజు పాదచారియై భీష్ముని యొద్దకుఁ బోవుట | 6-41-6 | 30 |
| ధర్మరాజు గురుకృపశల్యులచేత యుద్ధమున కనుజ్ఞాతుం డగుట | 6-41-43 | 32 |
| అర్జునుఁడు స్వజనసంహారంబునకు శంకించి మోహావిష్టుం డగుట | 6-23-30 | 36 |
| శ్రీకృష్ణుఁ డర్జునునకుఁ దత్త్వజ్ఞానోపదేశంబు సేయుట | 6-24-19 | 39 |
| అర్జునుఁడు శ్రీకృష్ణునివిశ్వరూపంబు గనుంగొని స్తుతించుట | 6-33-5 | 41 |
| భీష్ముని ప్రథమదివసయుద్ధము | 6-42-1 | 45 |
| భీష్ముఁడు దుర్యోధనప్రేరితుం డై పాండవవీరుల నొప్పించుట | 6-45-1 | 53 |


## భీష్మపర్వము – ద్వితీయాశ్వాసము


| | | |
|---|---|---|
| ధర్మజుఁడు గోపాలదేవుపాలికిం జనుట | 6-46-1 | 59 |
| భీష్ముని ద్వితీయదివసయుద్ధక్రమము | 6-47-1 | 64 |
| అర్జునుఁడు భీష్మునిమీఁదికి రథంబు దోలించి విజృంభించుట | 6-48-2 | 66 |
| ధృష్టద్యుమ్న ద్రోణాచార్యులయుద్ధము | 6-49-1 | 70 |
| భీమసేనునిచేత భానుమంతుండు చచ్చుట | 6-50-30 | 73 |
| భీష్మునితృతీయదివసయుద్ధము | 6-52-1 | 80 |
| దుర్యోధనుఁడు భీమునితో యుద్ధముసేసి మూర్ఛిల్లుట | 6-54-15 | 84 |
| అర్జునుఁడు శ్రీకృష్ణప్రేరితుఁడై భీష్మునిపైఁ గవియుట | 6-55-40 | 91 |
| శ్రీకృష్ణుఁడు చక్రంబు ధరించి భీష్మునిమీఁది కుఱుకుట | 6-55-84 | 94 |

| విషయము | | పుట |
|---|---|---|
| భీష్ముని చతుర్థదివసయుద్ధము | 6-56-1 | 97 |
| శల్యనందనుఁడు ధృష్టద్యుమ్మునితో యుద్ధంబుసేసి చచ్చుట | 6-57-25 | 101 |
| దుర్యోధనుఁడు భీముని మార్కొని మూర్ఛఁ బొందించుట | 6-60-7 | 108 |
| ఘటోత్కచుండు మాయాబలంబున కౌరవసేనపై విజృంభించుట | 6-63-40 | 111 |
| భీష్ముని పంచమదివసయుద్ధక్రమము | 6-65-1 | 117 |
| ద్రోణుండు దుర్యోధనప్రేరితుండై పాండవసైన్యంబుపైఁ గవియుట | 6-65-21 | 119 |
| అభిమన్యు లక్ష్మణకుమారులయుద్ధము | 6-69-30 | 126 |
| భీష్ముని షష్ఠదివసయుద్ధక్రమము | 6-71-1 | 130 |
| ధృష్టద్యుమ్నుఁడు భీమసేనునకుఁ దోడ్పడుట | 6-73-31 | 135 |
| ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితో యుద్ధముసేయుట | 6-73-67 | 138 |


## భీష్మపర్వము – తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| భీష్మగాంధారేయులసంవాదము | 6-76-3 | 145 |
| భీష్ముని సప్తమదివసయుద్ధక్రమము | 6-77-11 | 146 |
| ధృష్టద్యుమ్మునిచే దుర్యోధనుఁడు విరథుఁడై పోవుట | 6-78-44 | 149 |
| చేకితాన కృపాచార్యుల ద్వంద్వయుద్ధము | 6-80-20 | 153 |
| భీష్ముని యష్టమదివసయుద్ధక్రమము | 6-83-1 | 159 |
| సునాభుఁడు మొదలగుకురుకుమారులు భీమునిచేఁ జచ్చుట | 6-84-12 | 160 |
| అలంబుసునిచేత నిరావంతుఁడు మృతుం డగుట | 6-86-48 | 164 |
| ఘటోత్కచుఁడు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబుసేయుట | 3-88-25 | 168 |
| అర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట | 6-92-1 | 174 |
| భీష్ముని నవమదివసయుద్ధము | 6-95-1 | 180 |
| అలంబుసుఁడు దుర్యోధనప్రేరితుఁడై యభిమన్యుపైఁ గవియుట | 6-96-24 | 183 |
| అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధముసేయుట | 6-98-4 | 186 |
| దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మునకు సహాయంబుగాఁ బంపుట | 6-101-1 | 190 |
| శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకిఁ బోవుట | 6-102-52 | 196 |
| ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట | 6-103-50 | 202 |
| భీష్మునిదశమదివసయుద్ధానుక్రమము | 6-104-2 | 207 |
| అర్జునుఁడు శిఖండికి బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట | 6-104-51 | 210 |
| ద్రోణాచార్యులశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట | 6-108-1 | 214 |
| విరటుతమ్ముఁ డగుశతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట | 6-118-24 | 222 |

| విషయము | | పుట |
|---|---|---|
| భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట | 6-114-80 | 226 |
| కర్ణుఁడు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట | 6-117-1 | 232 |

## ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము

| | | |
|---|---|---|
| సంజయుఁడు యుద్ధభూమికిఁ బోయి మరలివచ్చి యందలివృత్తాంతంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట | 7-1-5 | 239 |
| ద్రోణాచార్యులకు సర్వసేనాధిపత్యంబు నిర్ణయించుట | 7-5-8 | 250 |
| ద్రోణాచార్యునిమరణంబు విని ధృతరాష్ట్రుండు పరితపించుట | 7-8-1 | 254 |
| ద్రోణుఁడు దుర్యోధనునకు ధర్మరాజుం బట్టియిచ్చునట్లు వరం బిచ్చుట | 7-11-1 | 259 |
| అర్జునుఁడు ధర్మరాజుతో ద్రోణునిప్రతిజ్ఞకు వెఱవకుండునట్లు సెప్పుట | 7-12-7 | 262 |
| ద్రోణుఁడు పాండవసైన్యంబుపై రేఁగి దివ్యాస్త్రంబులశక్తి సూపుట | 7-13-1 | 268 |
| భీమసేనశల్యులగదాయుద్ధము | 7-14-4 | 276 |
| ద్రోణాచార్యులు ధర్మరాజుతో యుద్ధంబుసేయుట | 7-15-19 | 280 |
| ద్రోణాచార్యులరెండవనాఁటియుద్ధము | 7-16-3 | 284 |
| అర్జునుఁడు ధర్మరాజుచే ననుజ్ఞాతుండై సంశప్తకులపైఁ బోవుట | 7-16-44 | 287 |
| సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునురథంబుపైఁ బడుట | 7-18-20 | 292 |
| ద్రోణాచార్యునిచేత సత్యజిత్తు సచ్చుట | 7-20-1 | 297 |
| ద్రోణాచార్యునిచేత సూర్యదత్తుఁడు సచ్చుట | 7-20-20 | 299 |
| భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱపి పాండవసైన్యంబులం గలంచుట | 7-25-19 | 304 |
| అర్జునుఁడు భగదత్తువిదెస రథంబు దోలు మని కృష్ణునితోఁ జెప్పుట | 7-26-1 | 308 |
| భగదత్తుండు సుప్రతీకంబుతోడ నర్జునుచేఁ జచ్చుట | 7-28-40 | 313 |
| కర్ణార్జునులయుద్ధము | 7-31-49-50 | 318 |

## ద్రోణపర్వము—ద్వితీయాశ్వాసము

| | | |
|---|---|---|
| ద్రోణునిమూఁడవనాఁటియుద్ధము | 7-32-25 | 323 |
| అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని చొచ్చుట | 7-35-12 | 326 |
| దుర్యోధనప్రభృతిమహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యునిపైఁ గవియుట | 7-36-22 | 329 |
| దుశ్శాసనుఁ డభిమన్యునితోడం బోరి పాఱిపోవుట | 7-38-26 | 333 |
| పద్మవ్యూహంబు సొచ్చుపాండవులకు సైంధవుం డడ్డపడుట | 7-41-3 | 336 |
| వృషసేనుం డభిమన్యుం దాఁకి మూర్ఛితుండగుట | 7-43-5 | 338 |

| విషయము | | పుట |
|---|---|---|
| దుర్యోధనపుత్రుం డగులక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట | 7-45-8 | 342 |
| కర్ణుఁడు మొదలగుయోధులు వంచనచే నభిమన్యుని విరథుఁ జేయుట | 7-47-31 | 346 |
| అభిమన్యుదుశ్శాసనసుతు లిరువురుఁ జచ్చుట | 7-48-8 | 349 |
| అభిమన్యునిమరణమునకు ధర్మరాజు దుఃఖించుట | 7-49-1 | 352 |
| నారదుఁ డకంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱింగించుట | 1-8-67 | 357 |
| వేదవ్యాసమునీంద్రుడు ధర్మరాజునకు సువర్ణష్ఠీవిచరిత్రంబు | 1-8-300 | 364 |
| షోడశరాజచరిత్రము | 1-8-360 | 366 |
| అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట | 7-50-1 | 374 |
| అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు చచ్చినవిధంబు నడుగుట | 7-50-45 | 378 |
| ధర్మరా జర్జునుని కభిమన్యుండు చచ్చినవిధంబు చెప్పుట | 7-51-1 | 383 |
| అర్జునుని ప్రతిజ్ఞ విని సైంధవుఁడు భయపడి దుర్యోధనునితోఁ జెప్పికొనుట | 7-52-1 | 387 |
| అర్జునుడు కృష్ణునితోఁ దనప్రతిజ్ఞావిషయంబులైనవాక్యంబులు సెప్పుట | 7-53-31 | 391 |
| శ్రీకృష్ణుఁడు పుత్రశోకాతుర యైనసుభద్ర నూఱడించుట | 7-54-11 | 394 |
| శ్రీకృష్ణుఁడు దారుకుతో నర్జునప్రతిజ్ఞావిషయంబులైనవాక్యంబులు గొన్ని సెప్పుట | 7-56-27 | 400 |
| కృష్ణార్జునులు స్వప్నమందుఁ గైలాసంబునకుఁ బోవుట | 7-57-24 | 403 |


## ద్రోణపర్వము - తృతీయాశ్వాసము


| | | |
|---|---|---|
| అర్జునుఁడు నిజస్వప్నవృత్తంబు ధర్మరాజాదులతోఁ జెప్పుట | 7-58-1 | 409 |
| అర్జునుఁడు సాత్యకిని ధర్మరాజురక్షణంబునకు నియోగించుట | 7-60-27 | 414 |
| ద్రోణుని నాల్గవనాటి యుద్ధము | 7-63-28 | 417 |
| ర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుండై మొగ్గరంబు సొచ్చుట | 7-66-1 | 423 |
| ర్జునుఁడు ద్రోణాచార్యుల నతిక్రమించి గురుసైన్యంబు సొచ్చుట | 7-66-30 | 426 |
| అర్జునుఁడు శ్రుతాయుధప్రముఖమహారథికులం జంపుట | 7-67-36 | 420 |
| దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట | 7-69-1 | 434 |
| ధృష్టద్యుమ్న ద్రోణాచార్యులయుద్ధము | 7-72-22 | 438 |

| విషయము | | పుట |
|---|---|---|
| విందానువిందు లర్జునుచేత మృతిం బొందుట | 7-74-17 | 443 |
| అర్జునుఁడు దివ్యాస్త్రముల ధరఁ బగిల్చికొల నుత్పాదించుట | 7-74-32 | 447 |
| కవచధారణంబున దుర్యోధనుం డర్జునుతోఁ దలపడుట | 7-76-37 | 451 |
| దుర్యోధనుఁ డర్జునుం దలపడి యధిక్షేపించుట | 7-77-35 | 454 |
| వృషసేనుండు లోనగు నెనమండ్రు రథికులొక్క పెట్ట యర్జునుపైఁ గవియుట | 7-79-1 | 459 |
| ధర్మరాజు ద్రోణునితో యుద్ధముచేసి యోడిపోవుట | 7-81-18 | 465 |
| అలంబుసుఁడు ఘటోత్కచునితో యుద్ధముసేసి చచ్చుట | 7-84-1 | 470 |
| ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట | 7-85-41 | 475 |
| సాత్యకి ధర్మరాజు వేడినచొప్పున నర్జునుకడకుఁ బోవ సమ్మతించుట | 7-86-1 | 480 |


## ద్రోణపర్వము — చతుర్థాశ్వాసము


| | | |
|---|---|---|
| సాత్యకి మొగ్గరంబు సొరం దొడంగుట | 7-89-38 | 484 |
| జలసంధుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట | 7-91-24 | 490 |
| సుదర్శనుం డనురాజు సాత్యకితో యుద్ధంబుసేసి చచ్చుట | 7-94-6 | 495 |
| దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధము సేసి పాఱిపోవుట | 7-97-29 | 499 |
| దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి ఓడుట | 7-99-28 | 503 |
| ధర్మరాజు భీముని నర్జునునకుఁ దోడ్పడఁ బుచ్చుట | 7-102-4 | 507 |
| భీముఁడు ద్రోణాదిరథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁబోవుట | 7-102-88 | 512 |
| దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట | 7-105-1 | 514 |
| భీమసేనుచేత శత్రుంజయాదికురుకుమారులు చచ్చుట | 7-112-30 | 525 |
| కర్ణుండు భీమసేను నవమానించి నీచోక్తులు పలుకుట | 7-114-69 | 529 |
| భూరిశ్రవుఁడు సాత్యకితో యుద్ధంబుసేసి మడియుట | 7-117-1 | 532 |
| సంజయుఁడు ధృతరాష్ట్రునకు సాత్యకిపరాభవకారణంబు చెప్పుట | 7-119-1 | 537 |
| కర్ణుడు సాత్యకితో యుద్ధంబుసేసి యోడిపోవుట | 7-120 | 539 |
| కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము | 7-120 | 543 |
| అర్జునుఁడు సైంధవునితలఁ దునుముట | 7-121-31 | 547 |


## ద్రోణపర్వము — పంచమాశ్వాసము


| | | |
|---|---|---|
| కృష్ణార్జునులు సల్లాపము లొనరించుచు ధర్మజుకడ కరుగుచుండుట | 7-122-1 | 552 |
| సైంధవుని సంహరించి కృష్ణార్జునులువచ్చి ధర్మరాజునకు నమస్కరించుట | 7-124-1 | 555 |

| విషయము | | పుట |
|---|---|---|
| ద్రోణుఁడు పాంచాలురం జంపక కవచంబు విడువ నని ప్రతిజ్ఞసేయుట | 7-126-32 | 560 |
| భీమసేనుఁడు దుర్మదదుష్కర్ణులం జంపుట | 7-130-22 | 566 |
| అంజనపర్వుం డశ్వత్థామతో యుద్ధంబుసేసి చచ్చుట | 7-131-44 | 569 |
| భీమసేనునిచేత బాహ్లికుఁడు చచ్చుట | 7-132-8 | 573 |
| కృపాచార్యుండు కర్ణు నుపాలంభించుట | 7-133-12 | 576 |
| సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట | 7-136-12 | 582 |
| పాండవకౌరవవీరులద్వంద్వయుద్ధము | 7-139-22 | 586 |
| కర్ణుఁడు సహదేవుని వింటికోపునం బొడుచుచు నవమానించుట | 7-141-12 | 589 |
| కర్ణదుర్యోధనులు దురాలోచనచేసి సాత్యకిం దలపడుట | 7-145-55 | 593 |
| అలంబుసుండు ఘటోత్కచునిచేతఁ జచ్చుట | 7-149-15 | 597 |
| అలాయుధాసురుఁడు ఘటోత్కచునితో యుద్ధముచేసి చచ్చుట | 7-151-1 | 600 |
| కర్ణుఁ డింద్రదత్తంబైన శక్తిచేత ఘటోత్కచునిం జంపుట | 7-154-5 | 605 |
| కృష్ణుండు ఘటోత్కచుండు పడఁ దాను సంతసించుటకు నిమిత్తం బర్జునుతోఁ జెప్పుట | 7-155-11 | 607 |
| విరాటద్రుపదులు ద్రోణునిచేతఁ జచ్చుట | 7-161-34 | 616 |
| ద్రోణార్జునులద్వంద్వయుద్ధము | 7-163-20 | 618 |
| ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామచచ్చెనని యేనుఁగునెపంబునఁ జెప్పుట | 7-164-105 | 623 |
| ధృష్టద్యుమ్నుఁడు మృతుం డైన ద్రోణునికంఠంబుఁ దునుముట | 7-165-47 | 626 |
| అశ్వత్థామపూన్కివలనఁ గౌరవయోధులు మరల ననికిఁ గడంగుట | 7-166-43 | 630 |
| ద్రోణుపరిభవంబునకుఁ గోపించి సాత్యకి ధృష్టద్యుమ్నునాక్షేపించుట | 7-169-8 | 634 |
| నారాయణాస్త్రపీడితుం డగుభీముఁ గృష్ణార్జునులు రథంబు డిగ్గఁ జేయుట | 7-171-12 | 639 |
| అశ్వత్థామకు వ్యాసుఁడు కృష్ణార్జునులమహిమ సెప్పుట | 7-172-43 | 643 |
| వేదవ్యాసమునీంద్రుఁ డర్జునునకుఁ బరమేశ్వరమహిమ సెప్పుట | 7-173-2 | 646 |


---

గమనిక :- 95 పుట, 161, చంపకమాల

పుట యవలీల నాకు ననుఁ బొల్లుగఁ జేయుట నీకుఁ బాడియే
కటకట నాపరాక్రమము గాసిగఁ జక్రముచేత [4] నంటితే

ఈ రెండు పాదములను జేర్చి చదువుకొనవలెను.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - ప్రథమాశ్వాసము

—o—~—o—

1. క. శ్రీ సంపాదిపదాంబుజ
నాసాగ్రనివాసరసిక నాదామృతధా
రా[1]సారరూప వేద
[2]వ్యాసవ్యంజితవిహార హరిహరనాథా.

### -: ధృతరాష్ట్రునికడకు వేదవ్యాసుండు వచ్చుట :-

సం. 6_2_1

2. క. దేవా! జనమేజయవసు, ధావల్లభుఁ డధిక [1]వినయతత్పరుఁ డై సం
భావించి కుతూహలమునఁ, దా వైశంపాయనునకుఁ దగ నిట్లనియెన్.

3. క. [1]ఒండొరుల [2]గెలుచు తలఁపునఁ, బాండవులును గౌరవులును బాహా[3]గర్వో
ద్దండత నెట్లు[4]దొడంగిరి, భండన మెప్పాటఁ జెల్లెఁ బరమమునీంద్రా.

4. క. అనుటయు వైశంపాయనుఁ, డను మోదరసార్ద్రహృదయుఁ డై
యిట్లనియెన్
జనమేజయుమనమున సం, జనితం బగు కౌతుకంబు సఫలతఁ బొందన్.

5. వ. పుణ్యక్షేత్రోత్తమం బయిన యాకురుక్షేత్రంబున నారెండుదెఱంగుల
వారికటకంబులును విడిసి కయ్యంబునకు గాలుద్రవ్వునట్టి సమయంబున

---

1. 1. సాద - ఖ. గ. 2. వ్యాసాదిమునీంద్రవంద్య - జ.

2. 1. భక్తి - ఎ. హ.

3. 1. ఒండొరులు - మ. వ. 2. కురుతలంబున - మ. 3. దర్పోద్దండత - త. వ.
4. గడంగిరి - ఙ. ద. న. ర. ల; పెనంగిరి - శ. ఒ. చ.

ధృతరాష్ట్రుండు గొడుకుల దుర్వినయంబునకు నిర్వేదనంబు నొంది సంజయ ద్వితీయుం డై [1]చింతించుచున్న [2]యెడకుం ద్రికాలవేది యగు వేదవ్యాసుండువిజయంచేసి యమ్మహీపతి సేయు నర్చనంబులం గైకొని యతని [3]కిట్లనియె.

6. క. [1]కాలం బగుటయు నృపులకు, నాలము సమకూఱె దీని కడలకు మది నీ
వాలోకింపఁగ వలసిన, [2]నే లోనికి దివ్యదృష్టి నిచ్చెదఁ బుత్త్రా.

7. చ. అనుఁడు నతండు ఘోరముగ నన్నలుఁ దమ్ములుఁ [1]బోరుక్రూరతం
గనుఁగొనఁ జాల నేను వినఁగా వలతుం దదనుగ్రహంబు సే
సినఁ గడు లెస్స యన్న ముని చిత్తమునం గరుణించి సంజయుం
బనిచె మహారణంబు పరిపాటిమెయిన్ సకలంబుఁ జెప్పఁగన్.

8. వ. ఇట్లు ధృతరాష్ట్రునకుం గయ్యంబుతెఱంగు వినిపింప నియోగించి యా సూతనందనునకు నారెండుదెఱంగులవారి దివారాత్రప్రవర్తనంబులు గనునట్లును రహస్యప్రకారభాషణంబులు వినునట్లును మనోవృత్తంబు లెఱుంగునట్లునుంగా వరం బిచ్చి యతిశీఘ్రగమనంబు నొసంగి భారతసమర ధరణిం దిరిగినను శస్త్రాస్త్రంబు లెవ్వియుం దాఁకకుండునట్టి ప్రభావంబుఁ బ్రసాదించి దివ్యులయాలాపంబులు రూపంబులుం దలంపులుం దేటపడునట్టి మహనీయబోధంబును గలుగ ననుగ్రహించి యావైచిత్రవీర్యు నాలోకించి యిది ప్రాప్తకాలం బై వచ్చిన భూప్రజాక్షయంబు దీనికి వగవం బని లేదు ధర్మో[1]జయ తనుచు నిశ్చింతంబున నుండు మేనును గురుపాండవుల కీర్తిఁ బ్రకటింపంగలవాఁడ నని యతని నాశ్వాసించి సాత్యవతేయుండు వెండియు.

---

5. 1. చింతింపుచున్న – కొన్నిప్రతులు. 2. సమయంబునంద్రికాల – జొ. ద. న; సమయంబున నయ్యెడకుం ద్రికాల – హ. 3. తో నిట్లనియె – పెక్కుప్రతులు.

6. 1. కాలంబు గదియ – మ. కాలము గదియగ – ఉ. ఝ. వ. 2. నీలోనికి దివ్యదృష్టి నించెదఁ – స.

7. 1. బోర – పెక్కుప్రతులు.

8. 1. జయ తి(తు) యనుచు – కొన్నిప్రతులు.

9. క. [1]మొగుళులు లేకయు నుఱుములు, గగనక్షోభంబు సేసెఁ గరిహయతతిఁ బె
ల్లుగ నశ్రు లురులఁ జొచ్చెను, మృగములు[2]పక్షులను బసులు
మృగము ల నీనెన్.

10. క. నలువురు నేవురుబిడ్డలు, గలిగెద రొక్కొక్కవనితగర్భంబున వా
రలు పుట్టినపుడ యాడుచుఁ గలకల నవ్వుచుఁ జెలంగఁ గనిఖేద మెందున్.

11. తే. అర్కునుదయాస్తమయములయందుఁ గృష్ణ
కాంతి ఘోరకబంధంబు గప్పఁ జొచ్చె
నిందులాంఛనస్థితి తలక్రిందు గాఁగఁ
దోఁచుచున్నది ప్రజ యెల్లఁ ద్రుంగ కున్నె.

12. వ. విశేషించియుం గౌరవనికేతనంబులఁ గేతనంబులఁ బొగ లెగయుటయు నాయుధంబులు మండుటయు నివి మొదలుగా ననేకదుర్నిమిత్తంబులు పుట్టుచున్నయవి కులక్షయంబును నానానరేంద్రనాశంబును నగు నుపేక్షింపం దగదు దుష్ప్రథవర్తు లగు దుర్యోధనాదికుమారుల వారించి నీతమ్ముని పా లతనికొడుకుల కొసంగి శాంతిసేయుట మేలు మముబోంట్ల మనంబులకుం బ్రియంబు గాని యీరాజ్యంబు నీ కేటి కనిన విని యమ్మనుజేంద్రుం డమ్మునీంద్రున కిట్లనియె.

13. చ. హితమును ధర్మముం దలఁచి యిమ్మెయిఁ జెప్పితి రిట్లు మున్ను నా
సుతుల నయంబుమై దఱిమి చూచితి [1]వారలఁ బంపుసేయ నేఁ
జతురుఁడఁ గాను ప్రాభవము సాలదు నాదెసఁ దప్పు లేమి మీ
మతిఁ దలపోసి యీపలుకు మానుఁడు పాకముదప్పెఁ గార్యముల్.

14. వ. అనిన విని పరాశరసూనుం డది యట్లుండని మ్మింక నేమేనియుం జెప్పవలయు నది గలదే యని పలికిన నాంబికేయుండు గయ్యంబున గెలుపు దెలుపునిమిత్తంబు లడిగిన నమ్మునివరేణ్యుం డు వహ్నులు హోమకాలంబునం బుణ్యగంధంబులతోఁ బ్రదక్షిణార్చు లగుటయు భేరీప్రముఖంబులు గంభీర

---

9. 1. మొగిళులు – వా; మొగుళులు – పెక్కుప్రతులు. 2. పశువులను – ఝ. పశు జాతి – న.

13. 1. వారలు పంపుసేయరే – ప. మ. స; నావశుపంపుసేయరే – ఝ.

ఘోషంబు లగుటయు వాయువుల నకూల మృదుమనోహర ప్రచారంబు లగుటయు నివి మొదలుగాఁ గొన్ని శుభసూచకంబులు నిర్దేశించి కొంచెంబు పెద్ద యన లేదు సమరంబున జయంబు దైవాధీనంబు గావునం బెద్దలకే పెనఁకువ లొప్పు ననిచెప్పుదు నేను బోయివచ్చెద నని చెప్పి సముచితప్రకారం బున నంతర్ధానంబు సేసెఁ దదనంతరంబ యక్కౌరవేంద్రుండు గొండొక సేపు చింతించి నిట్టూర్పు [1]నిగుడించి సంజయున కిట్లనియె.

15. ఉ. భూమికిఁ గాఁగఁ బ్రాణములపోక దలంపక రౌద్రఘోరసం
గ్రామము సేయుచుండుదురు రాజులు దొల్లియు నెంతదీపెకో
భూమి మునీంద్రసంగతి [1]సుబుద్ధము నీకు జగంబు నాకు నీ
భూమి తెఱంగు సెప్పుము ప్రబోధనిరూఢముగా సమస్తమున్.

16. వ. అనిన విని సంజయుం డతని కిట్లను నాయెఱింగినంతయు నెఱింగించెద భూతత్త్వప్రకారం బవధరింపుము.

*-: సంజయుఁడు ధృతరాష్ట్రునకు భూపరిమాణంబు సెప్పుట :-*

సం. 6_5_9

17. తే. అధిప నానాప్రకారచరాచరంబు, లింద వేర్వేఱ జనియించు నింద పెరుఁగుఁ
బిదప నింద యడంగు నీపృథ్వి దాన, సకలమునకుఁ బరాయణస్థాన మరయ.

18. వ. అదియునుంగాక విను మాకాశంబునకు గుణంబు శబ్దంబు వాయువునకు శబ్దస్పర్శంబులును దేజంబునకు శబ్దస్పర్శరూపంబులును నప్పులకు శబ్దస్పర్శ రూపరసంబులును గుణంబులు పృథివికి శబ్దస్పర్శరూపరసగంధాత్మకం బైన గుణసముదయం బంతయుం గలదు గావున నిమ్మహాభూతంబు లేనింటిలోనం బృథివి యెక్కుడు దీనియున్నవిధంబు వివరించెద నాకర్ణింపుము.

19. సీ. ధాత్రీశ మేరువు దక్షిణంబున [1]సుదర్శన మనునభిధానమునఁ బ్రభూత
విస్తార మై [2]రెండువేలు నేనూఱుయోజనముల [3]పొడువు నై సరసమధుర

---

14. 1. నిగిడించి - వా; నిగిడించి - పెక్కుప్రతులు.

15. 1. సుబోధము - కొన్ని ప్రతులు.

19. 1. మూలము (6-8-18 భండార్కర్). 2. యోజనానాం సహస్రం చ శతం చ భరతర్షభ - భం. 6-8-20, రెండువేలు నిన్నూరు - అ. వ; రెండువేలును నూరు-ఉ. 3. పొడవై - పెక్కు ప్రతులు.

విపులశాశ్వతఫలవితతిసమేత మై యొక్కజంబూతరు వొప్పి యుండు
దానిపండులు మహీస్థలి మహారవముగ ననిశంబుఁ బడి రాలి యవియుచుండు.

ఆ. వానిరసము పొంగి వాహినీమూర్తి న, న్నగమునకుఁ బ్రదక్షిణంబు గాఁగ
నొరసికొనుచుఁ దిరిగి యుత్తరకురుభూము, లందుఁ జొచ్చి పాఱు [4]నంబునిధికి.

20. వ. జంబూనది యనం బరగిన యాతరంగిణినీరు సోఁకినచోట్లెల్లను సువర్ణం బగుటం జేసి కనకంబునకు జాంబూనదం బను నామంబునుం గలిగెఁ దదీయ జలపానంబు సేసిన మానవులకు ముదిమియుం దెవులును దప్పియు [1]లేవని చెప్పుదు రయ్యేటి పడమటం బెరిఁగి పఱపు గలిగి శరనిధిచందంబున జంబూ షండంబు గాఱుకొనుచుండు నింతటికిం గారణం బయిన యాజంబూవృక్షంబు పేర నీద్వీపంబు జంబూద్వీపంబు జంబూద్వీపంబును సుదర్శనద్వీపంబు నన నెగడి లవణసముద్రముద్రితం బయి పొలుచు నద్దీవియందు.

21. సీ. నిడుపునఁ దూర్పును బడమర నై రెండు [1]గడలు నంభోనిధి గదిసియుండు
రత్నమయంబులు రమణీయములు సాధ్యసిద్ధచారణగణసేవితములు
నై హిమాచలమును నావల హేమకూటంబును నట నిషధంబు నొప్పు
లలితంబు లై ననీలశ్వేతశృంగవంతంబులు [2]గ్రమమునఁ దనరి పొలుచు

ఆ. నివులమూఁటి కవల నవులయమ్మూఁటికి, నివలఁ దేజరిల్లు దివిజనగము
గమలకర్ణికానుకారి యై కాంచన, మణిమయత్వమహిమ మహిత మగుచు.

22. తే. అతివృథం బగుపాఁతు పదాఱువేల, యోజనము లంద్రు దానికి రాజముఖ్య
విందు మెనుబదినాలుగు వేలయోజ, నంబు లని హేమధాత్రీధరంబుపొడువు.

23. వ. ఇవ్విధంబున భూమధ్యంబున నున్న యమ్మేరుమహీధరంబున దేవతలును దేవమునులును గంధర్వకింపురుషాది దేవయోనులును దేవేంద్రప్రముఖ దిక్పతులును బరమేష్ఠియుం దత్తత్ప్రదేశంబులఁ బుణ్యావర్తనంబులం బరమ సుఖంబు లనుభవింతు రుత్తరతటంబునం గర్ణికారవనంబున గౌరీసమేతుం డై సిద్ధగణంబులు పరివేష్టింప విశ్వేశ్వరుండు విహరించుచుండు.

---

4. నంబుధికిని – వా; నంబునిధికి – పెక్కు ప్రతులు.

20. 1. లేదని – కొన్ని ప్రతులు.

21. 1. కడల – శ ర; గడల – ఈ. ఔ. గ. న. 2. నెంతయు – అ. ఔ. జ. వ.

24. క. తొమ్మిదిఖండము లై వర్షమ్ము లనం జాల నొప్పెసఁగు జంబూద్వీ
పమ్మున జనపదములు విను, మమ్మహితాంశములు దెలియ [1]ననువర్ణింతున్.

25. వ. ఉత్తరసముద్రంబు శృంగవంతంబు మధ్యమం బైరావతవర్షం బననొప్పు శ్వేతపర్వతశృంగవంతంబుల నడుము హైరణ్మయవర్షం బనం బొలుచు నీల శైలోత్తర దక్షిణదేశంబులు గ్రమంబున రమణకవర్షంబును ననం జెలు వమరు మేరువునకుం బ్రాచ్యప్రతీచ్యంబు లగుభాగంబులు వరుసన భద్రాశ్వ వర్షంబును గేతుమాలావర్షంబును ననం బొగడొందు హేమకూటోత్తర భూమి హరివర్షం బన నెగడు హిమవంతంబు నక్కడయు నిక్కడయు నొలిన కింపురుషవర్షంబును భారతవర్షంబును ననం బెంపారు ని ట్లున్న దీనియందు.

26. క. భారతవర్షముఁ దొడఁగి మ, హీరమణ [1]యుదీచ్యము లను నెక్కుడు బలస
త్త్వారోగ్యాయుస్సుఖపు, ణ్యారంభ [2]గుణంబు లంత కంతకు [3]నరయన్.

27. వ. అనిన విని వైచిత్రవీర్యుండు సమస్తద్వీపంబులు సకలజలనిధులు నున్న పరిపాటియుం బ్రమాణంబులుం బ్రకాశంబుగ నెఱిఁగింపు మనుటయు సూతసూనుండు జంబూద్వీపవిష్కంభంబు కొలఁది యెనుబదివేలు నాలు నూలుయోజనంబులు దీని రెం డంతలు దొడంగి లవణేక్షు [1]సురాఘృతదధి క్షీరశుద్ధజలమయంబు లయిన మహార్ణవంబులవిష్కంభంబులు గ్రమంబున నొకటి కొకటి రెట్టి యై యుండుఁ బ్లక్షద్వీప శాల్మలద్వీప క్రౌంచద్వీప కుశద్వీప శాకద్వీప పుష్కరద్వీపంబుల విష్కంభంబులు జంబూద్వీప విష్కం భద్విగుణప్రమాణంబు మొదలుగా నొలి నొకటి కొకటి యినుమడి యై యుండు నయ్యాఱుదీవులును జంబూద్వీపంబుకంటె నెల్లదానను బొగడ్త వడి యనేకపర్వతంబులను నానానదులను బహుజనపదంబులను నొప్పి వరుస నొండొంటికి గుణవిశేషంబుల నధికంబు లై యుండు నింతకుం గర్తయు భర్తయు హర్తయు నై దుగ్ధాంబుధియుత్తరంబునం గనకమయం బై యష్టచక్రంబును [2]బభూతభూతయుక్తంబును మనోజవంబును నగు మహా

---

24. 1. నభివర్ణింతున్ – పెక్కు ప్రతులు; నవివివరింతున్ – ర; నవి వర్ణింతున్ – వ.

26. 1. యుదీచ్యము లన – పెక్కు ప్రతులు; యుదీచ్యము లను – జ. 2. మనంబు – ల.
3. నమరున్ – ఎ. ఒ. ఘ. చ; జెఱుగన్ – న.

27. 1. సుసురా – కొన్ని ప్రతులు. 2. ప్రభూత – పెక్కు ప్రతులలో లేదు.

నీయశకటంబున వినోదపరాయణుం డై నారాయణుండు వికుంఠనిధానుం డగుచు వైకుంఠాభిధానంబున విఖ్యాతుం డై విహరించుచుండు నని చెప్పు టయు నతండు.

28. క. భారత[1]వర్షమునకుఁగాఁ, గౌరవులును బాండవులును [2]గాంక్షం గడుఁ జె
[3]ల్లై రాసి యొండొరులతోఁ, [4]బోరం దెగి రిట్టిలుబ్ధబుద్ధులు గలరే.

29. వ. అనిన విని యమ్మనుజపతికి సంజయుం డి ట్లనియె.

30. ఆ. అధిప పాండుసుతుల [1]కరయంగ నతికాంక్ష, లేదు [2]లుబ్ధబుద్ధి నీకు [3]సుతుఁడు
శకునికడపు విని యసన్మార్గవృత్తికిఁ, జొచ్చి [4]యిట్టియెడరు [5]దెచ్చికొనియె.

*-: సంజయుండు ధృతరాష్ట్రునకు భారతవర్షంబునం గల విశేషంబులు సెప్పుట :-*

సం 6_10_1

31. క. తమతమదేశంబులకై, మిముఁ గొని పాండవుల గెలుచు మెయికోలున భూ
రమణులుఁ [1]గొందఱు వచ్చిరి, సమగ్రసఖ్యమునఁ గూడుచందమునఁ దగన్.

32. తే. వారి నన నేల తొల్లియు వసుధకై యనేకనృపతులు [1]పోరాడి రిట్లు నేల
[2]వ్రాలి కాదె భగీరథరఘుయయాతి నహుషముఖ్యులు విశ్రుతోన్నతు లు
[3]గనిరె.

---

28. 1. వర్షంబునకుం – అ. 2. కాంక్షవహించు – ఇ; [illegible] కాంక్షకు – ఉ. ఓ. 3. ల్లాసి యొండొరువులతో – ప. 4. [illegible] – ఈ. శర. వ; బోరదొణగిరింత – ఎ. ఐ.

30. 1. నరయంగ – ఐ. ఓ. 2. బుద్ధి – అ. 3. సుతుడ – ఎ. [illegible] యింట – ఇ; యిచ్చు – జొ; యెడరు దాన దెచ్చుకొనియె – ఉ. 5. [illegible] – పెక్కు ప్రతులు.

31. 1. వచ్చిరి మీదెస – ఉ, ఎ. ఐ. క.

32. 1. పోరాడరెట్లు – ఉ. ఐ. వ. క. 2. వ్రాల – పెక్కు ప్రతులు; [illegible] వ్రాలిరిగదే – ప. వ. 3. కనిరె – ఐ. వ; [illegible] – ప.

33. వ. [1]భారతవర్షంబున నుదారవిభూతివిలాసంబున కాసపడి యోసునం బెనంగ కుండుదురె దీనివిస్తారంబు విను వివరించెద.

34. ఆ. మలయ మనఁగ శుక్తిమంతంబు నా వింధ్య మనఁగఁ బారియాత్ర మన మహేంద్ర
మనఁగ ఋక్షవంత మన సహ్య మన నింధుఁ గులనగంబు లేడు వొలుచు నధిప.

35. వ. వీనియందు వివిధమణిగణంబులు సమకూర్పవచ్చు ననిన ఖనివిశేషంబులు సెప్పనేల మఱియు [1]నుపమహీధరంబు లనేకంబులు గలిగి యుండు వాని యందు.

36. క. ఇనుమును రాగియుఁ దగరం,బును వెండియుఁ బసిఁడియుం బ్రభూతములై పే
ర్చినసిరిఁ జేయఁగ నొప్పెడు, [1]ఖను లెడనెడఁ బెక్కు గలవు కౌరవనాథా.

37. క. వెండియు ధనార్జనంబులు, గొండలవలనన [1]ఘటించికొన నగు నేర్పున్
దండితనంబును బాడియు, నొండొంటికి మిగులఁ గలిగి యున్న ట్లయినన్.

38. వ. గంగయుఁ దుంగభద్రయు వేత్రవతియు [1]వేదవతియుఁ గృష్ణవేణియుఁ బెన్నయు యమునయుఁ దమసయు [2]శరావతియుఁ గావేరియు గోదావరియు నర్మదయు బాహుదయును సరయువును శతద్రువును వితస్తయు విపాశయుఁ దామ్రపర్ణియు[3] ననుమహానదులు మఱియు ననేక సరిద్విశే

---

33. 1. పై వచనమునకు మాఱుగా కొన్నిప్రతులలో నీ క్రింది పద్య మున్నది:

క. భారతవర్షంబున మును
భూరివిలాసమున కాసబొంది యనేకుల్
ఘోరముగ బెనుగుదురు వి
స్తారము వినుపింతు దీని సవినయభక్తిన్ - ఖ. ఝ. ట. డ. వ.

35. 1. మహామహీధరంబులు - పెక్కు ప్రతులు.

36. 1. గను - పెక్కు ప్రతులు.

37. 1. ఘటించుకొన - పెక్కు ప్రతులు.

38. 1. వేగవతి - కొన్ని ప్రతులు. 2. రేవతి - కొన్ని ప్రతులు. 3. యు నేకామ్రయు- పెక్కు ప్రతులు.

షంబులునుం గలిగి వీనివలన నానాసుఖంబులు ధనధాన్యాది సంపదాగమం బులు సొంపు మిగిలి యుండు.

39. క. ఎడ నెడఁ బఱపై యొప్పెడి, యడవు లనేకములు వానియం దర్థము సే
రెడు వెరవులు పెక్కులు సొం,పడి యుండు నయంబుతోడి బలిమి గలిగినన్.

40. వ. పాంచాల బర్బర కచ్ఛ మత్స్య మగధ మళయాళ కళింగ కుళింగ కుకుర కొంకణ టెంకణ త్రిగర్త సాముద్ర సాళ్వ శూరసేన సుదేష్ణ సుహ్మ కురు కరూశ కాశ కోసల యవన యుగంధ రాంధ్ర సింధు చేది చోళ పుళింద పుండ్ర పాండ్యాభీర సౌవీర సౌరాష్ట్ర మహారాష్ట్ర విదేహ విదర్భ ద్రవిళ దశార్ణ కర్ణాట గౌళాంగ వంగ వరాట లాట బాహ్లిక బహుదాన కిరాత కేకయాశ్మంత కాశ్మీర గాంధార కాంభోజ కేరళ మాళవ నేపాళ ఘూర్జర కుంత లావంతికానూపాది జనపదంబులు సమస్తవస్తుసంపత్సంపాదనంబు లయిన గుణవిశేషంబుల వెలసి పురుషార్థంబు లగు ధర్మార్థకామంబులకుం గారణంబు లై కమనీయంబు లగుచుండు.

41. క. వినికి గలిగి రక్షించుచు, ననువున దయతోడిపాడి నాయతు లెల్లం
గొనుచు దగ నేలి పొగ డొం,దినరాజున కుర్వి గామధేనువు గాదే.

42. ఆ. వెరవు లావుఁ గలుగు నరనాథు లెంతదే, శంబు గలదు [1]తమకుఁ జాలు ననరు
దండ్రి బిడ్డ యన్నదమ్ముఁడు [2]నా కెత్తి, పోయి పోటులాడి పుడమిఁ
గొంద్రు.

43. క. కావునఁ గౌరవపాండవు, లీవసుధకు నై పెనంగు టెగ్గే దైవం
బేసంక [1]వ్రాలె వారిక, [2]పోవుం గా కిది నరేంద్ర పోగులకు మింకన్.

44. వ. అనిన విని యాంబికేయుండు సంజయుతో నీ వింక సంగరంబుఁ జూడం బొమ్మని సముచితంబుగ వీడుకొలిపినం బోయి భారతరణప్రకారం బను సంధించి యతండు కతిపయదినంబులకుం జనుదెంచి తగిన తెఱంగునం గాంచి.

---

42. 1. మనకు – శర. పెక్కు ప్రతులు. 2. ననకెత్తి – అ. ఔ. గ. జ. శ. శర. ష; నాఁ కెత్తి – అ. ఈ. ద. న.

43. 1. వ్రాలు – డ. న; వ్రాసె – త. వ. 2. ఘూవర విను జయము గలుగు పోగులకు మింకన్ – కొన్ని ప్రతులు.

45. క. కొడుకులదెస నెవ్వగఁ జేఁ,ప్పడి వందురి యున్న యాన్నృపాలునడుగులం
బడి భీష్ముపాటు సెప్పుచు, నడలి [1]కరుణానాద మెసఁగ నాక్రందించెన్.

46. వ. అన్యోద్భుతో ని ట్లని విలాపంబు సేయు.

47. సీ. అత్త[1]యోధులకెల్ల నాధార మగునట్టి తనకు [2]నస్త్రంబు లాధార మయ్యెఁ
బరశు[3]రామునకు మే ల్పడయైనతనయందుఁ గలిగె భంగంబు శిఖండిచేత
జనపతి దను [4]నచ్చి మును జూద మో[5]రించెఁ దాను
[6]గయ్యంపుజూదమున నోడెఁ
దనయూర్పు [7]వెలుఁగుఁ దలఁకు వైరులు వొంగ నొఱలుచు నేలకు
నొఱగె నేఁడు

ఆ. తీవ్రబాణజాలదీప్తులు [8]పరగించి, పాండుతనయ సైన్యబహుళతమము
తీఱఁ బడ[9]దినంబు లోలి [10]వినోదించి, యుధిప భీష్మభానుఁ డస్తమించె.

48. క. పదివేవురు రాజులు దన, కెదిరి పొలిసి రాశిఖండి యేమిటివాఁ డై
తుదిఁ బోయి తన్ను నాజిం, [1]గదియుచుఁ బొలియించె నియతిఁ గడవఁగ వశమే

49. తే. చాపవక్త్రుండు భల్లదంష్ట్రాపితాన, ఘోరమూర్తి నారాచనఖుండు ఖడ్గ
జిహ్వికాభీషణుఁడు నరసింహమూర్తి, గాక కేవలనరుఁడె గంగాసుతుండు.

*-: ధృతరాష్ట్రుఁడు భీష్మ మరణంబు విని విలపించుట :-*

సం. 6-14-1

50. వ. అని సంజయుండు పలవించుపలుకులకుఁ జిత్తంబు [1]జల్లనియొల్లంబోయి మూర్ఛిల్లి కొండొకసేపునకు శిశిరవిధానంబుల సేద దేఱి ధృతరాష్ట్రుండు గన్నీరు దొరఁగ గద్గదకంఠుండై.

---

45. 1. మహానాద - ఉ. ఎ. ఒ. ఓ. చ. జ; కడున్నాద - అ. ఔ. క. న. వ. శ. శర. ష.

47. 1. యోధల - ఇ. ఈ. గ. ఘ. చ. వ. 2. శస్త్రంబు - ఏ. ఖ. ఘ. చ. 3. రాముని కెల్లఁ భరమైన - న (అర్థము సరిగా కుదురదు). 4. నమ్మి - ఖ. 5. రింప - చ; రించు - శ. 6. గయ్యంబు - జ. 7. వెలుఁగుల - కొన్ని ప్రతులు. 8. వఱగించి - బ. శ. ష. 9. దినములు దోలి - ఆ. ఊ. ఒ. క. త. న. ల; దినంబు లోలి మై - ఐ. శ. ష. స. సూ. 10. విరియించి - ఙ. శ. ష. స. సూ.

48. 1. గదియుడు - ఈ. గ. ద; గదిసిన - వ; గదిసియు - క; గదియగ - ఇ.

50. 1. ఝల్లని - పెక్కు ప్రతులు.

51. క. దేవాసురులు లోకత్రయి, యై వచ్చినఁ జిక్కువడుచు నాహవమున నా
దేవవ్రతుఁడు శిఖండి శ, రావళిపా లయ్యె నేమి యనఁ గల దింకన్.

52. ఉ. అంచితతాలకేతుకిరణాళి మెఱుంగులు గాఁగ మౌర్వి [1]మ్రో
యించుట గర్జచందముగ నేచి విరోధిదవానలంబు మా
యించు శిలాస్త్రవర్షమున నట్టిది భీష్మమహాభ్రమె ట్లడం
గించెనొకో శిఖండి యనుకృత్రిమవాయువు [2]దాఁకి దైవమా.

53. తే. [1]పెరిఁగి పాండవాంబుధి వెల్లిపఁడిసినపుడు, నిలువ నిమ్మగుదీవిగా నిన్నుఁ దలఁచి
[2]యుండు నత్యంతతుచ్ఛశిఖండి [3]పల్వ, లాక్రమంబున మునిఁగితే యకట తండ్రి.

54. ఉ. వీరరసాంబు[1]పూరిత మను విశ్రుతబాహు [2]మహోగ్రసత్త్వము
జారుగదాధ్వజాచలవిశాలము నంబకజాలవీచికా
స్ఫారము నైన భీష్ముఁ డనుసాగరముం గడవంగ నీఁదఁగా
నేరమి యె ట్లొకో [3]కలుగ నేర్చు శిఖండికి నేమి సేయుదున్.

55. తే. అంబకై పూని వచ్చి బలాధికుండు, జామదగ్న్యుండు సాధింపఁ జాల[1]కున్న
వాని భీష్ముఁ బాండవులకై పూనివచ్చి, [2]కడిమి సాధిం[3]చి తౌర శిఖండి
[4]పోర.

56. క. ఆశౌర్యం బాసత్త్వం, బాశీలం బాపరాక్రమాభీలత్వం
బాశుద్ధవ్రత మెందు [1]న, నాశము [2]లని భీష్ముఁ [3]బెద్ద నమ్మితిమి గదే.

---

52. 1. మ్రోయించిన – కొన్ని ప్రతులు. 2. సోకి – వ.

53. 1. పరగి – పెక్కు ప్రతులు; పరగ – కొన్ని ప్రతులు. 2. యుండు నాసుతుం డెపుడు – అ. జ. న. వ. 3. పల్వలాంతరంబున – అ. జ. న; పల్వలాంబువుల – ణ;

54. 1. పూర్ణము – కొన్ని ప్రతులు. 2. సమగ్ర – ఎ. ఏ. ఓ. ఘ. ప. వ. హ. 3. కలిగె నేడు – అ. ఔ. జ. వ.

55. 1. నట్టి – ఝ. డ. 2. కడగి – ఉ. ఎ. చ. 3. చెసేదు – అ. ఈ. గ. 4. యౌర – పెక్కు ప్రతులు.

56. 1. ను నాశము లే దనియు భీష్ము నమ్మితిమి గదే – వ. 2. గావనుచు భీష్ము నమ్మితి గదవే – మ. 3. జాల నమ్మితిమి గదే – ణ. ర.

57. వ. అని బహుప్రకారంబులం బలవించి యామూతనందను చేసేతం గెలిచించి.

58. సీ. అతఁడు నొచ్చినతటి నడ్డంబు [1]నొచ్చెద మని వచ్చువారు లేరైరె [2]యచట
నడరి [3]పోరాడక యగ్నియడవాహిణు లొప్పరికించెనె యొకనిఁ గలన
నతని నోర్వఁగఁ జాల [4]మని నిశ్చయించితి మంతకు నోపెనే యరిబలములు
ద్రోణుండుఁ గృపుఁడును ద్రోణసుతుండును శల్యుండుఁ [5]గ్రేడించి చనిరె
యపుడు

తే. పాండుసుతులు శిఖండినిఁ జండశక్తి, మెఱయ నొక్కటఁ బైఁబడ్డ
వెఱచి తాత
విడిచి నాపుత్త్రులందఱు విఱిగి యడవిఁ, గలిసిరొకో యాతనికిఁ
బడవలసె నకట.

59. వ. దేవవ్రతుండు దెగినయప్పుడ తక్కినయంతవట్టునుం [1]దెగియెనకాఁ దలంచెద
నని మఱియు ని ట్లనియె.

60. సీ. [1]కులగురు వృద్ధు నిర్మలచిత్తు గాంగేయుఁ జంపి రాజ్యము సేయ సమ్మతించి
[2]తొడరినపాండుపుత్త్రులకును దైవంబుఁ దోడయ్యె ధర్మంబు గీడుపఱిచి
[3]పరగి యధర్మంబు పెరిఁగిన ట్లున్నది వార లాతనిఁ గూల్చ వసుధఁ గొనఁగ
నిశ్చయించుట గడు నిష్ఠురత్వము దానికంటెను పాపంబు గాదె [4]మనకు

తే. సంగరంబున నాతండు సచ్చుటోర్చి, సంపదకుఁ గాఁ బెనంగినచంద మరయఁ
గులము లందెల్ల నీచకులము సాల, జెట్టిదం బిక్కులంబునఁ బుట్ట [5]నగునె.

61. వ. అని పలుమాటలాడి వెండియు.

---

58. 1. వచ్చెద - ఎ. న. 2. యచట - ఇ. ఒ. ల. 3. పోరాడుచో నలిగి - ఆ. ఙ; పోరాడుచో నన్ని - ఉ. ఎ. ఓ. వ. 4. రని - కొన్ని ప్రతులు. 5. గేడించి - పెక్కు ప్రతులు.

59. 1. దెగినయదియ కాఁ - చ. ఝ. ట. క. న. న.

60. 1. కులవృద్ధు సుగుణు - ఙ; కులవృద్ధు తాత - అ. ఉ.ఎ. ఓ. ట. వ. 2. తొడగిన - కొన్ని ప్రతులు. 3. పెరిగె యధర్మంబు పరగి నట్లున్నది - కొన్ని ప్రతులు. 4. మనను - పెక్కు ప్రతులు. 5. నగునె - పెక్కు ప్రతులు.

62. ఆ. మగఁడు వేనవేగుఁ బమాడ్కి గాకున్న నా, సేన భీష్ము లేమిఁ జేసి నేఁడు
కురుకుమారు లెంత గుందిరో యెవ్వరే, మైరొ యింక నెట్లు లగుదు రొక్కొ.

63. క. రాజులు మంత్రులు నని యెడు, నాజూదరు లాత్మ నేమి యని తలఁచిరొ యే
యోజం ¹బలికి రొకో తమ, కాజికి నిట మీఁద నెవ్వ రాధారంబో.

64. వ. అని పలికి సంజయుకరంబు విడిచి కయ్యం బెయ్యెడం బొడిచిరి పదిదినం
బులు నుభయబలంబువారును నెవ్విధంబున మోహరించి రెవ్వ రెవ్వ రెప్పు
డెప్పు డేమి సేసి రిన్నాళ్లు గాంగేయుఁ డెబ్బంగుల సంగరంబు సేసెఁ దుది
నెత్తెఱంగునం దెగియె నంతయు వివరించి పరిపాటిం దేటపడం జెప్పుము.

65. ఉ. నెట్టన యాపగాసుతుఁడు నేలకు వ్రాలె ననంగ విన్న నా
కట్టిఁడి వీను లేమి వినుకాఱియ కోర్వవు దుర్వినీతికిం
బుట్టిన¹యిల్ల నై వినక పోవఁగ వచ్చునె యింక నాకు నే
డిట్టిఁడ నైతి నెల్లవియుఁ దెల్లముగా ²విన నేర్తు సంజయా.

66. వ. అనిన విని సంజయుం డతని కిట్లనియె.

67. ఆ. అధిప నీవు సెప్పినట్టిద నీయని, నీతిఁ జేసి ధర్మనిరతు లైన
పాండుసుతుల కన్ని పాటులు వాటిల్లె, నింత వెచ్చికొంటి ¹వంత నేసి.

68. క. కీ డొనరించినవారికిఁ, గీ డగు టరుదయ్యె మేలు గీ డేమియు నీ
వాడక విను ననుఁ గయ్యముఁ, జూడఁగఁ బుచ్చుట వినంగఁ జూచియ కాదే.

69. క. ¹వేదవ్యాసమునీశ్వరు, పాదంబులు దలఁచి మ్రొక్కి భక్తిరనై కా
ప్సాదనసుకరానందో, త్పాద²నదివ్యమతి నగుచుఁ దగ నెఱిఁగింతున్.

70. వ. అనిన నాంబికేయుం¹డు నట్లు గాక యెఱింగింపు మనుటయు సంజయుండు.

---

63. 1. దలంచిరొకో – వ; బోదురొకో – వ. స.

65. 1. యట్లనై – కొన్ని ప్రతులు. 2. వివరింపు – అ. ఈ. గ. వ.

67. 1. మంత – కొన్ని ప్రతులు.

69. 1. ఈ పద్యమునకు ముందు "అని వెండియు సంజయుం డాంబికేయున కిట్లనియె" అను వచనము, య. వ. హ, ప్రతులలో నధికముగా నున్నది. 2. న మతినగుచు నేను – ఆ. ఔ. వ.

70. 1. నట్ల – పెక్కు ప్రతులు.

తే. వెడలి తమతమ చతురంగవితతు లెల్ల, నుచితగతి నూల్కొనంగఁ జేయుచుఁ గడంగి
సంగ[3]రోత్సవసంభృతోత్సాహు లగుచు, [4]నగుచు దగుమాట లాడుచు నడచి రెలమి.

88. క. సమరక్రీడాసన్నా, హము [1]లొప్పఁగఁ దక్కుఁగలుగునట్టి దొరలు ద
ర్పము [2]పల్లవింప వెడలిరి, తమతమకేతువులు గ్రాల ధరణీనాథా.

89. వ. వారెవ్వ రంటేని వినుము.

90. క. కల్పితదృఢచతురంగా, నల్పం బై గండు మిగిలి యాదవబల మా
కల్పోజ్జ్వలతఁ గొలువ నవి, కల్పుఁడు గృతవర్మ సనియె [1]గాఢస్ఫూర్తిన్.

91. క. రథములు [1]దఱచై చెలువగు, పృథుసైన్యముతోడ బంధుబృందముఁ దానుం
బ్రథనోత్సుకవృత్తి మహో, రథుఁడు జయద్రథుఁడు వొలిచెఁ బ్రస్ఫురితగతిన్.

92. మ. చలదుర్వీధరలీలఁ [1]గ్రాలుమదవత్సామోద్భవస్తోమ మ
గ్గల మై యేచినసేన లొప్పఁగ దిశల్ గంపింప విందానువిం
దులుఁ గాళింగ మహీవిభుండు భగదత్తుండున్ భవత్సేనయో
ధులకుం గన్నులపండు వై నడచి రుత్తుంగాంగసంరంభు లై.

93. క. కొడుకులుఁ దమ్ములు గుఱ్ఱపు, [1]దడములుఁ బెక్కైన బలవితానముఁ దగు మై
నడపించుచు మెలుపున సం, గడములతో [2]నరుగుశకుని గడునొప్పారెన్.

94. మ. తనతోఁ గాల్వురు సాలఁ గల్గుబలసంతానంబు[1]తోఁ బ్రీతిఁ బు
త్రుని వీరోత్తము సోమదత్తు విలసద్దోర్దర్పదుర్దాంతుఁ బౌ

---

3. రోద్యోగ — ఈ. గ. ద. 4. వెడలి — ఆ. ఓ. ఔ. జ. వ.

88. 1. సొంపున — ఈ. గ. ఘ. 2. ఉల్లసిల్ల — ఎ. ఓ. చ. ఝ. న.

90. 1. కాంతిస్ఫూర్తిన్ — పెక్కు ప్రతులు.

91. 1. దరుచై — పెక్కు ప్రతులు.

92. 1. గ్రాల — ఇ. ఈ. ఖ. త. ప. మ.

93. 1. దళములు — కొన్ని ప్రతులు. 2. నేగుచు — పెక్కు ప్రతులు; ధృతను — ఒ;
నపుడు శౌరి కడు నొప్పారెన్ — తి.

94. 1. రా — కొన్ని ప్రతులు.

త్త్రుని భూరి[2]శ్రవసుం గనుంగొనుచు నింద్రుం గ్రేణిసేయంగ[3] నే
చినపెం పొప్పఁగ బాహ్లికుం డరిగె నిశ్చింతంబునం బోరికిన్.

95. వ. కాంభోజరా జగు సుదక్షిణుం డక్షీణవిభవంబున వెడలె మఱియుం గోసల పతి యగు బృహద్బలుండును మాహిష్మతీ[1]పురనాథుం డగు నీలుండును త్రిగర్తేశ్వరుం డగు సుశర్మయు నసురేంద్రు లగు నలంబసహాలాయుధులును సాల్వసౌవీర శూరసేనాభీరయవన [2]వసుధాధిపులును లోనుగా ననేక దేశాధీశు లాత్మీయచతురంగబలసమన్వితులును నిజధ్వజవిరాజమానులును నానాభరణోజ్జ్వలాంగులును నయి సంగరకౌతుకంబు మొగంబులం దొంగలింప నరిగి రివ్విధంబునం బదియక్షౌహిణులు నడవం బదునొకండవ యక్షౌహిణితోఁ గురుక్షోణీవల్లభుండు విస్ఫురితభూషణభూషితం బైన గంధసింధురంబు నెక్కి వెలిగొడుగులు మెఱయం దొడవులం దఱచైన వజ్రంబుల యుద్దామంబు లగుదీధితిస్తోమంబులును జామరంబులుం గలయం బొలయ బహురత్నప్రభావిభాసితం బయిన భుజంగకేతనంబు గ్రాలఁ గెలంకుల దుశ్శాసన దుర్మర్షణ వివింశతివికర్ణాదు లగు సోదరులు వాహనవల్గనంబులు మెఱసి మెఱుఁగారు తమతమసిడంబు లుల్లసిల్లం జెలువు మిగిలి చనుదేరం జనియె నిట్లు కౌరవసైన్యంబు గూడికొని కోదండగదాదండ కుంతక్షురికాముసలముద్గరతోమరపరశుభిందిపాలశూల ప్రముఖనిఖిలహేతివ్రాతంబులను భర్మపరికర్మ నిర్మాణశోభిత వర్మంబులును వివిధవర్ణవిచిత్ర తనుత్రాణంబులును మణిగణోజ్జ్వలజ్వాలాజటిలకేతనంబులం బరమాభీల సుందరసమ్మర్దం బయ్యె న ట్లున్న యప్పుడు.

96. తే. అమరుతొడవులవజ్రాంసు లంచపిండు, కరణి హరినీలములఁ
చేర్పుకాంతి యళుల
పగిది మాణిక్యరుచి పద్మభంగి మెఱయఁ, గురుబలంబు
గెందామర[1]కొలనిఁ బోలె.

97. వ. అట్టియెడ భీష్ముండు భూవల్లభులనెల్లం గూడం బిలిపించి వారలతో ని ట్లనియె.

---

2. శ్రవునిం - ఇ. ఈ. ఐ. గ. ఘు. ద. 3. బేర్చిన - కొన్ని ప్రతులు.

95. 1. పుర - పెక్కు ప్రతులలో లేదు- 2. వసాతి వసుధాధిపులు - పెక్కు ప్రతులు.

96. 1. కొలను - పెక్కు ప్రతులు.

*-: భీష్ముఁడు నిజయోధులకెల్ల నుత్సాహంబుగాఁ దెగువ సెప్పుట :-*

సం. 6-17-7

98. క. ఆరయ వివృతస్వర్గ, ద్వారము రాజులకు నాహవం బందు మహో
దారులు దొల్లియు నరిగిరి, మీ రీమార్గమున నడవ మెయికొను టొప్పున్.

99. క. ఇంటం దెవులునఁ జచ్చుట, కంటెను బాపంబు లొండు గలవె నృపులకున్
[1]బంటకలను పొలిగల నిది, గంట నిధానంబు గంట గాదే మనకున్.

100. తే. అనిన విని వార లందఱు నగ్గలికలు, నెఱయుమాటలఁ [1]దనతన తెఱఁగు మెఱయ
బహువిధంబుల నతనికి బాస [2]యిచ్చి, యేచి నిజసైన్యములలోని కేఁగి రధిప.

101. వ. అయ్యవసరంబున గాంగేయుండు గాంధారేయు నాలోకించి మదీయసంగర సమయంబునఁ గర్ణుండు పుత్త్రమిత్త్రామాత్యబంధుసహితంబుగాఁ గయ్యంబునకు రాకుండం గలవాఁ డని తేటపడం బలికిన.

102. క. చలముకొని [1]యొరుల [2]నుడుపుట, బలియుం డై తెంపు సేసి బవరమునకుఁ దా
[3]దెలియుటగాదే యని కురు, కులముఖ్యుఁడు వొంగి యతనిఁ గొనియాడెఁ దగన్.

103. వ. ఇట్లు పితామహునెత్తికోలునకుం జిత్తంబు వికసిల్ల ననుజసహితంబుగా నతనిం బరివేష్టించి యన్నరపతి నిబిడచారుసన్నాహంబుగా నుచితవ్యూహం బమర్పు మని యతనికిం జెప్పిన నతండును బడమరమొగం బయి తానును ద్రోణుండును దాలధ్వజంబును వేదికాకేతనంబును గ్రాలుచుండ ముందఱ నిలిచి వలపటఁ గృపాశ్వత్థామలును దాపటం గృతవర్మమద్రేశ్వరులును

---

99. 1. బంటైకలనం – అ. వ. శ. ష. హ; బంటై యని గల్గిన నది – ఇ; బంటుకలన – ఈ. గ. డ.

100. 1. దమతమ – పెక్కు ప్రతులు. 2. లిచ్చి – పెక్కు ప్రతులు.

102. 1. యరుల – ఎ. ఏ. గ. ఘ. 2. నడపుట – పెక్కు ప్రతులు; నొడుపుట – శర; నణపుచు – త. 3. నెలయుట – ఐ. ఔ. స; వెలయుట – ట.

వెనుక బాహ్లిక [1]సోమదత్త భూరిశ్రవసులును నడుమం గురుకుమారసమేతంబుగా నమ్మహీనాథుండును నతని యగ్రభాగంబున నర్జునుఁ జంపుదుము చత్తు మింతియ కాని యొండు లే దని [2]శపథంబులు పలికి సంశప్తకు లనం బ్రఖ్యాతు లయిన సుశర్మమొదలుగాఁ గల పదివేవురురథికముఖ్యులు[3]న్గలయ నెడనెడం దక్కినయోధవీరులును నిలుచు నట్లుగా నియమించి తగ నయ్యైసైన్యంబుల కేనుంగులు నేనుంగుల కరదంబులు నరదంబులకుం దురంగంబులుఁ దురంగంబులకు విండ్లవారు విండ్లవారికి [4]నడ్డాయుధులు నడ్డం బగుతెఱంగున నిలువ నియోగించి మానుషవ్యూహంబు సమకట్టిన [5]నెన్నండును నిట్టి దృఢవ్యూహంబు గనియును వినియు నెఱుంగ మని యెల్లవారు నచ్చెరు[6]వునం బొరయుచుఁ బ్రియంబందుచుండిరి బృందారకప్రముఖదేవయోనులును దివంబున నున్నపురాతనధరారమణులును భారతరణంబు గనుంగొను కుతూహలంబున వివిధవిమానారూఢు లై యేతెంచి రంతకు మున్న యక్కడ.

-: పాండవయోధులు యుద్ధంబునకు వెడలుట :-

104\. సీ. ఏనికమదమున కెలయుతేఁటులమొత్తములు [1]వెలిగొడుగులచెలువు [2]గెలువఁ
దురగఖురోద్ధూతధూళి యప్సరసల [3]యలకపూవులతోడఁ జెలిమి సేయఁ

103\. 1. సోమదత్త – పెక్కు ప్రతులలో లేదు. 2. సంశాపంబులు – అ. ఊ. ఓ. క. మ. స. 3. మఱియు నసురవరు లైన యలంబస హలాయుధులును గలయ – త. న. ప. 4. నడ్డాయుధంబులు – కొన్ని ప్రతులు; నడ్డ నాయకులు – ఊ. న. మ. స. 5. 'మ' ప్రతిలో యీ వచనము నడుమ యీక్రిందిపద్య మధికముగా కలదు.

కం. ఎన్నండు నిట్టి వ్యూహము, గన్నుల గని యద్భుతంబు గడలుకొనంగా
మున్నెన్నడు విన్నదియును, గన్నదియును లే దటంచు గని పల్కెడన్.

6\. వందుచు – పెక్కు ప్రతులు.

104\. 1. నీలిగొడుగుల – ఊ. త. శ. శర. ప. సూ. 2. గెలువ – పెక్కు ప్రతులు; మిగుల – ఇ. శ. శర. ప. సూ; గొలుపఁ – వా. 3. యలఁలతోడుత జెలిమి సేయ – క. శ. ప. స; యలకపంక్తులతోడ – న; చిన్నిపువ్వులతోడ – వా.

గేతనంబుల మణివ్రాతంబురోచులు రవికిరణంబుల [4]నవలఁ ద్రోవ
జైత్రభేరుల మహాస్వనములు సకల పర్వతములఁ బ్రతివిరావముల సీన
తే. నంబరము రథఘోష[5]భీమాభిరామ, కింకిణీగణఝుణఝుణత్కృతిమయముగఁ
బటుపదాతిహేతిప్రభాపటలి యెల్ల, దిశలు [6]వెలిఁగింప వెడలె యుధిష్ఠిరుండు.

105. మ. ప్రమదం బాననకాంతిఁ [1]గ్రొత్తవఱుపం [2]బాదాతిభూయిష్ఠ సై
న్యముతో భీముఁడు భూషణద్యుతినికాయంబుణ గదాద్యాయుధో
గ్రమరీచిప్రకరంబు[3]నుం గలిసి [4]చిత్రస్ఫూర్తి శోభిల్లఁ గా
సమరక్రీడకు వచ్చె జృంభితభుజాస్తంభోజ్జ్వలాకారుఁడై.

106. సీ. దివ్యరథస్ఫారదీప్తిజాలంబులు పద్మరాగోజ్జ్వలప్రభలు గాఁగ
మహనీయరథ్యవిగ్రహములజిగిసొంపు ఘనవజ్ర [1]వసుసముత్కరము గాఁగ
నొగలపై నున్న [2]కృష్ణుని [3]మేనినునుఁ[4]జాయ హరినీల[5]కాంతివిస్ఫురణ
గాఁగఁ
బ్రస్ఫీతకేతనాగ్రస్థితకపిదేహరోచులు గరుడాశ్మరుచులు గాఁగ
ఆ. నంపపాదుల నిగుడునంశువితానంబు, దీప్రమరకతముల దీధితులుగఁ
దాలిమియును బెంపుఁ దనకు నైజములుగ, విజయ[6]రోహణాద్రి వెడలి
వెలిఁగె.

107. క. అతులితరథప్రతానో, ద్ధతసైన్యము గొలువ దేవదత్తం బంగీ
కృతసకలతూర్య[1]నాదో, ద్ధతి యగుచుఁ జెలంగఁ గ్రీడి గడు నొప్పారెన్.

---

4. నవ్వుల - పెక్కు ప్రతులు. 5. ఘూషా - పెక్కు ప్రతులు. 6. [illegible] -
పెక్కు ప్రతులు.

105. 1. తోడ బరవన్ - ల. 2. బాదాత - కొన్ని ప్రతులు. [illegible]
గర్వంబు శోభిల్లగా - అ. జ. వ; [illegible] - కొన్ని ప్రతులు. [illegible]-
ఉ. ఎ. ఓ.

106. 1. రుచి - ఈ. న. పీ. 2. విష్ణుని - ఆ. ఊ. [illegible] - [illegible].
3. మేను - ఆ. ఒ. చ. 4. గాంతి - ఒ. [illegible]. 5. దీప్తి - ట. [illegible]
గాగ - ఈ. 6. రోహిణాద్రి - వా; [illegible] - [illegible].

107. 1. నాదోద్ధతి - పెక్కు ప్రతులు.

సన్నద్ధంబు లయి నడచి [11]నిస్సాణాదులరావంబులు సెలంగ రౌద్రంబు దలకొనం దార్కొనియెం దత్సమయంబున ధనంజయుండు మన[12]పదాతులు బడలువడం దనరథంబు వఱపించి శరంబులు [13]నిగిడించి.

99. క. అరదములు రథికవరులును, [1]హరిసారథి కేతుసహిత మై [2]పొడిపొడిగా, గరులును జోదులు [3]డొల్లఁగఁ, దురగంబులు [4]రావుతులును [5]దుత్తునియలుగన్.

100. క. [1]చేయఁ [2]దొడంగిన గాంధా,రేయులు వెస నొక్కపెట్ట రేఁగి యతనిపైఁ [3]గో యని [4]కవిసినఁ [5]గని కౌం,తేయులు [6]నందఱుఁ గడంగి తేరులు పఱపన్.

101. వ. కని తమకించి బలంబులు రెండును గలయఁ [1]బెరయఁ [2]గెందూళి [3]యెగసిన.

102. క. [1]నామములఁ బితృపితామహ,[2]నామంబుల నుగ్రబిరుద[3]నామంబుల [4]సాం గ్రామికు లెఱిఁగింతురు దము,నా మొన నీమొనను [5]జూపు లడరక యున్నన్.

---

11. నిస్సాణాదిరావంబులు – పెక్కు ప్రతులు. 12. పదాతులం – ఖ. గ. ఘ. జ. ద. 13. నిగుడించి – పెక్కు ప్రతులు.

99. 1. హరులును సారథులు సహిత మై – ఈ. 2. పొడివొడిగా – జ. బ. వ; పొడి వడిగా – ఆ. ఏ. ఖ; పొడివడగా – న; పొడిగాగన్ – ఝ. డ. 3. ద్రెళ్లఁగ – శ. ష; డుల్లగ – వ. 4. రాహుతులును – పెక్కు ప్రతులు. 5. తునియలుగాగన్ – ఏ. చ. ట.

100. 1. చేయం – ద. 2. దొణంగిన – పెక్కు ప్రతులు; దొడరిన – ద; దొరంగిన – ఖ. 3. కోయని – పెక్కు ప్రతులు. 4. కవియగ – పెక్కు ప్రతులు. 5. నా కౌంతే యులు – పెక్కు ప్రతులు. 6. నందరును గూడి తెరలుపగన్ – ఉ; నందరును గడగి – అ; నందరును గూడి – చ.

101. 1. బెరసిన – పెక్కు ప్రతులు. 2. గెంధూళి – పెక్కు ప్రతులు. 3. గవిసిన – పెక్కు ప్రతులు.

102. 1. నామములు – పెక్కు ప్రతులు. 2. నామంబులు – పెక్కు ప్రతులు. 3. నామం బులు – ఉ. ఊ. ఐ; నామములను – ఇ. ఔ. క. ఘ. న. వ. మ. వ. 4. సంగ్రా మోత్సుకు లెరిగింతురు నామొన – అ. ల; సంగ్రామోత్తము లెరిగింతురు నామొన – ఏ. ఐ. మ; సంగ్రామకు లెరిగింతురు – ల. 5. జూడ్కు – పెక్కు ప్రతులు.

103. తే. ఇవ్విధంబునఁ [1]గ్రందుపాటింత యైన, భీష్ము[2]కడఁక నీ[3]సైన్యంబు భీముబలిమిఁ
జేసి యా[4]సేనయును నప్డు సిక్కువడక, [5]పోరె నేమని చెప్పుదుఁ [6]గౌరవేంద్ర.

104. క. శోణితము [1]వెల్లి [2]గవిసిన, రేణు వడంగుటయు మొనలు [3]ప్రియపడి వెస గీ
ర్వాణాసుర[4]సమరముక్రియ, బాణాదినిశాతహేతిపంక్తులు మెఱయన్.

105. వ. [5]పెనంగునట్టియెడ గాంగేయుండును గురుండును బురుమిత్త్రుండును సైంధవుండును సౌబలుండును వికర్ణుండును బాండవసేనపయి నడరిన భీమసేనఘటోత్కచసాత్యకిశైబ్యచేకితానద్రౌపదేయులు వారిం దలపడినం బోరు ఘోరం బయ్యె నప్పుడు రథబృందంబులతో[2] భవద్గ్రనందనుండు వాయునందనతదీయనందను లున్నయెడకు [3]నురవడించినం గని భీష్మద్రోణు [4]లతనిమించి వారలం దాఁకినం జూచి సవ్యసాచి యగ్రజునగ్రభాగంబునకు వచ్చి.

106. క. భూరిశరా[1]సారంబునఁ, గౌరవులకడంక [2]యుడిపె గాంధార[3]బలాం
భోరాశిఁ దఱియఁ జొచ్చిరి, వీరాగ్రణి సాత్యకియును [4]విజయసుతుండున్.

---

103. 1. గ్రందుపాటింత యైన – పెక్కు ప్రతులు. 2. కతన – పెక్కు ప్రతులు; కతమున– ఉ. ఒ. త. 3. బలమును – ఒ. 4. సైన్యము – ఆ. ఘ. 5. పోరిరేమని – ఎ. ఏ. మ. 6. భూపవర్య – ఐ. ఝ. డ. మ. వ; భూవరేంద్ర – అ.

104. 1. పెల్లు – పెక్కు ప్రతులు. 2. విరిగిన – ఏ; దొరగిన – ఒ. జ. త. వ; పెరిగిన – ఝ. డ; గురిసిన – బ; డొల్లిన – ఖ. 3. వ్రేయగ పడిగే – ఆ. 4. సమరక్రియ బాణౌఘనిశాత – ఝ.

105. 1. పెనంగి రట్టి – పెక్కు ప్రతులు; పెనంగెనట్టి – ఆ. ఈ. ఊ. క ఖ. గ. త. ద. బ. వ. 2. తోడ – పెక్కు ప్రతులు. 3. నురువణించినం – పెక్కు ప్రతులు. 4. లతనికి – పెక్కు ప్రతులు.

106. 1. సారంబుల – ఎ. ఒ. ఐ. చ. ప. 2. యుడిపి – పెక్కు ప్రతులు. 3. సుతాం–ఊ. 4. విజయుడును వడిన్ – అ. ఏ.

107. క. పొదివికొని శకునిబలము, న్మదగతి సాత్యకి[1]రథంబు నలికిన నాతం
డది [2]దిగ్గదాఁటి ధైర్యాస్పద[3]మతి నభిమన్యు[4]తేరిపైకిం జనియెన్.

108. క. వారిరువురుఁ[1] జలమున గాంధారపతిప్రముఖరథిక[2]తతులఁ జంచ
[3]న్నారాచతతుల నొంచిరి, క్రూరతఁ [4]గవిసెన్ యుధిష్ఠిరుఁడు
[5]భీష్మపయిన్.

109. క. భూరిబలఘోర [1]మగునా, భూరమణుని[2]కోలుతలకుఁ బోవక భీష్మ
స్ఫారబలము ద్రోణునిదో, స్సారంబు[3]ను నచ్చి నీదుసైన్యము [4]పెనఁగెన్.

:- దుర్యోధనుఁడు భీమునితో యుద్ధము సేసి మూర్ఛిల్లుట :-

సం 6_54_15

110. చ. తదవసరంబునం బతి యుదగ్రత [1]భీమునిఁ దాఁకి [2]విస్ఫుర
త్ప్రదరము లేసినన్ నగుచుఁ బాండవవీరుఁడు రాజు[3]మేన బె
ట్టిద [4]మగుబాణ మొక్కటి వడిం [5]గొని [6]తూలఁగ నేయఁ [7]దేరిపైఁ
జదికిలఁ బడ్డ మూర్ఛ నృపసత్తము లేవఁగ నీక కప్పినన్.

---

107. 1. బలంబు – జ. 2. దిగి కడింది – ఈ; దిగ్గద్రోవి – ప. ఖ. ఝ. త. ద; దిగ్గద్రోచి–చ. వ. 3. గతి – ఊ. ఖ. ఘ. ఝ. ట. ర. 4. తేరు పయికిం – త. జ. మ; 5. తేరుపై – వ; తేరువయి – ఊ.

108. 1. రక్కజముగ – ఐ. మ. వ. 2. వరులను – ఎ; తతులును – పెక్కు ప్రతులు; తతి చెన్నొందన్ – జ; తతులు చలింపన్, నారాచ – ఊ; ముఖ్యుల జించెన్, నారాచ – ల; తతులం జింపన్, నారాచ – వ. 3. న్నారాచంబుల – ఆ. ప; న్నారాచసమితి – ద. 4. గవిసెను – పెక్కు ప్రతులు. 5. భీష్మునిపైన్ – అ. ఉ. క. మ.

109. 1. ముగ – ఐ. 2. కోత్తలకును – పెక్కు ప్రతులు. 3. న నచ్చి – అ. గ. వ; న నేచి – ఈ. 4. లెసగెన్ – వ; లెసగన్ – ఐ. జ. బ. మ.

110. 1. భీము నెదిర్చి – క. వ. 2. యుగ్రతన్ ప్రదర – గ. ద; నిష్ఠుర ప్రదర – ఊ. ట. బ. 3. మేను – శ్రీ. న. ల. 4. ముగ – ఔ. ఘ. జ. ల. 5. దొడి – ఈ. ఘ. 6. తూలగ – వ. 7. దేరుపై – ఐ.

111. ఆ. [1]సంభ్రమమున [2]నపుడు సారథి [3]యచ్చోటు
దొలఁగ [4]బెలుచఁ దేరు దోలుటయును
గని [5]భయంబు [6]నొంది కలఁగి యుక్కుమ్మడి
బలము [7]తెల్ల దెరలి పాఱఁ జొచ్చె.

112. క. వెనుకొని విఱిగిన[1]సైన్యము, [2]గనుకనిఁ [3]బాఱంగఁ [4]జేసి క్రౌర్యోద్రేకం
బున ధృష్టద్యుమ్నుండును, దన[5]కెలనం దఱుమ వాయు[6]తనయుం డెగిచెన్.

113. క. అదలిచి ద్రోణుఁడు భీష్ముఁడు, మదమున నిలు[1]నిలు మనంగ మఱియును మొగక
[2]ట్టదసేన భీమసేనుఁడు, గదిసి పిఱుఁద నంట నార్వఁ గౌరవనాథా.

114. క. [1]సభయ మయి శకుని[2]సైన్యం, బభిమన్యుఁడు సాత్యకియు రయంబునఁ [3]దోలం
బ్రభ [4]సెడి [5]పఱచుట గని యా,[6]ప్రభువు [7]చలం బెడలి [8]విఱిగె బంధులుఁ దానున్.

---

111. 1. సరభసమున – ఘ. ఝ. డ. 2. నిపుణ – గ. 3. యచ్చట – అ. ఆ. ప; యచ్చోట – ఎ. వ. 4. దేరు బెలుచ – పెక్కు ప్రతులు; దేరు పెలుచ–గ. బ. ల; బెలుచరథము – ఘ. 5. భయమున – ఖ. ఝ. డ. 6. బొంది–పెక్కు ప్రతులు. 7. తెరలి మరలి – పెక్కు ప్రతులు.

112. 1. బలములు – ఈ. ఘ. 2. గనుగొని – పెక్కు ప్రతులు; గనికని – ట; కనికని – వ. 3. పాఱంగ – న. ప. మ. ల. శ. 4. నేసి – అ. ఐ. మ. వ; నేసె – ఖ; జేసె – ట. త. ద. ప. 5. కెలనను – ఈ; కెలకు లదర – ఝ. ద. 6. తనయుండు వెసన్– పెక్కు ప్రతులు; తనయుడు నేసెన్ – ఐ. ఘ. మ. వ; తనయుడు బెలుచన్ – ఊ; తనయుడు వేగన్ – గ. ద.

113. 1. నిలువు మనగ – అ. ఇ. ఊ. ఏ. ద; నిలువు డనగ–చ. ట. 2. ట్టైద భీమసేను– ఉ. ఐ. ట. మ; ట్టద భీమసేనుడు – అ. ఏ; ట్టదనిన భీమసేనుడు వెస – ఆ. ఇ.

114. 1. సభయ మై శకుని – పెక్కు ప్రతులు. 2. సైన్యము నభి – ఇ. చ. త; సైన్యమ్మభి – మ. 3. దొలగన్ – గ; దొలగన్ – వ. 4. చెడి – న. ప. బ. మ. వ. శ. 5. పారుట – క. ఝ. 6. ప్రభులు – వ. 7. బలంబె – ట. ప. మ. వ. 8. తిరిగె– పెక్కు ప్రతులు; పరచె – ఊ. ఖ. ఝ. డ.

115. క. [1]ఊర్జితశాత్రవ[2]సేనా,దుర్జయుఁ డగునర్జునుండు దోర్బల[3]లీలా
[4]స్ఫూర్జితుఁ డై [5]యొక్కదెసన్, [6]గర్జారౌద్రముగఁ [7]దోలెఁ
గౌరవ[8]బలమున్.

116. తే. అంతఁ దెప్పిఱి నీకొడు కనికి రథము
దోలఁగఁ దెచ్చుట గనుఁగొని[1]యలిగి సూతుఁ
[2]బలికి సరభసముగ నడుకలని [3]కేఁగి
యెలుఁగు సూపిన బలములు నిలిచి [4]పొదివె.

117. తే. ఉన్న[1]చోటన కదలకయున్నద్రోణ, భీష్ములును [2]గోలుతల సేయఁ
[3]బెటిగి సేన
చంద్రుఁ డుదయింపఁ [4]బెటిగిన[5]శరధి[6]యట్లు, దోడు[7]తోడుతఁ
బొంగారి చూడ నొప్పె.

118. వ. ఇట్లు [1]బలంబుల నిలిపి [2]సుయోధనుండు సత్వరంబుగా భీష్మద్రోణుల పాలికిం [3]జని వారలతో ని ట్లనియె.

---

115. 1. స్ఫూర్జిత – ఐ. మ. వ. 2. సేనన్ – ప; సేనను – ఐ. వ. 3. లీలన్ – ఘ. 4. స్ఫూర్జిత మై గుణరవమును గర్జితరౌ – ఒ. 5. యొకటం జ్యా – ఉ; యొక్కటనుద్గర్జిత – ఝ. డ; యురుతర్జా గర్జా – చ. 6. గర్జిత – ఖ. ట. ర. 7. దాకె– ఊ; బోలె – వ. 8. నాథా – క. గ.

116. 1. యరిగి – ల. 2. బలికె బరవసంబుగ – ట. 3. కరిగి – ఈ. 4. పొలిచె – పెక్కు ప్రతులు.

117. 1. చోటనె – ఆ. గ; చోటున – ద. ల. శ. 2. గోత్తల – ఒ. ట. ల; గోలతల – ఓ. చ. 3. బ్రిదిలె – జ; బెదరి – న; బెరిగెనేని – ఐ; బెరగె సేన – ద. 4. బొంగెడుశరధి – ఉ. ఊ. ఎ; బెరిగెడు – పెక్కు ప్రతులు; బొంగారు – ఖ. ఝ. డ. వ. 5. జలధి – ఎ. ప. 6. కరణి – ఈ. 7. తోడనె – చ. న. వ; తోడన– పెక్కు ప్రతులు.

118. 1. బలంబులు – ఈ. ఉ. ఎ. చ. న. ల. 2. దుర్యోధనుండు – ఔ. వ. 3. పోయి–క.

119. ఉ. ఉక్కున మూఁడులోకములు నొక్కటఁ [1]దాఁకెన [2]యేనిఁ బోర మీ
[3]రొక్కఁ డొకండ [4]గెల్చుటకు నోపుదు రక్రమవృత్తి [5]నిట్టి మీ
ముక్కున నూర్పు గల్గ మనమోహర [6]మిదురవస్థఁ బొందునే
యక్కట [7]మున్న పాండవుల [8]కల్గఁగ నొల్లమి సెప్పరైతిరే.

120. వ. అని పలికి గాంగేయుం గనుంగొని.

121. ఆ. [1]నాఁడె చెప్పఁ గన్ననాకు రాధేయున, కెట్లు సూడఁ [2]బోలె నిట్లు వోలెఁ
బడిన[3]పాటుఁ బడుదు మడియాస నీచేత, భంగపడితి మింకఁ [4]బలుకు లేల.

122. వ. అనిన విని [1]చిఱునవ్వు [2]నవ్వుచు మీతండ్రి నీకొడుకును బ్రియభాషణం
బులం [3]దేర్చి యి ట్లనియె.

123. క. [1]పురుహూత[2]సహిత మగుని,ర్జర[3]బలమున కైన గెలువ శక్యమె సమర
స్థిరు లగు పాండు[4]తనూజుల, నరనాయక [5]నీకు ని ట్లనం దగ వగునే.

124. క. వృద్ధులు గతాయువులు దు,ర్బుద్ధులు నగువారిచేతఁ బోదురె శస్త్రా
స్త్రోద్ధతియు బహుగర్వ[1]స,మృద్ధియుఁ గలపాండుసుతు లమిత్రధ్వంసీ.

---

119. 1. దాఁకినయేని – పెక్కు ప్రతులు; దాఁకిన యైన – గ; దాఁకరయేని – ల. 2. బోరు మీర – ఐ. మ. వ. 3. రొక్కొకరుండు – ఐ. వ; రొక్కొకరుండ – జ; రొక్క రొకండ – ఉ. గ. ట. బ. 4. గెల్వులకు – ఐ. మ. వ. 5. నిట్లు – ఆ. ఓ. ఔ. జ. న. మ; నట్టి – ఇ. ట. డ. త. వ. 6. మిద్దురవస్థ – ఒ. వ. 7. మున్నె – ఝ. హ; మున్ను - పెక్కు ప్రతులు. 8. కల్గమి యెు – ఎ. గ. ట. ప. బ.

121. 1. నాడ చెప్ప గన్న–ఓ. త. ల. 2. బోరి – పెక్కు ప్రతులు; చేసె – చ. 3. పాట్లు– ఉ. ఎ. చ. న. ప; పాట్ల – ఆ. ఔ. జ. శ. ష; దోడు – వ. 4. భయము – ఎ.

122. 1. చిరినవ్వు – ల. 2. నవ్వి నీతండ్రి – ఐ. ఝ. వ; నవ్వుచు నీ తండ్రి – ఆ. 3. దేల్చి – ఎ. ట; దీర్చుచు – బ.

123. 1. పురుహూతు సహితు లగు – ఉ. 2. సహితముగ – ఊ. ట. న. ల. 3. వరులకు నైన – ఇ. ద; బలముల నైన – చ. ఝ. డ. 4. కుమారుల – ఓ. 5. నీ కిట్లు లనన్ – వ; నీకు నట్టు లనం – ఏ. వ; నీకు ని ట్లనంగా దగునే – వ.

124. 1. సమృద్ధులు – ఏ.

125\. క. [1]ఐనను నోపినభంగిని, భూనాయక పాండురాజ[2]పుత్రసముద్య
[3]త్సేనలఁ [4]గూల్చెదఁ గనుఁగొను,మీ నీవును [5]బంధులును సమీపస్థులరై.

126\. వ. అని పలికి సంరంభంబున విజృంభించిన ధార్తరాష్ట్రులు ముదిత[1]మానసులై శంఖంబులు [2]పూరింప భేరీమృదంగాది[3]తూర్యస్వనంబులు సెలంగుటయును.

127\. క. [1]విని పాండునందనులు శంఖనినాదము లుల్లసిల్లఁగా బహుతూర్య
[2]ధ్వను [3]లడరఁగఁ దిరమై తమ, [4]మొన నిరతముగా నొనర్చి ముదము దలిర్పన్.

128\. వ. [1]నడచి రనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

129\. క. దుర్యోధనుమాటకు భుజవీర్యోద్ధతి భీష్ముఁ డేచి విక్రమలీలా
[1]ధుర్యతఁ గడఁగినఁ గయ్యం, బార్యస్తవనీయ మెట్టు లయ్యెం జెపుమా.

130\. వ. అనిన విని సంజయుం డతని కి ట్లనియె నప్పుడు ప్రభాకరుండు నభోమధ్యంబునకు వచ్చి [1]వెలుంగు[2]చున్న నతనితోడిపురుడునం దేజోమహిమ

---

125\. 1. (యే) ఏనను – ఈ. ఉ. గ. ద. 2. పుత్రులమాద్య – అ. ఈ. ఊ. ఔ. ఎ; పుత్రుల సముద్య – ల. 3. త్సేనం గూర్చెద – ఎ. ఖ. ఝ. డ. 4. నోర్చెద–గ. ద. 5. సంధువులు సమీప – ట. వ.

126\. 1. మూర్తులై – పెక్కు ప్రతులు. 2. పూరించిన – పెక్కు ప్రతులు. 3. తూర్యంబులు సెలంగుటయును – పెక్కు ప్రతులు.

127\. 1. విను – ఇ. వ; కని – ల. 2. స్వనము లడర దిరమై – ఈ. ఘ. 3. లడరం దిరమై – పెక్కు ప్రతులు. 4. మొనం దిరముగా – అ. ఓ. ఔ. జ.

128\. 1. నడచె నన – గ. ఝ.

129\. 1. ధుర్యగతి నడవ – త; ధుర్యగతి గడగు – జ.

130\. 1. మెలంగు – ట. 2. చున్నంత – ఊ; చుండ – ఒ. ట.

దలకొన్న తెఱంగునం దనమెఱుంగు [3]వాలమ్ము లను[4]కిరణమ్ములు వర
గించుచుఁ బ్రతాపదీపితుం డగు దేవవ్రతుండు [5]దేవేంద్ర[6]సుతుం దాఁకిన.

131. చ. కడఁగి సుయోధనప్రభృతికౌరవవీరులు భీష్ము[1]తోన [2]బె
ట్టడరిన భీమముఖ్యు లగు [3]నక్కడి యోధులు నొక్కయుమ్మడిన్
వడిఁ దలపడ్డ సైన్యము లవారణ రెండును నేచి [4]త్రోచి య
ప్పుడు రథసంబునన్ బెరసి పోరె వియచ్చరకోటి మెచ్చఁగన్.

132. వ. అట్టియెడ.

133. క. హుంకారములు నదల్పులు, [1]జంకెలు [2]ధిక్కరణములును సంస్తుతులును వీ
రాంకోక్తులు నిస్సాణ[3]జ, ఢాంకృతులును [4]గలసి యుద్భటంబుగఁ [5]బెలిగెన్.

134. క. తునిసిన[1]బాహామస్తక,తనుచరణంబులను బాణ[2]తరవారిగదా
ధనువులుఁ గిరీటకంకణ, కనదంగదములును దఱచుగా ధరఁ దొరఁగెన్.

135. తే. నగము [1]సచ్చిన యొడళులు జలచరములు, రక్తపూరంబు దోయంబు
ప్రచురమాంస
పటలిపంకంబుగాఁ గేఁబహునదీప్ర,వాహములు [2]వాఱె సంగరావని నృపాల.

---

3. వాలంబులను - ఊ. ఏ. 4. కిరణంబులు - పెక్కు ప్రతులు. 5. నరుం దాకిన- ఆ. న. వ. శ. ష. 6. పుత్రుం - ఖ; సూనుం - ఘ; నందనుం - త.

131. 1. తోడ - పెక్కు ప్రతులు. 2. బిట్ట - ఏ. ఒ. ఔ. ఝ. డ. ద, ల. 3. నక్కురు వీరులు - ఉ. ఎ. చ; నక్కడి వీరులు - ఇ. ఖ. ఝ. డ. ర. వ. 4. త్రోచె న-అ. జ.

133. 1. ఝంకెలు - పెక్కు ప్రతులు. 2. దీక (క్క) రణంబులు - పెక్కు ప్రతులు. 3. ధణం - పెక్కు ప్రతులు; ధణాం - బ; ధనుష్ఠంకృతులు - ఝ. 4. గడచి - పెక్కు ప్రతులు; గడచి యుల్బణంబుగ - ఈ. ఘ; గడచి భీషణంబుగ - క. ఖ. ట. వ; గడు విభీషణంబుగ - ఝ. డ. 5. జెలగెన్ - పెక్కు ప్రతులు; నడరెన్ - ఉ. ఎ. ఔ. చ.

134. 1. మస్తకబాహా - పెక్కు ప్రతులు. 2. దళితాసి - ఎ. ఔ. చ; తతిహేతి - ఒ. ఖ. ఝ. ట. డ.

135. 1. వ్రచ్చిన - చ. 2. బుట్టి - పెక్కు ప్రతులు; పుట్టి - ఉ. ఐ. ఒ. ఓ. ట. వ. ప. మ. శ. ష; వుట్టి - ఖ. జ. బ. వ.

136\. క. అఱవఱ లైన రథంబులు, నెఱి దప్పఁగఁ బడినయశ్వనికరంబులు బెం
దఱచుగఁ గూలిన [1]కరులు, న్గిరి[2]గొనియె సమరమేదినీతల మెల్లన్.

137\. వ. ఇవ్విధంబున విషమం బగురణభూభాగంబునం జరియింపం జతురులు గాక
రథిక[1]జను లంతంత గుంపులు[2]గట్టిరి గాంగేయుండు ప్రతియోధులం
బేరువేరం బిలుచుచు నుక్కుమిగిలి [3]దెక్కు లమ్ములం బిక్కటిల్లం జేయుచు
నెక్కడఁ జూచినం దాన యై మెఱుంగు మెఱసిన[4]తెఱంగునం గొఱవి
ద్రిప్పినయొప్పున నింద్రజాలంబు సూపిన[5]చందంబునం దనరథంబు [6]నెఱయ
శక్తిశౌర్యంబులు నెఱయ నెవ్వరికి నిలువరింపరాక యెదిరిన[7]రూపంబులం
బెక్కింటి నొక్కబాణంబునం బెక్కుబాణంబుల [8]నొక్కంటిఁ గూల్చి కేశి
[9]సలుపుచు [10]నతిమిపయిం బడినవీరులం [11]గి లెడలినజంత్రం[12]బులుంబోతె
నేలం గూల నేయుచు దృఢత్వలక్ష్య[13]శుద్ధిలాఘవంబులకు వియచ్చరులు
పిచ్చలింప ననేకప్రకారంబు లగుక్రూరశరంబులఁ జతురంగంబులుం దుని
యలుం బఱియలుం దునురులుం గుదులు నై బడలువడం [14]జేయుచుం
గార్చిచ్చు పోదివినపోలిక మాయ గావించిన మాడ్కి మంత్రించి పడవైచిన
పగిదిం గసిమసంగి [15]కౌంతేయసేనం గనుపుకొట్టుచుఁ బ్రళయకాలతాండవ
[16]ప్రవర్తి యైన ఫాలలోచనులీల [17]నాజిరంగంబునం బరాక్రమ[18]నృత్యంబు
సేయుచున్నం బాంచాలయాదవాదియోధులు [19]వెఱఁగు[20]పడి చూచు
చుండఁ బాండవులునుం జేయునదిలేక చేష్టలు దక్కినం దదీయసైన్యంబులు

---

136\. 1. కరులును గిరి - పెక్కు ప్రతులు. 2. గొనియెను - పెక్కు ప్రతులు.

137\. 1. జనంబు లంతంత - పెక్కు ప్రతులు. 2. గట్టియున్న - ఉ. ఎ. ఔ. చ; గట్టి యుండ - ఘ; గట్ట గాంగేయుండు - ఏ. ఒ. ఓ. ఝ. ట. డ. న. బ. వ. 3. దిక్కులు బిక్కటిల్ల - అ. ఉ. ఎ. ఏ. ఐ. ఘ. మ. వ. 4. చందంబు - ఔ. ఝ. డ. 5. తెరం గున - పెక్కు ప్రతులు; చాడ్పున - క; విధంబున-ఓ. ఖ. గ. ట. జ. ద. 6. మెరయ- ఈ. ఉ. చ. ట. 7. రూపులం - పెక్కు ప్రతులు. 8. నొక్కటిం - పెక్కు ప్రతులు. 9. సల్పు - ఊ. ఏ. ప. మ. 10. దరిమి - ఈ. ఉ. 11. గి లెడపిన- పెక్కు ప్రతులు; గేలణపిన - వ. 12. బుల - పెక్కు ప్రతులు. 13. శుద్ధి చిత్ర త్వ లాఘవంబులు-పెక్కు ప్రతులు; శుద్ధి చిత్రలాఘవంబు - ఐ. మ. వ. 14. నడ చుచుం - పెక్కు ప్రతులు. 15. కౌంతేయుల - ఇ. క. 16. మూర్తి - ఆ. ఏ; ప్రచండవర్తి - వ. 17. నాభీల - ఐ. మ. వ. 18. కృత్యంబు - ఐ. వ. 19. వెగడు - ఉ. ఔ, ౕ. డ. 20. పడుచున్న - ఉ.

రూపతి భయభ్రాంతంబు లై దీనదశకు వచ్చె నప్పుడు శౌరి యుగ్యంబుల
పగ్గంబు[21]లఁ బట్టి [22]పార్థునితో ని ట్లనియె.

138. చ. కృపగురుభీష్మయుక్తముగ గెల్తు సుయోధను[1]సేన నంచు నీ
వపరిమితోగ్రశక్తి మెఱయం దటి గోరుచు నుండు దెప్పుడుం
గుపిత[2]యుగాంతరుద్రు[3]గతిఁ గోలుమసంగినవాఁడు భీష్ముఁ డే
చి పటుభుజాబలంబు [4]విలసిల్లఁగ మార్కొన కున్కి [5]యొప్పునే.

-: అర్జునుఁడు శ్రీకృష్ణప్రేరితుం డై భీష్మునిపైఁ గవియుట :-

సం 6_55_40

139. క. అనిన విని యర్జునుం డి, ట్లను [1]నీ విం తనఁగ నేల యాతనిమీఁదఁ
మనరథముఁ బఱపు [2]మిప్పుడ, ఘనిసితశాణముల [3]నతని సొం పడఁగింతున్.

140. చ. అనుటయు [1]నట్లకాక యని యచ్యుతుఁ డుద్గతిఁ దేరు వోవ ని
చ్చినఁ గని పొంగి యారథికసింహుఁ డు[2]దంచితసింహనాదుఁ డై
నిసిచెఁ దురంగ[3]దేహముల నీరజనాభునిమేనఁ బాండునం
దను నొడలం బ్రదీప్తఘనదారుణమార్గణ [4]పుంజముల్ వడిన్.

141. తే. తనదునొవ్వున కలఁకక ధైర్యవృత్తి, నయ్యుపేంద్రుండు నొచ్చిన హాయచయంబుఁ
[1]దడవి [2]తేర్చి యుదగ్రతఁ దఱుముటయును, గుణరవం బుల్లసిల్ల ఫల్గునుఁడు గడఁగి.

---

21. లు వట్టి – న. బ.మ. వ; లు పట్టి – ల. 22. పార్థున కి – అ. ఏ. చ.

138. 1. నాజి – ఎ. క. న. వ. 2. యుగాంత్య – పెక్కు ప్రతులు. 3. క్రియ – పెక్కు ప్రతులు. 4. వికసిల్లగ – ఐ. ద. 5. పాడియే – ఉ. జ; యుక్తమే – ల.

139. 1. నీవును వగవ నేల – గ. ద. 2. మిప్పుడు – పెక్కు ప్రతులు. 3. మదము – పెక్కు ప్రతులు; ముదము – వ.

140. 1. భీష్ము తేరుదెస కచ్యుతు డు – గ; భీష్ము తేరుదెస కర్జును డెంతయు – ద. 2. భీకర – వ. 3. మాంగముల – ఎ. ఔ. చ. జ. 4. పుంఖముల్ – న. వ. శ.

141. 1. దర (రి) మి – పెక్కు ప్రతులు. 2. తేర్చి – పెక్కు ప్రతులు.

142. క. ఖల్లం బోకటఁ బితామహు, విల్లు దునుమ [1]వేఱొకండు వెస నెత్తిన న
[2]వ్విల్లును [3]దునిమినలాఘవ, ముల్లంబునఁ [4]బొగడి యేసె నొండొకవింటన్.

143. తే. ఇట్లు గాంగేయుఁ డేయున నేకవిశిఖ, [1]వితతి యసురారిరథచిత్రగతుల దప్పి
పోవఁ జేయంగ [2]నతఁ డంతఁ బోక నొంచె, నరుని నారాయణుని
[3]బలునారసముల.

144. క. నొచ్చియు భీష్మునిపై వి,వ్వచ్చుఁడు బెడిదముగఁ గురిసె వాలమ్ము లతం
డచ్చెరువుతోడ వెసఁ గా,ర్చిచ్చు గవిసినట్లు పొదివె శితవిశిఖములన్.

145. వ. అంత నపరాహ్ణం బయ్యె నట్టి[1]యెడ.

146. క. [1]హరి దాను నొచ్చి [2]నొచ్చిన, నరునితెఱం గెఱిఁగి భీష్మునకు నించుకయుం
గరలాఘవ [3]మెడలమియుం, దిర మై పరికించి తనమదిం [4]దలపోయున్.

147. ఉ. పాండవసైన్యముల్ [1]గలఁగి [2]పాఱెడు సిగ్గటి వీరిలోన నొ
క్కండును భీష్ము [3]మార్కొని మగంటిమి [4]సూపఁగ లేఁడ యింద్రపు
త్రుండును జాల [5]నొ వ్వడరి [6]తూఁగెడు నిట్టిద [7]యైన నేఁడ [8]తీ
ర్పండె యితండు కౌరవనృపాలునమస్తమనోరథంబులున్.

---

142. 1. వేర (అ) యొకటి - పెక్కు ప్రతులు. 2. వ్విల్లు దునుమ గర - ఎ. 3. దును
మగ - వ. 4. మెచ్చియేసె - ఝ. డ.

143. 1. వితతి నసురారి - పెక్కు ప్రతులు. 2. నాతడు పోక - బ; నతడుతా - వ.
3. బెక్కు - జ.

145. 1. సమయంబున - న.

146. 1. హరి దా నొచ్చియు-ఇ. ప. గ. ఝ. ట. 2. యుండియు - ఆ. ఓ. న. 3. మెడల
మియును - ఝ. త. ప. మెడలమియున్ - ష. 4. దలపోసెన్ - మ. ల.

147. 1. విరిగి - ఉ. ఎ. ఔ. త. య. హ; దలగి - ఏ. 2. పారెడి - ఈ. గ. ద. ర.
ఓ. గ; 3. మార్కొన - డ. న. ప; మార్కొను - వ. 4. చూపగ - ఎ. ఔ. డ. ద;
జూపగ - అ. ఏ. 5. నొప్పడిరి - ప. బ. మ. ల; నోవడరి - న. 6. తూలెడు -
జ; తూలెడి - వ; తూగెడి - వ. 7. యేని - ఉ. ఎ. 8. తీర్పండ - ఇ. వ.

148. క. యాదవకేకయపాంచాలాదు[1]లు వాఱుటలు [2]సూచి యప మెక్కి జయో
న్మాదంబునఁ గురుసైన్యము, లేదెక్కు[3]నఁ దామ యగుచు నేత్తెఱఁ
బొదివెన్.

149. వ. ఇప్పు డే నూరకున్నం బోవ దీ దేవవ్రతుం జంపి ధర్మతనయు గెలిపింప వలయు నని యిట్లు దలపోయునెడ మఱియు మందాకినీనందనుండు బెట్టిదమ్ము లగునారసమ్ములు గురియం దేఁకువ సెడి క్రీడి యున్నం గని కృప కృతవర్మాశ్వత్థామలును భూరిశ్రవసైంధవ వికర్ణులును నొక్క మొగంబై రథమ్ముల మొత్తమ్ములతోడం గడంగి వచ్చి కవ్వడిపయిం బడి రాసమయంబున సాత్యకి సామజఘటలతో మరవడించి యిరుగెలంకుల యోధుల నాలోకించి.

150. క. మఱతురె [1]యాడినమాటలు, [2]పిఱుసనిపోఁ దగునె మీకు బెదరక యెదురై
తఱుముఁడు [3]భీష్ముని గీష్ముని, నెఱుఁగరె ము న్నేను గలుగ నేలా
[4]వెఱవన్.

151. వ. అనుచు నేచి యెదిరిన బలంబుల నిలు నిలు మని యదల్చుచు నర్జును తేరికిం దలకడచి వచ్చునతనికి దనుజాంతకుం డి ట్లనియె.

152. క. తిరిగినపంద లనేటికిఁ, [1]బురికొల్పఁగ నున్నవారు వోదురు [2]గా కేఁ
గురుపతి జయంబు గొని [3]యిద్ధర [4]యేలం జూడ నేర్చెదనె విను నన్నున్.

153. శా. గంగానందనుఁ గూల్చి ద్రోణుపని [1]సక్కంజేసి కౌరవ్య [2]వీ
[3]రాంగమ్ముల్ నుఱుమాడి తత్ప్రబలసైన్యం బెల్ల మాయించి యి

---

148. 1. ఐ పాఱుటలు – పెక్కు ప్రతులు; ల పారుటలు – ఊ. ఐ. న. 2. చూచి – ఊ. ఒ. ఓ. త. ప. 3. నుదార – కొన్ని ప్రతులు.

150. 1. యాడెడి – మ. వ. 2. బిఱుసని – పెక్కు ప్రతులు; బిరుసనె – ఎ. 3. గురు భీష్మాదుల – జొ. చ; గంగాతనయుని – ఒ; వెరువక భీష్ముని – ఐ. వ. 4. విరుగన్ – వ.

152. 1. బురికొలుపగ – పెక్కు ప్రతులు. 2. గాకే కురు – ఝ. ఐ. ఎ. 3. యీధర – పెక్కు ప్రతులు. 4. యేలగ – ఇ. మ. న. ల; నేలగ – వ.

153. 1. చక్కం – పెక్కు ప్రతులు. 2. యోధాంగంబుల్ – అ. 3. రాంగంబుల్ – పెక్కు ప్రతులు.

త్తుం గౌంతేయుల [4]కిమ్మహీవలయముం దుర్దాంతచంచద్భుజా
సంగ[5]స్ఫూర్జితచక్రవిక్రమకళాసంక్రీడనోన్మాదినై.

-: శ్రీకృష్ణుఁడు చక్రంబు ధరించి భీష్మునిమీఁది కుఱుకుట :-

సం. 6_55_84

154. వ. అని పలికి సుదర్శనంబుం దలంచినం దత్క్షణంబ యది సన్నిహితం బగుటయుం బద్మనాభుండు సునాభం బగునాచక్రంబు గైకొని దక్షిణకరంబున నమర్చి పేర్చి యుగ్రంబులపగ్గంబులు [1]నొగల ముడిచి యరదంబు డిగ్గ నుఱికి.

155. తే. అవని గంపింప [1]లలితపీతాంబరంబు, చెఱఁగు దూలఁ జక్రాంశులు [2]దుఱఁగలింప
సింహనాదంబు క్రోధరంజితభయంక,రాననంబునఁ జెలఁగంగ [3]నడరుఁ బెలుచ.

156. శా. అంహోమర్దనుఁ డాజనార్దనుఁడు మాద్యద్భీష్మకుంభీంద్రుపై
సింహోల్లాసవిలాసి యై [1]కవియు నుత్సేకంబు నాటోపముం
రంహస్స్ఫూర్తియు దీప్త[2]మూర్తియును సంరంభంబుఁ జూడఁగ జగ
త్సంహారోన్ముఖుఁ డైనరుద్రుగతి రౌద్రప్రక్రియం బొల్చినన్.

157. చ. పులిఁ [1]బొడగన్న [2]లేళ్లగమి[3]వోలె సుయోధను[4]నగ్రసైనికుల్
దలఁకి [5]కలంగి [6]నివ్వెఱఁగు [7]ధక్కినఁ జేష్టలు దక్కి చిత్రరూ

---

4. కున్మహీ – ఊ. ఎ. న. ప. బ. మ. వ; కీమహీ – ల. 5. స్ఫూర్తిగఁ జక్ర – బ; స్ఫూర్తిత – ల.

154. 1. పిడిచి యరదంబు – ఊ. ట.

155. 1. లీల – వ. 2. దొంగిలింప – ఈ. 3. నడరె – పెక్కు ప్రతులు; నతడు నడచె–ఈ.

156. 1. కవియ – ల. 2. మూర్తి యగు – అ. ఓ. న. వ.

157. 1. గనుగొన్న – పెక్కు ప్రతులు; పొడగన్న – బ. వ. 2. లేళులును బోలె – ఊ; లేడులును బోలె – ఝ. వ; లేళ్లగమిబోలి – జ. వ. 3. బోలె – ల. 4. సేన – అ. ఐ. ఓ. మ. వ. శ; నుగ్ర – వ. 5. తలంగి – ఊ; (గ)క(ణం)డంగి – మ. 6. నివ్వెరయు దాల్మియు – ఐ. మ. వ. 7. దన్కిన – వా. వీ; దన్నిన – న. బ; దక్కొని – శ.

పేల్క్రియ నుండి రక్కరువిభుండును మాఱు దలంప [8]లేనికొం
దలమునఁ బొందుదెందమునఁ దానును రూపఱి యుండె వెల్ల నై.

158. ఉ. అప్పుడు భీష్ముఁ డెంతయుఁ [1]బ్రియంబున ని ట్లను సంభ్రమంబు లే
కప్పరమేశుతో[2] నిటు కృతార్థునిఁ [3]జేయుదె నీవు వచ్చి న
న్నిప్పుడు నీకుఁ బోలినటు లెల్లను జేయుదు గాని [4]వేగర
మ్మొప్పదె నాకు నిట్టితెఱఁ గుజ్జ్వలఫుల్లసరోజలోచనా.

159. వ. [1]అను నట్టియెడ నర్జునుండు రయంబున రథంబు డిగ్గనుఱికి పఱచి పురుషో
త్తము పిఱిందిదెసం గ్రుచ్చి పట్టిన నతండు దీర్ఘబాహుం డగునతని నాయ
తశాఖం [2]బగువిపుల[3]శాఖిం గొనిపోవు మహావాతంబునుం బోలెఁ గొనిపోవ
నాతండు పదియడుగులకొలఁది నిలా[4]తలంబు చిక్కం ద్రొక్కి యాడిగిలం
బడి నిలువం బట్టి యి ట్లనియె.

160. ఉ. కోపము సంహరింపు యదుకుంజర పాండవకోటి కెల్లనుం
[1]దేపవు [2]గావె నీ విటు లధీరతఁ [3]బూనికి దప్పినం బ్రతి
జ్ఞాపరుఁ డైన ధర్మసుతుశౌర్యము [4]ధైర్యము [5]బాహువీర్యమున్
[6]రూపఱిపోక కాదె యనురూపమె నీ కిది లోకనాయకా.

161. చ. ఇటు దగునయ్య కృష్ణ [1]శమియింపుము సాత్యకిఁ [2]జంపినాఁడ విం
కట చనితేని నీదగుసహాయతఁ గౌరవసేన [3]రూపు మా

---

8. నీని – వ.

158. 1. రయంబున – ఇ. బ. ల. 2. తోడుత – ల. 3. జేయుము – పెక్కు ప్రతులు.
4. వేగిరం బొప్పదె – ఐ; వే గరం బొప్పదె – న. ప; వేగిరమ్మొప్పదె – బ. మ.

159. 1. అనియె నట్టి – పెక్కు ప్రతులు. 2. బై న – పెక్కు ప్రతులు. 3. శాఖిలీల – శ.
4. తలంబున నిలువం ద్రొక్కి – ఓ. ఝ. న. వ.

160. 1. దీపము – మ. 2. గాదె – న. మ. 3. బూనిక – న. ల. వ. 4. ధర్మము – ఊ.
5. నస్త్ర – ఉ. ఎ. క. చ. 5. రూపెడలేకపోదె – ఊ. న. వ. శ; రూపడలేక
పోదె – స.

161. 1. క్షమియింపుము – ల. 2. బంపినాడ – వ. 3. యేపు – పెక్కు ప్రతులు.
4. బట్టితే – ఔ. ఘ. జ. ఝ. న. వ.

162\. వ. అనిన సవ్యసాచిసమయనిష్ఠకు శౌరి సంతోషించి రోషం బుడిపికొని యతని కిం బ్రియంబుగా మగిడి [1]నొగలపై కి వచ్చి దిక్కులు పిక్కటిల్లం బాంచజన్యంబు పూరింప నాధనంజయుండును [2]దేవదత్తం బొత్తి గాండీవగుణచండనిస్వనం బొండొంట నిగిడించుటయుం గౌరవబలంబులు భేరీమృదంగాదితూర్యనాదంబులు సెలంగ మార్కొని [3]కడంగిన.

163\. క. అగ్గలిక [1]దూది దరికొను, నగ్గితెలం గమర నప్పు డర్జునుండు [2]గడుం
దగ్గఱి మెఱుంగుటమ్ముల, మ్రగ్గించె వియచ్చరోత్కరం బగ్గింపన్.

164\. వ. [1]ఆసేనకుం దలకడచి భీష్మభూరిశ్రవశ్శల్యదుర్యోధను లడరి యర్జునుపై శక్తిగదాసప్తనారాచతోమరంబులు ప్రయోగించిన నతండు శక్తియు గదయును దోమరంబును నొక్కొక్కభల్లంబునను నేడునారాచంబు లేడింటను దునిమి పేర్చి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది నానాప్రకార క్రూరశరకలాపరూపంబునం గవిసి కౌరవసైన్యంబు నొప్పింప మఱియును దాను మందాకినీనందను నిశితనారాచజాలంబునం బొదివి భూరిశ్రవసుని చాపంబు ద్రుంచి తొమ్మిదివాలమ్ములు శల్యుమేనం గీలించి కురుపతి వక్షంబు వెడందవాతియమ్మున భేదించె నప్పుడు పాంచాలపతివిరాట్ప్రముఖు లగుజోదులు గోలుతల సేసిరి మనబలంబులు గాండీవగుణనిష్ఠురనినదంబునం జేడ్పడి యొల్లంబోయి వెల్లనయి యుండ భవదీయసుతులు శౌర్యోద్రేకంబున నాకేశనందనునరదంబుం బొదివి రట్టిసంకులసమరంబున మహేంద్రబాణంబుచేత మనదిక్కున.

165\. ఆ. కెడసె [1]హయము లొడ్డగెడ వయ్యె [2]రథములు, [3]చాఁపకట్టు వడియె
సామజములు

---

162\. 1. యరదంబు పైకి – ఏ. 2. దేవదత్తంబు పూరించి – ఇ. 3. క(డం)ణంగె–ఐ; క(డం)ణంగిన – ఒ.

163\. 1. నడవి – ఊ. క. వ; సుడుము – ఎ. ఔ. ట. త. ర; సుడులు–వ; నురుము – ఈ. వ; నడరి – య. 2. వడిం – ఎ.

164\. 1. ఆదెసకుం – అ.

165\. 1. రథము – ఐ. బ. మ. వ. 2. హయము – మ. 3. సామజములు వడియె చాపకట్టు – ద.

చదిసెఁ [4]గాలుబలము [5]చామరచ్ఛత్త్రకేతువులు నాయధములుఁ
దునియ లయ్యె.

166\. వ. అప్పు డర్జునుండు కేశకలాపంబు శైవాలంబును బ్రేవులప్రోవులు ఫేనపుం జంబులును మేదోమాంసమస్తిష్కపటలంబు పంకంబును నగురక్తనదీప్రవాహంబు భవదీయసేనామధ్యంబునం బఱపి బేతాళక్రవ్యాదిభూతంబుల నోలలార్చె నతండు దేవదత్తంబును దామోదరుండు పాంచజన్యంబును బూరించి సింహనాదంబులు సేసి రంత నరుణగభస్తి యస్తగిరిమస్తకాంతరితుం డయ్యె నాసంధ్యాసమయంబున నిజసైన్యంబునొవ్వనుం గవ్వడి దివ్యబాణజాలంబుల దుర్నివారత్వంబును విచారించి భీష్మద్రోణబాహ్లీక దుర్యోధనులు బలంబులఁ దివియం [1]బంచి మరలి [2]కరదీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి పాండవులును గృష్ణసహితంబుగా నుబ్బునం బొంగుచు వందిజనకీర్తనంబులు సెలంగ మగిడి శిబిరంబునకుం జని రమ్మూఁడవనాఁటి రాత్రి గురుపతిపీటిజనంబులు గిరీటిపరాక్రమప్రకారంబులం దమదెస నానాదేశంబులచతురంగంబులు వ్రాలినపెల్లును నంతంతం [3]గుములుగట్టి [4]చెప్పికొనుచుండ.

-: భీష్ముని చతుర్థదివస యుద్ధము :-
సం 6-56-1.

167\. క. వేగుటయు సత్వరంబుగ, నాగాంగేయుండు మించి యనికి [1]నడచినఁ
సాగర[2]తరంగములగతి, వేగమ తరతరమ మొనలు వెడలఁ [3]దొడంగెన్.

168\. క. [1]అతిరయమున గురుఁడు భవత్సుతుఁడును [2]బాహ్లికుఁడు నెయిదితోడ్తోబలసం
[3]తతి గూడికొనఁగఁ బటుబృంహిత హేషానేమిరవము లెసగెం దఱచై.

---

4\. గాల్బలంబు - ఇ. 5. సారథి - ఆ.

166\. 1. మించి - ఇ. ఏ. చ. జ. 2. చేదివియలు - ఇ. 3. గుములుగు - పెక్కు ప్రతులు. 4. చెప్పుకొనుచుండిరి - పెక్కు ప్రతులు.

167\. 1. వెడలినన్ - ఝ. డ. త. 2. భంగంబుల - న. వ. 3. దొణంగెన్ - పెక్కు ప్రతులు.

168\. 1. అతిశయమున - స. 2. బాహ్లికవరుడును దోడ్తో - క. 3. తతి మారుకొనగ- ఎ; తతి గూడుకొనగ - ఐ. ఓ. ఖ. బ. మ. శ.

169. క. కారుకొని మేఘమాలా,కారంబునఁ జాల నొప్పెఁ గౌరవసైన్యం [1]బారూఢవీరరసవి,స్ఫారం బై యంతఁ దోఁచె బాండవ[2]బలమున్.

170. క. కురుసేనఁ జూచి యప్పుడు, నరనారాయణులు దమమొనకు మిగిలి సము ద్ధుర[1]లీల సూర్యచంద్ర,స్ఫురణము లొక్కెడన మెఱయుపోలిక నమరన్.

171. క. వెలిఁగిరి బలములు [1]దూర్యం,బులు నార్పులుఁ జెలఁగ రెండుఁ బురికొని చతురం [2]గలసన్గతు లొప్పఁగ వడిఁ, దలపడియెం గై దువులు నదరు లెగయంగన్.

172. వ. ఇట్లు దాఁకి తోమరప్రాసప్రముఖంబులం డొల్లవైచుచుఁ గుంతక్షురికా దులఁ గూలం బొడుచుచుం గరవాలపరశ్వథప్రభృతులం దునియ[1]వ్రేయుచు గదాముసలముద్గరంబులఁ జదియ మోఁదుచు నఖరప్రాసంబులం బగుల [1]వ్రచ్చుచు.

173. క. పురికొనుచుం దెరలుచు నో,హరిసాహరి నొక్కచోట [1]నలవడు నొకచో విరియు నొకచోటఁ [2]దిరుగుం, దిరుగక యొకచోట రెండుదెఱఁగులు నొచ్చున్.

174. క. పలుచోటులఁ బలుభంగులఁ, బలుమొన లిమ్మాడ్కిఁ బోరఁ బార్థునిపై న గ్గలిక [1]నడరెఁ దాటిసిడము, [2]తలతల [3]మని మెఱయఁ గురుపితామహుఁ డధిపా.

---

169. 1. బారూఢి – ల. 2. బలముల్ – పెక్కు ప్రతులు.

170. 1. లీలారవి – బ.

171. 1. తూర్యంబులు – ఈ. ఊ. స. 2. గల సవరణ లొప్పంగా దలపడి – ఎ. గల సవ రణ లొప్పగ వడి – చ; లలిత తతు – ట.

172. 1. వైచుచు – ఐ. మ. వ; వేయుచు – ఘ; వ్రేయుచు – ట. డ.

173. 1. నడరుచు – ఉ. ఎ. చ; నగపడు – ఆ. 2. దొలగున్ – ఇ. మ; దొలగుం – ల; దెరలున్ – ఈ; దోలు చు – ట.

174. 1. గవిసె – ఈ. 2. తళతళ – పెక్కు ప్రతులు. 3. వెలుగంగ వడి, పితా – పెక్కు ప్రతులు.

175. క. పతియును ద్రోణుండు విపిం,శతియుం గృపసోమదత్తశల్యులు గంగా
పుతు[1]తోడఁ గడఁగి రర్జున,సుతుఁ డయ్యేడ్వురను దాఁకె సురలు నుతింపన్.

176. క. వారలశరనిచయము దు,ర్వారవిశిఖ[1]పంక్తిఁ దునిమి వాపవ పౌత్రుం
డారూఢతేజుఁ డై వెలుఁ, గారెను వహుత[2]వహ్నిక్రియ రణాంగ[3]వేదిన్.

177. తే. భీష్ముఁ డభిమన్యుఁ గడచి యాభీలబాణ,జాలములు దీవ్రతరముగ సవ్యసాచి
మీఁదఁ గురియంగ వాతఁ డమేయభల్ల,తతుల నన్నింటిఁ దునుమాడెఁ దరతరంబ.

178. వ. ఇట్లు దొడంగి యుద్భటప్రకారంబునఁ బెల్లు సెల్లు భీష్మార్జునులకయ్యం బయ్యెరువాఁగును గొండొకసేపు నివ్వెఱపడి చూచుచుండె నశ్వత్థామ భూరిశ్రవశ్శల్యపుత్రచిత్రసేనులు మత్తమాంతగంబులు సింగంబుకొదమం బొదువుపోలిక నభిమన్యుం బొదివిన నతండు.

179. క. కని యల్లన నవ్వుచు గురు,తనయుని యుర మేసి శల్యతనయునిసిడముం
దునిమి వెస నీదుతనయుని, ధనువు నఱకి సోమదత్తతనయుని నొంచెన్.

180. క. వారును ముందటి యార్వురు, నీరసమున నొక్కపెట్ట యేయఁగఁ బటు దో
స్సారుం డగుసౌభద్రుఁ డు,దారస్ఫురణమున నద్భుతంబుగఁ [1]బోరెన్.

181. ఆ. [1]హస్తలాఘవమున [2]నతులబలంబున, [3]శౌర్యమహిమ [4]నధికధైర్యమునను
సవ్యసాచితనయు నసె గార యమ్మహా,వీరు లంతవట్టుఁ గారవేంద్ర.

182. వ. ఇట్లు పెక్కండ్రతోడం బెనంగుపుత్రుం గనుంగొని యర్జునుం డంట నార్చి యడరి యందఱ కన్నిరూపు లై నొప్పించి చిక్కువఱిచె నప్పుడు నీ

---

175. 1. తోన – ఇ. ఉ. ఏ. ట. డ. బ. ల.

176. 1. దృష్టి – గ. ద; వహ్ని – ట. 2. వహుని – ప. బ. శ. 3. భూమిన్ – ఊ. ఒ. క. చ. త. బ.

180. 1. బొదివెన్ – ఐ. మ. వ; బొలిచెన్ – వ.

181. 1. అస్త్ర – పెక్కు ప్రతులు. 2. నధిక – పెక్కు ప్రతులు. 3. ధైర్య – ఊ. ఝ. ట. డ. వ. 4. నతుల – పెక్కు ప్రతులు.

కొడుకుపంపునం ద్రిగర్తులుఁ గృతవర్మయుఁ గేకయులును ముప్పదేను వేల రథంబుల[1]వారును గవిసి [2]కిరీటిం గొడుకునుం [3]బొదివి రట్టియెడ.

183\. మ. తటికిం జొచ్చి కడంగి పోరువిజయుల్ దౌదవ్వులం [1]జూచి యే
డ్తెఱఁ బాంచాలసుతుండు సత్వరగతిం దే రద్దెసన్ సారథిం
బఱపం బంచి నిశాతబాణపటలీపాతంబునన్ వైరు లు
క్కఱఁ దాఁకెం [2]దమ[3]సైన్యముల్ సెలఁగ [4]శౌర్యస్ఫూర్తి శోభిల్లగన్.

184\. వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు పురందరనందనునకుం దలకడచి తాఁకి.

185\. క. [1]శరములు మూఁటం గృపుఁ బదిశరముల మ్రదేశు నొంచి శర [2]మొక్కట ను
ద్ధురగతి యగుకృతవర్మని,[3]యరదముఁ [4]దురగముఁల నొకట నవనిం గూల్చెన్.

186\. వ. అప్పుడు [1]శల్యనందనుండు.

---

182\. 1. తోడ – ఇ. ఈ. ఉ. ఎ. ఒ. క. చ; తోడ రా – వ. 2. కిరీటినిం – పెక్కు ప్రతులు. 3. దాకి – వ.

183\. 1. గాంచి – పెక్కు ప్రతులు. 2. ఘన – య, మన – ఈ. 3. తూర్యముల్ – త. య. 4. దోర్గర్వం బఖర్వంబుగన్ – త.

185\. 1. శరముల – పెక్కు ప్రతులు. 2. మొక్కటి – ఇ. ఐ. ఓ. బ. 3. యరదముల తురగముల – త. న. ప. బ. మ. 4. దురగంబు నొకట – ఊ. ఏ. ఒ. క. ఖ. చ. ఝ. డ. ల.

186\. 1. ఈ ఘట్టమున ధృష్టద్యుమ్నునిపై విజృంభించిన వాఁడును, పార్థునిచే సంహరింపఁబడిన వాఁడును శల్యనందనుఁడా యనునది విచార్యము.

ఇచ్చట మూలమునం దిట్లున్నది "తతః సాంయమనేఃపుత్రః పాంచాల్యం యుద్ధదుర్మదమ్, అవిధ్య త్రింశతాబాణైః దశభి శ్చాస్యసారథిమ్" భం. 6–57–21 ఈ శ్లోకము చిత్రశాల ప్రతి (6–61–21). కుంభకోణప్రతి (6–61–21), పి. పి. యస్. శాస్త్రి ప్రతులందును (6–56–21) – యిట్లే యున్నది.

సాంయమని అనగా – 'శలస్యపుత్రః' చిత్రశాల ప్రతి నీలకంఠీయవ్యాఖ్య – మహాభారతనామానుక్రమణిక (సోరన్సన్) – **Samyamani – Kuru warrior who attacked Abhimanyu, Dhristadyumna smashed the head of the son of–**

సాంయమనేః పుత్రః అనుదానిని తిక్క సోమయాజి శల్యనందనుఁడు అనునట్లనువదించెను. సాంయమని అనగా శల్యుఁ డగునో కాదో? నీలకంఠవ్యాఖ్యయందు శలునిపుత్రుఁడని యున్నది.

ధృష్టద్యుమ్నుఁడు సంహరించినది శల్యుని పుత్రుఁడు అనుటకు ఆకరము ఇంకను లభింప లేదు.

187. క. [1]పదిటఁ ధృష్టద్యుమ్నునిఁ, బదియమ్ముల నతనిసూతుఁ బటురయమున ను
న్మదుఁడై నొప్పించినఁ గెం, పొదవిన[2]మోమ మలఁతినవ్వు [3]నొప్పున నొప్పెన్.

188. క. అప్పృషతపౌత్రుఁ [1]డుద్ధత,కోపానలుఁ డగుచు శల్యుకొడుకుధనువు [2]నా
టోపమునఁ దునిమి ఫణిరా,జోపమితాస్త్రంబు లతనియొడలం జొనిపెన్.

189. వ. ఇవ్విధంబున.

190. క. నోనేసి సూతు హయసం,తానముఁ జంపుటయు శల్యతనయుఁడు విరథుం
డై నిరుపమాన మగు తన,[1]మానము వాహనము గాఁగ మద [2]మెలరారన్.

-: శల్యనందనుఁడు ధృష్టద్యుమ్నునితో యుద్ధంబు సేసి చచ్చుట :-

సం: 6_57_25

191. క. పలకయు వాలును గొని ఱెక్కలు గలవెనుఁబాము [1]పగిదిఁ గవిసినఁ గాంతే
యులు సూచి వెఱఁగుపడి రా,బలమును నీబలముఁ బొగడెఁ
బటుశౌర్యంబున్.

192. వ. ఇట్లు గవిసి.

193. క. వెరవున ధృష్టద్యుమ్నుని, శర[1]నికరం బెల్లఁ బలక జడియుచుఁ గిరణ
[2]స్ఫురణాతిభీషణం బై, కరవాలము మెఱయఁ జిత్రగతులం గవిసెన్.

---

187. 1. పదిటను - ఇ. ఈ. ఐ. ఔ. చ. ప. బ. మ. ల. 2. కనుగవ కోప ముగ్రత నొదువన్ - ఉ. ఎ. ఒ. చ. ల. 3. వొలుపున - ఔ. క. శ. ష; పొలుపున - క. జ. న. వ. గమనిక : పొలుపున అను పాఠము అంగీకరించినచో అఖండయతి యగును.

188. 1. డుగ్గత - అ. ఏ. క. ఘ. చ. న. స; దద్భుత - ఝ. డ; డుద్ధుర - వ; దుద్భట-వ. 2. సాటోపముగ - ఐ. ఘ. ద. వ. శ. ష.

190. 1. మానము - ఆ. ఊ. ఓ. క. ఘ. జ. ట. డ. న. వ; మానమె - అ. ఈ. ఉ. ఏ. ఐ. గ. ద. వ. 2. మలరారన్ - అ. ఆ. ఖ. ఝ. డ. న. మ.

191. 1. కరణి - ఝ. డ; రీతిన్ - ఊ; గతిని - ట. ర. వ.

193. 1. నికరంబులను - ఉ. ఎ. ఔ. 2. స్ఫురణ విభీషణ మై తన-ఈ. ఏ. క. గ; స్ఫురణ విభీష మై యక్కర - అ. ఇ. ఐ. ఒ.

194. తే. [1]కవిసి వ్రేసిన గ్రక్కున గద యమర్చి, యాఁగి వజ్రప్రహారంబు ననుకరింప
ద్రుపదనందనుఁ [2]డడిచినఁ దునియ లయ్యెఁ, బలక రెండవవాటునఁ బగిలె శిరము.

195. క. తల వ్రయ్య [1]లైనఁ బ్రాణం, బులును గృపాణంబు విడిచి భువిఁ ద్రెళ్లె వతం
[2]డలుకొందె కురుబలం బా, కులతం బొందంగఁ గొండ గూలినభంగిన్.

196. తే. [1]ఇత్తెఱంగున నిజపుత్త్రుఁ డీల్గుటయును, గ్రోధదీప్తుఁ డై కల్యుండు ద్రుపదసూతి
మీఁదఁ [2]గవిసిన [3]నాతఁ డమేయబాణ,పంక్తి వరగించె నుజ్జ్వలప్రభలు నిగుడ.

197. వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

198. క. మానుష మేటికి [1]దైవా,ధీనము సర్వంబు నస్మదీయస్వాయ
త్తేనలఁ బాండునృపాలకసూ,నులు [2]గెల్చెదరు కంటె సూతతనూజా.

199. క. చావును [1]నోవును మన[2]యో, ధావలికిఁ గెలుపునుబ్బు [3]నావలికిని నీ
చే వినియెదఁ దుది [5]నెట్టులు, శ్రీవిభవము [6]పాండవులకుఁ జేపడున కదే.

200. వ. దుర్యోధను [1]దుర్ణయంబున నేను దుర్వార్తలు వినుచు దుఃఖంబు లనుభ
వించు[2]వాఁడ నైతిఁ గాంతేయులగెలుచునుపాయం బెద్దియుం గన్నవార

---

194. 1. కదిసి - పెక్కు ప్రతులు. 2. డడచిన - పెక్కు ప్రతులు.

195. 1. లయిన - ఎ. ఖ; లయ్యె - ఈ. ఏ. ఒ. చ. ల. 2. డలుపొంద గురు - అ; డలు
వొందగ గురు - ప. శ; దలరన్ దగ గురు-ఓ; దలఘుతర వజ్రహతినా - ఇ. ఈ;
దలఘుతర వజ్రహతి గురుకుల మల్లడ గొండ - క.

196. 1. ఇవ్విధంబున-ఒ. ల. 2. నేసిన - పెక్కు ప్రతులు. 3. నతడు న - పెక్కు
ప్రతులు.

198. 1. దైవాధీనము - పెక్కు ప్రతులు. 2. గెలిచెదరు - పెక్కు ప్రతులు.

199. 1. నొప్పియు - పెక్కు ప్రతులు. 2. యోధావలికిని - పెక్కు ప్రతులు.
3. నావలనికి - పెక్కు ప్రతులు; నవ్వలికిని - బ. 4. యెద దోస్సారము - అ.
5. నెట్లును - పెక్కు ప్రతులు. 6. పాండుసుతుల - ఇ. గ. ద.

200. 1. దుర్వినయంబున - పెక్కు ప్రతులు. 2. చుచుండువాడ - ఈ. ఎ. క. గ.
చ. ద; చున్నవాడ - పెక్కు ప్రతులు.

ముగా మనిన సంజయుం డది యట్టిద నీసైన్యంబుల సేనాంగంబు లనేకం బులు వొలిసె దొరలు మడిసెదరు దిర మై విను మని యిట్లనియె నట్లు శల్యుచేత బహుబాణంబులం బొదువం[3]బడి పార్షతుం డతని నపరిమిత నిశితశరంబులం [4]బొదువ నతం డతనివిల్లు దునిమి వివిధాస్త్రంబుల వెగడు వఱచిన నాధృష్టద్యుమ్నుండు నొచ్చుటయుఁ జూచి సుభద్రాసూనుండు మద్రపతిం దాఁకె నప్పుడు కురుపతి పుర[5]కొల్ప దుర్ముఖుండును [6]దుష్ప్ర హుండును దుర్మర్షణుండును సత్యవ్రతుండును జిత్రసేనుండును బురు మిత్రుండును వివింశతియును వికర్ణుండును నయ్యభిమన్యు మార్కొనుట కలికి పాంచాలనందనుపై నడరి [7]యొక్కొక్కండ పెక్కమ్ము లేసిన నాప్రుషతపౌత్రుండు [8]చలింపక యొక్కొక్కరినిం బెక్కమ్ము లేసి కర లాఘవంబు నెఱపి యందఱకుం జాలి సమరంబు సేయుచుండె.

201\. క. నకులుఁడు సహదేవుఁడు మా,మకు [1]నచ్చెరువాటుఁ బ్రియము మదిఁ దలకొన నం
బకవృష్టి [2]గురియ నస్త్ర,ప్రకరంబు[3]నఁ బొదివె మద్రపతియును వారిన్.

202\. వ. వాఁకి బాసట యై పాంచాల[1]మత్స్యపతులు సైన్యోపేతంబుగాఁ దఱిమిన మనయందుఁ గలదండిమగలు శల్యునకు [2]సాహాయ్యంబు సేసి రంత దినమణి యంబరమధ్యం బలంకరించె నట్టియెడ.

---

3\. బడిన — పెక్కు ప్రతులు. 4. బొదివె — పెక్కు ప్రతులు. 5. కొల్ప దుర్వి షహుండును దుర్ము — పెక్కు ప్రతులు. 6. దుష్ప్రహుండును — పెక్కు ప్రతులు. 7. యొక్కొక్కరుండు — పెక్కు ప్రతులు. 8. సంచలింపక — ఉ. ఔ. ఖ. చ. ఝ. డ. ప.

201\. 1. నచ్చెరుపాటు—పెక్కు ప్రతులు. 2. గురిసి రస్త్ర — పెక్కు ప్రతులు. 3. ల గప్పె మద్ర — ఎ; న గప్పి మద్ర — చ.

202\. 1. మాత్స్యధీశులు — ఈ; మత్స్యాధీశులు — ఉ. ఏ; మాత్స్యపతులు — ఐ. క. గ. ఘ. జ. ద. హ; మత్స్యపతియు — ఒ. ఖ. గ. డ. ర. 2. సహాయంబు — పెక్కు ప్రతులు.

203. తే. భీమసేనుండు నేఁడు సంగ్రామమునకుఁ, [1]దీఱుదల యగుఁ గా కని తీవ్రకోప
దీప్తుఁ డై గద [2]సూచుచుఁ దేరు నీదు,తనయునకు [3]సమ్ముఖంబుగఁ.
దఱుముఁటయును.

204. క. నీకొడుకు లందఱును వెఱ, నాకులతం [1]బొంది రప్పు డగ్రజుఁడు గజా
[2]నీకఘను మగధు వీరో,ద్రేకంబునఁ బనిచె మారుతిం దలపడఁగన్.

205. వ. పనుచుటయు నతం డురవడించిన.

206. చ. గజఘటలం గనుంగొని వికాసము మోమునఁ [1]బల్లవింపఁగా
భుజశిఖరంబునందు గద పూన్చి మదంబునఁ దేరు డిగ్గి వా
యుజుఁడు గడంగి భీషణసముద్ధతిమైఁ దలపడ్డఁ బర్వత
[2]వ్రజముపయిఁ వెసం గవియు[3]వాసవుచందము దోఁచె నత్తఱిన్.

207. క. నిజసింహనాదమున [1]న,గ్గజములు గుండియలు వగిలి కలగుండు వడ
విజయాగ్రజుఁ [2]డి ట్లేఁచి ది,విజవర్గము పిచ్చలింప విస్ఫురితగతిన్.

208. వ. విక్రమవిహారంబునకుం జొచ్చె నప్పుడు ద్రౌపదేయులు నభిమన్యుండును గవలును ధృష్టద్యుమ్నుండును గరిసముత్కరంబుపై శరనికరంబులు నిగిడించుచు భీముని నిరుగెలంకులం [1]జేసి కవిసి రందు నకులనందనుం డగు శతానీకుండు హస్తికులమస్తకంబులు భల్లంబుల డొల్ల [2]నేయుచు నడరె నట్టియెడ.

---

203. 1. తెరుగడ – ఓ. శ; తీరుగడ – త. వీ. స. 2. సాచుచు – అ. ట. న. మ. వ. శ; పూనుచు–ఈ; నూనుచు – క; బూనుచు–ప, ఘ. ఝ; జూచుచు – చ. ప. 3. సమ్ముఖంబుగా – పెక్కు ప్రతులు; సన్ముఖంబుగ – ఊ. చ. న.

204. 1. బొంద కా(గా)రవాధిపు – ఉ. ఏ. ఔ. చ. 2. నీకమును – పెక్కు ప్రతులు; నీకపుగమి – స; నీకమున – ఘ. ప; నీకముఘన – ఔ. గ. త. ద. ల.

206. 1. దొంగలింపగా – ఉ. ఎ. ఒ. ఔ. త. 2. వ్రజములపై – పెక్కు ప్రతులు. 3. వాసవ శక్తియు బోలె నత్తరిన్ – జ.

207. 1. నగ్గజముల – పెక్కు ప్రతులు. 2. డ ట్లేచి – పెక్కు ప్రతులు.

208. 1. జేరి – పెక్కు ప్రతులు. 2. నేయుచు – గ. ట. వీ. శ. ష.

209\. చ. మగధమహీశుఁ డేచి యభిమన్యుని[1]పైఁ గరిఁ [2]గొల్పి నుజ్జ్వలం
బగు నొకనారసంబు దొడి యాతఁ డుదగ్రత ఫాలకుంభసం
ధిగతము గాఁగ నేయ నది దీనత మ్రొగ్గఁగ నప్పు డక్కజం
బుగ వెస మాగధుం దునిమె భూస్థలి నయ్యురుపీనుఁగుం బడన్.

210\. క. ధృష్టద్యుమ్నుఁడు నుజ్జ్వల, [1]దష్టాపదపుంఖమార్గణావళి నయ్యు
త్కృష్టగజఘటలఁ [2]గలఁచె న,వష్టంభవిజృంభణంబు వైరులు వొగడన్.

211\. ఉ. కొన్నిటి హస్తముల్ [1]సదియఁ గొన్నిటిఁ గొమ్ములు దుమ్ము [2]దూళిగాఁ
గొన్నిటిఁ గుంభముల్ వగులఁ గొన్నిటిఁ గాళులు నుగ్గునూచగాఁ
గొన్నిటిఁ బార్శ్వముల్ నలియఁ గొన్నిటి వీఁపులు [3]పిండుపీఁచుగా
[4]నన్నిటి భీముఁ డుద్భటగదాహతి నేనికవేఁట లాడఁగన్.

212\. క. అభిమన్యుద్రుపదసుత, ప్రభృతు లతనితోన మెలఁగి బడలువడఁగ న
య్యిభచయము నిశితవిశిఖ,తుభి[1]తముగాఁ జేసి రేపు సొంపారంగన్.

213\. క. [1]ద్విరదము [2]లొఱగెడివియు నె,త్తురు గ్రక్కుచుఁ [3]గూలెడివి
గదుపులై కలయం
దిరుగుడు వడియెడివియు భువిఁ, బొరలెడివియు నయ్యెఁ
బవనపుత్రుమునుమునన్.

214\. క. [1]ఏనుఁగునెత్తుట [2]గదయుం, దానుఁ దడిసి విలయకాలదండధరుని చం
[3]దానం బావని మాగధ,[4]సేనం బీనుంగుపెంటఁ జేసి చెలంగెన్.



---

209\. 1. పయిం – క. ఘ. న. 2. కొల్పె – న. బ. వ; కొల్పి – ఉ. క. త. మ.

210\. 1. దంష్ట్రారథ – ఐ. 2. గూల్చె నవ – ఉ. ఎ. చ. జ.



211\. 1. దునియ – ఇ. ఈ. ఎ. ఒ; దునిమి – ప. 2. ధూళిగా – పెక్కు ప్రతులు. 3. పెండిపిండిగా – ఆ. శ. ష; పిండి పీచుగా – అ; పిచ్చలింపగా – న; పిండలించగా – వ. 4. నన్నున – పెక్కు ప్రతులు.



212\. 1. తంబుగ – పెక్కు ప్రతులు.



213\. 1. ద్విరదంబు – పెక్కు ప్రతులు. 2. లొరలెడి – పెక్కు ప్రతులు. 3. (దూ) తూలె – ఊ. ఐ. గ. ఘ.

214\. 1. యేనిక – ఆ. ఉ. ఐ. ఒ. ఓ. ఔ. న. మ; యేనికె – ఇ. ద. వ; యేనుగ – ఎ. ఏ. ల. 2. గదయును – పెక్కు ప్రతులు. 3. దానను – ఉ. ఖ. త. జ. ల. 4. సేనను – ఏ.

215. క. శరములవేగంబున గద, పొరుసదనంబునను [1]గలఁగఁబడి [2]చేడ్పడ నా
కరులం దోలెసు భీముఁడు, వెరవున గోపకుఁడు [3]గదుపు వెలిచినమాడ్కన్.

216. క. పెనుగాలిఁ దూలు [1]మొగిళులొ,యన నిభములు [2]విఱిగి నిజబలావలి సదియం
దనమీఁదఁ జాఱ దుర్యో,ధనుఁ డదలిచి సర్వసైన్యతతిఁ [3]బురికొల్పెన్.

217. క. పతి పురి[1]కొలిపిన [2]నమవస, [3]నతిశయముగఁ బొంగు జలధి యనఁ గ్రమ్మినయు
[4]ద్ధతబలము [5]నిలిపె నమ్మా,రుతి [6]సెలియలికట్టక్రియ నిరూఢ[7]స్థితి యై.

218. వ. ఇట్లు నిలిపి యార్చి తఱియం జొచ్చువృకోదరునకుం దో డయి ధృష్ట
ద్యుమ్న సౌభద్రప్రముఖు లగు రథికజనంబులు.

219. క. విడువక [1]దాపట వలపటఁ, గడిమి మెఱయ [2]నిలిచి యపుడు కౌరవసేనం
గడుఁ జిక్కు వఱచి రొక్కు,మ్మడి నమ్ములవానఁ [3]గురిసి మద[4]మెలరారన్.

220. క. అడవి దరి[1]కొనినపావకు, వడువున భీముండు గౌరవ[2]వ్యూహంబుం
బొడి సేయుచుఁ జేర్చెం దన, యొడలు మనము నంతకంత కుబ్బుచు
నుండన్.

---

215. 1. గలయం – అ. ఆ. వ. 2. చేడ్వడు నా – పెక్కు ప్రతులు. 3. పసుల – ఉ. క. ఖ. ల.

216. 1. మొ (గి) గుళ్లో యన – పెక్కు ప్రతులు. 2. చెదరి – ఉ. ఎ; తిరిగి – ఇ. 3. గవియించెన్ – పెక్కు ప్రతులు.

217. 1. కొల్పిన – పెక్కు ప్రతులు. 2. మరలిన – ఆ. ఓ. ఔ. న; పున్నమ – ఊ. ఎ; మనసేనతిశయ – ఝ. ట. డ; సేనయు నతి – ఈ; మరలుచు – ష. 3. నతిశయమున – ఐ. చ. జ. ఝ. డ. మ. ల. 4. ద్ధతబలముల – ఆ. ఒ. ఓ. న; ద్ధతిబలము– పెక్కు ప్రతులు. 5. నిలిపెను మా – ఆ. ఒ. ఓ. జ. న. 6. చెలియలి కట్ట – న. బ. మ. శ. 7. తయెలరన్ – ఆ. ఓ. జ. న. వ. శ. ష; త మెరయన్ – ఔ.

219. 1. వలపల దాపట – ఒ. ఝ. ప. వ. 2. నడచి – ఉ. ఎ; నిల్చి రపుడు – గ. వ; నిల్చి యపుడు – ష. 3. గురిసె – పెక్కు ప్రతులు. 4. మలరారన్ – ఓ. ఖ. జ. న. వ.

220. 1. కొనెడి – ఇ. 2. వ్యూహములం – ఆ. ఎ. ఏ. ఐ ఓ. చ. మ; వ్యూహములన్ – అ. ఓ. గ. ట. డ. న.

221. క. [1]ఉరమునఁ గటిమైఁ దొడలం, [2]జరణములం గౌరవేంద్రు [3]చతురంగంబుల్.
ధరఁ జాఁపకట్టు పడ ని,ష్ఠురగతిఁ దాఁకుచు సమీరసుతుఁడు చరించెన్.

222. తే. తుంగమఁడువున నాఁడుమాతంగవిభుని, భంగి భవదీయసైన్యంబు బడలువడఁగ
లీల [1]నిస్సంభ్రమునఁ డయి కేలి [2]సలిపె, గాలిచూలప్పు గగనచరాలి పొగడ.

223. క. వెఱచఱచి [1]వెగడువడి ని,వ్వెఱఁ గందుచుఁ గురుబలంబు[2]పేరు లతనిడ
గ్గఱ కంత నంతఁ జూడఁగ, నుఱక నదీసుతుఁడు దాఁకె [3]నుద్భటభంగిన్.

224. క. అరదంబురవము సెలఁగఁగ, శరములు [1]వాయుజునిమీఁద సాంద్రముగ వెసం
గురియుచు నడరెడుభీష్ముని, సరభసముగ [2]మాఱుకొని యె సాత్యకి గడిమిన్.

225. వ. ఇ ట్లెదిర్చినం జూచి.

226. క. అంబరము వగుల నార్చి [1]జ,నంబు పొగడఁ గృష్ణునను జునకు మార్కొని తీ
వ్రాంబకములు పదియింట [2]న,లంబుసుఁడు దరంగకంబులం గీలించెన్.

227. వ. ఇవ్విధంబున [1]దాఁకి బెట్టు నొప్పించినం గోపించి.

228. చ. [1]శినిమనుమండు నద్దనుజు శీఘ్రము [2]నాలుగునారసంబులన్
వెనుక కొరుఁగఁ [3]జేసి పటువిక్రమ మొప్పఁగ నార్చె నార్చినన్

---

221. 1. ఉరమునను గటిని - ఇ. ఈ. ఊ. క. ఖ. ఝ. డ. ద. బ. 2. జరణంబుల - అ. ఈ. ఉ. ఏ. గ. ఝ. డ. జ; జరణములను - పెక్కు ప్రతులు. 3. చతురంగములన్ - పెక్కు ప్రతులు.

222. 1. నిశ్శంకితుండు నై - ఈ; నిస్సంభ్రమంబు గఁ (గా)-ఐ. న. వ. శ. 2. సల్పె - న. ప.

223. 1. పిడుగు వడ - మ. 2. వికలతతో డగ్గర - ఝ డ. 3. నుద్ధుర - పెక్కు ప్రతులు.

224. 1. పవనజుని - ఒ. ఖ. ఝ. ట. డ. 2. నతడు నొంచె శరపుంజములన్ - ఉ; దాఁకె నపుడు - ద.

226. జగంబు - వ. 2. నలంబసుడు - పెక్కు ప్రతులు.

227. 1. బెట్టుదాకి - పెక్కు ప్రతులు.

228. 1. శినివరు డప్పు డద్దనుజు - ఐ. మ. వ. 2. తొమ్మిది - ఎ. ఓ. చ. 3. నేసి - పెక్కు ప్రతులు.

విని కనుఁగ్రేవఁ [4]గెంపడర వీరరసోద్ధతిఁ [5]జూచి సోమద
త్తునినతయుండు [6]బి ట్టతనితోఁ దలపడ్డ నుతించె సైన్యముల్.

229. వ. ఇత్తెఱంగునం దలపడి.

230. క. భూరి[1]శ్రవుండు దొమ్మిది, నారాచము లతనిమేన నాటించిన నా
కౌరవ్యునిఁ బటువిశిఖా, సారంబున ముంచి నొంచె శైనేయుండున్.

231. ఉ. ఈసునఁ దానుఁ దమ్ములు నరేంద్రుఁ[1]డు గ్రందుగ [2]సోమదత్తికిన్
బాసట యై [3]కడంగ నట పాండవులున్ హరితమ్ముఁ గూడి పె
ల్లేసిరి వారి[4]పై నధిప యేత్తెఱమీఱ బకారి [5]యప్డు సం
త్రాసన[6]భాసురుం డగుచుఁ దాఁకి తెరల్చె భవత్కుమారులన్.

:- దుర్యోధనుఁడు భీముని మార్కొని మూర్ఛఁ బొందించుట :-

సం. 6_60_7

232. ఉ. తమ్ములు వీఁగినం బతి యుదగ్రత భీము నెదిర్చి[1] యార్చుచుం
దొమ్మిది [2]యమ్ములం [3]దనువు [4]దూఁటులు [5]నేసిన సూతుఁ బిల్చి వే
[6]గమ్మ [7]రథమ్ముపై [8]కరిగి కన్నుల నిప్పులు రాల [9]నవ్వి యొ
క్కుమ్మడి నాతఁ డేసె నృపు నుగ్రగతిం బదినారసంబులన్.

---

4. కెంపొదవ – ఊ; కెంపలరి – వ. 5. బోల్చి – ఘ; జేసి – ట: జూచె – వ. 6. బె ట్టతనితో – ఇ. ఊ. ఒ. క. గ. ఘ. చ. ద.

230. 1. శ్రవసుడు – పెక్కు ప్రతులు.

231. 1. డుదగ్రత – జ; 2. సోమదత్తికిన్ – పెక్కు ప్రతులు; 3. కడంగె – పెక్కు ప్రతులు. 4. మీదధిప – ఎ. 5. భూరి – ఇ. ఈ; వైరి – ఉ. మ; యేచి – చ. హ. 6. భాసితుం డగుచు – ఈ. ఘ. త.

232. 1. తాకినం – ఏ; తాకిదా – ఇ; యార్చినం – ట. 2. తూపులం – ఐ. మ. 3. ధనువు – ఆ. ఏ. ఐ. ఘ. ప. మ. ల. వ. 4. దూట్లుగ – ఆ. ఏ. ఓ. ల. 5. నేసిన – ఇ. గ. చ. 6. గమ్మ – పెక్కు ప్రతులు. 7. రథంబు – పెక్కు ప్రతులు. 8. కి జని – ఉ; కురికి – ఐ. మ. వ; కెగసి – జ; బరపి – డ. 9. నిల్చి – అ. ఏ. మ. వ.

233. సీ. అంతఁ బోవక సూతుఁ డగు[1]నందకుని మూఁడుశరముల [2]నేసిన ధరణినాథుఁ
డరువది[3]యమ్ముల నతని [4]నాతనిరథచోదకుం డైనవిశోకు మూఁటఁ
నఱిముఱి [5]నొ నేసి మఱియు నొక్కమ్మున ఘనశరాసనము ద్రుంచినఁ బ్రదీప్త
కోపుఁ డై [6]యొండొకచాపంబు [7]గైకొని యుగ్రభల్లమున వృకోదరుండు

ఆ. విల్లు దునుముటయును వేఱొక్కవింట [8]వజ్రంబుఁ బోని[9]నారసంబు [10]దొడిగి
[11]రాజరాజు [12]వెస నురం బాడ నేసిన, [13]మూర్ఛ [14]వచ్చి యతఁడు ద్రెుగ్గె నధిప.

234. క. కని కడు నలిగి సుభద్రా, తనయుడుఁ బాంచాలరాజతనయుఁడు [1]గృష్ణా
తనయులు నొక్కుమ్మడి నీ, తనయునిఁ బొదివిరి పటుప్రదరపుంజములన్.

235. ఉ. అంతకు నేద దేఱి [1]విలయాంతకు [2]నాకృతి భీముఁ డేచి దు
ర్దాంతపరాక్రమస్ఫురణఁ దాఁకి నరేంద్ర[3]తనూజు శల్యు న
త్యంతరయంబునం బటుశరావలి [4]నొంచిన నీదు[5]సైనికుల్
సెంతలఁ [6]జేర రైరి బలుసింగముఁ గన్న గజంబు[7]లట్ల యై.

---

233. 1. నందనుని – క. ల. 2. నోనేసి – ల. 3. శరముల – ఘ. 4. నేసియు – ఊ. 5. నొప్పించి–ఇ. ఈ; నొకశేసి – వ; నొక్కవాలమ్మున నవలీల – ఏ. 6. రెండవ – ఊ; వేరొక – గ; వేరొక్క – ద. 7. వేకొని – అ. ఎ. ఘ. చ. ల; చే(జే)కొని – ఈ. ఖ. ఝ. డ. 8. వజ్రంబువోని – న. వ. మ. శ; వజ్రమ్ము – ఈ. ఒ. 9. నారసమ్ము – ఏ. ఐ; నారసమును – ఐ. న. 10. బూని – జ; దొడివి – ఓ. క. వ. 11. గాఢ్పుపట్టి యురము గాడగ – ఇ. 12. పేరురము గాడ – ఆ. ఎ. ఓ. న; పెరురంబు గాఁడఁగ నేయ – వీ. శ. ష. స; పెన్నురము గాడ – ఐ. ఝ. మ. 13. నొచ్చి – జ. 14. నొంది – ఒ. చ.

234. 1. గృష్ణార్జునులును – ఒ. ఔ. చ.

235. 1. ప్రళయాంతకు – ఊ. 2. కైవడి – అ. ఏ. చ. 3. భవత్తనూజున – ఖ. ఘ. ఝ. ట. డ. ల. 4. నించిన – వ; గప్పిన – ఖ. ల. 5. సైన్యమున్ – ఉ. 6. జెంద రైరి – జ. న. 7. లట్టు లై – పెక్కు ప్రతులు.

236. వ. అప్పు డపరాహ్ణం బయ్యెఁ దత్సమయంబున [1]భవత్సూనులు సేనాపతి సుషేణజలసంధసులోచనులు భీమభీమరథభీమబాహు దుష్ప్రధర్షదుర్ముఖులును వివిత్సు [2]ఏకటోగ్రాలోలుపసములు నీపదునలువురు బహుళశరంబు లడరించుచు కతనిం బొదివిన నజ్జరాసంధమర్దనుండు ఘనశార్దూలంబు [3]బాల మృగంబులం గని కవియుచందంబున నెదుర్కొని సేనాపతిశిరంబు భల్లంబునం ద్రుంచి బాణత్రయంబున జలసంధు నంతకాలయంబున కనిచి సుషేణు [4]వక్షస్థ్సలంబున వలుఁదనారసంబు నాటించి పడవైచి భీమబాహు నస్త్రపంచకంబునం జంపి యుగ్రునుత్తమాంగంబు వెడఁదవాతియమ్మునం గుండలమ్ముల[5]తోఁ గూల్చి భీమ భీమరథుల నొక్కమ్మడిం బెక్కమ్ములం గూల నేసి నగుచు మిక్కుట మ్మగుసాలుగమ్ముల సులోచనుం గీటడంగించిన.

237. క. వెఱవార లధికభీతిన్, దొలఁగి చనిరి భీష్ముఁ డేచి వీరరథికు లం
దఱఁ జూచి రాచకొడుకుల, [1]నఱుమాడెడు భీముఁ డిట్లు [2]నడుఁకం దగునే.

238. వ. అని పురికొల్పికొని తొడఁగునట్టియెడ.

239. క. [1]మిగిలి [2]పవమానసుతుపై, భగదత్తుఁడు [3]మత్త[4]గజముఁ [5]బఱపి యతని నా
శుగములఁ బొదివిన నమ్మెయి, [6]మొగిళులు రవిఁ [7]బొదువుదర్పముం
దలఁపించెన్.

240. చ. కని [1]యభిమన్యుముఖ్యు [2]లవికంపితవృత్తిఁ గడంగి యేసినం
దనువున [3]నెల్ల రక్త[4]జలధారలు గ్రమ్మఁగ [5]వారణేంద్రుఁ డే

---

236. 1. భవదీయసూనులు – పెక్కు ప్రతులు. 2. వికటోగ్ర – పెక్కు ప్రతులు. 3. నల్ప– ఏ; వాలు – ఐ. మ. స. 4. వక్షంబున – పెక్కు ప్రతులు. 5. తోడ – పెక్కు ప్రతులు.

237. 1. నురు – పెక్కు ప్రతులు. 2. నుడుకం – అ. ఐ. ఖ. గ. న. వ; నుడుగం – ఒ. ఘ. ఝ. ట. డ. వ; నురుకం – వ.

239. 1. మిగిలిన – అ. ఓ. జ. న. 2. పవనుని – అ ఓ. జ. న. వ. 3. భద్ర – ఖ. ఝ. ట. డ. ల; తన – క. బ. వ. 4. గజంబు – క. బ. వ. 5. వఱపి – శ. ష. 6. మొగుళ్లు – పెక్కు ప్రతులు. 7. గప్పు – పెక్కు ప్రతులు.

240. 1. యభిమన్య – పెక్కు ప్రతులు. 2. లతి – ఈ. ఒ. చ. ప. వ. 3. రక్త పూతములు ధారలు – చ. 4. మయ – ఈ. ఘ. 5. దానవేం – ఏ.

పున నెలయేఱు లొక్కమొగి [6]బోరనఁ [7]బెక్కడరంగ [8]లీలఁ గై
[9]కొని [10]ఘనకేళి సల్పునడగొండగతిం సముదగ్రమూర్తి యై.

241. క. కవిసి బలముఁ జంపఁగఁ బాండవయోధులు [1]నిల్వరించుటకుఁ జాలక టి
చ్చవడి[2]నఁ [3]గని [4]పెల్లుగఁ గౌరవసైన్యము లడరె నుద్ధురస్ఫురణమెయిన్.

242. తే. [1]అప్పు డుబ్బి దుర్యోధనుఁ డతిరయమునఁ, దేరు వఱపించి [2]మారుతిఁ [3]దెగువతోడఁ
గదిసి బలునారసంబు [4]వక్షమున నాట, వ్రాల్లఁబోవుచు సిడ [5]మతఁ డూఁత గొనియె.

243. వ. అయ్యవసరంబున.

## -: ఘటోత్కచుండు మాయాబలంబునఁ గౌరవసేనపై విజృంభించుట :-

సం. 6_63_40

244. క. మనసేన [1]పేర్చి [2]పెల్లార్చినఁ జూచి ఘటోత్కచుండు నెలఁగి జనకుఁ జే
కొని యిది మాయ ఘటింపఁగ, ననురూపం బైన[3]వేళ యని [4]తలఁచి వెసన్.

---

6. భోరున—పెక్కు ప్రతులు.; భోరన – అ. ఆ. ఇ. ఓ. ఔ. క. గ. ల; బోరున – ఝ. ట. న. మ. 7. బైక – బ. 8. లీలమై – ఝ. 9. కొన – ఆ. ఈ. ఏ. 10. నలిగేలి— పెక్కు ప్రతులు; నది గేలి – ఇ. వ; యటు గేలి – మ. వ; యును గేలి – జ; వడి కేళి – ఊ.

241. 1. నిలువరించు – పెక్కు ప్రతులు. 2. వెల్లగిలఁ – చ. 3. గతి – ద. 4. పెల్లున – ల; బెట్టుగ – ప.

242. 1. అట్టియెడ నాసుయోధను డతి – ఝ. ట. డ. మారుత తీవ్రగతిని – వ. 3. తేకు వడర – అ. ఏ; దీవ్ర మగుడు–ఇ; దేకువెసగ – ఘ; తెం (దెం) పు తోడ – ఎ. ఒ. ఔ. న. వ. శ. ష; దెళకు నడరి – ఝ; దెళసు (దేకు) వెడలి – ఖ. ఢ. 4. వక్షంబు నాట – కొన్ని ప్రతులు. 5. మాత డూత – ఐ. ద.

244. 1. యేచి – ఈ. ఘ; యడరి – ఐ. మ. వ; జూచి – ఒ. చ. ట. 2. యార్చుట యును – ఐ. మ. వ. 3. సమయ మని – పెక్కు ప్రతులు. 4. తలచె – ఐ. గ. చ. ట.

245. వ. కైలాస[1]శైలాకారంబును జతుర్దంతసారో[8]దారంబును నుద్దామ గమన దుర్వారంబును నగు [2]వారణంబు నెక్కి వజ్రజ్వాలాభీల[3]బహుదండుం డగుచు నయనసహస్రం [4]బొప్ప నప్పాండవులకుం దోడుపడ నైరావణారూఢుం డై యింద్రుండు చనుదెంచె ననుబుద్ధి వైరులకుం [5]బుట్టునట్టుగా నంజనవామనాది దిగ్గజంబు [6]లెట్టెట్టివి యని వినంబడు నాభంగి మత్తేభం బుల నెక్కి తక్కటి [7]దిక్పాలురపోలికం దోడిదానవులు గెలంకుల [8]నేతేరం గురుపతిపైఁ దోఁతెంచి యతని కడ్డుపడుభగదత్తుదంతిం బొదివి.

246. క. అమ్ముల [1]నేనుఁగుకొమ్ముల, నమ్మత్త[2]గజమ్ము [3]నొంచి యటిముటి మనసైన్యమ్మెల్లఁ [4]జదియఁ బఱచె భ,యమ్మున మొగతిరిగి దిక్కు [5]లద్రువ
నొరలుచున్.

247. వ. ఇట్లాభీలంబుగా భగదత్తుకుండాలంబుఁ దోలి [1]యురవడించి.

248. క. [1]దనుజపతి యేచి దుర్యోధనుదెస కడరుటయుఁ దత్త్వితామహుఁ డాచార్యున కిట్లను [2]హైడింబుఁడు, దనమాయా[3]గర్వమున నుదగ్రుం డయ్యెన్.

249. క. భగదత్తు [1]నెగిచి కౌరవ,[2]జగతీశ్వరుమీఁదఁ గవిసె సరభసవృత్తిం దగ నడ్డ తడయుట, మగఁటిమియే పొదువవలయు మనుజాశనునిన్.

---

245. 1. శిఖరా – ఊ. 2. నైరావతంబు – ఉ. 3. బాహుం డగుచు–పెక్కు ప్రతులు; దండబాహుం – ఇ. 4. బొప్ప పాండ – పెక్కు ప్రతులు. 5. బట్టు – వ. 6. లిట్టి (ట్టి) వని – ఇ. డ. వ; లెట్టి వని – ఈ. వ. 7. దిక్పాలకుల – ఈ. ఊ. ఎ, ఏ. క. 8. నడతేర – పెక్కు ప్రతులు.

246. 1. నేనిక – పెక్కు ప్రతులు. 2. గజంబు – పెక్కు ప్రతులు. 3. నొచ్చి – ఇ. ఖ. ఘ. చ. జ. 4. జడియ – అ. ఏ. ఐ. గ. ఘ. ట. మ; ఝడియ – త. 5. లద్రువం గడిమిన్ – ఏ; లద్రువఁగఁ (వడిన్) బెలుచన్ – ఇ. వీ. శ. ష.

247. 1. యురువణించిన – పెక్కు ప్రతులు.

248. 1. దనుజాధిపు డాదుర్యో – ఇ. 2. హైండంబుడు – ఆ. ఘ. దర్ప (వర్గ) మున– ఇ. ఈ. ఖ. ల.

249. 1. నొంచి – ఆ. వ; దే(నే)చి – ఇ. ఈ. ఐ. ఔ. జ. గ. ద. బ. 2. 2. జగతీపతి – పెక్కు ప్రతులు.

250. చ. తలఁకెడువాఁడు గాఁడు భగదత్తుఁడు భీమతనూజునితోడ ని
ట్టలముగఁ బోరఁ జాలు నకటా కరి[1]యోరువ దేమి సేయు వి
చ్చలవిడి భూవిభుం [2]గవిసె [3]సామజమున్ [4]వెస [5]నేయుఁ డంచు జో
దులకును [6]జేయి వీచి మును దోలె నతం[7]డు రథంబు [8]బల్విడిన్.

251. వ. ఆచార్యప్రభృతు లగురథికవరులునుం [1]గూడికొని కురుభూపతి [2]కడ్డపడి హిడింబానందనుపైఁ గ్రందు[3]కొని వివిధాస్త్రంబులు వర[4]గించి రంత నక్కడ నతనికిం దోడై యుధిష్ఠి[5]రాదిపాండవులును బాంచాల[6]మాత్స్య ప్రముఖదండనాయకులును బ్రతివీరులపై ననేకవిశిఖంబు[7]లు గురియ నప్పుడు పోరు ఘోరం బయ్యె నందు మందాకినీనందనుం [8]డమందపరా క్ర[9]మక్రీడం గాంతేయ[10]బలంబుఁ గనుపుగొట్టె నట్టియెడ నాఘటోత్క చుం [11]డుత్కటోద్దామవిక్రమాభిరాముం డగుచు సింహనాదంబు సేయ బృంహితో[12]దాత్తంబు లైన తదీయదంతావళంబులు నలి రేఁగి నీసైన్యం బుల బడలువడం జేసినం [13]గని గాంగేయుండు కుంభసంభవున కిట్లనియె.

252. క. ఈయనతో రణ మిప్పుడు, సేయఁగ మది [1]గొల్ప దస్త్రశిఖరికిఁ [2]జేరెం
దోయజమిత్రుఁడు నేఁటికిఁ, [3]బోయి మనము వత్త మెల్లిప్రొద్దున ననికిన్.

---

250. 1. యోర్వద (దె) యేమి - పెక్కు ప్రతులు. 2. గదిసె (సి)-పెక్కు ప్రతులు. 3. సామజముల్ - పెక్కు ప్రతులు. 4. వడ - ఝ. డ. 5. నేయు మంచు - అ. ఈ. ఏ. గ. ద. న. వ; నైదుమంచు - క. ఘ; నేయుటయ్యె - డ. 6. జేయు - పెక్కు ప్రతులు. 7. డరదంబు - పెక్కు ప్రతులు. 8. వ్రేల్మిడిన్ - ఏ; నివ్వ డిన్ - వ.

251. 1. గూడుకొని - పెక్కు ప్రతులు. 2. కినడ్డ - పెక్కు ప్రతులు. 3. కొన - పెక్కు ప్రతులు. 4. గించి రక్కడ - పెక్కు ప్రతులు. 5. రాదులగు పాండవే యులు - ఏ; రనకులసహదేవులును - ఖ. ఝ. ట. డ. 6. మాత్స్యాదిదండ - జ; మత్స్య - చ. న. బ. మ. వ. 7. లంగప్పి రప్పుడు - పెక్కు ప్రతులు. 8. డునమంద - ఇ. ఈ. ఏ. ఖ. గ. చ. త. ద. 9. మంబునగాం - ఝ. ట. డ. 10. సేనం గనుపు - ఎ. ఔ. క. 11. డుద్దామదారుణంబు లైన-ఎ; డుద్దామంబు లైన - పెక్కు ప్రతులు. 13. గనుంగొని - ఈ. ఏ.

252. 1. గొలుప - ఈ. ఊ. ఖ. మ. 2. డాసెన్ - పెక్కు ప్రతులు. 3. నై యని సాలింత మనిన నే గా కనుచున్ - ఘ;

253. ఆ. అనిన నట్లకాక యని ధనురాచార్యుఁ, [1]డప్పు డాత్మపక్షమైన [2]రథిక
కోటి కెఱుఁగఁ [3]జెప్పికొని యని సేయుట, నిశిపి తివియఁ [4]బంచె,
[5]బలము నెల్ల.

254. వ. ఇవ్విధంబున.

255. క. కౌరవ[1]బలములు [2]దిరిగిన, భేరీశంఖాదితూర్యభీషణరావో
దారపటుసింహనాద,స్ఫార[3]విలాసంబు లయ్యెఁ బాండవబలముల్.

256. తే. చిన్నఁబోయి నీకొడుకులు సేయఁగలుగు, దొరలు విడిదల కరిగిరి [1]పరగభీమ
సేనకొడుకు నగ్గించుచుఁ జెలఁగి వారు, చెన్నుసొంపారఁ జని
రాత్మ[2]శిబిరములకు.

257. వ. అని యిట్లు నాలవనాఁడు ధార్తరాష్ట్రులు దూలపోవుట సెప్పిన విని సంజ
యునకు నాంబికేయుం డిట్లనియె.

258. చ. [1]అనితల నీవు పాండుతనయావలి కెప్పుడు మేలు [2]చేయు నా
తనయులకుం బరాక్రమము తక్కువయుం [3]బ్రకటింప [4]విందు భీ
ష్ముని గురు శల్యుఁ దక్కఁగలశూరుల నెల్లను వారు సీరికిం
[5]గొన కిటు [6]లింతవా రగుటకుం [7]గత మెయ్యది నాకుఁ జెప్పుమా.

259. క. అనుటయు నాతం డిట్లను, విను మౌషధగుణము [1]మంత్రవీర్యము మాయా
జనితసమగ్రోద్ధతి గా, [2]దనఘా [3]నీ కేను మున్న యది యెఱిఁగింతున్.

---

253. 1. డపుడు దనదు – ఐ. మ. 2. యోధ – ఈ. 3. జెప్పుకొని – పెక్కు ప్రతులు.
4. బనిచె – పెక్కు ప్రతులు, 5. నిజబలముల – ఖ. ఝ. ట. డ.

255. సేనలు – పెక్కు ప్రతులు, 2. విరిగిన – పెక్కు ప్రతులు; దివిసిన – ఖ. డ. ల;
దివిరిన – వ. 3. విహారంబు – ఇ; విలోలంబు – ఉ. చ; విరావంబు – ఝ. డ.

256. 1. మరలి – పెక్కు ప్రతులు; దొడరి–ఫ. 2. సదన – ఈ. ఊ. ఏ. గ. ఘ. ఝ. ద.

258. 1. అనయము – ఈ. 2. చేయి – ఈ. ఖ. బ. ష; సేయు – ల. 3. ప్రకటించె
దిందు – ఐ. మ. వ. 4. వీడు – గ. 5. గొనరట యింత – ఇ. ఘ; గొనరట
యంత – ఈ; గొనరిటు – ఖ. ఝ. జ. ద. ప; గొనరయి రింత–వ. 6. వింత – ల.
7. తగ వయ్యది – గ; తెరు వెయ్యది – ద.

259. 1. మంత్రగుణము – ఉ. 2. తన పూనికె యేను మున్ను తగ నెరిగింతున్ – ఫ.
3. విను నీకు నేను నది – ఖ; వినుమేనునీకునది – జ. ఝ. ట. డ; విను మేలు నీకు
నది – ల; మున్నేను నీకు నది – ఐ. మ.

260. ఉ. పాడియు సత్యముం [1]గలరు పాండుతనూజులు నీదుపుత్త్రు ల
ప్పాడికి [2]నోడ రత్తెఱఁగు పాపము సేయఁగఁ [3]జూచి తీవు న
క్కీడిటు సేయ [4]కేలఁడుగు [5]గెల్వదె [6]ధర్మువు వారిగెల్పు మీ
[7]యోడుటయుం [8]ధ్రువంబు విదురోక్తులు [9]వింటిమి గాదె [10]యేర్పడన్.

261. క. నీయడిగిన[1]భంగిన గాంగేయు నడిగె నట్లు వారు గెలిచి చనినయా
రేయి కురునాథుఁ [2]డాతని, కాయన సెప్పినవిధంబు [3]నభివర్ణింతున్.

262. వ. భీష్ముండు దుర్యోధనున కిట్లనియెఁ దొల్లియుం బలుమాఱుం జెప్పుదుఁ బాండవులకు వాసుదేవుండు సహాయుండై యుండు నట్లగుట నెయ్యదియు నసాధ్యంబు లే దప్పరమేశ్వరు[1]మహాత్వం బున్నరూ పెఱింగెడువారు పెక్కండ్రు లే రెఱింగినవారల కాపదలు లేవు కౌంతేయు [2]లతని నెఱింగి యాశ్రయింతురు నీవు సరకుసేయవు వినుము చెప్పెద మానస సరస్సు [3]నుత్తరపర్వతంబు నగ్రప్రదేశంబున దేవతామునిగంధర్వాప్సరో గణంబులు గొలువం గొలువుండి కమలసంభవుండు.

263. తే. మణిగణోజ్జ్వల మైన విమాన మొకటి, యంబరంబునఁ గాంచి [1]సర్వాత్ముఁ డందు
[2]సన్నిహితుఁ డగు టెఱిఁగి హర్షంబు సంభ్రమంబుఁ దలకొన లేచి నమస్కరించి.

---

260. 1. గలుగు—పెక్కు ప్రతులు; గలగు — వ. 2. నోప — ఇ. ఈ. ఐ. ఖ; నోడిర — ల. 3. జూడ నీవు — ఓ; నీవు జూతువ — జ. 4 కేలగును — ఉ. 5. గెల్పది — ఏ. ఐ. మ; గెల్చుట — ఈ. గీడ్వడు — ఘ. 6. ధర్మము — అ. ఇ. ఈ. ఏ. గ. ఘ. ద. వ. 7. యోడమియున్ — ఘ. 8. ధ్రువంబ — ఏ. క. ఘ. 9. వింటిమ — అ. జె. ఖ. గ. ఝ. డ. ద. మ. ల; వింటిమె — ఎ. 10. యెప్పుడున్ — క. వ; యప్పుడున్—జ.

261. 1. క్రియనం (న) — ఆ. ఓ. జ; క్రియనగ్గాం — వ. 2. డతనికి నాయన — పెక్కు ప్రతులు. 3. నంత దెలిపెదన్ — గ. ద; నను వర్ణింతున్ — ఇ. ఊ; నను వర్తింతున్ — ఈ.

262. 1. మహాత్మ్యం — పెక్కు ప్రతులు. 2. లమ్మహాత్ము — ఖ. ఝ. ట. డ. ల. 3. నుత్తరంబున — పెక్కు ప్రతులు.

263. 1. సర్వాత్మకుండు — ఔ. ఘ. 2. సన్నిహితు డా యెరింగి — ఉ. ఎ. వ; సన్నిహితు డౌట యెరిగి — బ.

264\. క. లోకోత్పత్తి[1]స్థితివిల, యాకలనవినోదమునిగణార్చితగుణర
త్నాకల్పనిర్గుణాత్మక,శోకభయాపహ[2]పదాబ్జ శుభకరమూర్తీ.

265\. వ. అని మఱియు ననేకప్రకారంబుల [1]సంస్తుతించి యి ట్లని విన్నవించె.

266\. క. నారాయణ [1]నీ కేఁ గడు,[2]గారవమునఁ బుట్టి [3]యిజ్జగము [4]లన్నింటిఁ
సారమతిం గావించితి, నీ[5]రక్షణ వీని కెల్ల [6]నిలు వై యుండున్.

267\. క. ఇత్తఱి [1]మనుష్య[2]భువనం, బుత్తలపడుచున్న యది మహో్గ్రాసుర[3]దు
ర్వృత్తముల [4]నీవు కరుణా,యత్తమతిం [5]బుట్టవయ్య యదువంశమునన్.

268\. క [1]నరసఖుఁడ నీవు [2]సఖుఁడును, నర[3]లోకమునఁ జనించి నానాదైత్యే
శ్వరుల[4]దెసఁ [5]బీడ లుడుపుము, ధరణీభారంబు వాయఁ దాత్పర్యమునన్.

269\. వ. అని [1]వేఁడికొని వినతుం డయి యద్దేవుని[2]తోడినీడయుం బోని నరనామ
ధేయుం [3]డగుమహాపురుషుం బ్రార్థించిన నన్నారాయణుండునుం
గారుణ్యార్ద్రకటాక్షంబున వీక్షించి యట్ల యయ్యెడుం గాక యని యాన
తిచ్చి యంతర్ధానంబు సేసిన నక్కాలువువా రెల్ల నచ్చెరువంది.

---

234\. 1. స్థితిలయనా – పెక్కు ప్రతులు. 2. సమగ్రశోభనమూర్తీ – అ ఏ; పదార్థ
శుభకరమూర్తీ – క.

265\. 1. సంస్తుతించి యా విరించి – పెక్కు ప్రతులు.

266\. 1. నీయందును – ఐ. మ. 2. నారూఢిగ – ఆ. 3. యీ జగము – పెక్కు ప్రతులు.
4. లన్నిటిలోనన్ – ఐ. వ; లన్నిటికిన్ – పెక్కు ప్రతులు. 5. రక్షయ – పెక్కు
ప్రతులు. 6. నిలువై – ఏ. గ. న.

267\. 1. మునువలె – గ. 2. భవనం – ఊ. ట. 3. దుర్వృత్తులచేతను సుగుణా – ఖ.
4. నడప గరుణా – బ. 5. బుట్టుమయ్య – చ. టు; బుట్టవలయు – ల.

268\. 1. నరుడును నీవును సఖులుగ – గ. ద. 2. నరుడును – ల. 3. లోకంబున – అ.
ఉ. ఏ. ఔ. మ. వ. 4. వెస – శ. ష; యెడ – అ. గ. ఘ. చ. ఝ. డ. ద. వ.
5. రూపుమాపుము – శ. ష; భయములు – ఉ. ఏ. ఔ. చ.

269\. 1. వేడుకొని – పెక్కు ప్రతులు. 2. తోడనీడ యగునర – పెక్కు ప్రతులు.
3. డైన – పెక్కు ప్రతులు.

270. క. పరమేష్ఠి నీవు గడుఁద,త్పరతను వినయంబు సేసి [1]ప్రార్థించితి వె
వ్వరొకో వీరలు నావుడు, [2]సరసిరుహాసనుఁడు సెప్పె సంప్రీతిమెయిన్.

271. క. పరమమును లాదిపురుషులు, నరనారాయణులు వీరు నా కారాధ్యుల్
నరహితముగఁ బ్రార్థించితి, [1]ధరఁ బుట్టుం డనుచు దానిఁ దలకొనిరి దయన్.

272. క. ఇలఁ గ్రీడగఁ బుట్టినవీ,రలఁ గేవలమర్త్యు లని సరకు సేయనివా
రలు సెడుదు రెఱిఁగి భక్తిం, గొలచినవారలకు శుభ [1]మగును వినుఁ డెందున్.

273. వ. అని యెఱింగించి బ్రహ్మ దనలోకంబు[1]న కరిగెఁ గొలువువారలు నిజస్థానంబులకుం జని రిక్కడ నీకథ నారద[2]జామదగ్న్యవ్యాసాదులచేత వింటిం దొల్లియు మహామునులు నిన్ను నరనారాయణుతోడివైరంబు వలవ దని వారించిర కాదే నీవు [3]మదాంధుడవై మానవైతి వింకనైనను గృష్ణు నాశ్రయించి పాండవులతోడిపొత్తున [4]మెలంగి బ్రదుకు మని చెప్పి భీష్ముం డూరకుండెఁ గౌరవపతియు నప్పలుకులు పెడచెవులం బెట్టె మీరు దగువారు సేయుహితోపదేశంబు లాచరించెదరె యని పలికి సంజయుం [5]డమ్మహీపతి కి ట్లనియె.

-: భీష్మునిపంచమదివసయుద్ధక్రమము :-

సం. 6_65_1

274. క. వేగినఁ గౌరవసేనలు, వేగమ కై సేసి యనికి వెడలెం దీవ్రో
ద్యోగత భీష్ముని మున్నిడి, సాగరములు మేర దప్పుచందం [1]బొందన్.

---

270. 1. ప్రార్థించితిరె - పెక్కు ప్రతులు. 2. సరసిజ సంభవుడు - ఈ. ల; సరసీరుహాభవుడు - పెక్కు ప్రతులు.

271. 1. ధరణిం బుట్టు డని వారు దల - పెక్కు ప్రతులు.

272. 1. మగు న్విను డెందున్ - పెక్కు ప్రతులు.

273. 1. నకుం జనియె - ఇ. జ. న. బ; నకు బోయె - ఈ. 2. జామదగ్ని - పెక్కు ప్రతులు. 3. మానాంధుండవై -ఆ. ఖ; మోహాంధుండవై -గ. ద; వాక్యంబులు వినవైతివి - ఉ. ఎ. చ. 4. మని బ్రతుకు - పెక్కు ప్రతులు. 5. డవ్విభునకి - పెక్కు ప్రతులు; డమ్మహీ వల్లభునికి - ఇ. ఝ. డ. మ.

274. బలరన్ - అ. ఏ; బమరన్ - ఇ. క. ఝ. ఉ. ఊ. త; బరయన్ - ఊ. ఓ. ఖ. న; బయ్యెన్ - ఘ.

275. వ. ఇట్లు వెడలి మకరవ్యూహం బమర్చుకొని నిలిచె నంతఁ బాండవులును [1]శ్యేనవ్యూహంబుగా మోహరించి [2]రందు ముఖంబున భీమసేనుండును నయనంబుల [3]ధృష్టద్యుమ్నశిఖండులును శిరంబున సాత్యకియును గంఠంబునం గిరీటియు వామపక్షంబున విరాట్ద్రుపదులును దక్షిణపక్షంబునఁ గేకయులును వీఁపున నభిమన్యుద్రౌపదేయులును బుచ్ఛంబున నకులసహదేవసహితుం డయి యుధిష్ఠిరుండును నిలిచి రివ్విధంబున సన్నద్ధంబు లయిన యుభయవ్యూహంబులు మేదురతూర్యనినాదంబులు రోదసీకుహరంబు నిండ నొండొంటిం [4]గదిసిన.

276. క. మకరవ్యూహం బనియెడు, మకరాలయ మపుడు దర్పమహామోజ్జ్వలుఁడై
మకరక్రీడం జండత, మకరాభీలముగఁ జొచ్చె మారుతి యధిపా.

277. ఉ. చొచ్చి పితా[1]మహుం గని యిషు[2]ప్రచయంబునఁ [3]గప్పె నాతఁడుం
జిచ్చున [4]నేయి వోసినవిశేషము దోఁపఁగ భీము నొంచి ము
చ్చిచ్చు[5]ను నేర్చునట్టులుగఁ జేసె దదూర్జితసేన నంత వి
వ్వచ్చుఁడు వచ్చి దివ్యశరవర్గనిరర్గళవిక్రమంబునన్.

278. క. భీష్మునిగర్వం [1]బుడిపి మ,హోష్ముఁడై కౌరవేంద్రుయోధుల కెల్లన్
గ్రీష్మాదిత్యునిక్రియ న,ర్చిష్మత్త్వము సూపి యడరె సేన[2]లు దెరలన్.

279. వ. అట్టియెడ నీకొడుకు గురునిం [1]గదిసి యతని కిట్లనియె.

---

275. 1. క్రౌంచ – ఆ. ఓ. న. ప; శకట – ఐ. మ. 2. రమ్ముఖంబున – ఓ. న. శ. ష. 3. శిఖండి ధృష్టద్యుమ్నులు – పెక్కు ప్రతులు. 4. దాకిన – పెక్కు ప్రతులు.

277. 1. మహి న్వడి నిషు – ఇ. ఈ; మహుంగనదిషు – బ. వ. 2. ప్రచయంబుల – ఎ. ట. వ. 3. గప్పు – ఉ. ల. 4. నెయ్యి – పెక్కు ప్రతులు. 5. నటించు నట్లు గను – ఊ; నవెచ్చ నూలుకొన – అ. ఏ; నవెచ్చునట్టులుగ–ఖ; ల వేచునట్టులుగ–గ; న జేర్చినట్టులుగ – ఘ; న చేర్చునట్టులుగ – ద. శ. ష.

278. 1. బెడపి – ద; బుడిపె – ఉ. ఖ. 2. లు గలగన్ – ఇ. ఈ; ల నెల్లన్ – గ; లు దలకన్ – ప.

279. 1. జేరి – పెక్కు ప్రతులు; జూచి – జ; గూడి – ఊ.

280. తే. పట్టి [1]పాలార్చెదరు మీరు పాండుసుతుల, నీవు భీష్ముండు నలిగిన దేవతలకు
[2]నైన మార్కొనవచ్చునే [3]సేన నరుఁడు, [4]నొంపగా నిట్టు లొప్పరికింపఁ
దగునె.

281. వ. అనిన విని కుంభసంభవుండు గటకటం బడి యతనితో ని ట్లనియె.

282. తే. ఎన్నఁడును మున్ను వారలయేపు నోపఁ, గాన [1]మెట్లు సముద్రంబులోన
బుట్టి
వైవఁ [2]గొన్నంత గొనుఁ గాక వారి [3]గెల్వ, మాకు [4]శక్యంబె చవి
గానిమాట లేల.

283. క. అనుచు మొన [1]గడచి [2]నడచినఁ, గని పాండుతనూజునై నిక[3]వ్రాతంబుల్
[4]గనకని [5]విచ్చిన సాత్యకి, యనిలజవం బెసఁగఁ దాఁకె నస్త్రాచార్యున్.

-: ద్రోణుండు దుర్యోధనప్రేరితుం డై పాండవసైన్యంబుపైఁ గవియుట :-

సం. 6_65_21

284. సీ. తాఁకి యుజ్జ్వలబాణతతి [1]గవియించిన నవ్వుచు బెడితంపు[2]నారసములు
గురుఁడు శైనేయుపైఁ గురిసిన నొచ్చియుఁ దెరలక యాతండు తీవ్రభంగిఁ
బెనఁగంగఁ జూచి పావని [3]యేచి [4]గురునిపై నిశితాస్త్ర[5]సంతతి నించి
[6]నొంచె
నంత శల్యుండును శాంతనవుండు నతనికిఁ దోడ్పడి యడరి భీము

---

280. 1. పల్లార్చెదరు – మ. వ. 2. నయిన – ఎ. 3. నరుడు సేన – ఎ. మ. 4. నొప్ప – ఆ. ఈ. బ.

282. 1. మోటు – ఆ. 2. గొన్ని(న్న)న్ని – అ. ఘ. చ. ఝ. ఠ, డ. బ. 3. గెలువ – పెక్కు ప్రతులు. 4. శక్యమె – పెక్కు ప్రతులు.

283. 1. గడచి – న. మ. 2. నడిచి – బ. మ. 3. వ్రాతములున్ – ఇ. 4. గనుగొని– ఏ. ఐ. మ. వ; కని కను – చ; కని కని – ల. 5. పేర్చిన – ఫ; నిలిచి(ల్చి)న – ప: వచ్చిన–మ.

284. 1. బ(ప)రగించిన – ఈ. ఉ. ఐ. మ. ల; గదియించిన – త. వ. 2. నారప మున – వ. 3. యును – ఏ. గ. 4. ద్రోణుపై – పెక్కు ప్రతులు. 5. ములు పెక్కు – క. వీ. శ. వ. ష. 6. యార్చె – అ. ఏ.

ఆ. నేయఁ దొడఁగుటయును నే_త్తెఱ ద్రౌపదేయులును దానఁ గవిసి
యుగ్రలీలఁ
[7]బటు[8]రయంబు [9]మై [10]సుభద్రాసుతుండు దుర్వారవిశిఖ[11]తతుల
వారిఁ బొదివె.

285. చ. కడువడితోడ నప్పుడు శిఖండి ధనుర్గుణనిస్వనంబు పె
ల్లడరఁగ బాణజాలము [1]వియత్తటిఁ గప్పఁగ నీదు[2]సైన్యముల్
సుడివడ భీష్ముఁ దాఁకుటయుఁ జూచి మనంబున [3]నాఁట దానితోఁ
బొడుతునె యంచు మార్కొనక పోయెఁ [4]దొలంగి యతండు భూవరా.

286. క. కనుఁగొని [1]కురుపతి యాచార్యునిఁ బురికొలుపుటయు నాతఁ డుద్దామగతిం
జని కడిమి మెఱయ నుజ్జ్వలఘనమార్గణ[2]పుంజముల శిఖండిఁ దెరల్చెన్.

287. క. అమ్మెయిఁ గౌరవులును దర్ప మ్మలరఁగఁ జెలఁగుటయును
బాండవబలముల్.
[1]సమ్ముఖమునఁ దలఁపడినను, సమ్మర్దం బుగ్ర మయ్యె సంగ్రామమునన్.

288. క. [1]ధూళుల మేఘంబులుఁ గరవాలాదినిశాత హేతివర్గాంశుతటి
న్మాలయు గుణ[2]రవగర్జలుఁ, [3]గీలాలపువృష్టికిం దగియె నట్టియెడన్.

---

7. బరగరయము - అ; బంటితంబు - మ. 8. రయము మెరయ - వ. 9. మెయి-
జ. ట. ద. మ. 10. సుభద్రపట్టియును - ఆ. ప. వ. 11. శిఖల - అ. ఎ. ట. వ;
ములను - ఝ. డ; వృష్టి - శ. ష; పంక్తి - ప.

285. 1. వియత్స్థలి - ఆ. ఇ. ష; వియత్తలి - ఉ. న. మ. శ; వియన్నది - గ. ద.
2. సైనికుల్ - పెక్కు ప్రతులు. 3. నాటి - ట. 4. నతండు దొలంగి - ఈ. ఓ.
గ. ద. న. బ. వ.

286. 1. భూవరు డాచార్యుని - ఇ. ఈ. 2. పుంజమున - పెక్కు ప్రతులు.

287. 1. గ్రమ్మరుటయు నా రెంటికి - ఎ. చ; కమ్మరఁ దలఁ పడియెను వడి - శ. ష;
సమ్మదమున - త.

288. 1. తూలిన - ఆ. ఈ. ఊ. ఏ. ఔ. ఝ. డ. న. బ వ; ధూళియు - పెక్కు ప్రతులు.
2. గర్జంబులుం - ఆ. ఓ. 3. వ్రాలిన వర్షాగమంబు వడువున నొప్పెన్ - ఝ. డ

289. క. ప్రోవులు గట్టినగుఱ్ఱపుఁ, బ్రేవులు నేనుఁగుల తఱచుఁబీనుంగులు [1]ర
క్తావిలత వెల్లచీరలు, గావులు [2]నై భటనికాయ[3]కాయంబులు నై.

290. క. సమరాంగణంబు గడుఘో,రముగా నిరువాఁగుఁ బోరురభసంబున ది
క్సమితి [1]వడఁకాడెఁ బొగడెడు, నమరులయులి వడరెఁ జదల
నతి[2]నిబిడముగాన్.

291. క. అనిలజభీష్ములు దమతమ,మొనలకుఁ గన్నాకు లగుచు మునుకొని వడి న
ర్జునకుంభసంభవులప్రా,పునఁ [1]జూపిరి విక్రమంబు భూరిబలంబున్.

292. క. భీమునిదెసఁ గాళింగో,ద్దామగజానీక[1]సంగతత్వస్ఫురణా
భీమగతిం [2]దఱిమెం గురు,భూమీశుఁడు భీష్మ[3]గురులు [4]పోరెడుబలిమిన్.

293. చ. అఱిముఱి నీ[1]కుమారవరు లత్తఱి నందఱు నాబకారిపై
నుఱక [2]రథంబులం బఱప నుజ్జ్వలశైలము మేఘబృందముల్
గిఱికొనఁ [3]గప్పిన ట్లయినఁ గ్రీడి గుణ[4]స్వన ముల్లసిల్ల నే
త్తెఱ విశిఖప్రతాన మనుతీవ్రసమీరము నేపు సూపినన్.

294. క. ఆరథ[1]నివహంబులు న,వ్వారణములుఁ దెరలి మరలి వడిఁ బఱచుటయుం
గౌరవబల మెల్లను రణ,శూరుఁడు గాంగేయుమఱువు సొచ్చె వికల మై.

---

289. 1. రక్తావలి (ళి) నెల్ల – క. గ. ద. 2. నై వీరభట కాయంబు – వ. 3. కాయం బెల్లన్ – ఎ. ఘ. ఝ. డ.

290. 1. వణకాడె – పెక్కు ప్రతులు. 2. విశదముగన్ – ఐ. మ. వ.

291. 1. బొలిచిరి – ఝ; జల్పి (లిపి) రి – న. బ.

292. 1. సమ్మదత్వస్ఫురణా – ఉ. ఎ; సమర తత్వస్ఫురణా–త; మాగధత్వస్ఫురణా – న. 2. దరిమెను – అ. ఈ. ఏ. ద. ప; గవిసెం – క. 3. గురుల – అ. ఆ. జ. ట. బ. మ. వ. ష. 4. బొదివెడు – మ.

293. 1. కుమారకులు నత్తరి – పెక్కు ప్రతులు; కుమారులకు నత్తరి – ఐ. ఘ. మ. వ. 2. శరంబులుం – అ. 3. నొప్పిర – జ; జేరిన – న. 4. ధ్వనియు – ఎ. క. న. వ.

294. 1. బృందంబులు – అ. ఆ. ఎ. ఔ. వ. శ. ష.

295. వ. ఇట్లు సేన మొగతిరిగినం గని సుయోధనుండు బరవసంబునం బురి[1]కొల్పి
చేయి వీచుచు నగ్గలిక నడచినం గాంభోజగోపాలసింధుగాంధారసౌవీర
త్రిగర్తకళింగప్రముఖబలసంగతు లై శకునిసైంధవులు దుశ్శాసనుం బుర
స్కరించికొని యురవడించి భీమపార్థులం బొదివిన ధర్మనందనుండు వెన్ను
దన్ని యదల్చినం జేదికాశికరూశ[2]పాంచాల సైన్యంబులతో ధృష్టద్యుమ్న
పురోగము లగురథికముఖ్యులు గడంగి కవిసి రప్పుడు విందానువిందులు
గాశిరాజును సైంధవుండు భీమసేనుని వికర్ణుండు సహదేవునిఁ జిత్రసేనుండు
శిఖండిని దుర్యోధనుండు విరటునిఁ ద్రిగర్తులు నకులుని ద్రోణుండు చేకి
తానసాత్యకులను గృపహార్దిక్యులు ధృష్టద్యుమ్నుని సౌభద్రుండు సాల్వ
కేకయులను ధృష్టకేతుఘటోత్కచులు నీకొడుకులం దలపడిరి యుధిష్ఠి
రుండు దాను మద్రేశ్వరుం దాఁకె నిట్లు సంకులసమరం బైన నస్త్రశస్త్ర
సంఘట్టనంబున వెడలుమంటలు మింట నడరి మధ్యాహ్నప్రచండంబు లై
యున్న చండకిరణుకిరణంబుల మగిడింప నరదంబులు దాఁకి పడి పొరలు
కరులును గరిహస్తాకర్షణవిధ్వస్తంబు లగురథంబులును దురగఖురపుటవి
ఘట్టితగాత్రు లగుపదాతులును బదాతివర్గానర్గళప్రహారధారాళరక్త
సిక్తంబు లగుఘోటకంబులు నై చూచుఖేచరులకు వెక్కసం బయ్యె
నట్టియెడ.

296. క. భీముని[1]పోరుట గడును,ద్దామం బై మెఱయుటయుఁ బితామహుఁడు శర
స్తోమవిదారితుఁ జేసె మ,హా[2]మర్షోత్కర్షుఁ డగుచు [3]నతనిం బెలుచన్.

297. క. కనుఁగొని సాత్యకి యేనుం,గునకు [1]సిడులు సూపినట్లు కోపంబున భీ
ష్మునిమీఁదఁ గవిసి యుజ్జ్వల,సునిశిత[2]భల్లంబు లేసె సురలు నుతింపన్.

298. ఆ. [1]అలికి [2]యతఁడు సూతుతలఁ దెగ [3]నేసిన, నధిప వృష్ణివీరునరద మిట్టు
[4]నట్టుఁ [5]దిగిచె నప్పు డాకులగతి ఘోట,కములు దద్బలంబు గలఁగఁ బడఁగ.

---

295. 1. కొలిపి – పెక్కు ప్రతులు. 2. పాంచాలాది – పెక్కు ప్రతులు.

296. 1. పోరున – ఝ. డ; పోరును – వ. 2. మర్దనశీలు డగుచు – అ. 3. సమ్మద లీలన్ – ఈ.

297. 1. సిళ్లు జూపినట్లు – పెక్కు ప్రతులు. 2. బాణంబు – ఈ. శ. వ.

298. 1. అలిగి – పెక్కు ప్రతులు. 2. యతని – ఈ. ఐ. మ. 3. వ్రేసిన – పెక్కు ప్రతులు. 4. నట్లు తిర్గి తిరిగె నాకులబడి – అ; నట్లు వీగి తిరిగె నాకుల – ఆ. 5. దిగిచి తిరిగెనా – పెక్కు ప్రతులు.

299. క. మరలుపుడు పట్టుఁ డిట తెం, డరదమునకు వేగ[1]వేగ యడ్డము [2]సనుఁ డా
తురుఁ డయ్యెను సాత్యకి సె,చ్చెరఁ [3]జొరుఁ డనునులివు వారిసేనఁ
జెలంగెన్.

300. తే. వికలరథుఁ డగునావృష్ణివీరుమీఁద, నేయ నొల్లక మీఁతండ్రి యెసక మెసఁగ
బాహుబలమునఁ బాండవవ్యూహవిదళ,నంబు సేయఁ దొడంగె
భూనాథముఖ్య.

301. క. అంత విరాటుఁడు లయకా,లాంత[1]కుఁడుంబోలెఁ జేర్చి యతిరభసమునన్
శాంతనవుఁ గదిసి యేసెం, గుంతీసుతు లలర మూఁడుక్రూరాస్త్రములన్.

302. క. ఏసి తురంగంబుల నో,నేసినఁ గోపించి భీష్ముఁ డిషుదళకమునం
జేసె నతని రక్తజలో,ద్భాసితగాత్రుఁడుగ రెండుబలములుఁ బొగడన్.

303. వ. అట్టియెడ.

304. శా. గంగానందనుఁ దాఁక నర్జునుఁడు [1]వోఁగా నడ్డమై రాజు మె
చ్చం గేలీగతి యుల్లసిల్లఁ జని యశ్వత్థామ షడ్బాణవి
ద్ధాంగుం జేసెఁ గిరీటి నవ్వుచుఁ దదీయం బైనచాపంబు ద్రుం
చెం గోదండము వే యొకండు గొని యేసెన్ ద్రౌణి పెక్కమ్ములన్.

305. క. గురుసుతు బెడిదపుటంపలు, నరనారాయణులు [1]నొచ్చినన్ నరుకడక
న్నరుణం బగుటయుఁ దద్రుచి,పరంపరలతోన నిగిడె బాణచయంబుల్.

306. క. ఉఱక నరుఁ డట్లు మైమఱు, వఱువుళ్లుగఁ జేసి లీల నంగము నెల్లం
బఱియలుగఁ జేయ నాతం,[1]డఱుమెడలక మఱియు నేసె నధికరయమునన్.

---

299. 1. వేగనడ్డము – పెక్కు ప్రతులు. 2. సొరుడా – క. గ. ట. త; చొరుడా – ఈ. 3. జను దను – ఆ; బొండను – ఇ; జూడుం డనుచు వారి – డ; జనుడే యనుచు వా – మ.

301. 1. కుడును – పెక్కు ప్రతులు.

304. 1. బోగా – అ. ఇ. ఝ. ట. డ; పోగా – ఎ. ఓ. చ. ల; రాగా – ఘ.

305. 1. నొంచె నన్నరు – గ; నొంచి నన్నరు – బ.

306. 1. డఱుఁదలఁకక – స.

307\. క. నొచ్చియుఁ బెనఁగినఁ గృపయును, మెచ్చు గదిరి విప్రుతోడ [1]మెయికొని పోలి
ట్లచ్చుపడ నేటి కని వి,వ్వచ్చుఁడు[2]గ్రీడించి యొండువలనికి [3]నడచెన్.

308\. వ. తదనంతరంబ.

309\. ఉ. భీముఁ డుదగ్ర[1]దర్పమున భీష్మునిపైఁ జన నడ్డమై కురు
గ్రామణి భల్లపంచకయుగంబున నాతనిమేను [2]సించుడుఁ
భీమదృఢకురప్రచయభిన్న[3]తనుండుగఁ జేసె నాతఁ డా
భూమిపు నిట్లు నీదు ప్రియపుత్రకు లొండొరుతోడఁ బోరఁగన్.

310\. వ. కనుంగొనుజనంబులు.

311\. క. చండవిరోధితిమిరమా,ర్తాండు [1]లనఁగఁ దగినవీరు దమలో ని ట్లు
ద్దండతఁ [2]బెనఁగుట ధృత[3]రా,ష్ట్రుం డవినయలోభముష్కరుం డగుటఁ జుమీ.

312\. వ. అని రట్టియెడ.

313\. క. కురుపతికిఁ జిత్రసేనుఁడుఁ, బురుమిత్త్రుఁడు వేల్పుశేటి పుత్త్రుఁడుఁ బ్రాపై
యురవడిఁ దటిమిన వారికి, నరనందనుఁ [1]డెదురుపడె గుణధ్వని సెలఁగన్.

314\. క. పురుమిత్త్రుని నే డుజ్జ్వల,శరముల గంగాతనూజు సప్తతిబాణ
స్ఫురణమునఁ జిత్రసేనునిఁ, బరమాంబకదశకమున [1]విపాటితుఁ జేసెన్.

---

307\. 1. మెయి మెయి – పెక్కు ప్రతులు. 2. గేడించి – పెక్కు ప్రతులు; కేడించి – అ. ఎ. బ. 3. జనియెన్ – ఈ. ఏ. క. జ. ఝ. త. ల; బోయెన్ – ఉ. ఒ.

309\. 1. కోపము – ట. 2. చించు – పెక్కు ప్రతులు; నించినన్ – గ; సించినన్ – ద. 3. శిరస్కుని – ఓ. న. వ.

311\. 1. లనం దగి – పెక్కు ప్రతులు; బోదగిలి–జ. 2. బోరుట – ఈ. ఎ. 3. రాష్ట్రుండు వినయ – ఈ. ఉ; రాష్ట్రుండు మహాలోభ – శ.

313\. 1. డడ్డ పడి – ఉ. గ; డడ్డ పడె – శ. ష.

314\. 1. ను భాధితు – అ. ఔ మ. వీ. శ. ష. స; విభాసితు – ఇ. ఏ; నివారితు – ఒ. ఓ; ను బాయగ – న.

315. తే. ఎన్ని శరముల నభిమన్యుఁ డేసెఁ దమ్ముఁ, దారు నన్ని[1]యు
శరములఁ దరిమి చిత్ర
సేనపురుమిత్త్రు లతని నేసిరి [2]నవోగ్ర,విశిఖములు నాఁటె భీష్ముఁ డప్పిరు మేన,

316. ఉ. అతఁడు చిత్రసేనునిశరాసన మేర్తైఱఁ ద్రుంచి ఘోటక
వ్రాతము నొంచి మైమఱువు వ్రచ్చి శరంబులు మేనఁ గ్రుచ్చి యు
ద్ద్యోతితుఁ డైనఁ జూచి కర ముద్ధతి రాజ[1]తనూజ[2]వర్గముల్
వే తఱియంగఁ జొచ్చి పొదివెం [3]బటుమార్గణ[4]వృష్టి నాతనిన్.

317. క. ఆ[1]సౌభద్రుం డుగ్రపు,వేసవిదావాగ్ని శుష్క[2]విపినమ్ముకు [3]నిరా
[4]యాసంబుగ దరికొనుగతి, భాసితశరశిఖలు వారిపైఁ [5]బరగించెన్.

318. క. [1]రంగత్ప్రథనస్తుత్య[2]తు,రంగముఁ డై తాండవాభిరతుఁ డగుహరులీ
లం గడఁగి వీర[3]నృత్యము, సంగరరంగమునఁ [4]జేసె శత్రులు [5]మెచ్చన్.

319. వ. [1]ఇట్లు పేర్చి కురుబలంబు నేర్చునభిమన్యుఁ జూచి [2]జనితమన్యుం డై శుభలక్ష
ణుం డగులక్ష్మణుండు.

---

315. 1. బాణంబుల – పెక్కు ప్రతులు. 2. మహోగ్ర – ఐ, ఒ; తీవ్రోగ్ర – జ.

316. 1. కుమార – ఎ. క. ఘ. వ. 2. వర్గమున్ – పెక్కు ప్రతులు. 3. ఘన – ఈ. 4. పుంజముల్ వడిన్ – గ; వృత్తి – ఐ. చ. మ. వ.

317. 1. సౌభద్రుడు వేగపు–ఆ. ఎ. ఔ. చ. వ; సౌభద్రుడు వేగమ – మ. ల; సౌభద్రు డమోఘ (గ) పు – ఇ. ఊ. క. ఖ. ఝ. డ. ద; సౌభద్రు డునగ్రత – ఈ; సౌభద్రుడు మనమున – ఘ, సౌభద్రుడు మగటిమి–జ. ట. 2. విపినంబు – పెక్కు ప్రతులు. 3. ననా – అ. ఐ. మ. ల. 4. యాసంబున – పెక్కు ప్రతులు. 5. గురియించెన్– ఏ. క. వ; గవియించెన్ – శ. ష; నిగుడించెన్ – ప.

318. 1. రంగద్రథసం – పెక్కు ప్రతులు; రంగత్ప్రథసం – మ. ల; రంగద్దృఢసం – అ. ఏ. గ. 2. తురంగుం డై–ఒ. ఖ. ఝ. డ. 3. కృత్యము – అ; నృ(వృ)త్తము – ఐ. బ. మ. ల. వ. 4. జూపె – ఈ. 5. దలకన్ – ఊ. ఒ.

319. 1. ఇట్లేచి – ఓ. ఔ. వ. శ. ష. 2. జన్యమనస్కుం డై – ఝ. డ.

:- అభిమన్యు లక్ష్మణకుమారుల యుద్ధము :-

సం. 6_69_30

320. క. తలపడి నానాస్త్రము ల,గ్గలికం గురియుటయు నతఁడు కాండము లా ఱ
ట్టల [1]మైనయలుక నాతని,లలితోరస్థ్సలమునం గలయ నాటించెన్.

321. చ. తెరలక లక్ష్మణుండు దృఢదీప్త[1]శరావలి పార్థుపట్టిపైఁ
దొరఁగఁగఁ జేసినం గినిసి తొల్తహయంబులఁ జంపి సారథిన్
ధరఁ బడ నాతఁ డేసె విరథత్వము [2]నొందియు నీదుమన్మఁ డు
ద్ధుర[3]గతి శక్తి వైవ నది ద్రుంచె మహేంద్రునిమన్మఁ [4]డమ్ములన్.

322. ఆ. శక్తిఁ [1]ద్రుంచి తీవ్రసాయక[2]హతదేహుఁ, జేయఁ దొడఁగునతనిచేతి[3]బలుపు
సూచి కృపుఁడు రాజసుతుఁ దన[4]తేరిపై, [5]నిడి [6]తొలంగఁ దెచ్చె
[7]నెల్లఁ జూడ.

323. క. [1]కురురాజు [2]యోధవీరులఁ, బురి[3]కొలుపుచు భీష్ముఁ డపుడు పోరి[4]కి నడరం
గరిహయ[5]నర[6]శర[7]నిబిడత, [8]ధరణి జలదనిబిడగగనతలముం [9]బోలెన్.

---

320. 1. మయిన – ఊ; మగున – ఎ. ఒ; ముగన – గ. ఝ.

321. 1. శరంబుల – ఝ; శరావళి – ఇ. ఓ; శరావలిఁ బా – శ. 2. బొందియు – పెక్కు ప్రతులు. 3. రతి – వ. 4. డంబులన్ – ఉ. ఝ; డుద్ధతిన్ – ఎ. ల.

322. 1. నరకి – పెక్కు ప్రతులు; దునిమి – ఓ; వైచి – ఆ. న. 2. పీడితు జేయ – గ. బరువు – పెక్కు ప్రతులు. 4. చేతి – ఏ. 5. నునిచి – పెక్కు ప్రతులు. 6. తొలగ – పెక్కు ప్రతులు. 7. జనులు – పెక్కు ప్రతులు; నృపుడు – వీ. శ. ష. స; నీసుతుండు – ఐ. మ.

323. 1. కురురాజ – ఆ. క. త. ద. 2. వీరయోధుల – ద. 3. కొల్పుచు – పెక్కు ప్రతులు; కొలిపిన – గ. 4. కదరినన్ – పెక్కు ప్రతులు; 5. రథ – గ. వ. 6. శవ, శబ, శత – అ. ఇ. ఈ. ఉ. ఏ. ఒ. ఓ. ఔ. క. చ. జ. ట. న. ల; శకటంబుల్ ధరణి – ఐ. మ. 7. నిబిడిత – ఉ. ఓ. ఔ. జ. ట. బ; పీడిత – ఘ. 8. బొలిచె జలద – ఈ. 9. బొలిచెన్ – పెక్కు ప్రతులు; బొదివెన్ – జ.

324. ఉ. సాత్యకి యప్పు డేచి శరజాలము [1]చిత్రలఘుస్ఫుటత్వసాం
గత్యవిరాజమానముగఁ గౌరవసేనఁ గలంగ జేసి యా
ధ్ధత్యమునం దనర్చిన నుదాత్తమనస్కుఁడు [2]సౌమదత్తి యా
పాత్యభి[3]రామ[4]వహ్ని క్రియ నుజ్జ్వలుఁ డై వెసఁ [5]దాకె నాతనిన్.

325. చ. [1]తలపడి యంత్యకాలశిఖిదారుణభంగి నమేయమార్గణా
ర్భులు [2]వరగించుడున్ భయము [3]సొచ్చి జనార్దనుతమ్ము[4]తోడియో
ధులు [5]పిఱుసన్నఁ దత్సుతులు దోర్బల[6]దుర్దము లై [7]పదుండ్రు న
గ్గలిక నెదిర్చి యి ట్లనిరి కౌరవసత్తముతో నుదగ్రతన్.

326. క. భూరిశ్రవసుఁడ యెక్కటి, వీర[1]వినోదంబు [2]సలుపు[3]వేడుకమెయి దు
ర్వారత [4]వచ్చితి [5]మొక్కరుఁ, [6]గోరికొనుము సంగరమున[7]కున్ మాలోనన్.

327. చ. అని విని [1]నవ్వి యొక్కఁడు మదస్త్రబలంబున [2]కోర్వఁ డోపినన్
సునిశితబాణముల్ వఱపి [3]సూరెల [4]నందఱు నొక్కపెట్ట యే
పు నెఱపుఁ డన్న నారథికపుంగవు లేయ నతండు [5]నమ్ము లె
ల్లను దునుమాడి వారిఁ జటులస్ఫురితాంబకవృష్టి ముంచినన్.

---

324. 1. శీఘ్రము విస్ఫురత్వసాం – ఐ; శీఘ్రమ విస్ఫుట – వ; శీఘ్రమ విస్ఫుర – మ. 2. సోమదత్తి – పెక్కు ప్రతులు. 3. వర్ధితాగ్ని – శ. ష. స. 4. మూర్తి – గ. 5. గిట్టియా – ఎ. ఒ. చ.

325. 1. తలకొని – ఎ. 2. పరగించుడున్ – న. ప. బ. మ. ల. శ; వరగించినం – ఏ. గ. ద. 3. బొంది – ఉ; జొచ్చి – న. బ. మ. ల. 4. తోటి – ఎ. ఘ. వ. 5. పెర (సన్న) చన్న – ఐ. మ. వ. 6. దుర్మదు – పెక్కు ప్రతులు; దర్పితు–బ; దుర్బలు – గ. 7. కడంగియ – ఎ. గ. ఘ.

326. 1. వినోదములు – అ. ఏ. 2. సలుప – ఆ. ఓ. జ. ఝ. న. బ. మ. ల. 3. వేడుక మై దు – పెక్కు ప్రతులు. 4. జొచ్చి – శ. ష. 5. మొక్కరి – ఇ. ఏ. వ. 6. నేరి – మ. వ; 7. కిట – ఐ. మ; కును – పెక్కు ప్రతులు.

327. 1. యాతడో – ఈ 2. కోపడో – ఈ. జె. త. 3. శూరుల – ఎ. ఔ; సూతు(ల)లు – న. వ; 4. నందర – ఊ. ఐ. ఔ. చ. బ. మ. 5. నంబులె – ఏ; తూపు – త.

328\. క. పొలి వోని శౌర్య[1]రేఖం, జెలఁగుచు వార్ష్ణేయు [2]లతనిఁ జేడ్పడఁ బెక్క
ముల్మల నొవ్వ నేసినం గడు, నలిగి శరాసనము లెల్ల [3]నాతఁడు [4]ద్రుంచెన్.

329\. క. కోదండదశకశీఘ్ర,[1]చ్ఛేదం బొనరించి [2]యపుడ శిరములు [3]పదియున్
భూదేవికి [4]బలిగా [5]ని,ష్పాదించెం గౌరవేంద్రుబలములు [6]సెలఁగన్.

330\. వ. ఇట్లు వడిన కొడుకులం గని వృష్ణివీరుండు.

331\. చ. వగపును [1]గోపముం గదుర వైరిబలంబు [2]దలంకఁ [3]దేరు పై
నొగనొగ దాఁకఁగాఁ [4]బఱపి నుగ్గుగఁ [5]గౌరవసూతు నేసి [6]బె
ట్టుగఁ దురగంబులం దునుముడున్ [7]వెస నాతఁడు నట్ల [8]చేసెఁ బా
టిగఁ గరవాలముల్ గొని [9]వడిన్ [10]దిగి [11]నేలకు [12]దాఁటి రిద్దఱున్.

332\. వ. [1]అట్టి సమయంబున.

333\. ఆ. వేగ [1]మెయిది వృష్ణివీరు భీముఁడు గురువీరు గురు[2]విభుఁడు గారవమున
[3]వెనుకఁ [4]జనఁగఁ [5]దివిచి [6]తనతన[7]రథము పైఁ, [8]బెట్టి[9]కొనుచుఁ దొలఁగఁ
బ్రీతిఁ జనిరి.

---

328\. 1. శి (రే) ఖలం – ఊ. ఖ. ఝ. డ; లీలం – త. 2. లపుడు – పెక్కు ప్రతులు. 3. నార్చుచు – ఉ. ఎ. ఔ. చ 4. దునిమెన్ – పెక్కు ప్రతులు.

329\. 1. చ్ఛేదనమొ – అ; చ్ఛేదమునో – ఏ– ట. 2. పిదప – ఇ; యపుడ – ఆ. న. వా. శ. ష. 3. బ (వ) డియెన్ – ఉ. ఊ; వడియా – గ; చదియన్ – డ; దడియన్ – ట. 4. బలియుగ – ఓ. ద. 5. సంపాదించెన్ – అ. ఓ. ద; నాపాదించెన్ – ఇ. ఈ. ఖ; సంభావించెన్ – ప; నుత్పాదించెన్ – ఉ. ఎ. ఒ. చ. ద; నాస్వాదించెన్ – ఝ. డ. ల 6. మాగడన్ – అ; బొగడన్ – ఇ. ప. పొంగన్ – ఉ. ఎ. ఒ; బొంగన్ – చ. ద.

331\. 1. రోషముం – ఝ. డ. 2. దలంకిచూడగా – ష; దలంకుచుండగా – క. 3. దేరిపై – పెక్కు ప్రతులు. 4. గడగి – అ. ఏ. 5. గౌరవు – అ. ఇ. ఖ. బ. 6. బిట్టుగ – ఊ. డ. త. 7. వ(డి)డ – ఎ. ఒ. చ. 8. చేయ – ఆ. ఎ. ఓ. ఔ; చేయు(య)బో – ఉ. ఒ. చ. 9. కడిందిగ – ఉ. ఎ. ఒ. ఔ. ట. 10. దెగి. దెగ. దిగ – ఆ. ఇ. ఐ. జ. మ. ల. 11. దాటిరి నేల కిద్దరున్ – ఇ. 12. ప్రాలి – ట.

332\. 1. అట్టియవసరంబున – ఏ. ట; అప్పుడు – ఉ. ఎ. ఒ. చ. శ. ష; అట్టియెడ – ఔ.

333\. 1. మయ్యెదుకురు – ఆ. న; మయదు – ఊ. వ; మేగివృష్ణి – ఒ. వ; దీవ్రవృష్ణి. – బ. 2. వరేణ్యు నీదు కొడుకు వెనుకద – ఉ. ఎ. ఒ. చ. 3. గిలి చలము డించి – ఎ. ఒ. చ. 4. దిగిచి – ఆ. ఔ; 5. దిగిచి – పెక్కు ప్రతులు. 6. తమ తమ – పెక్కు ప్రతులు. 7. తేరిపై – బ. 8. నిడి తొలంగ దెచ్చి రెల్ల జూడ – బ. 9. కొని తొలంగి – పెక్కు ప్రతులు.

334. వ. అంత.

335.* క. అపరాహ్ణసంగతుం డగు, తపనుం గని ప్రొద్దు గ్రుంకెఁ దడ వేఁగుదు రీ
రిపు లని కడఁగి నరుఁ డస్త్రపరంపర [1]వఱపి నీదు[2]రథికుల [3]నెల్లన్.

336. వ. నిహతులం జేయుచు విహరించు[1]చున్నం గనుంగొని.

337. క. సైరింపక [1]యేత్తెఱఁ గురు, వీరాగ్రణి యిరువదేను[2]వేల[3]రథంబుల్
బోరికిఁ బురిఁ[4]కొలిపిన [5]వి,స్ఫారగతిం [6]గూడి కవిసెఁ బార్థునిమీఁదన్.

338. క. కడు[1]వెసఁ గవిసిన [2]యవి గ,వ్వడి బాణజ్వాల [3]లడర వడి [4]దావాగ్నిం
మిడుతలు [5]వాలిసిన క్రియఁ బొడి,పొడి యయ్యెం గురుబలంబు
[6]పొం గడఁగంగన్.

339. క. [1]కిరణంబు లడఁగి యంతకు, నరుణత్వము మెఱయఁ దరణి యపరాద్రిశిరః
[2]స్ఫురణను నధికరణాలం,కరణం బొనరించుటయును [3]గాంగేయుఁ డెడన్.

---

335. 1. వరపె – పెక్కు ప్రతులు; బొదివె – ర. 2. యోధులకెల్లన్ – జ.
3. మీదన్ – త.

336. 1.చున్న సమయంబున – ఘ.

337. 1. గురు డేత్తెర – ఐ. మ. 2. వేలు – ఆ. ఐ. ఔ. చ. వ. ష. 3. రథము(లం)
లన్ – పెక్కు ప్రతులు. 4. కొల్పిన – పెక్కు ప్రతులు. 5. విస్తార – ట. ద;
6. నిగు(గి) డి – జ.

338. 1. వడి – ఉ. ఎ. చ. ట. ద. ల. 2. నాకవ్వడి – ఐ. గ. జ. ద. మ; నవిగ(క)
వ్వడి – క. డ. న; నక్కవ్వడి – బ. 3. లడరు – పెక్కు ప్రతులు; లడరి –
త. ద; లడరి వడ – గ; లడరువడు – మ. 4. వాలగ్గిన్ – పెక్కు ప్రతులు;
వార(గ్గిన్)గ్నిన్ – ఐ. న. మ. వ; కారగ్గిన్ – క; గా(వా)లాగ్నిన్ – చ. జ. ష.
5. దొరగిన – బ. 6. పొంగడరంగన్ – అ. ఘ; పొంగణగంగన్ – పెక్కు
ప్రతులు; పొడ వడగంగన్ – ఊ. శ. ష.

339 1. కిరణము లడంగి–కొన్ని ప్రతులు; కిరణము లడగిన – కొన్ని ప్రతులు. 2. స్ఫుర
ణంబున నరుణా – ఏ. ఘ; స్ఫురణం బను కిరణా – ఇ; స్ఫురణాలవకిరణా – జ;
స్ఫురణనవీకరణా – ఆ; 3. గాంగేయుండున్ – పెక్కు ప్రతులు.

340. క. [1]శ్రాంతం బయ్యెను [2]వాహనసంతానం బెల్ల [3]నిపుడు సంధ్యాసమయం
[4]బింతట నేఁటికి నని సాలింతము గా [5]కింకఁ [6]బోర లెసైన్య యున్నే.

341. వ. అని తలంచి కుంభసంభవాదియోధముఖ్యుల కెఱింగించి బలంబులఁ దివియ
నియమించి.

342. క. సమర[1]క్రీడనలీలం, [2]దమక తమక తనిసి మరలి తమతమయావా
సములకు నేఁగి రుభయసైన్యము లజనంబులును [3]దీవియలు వెలుఁగంగన్.

343. తే. రెండు[1]వీళ్లజనంబులు [2]రేలు వివిధ, వాద్యసంగీతములను సాహిత్యమధుర
లలితగోష్ఠి[3]వినోదంబులను బ్రమోద,భరితులై ప్రొద్దు [4]పుత్తురు
భరతముఖ్య.

*-: భీష్మని షష్ఠదివస యుద్ధక్రమము :-*

సం. 6_71_1

344. వ. వినవనాఁటిరాత్రి సనుటయు దెలతెల వేగునప్పుడు ధనంజయుండు సేనా
పతి రావించి మకరవ్యూహంబు సంఘటింపు మని నియమించిన నఖిల
జనంబులకుఁ [1]బ్రీతి సెక్కొన నతం డమ్మోహారంబు దీర్చునెడ దానికిఁ
బార్థపాంచాలపతులు శిరంబును గవలు గన్నులును భీమసేనుండు దుండం
బును సౌభద్రద్రౌపదేయఘటోత్కచులు గండస్థలంబులును సాత్యకిసహితుం

---

340. 1. శాంతం – అ. ఆ. ఊ. ఎ. ఏ. ఐ. ఓ. మ. ల; ప్రాంతం – న. 2. వాహిని – ఊ. ద. 3. నిపుడ – న. మ. 4. బింతకు – వీ. ష. 5. కెం (కిం) త – ఉ. ద. 6. బోరు – పెక్కు ప్రతులు.

342. 1. క్రీడాలీలం – పెక్కు ప్రతులు; క్రీడాలీలల – ఖ. జ. త. ల. 2. దమ తమ సైన్యములు గూడ – ద. 3. దివ్వె – ఒ. ఖ. ఝ. ద.

343. 1. వీడుల జనములు – ఝ. డ; వీళ్లుల వారును – క; వీళ్ల బలం – ఊ; వీళ్ల జనములును – ఖ; దిక్కుల వారును – శ. వ. 2. రేయి – ఈ. ఓ. చ. వ శ. ష; వేలు – డ. న. 3. వినాదంబు – ఓ. 4. పుచ్చిరి – పెక్కు ప్రతులు.

344. 1. చేకొని వెడలి – ఉ. ఊ. చ. ట. డ. త; చేసికొనివెడలి – ఇ. ఒ. గ. ఘ. ఙ. బ; గైచేసికొని వెడలి – ఐ. ద. మ.

డై యుధిష్ఠిరుండు గంఠంబును ధృష్టద్యుమ్నపురస్సరంబుగా విరాటుండు వెన్నును గేకయులు వామపార్శ్వంబును ధృష్టకేతుండును గరూశపతి యును దక్షిణపార్శ్వంబును గుంతిభోజశతానీకులు జఘనంబును శిఖండియు [2]నిరావంతుండును బుచ్ఛంబును నై పన్నిరి భీష్ముండు దానికిఁ బ్రతి వ్యూహం బూహించి క్రౌంచవ్యూహం బమర్చి యందుఁ జంచువునం [3]దాను గురు[4]సహాయుం డై నిలిచి నేత్రంబులఁ గృపగురుపుత్త్రులును మస్తకం బునఁ గృతవర్మయుఁ గాంభోజబాహ్లికులును గళంబున శూరసేనపరివృతుం డై సుయోధనుండును నురంబున సౌవీరసమేతుం డై భగదత్తుండును మీఁపున విందానువిందులును వామపక్షంబున సుశర్మయు దక్షిణపక్షంబున యవనపతియు నపరభాగంబున శ్రుతాయురుపేతుం డై భూరి[5]శ్రవసుండును నిలిచి రిట్లుభయసైన్యంబులు సన్నద్ధంబు లై నడచి శంఖభేరీ[6]ప్రముఖ తూర్య[7]నాదంబులు సెలంగం దలపడియె నట్టిసమయంబున.

345. క. తలకడచి[1] నడచు ద్రోణుని, [2]యలవుఁ జలంబును సహింప కనిలతనయుఁడి ట్టల[3]మగు[4]రోషంబునఁ ద, ద్బలము పయిం బఱపె [5]రథముఁ బటువేగమునన్.

346. వ. ఇట్లు వఱపిన నతనికో ల్తలకుం గాక

347. క. తనముందటియోధులు [1]పిఱు, సనుటయుఁ గుంభజుఁడు గినిసి [2]శరనవకముఖీ మునిమేన [3]నాఁట నాతఁడు, పునిశితభల్లమున నతని [4]సూతుం దునిమెన్.

348. క. [1]వాహనముఁ దాన నడపుచు, సాహసి[2]కత్వమున గురుఁడు సమరక్రీడో త్సాహము వదలక వైరి,[3]వ్యూహము దలఁకంగ భుజసముద్ధతిఁ గవిసెన్.

---

2. నిలావంతుండును – పెక్కు ప్రతులు. 3. దానును – పెక్కు ప్రతులు. 4. సమేతుం డై – ఖ. జ. డ; సహితుం డై–ఉ. 5. శ్రవుండును – పెక్కు ప్రతులు. 6. ప్రభృతి – ఇ ఊ. ఏ. క. ట. త. 7. స్వనంబులు – ఉ. ఎ. ఘ; నిస్వనంబులు – ఔ. చ. ద; నినదంబులు – మ; రవంబులు – గ.

345. 1. యపుడు – అ. ఈ. ఏ. 2. యలవున్ జలమును – పెక్కు ప్రతులు. 3. ముగ – ఊ. త. ప. 4. కోపంబున – ఉ. ఔ. చ. ద. 5. దేరు పటు – క. ఖ. జ.

347. 1. బిరి – ఘ. 2. శరవర్షము ఖీ – జ 3. నాటి – పెక్కు ప్రతులు; నింప – ఇ; నించ నొంచిన – ట; నించ నొచ్చియు – న. 4 సూతుని – పెక్కు ప్రతులు.

348. 1. వాహనము(లు)ల దా నడపుచు–పెక్కు ప్రతులు. 2. కృత్య–ఘ. 3. వ్యూహంబు దలంక – పెక్కు ప్రతులు.

349. క. మీతండ్రి ద్రోణునకుఁ దో, డై తఱిమినఁ గేకయులు భయాకులత మరు
ద్ధూతాంబుదగతిఁ దెరలఁగ, [1]నాతతసృంజయబలంబు లఱిముఱి [2]విఱిగెన్.

350. ఆ. అధిపభీమసేనుఁ డడరినఁ గౌరవ,సైన్య మతనిచేతఁ జాఁపకట్టు
వడియె[1]నపుడు ధరణిపతు [2]లిద్దరును [3]జేయి, వీచి తఱిమి రధికవిక్రమమున.

351. వ. ఇవ్విధంబున ధర్మనందనదుర్యోధను లగ్గలికం బరి[1]కొలుప మొగ్గరంబులు రెండును గండు మిగిలి తలపడియె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

352. ఆ. మనబలంబునందు మంచి[1]మగల్ సాల, గలిగి [2]యాబలంబు గెలువ[3]లేమి
దైవకృతము గాదె తలఁపఁ జోద్యము మున్న, [4]యెఱుఁగఁ జెప్పె
విదురుఁ [5]డిట్టు లగుట.

353. క. అతఁ డెంత సాటి చెప్పిన, మతి [1]హితముగఁ [2]గొనఁడు [3]కీడు
మానఁడు కడుదు
ర్మతి యైన నాతనూజుఁడు, మతి కర్మము వెనుకఁ జనక మానునె
యెందున్.

354. వ. విధికృతం బెవ్వరి[1]కి నుడుపవచ్చు నెట్లు గా నున్నది యట్లయ్యెడుం గాక యనిన సంజయుం డతని కిట్లనియె.

---

349. 1. నాతరి – పెక్కు ప్రతులు. 2. గవిసెన్ – ఇ. ఊ. ఎ. చ. వ. శ. ష.

350. 1. సమర – క. 2. లనందరును – ఐ. మ; లం(లిం)దరును – ఒ. జ. ల. 3. జేయు – పెక్కు ప్రతులు.

351. 1. కొల్పిన – పెక్కు ప్రతులు.

352. 1. మగలు – పెక్కు ప్రతులు. 2. యబ్బ – ఉ; యుండిబలము – ఘ; యాబలమును – గ. ద. 3. దేమి – ఎ. ఘ. 4. యెరిగి చెప్పె – పెక్కు ప్రతులు. 5. డిట్ల యగుట – పెక్కు ప్రతులు.

353. 1. హీనత – ఒ; హితవు – ఝ. డ; హితముంగొనడు – జ. 2. గొన(డ) క – ఒ. క. త బ. 3. మానడు కేడున్ – ఉ; వీడు మానడు – ల.

354. 1. కిం గడవ – పెక్కు ప్రతులు.

355. ఆ. నీతనూభవుండు [1]నెఱిగుఱి యెఱుంగమి, [2]యెఱింగియెఱింగి యతని నేలచెప్ప
మనయుపేక్షవలన విను వాని[3]జూదంబు, నేఁడు గయ్యె మయ్యె నృపవరేణ్య.

356. వ. ఇంకఁ బశ్చాత్తాపం బుడిగి ధీరుండ వై సమరప్రకారంబు విను మట్టియెడ భీమసేనుండు [1]భవత్సేనాసాగరంబు పాయ వడం దఱిమి చొచ్చి దుశ్శాసనుండును దుర్విషహుండును దుర్మదుండును దుస్సహుండును జయుండును జయత్సేనుండును వికర్ణుండును జిత్రసేనుండును సుదర్శనుండును జారుచిత్రుండును సువర్మ్ముండును దుష్కర్ణుండును నొక్కచో నున్నం గనుంగొని యక్కుమారులం దాఁకిన.

357. తే. వారలందఱు నొండొరుఁ బేరువేరఁ, [1]బిలిచికొని వీఁడె సనుదెంచె భీముఁ [2]డితఁ
[3]డొంటి యగపడ్డ [4]చోటన యుక్కడంగఁ, బొదివి [5]చంపుద మని [6]యతిస్ఫురణ [7]సేసి.

358. క. ఉగ్రగ్రహములు లయకా,లగ్రహపతిఁ బొదువుక్రియ నలఘువిక్రమగ
ర్వాగ్రహమున [1]ముట్టిరి రిపు,[2]నిగ్రహలంపటుని భీమునిం జటుల[3]గతిన్.

359. వ. ఇట్లు నీకొడుకులు చతురంగబలంబుతోడం జుట్టుముట్టిన వృకోదరుండు సంతసంబున బొదలి సారథిం గనుంగొని నీ నీరథం బిచ్చట నిలిపికొని యుండు మని నియోగించి గద పుచ్చికొని ధరణికి లంఘించి.

---

355. 1. నీతియుక్తుడు గామి — ఉ. ఏ. చ. జ. క. 2. యెరుగ మిట్టు లగుట — ఈ. ప; యెరుగ మిట్టు లతని — పెక్కు ప్రతులు. 3. జూదంబు — పెక్కు ప్రతులు.

356. 1. భవత్సేన పాయవడం — పెక్కు ప్రతులు.

357. 1. బిలుచుకొని — పెక్కు ప్రతులు. 2. సేను — ఐ. ఘ. మ; డింకనొం — ఈ; డితడునొం — ఓ; నిటకు — చ; డిచట — జ. 3. నొంటినగ — పెక్కు ప్రతులు. 4. చోటనె — ఉ. జె. ట. డ. త. 5. పట్టు — పెక్కు ప్రతులు. 6. మహా — క. న. బ. 7. మెరసి — ఇ. ఎ. ఐ. న. ల; మెరయ — ఐ. మ.

358. 1. బొదివిరి — ప; జుట్టిరి — క; బట్టిరి — వ. 2 న్నిగ్రహ దగునట్టి — ఇ. ఓ. న. వ. 3. మతిన్ — గ. ద.

360. చ. కవిసి [1]యుగాంతదండధరుఁడై వడిఁ గోలు మసంగి కుంభముల్
పవులఁగఁ దుండముల్ దునియఁ బ్రక్కలు వ్రక్కలు గాఁగ దర్పముం
జవము బలంబు [2]నొప్పఁగ గజంబుల వ్రేసిన నెత్తు లొల్కఁగా
నవి [3]వడె ధాతునిర్ఝరమయాచలపంక్తులఁ [4]బోలి [5]మేదినిన్.

361. క. అరదంబులు పొడిపొడి యై, హరుల[1]గములు నుగ్గునూచ మై [2]మొత్తపుఁ గా
ల్వురు [3]సిదురుప లై పడ ని,[4]ష్ఠురగతి విహరించె వాయు[5]సూనుఁడు
[6]గదతోన్.

362. క. పెక్కండ్రతోడ నిమ్మెయి, [1]నొక్కరుఁడ [2]రథమ్ము డిగ్గి [3]యురవడిఁ జని పే
రుక్కునఁ [4]బోరుట [5]సూడఁగ, నక్కజ మై యుండెఁ గౌరవాన్వయముఖ్యా.

363. ఆ. భీమసేను [1]నపుడు పెక్కుబలంబులు, పొదువు టెఱిఁగి ద్రుపదపుత్త్రకుండు
శస్త్రగురునితోడ సరభసవృత్తి మైఁ, బోరిపోరి యుడిగి బుద్ధి [2]గలఁగ.

364. క. భూరి[1]రయంబున నద్దెసఁ, దేరు వఱపఁ బనిచి యతని[2]తేరిపయిం ద
త్సా[3]రథిన కాంచి శోకము, [4]గూరన్ గద్గదిక నెలుఁగు గుత్తుకఁ దగులన్.

365. తే. [1]ఆర్తుఁ డై యవ్విశోకుని నడిగె భీముఁ,డెచట నున్నాఁడు నాయొడ
[2]లెట్లు ప్రాణ

---

360. 1. యుగాంత్య - పెక్కు ప్రతులు. 2. నొంప - ఎ. మ. ల; నొవ్వ - గ. 3. వడి- పెక్కు ప్రతులు. 4. బోలె - పెక్కు ప్రతులు. 5. నత్తరిన్ - న.

361. 1. బలము - ఎ; గముల్ - ఝ. డ. 2. మొత్తము - ఊ. ఐ. ఘ. 3. సావగ నొక్కటి విస్ఫురత - ఈ. 4. ష్ఠురుండై విహ - ఒ. ఖ. ఝ. త. 5. సూనుండు గదన్ - ఇ. ఉ. ఊ. డ. త. ల; సూనుండు దగన్-ఏ. ఘ. చ. ద. బ. 6. పె(వె)లు చన్ - ఐ. మ; కడిమిన్ - ఒ.

362. 1. నొక్కరుడు - పెక్కు ప్రతులు; నొక్కరు డై రథము - ఓ. ల. 2. రథంబు - పెక్కు ప్రతులు. 3. ఉరువడి - పెక్కు ప్రతులు. 4. బొదువుట - పెక్కు ప్రతులు. 5. సూవర కక్కజ మై - ఉ. ఔ. ఘ. చ.

363. 1. నిట్లు - పెక్కు ప్రతులు. 2. కలగి - పెక్కు ప్రతులు.

364. 1. బలంబున - గ. 2. నొగలపై సారథి - ఆ. ఓ. న. శ. 3. రథిని - పెక్కు ప్రతులు. 4. గూరగ - పెక్కు ప్రతులు.

365. 1. ఆర్తుడయ్యువి - అ. న; ఆర్తుడగుచు వి - డ. 2. లిట్లు - పెక్కు ప్రతులు.

సహితమై [3]యుండు నతఁ [4]డోకచందమైన నేమిగతిఁ బోదు [5]నక్కట
[6]యెఱుఁగఁ జెపుమ.

366. వ. [1]అనిన విశోకుండు ధృష్టద్యుమ్నున కిట్లనియె.

367. చ. గొదగొని ధార్తరాష్ట్రు లతిఘోరవిధంబునఁ జుట్టుముట్టిన
న్మదమునఁ దేరు డిగ్గి హరిణంబు[1]లపైఁ [2]జనుసింహమో యనం
గదఁ గొని [3]నన్ను నియ్యెడ నకంపితసుస్థితి నిల్పఁ బంచి బె
ట్టిదముగఁ జొచ్చె నాహవ[4]పటిష్ఠుఁడు భీముఁడు వారి[5]సైన్యమున్.

368. వ. అని [1]యవ్వల నెఱింగించిన నతండు.

-: ధృష్టద్యుమ్నుఁడు భీమసేనునకుఁ దోడ్పడుట :-

సం 6_73_31

369. క. కడువడిఁ జని యంతంతం, బుడమిఁ బడినకరుల[1]గములు [2]పొరలుటకతనన్
[3]వడముడి [4]యరిగినతెరు వేర్పడఁ గని వేవేగ [5]రథము వఱపెం గదియన్.

370. వ. ఇట్లు భీమసేనుఁ జేరం బోయి.

371. క. [1]ఇదె యేనుఁ గూడవచ్చితిఁ, బది[2]లుఁడవై పోరు మింక బకమర్దన యీ
కదిసిన వీరుల [3]నెల్లం, గుదియించెద [4]ననుచుఁ గవిసె గురు[5]వితతిపయిన్.

---

3. యుండ – పెక్కు ప్రతులు. 4. డొక్క – పెక్కు ప్రతులు. 5. నక్కటా – పెక్కు ప్రతులు; సకలంబునె – ఝ. ల; సకలమునె – ఖ. 6. యేను – బ.

366. 1. అనిన విని – పెక్కు ప్రతులు.

367. 1. పయిం – వ. 2. బడు – ఎ. వ. 3. యియ్యెడ న్నను – పెక్కు ప్రతులు; యీయెడ న్నను – ఎ. ఐ. ఘ. చ. త. వ. 4. గరిష్ఠు(ష్టు) – న. మ. వ. 5. సైన్యముల్ – అ. ఈ. ఘ. ప. ల.

368. 1. నియోగించిన నతండు – వ.

369. 1. గముల – పెక్కు ప్రతులు. 2. పోరుట – ఎ. 3. వడి నడరి యపుడు – ఆ. ఓ. వ. 4. యడరిన – పెక్కు ప్రతులు; నడచిన – ఉ. ఔ. చ. ద. ల. 5. తేరు వరపెం – పెక్కు ప్రతులు.

371. ఇది – ఊ. ఎ. ఐ. ఓ. మ. వ. 2. లంబై – ఐ. మ. వ. 3. నెల్లను – పెక్కు ప్రతులు. 4. నంచు – ఝ. ట. బ. ల. 5. బలములపైన్ – ఇ; బలము – ఈ.

372. క. అ త్తఱి నీతనయుం డెలుఁగెత్తి రథికవరులతోడ నిట్లను నీదు
ర్వృత్తునిఁ బొదువుఁడు భీముని,యుత్తల[1]పాటుడుపుకడఁక నుడుపుఁడు
గడిమిన్.

373. వ. అనిన విని యోధవీరులం గుమారులు నొక్కపెట్ట ధృష్టద్యుమ్నుం బొదివిన నతండుఁ ద్రోణదత్తప్రమోహనబాణంబున వారి నందఱ నిశ్చేష్టితులం జేసిన నప్పుడు దప్పిదీర్చుకొన నెడగని యనిలనందనుం డొక్కమడువున మధురశిశిర[1]జలంబులఁ బానంబు సేసి యుల్లసిల్లి యాద్రుపదపుత్త్రుం గూడికొనియె నట్టియెడ నాచార్యుండు గయ్యంబు సేయుమనుమున ధృష్టద్యుమ్నుండు దొలంగిన తెఱపిం గదియఁ బాంచాలపతి దఱిమిన నప్పు డగ్గురుండు నవ్వుచు.

374. తే. అస్త్రవర్షంబుఁ గురియంగ నతఁడు పూర్వ,వైరబంధంబుకతన దుర్వార[1]మైన
యతని[2]రోషంబు నైరింప నలవి గాక, జడిసి [3]పోయిన నాతండు శంఖ మొత్తె.

375. వ. ఇట్లు ద్రోణుండు ద్రుపదుం దెరల్చి ధృష్టద్యుమ్ను చనినవల నరసి తదీయ ప్రమోహనమార్గణమూర్ఛితం బయినశూరలోకంబు నాలోకించి కరంబు రయంబునఁ బోయి.

376. క. వినుత[1]ప్రజ్ఞాబాణంబున మోహనబాణశక్తి వోఁ జేసిన సం
జనితప్రాణోజ్జ్వలులై, యనికిం గ్రమ్మఱఁ [2]గడంగి రయ్యోధవరుల్.

377. వ. ఇవ్విధంబున నాచార్యుప్రాపునం జేసి యేచి నీకొడుకులు పవనద్రుపదుల కొడుకులపై వడరినం గని యుధిష్ఠిరుండు గేకయు [1]లేవురను ద్రౌపదేయులను ధృష్టకేతునిం జూచి మీ రభిమన్యుండు ముంగలిగా రథంబులు వఱపి భీమసేన ధృష్టద్యుమ్నులకుఁ దోడుపడుఁ డని పంచిన.

---

372. 1. పాటుడిపి - అ. ఆ. ట. న. ప. వ; పాటడ(ణ)చి - ఇ. ఎ. ఘ. చ. ల. వ.

373. 1. జలంబులు - పెక్కు ప్రతులు.

374. 1. మయిన - ఎ. న. 2. దోషంబు - ఊ; వైరంబు - ఝ; కోపంబు - వ.
3. పాఱిన - శ. ష.

376. 1. ప్రతిజ్ఞ - మ. 2. గణంగి - పెక్కు ప్రతులు.

377. 1. లేవురును - పెక్కు ప్రతులు.

378. క. ఆ[1]పన్నిద్దఱు సైన్యా,[2]టోపసమేతముగఁ [3]గవియుడును పాంచాల
క్ష్మాపాలసుతుఁడు, భీముఁడు నేపారిరి నీదుసేన యొసకం [4]బడఁగన్.

379. వ. తదవసరంబున.

380. తే. [1]క్రందుఁ గయ్యంబులోన నరాతిభయద, బాహువిక్రమ నీ విట్లు పాదచారి
వగుట [2]వల దని [3]కేకయునరద మెక్కఁ, బనిచె భీమునిఁ బాంచాలపతి
సుతుండు.

381. క. అప్పుడు మధ్యందినమున, [1]నొప్పినయిను[2]తోడఁ [3]జాల [4]నొర[5]వచ్చి గురుం
డప్పాండవబలము[6]లపైఁ, [7]దెప్పదెరలఁ గురిసె శరతతిం దీవ్రముగన్.

382. చ. కనుఁగొని పార్షతుం డపుడు గట్టుపకా సయి వీఁకఁ దాఁకినం
దునిమె నతండు తద్ధనువుఁ దోడన పెక్కుశరంబు లేసె నా
తని[1]మెయి నొండువిల్లు ద్రుపదక్షితిపాలసుతుండు గ్రక్కునం
గొని శర[2]సప్తతిం [3]గురిసి కోపముఁ [4]బెంచిన నాతఁ డుగ్రతన్.

383. క. ఆవిల్లు ద్రుంచి రౌద్రర,సావే[1]శం బొప్ప [2]నాలుగమ్ముల రథవా
[3]హావలిని సూతు [4]నొక్కట, దేవగణము పొగడ [5]వసుమతిం బడ నేసెన్.

---

378. 1. పన్నిరువురు – అ. ప. బ. 2. టోపముమైఁ దమ్ము – ఎ. చ. 3. గలయుడు– ఎ. చ. 4. బెసగన్ – పెక్కు ప్రతులు; బడగెన్ – ఈ. ర.

380. 1. క్రందుకయ్యంబు – మ. ల. శ. 2. ద(త)గ – ఈ. ఏ. వ. 3. నాతని – ఝ; కైకేయు – డ.

381. 1. నొప్పారిన భాను – క. వ. శ. ష. 2. తో(టి)డి – ఆ. ఉ. ఒ. ఔ. గ. చ. ద. న. 3. జూడ – అ. ఇ. ఐ. ఖ. ట. డ. త. ప. బ. మ. ల; సాటి – ఆ. ఉ. ఒ. ఓ. ఔ. చ. ద. వ; భంగి – గ. 4. నె(న)ర – ఏ. న. 5. వ(చ్చె)చ్చు – ఉ. ఎ. ప. ఘ. చ. ద. న. మ. 6. పయిం – అ. ఏ. గ. ద. వ. 7. దెప్పలు దేల – గ.

382. 1. పయి – జ డ. త. ద. 2. పంక్తులం – వ. 3. గురుని – .పెక్కు ప్రతులు. 4. వెంచి, దెచ్చి, పంచి – అని పాఠములు.

383. 1. శమ్మొసగ – ఒ; శంబునను – ప. 2. నాల్గు శరములు – బ. 3. హావలి సూతుని – గ; హావలి సూతు – జ. 4. నొంటను – క. ద; నొకటను – అ. ఇ. ఉ. ఊ; నొకంటన్ – జ. 5. వసుమతిని – ఏ.

384\. మ. విరథుం డై యభిమన్యు తేరిపయికిన్ [1]వేగంబ పాంచాలభూ
వరసూనుం డరుగం దదీయబల మోర్వం జాల కొక్కుమ్మడిన్
మరలం జాఱె నతండు వాయు[2]సుతుఁడున్ మానింప [3]మానింప న
ష్టు రథానీకముతోడ భీముఁ బొదివెన్ భూమీశ్వరుం డుద్ధతిన్.

-: ధృష్టద్యుమ్నుఁడు ద్రోణునితో యుద్ధము సేయుట :-

సం. 6_73_67

385\. తే. అంత నొం డొకసారథి యతిరయమునఁ, జటులహయములఁ బూన్పఁ బాంచాల[1]సుతుఁడు
దన[2]రథమునకు గ్రక్కునఁ జని పరాక్ర,మాభిరాముఁ డై గురునిపై నడరెఁ [3]బెలుచ.

386\. వ. ఇట్లు ధృష్టద్యుమ్నుండు గడంగి యెప్పటియట్ల కుంభసంభవుతోడం బెనంగుచుండ భీమసేనుండును.

387\. క. తన[1]యరదం[2]బు విశోకుఁడు, గొని వచ్చిన [3]నెలమి నెక్కి క్రూరోత్సాహం
బునఁ దనుఁ బొదివినదుర్యో,ధనుమీఁద నిశాతవిశిఖతతి [4]నిగిడించెన్.

388\. క. కురుపతి [1]యొకనారాచం, బురమున [2]నాఁటింప భీముఁ డుగ్రత [3]నేసెన్
[4]గురుతరశర[5]త్రయంబునఁ, గరములు [6]వక్షమును నాఁటఁ [7]గౌరవనాథున్.

---

384\. 1.వేగంబె – ఊ. ఏ. గ. ఘ. జ. వ; వేగంబు – ఓ. న. మ. వ. 2. సుతు డన్మా- .పెక్కు ప్రతులు. 3. కోపించి య – అ. ఏ; కేతెం(చె)చి – ఉ. ఎ. ఒ. ఔ. చ. ద. ల.

385\. 1. విభుడు – శ. ష. 2. రథంబున గ్రక్కున – అ. ఏ. ఐ. ఒ. ఓ. ఔ. ద. న. మ. ల. 3. నధిపా – పెక్కు ప్రతులు.

387\. 1. యరదమ్ము – మ. 2. బవి – ఐ. 3. యరద మె – ఈ; నెక్కి యపుడు క్రూ – ఏ. ఓ. ఔ. న. వ. శ. ష; నెమ్మి – ఐ. మ. వ. 4. గురియించెన్ – ఏ. ఒ. చ; గవియించెన్ – ఘ; బరగించెన్ – ఎ. జ. వ; నిగుడించెన్ – పెక్కు ప్రతులు.

388\. 1. యు నొక్కనారసము – ఇ. ఈ. వ. 2. నిగుడింప – ఏ. 3. నేయన్ – ఐ. మ. వ; నినిచెన్ – ఝ. 4. గురుపతిని – పెక్కు ప్రతులు; గురుపతి శర – ఖ– ఘ. వ; ఉ(వు)రువడి – ఝ. డ; గురువరు(ని) – త బ. 5. త్రయమున – ఉ. ఎ. చ. త. 6. వక్షంబు – పెక్కు ప్రతులు. 7. గౌరవనాథా – పెక్కు ప్రతులు.

389. వ. దాని కతండు చలింపక వృకోదరుపై వివిధ[1]శరంబు [2]లేసె నతనితమ్ములు దలకడచి యాభీమసేనుం [3]బట్టికొన నుత్సహించి యెప్పటియట్ల [4]బెట్టిదంబుగాఁ గవిసినం గని యక్కుమారుల నభిమన్యుద్రౌపదేయులును ధృష్టకేతుకేకయులునుం దాఁకి రట్లు వారును నమ్మారుతియుం గూడి దారుణభంగిం దఱుముట సైరింపం జాలక.

390. క. విఱిగి భవత్సుతనివహం, బఱిముఱిఁ గనుకనిఁ జనంగ ననిలసుతుం డే
త్తెఱ [1]నెగచి వగచె వా రం,దఱుఁ దనచేఁ జచ్చు టపుడు దప్పుటకుఁ
గడున్.

391. క. తమ్ములఁ [1]దోలిన నతిరా,ద్రమ్మునఁ గోపించి యన్న దలపడియెను సై
న్యమ్ముఁ బురి[2]కొలిపికొని రథ,సమ్మున భీమాదియోధసంఘముతోడన్.

392. క. అపరాహ్ణసమయమున [1]న, ట్లుపమాతీతాతిఘోరయుద్ధం బయ్యెక్
రిపుభయదభుజుఁడు భీమున, కపరిమితబలుండు గురుధరాధీశునకున్.

393. సీ. తదవసరంబునఁ [1]బొదివి వికర్ణుండుఁ జిత్రసేనుఁడుఁ [2]బార్థుపుత్త్రుమీఁదఁ
గవిసిన నతఁడు వికర్ణురథ్యంబులఁ గూల్చి యాతని[3]పయిఁ గుప్పెకోల
[4]లిరువది నాఁటింప నరదంబు డిగి భీతి యూన నాతఁడు చిత్రసేనురథము
పై కేఁగె ద్రౌపది[5]పట్టు లేవురు భీమునకు నడ్డపడి కురునాథుఁ దాఁకి

---

389. 1. విశిఖంబు — పెక్కు ప్రతులు. 2. వేసిన — పెక్కు ప్రతులు. 3. బట్టుకొన — పెక్కు ప్రతులు. 4. బొదివినం గని — వ.

390. 1. నిలిచి — అ. వ.

391. 1. విరిగిన — ఐ. క. ఝ; దోలగుటయును — ఒ; బోలియుటను — ఉ; దోలగిన — ల. 2 కొల్పుకొని — పెక్కు ప్రతులు; కొల్పికొని — ఇ. ఊ. గ.

392. 1. నిట్లు — పెక్కు ప్రతులు.

393. 1. నొదవి — పెక్కు ప్రతులు. 2. పాండు — పెక్కు ప్రతులు. 3. మీద — అ. ఇ. ఒ. వ. ల; మేన — పెక్కు ప్రతులు; పైని — ఆ. ఓ. 4. లిరువదే నడరింప — ఝ. వ. పట్లేవురును — పెక్కు ప్రతులు.

తే. మేనునెత్తురు వఱ్ఱుగా మెఱుఁగుటమ్ము, లేయ వారలఁ [6]దలపడి యేనునార
సముల రారాజు [7]వో నేసి సరభసముగఁ, [8]దఱిమె గాంగేయుఁ డరిసేనఁ దఱియఁ జొచ్చె.

394. క. చొచ్చి చతురంగ[1]వితతులు, విచ్చునటులు సేయుటయును విన్వచ్చుఁడు వే
వచ్చి తలపడినఁ బురికొని, యచ్చట నిరు[2]వాఁగు నట్టలాడం [3]బోరెన్.

395. ఆ. రక్తనదులలోన రథయానపాత్రముల్, వఱపి యోధవరులు బాహుబలము
వెలయ సమరకేళి సలిపిరి [1]శూరత, నేచి కడఁగి యోల [2]రాచి రాచి.

396. వ. అంత నరుణకిరణుం డన్వర్థాభిధానుం డగుచు వచ్చిన వేగిరపడి వాయు నందనుండు సుయోధను నేఁడ సమయింతు ననుసంరంభంబున నతనికి సమ్ముఖంబుగాఁ దేరు వఱపించి కదిసి క్రోధమోదంబులు మనంబునం బెనంగొన నతనిం గనుంగొని.

397. సీ. కడుఁబెద్దకాలంబు గాంఢించి యున్నయుత్సవ మిప్డు [1]సమకూర దైవ మిచ్చె
గొంతిసంకటపాటుఁ గోడలిబన్నంబుఁ దీర్చెదఁ గృష్ణుండు దెలుప నీవు
సరకు సేయమియును సభలో నులూకునిఁ బంచి యాడించినపరుస[2]ములును
[3]గక్కించి [4]బిరంబు [5]దక్కించుకొన నీక తెగఁజూడఁ గాంచితి మగతనంబు

6. సరిపడి, సరిబడి, వెసబడి, వడిబడి, నిరువడి – అని పాఠములు.
7. నోనేసి – పెక్కు ప్రతులు. 8. దరిమి – పెక్కు ప్రతులు.

394. 1. వితతుల – కొన్ని ప్రతులు. 2. వాగుల – పెక్కు ప్రతులు; 3. బోలెన్ – న. వ. బారెన్ – ప; జొచ్చెన్ – ష.

395. 1. ఘోరత – ఐ; ఘోరతరాగ్రహమున యోధు లార్చి యార్చి – ఉ. ఎ. 2. లార్చి యార్చి – పెక్కు ప్రతులు; లింత గదిసి – అ; లెల్లగదిసి – త; లెల్లనార్చి – శ. ష; లాడి యార్చె – ల; లేచి యార్చి – వ.

397. 1. సమకూరె – అ. గ. ఝ. ట. 2. దనము – పెక్కు ప్రతులు. 3. గ్రక్కించి – పెక్కు ప్రతులు; తలచి నీ – ఖ. ఝ. ట. ల. 4. బిరుదం(పు)బు – ఉ. త. బ. 5. దక్కించి – ఇ. ఖ. బ. వీ.

తే. గలిగి [6]మగుడక నిలు మని పలికి యుగ్రగతి నెదుర్కొని
రథతురంగముల సూతుఁ
జంపి చాపంబు [7]ద్రుంచి విస్ఫారకేతుదండ మేర్తెఱ నఱకె
భీముండు [8]సెలఁగి.

398. ఉ. వేఱొకవిల్లు [1]పుచ్చికొను [2]వేగము[3]లోనన కౌరవేంద్రు[4]మైఁ
దూఱ వృకోదరుండు పదితూపులు పాములు పుట్టలోనికిం
దూఱినయట్లుగాఁ బ్రబలదోర్బల [5]మేర్పడ [6]నేయ [7]నెమ్ములం
గీఱిన మూర్ఛ వచ్చి యొఱగెం దఱచై రుధిరంబు గ్రమ్మఁగన్.

399. వ. అట్టియెడ జయద్రథుండు రథికవరులతోడం గడంగి వడముడిపై నడరె నప్పుడు కృపాచార్యుండు దుర్యోధనుఁ దనరథంబుమీఁదం[1]బెట్టికొని తొలంగం గొనిపోయె నభిమన్యుండును ద్రౌపదేయులును గేకయులును [2]మారుతిని [3]మీఱి సైంధవుం దలపడినఁ జిత్రసేనుండును జిత్రుండును జిత్రాశుండును జారుచిత్రుండును సులోచనుండును నందుండును నుపనందుండును రౌద్రంబుగా సౌభద్రుం బొదివిన.

400. క. బలియుఁ డగు[1]పార్థపుత్త్రుఁడు, వలనేర్పడ నొకనినొకని వడి నైదైద
మ్ముల [2]నేసి నొంప వారలు. దలఁకక వెస ముంచి రస్త్రధారల నతనిన్.

---

6. నిలు మన మగుడక – ఈ. 7. దునిమి – ఇ. 8. గనలి – ఇ. ఈ; చె(చ)లఁగె– పెక్కు ప్రతులు.

398. 1. పుచ్చుకొని – పెక్కు ప్రతులు. 2. వేగమ – ఒ. ల. వ; వేగమె – ఈ. 3. తోడన, తోడను, తోడుత, తోనన, పాటున – అని పాఠములు. 4. పై – ఈ. ఎ. 5. దర్పము – వ. 6. మీరి – వ. 7. నమ్ములన్ – పెక్కు ప్రతులు; యిమ్ములన్ – వ.

399. 1. బెట్టుకొని – పెక్కు ప్రతులు .2. మారుతి మీఱి – పెక్కు ప్రతులు. 3. మిగిలి – ఆ. గ. ఘ. ద; దల కడచి – బ.

400. 1. పార్థ – పెక్కు ప్రతులు; పాండుపౌత్రుడు – ఖ. ఏ. గ. ద. 2. నొప్పించిన వారలు – పెక్కు ప్రతులు.

401. వ. సహోదరులకు సహాయత్వంబు సేయం బూని మున్ను విరథుం డై పోయి నవాఁ డగుటం జేసి.

402. చ. తఱిమి వికర్ణుఁ [1]డప్డు [2]తనుఁ దాఁకిన నాయభిమన్యుఁ డల్గి బి
ట్టఱ విలు ద్రుంచి సారథి వడం దురగంబులఁ జావ [3]నేసి క్రో
మ్మెఱుఁగులతోడఁ దద్ధ్వజము మేదినిఁ గూలఁగఁ [4]జేసి యంగముల్
గిరికొన బాణముల్ నినిచెఁ గేలిమెయిం బటుదర్ప మేర్పడన్.

403. వ. ఇట్లు నొచ్చినవికర్ణుం గనుంగొని కురుకుమారు లొక్కపెట్ట కవ్వడి[1]కొడుకు పై [2]నురవడించిన.

404. ఉ. ఏవురు ద్రౌపదేయులును నే త్తెఱ నాతని కడ్డ మై తురం
[1]గావళి నొంచియుం బడగ లన్నియుఁ ద్రుంచియు నంపవానలం
జేవ సెడంగ ముంచియునుఁ జేడ్పడఁ జేయఁగ నీతనూభవుల్
వోవక వారితో [2]మఱియుఁ బోరిరి [3]సిగ్గున బీర [4]మెక్కఁగన్.

405. వ. అట్టియెడ నకులనందనుం డగుశతానీకుండు బహుప్రకారబాణంబుల వివిధ విక్రమక్రీడ సలుపుబలుపుఁ గనుంగొని కేకయపాంచాలపతులు బాసట యై చటులతరతురంగమాతంగస్యందనసందోహంబులం బఱపి కడిమి నెఱపి రిప్పురుసునం బ్రతివీరుల నఱుముటయు నప్పుడు పతంగుండు పశ్చిమాచల శృంగంబు [1]మఱుంగుపడుటయుం జూచి గాంగేయుం డంత్యకాలకా లాకృతిం గడంగి పటుపిశిఖవితానంబుల వేఁడిమి సూపి యమ్మోహరంబు దెరల్చి తనమొనల మరల్చి కొని సమరంబు సాలించి శిబిరంబున కరిగెఁ బాండు సూనులును మేనులు వెడవెడ చెమర్ప విడిదలకుం జని రని యిట్లు సంజయుండాఱవదివసంబునాహవంబుతెఱం గెఱింగించె నప్పుడు.

---

402. 1. డంత – ఈ. ఏ. 2. వడి – జ. 3. జేసి – పెక్కు ప్రతులు. 4. నేసి – పెక్కు ప్రతులు.

403. 1. పట్టి – పెక్కు ప్రతులు. 2. నురువడించిన – పెక్కు ప్రతులు.

404. 1. గావలి – పెక్కు ప్రతులు. 2. మిపుల – అ. 3. సిగ్గును – పెక్కు ప్రతులు. 4. మెక్కగాన్ – బ.

405. 1. మరువు – పెక్కు ప్రతులు.

406. క. కిమ్మీర[1]మర్దనునిచే, [2]నిమ్మెయి [3]నోటారఁ బెక్కు[4]లేటులు వడి ద
ర్పమ్మెడలి మూర్ఛ మునిఁగియుఁ, గ్రమ్మఱఁ గురునాథుఁ
డెట్లు[5]గడఁగెనో యనికిన్.

407. వ. అని సకౌతుకంబుగాఁ బలికిన.

408. ఉ. భూరితపోవిశేష[1]పరి[2]పూర్ణమ్మృదుస్థిరహృత్కరండవి
[3]స్తార[4]నివాసతంత్ర[5]ఘనసారవి[6]ధాపరమాభిరామరే
ఖారమణీయ లోకహితకారిమహో[7]కరణీయ ఘోరసం
సారదురామయా[8]పదవసాయక నిత్య[9]ఫలప్రదాయకా.

409. క. పారాశర్యప్రముఖో,దారమునీంద్రాంతరంగ[1]ధామాంతర్వి
[2]స్ఫార[3]ప్రభా[4]పటల[5]వి,స్తారోజ్జ్వల[6]దీప[7]రూప[8]తా స్తవనీయా.

410. మాలిని. [1]అసుర[2]దళనలీలా[3]వ్యాప్తి[4]దీప్తారశోచి
ర్లసిత[5]పరశు[6]గాఢాలం[7]కృతప్రౌఢముద్రా

---

406. 1. వైరి చేతను – అ. ఏ. ఘ. ప. 2. నెమ్మెయి, నెమ్మియు, నమ్మెయి – అని పాఠములు. 3. నోనాట – పెక్కు ప్రతులు. 4 నేటులు – ఆ. న. శ. ష; లద్రులు – ప. 5. గణగె – పెక్కు ప్రతులు.

408. 1. ముని – గ. ద. 2. పూత – పెక్కు ప్రతులు; పూరిత సుస్థిర; పూజిత సుస్థిర – అని పాఠములు. 3. స్ఫార – ఏ. జ. ఝ. త. 4. విలాస – ఈ; విమాన – ఘ. 5. సుదారస – ఎ. ఔ. చ. ద. 6. లోల గుణాభిరామ రే – ఎ. ఔ. ద. 7. రమణీయ – ఊ. ఘ. డ; మహనీయ – ఇ. 8. దహన – అ. ఏ. గ. ద; పరమ – ఉ. 9. సుఖ – పెక్కు ప్రతులు, శుభ – ఒ. ఔ. చ. మ. ల; విభూతి నాయకా – ఎ.

409. 1. ధర్మాంతర్వి – ఎ; ధామాతురవి – ల; ధామారుత – ఒ. 2. స్తార – ఎ. చ. డ. మ. 3. తమః – శ. ష. 4. పటలీ – శ. ష. 5. విస్ఫారో – ఎ. న. 6. దివ్య – ఔ; దీప్త – ద. 7. హవన – ఎ. రూపిత – బ. 8. సంస్తవ – ఇ. ఈ.

410. 1. అసదృశ ఘన – ఇ. 2. దళన – అ. 3. వ్యక్త – ఆ; వ్యాప్త–పెక్కు ప్రతులు. 4. దీప్తాభి – పెక్కు ప్రతులు; శేషాభిరామ – ఎ. ఖ. చ. ఝ. ట. డ. ల. 5. పరమ – పెక్కు ప్రతులు; వహన, గహన, చరణ – అని పాఠములు. 6. గండా – ఇ. 7. కృతి – వ; కృత – పెక్కు ప్రతులు.

[8]భ్యసనమహిత[9]బాహా ప్రస్ఫురత్కాంతి[10]హృద్యా
హాసనసురభి[11]విద్యా హాంస[12]నాద్వైక[13]వేద్యా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన
శ్రీ మహాభారతంబున భీష్మపర్వంబునందు
ద్వితీయాశ్వాసము.



8. వ్యసన – ఈ. ఒ. న. స; ప్రసరతులిత – వ. 9. బాహు – ఏ. న. మ; బాణా – ఎ. చ; ధారా – డ. 10. విద్యా – ఐ. 11. హృద్యా – ఖ; వంద్యా – న. 12. భావైక – ఈ; సారైక – న. శ; ద్వైవైక – ల. 13. విద్యా – చ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## భీష్మపర్వము - తృతీయాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీవిలసనత్వ[1]గురుగా
రీవిభ్రమ[2]రమ్యచాతురీ[3]స్వీకృతస
ద్భావ నిరుపాధికానం
దావహాకరు[4]ణానుభావ హరిహరనాథా.

### -: భీష్మ గాంధారేయుల సంవాదము :-

సం. 6_76_3

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. తే. ఖండనంబునఁ [1]దనయుండు గండడంగి, [2]పోక విని తీవ్ర[3]ఖేదంబుఁ బొంది యంబి
కాతనూభవుఁ డప్పు డాసూతపుత్త్రు, నడిగె నుత్తరవర్తన మాదరమున.

4. వ. అడుగుటయు నతం డతని [1]కిట్లను నాఁటిరేయి గాంగేయుతోడ గాంధారేయుండు.

---

1. 1. గుణగౌరీ - ఝ. డ. వ. 2. చారు చాతురీ - మ. వ. 3. విశ్రుత - కొన్ని ప్రతులు.
4. ణాసనాథ - అ.

3. 1. తన తనయుండు గణగి పోక - వ. 2. పోవ నతితీవ్రఖేధంబు - వ. 3. వేదన - ప.

4. 1. కి ట్లనియె - శ. ప. కొన్ని ప్రతులు.

5 ఆ. మనము పూఁచి పట్టి మొన [1]లేర్చికొని పోవఁ,
పాండురాజసుతులబలము [2]గఁసి
గాసి చేయునదియుఁ గాక నీముందటఁ, బవనతనయుచేత భంగపడితి.

6. క. నినుఁ గొని గెలిచెదఁ గుంతీ,తనయుల నని యున్నతలఁపు దప్పించెదు నీ
వనిమిషుల [1]నైనఁ [2]జేకొన, వని[3]మొన వా రింతబలియు [4]రగు
టేమి యొకో.

7. క. అనిన విని నవ్వి యతఁ డి, ట్లను నిం తన నేల నన్ను నని నాయెడ లో
మినచోటుఁ గలదె పెఱయో, ధనికాయం బైన నకట [1]తలఁకదె చెపుమా.

8. వ. పాండవులు [1]జయింప నలవి [2]గా దని యెప్పుడుం జెప్పుదు నైన [3]నఱలేక
నీకు జయంబు గోరి [4]పోరెద వగవ కుండుము.

-: భీష్మునిప్రథమదివసయుద్ధక్రమము :-

సం 6_77_11

9. క. అన విని యూఱడి నిద్రా,జనితసుఖం బంది [1]రేప జనపతి యనికిం
జనుటయు భీష్ముఁడు బలమె,ల్లను నెఱయఁగఁ దీర్చె మండల[2]వ్యూహముగన్.

10. వ. అందు నడుమ నరనాథుం డొప్పి యుండెఁ దమ్ములుఁ [1]జేయం గలదొర
లును [2]సూరెల నిలిచి రంతం బాండవులును ఖండనంబునకు వెడలి రయ్యె

---

5. 1. యేర్చుకొని - కొన్ని ప్రతులు. 2. గలన, గలసి - అని పాఠములు.

6. 1. జీరిం గొనవని - ఒ. ఖ. ఝు. ట. డ. వ. 2. గైకొన - కొన్ని ప్రతులు. 3. యుండుదు వారు బలియు రగు - ఐ. మ. వ. 4. రటెమార్కొనగాన్ - గ. ద.

7. 1. దాకదె - అ; తలఁకెనె, తలపదె - అనిపాఠములు.

8. 1. జయింప - పెక్కు ప్రతులు; గెలువ - వా. 2. గా దెప్పుడుం, గామి యెప్పుడుం - అనిపాఠములు. 3. నోట లేక - ల; నోర లేక-అ. బ. వ. 4. పెనం గెద - చ. పీ. శ. ప.

9. 1. రేప - వ; జేపు - సం(శకటరేఫయుక్తరూపము). 2. వ్యూహంబున్ - పెక్కు ప్రతులు.

10. 1. తగురాజులు - ఉ. ఐ. 2. నిరుగెలంకుల - ఇ.

ధిష్ఠిరుండు మనమొనలం గనుంగొని వజ్రవ్యూహంబు [3]గల్పింపు మని సేనా
పతిం బనుప నతండును దత్ప్రకారంబున [4]సైన్యంబు సన్నద్ధంబు సేసిన నది
పరబలంబు మెచ్చక తఱిమి తూర్యధ్వను [5]లెసఁగం దాఁకె నప్పుడు
ద్రోణుండు విరాటుని ద్రౌణి శిఖండిని దుర్యోధనుండు ధృష్టద్యుమ్నుని
మద్రపతి గవలను విందానువిందులు యుధామన్యునిఁ బెక్కండ్రు రాజులు
బీభత్సుని మార్కొనిరి భీమసేనుండు కృతవర్మను సౌభద్రుండు చిత్రసేన
దుశ్శాసనవికర్ణులను ఘటోత్కచుండు భగదత్తుని సాత్యకి యలంబుసుని
ధృష్టకేతుండు భూరిశ్రవసునిఁ జేకితానుండు గృపాచార్యుని ధర్మసూనుండు
శ్రుతాయువును బలువురు భూపతులు భీష్మునిం [6]దలపడి రట్టియెడఁ గృష్ణు
నితో జిష్ణుం డిట్లనియె.

11. తే. భీష్ముఁ డొడ్డన మేర్చిన బెడఁగు సాల
నొప్పెఁ గౌరవయోధులయుబ్బు మెఱసె
నృపు లనేకులు నామీఁద నిగిడి రేను
జిక్కు వఱిచెదఁ జూడు మీయుక్కు [1]మెఱసి.

12. వ. అని పలికి గొనయంబు సారించి.

13. క. జననాథులపైఁ బేర్లే, సిన వారలు నొక్కపెట్ట చెలఁగి ముకుందా
ర్జునులఁ బటుబాణవర్షం,బున ముంచిన నార్చె నీదుపుత్రబలంబుల్.

14. వ. అప్పు డింద్రనందనుండు గోపించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన.

15. మ. అది యాబాణము లెల్ల [1]మాన్చి నరనాథాంగంబులన్ గీఱి యు
న్మదశుండాలహ[2]యాళిఁ గూల్చి [3]రభసోన్మాదక్రియన్ సంభ్రమ
ప్రద మై మందర మంబుధిం గలఁచుదర్పం బొప్ప నొప్పించుచుం
దదనీకంబులు వాఱి భీష్మురథ మాధారంబుగా నిల్చినన్.

---

3. రచియింపు మని – వ. 4. నొడ్డనంబు దీర్చిన నది – ఒ. ఝ. ట. డ. వ.
5. లు దిక్కు లదర, లు దిక్కులు దలంక(వడంక)లు దిక్కులు పిక్కటిలం–అని పాఠములు. 6. మార్కొని – జ.

11. 1. మెరసి, మిగిలి – అని పాఠములు; దక్క–అ. ఐ. ఓ. వ. వీ. శ. ష; మడఁచి – వా.
15. 1. ద్రుంచి – ఇ. ఈ. ట. త. ష; మాన్పి – ర. 2. యావలీరథభటోన్మాదక్రియన్ – వ; 3. రభసమ్మర్దంబునన్ వచ్చి భీ – ఇ.

16. వ. [1]త్రిగర్తపతి మెద లయిన యమ్మహీపతులుం దెరలి తమతమ[2]సైన్యంబులు సన్న[3]నెలవులకుం జని [4]యొదుంగుటయు గాంగే[5]యుండు గడంగుటయుం గని రాజుతోఁ రారా జిట్లనియె.

17. క. సేనాసమేతుఁ డగునరు,పై [1]నొక్కఁడ భీష్ముఁ డదర [2]బలువిడిమైఁ దో
డై నడవ వలదె యింతటి,[3]మానుసులకు [4]నేను జూడ మరలం దగునే.

18. వ. అనిన విని యాభూపాలనికరం బాలంబునకు నూలుకొని [1]సురనదీసూను నిరుగెలంకులం గూడుకొనియె [2]నప్పుడు.

19. సీ. గురుఁడు విరాటుని కోదండకేతుదండంబులఁ ద్రుంచె రెండంబకముల
నతఁడు వేఱొకవింట నాచార్యుమేనును సూతుని [1]మూఁడేసినిశితాస్త్ర
ముల [2]నొంచి ఘోటకమ్ముల నాలుగింట [3]నోనేసి చాపము సిడ మెడల రెంట
నేసిన నతఁడు ద న్నెనిమిదియమ్ముల విరథుఁ జేసిన సుతునరద మెక్కి

తే. యతఁడు దానును గూడి వాలంప[4]వెల్లి, ముంచుటయుఁ [5]గుంభజుండు గోపించి దొడ్డ
నారసం బేయ నమ్మత్స్యనాథతనయు, నురము వడిఁ [6]గాఁడి వీఁపున నుచ్చిపోయె.

20. వ. ఇట్లు క్రూరనారాచంబు బెట్టు [1]దాఁకిన.

---

16. 1. త్రికర్త – పెక్కు తాళపత్రప్రతులు. 2. సైన్యంబు లున్న – ఇ. ల. 3. నేల కుం జని – అ. ఆ. ఓ. వ. శ. ష. హ. 4. యొదిగి యఁడిరి – ద. 5. యుండు గం డడంగినన్ – ర; యుండు గడంగినన్ – పెక్కు ప్రతులు.

17. 1. నొకరుడ – కొన్నిప్రతులు 2. బలిమిమై – ఊ. న; బలిమిమెయి – ఒ. బ. 3. మానుసులకు – పెక్కు ప్రతులు; మానిసులకు–వా. 4. వెనుక జూడ మరలం – ఆ. మ. వ; రణమునందు మరలం – ఇ.

18. 1. సుయోధను నిరు – ఉ. 2. నట్టియెడ – కొన్ని ప్రతులు.

19 1. మైమూడు – బ. 2. నేసి – కొన్ని ప్రతులు. 3. నొవ్వ జేసి, నెవ్వ నేసి–అని పాఠములు; నోఁజేసి – ల. వ. శ. 4. గముల – ఐ. ఝ. మ. వ. 5. నగ్గు రుండును మొనసి దొడ్డ – ఇ. క. న. 6. దాకి – ఓ. శర; గాడి (అర్ధబిందు రహిత రూపము) – వీ. శ. ష.

20. 1. నాటించిన – వ; నాటిన – ఈ.

21. క. విల్లును నమ్ములు విడుచుచుఁ, ద్రెళ్లుటయును శంఖుఁ జూచి ధృతి గలఁగి [1]జనం
బెల్లను జూడ విరాటుఁడు, దల్లడ[2]మునఁ బాఱ [3]విచ్చెఁ దత్సైన్యంబుల్.

22. వ. అట్టిసమయంబున శిఖండి గురుపుత్త్రుఫాలంబునఁ [1]బటునారాచత్రయంబు నాఁటించిన నతం డలిగి యొక్కపెట్ట పెక్కమ్ములఁ దురంగసూతకేతు చాపంబుల నుగ్గు సేసినం [2]బలకయు వాలునుం గొని నేల [3]కుఱికి పాంచాల నందనుండు సాళువంబుచందంబునం [4]గవిసి యశ్వత్థామ యేయుబాణంబులు గృపాణంబునఁ [5]ద్రుంచుచుం గదిసిన నతండు కోపించి.

23. తే. పలక పఱియలుగాఁ జేసి యలుఁగు దునిమి, యొడల వాలంపపొది నింప నోర్లఁబోక
ద్రుపదపుత్త్రుండు గరవాలు దునియ వైవ, నడుమఁ [1]బోడి సేసె నాచార్యనందనుండు.

24. వ. శిఖండియు సాత్యకిరథం బెక్కెఁ దదవసరంబున ధృష్టద్యుమ్నుఁడు.

*-: ధృష్టద్యుమ్నునిచే దుర్యోధనుండు విరథుఁ డై పోవుట :-*

సం. 6_78_44

25. క. శరములు కురుపతి[1]మీఁదం, గురిసిన నతఁ డతనిమేనఁ గ్రూరాస్త్రంబుల్
సరభసమున నింపఁగ సత్వరముగ నాద్రుపదసుతుఁడు దచ్చాపంబున్.

26. వ. తుండంబులు గావించి.

---

21. 1. బలం బెల్లను - ఐ. మ. వ. 2. పడి పార(రె)-పెక్కు ప్రతులు. 3. కలగె - వ.

22. 1. చటుల(క్రూర)నారాచ - ఖ. న. 2. బలుకయు వాలును - కొన్ని ప్రతులు. 3. కుఱికి, కెగసి, కరిగి-అని పాఠములు. 4. గవిసె - వీ. శ. ష. 5. జడియుచు - ల. వీ. శ. ష.

23. 1. నాచార్యతనయుండు నగుచు దునిమె - వ.

25. 1. మేనం గురిసిన - కొన్ని ప్రతులు.

27. క. మఱియు నొకవిల్లు గొను[1]న, త్తెఱపిన విరథుఁడుగఁ జేయ ధృతిఁ గరవాలం
బుఱక గొని విభుఁడు నేలకు, నుఱికి యతనిమీఁద నడరె నుగ్రాకృతి యై.

28. వ. అట్టియెడ సౌబలుండు రయంబున [1]నెయిది యన్నరపతిం దన[2]రథంబు మీఁదికిఁ [3]దిగిచికొని పోయె సాత్యకి యలంబుసుని నలఘువిశిఖవృష్టిం బొదివిన నద్దనుజుం డర్ధచంద్రబాణంబున దద్బాణాసనంబు [4]దుండంబులు సేసి [5]యంగమ్ముల వాలమ్ములు గీలించి మాయ లొనర్చి యతిఘోరంబుగాఁ బేర్చిన నాశినివంశవరుం డచలుం డై [6]యైంద్రాస్త్రప్రయోగంబున నమ్మాయ మాయించి యతని వెగడుపఱచిన నతఁడు వెఱచఱచి పఱచిన నయ్యాదవసింహుండు సింహనాదంబు సేసి కురుబలంబులపయిం గవిసె నప్పుడు.

29. క. కృతవర్మ యేచి మారుత,సుతుపయిఁ దఱుముటయు నతఁడు సూతుని దురగ
ప్రతతిం బడ నేసి మహో,ద్ధతి మార్గణమయము సేసెఁ దద్గాత్రంబున్.

30. వ. ఇట్లు విరథుండును విశిఖ[1]క్షతదేహుండును నై యతం డేదు వెరఁగి నట్లు నీదుమఱంది యగువృషకునరదంబుమీఁది కరిగె ననిలతనయుండును మనగజఘటలపైఁ బటురయంబునం దనరథంబుఁ బఱపె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె.

31. క. విఱుగుట [1]నొచ్చుట మనదెసఁ, దఱచుగ [2]నాడెదవు పాండుతనయులబల మే
త్తెఱ దఱుఁగక పెనఁగుట పలు, మాఱుఁ [3]జెప్పెద వకట
యేమిమాయయొ తలఁపన్.

---

27. 1. నెడఁ దెఱపిం గని విరథుఁ జేయ – వీ. స. శ; నేత్తెఱ గని – అ. ఓ. వ. శ. ష.

28. 1. నెవరి – హా; నంజని – ఎ. ఔ. శ. ష. 2. యరదంబు – కొన్ని ప్రతులు. 3. దిగిచి తోలంగిపోయె – ల; దిగిచి తోలంగం గొనిపోయె – కొన్ని ప్రతులు. 4. ఖండంబులు – పెక్కు ప్రతులు. 5. యంగంబున – కొన్ని ప్రతులు. 6. యైంద్రాస్త్రంబు ప్రయోగించి – ఈ. ఏ. చ. త. ర. వ. హా.

30. 1. క్షతుండును నై – పెక్కు ప్రతులు. 2. శకుని – ఎ. క. స; వృషాంకు – శ. ష. మూలమునందు వృషకుఁడనియే కలదు.

31. 1. చచ్చుట – వ. 2. జెప్పెదవు – కొన్ని ప్రతులు. 3. జెప్పెన వగుట – తి.

32\. వ. అనిన విని సంజయుం డతని కిట్లను మనవారుఁ [1]దా మోపినభంగి బెనంగు దురు సముద్రంబు సొచ్చిన[2]యేఱులుంబోలెఁ బాండవసేనం జొచ్చి తమ దర్పంబులు మెఱయ [3]లే రది తప్పుగాఁ గొనరాదు నీ[4]తప్పునఁ బాటిల్లిన చేటునకు శోకింపం బని లేదు సమరప్రకారం బవధరింపు మవంతిదేశాధీశు లగు విందానువిందులం బటుబాణపరం[5]పరలం గప్పి యుధామన్యుం డేచి యను విందు విరథుం జేసిన నతండు విందుస్యందనం బెక్కుటయు నప్పాంచాల వంశవరుండు.

33\. క. విందునిసారథి నొకకో,లం దునిమిన [1]వాహములు గలంగంబడి పా
ఱం దేరు దిగిచికొని మగు,డం దద్బల మెల్లఁ దల్లడముఁ [2]బొందె వడిన్.

34\. వ. అట్టి సంకులసమరంబున.

35\. క. భగదత్తునేనుఁ గడరిన, వెగడునఁ బాండవులమొనలు విఱుగుటయు మహా
నగ [1]మేటివేగ మాఁగిన, పగిది ఘటోత్కచుఁడు దాని[2]పరు [3]వుడిగించెన్.

36\. సీ. దనుజేంద్రు[1]నిలుచుట [2]గని సైన్య మెప్పటి[3]యట్టుల పురికొని
యనికిఁ జొచ్చె
[4]నాఘటోత్కచుఁడు బాణావళి వఱపిన భగదత్తుఁ డదియెల్ల మగుడఁ జేసి
పటుతోమరంబులు పదునాలు గడరింప నవి [5]ద్రుంచి డెబ్బదియమ్ము లేసి
యసుర యార్చినఁ బేర్చి యాతఁడు విరథుఁ జేసినవాఁడు శక్తి
వైచిన నతండు

---

32\. 1. దారోపినభంగి – కొన్ని ప్రతులు. 2. యేఱుల తెరంగున(చందంబున) – కొన్ని ప్రతులు. 3. నేర రది తప్పు – ల. 4. కతంబున, పంపున – అని పాఠములు. 5. పరల బరగించి – అ.

33\. 1. తురగములు గలంగం – ర. వ. 2. బొందంగన్ – ఐ. మ. వ.

35\. 1. మెదిరి వేగము – ఐ. మ; ము సది వేగము – ఒ. ట ల. 2. పఱ పుడిగించెన్ – ఐ. మ. శర. 3. వడగించెన్ – అ.

36\. 1.డడరిన గని – అ. 2. గని వారిసైన్య మెప్పటియట్ల–ష. హ; గని నీదు సైన్య మెప్పటియట్ల పురికొని – శ. 3. యట్ల వే పురికొని – వ. 4. కడగి యపుడు ఘటోత్కచుడు బాణావలి వఱపిన నవియెల్లమరలజేసి – ఇ. ఈ. 5. ద్రుంచె – కొన్ని ప్రతులు.

తే. నడుమఁ దునుమాడి వడిఁ బెక్కునారసముల, నొంప దైత్యుండు నముచి నిలింపపతికిఁ
బాఱిన ట్లోడి పాఱె నబ్బలముఁ గడిమి, నెగచెఁ బ్రాగ్జ్యోతిషాధీశుఁ డిభముఁ బఱపి.

37. ఆ. శల్యుమీఁదఁ గవలు శరవృష్టి గురిసిన, నగుచు విరథుఁ జేసె నకులు నతఁడు,
వార లప్పు డొక్కతేరెక్కి యడరిన, రౌద్ర మెసఁగ నొంచె మద్ర[1]విభుఁడు.

38. చ. ధృతి [1]బలు పొప్పు నిల్చి సహదేవుఁడు వ్రేఁకనినారసంబుఁ గ్రూ
రత నుర మాడ నేయ నది రక్తము సోఁకక యుచ్చి పోవుడుఁ
మృతుఁడునుబోలెఁ దేరిపయి మేటిమగం డగుమద్రమేదినీ
పతి వడినం గలంగె నరపాలక కౌరవరాజసైన్యముల్.

39. వ. ఇట్లు మూర్ఛితుం డయినశల్యుం జూచి సారథి రథంబు దొలంగందోలికొని
పోయినం గనుంగొని కవలు సింహనాదంబు సేసి శంఖంబులఁ బూరించి
రంతం గమల[1]బాంధవుండు దివస[2]మధ్యోపేతుం డయ్యె నట్టిసమయంబున
యమసూనుండు శ్రుతాయువుపైఁ దొమ్మిదియమ్ములు నిగిడించిన నతండు
వాని మగిడించి నిశాతసాయకసప్తకంబు శరీరంబున గ్రుచ్చినం గోపించి
యుధిష్ఠిరుండు వరాహకర్ణ[3]శరాసారంబున వాని వక్షస్థలంబు వ్రచ్చి వెడం
దవాతి యమ్మునం [4]గేతువుం దునిమిన నతండు.

40. ఉ. వెండియు నేడుబాణములు వే తొడి ధర్మజు [1]నొవ్వ నేయ నా
తండు మహోగ్రకోపమునఁ దత్తురగంబులఁ జంపి తద్ధను
ర్దండముఁ ద్రుంచి తత్తనువు రక్తమయంబుగఁ జేయ వాఁడు భీ
తుం డయి పాఱె నీబలము దూలఁగ నబ్బల ముబ్బి [2]క్రాలఁగన్.

---

37. 1. పతియు – జ. ద. ర. వ.

38. 1. బలు వొప్ప – ల. కొన్ని ప్రతులు.

39. 1. మిత్రుండు, హితుండు – అనిపాఠములు. 2. మధ్యోపహితుం డయ్యె – ఙ. య. వ. స. శ. హ; మధ్యోపగతుం డయ్యె – కొన్ని ప్రతులు. 3. శరాసారంబున – పెక్కు ప్రతులు; మార్గణంబున – వా. 4. కైదువు ద్రుంచిన – వ; కేతుదండంబు దునిమిన – ర. వ.

0. 1. మేనునొంపనా – ఝ. డ. 2. పోవగన్ – వ.

–: చేకితానకృపాచార్యుల ద్వంద్వయుద్ధము :–

సం. 6_80_20

41. తే. చేకితానుండు గృపునిపై శితశరములు, గురిసె నాతండు విల్లును గుఱ్ఱములను
వ్రయ్యలుగఁ జేయ గద గొని రథము డిగ్గి, సరభసంబుగఁ జని
కృపు విరథుఁ జేసి.

42. వ. అయ్యాదవసింహుండు వెనుకకు లంఘించి పోయినం గృపాచార్యుండు పదాఱమ్ము లెమ్ములం గీలించుటయు నతండు గదాదండంబు వైవ నగ్గౌతముండు తుండంబులు సేసినం జేకితానుండు రయంబున [1]రథంబుమీఁదికర కరవాలంబు గొని మెఱుంగు [2]మెఱిసినట్లు పఱతెంచిన శారద్వతుండు నిశాత కృపాణపాణి యై ధరణి కెఱఁగి [3]యేడ్తెఱ నతనిం [4]గవిసి నొప్పించి యతని చేత నొచ్చె నట్లిరువురు మూర్ఛిల్లి మేదిని వ్రాలిన.

43. క. ఇద్దెస సుబలతనూజుఁడు, నద్దెసఁ [1]గరకర్షణుఁడు రయం బెసఁగఁగ న
య్యిద్దఱుఁ దమరథములపై, గ్రద్దన నిడికొని తొలంగఁగా జని రథిపా.

44. వ. చేదిపతి యగుధృష్టకేతుండు భూరిశ్రవసునిం దొంబదితూపుల నేపారి యేసిన నొచ్చి కోపించి యాసోమదత్తతనయుండు.

45. క. నానాస్త్రంబుల హయముల, మేనులు దునియలుగఁ జేసి మెయి నారసముల్
[1]వే నాటించిన నతఁడు శ,తానీకునిరథముపైకి [2]నరిగెం బెలుచన్.

46. వ. దుశ్శాసనవికర్ణచిత్రసేనులతో సుభద్రాసూనునకు మహాయుద్ధం బయ్యె నందు వారల నందఱ నాసంక్రందనపౌత్త్రుండు విరథులం జేసి వృకోదరు

---

42. 1. నెయిది – అ. 2. మెరచినట్లు – ర. ల. వ. కొన్ని ప్రతులు. 3. యేడ్తెరం గవిసి – పెక్కు ప్రతులు. 4. గదిసి – కొన్ని ప్రతులు.

43. 1. కు తదనుజుండును రయంబున జని య – ఇ.

45. నోనాటించిన – ఐ. మ. వ. శ. 2. దా పడి నరిగెన్–ఇ. ఉ. క; దా వెస నరిగెన్, దా నేగెన్ పెలుచన్–అని పాఠములు. వీనియందు అఖండయతిగా భావించవలెను.

వచనంబులు దలంచి [1]యలంచుచుండెం గాని సమయింపం డయ్యె నట్టి సమయంబున శాంతనవుండు వారిం [2]గై కొని యనేక రాజరథికులతోడం గూడ నన్నరనందనుపై నురవడించిన నాభూపతులు [3]పలువురు ప్రౌఢు లగుటయు నయ్యభిమన్యుం డొక్కరుండు బాలుం[4]డు నగుటయుం జూచి సవ్యసాచి శౌరితో ని ట్లనియె.

47. క. ఉక్కు మిగిలి జగతీశులు, పెక్కం్రడు రయంబు మెఱయ భీష్మ[1]సహితు లై యొక్కటఁ [2]దోఁతెంచెద రా,దిక్కునఁ బోనిమ్ము రథము దీవ్రస్ఫురణన్.

48. వ. అని వారలవలను [1]సూప నచ్యుతుం డట్ల చేయం ద్రిగర్తపతి దనమొనలకుం దలకడచి కవ్వడి మాఱ్కొనుటయు నతండు.

49. క. మీపీటి కెల్ల [1]మేటివి, నీ విట్లు గడంగి తిచట [3]నిక్కమ పోరం గావలయుఁ జుమీ యనుచు శ,రావృతుఁ గావించె సూతహయసహితముగన్.

50. వ. అట్టియెడం గౌరవసైన్యంబు గాండీవిపై నొక్కపెట్ట యడరినం బాండవ బలంబు లతనికిం దలకడచి తలపడిన సందడి[1]కయ్యం [2]బయ్యె నా సంక్రందననందనుండు [3]రాజులగములకుం [4]గవిసి కేతనంబులు నఱికియు సారథిరథికరథ్యంబులప్రాణంబులు వెఱికియు నాతపత్రచామరంబులు పొడి సేసియుఁ జాపంబులు రూపఱఁ[5]జేసియుఁ [6]వర్మంబులు వ్రచ్చియు [7]మర్మం బుల మార్గణంబులు గ్రుచ్చియు సర్వాంగంబులు [8]నొంచియుఁ దలలు ద్రుంచియు విహరించుచుండ నపరాహ్ణం బయ్యెఁ ద్రిగర్తనాథుండు వెండి యుం బేర్చి యెదిర్చిన.

---

46. 1. యలయించు చుండె – ఎ. న. 2. గనుంగొని – డ. 3. ముప్పురు – చ. హా. 4. డై యునికిం జూచి – పెక్కు ప్రతులు.

47. 1. సహితమై – క. ప. 2. తోతెంచిరి యద్దిక్కున – ఇ. ఈ; తోతెంచద రద్దిక్కున – కొన్ని ప్రతులు.

48. 1. సూపిన నచ్యుతుం – కొన్ని ప్రతులు

49. 1. మెరసియు – స. 2. నిజముగ – చ. హా.

50. 1 కయ్యంబున–వ. కొన్ని ప్రతులు. 2. బయ్యె నట్టియెడ – ఇ. ఖ. ఝ. ట. డ. వ. 3. రాజులకుం దల మిగిలి రాగుమురులకుం గవిసి – ద. 4. దలకడచి, దలమిగిలి – అని పాఠములు. 5. నఱకియు – హా. 6. వర్మంబులు – పెక్కు ప్రతులు; చర్మం బులు – వా. 7. దనువుల – ప. 8. నొప్పించియు – ఘ.

51\. తే. అతనిరథరక్షకులు శక్రసుతునిమీఁదఁ, గడఁగి ముప్పదియిద్దఱు గవియుటయును
నవ్వి [1]యఱువదినాలుగు నారసముల, నక్కిరీటి యారథికుల నవనిఁ గూల్చె.

52\. క. [1]ఇలఁ బడినసహచరులఁ గని, యలిగి సుశర్ముండు దాఁకె నర్జును [2]నతనిం
దలకడచి శిఖండిప్రభృ, తులు నిగిడిరి వారిమీఁద ద్రుపదజ్ఞాతుల్.

53\. వ. ధనంజయుండును దనకు దుర్యోధనసైంధవు [1]లగ్గం బై యున్నను గ్రేఁగం
టం జూచుచు గాంగేయుపై నడరె నప్పుడు దన్నుఁ దొడర వచ్చుశల్యు
నాదరింపక ధర్మతనయుం డనిలతనయమాద్రీతనయసహితుం డై పార్థునకు
బాసట యై భీష్ముని[2]దెసకు [3]నడరె నిట్లు పాండవపంచకంబుతోఁ బెనంగు
శాంతనవుం గనుంగొని కురుపతియును సింధురాజును బరవసంబు సేసి
యప్పాండవేయులం దాఁకిన.

54\. క. శలశల్యచిత్రసేనులు, బలియుం డగు[1]కృపునిఁ గూడి పాండుకుమారా
వలిమీఁదఁ గవిసి వాలు,మ్ములు గురిసి రతండు సూచి [2]మోదం బందన్.

55\. వ. [1]తదవసరంబున శిఖండి దేవ[2]వ్రతున కెదిర్చిన [3]నొండు సేయ నొల్లమి
నాతండు కోదండంబు దుండంబులు [4]సేసి పిఱుసనఁ జేయుటయుఁ బాండ
వాగ్రజుండు వానిప్రతిజ్ఞావచనంబు లెత్తి [5]చెప్పి మొగమోడక యదల్చినం
బురికొని యప్పాంచాలపతిసూనుండు సురనదీసూను మార్కొనుటయు

---

51\. 1. యిరువది నాలుగు - చ. జ. ఝ. ట. డ. ణ. ల.

52\. 1. ఇలబడు సహచరులం గని - హ. శ. ష. 2. తనయున్ - మ. వ.

53\. 1. లడ్డంబై యున్నను-ఖ ఝ. ట. డ; లగ్గలంబై యున్నను - ల వ. కొన్ని ప్రతులు. 2. కడకు నడచె - వ. 3. నడచె - పెక్కు ప్రతులు.

54\. 1. కృపుడు గూడి - అ. ఈ. ఊ. ఖ. వ. వీ హ. 2. మోదమును బొందంగన్ - వ. స. శ; మిగులమోదం బందన్ - ఐ. మ; ముదమున బొందన్ - ర. కొన్ని ప్రతుల; నతులమోదము బొందన్ - ఘ.

55\. 1. తదనంతరంబ - శ. ష. కొన్ని ప్రతులు. 2. వ్రతుం దాకిన - ఇ. 3. నొప్పమి సేయనొల్లమి - ఎ. 4. సేసినం బిఱుసనుటయు - వీ. శ. ష. పెక్కు ప్రతులు. 5. పెట్టి - క. న. మ. ల.

మద్రనాథుం డెడసొచ్చి [6]మహానలాస్త్రంబు ప్రయోగించిన దానికిం దలంకక [7]వారించి వాఁడును వారుణాస్త్రం బేసిన నతండు తత్ప్రతి[8]హతి గావించె గాంగేయుండును ధర్మతనయుకేతుచాపదండంబులు ద్రుంచి యార్చినం జేర్చి భీముండు గదగొని రథంబు డిగ్గి రారాజుపయిం [9]గవియు టయుఁ దత్సమయంబునం దలమిగిలి జయద్రథుండు రౌద్రం బెసంగ వేగంబు మెఱసి మెఱుంగుటమ్ముల నేనూ ఱతనిపై నడరింప నతండు సరకు సేయక శరంబులు గద జడియుచుం [10]గదిసి యమ్మారుతి సింధురాజు హయంబులం జదియ మోఁదిన నాసైంధవుండు.

56\. క. [1]ఉక్కఱి యొండొకనిరథం, బెక్కుటయుఁ దొరలు దెరలి యేదెఱ నెడి రా దిక్కు ప్రజ [2]విచ్చె నప్పుడు, గ్రక్కునఁ బతి భీముమీఁదఁ గవిసెం బెలుచన్.

57\. క. ఎడఁ జొచ్చి చిత్రసేనుఁడు, వడముడిపై [1]నేయ నతఁడు వైచెం గోపం [2]బడరఁగ గద నది యుగ్రపుఁ, బిడుగుక్రియన్ మెఱసి పఱచె బిట్టుగఁ జదలన్.

58\. తే. అట్లు వచ్చునాగదఁ గని యచటియోధు, లనికి తమతమమీఁదన యడరు ననియుఁ
[1]దలఁచి [2]యొడిఁగిరి రారాజుఁ దలఁప రైరి, ప్రాణభయ మెట్టివారిఁ గీడ్పఱుప కున్నె.

59\. క. [1]అడిదముఁ బలుకయునుం గొని, చిడిముడి పడ కపుడు చిత్రసేనుం డుఱికెం బుడమికి రథహయసూతులఁ, బొడిపొడి గావించెఁ బవనపుత్త్రునిగదయున్.

---

6\. మహాస్త్రంబులు బ్రయో – పెక్కు ప్రతులు; మహేంద్రాస్త్రంబు – ఏ. 7. వారించి వాడును – పెక్కు ప్రతులు; యతండు – వా. కొన్ని ప్రతులు. 8. హతింజేసె, హతంబు చేసి – అని పాఠములు. 9. గవియుఁడుం గని – పెక్కు ప్రతులు. 10. గడంగి – కొన్ని ప్రతులు.

56\. 1. అక్కఱ, అక్కడి – అని పాఠములు. 2. నిల్చె – ల.

57\. 1. నతులశక్తి వైచినఁ – చ. పీ. శ. ష. స. శ. 2. బడర గద ప్రేయ నుగ్రపు – పీ. శ. ష. స. శ.

58\. 1. దలఁకి – అ. ఝ. డ. మ. ర. వ. ష. 2. యుండిరి – వ. ష; పారిరి – ఝ. డ.

59\. 1. వడి కత్తిపలుకయు – ప.

60\. వ. ఇట్లు చిత్రసేనుండు విరథుం డైన వికర్ణుం డతనిం దనరథం బెక్కించుకొని పోయె నట్టియెడ.

61\. శా. గంగాపుత్త్రుఁడు పాండవాగ్రజుని[1]యుగ్యంబుల్ మహిం గూల్చి స
ర్వాంగంబుల్ వెస నొంప నాతఁడు సముద్యత్క్రోధుఁ డై శక్తి వై
చెం గంపింపక [2]త్రుంచెఁ దాత విభుఁడుం శీఘ్రంబ మాద్రీసుతో
త్తుంగస్యందన మెక్క నొంచెను సరిత్సూనుండు [3]మాద్రేయులన్.

62\. క. తమ్ముల [1]నొంచిన నగ్రజుఁ, డుమ్మలికముతోడ బెరయనుత్సాహమునం
ద మ్మొందఱుఁ బరికొలుపఁగ, నమ్మొన నృపు లెల్లఁ దాఁకి రప్పుడు భీష్మున్.

63\. వ. ఇట్లు పలువురు ధరణీశు లురవడించినం బెక్కుమృగంబులు మార్కొనినం జెలంగు సింగంబు చందంబున నలిరేఁగి సురనదీసూనుండు వెరవు గలవనపాలకుండు తాళఫలంబు[1]లు దిగఁ ద్రోచు చందంబున మెఱుంగు లడరువెడంద వాతియమ్ముల నమ్మహీశుల తలలు డొల్ల నేయుచు మండల[2]చారి యై విహరించుచున్న వెఱఁగుపడి పాండవులు సూచుచుండ శిఖండికోదండపాండిత్యంబు మెఱయుచుం [3]గదిసినఁ [4]గ్రీడించి యతండు సృంజయసైన్యంబు పయిం దఱిమి దైన్యంబు నొందించె నట్టిసమయంబున.

64\. సీ. సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దానుఁ [1]గురుసైన్యములఁ గలగుండు వెట్టె
విందానువిందులు వెసఁ దాఁకి ద్రుపదుసుకొడుకుగుఱ్ఱంబులఁ గూల్చుటయును
విరథుఁ డై హారితమ్మునరదంబుపై కతఁ డేఁగిన ధర్మజుఁ డెల్లబలముఁ
[2]గవియించి యిరువురఁ గైకొని తఱిమినఁ బ్రజకుఁ జేవిచి గారాజు గడఁగఁ

---

61\. 1.యుగ్యవ్రాతమున్ — క. ఖ. 2. వాని ద్రుంచె — న. 3. తద్గాత్రముల్ — ఇ.

62\. 1. నేసిన — న. వ.

63\. 1.ఉరులం ద్రోచు తెరంగున(కరణి) — ఇ.న; డిగ ద్రోచు చందంబున—అ. 2. ప్రచారి — కొన్ని ప్రతులు. 3. గవిసిన — కొన్ని ప్రతులు. 4. గేడించి — పెక్కు ప్రతులు.

64\. 1. నాపగాతనయుపై నడరుటయును — ఇ. 2. కదియించి, కలయించి — అని పాఠములు.

తే. దమ్ములును భీష్ముఁడును ధర్మతనయు[3]సమద, సేనఁ బొదివిన వాసవసూనుఁ డడర
ద్రోణుఁ డాతని మార్కొని బాణజాల, [4]పిహితముగఁ జేసె రోదసీకుహార మెల్ల.

65. వ. ఇవ్విధంబున నాచార్యుం డేచిన నతనిప్రాపున భవత్సేనలు [1]సెలంగి పైకొనియె నయ్యవసరంబున ధర్మతనయుండు దనయెలుంగు సూపిన నగ్గలిక నాతనిమొగ్గరంబు[2]న మొనలు బెరసి [3]పరుసఁదనంబు సూపి యేపునం బెనంగుచుండ నినుండు దర్శనీయమండలుం డగుచు [4]నపరశైలశిఖరగతుం డయ్యె నయ్యెడ సంజకెంజాయ [5]నెఱయ నెత్తురుటేఱులపయి వడిం దేలిపోవుపీనుంగులం దివిచికొని చనుభూతభేతాళసమ్మర్దంబులను సమరతలప్రాంత[6]పతితంబులైనశవంబులం గైకొని చెలంగు సృగాలంబులరవంబులను దత్సమయం బతిఘోరం బగుటయుఁ ద్రిగర్తపతి[7]ప్రముఖు లగుజగతీశుల వెగడుపఱచి మెఱసినసవ్యసాచియు సైంధవాదివసుంధరాపతులం [8]జిక్కువడం జేసి యుక్కు[9]మీఱినమారుతియుం దమయన్నకుం బొడసూపి నిలిచిన నతండు సైన్యంబుల [10]నివర్తింప నియమించి సమస్తపరిజనపరివృతుం డై.

66. తే. విడిదలకుఁ బోయె నపుడు నీకొడుకు లెల్ల, నాపగానందనునికడ కరుగుదెంచి
బలము లన్నింటిఁ [1]దివియంగఁ బనిచి మరలి, రాత్మసన్నివేశంబుల కతఁడుఁ దారు.

67. వ. సప్తమదివసరజనీసమయావసానం బగుటయు.

---

3. సకలసేన - ఝ. డ. ల. 4. విహితముగ - మ. వ. పీ. శ; నిహితముగ - త. వ.

65. 1. గడంగి - మ. వ. 2. ల. - కొన్ని ప్రతులు. 3. పరవసంబులు సూపి - వ. 4. చరమశైల, పరమశైల, పశ్చిమ శిఖరి (శైల) - అని పాఠములు. 5. రంజిల్లు - క. వ; నిగుడ - ద. 6. పతితశవఖాదనవిలాసంబు లైన - ఔ; పతిత శబరబంధన లోలంబు లైన-చ. 7. ప్రభృతు లగు - ఖ. ల. 8. జిక్కుపరచి - ఇ. ఉ. ఎ. వ. 9. మిగిలిన - ఇ. ఈ. ద. ర. వ. పీ. 10 నిర్వర్తింప - పీ. శ. ష. పెక్కు ప్రతులు.

66. 1. మరలంగ - పెక్కు ప్రతులు.

-: భీష్ముని యష్టమదివస యుద్ధక్రమము :-

సం. 6–83–1

68. క. [1]భూపోత్తమ విను పాండు,క్ష్మాపాలతనూభవులును గౌరవులును నా
టోపంబున సంగరకే,లీపరులై వెడలి రుగ్రలీలలు మెఱయన్.

69. వ. అట్టియెడం గురుపితామహుండు గూర్మవ్యూహం[1]బు దీర్చినం గనుంగొని ధర్మతనయుండు ధృష్టద్యుమ్ను నాలోకించి కౌరవవ్యూహంబు సూచితే దీనికిఁ బ్రతివ్యూహం బెయ్యది దాని సంఘటింపు మనిన నతండు శృంగాటక వ్యూహంబు [2]పన్నె నిట్లు రెండుసైన్యంబులు మోహరించి యుత్సాహం బులు మెఱయ భేరీమృదంగాది[3]తూర్యంబులు మొరయం దలపడినఁ బటు హేతివ్రాత[4]పరస్పరసంఘట్టనంబులం బొగ లేమి మంట లెగయం జటులస్యం దనమాతంగతురంగభటకదంబకంబుల గమనవేగంబున [5]నెగయుపరాగపట లంబు లంబరంబునం బరగ నీక తత్తదనీకానేకరక్తధారాసారంబు లడరి యడంగించిన నతిరౌద్రంబునఁ బెనంగు నాసమయంబున.

70. క. మీతండ్రి సింహనాద,స్ఫీతముఖుం డగుచు నాత్మసేన గడచినన్
భీతిం బాండవయోధ,వ్రాతము మార్కొనక యొదిఁగె వసుధాధీశా.

71. చ. అనిలతనూజుఁ డొక్కరుఁడు నార్చుచు భీష్ము నెదిర్చి సూతుఁ జం
పిన రథ మీడ్చికొంచుఁ గురుబృందము [1]గొందల మంద నశ్వముల్
వెనుకకుఁ బాఱె నప్డు పృథివీవర పాండవసేన యుబ్బె నీ
తనయుఁడు భీముకట్టెదురఁ దాఁకె మనాథుఁడు విక్ర[2]మోద్ధతిన్.

---

68. 1. భూపాలోత్తమ పాండుక్ష్మాపాల – కొన్ని ప్రతులు.

69. 1. బమర్చినం – ఊ. 2. దీర్చె – కొన్ని ప్రతులు. 3. నాదంబులు, వివిధ నాదం బులు – అని పాఠములు. 4. పరంపరా సంఘట్టనంబుల – ల. 5. నెగయు ధరాపరాగ – వీ.

71. 1. తల్లడమంద – ఉ. ఏ. య. 2. మోన్నతిన్ – హ.

-: సునాభుఁడు మొదలగు కురుకుమారులు భీమునిచేఁ జచ్చుట :-

సం. 6-84-12

72. ఆ. అట్లు దాఁకుటయు బకాంతకుఁ డంత్యకాలాంతకుండు వోలె నలిగి బోములు
మండి వడంగ నొక్కవెడఁదయమ్మునఁ దల,నఱికి వైచి వెలుచ నవ్వె నధిప.

73 వ. ఇట్లు సునాభుండు [1]వడుట గనుంగొని కోపాటోపంబునఁ దత్సోదరులగు
[2]నాదిత్యకేతుండును నపరాజితుండును బహ్వాశియుఁ [3]బండితుండును [4]గుండ
ధారుఁడును విశాలాక్షుండును మహోదరుండును వృకోదరుపై నొక్క
పెట్ట కదిసి పెక్కువిధమ్ము లగునమ్ములం జెక్కింట నొప్పించిన నప్పాండవ
వీరుండు రోషాతిభీష[5]ణుం డై యేరికిం దేఱి చూడ రాక పటుభల్లంబున
నతినిశితక్షురప్రముఖంబున శితప్రదరంబున శాతక్షురికాముఖంబున [6]దీప్తా
ర్ధచంద్రాంబకంబున ఖరనారాచంబునఁ గ్రూరబాణంబున నక్కుమార
సప్తకంబు సమవర్తి [7]సమీపంబున కనిచినం దక్కటికుమారు లుక్కుదక్కి
వెఱఁగుపడి యంతంత నొదిఁగిన.

74. తే. నాఁడు సభ నాడినంతయు నేఁడ చేయు, నట్టు లున్నాఁడు [1]మొనతల
ననిలసుతుఁడు
విదురుపలుకులు దలకూడె వేయు నేల, యనుచు వెఱఁ జూచు
చుండిరి మనుజపతులు.

75. క. నీవు తనూ[1]జుల దుర్వినయావేశం బుడుప వైతి వది దుర్ధశలం
గావింప నింకఁ జావక, పోవచ్చునె వారి కనిలపుత్త్రుని చేతన్.

---

73. 1. వడుటయుం - కొన్ని ప్రతులు. 2. ఇచ్చట నీయబడిన ధృతరాష్ట్రుని తనుజులలో "పండితకుడు" అనువాడుగాక మిగిలినవారిపేరులు 1-5-107 నందలి పేర్లతో సరిపడుచున్నవి. 3. బండితకుండును, ఖండితకుడుంను - అని పాఠములు. 4. గుండోదరుండును - ఇ. ఏ. 5. ణుండై పటుభల్లంబున శాత - అని పెక్కుప్రతులు. 6. దృఢ విశిఖంబున, దృఢద్విముఖంబున, దృఢలిప్తవిశిఖంబున - అని భిన్న పాఠములు. 7. సమీపవర్తులం జేసిన - కొన్ని ప్రతులు.

74. 1. చెలరేగి - అ.

75. 1. జుని - వ.

76\. వ. అది యట్లుండె నప్పుడు సుయోధనుండు దనచుట్టు నున్న యోధవీరులం గల యంగనుంగొని భీమసేను మార్కొనం బంచి భీష్ము[1]కడకుం జని [2]శోకగద్గద కంఠుం డగుచు నతనితో ని ట్లనియె.

77\. ఉ. ఇమ్మెయిఁ గిట్టి వాయుసుతుఁ డేపునఁ గోలుమసంగి పొంగి నా
తమ్ములఁ జంపఁగా నకట తప్పక చూచెదు గాని రోషతో
కమ్ములు లేవు తోడుపడఁ గా దని నిల్చితొ యున్న[1]వారు నొ
క్కమ్మడిఁ జావఁ గోరి యిటు లూరక యుండితొ కౌరవోత్తమా.

78\. వ. అనిన విని నదీసూనుండు దాను నెదురు శోకించి యతని కి ట్లనియె.

79\. క. ఇది మున్న [1]యేను ద్రోణుఁడు, విదురుండును [2]జెప్పి[3]నదియ విన వప్పుడు బె ట్టిదు లగుపాండుతనూజుల, కెదురై నిర్జింప వశమె యాశున కైనన్.

80\. తే. మనకుమారులలోన నయ్యనిలతనయు, బారి [1]కగపడువాని నెవ్వారి కైనఁ గావఁ దలకొన శక్యంబు గాదు మనకు, నడలఁ బనిలేదు దీనికి నధిపతనయ.

81\. క. వీరస్వర్గము ధనముగఁ, [1]బోరుము నీ వింక నొండుబుద్ధు [2]లుడుగు మేఁ బోరెద నోపినమెయిఁ దెగి, పోరఁగ జయ మైన దానిఁ బోఁ [3]ద్రోచెద మే.

82\. వ. [1]అనియె నని [2]చెప్పిన విని వైచిత్రవీర్యుండు.

---

76\. 1. దెస కరిగి — ఎ. ఓ. ద; కడ కరిగి — కొన్ని ప్రతులు. 2. వగచి — వ.

77\. 1. వారి నొక్కుమ్మడి — కొన్ని ప్రతులు.

79\. 1. నీకు — హ. 2. జాటి చెప్ప విన వప్పుడు — ఔ. ల. వీ. శ. ష. స. 3. నదియె, నదియు — అని పాఠములు.

80\. 1. కగపడ్డవాని — కొన్ని ప్రతులు.

81\. 1. బోరుట దగు గాక యొండు — ఇ; బోరుము మదిలోన నొండుబుద్ధు లుడిగి(గు) నేఁ బోరెద — శ. వ; బోరుము మదిలోన నొండు బుద్ధులు దగునే–న. 2. లుడిగి నే బోరెద — లు. వీ. ష. 3. ద్రోచెదనే — శ. ష. కొన్ని ప్రతులు.

82\. 1. ఈ వచనము 'ల' ప్రతిలోలేదు. 2. చెప్పిన విన్న నై వైచిత్ర — ప.

83. తే. గురుఁడు భీష్ముండుఁ గలుగంగఁ గురుకుమారు, లిట్టు వొలిసెదరే మున్న యింతవట్టు
దల్లియును నేనుఁ [1]జెప్పినఁ [2]బొల్ల సేసి, దానిఫల మిప్పు [3]డానుయోధనుఁడు గనియె.

84. వ. ఇంక నమ్మాట లాడుట గతజలసేతుబంధనంబు దానిం జాలింపు మట్లు కురుకుమారులచావు గనుంగొని గాంగేయకుంభసంభవులు పదంపడి యేమి సేసి [1]రని యడుగుటయు సూతనందనుం డంబికానందనున కిట్లను భీష్ముండు భయంకరాకారుం డై మారుతి[2]పయిం దేరు వఱపె నతనిం గని ధర్మనంద నుండు సేయి వీచిన ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకులు దలకడచి యతనితోఁ దలపడి రంతకు మున్న దుర్యోధనుపనుపునఁ గవిసినరథికులమీఁదం జేకితాన ద్రౌపదేయసహితంబుగా సవ్యసాచి యడరె నభిమన్యుండును హైడింబుం డును ధార్తరాష్ట్రులదెసం దఱిమి రిత్తెఱంగున మూఁడుగట్టిమొత్తములు బెట్టిదంబు సేయ మనబలంబులు [3]బోక పెనంగు[4]చుండె నట్టియెడ.

85. క. ద్రోణాచార్యుఁడు ద్రుపద,[1]క్షోణీశ్వరుమోహరంబు సుడివడి దివి గీ ర్వాణులు గీర్తింపఁగఁ బటు,బాణపరంపర [2]లనేకభంగులఁ బఱపెన్.

86. క. కరిఘటలు మీఁద భీముఁడు, సరభసముగ [1]నేయునారసంబుల మ్రోడై ధరఁ బడి రూపఱినను దిన,కరుకరములఁ దమము విరియుగతి [2]దోఁచె నృపా.

87. క. అఱిముఱి గుఱ్ఱపు[1]దడముల, కుఱికి కవలు [2]రౌద్రరసమహోగ్రాకృతు లై నఱికిన నచ్చట రథములు, వఱపఁగ రా దయ్యె నుభయబలయోధులకున్.

---

83. 1. జెప్పితి మెల్లభంగి–ల. 2. బొల్లు సేసి – ద. వ. 3. డోగి సుయోధనుఁడు – వ.

84. 1. రనుటయు సూత – పెక్కు ప్రతులు. 2. మీద – ఇ. న. వ. 3. బోనీక – ఇ; పోరికమఱి పెనంగు – ఈ. 4. చుండి రట్టియెడ–కొన్ని ప్రతులు.

85. 1. క్షోణీవిభు – ల. 2. ల నెల్లభంగుల – ద.

86. 1. వరుసన్, దూలై, నోడై – అని పాఠములు. 2. పొలిచె నృపా – ల.

87. 1. దళముల కురికి – కొన్ని ప్రతులు. 2. రౌద్రభంగి నుగ్రాకృతు లై – ల.

88. తే. నరుఁడు రథికజనంబుపై సరభసముగ, నేయఁ
గేయూరహారతత్కాయశకల
వితతి నిల యొప్పె రాలినవివిధపుష్ప, పుంజమునఁ బోల్పు
[1]నుద్యానభూమి వోలె.

89. వ. అప్పు [1]డిరావంతుండు.

90. క. తురగనికరంబుతోడం, గురుసైన్యము దఱియఁ జొచ్చుకొత్తల సూడం
గర మొప్పె [1]లఘువిహంగో,త్కరముపయిం గవియు డేగ [2]తండంబుగతిన్.

91. వ. ఇట్లుక్కు మిగిలి యెక్కినయర్జుననందనుం గనుంగొని శకునితమ్ములు [1]శుకుండును [2]శర్మవంతుండును వృషకుండును [3]నార్జవుండును గజుండును గవాక్షుండును గుఱ్ఱపు[4]మొత్తంబులతో నగ్గలిక నతనిపై వాహనంబులం బఱపి పిఱుదివియక [5]రాయిరాయి దాఁకినట్లు దాఁకి రయ్యిరువాఁగును విచిత్రంబుగాఁ బోర నయ్యార్వురు గాంధారకుమారులు నయ్యిరావంతుం బొదివి సెలకట్టెలవాట్ల డొంకెనపోట్ల నొప్పిం[6]చిన బరిగోలలపోటులు దాఁకి నం గినిసిన[7]గంధగజంబుచందం బై.

92. ఆ. అతఁడు ధన్వి యగుట నశ్వంబుఁ దోలఁగ దాఁ,టించి తిరిగి యాకడిందిమగల
నారసములు పెక్కు నాఁటించి నొప్పించి, వెగడు వఱచె సురలు
వొగడుచుండ.

93. వ. అట్టియెడ.

---

88. 1. నున్నతభూమివోలె – న.

89. 1. డిలావంతుండు – పెక్కు ప్రతులు.

90. 1. లఘువిహంగోత్కరము – ఈ. ఉ. పెక్కు ప్రతులు; ఘనవిహంగోత్కర – వా. కొన్ని ప్రతులు. 2. తండము పగిదిన్ – ఇ.

91. 1. శకుండును – కొన్ని ప్రతులు 2. శరవంతుండును – హ. 3 సంజయుండును – శ. కొన్ని ప్రతులు; సృంజయుడును – ష. 4. మొత్తంబులతో – ఓ. ల. వీ. శ. ష; మొగ్గరంబులతో – వా. కొన్ని ప్రతులు. 5. రాయి రాతిం దాకినట్లు – ఐ. ర; రాతం దాకినట్లు – మ. ల; కొరవి కొరవిం దాకినట్లు – ఎ. 6. చి వెగడు పరచిన నతండు బరిగోలపోట్లు దాకినం గినిసి – ఇ. ఈ. వ. 7. భద్రగజంబు – ఎ. ద.

94. క. మునుపోటులఁ బడి నొచ్చుటఁ, దనగుఱ్ఱము [1]వడినఁ బడక ధరణికి లంఘిం
చెను [2]వెఱపు లేక పేరు,క్కునఁ బటుఖడ్గంబు వెలికికొనుచు రయమునన్.

95. వ. ఇట్లు భూచారి యయిన భుజగరాజదౌహిత్రుం జూచి యేచి యాసుబల
సూనులు సుట్టు ముట్టి.

96. క. [1]పొడువఁగ [2]వ్రేయఁగ నతఁడుం, గడు[3]నుఱ వగునేర్పు కడిమికలిమిం దనపైఁ
బడకుండఁ గృపాణమ్మునఁ, గడుఁజిత్రపుగతుల [4]జడిసెఁ గైదువు లెల్లన్.

97. వ. ఆ[1]రౌతులు వీఁడు గాలుమానిసి యగుటం జేసి మనకు నొప్పింప [2]వెరవుగా
దయ్యెడు ననుదుర్విచారంబున.

98. ఆ. ఆర్వురను గడంగి హయముల డిగి పటు,ఖడ్గదీప్తు లడరఁ [1]గదియుటయును
బ్రమరి తిరిగి వారిఁ బంద్రెండుదునియలు, సేసి క్రీడికొడుకు సెలఁగి యార్చె.

99. క. వెక్కస మందుచుఁ గురుపతి, రక్కసుతో ననియె నియ్యురగదౌహిత్రుం
డొక్కఁడ మనసైన్యంబు, ల్సొక్కడఁచుచు నున్నవాఁ డలంబున కంటే.

*-: అలంబుసునిచేత నిరావంతుఁడు మృతుం డగుట :-*

సం. 6_86_48

100. వ. అని యాతనివలనను సూపినం గనుంగొని దైతేయనాథుండు.

---

94. 1. నడువకున్న - బ; ధరణి వడిన ధాత్రికలంఘిం - వ. మ. 2. వెఱపులేక - ల. శ. ష. హ; మరువులేక - న. మ; మఱపులేక - వా. కొన్ని ప్రతులు.

96. 1. పొడ వడగ జేయ నాతడు - ఉ. 2. నడువగ నాతడు - ఆ. ఓ. ఔ. న. ల. 3. వడి నేర్పు నను బలిమి కడిమిం దనపై - ఇ. ఈ; వడి నేర్పు నను కడిమి - శ. 4. నడచె - ఇ. ఈ. ద.

97. 1. రాహుత్తులు - అ. ఇ. బ. ర. ల; రావుతులు - ఎ. వ. 2. ననువు గా దయ్యెడు - వ.

98. 1. గడగుటయును - ర. వ.

101. ఆ. కడఁగి నడచి మాయ గావింప నయ్యైరా,వంతు నశ్వ[1]సేనయంత సేన
పుట్టి వారిమీఁదఁ బురికొని తలపడి, సమయఁ [2]జేసె నదియు
సమసె నధిప.

102. వ. అయ్యైరావంతుం డొక్కరుండును బోలి వానివిక్రమంబున నలంబుసుని మార్కొని రయంబు మెఱయ మెఱుంగు మెఱసినట్లు గవిసి కరవాలంబున విల్లు దునిమిన దనుజుండు వినువీథి కెగసి మాయాశరంబుల నతని నొప్పించి నంగోపించి గగనంబునకు లంఘించి.

103. క. ఘనఖడ్గంబున వానిం, [1]దునుమ నలంబుసుఁడు దోడుతో నుజ్జ్వల యా
వనరూపము గ్రొత్తగఁ గై ,కొని [2]పెనఁగం బెనఁగఁ బార్థుకొడు
కచలుం డై.

104. క. జననీవంశంబునఁ గల,యనుపమమాయానుభావ మాత్మఁ దలఁచి శే
షునిచందం బగురూపం,బున బేర్చి యనేకనాగ[1]పుంజముతోడన్.

105. చ. అడరిన దానవుండు గరుఁ[1]డాకృతిఁ గై కొని మాయతోడ [2]లో
పడ భుజగంబులం బోదివి పట్టి రయంబున మ్రింగి యప్డు చే
డ్పడు నరుపట్టి కంఠము గృపాణమునం దెగ[3]వ్రేయ మేదినిం
బడి మొగ మొప్పెఁ బూర్ణశశిభాతి [4]వికారము లేసి[5]చెన్నునన్.

106. వ. అంత వియత్తలం బుదాత్తమిహిరమండలమండితమధ్యం బయ్యె నని చెప్పిన విని ధృతరాష్ట్రుం డయ్యైరావంతుండు వడినం బాండవులును వారి యోధవీరులును జేసినతెఱంగు సెప్పు మనవుడు సంజయుఁ డతని కి ట్లనియె.

---

101. 1. సైన్య మంత–ఝ. ల. 2. జేసి తాను సమసె నధిప – గ. జ. డ. ద. బ. ల.ర. హా; జేసి వారు సమసి రధిప – అ. ఎ. ఝ.

103. 1. దునుమందునుమ – ర. వ. హా; నడుమను దునుమ – ఐ. మ. వ. 2. తనతోఁ బెనఁగ – ఆ. ఒ. న. ల. వ. వీ. శ. ష; వడితో బెనగ ర. వ; వడితో జనగ – వ; పెనగగ జూచి పార్థు – మ.

104. 1. పుంజంబులతోన్ – ఇ. ఊ. ఎ. ఖ.

105. 1. డాకృతి యై వెస మాయ – ల. వీ. శ. ష. స. 2. లోఁబడ–వీ. శ. ష. సూ; లోబడు – అ. ల. వ. 3. వ్రేయ – పెక్కు ప్రతులు; వైవ – వా. 4. వికాసము లేని – ఈ. వ. 5. చూపునన్ – ద; చెల్వునన్ – ఏ.

107. శా. తోడంబుట్టువు[1]పాటు సూచి యలుకన్ దుర్వారశుంభద్గతిన్
హైడింబుండు మహాసురేంద్రులు గజేంద్రారూఢులై సంగర
క్రీడాలోలతఁ దన్ను మీఱి విలయాగ్నిం బోల దిక్చక్రమ
ల్లాడన్ బెట్టుగ నార్చి చొచ్చె గురుసైన్యంబున్ [2]మహోగ్రంబుగన్.

108. చ. కరమున నున్న శూలమునఁ గ్రమ్ము మెఱుంగులు [1]శత్రుసైన్యభీ
కరములుగా గజాశ్వభటకాయములన్ గుది గ్రుచ్చినట్లుగాఁ
[2]జెరువుచు వచ్చువానిఁ గురుసింహుఁడు సూచి మదాంధసింధురో
త్కరరథసాతిభీషణముగాఁ గవిసెం బటువిక్రమోద్ధతిన్.

109. క. వంగా[1]ధిపతియు శౌర్యో,త్తుంగతనుం డగుచు నీసుతుం డలరఁగ దై
త్యుం గదిసె గాఢమదమా,తంగఘటలతోడ [2]నపుడు దారుణభంగిన్.

110. వ. ఇట్లు దన్ను బెట్టు గిట్టిన[1]కరినికరంబులం గని పొంగి కరవాలంబు గొని యడరి ఘటోత్కచుండు.

111. క. కరదంతకర్ణమస్తక,చరణము [1]లవి తోఁపకుండుచందముగా ని
ష్ఠురవిక్రమకేలీవి,స్ఫురణంబున రూపుమాపె సురలు నుతింపన్.

112. వ. ఇవ్విధంబున గజంబులు వొలిసిన గజపురనాథుండు [1]రోషంబున నురవడించి నారాచవృష్టి ముంచి వేగవంతుండును విద్యుజ్జిహ్వుండును [2]బహ్వాశియు నను దనుజప్రధాననాయ[3]కులం బ్రేతపతిపురంబున [4]కనిచి యాభీమసేనతనయు

---

107. 1. సావు జూచి – ఝ. న. బ. య. ల. హ. 2. మహోదగ్రతన్ – ఇ. ఎ. ల.

108. 1. శత్రుసంఘభీ – పెక్కు ప్రతులు. 2. జెరుపుచు – కసం. న. బ. మ. ల.

109. 1. ధీశుడు – హ. 2. శీఘ్రదారుణభంగిన్ – చ. ల.

110. 1. కరిసేనానికరంబు – చ. వ; కరిసేనానీకంబు గని – ల.

111. 1. లని తోపకుండ – న. బ. మ. శ. ష. శ.

112. 1. క్రోధంబున – హ. 2. బ్రహారియు నను దనుజ – ఎ. ఙ. ఝ. ట. డ. త. ద. ర. ల; బ్రహాసి–వ. 3. కు లుద్రేకంబునం గదిసినవారిం బ్రేతపతిపురంబున కనిచి రణప్రారంభంబునం గదిసి యా – న. వ. వీ. స. శ. 4. కనిచి రణప్రారంభంబునం గదిసి– శ. ష. హ.

తనువున నిశాతశరములు నించినం గోదండపాణి యై క్రోధాగ్నిజ్వాలలు [5]నిగుడువడువునఁ బటుబాణజ్వాలలు నిగిడించి కదిసి కురుపతి నవలోకించి [6]యాఘటోత్కచుం డిట్లనియె.

113. ఉ. పాడియు సత్యముం గలుగు [1]పాండుతనూజుల కీవు దొల్లి యె
ప్పాడిమెయిన్ సభం గరము భంగ మొనర్చితి నాఁటియందఱుం
జూడఁగ నేఁడు [2]తత్ఫలము సూపెద నీ కని మూదలించి [3]మై
నాడఁగ నేసెఁ గృష్ణభుజగావలిఁ బోలిననారసంబులన్.

114. క. దానికిఁ జల [1]మెడలక నీ,సూనుం డాపవనసూనుసూనునిమేనం
దా నుగ్రశరము లిరువది,యేను వెసం గీలుగొలిపె నిభపురనాథా.

115. తే. అసుర కినిసి కృతాంతజిహ్వాయనుబోని, శక్తి యెత్తిన నమ్మహీశ్వరున కపుడు
వంగపతి యడ్డపడుటయు వానిగజముఁ, గూల వైచిన నాతండు నేల కుఱికె.

116. క. ఏనుంగు వడిన నచ్చటి, సేనలు దెరలుటయు రాజసింహుఁడు [1]దన్నుం
దాన పురికొల్పికొని వెఱ, పూనక దానవునియెదుర నొక్కఁడ నిలిచెన్.

117. క. నిలిచి మహాస్త్రం బెఱమం,టలు గ్రమ్మఁగఁ బెలుచ నేయుటయు నడుమన చె
క్కలు గాఁగ నేసి దిక్కులు, నలిగులిగా నతఁడు సింహనాదము సేసెన్.

118. వ. [1]ఇట్లు సేసిన విని గాంగేయుండు గురుపతియోధవీరులం గలయం గనుంగొని.

---

5. నిగిడించి — వీ; నిగిడించి కదిసి — న. బ. ర. ల. శ. ష. హ; నిగుడం బ్రబదరాగ్ని పరంపరలు — ఇ. వ. 6. యతండు — వా. కొన్ని ప్రతులు; యాఘటోత్కచుం డిట్లనియె — ఈ. త.

113. 1. పాండుతనూజుల కీవు—అ. ఓ. జ. ఝ. త. న. బ. వీ. శ. ష; పాండవకోటికి నీవు— వా. కొన్ని ప్రతులు. 2. తత్ఫలం బిపుడ సూపెద — ల. 3. నోనాడగ — ల.

114. 1. మొదవగ, ముడపగ, మెడపక — అని పాఠములు.

116. 1. దనకుం దాన — వీ. శ. ష.

118. 1. ఇట్లు సేసిన — ఇది పెక్కు ప్రతులలో లేదు.

119. క. భీమునితనయుం డత్యు
[1]ద్దామగతిన్ రాజుఁ [2]దొడరి తత్కరటిఘటా
[3]స్తోమంబు గూల్చి యాతని
పై మారి మసంగినట్లు బలువిడిఁ గవిసెన్.

120. వ. అఘటోత్కచుండు దివిజులకు [1]దుర్జయుండు మీరు వేవేగ రారాజుం గూడి కొనుం డనిన సేనాపతి పలుకులకు గురుకృపాశ్వత్థామ చిత్రసేనులు బృహద్బల బాహ్లికావంతీనాథభూరిశ్రవసులును సైంధవసోమదత్తవివింశతి వికర్ణులు నేకోద్యోగంబునం దమతమ యనుచరు లైనయోధవీరసహస్రంబులతో రథంబులు [2]దోలికొని చని భవత్తనయుం బరివేష్టించి హిడింబాతనయుం దాఁకిన నతండును [3]దైతేయబలంబులం గొని బలిమి మెఱసి నిలిచి మార్కొనియె నారెండుసైన్యంబులు నొండొం[4]టి కెదిర్చి పేర్చి పెనంగుచుండ నాభీమసేననందనుం డాచార్యప్రభృతు లగునా[5]పన్నిద్దఱపై బహుప్రకారక్రూరబాణంబులు వరగింప నందు.

## -: ఘటోత్కచుండు ద్రోణాచార్యప్రభృతులతో యుద్ధంబు సేయుట :-

సం. 6_88_25

121. క. [1]కొందఱసూతులు వ్రాలిసిరి
కొందఱిచాపములు దునిసెఁ గొందఱ చటుల
స్యందనహయాలి పడియెను
గొందఱ యంగములు వ్రస్సెఁ [2]గురుకులముఖ్యా.

---

119. 1. ద్దామత రారాజు - ఘ. బ. ర. 2. బొదివి - అ. ప; దాకి - ఎ. గ. ద. 3. స్తోమములు - కొన్ని ప్రతులు.

120. 1. దుర్జయుండు - పెక్కు ప్రతులు; నజయ్యుండు - వా. 2. దరిమి-ఇ. 3దైత్య - ఇ. న. ల. 4. టిండని - వీ. శ. ష. కొన్ని ప్రతులు; టికింబేర్చి - ర. హ; టికిం గవిసి పేర్చి - న. వ. 5. పన్నిరువురపై - పెక్కు ప్రతులు.

121. 1.కొందఱి - శ. ష. కొన్ని ప్రతులు. 2. గురువంశనిధీ - ల. శ. ష. కొన్ని ప్రతులు.

122. వ. ఇట్లతిరథమహారథు[1]లం జిక్కుపఱచినరక్కసున కలిగి రయంబున సాధనంబులు సమకట్టికొని [2]రభసంబున నాకుంభసంభవాది ద్వాదశ రథికవరులు నొక్కపెట్ట చుట్టుముట్టి మహాస్త్రజ్వాలాజాలంబులం బొదివిన.

123. ఆ. ఓర్వ[1]రాక దానవోత్తముఁ డంబర
వీథి [2]కెగసి పోయి విపులరవము
సెలఁగఁ బెలుచ [3]నడరి జీమూతభంగి దు
ర్దాంతుఁ డైనఁ జూచి ధర్మసుతుఁడు.

124. వ. భీమసేనుతో నిట్లనియె నిక్కడ భీష్మబారిం బడిన పాంచాల బలంబులఁ [1]బరిపాలింపను నక్కడనాచార్యా[2]దుల కగపడ్డ ఘటోత్కచుం గావను వలసి యున్నయది యివ్వలనకిం గవ్వడి గలండు నీ వవ్వలనికి వేగంబ యరుగు మనిన సింహనాదంబు సేయుచు.

125. క. కౌరవబలము[1]లు పుడివడ
మారుతి గవియుటయు మెఱసి మార్కొని కురుధా
త్రీరమణుఁ డర్ధచంద్రా
కారశరము దొడిగి ధనువు గ్రక్కునఁ దునిమెన్.

126. తే. తునిమి తోడన క్రొవ్వాఁడిదొడ్డనార
సంబు భీమునివక్షస్స్థలంబు దూఱ
నేయుటయు [1]సోలఁ గని ద్రౌపదేయు లడరఁ
గడఁగె సౌభద్రుఁడును ఘటోత్కచుఁడుఁ [2]గలసె.

127. వ. ఇట్లు దండ్రి నొచ్చినఁ బాండుపౌత్త్రులు నీపుత్త్రునిపై నొక్కపెట్ట మిక్కుటం బగుకోపంబునం గవిసిన.

---

122. 1. లనెల్ల జిక్కు - ర. 2. సంరంభంబున - ఇ; సరభసంబున - ఒ. ఘ. చ. వ.

123. 1. లేక - కొన్ని ప్రతులు. 2. కెగిరి - అని పాఠములు. 3. నొదరి, నుదరి, నొదిగి, నెదిరి, నుగ్ర - అని పాఠములు.

124. 1. రక్షింపను - ఘ. 2. దిరథికుల కగ, దియోధవీరుల కగ - అని పాఠములు.

125. 1. లజదుపుచు - ఈ.

126. 1. సోలె గని - పెక్కు ప్రతులు. 2. గదిసె, గవిసె - అని పాఠములు.

128. చ. కని కృపబాహ్లికాదిరథికప్రకరంబు గడంగి వారి మా
ర్కొని పెనఁగంగ దేటి కడుఁ గ్రూర[1]త నేచిన మారుతాత్మజుం
జెనసి గురుండు రక్త [2]పరిషిక్తునిఁ జేసిన నాతఁ డల్గి యా
తని నొకనారసంబున నుదగ్రత మూర్ఛ మునుంగ నేసినన్.

129. మ. ధనురాచార్యునిఁ [1]జూచి తత్తనయుఁడున్ ధాత్రీశుఁడున్ భీము మా
ర్కొని రాతం డెలనవ్వు [2]చెన్నుగ గదాఘోరాకృతిం దేరు డి
గ్గిన యాలోనన తేటి ద్రోణుఁడు గడంగెం జూచి తోడై కృపా
దినికాయంబుఁ [3]గడంగి వాయుసుతు[4]పైఁ దీవ్రాస్త్రముల్ నింపఁగన్.

130. క. ఏపున హిడింబసుతుఁడును
ద్రౌపదిపుత్త్రులు సుభద్రతనయుఁడుఁ గోపో
ద్దీపితు లై వారలయా
టో[1]పముఁ గుదియించి రతిపటుప్రదరములన్.

131. వ. అప్పు [1]డనూపభూపాలుండును భీమసేనసఖత్వలోలుండు నగునీలుండు నశ్వ
త్థామం దొడరి నొచ్చినం గని ఘటోత్కచుండు.

132. క. తలపడి యగ్గురునందనుఁ
జలమున నొప్పింప గురుఁడు సరభసముగ ను
జ్జ్వలబాణావృతుఁ జేసిన
బలమటి దనుజుండు మాయఁ బన్నెఁ గుపితుఁ డై

133. వ. ఇవ్విధంబున హిడింబాసూనుం[1]డు సేసినమాయం జేసి.

---

128. 1. తఁ బేర్చిన-శ. ష. 2. పరిషిక్తి(క్త)త గాత్రుని జేయ నల్గి – ఖ. ఝ. ట. డ. వ.

129. 1. గాంచి – పెక్కు ప్రతులు. 2. చెన్నలర దా ఘోరా – ఓ; చెన్నొనగ ఝ. బ; చెన్ను గదురన్ – న. 3. నుగిట్టి – చ. ర. 4. మై – కొన్ని ప్రతులు.

130. 1. పముగుందించి రతి – ఘ. ల. శ; పం బుడిగించి రతి – గ. ద.

131. 1. డువివిధానూప – కొన్ని ప్రతులు; డు దశార్ణభూపాలుడు – ఆ. ఐ. ఔ. చ. న. మ. ర. ల. శ. ష. హ.

133. 1. డొనర్చిన, డుపన్నిన – అని పాఠములు.

134. క. గురుఁడు మొదలై నయాప
న్నిరువురుఁ గురుపతియు నొవ్వ నేటులఁ బడి నె
త్తురు దొరఁగ సోలి సంగర
ధరణిం బడినట్లు దోఁచెఁ దత్సేనలకున్.

135. చ. కనుఁగొని సైన్యముల్ విఱిగి క్రందుకొనన్ వెసఁ జాఱ నాపగా
తనయుఁడు సేన [1]నాఁగి [2]యివి దైత్యులమాయలు గాని [3]బోంకు బోం
కని యెలుఁగెత్తి చెప్పఁగ భయంబున నమ్మక[4]పోయె నట్లువో
యినఁ జనుదెంచెఁ గౌరవమహీశుఁడు [5]దీనత భీష్మపాలికిన్.

136. వ. వచ్చి యి ట్లనియె.

137. క. నీవును ద్రోణుఁడు గలుగం
గా వైరులచేత నేను [1]గష్టపడితిఁ గా
దే వారితోడఁ దలపడి
చావొండెను విజయ మొండె సంపాదింతున్.

138. చ. [1]అన విని [2]నవ్వి పాండవులయంతటివారి[3]కిఁ గాక నీకు మా
ర్కొన నగు నయ్య [4]యిప్పరుసు కుత్సితవర్తన మిట్టి[5]దుస్తరం
బునఁ [6]దగులావు సేయ మముబోఁటులు లేరె చలంబు డింపు మీ
వని [7]పతితోడఁ జెప్పి సరిదాత్మజుఁ డప్పుడు ప్రాభవంబునన్.

139. వ. భగదత్తు నాలోకించి.

---

135. 1. జూచి – అ. ఏ. 2. యిది దైత్యుని – కొన్ని ప్రతులు. 3. పోకుపో కని–కొన్ని ప్రతులు. 4. పోయి రట్లు – ఊ. ఐ. త. మ. 5. భీతిని – వ.

137. 1. గప్పుబడితి నింకేవారిం – చ. ర. ల.

138. 1. అనవుడు – పెక్కు ప్రతులు. 2. వించు – ఐ. ఓ. ఔ. మ. 3. నెదిర్చి బెట్టు– అ. ఇ. ఈ. ఏ. 4. యీపదుచుకుత్సిత – పెక్కు ప్రతులు; యి ట్లగుట – ఏ. వీ. ష; యి ట్లనుట – అ. 5. దుస్థలంబున – ఆ. ఒ. ఔ. ఖ. ఘ. న. ర. హ; దుస్తలంబున– ఊ. ఐ. చ. బ. మ. 6. గడులావు – పీ. శ. ష. 7. నృపుతోడ – పెక్కు ప్రతులు; నియమించి చెప్పి – ఎ.

140\. క. దనుజు [1]లొనరించుమాయలు
నినుఁ జేరవు వారి గెలుతు నీ [2]విప్పుడ యీ
జనపతి మెచ్చఁగ [3]నాదై
త్యుని గెలువుము నీదుసేనతో నడరి వడిన్.

141\. వ. [1]అనినం బ్రాగ్జ్యోతిషపతి [2]మేటిమగండు గావున నమ్మాటకుం బొంగి సింగం [3]బడరినచందంబున నార్చి సుప్రతీకంబు నెక్కి సేనాసమేతుం డై.

142\. తే. [1]పరగి [2]తోఁతెంచుపాండవబలముమీఁదఁ
గవియుటయు నంత[3]నంతఁ గౌరవుల[4]మూఁక
మరలి యేర్పడఁ జూచి యమ్మాట యపుడు
నిజముగాఁ గొని యాజికి నిగిడె మగుడ.

143\. వ. ఇట్లుభయసైన్యంబులుం దలపడిన సందడికయ్యంబున నపరాహ్ణం [1]బగుచు నుండ.

144\. క. నగపతియుఁ బోనిగజపతిఁ
దగ నేత్తెఱ నెక్కి ప్రబలదైత్యబలముతో
నిగుడఁగ ఘటోత్కచుం డా
భగదత్తునిమీఁదఁ గవిసెఁ బార్థివముఖ్యా.

145\. వ. తదవసరంబున వృకోదరుం డడరంబు రయంబు మెఱయ నయ్యభిమన్యు ద్రౌపదేయప్రముఖులుం దానును హైడింబునకుం దో డై [1]కడంగె నట్టి యెడ.

---

140\. 1. లునొనర్చు – కొన్ని ప్రతులు. 2. వెప్పుడు – కొన్ని ప్రతులు, 3. దైత్యుని దునిమి గెలుము నీదు – జ. ర. వ.

141\. 1. అనినం బ్రాగ్జ్యోతిష – పెక్కు ప్రతులు; అని భీష్ముండు పలికినం బ్రాగ్జ్యోతిష – వా. 2. మంచిమగండు–ఝ. 3. బు బొదివిన, బు గదిరిన, బు బొదలిన, బు డగ్గరిన– అని పాఠములు.

142\. 1. పరగ – కొన్ని ప్రతులు. 2. నేతెంచి – ర. 3. లోన – అ. ర. శ. వ. 4. సేన – ఇ. ఈ. క. ద.

143\. 1. బునం బెనంగుచుండ – పెక్కు ప్రతులు.

145\. 1. కడంగి రట్టియెడ – కొన్ని ప్రతులు.

146\. ఆ. పొదివి పలువు రేయఁ బొడువ వ్రేయఁగ భగ
దత్తుదంతిరక్తధార లొప్పెఁ
జెలువు రెట్టి గాఁగ [1]జేవులు సెలయేఱు
లున్నతాచలమున [2]నురుఁలునట్లు.

147\. క. శూలంబున హైడింబుఁడు
గాలాకృతితోడ వైవఁగా నది పొడి యై
రాలెడునట్లుగ మగఁటిమి
వ్రాలినభగదత్తుఁ డేసె వడి భల్లమునన్.

148\. వ. ఇట్లేసి యార్చి వెండియు.

149\. ఆ. భీమహరులఁ గూల్చి పేర్చి సౌభద్రాది
యోధవరుల నెల్ల నుఱక తఱచు
టంపవానఁ [1]దడిపి హయరథభటసమూ
[2]హంబుఁ జంపె సమదహస్తిఁ బఱపి.

150\. క. మందరము మహాంభోనిధి
యందుఁ దిరుగునట్లు పాండవానీకములో
నం దిరిగి సుప్రతీక మ
మందగతిం జంపెఁ బెక్కుమాతంగములన్.

151\. క. అలిగి దశార్ణాధీశుఁడు
గొలిపెను భగదత్తుమీఁదఁ గ్రూరగజము న
జ్జ్వలము లగునతనితోమర
ములతాఁకున [1]నది చలించి [2]మొగతిరిగె వెసన్.

---

146\. 1. జేగురు – కొన్ని ప్రతులు. 2. నురులు – పెక్కు ప్రతులు; నురలు – వా.

149\. 1. ముంచి – ఖ. ఝ. ట. డ. వ. 2. హాముల జదిపె – పెక్కు ప్రతులు; హాముల ద్రిప్పె – జ. ర. వ.

151\. 1. గరి చలించె – శ. వ; సంచలించి మొగ – వ; కోర్వ కదియు మొగ – క. న. 2. మొన – డ. ణ.

152. వ. ఇవ్విధంబునం బోరుభగదత్తుం గనుంగొని గండుమిగిలి కురుపతిభుండు గురుకృపాదియోధవీరసమేతంబుగాఁ దఱిమినం దమబలంబులు గోలాహలబహుళంబు లగుటయుఁ బాండవాగ్రజుండు పార్థపాంచాలపురస్సరుం డై యవ్వలనికిం గ్రొవ్వలరం గోత్తలల సేసె నట్టిసమయంబున.

-: అర్జునుఁ డిరావంతునిచచ్చుట భీమునిచే విని దుఃఖించుట :-

సం. 6-92-1

153. క. నరుఁడు ధనుర్గుణరావ
స్ఫురణంబును దేవదత్తభూరిరవము నం
బరము పగిలింప నానా
శరముఁ గురుసైన్యసరభసత్వం బుడిపెన్.

154. ఆ. అపుడు సేరి భీముఁ డతనికి భుజగేంద్ర
కన్యకాసుతుండు గలనఁ బడుట
నల్లఁ జెప్పుటయును నడలి యెచ్చట నని
యడిగి యతఁడు సూప నచటి కరిగి.

155. వ. దనుజఖండితుం డయి పడియున్న యయ్యిరావంతు శరీరంబు గనుంగొని యాధనంజయుండు[1].

156. చ. ఘనతర[1]శోకవేగమునఁ గన్నుల నీళులు సించి యాసుయో
ధనునవినీతియుం బిదప ధర్మతనూజుఁడు సంధి గోరి ప
ల్కిన[2]తగవుం గడంగి యనికిం దలకొన్న నిజోద్యమంబుఁ దోఁ
చిన[3]విధిఁ దిట్టుచున్ వినుతి సేయుచు [4]రోయుచునుండె నయ్యెడన్.

155. 1. ఈ వచనము తరువాత - "జా. ఘు, చ. ఝ. ల. పీ(పాదసూచి)శ. ష. స. శ" ప్రతులలో నీ క్రింది పద్యము అధికముగా కలదు.

క. నీ చెలువును, నీ బలువును, నీ చతురత నీగుణంబు నీ సాహసమున్
నీ చక్కదనము నే నే,రాచూలికి గలుగ గందురా నాకుజ్జా.

156. 1. మైన శోకమున గన్నుల - ర. 2. యదియుం - ఇ. ఈ. 3. విధి దిట్టుచున్ - ఒ. చ. న. ప. ర. ల; మదిఁ దిట్టుచున్-వా. కొన్ని ప్రతులు. 4. దీనత నుండె - హ.

157. వ. ఇట్లు పుత్త్రశోకానలసంతప్తచిత్తుం డగుసవ్యసాచిం జూచి గోవిందుండు మందస్మితంబు సేసిన.

158. క. కని యతఁడు దెలిసి నీచే
వినినది యిది [1]మున్న [2]దీని విడిచితి [3]నహిం భం
జన తేరు [4]నడపు కురుబల
వినిపాతనపాటవమున విహరించుటకున్.

159. వ. అని పలికినం బద్మనాభుండు రథంబు రయంబున మనమొనపయిం బఱపం శార్ఙ్గుండు పటుబాణపరంపరలు వరగింప భగదత్తుండును గృపాచార్యుండును త్రిగర్తపతియును భీష్ముం గూడుకొని యాక్రీడి నెదిర్చిరి సాత్యకి యడరినం గృతవర్మబాహ్లికులు మార్కొనిరి మారుతి గవిసినం గుంభసంభవుండు దలపడియె నతనిత్రాపున నేపు మిగిలి నీపుత్త్రకు లాబకమర్దను మర్దింపం గడంగి కవిసిన.

160. క. గురువంపవెల్లి నాఁగుచు
సరభసముగ వారిమీఁద శరవర్షంబుల్
గురియుచు వారలయమ్ములఁ
దెరలక భీముండు పటుగతిస్యందనుఁ డై.

161. వ. సమరక్రీడ సలిపి కురుకుమారులు దొరఁగించునారాచధారల నొచ్చి యాజ్యధారాక్రాంతుం డై నయగ్నిచ్మంతుండునుంబోలె మండి యుద్దండ కోదండనై పుణ్యంబు సూపినం గుండభేదియు [1]ననాధృష్యుండును గనకధ్వజుండును [2]విరావియు సుబాహుండును దీర్ఘబాహుండును దీర్ఘలోచనుండును దీర్ఘనిద్రం బొందిరి పెఱవారు వెఱచఱచి [3]విఱిగి పఱచిన [4]గజంబుల వెనుకొనువృకంబువిధంబున వృకోదరుం[5]డు దోర్విలాసంబు మెఱసె నప్పుడు

---

158. 1. మున్న – కొన్ని ప్రతులు. 2. భ్రాంతి – ప. 3. నరి భంజన – కొన్ని ప్రతులు. 4. గడపు – అ. ఎ. గ. జ. ద. ర; పరపు – ఇ. ఈ. ఐ. ఒ. మ.

161. 1. ననాధృష్టుండును – ఘ. వ. ష; ననాదృశ్యుండు – శ. కొన్ని ప్రతులు. 2. వైరాటుండును – వ(మూలము) విరోధియును – శ. ష; విశాలి – కొన్ని ప్రతులు. 3. విఱిగి – కొన్ని ప్రతులలో లేదు. 4. మృగేంద్రు – కొన్ని ప్రతులు; గజంబుల వెనుకొను సింగంబునుం(మృగేంద్రుడుం)బోలె – ఆ. ఇ. ఒ. ఓ. ఔ. ర. వ. శ. 5. డు దోలి దోర్విలాసంబు–కొన్ని ప్రతులు; డు దోర్లీల మెరసె–కొన్ని ప్రతులు.

ప్రొద్దుగ్రుంకుచుండ నీపెద్దకొడుకు బలుమొనలం బురికొల్పికొని చలంబున గోల్తల సేసినం గాంగేయవ్యూహంబులు నభినవోత్సాహంబునం బోక పెనంగిన.

162. తే. ధరణి నెత్తుటఁ దోఁగి యాభరణకాయ
శస్త్రఖండజాలంబులఁ జాలఁ [1]బొలిచెఁ
బలుచ గాకుండఁ గుంకుమ మలఁది పెక్కు
తెఱఁగుతొడవులు [2]దొడిగినతెఱవపోలె.

163. వ. అంత.

164. క. తిమిరము గవిసినఁ బాండవ
సమితియుఁ గౌరవులు రణము సాలించి నివా
సములకుఁ దగఁ జని రయ్యా
ష్టమయామిని నుదితపటువిషాదుం డగుచున్.

165. క. కురువిభుఁడు నగరు సొచ్చియుఁ
[1]జొరమిన గాంధారవిభుని సూతతనూజుం
ద్వరితముగఁ బిలువు మని యా
తురతం బలుమాఱుఁ జెప్పె దుశ్శాసనుతోన్.

166. వ. చెప్పిన నతండు వారిం గూర్చికొని నచ్చుటయు నేకాంతంబున నమ్మహీకాంతుండు వారలతో [1]ని ట్లనియె గాంగేయ గురుకృపాశ్వత్థాములు మధ్యస్థు లై పాండవబలంబులం జెఱుచునట్టి[2]సంరంభంబునకుం జొరరు మనసేనలు నానాఁటికి నష్టంబు లై సమయుచు వచ్చె నేమి సేయంగల వార మనిన విని రాధేయుండు రణక్రీడాలంపటుం డై.

---

162. 1. నొప్పె – వా; బొలిచె – పెక్కు ప్రతులు. 2. తొడిగొప్పు తెఱవ – ఆ. ఓ. టొ. న. ర; తొడియొప్పు – అ. ఇ. ఒ. ఖ. కొన్ని ప్రతులు.

165. 1. జొరమియ – ష; జొరమియు – కొన్ని ప్రతులు.

166. 1. ని ట్లను – పెక్కు ప్రతులు. 2. సమరంబునకు – వ.

167. క. [1]నరనాథ యింక భీష్ముని
దురమునకుం దేకు మేను దోర్బలవిభవో
ద్ధురతం బాండుకుమారో
త్కరముం దత్సేనలఁ మదం బడఁగింతున్.

168. క. అని పలికిన విని దుశ్శా
సనుఁ గనుఁగొని మనము వోయి శాంతనవునిభం
డన ముడిపి వత్తమని చె
ప్పి నరేంద్రుఁడు వీఁడుకొల్పెఁ బెఱవారిఁ దగన్.

169. వ. ఇట్లు కర్ణసౌబలులనిజనివాసంబులకుం బోవం బనిచి బహుప్రకారసౌరభసంవాసితంబు లగుజలంబుల జలకం బాడి పరమసురభిచందనానులేపంబులను జీనిచీనాంబరపరిధానంబులను మహనీయమాల్యాభరణంబులను బ్రస్ఫీతమణిమయభూషణధారణంబులను దగ నలంకృతుం డై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ బరిమళపరంపరా[1]భాసితనూతనతైలధారాభిషేకప్రదీపితంబు లయిన కరదీపికా[2]సహస్రంబులు వెలుంగ వేత్రహస్తులు దొలంగు [3]తొలంగుం డని సందడి నెడ గలుగ జడియ వందిసందోహంబులు సంకీర్తనంబులు సేయ మాగధమంజులగానంబులు వీనులం [4]బొరయఁ బాఠకపఠనరవంబుల మనంబు రంజిల్ల రమణీయరత్నఖచితం బగురథం బెక్కి మందమందగమనంబున మందాకినీనందనుమందిరంబు సేరం జని తదీయద్వారంబునం దేరు డిగ్గి దుశ్శాసనుముంజేయి కరతలంబున నవలంబించి యల్లన నడచి యుచితప్రకారంబునం బ్రవేశించి యప్పితామహుపాదంబులకుం బ్రణామంబులు సేసి తత్పీఠసమీపంబున సముచితకనకాసనంబున [5]నతం డనుప నాసీనుం డై చేతులు మొగిచి యమ్మనుజపతి యతనితో ని ట్లనియె.

---

167. 1. కురునాథ - ఔ. ఘ. చ.

169. 1. భావిత - కొన్ని ప్రతులు. 2. నికరంబులు - పెక్కు ప్రతులు. 3. తొలంగుమని - పెక్కు ప్రతులు. 4. బొలయ - కొన్ని ప్రతులు. 5. నతం డనుప - కొన్ని ప్రతులు.

170. మ. నిను మున్నెంతయు నమ్మి పాండవులయున్మేషంబు నేఁ జీరికిం
గొన నీపోరెడుచందముల్ దెలియఁ బెక్కుల్ సూచితిం జేరి చే
రి నయం బిచ్చుచు నొంప నూల్కొనక వారిం బట్టి [1]పాలార్చ దొం
డన నేరం గురుముఖ్య యింక నిట నీవాలంబు సాలింపవే.

171. చ. అనిమొన దేవదానవుల కైనను మార్కొన రాదు నిన్ను నేఁ
డెనిమిది[1]నాళ్ళు లయ్యె నమయింపవు నొంపవు సవ్యసాచి న
ప్పని యటు లుండనిమ్ము [2]నినుఁ బ్రార్థన సేసెద నింతవట్టు నా
చనవునఁ బోవ నిచ్చి నృపసత్తమ పోరికిఁ గర్ణుఁ బంపవే.

172. వ. అనవుడు.

173. క. అమ్మాట మనమునకు వా
ల మ్మై తాఁకుటయు భీష్ముఁ డత్యంతవిషా
దమ్మున నించుకవడి మా
నమ్మె దగం దాల్చియుండె నతవదనుం డై.

174. వ. పదంపడి నిట్టూర్పు నిగిడించి మొగం బెగయించి భూపాలు నాలోకించి.

175. క. తలకొని [1]నీకుం బ్రాణం
బులు డాఁపక యోపినట్లు పోరఁగ నిమ్మెఁ
బలుకఁ దగునె యక్కట నా
వలనం గలభక్తి యెల్ల వమ్మునఁ [2]గలయన్.

176. వ. అని పలికి యలుక వోడమి వెండియు.

177. సీ. కాల్పఁడే మహనీయఖాండవం బింద్రుని నమరగణంబుతో విముఖుఁ జేసి
బహుదివ్యశరములు వడయఁడే యొక్కటి బవరాన మెప్పించి శివునిచేత

---

170. 1. పల్లార్చ - కొన్ని ప్రతులు.

171. 1. నాళు లయ్యె - ప. సూ; నాడులేని - శ; నాళ్లయేని-కొన్ని ప్రతులు. 2. తగ, విను - అని పాఠములు.

175. 1. నీకుగ(ను) - కొన్ని ప్రతులు. 2. బోవన్ - శ. ష.

గంధర్వులకు నోడి కర్ణుండు నీతమ్ములును బాఱ విడిపించికొనఁడె నిన్ను
నిను నను ద్రోణు నాతనిపుత్రుఁ గృపుఁ గర్ణు గెలిచి విరాటుగోవులఁ
గొనండె

ఆ. తక్కువెక్కులెడలఁ బెక్కండ్ర నేమేమి
సేసె వినమె యట్టి జెట్టి నిన్ని
దినము [1]లిట్లు దొడరి పెనఁగియు నీచేత
నేఁడు వినఁగ వలసె వేఁడిపలుకు.

178. క. తగ[1]నిపని యని తలంపక
పగగొంటి వ[2]జేయు లైన పాండుసుతులతోఁ
దెగి యింక నీవు రణమున
మగఁటిమి వాటింపు రిత్తమాటల నగునే.

179. వ. అని మఱియును.

180. క. గాండీవి గెలువ రాదు శి
ఖండిని [1]జంపంగ నాకుఁ గాదు వినుము న
న్నొండుమగలు మార్కొనినం
జెండుదు నుగ్రముగ మున్న చెప్పితి నీకున్.

181. క. [1]పనును నాదశమున ద్రుప
దానీకవిరాటసైన్యయాదవబలసం
తానములతోడఁ బెనఁగెదఁ
బూనుఁడు మీ రెల్లఁ బాండుపుత్రుల గెలువన్.

---

177. 1. లోర్చి తొడరి – ఒ. ఔ. చ.

178. 1. దీపని యని తలఁపక – ఝ. న. పీ. 2. జేయు – శ. ష. పెక్కు ప్రతులు;
జయ్యు – వా

180. 1. నొంపగ – ర.

181. 1. ఐనను నాబలమున – ర. స. ఇచ్చట మూలము. అహం తు సోమకాన్ సర్వాన్
పాంచాలాంశ్చ సమాగతాన్ నిహ నిష్యేన రవ్యాఘ్ర వర్జయిత్వా శిఖండినం.

182. ఆ. నడికిరేయి వచ్చి నను నొవ్వఁ బలికినఁ
గలుగునయ్య [1]జయము గడఁగి నీవు
నడవు మనికి నెల్లి నాచేతిఁ [2]బలువు సూ
చెదవుగాక వేయి సెప్ప నేల.

183. క. అనినఁ బ్రియమంది [1]నగరికిఁ
జని [2]పతి సుఖనిద్ర సేసి సముచితసమయం
బున మేలు కాంచి కయ్యం
బున కాయిత మయ్యె [3]మేను వొంగారంగన్.

184. వ. ఇట్లు సన్నద్ధుం డయి బలంబుతో వెడలి నీపుత్రుండు భీష్ము నుపలక్షించి
భూపతిప్రకరంబులతో ని ట్లనియె.

-: భీష్ముని నవమదివస యుద్ధము :-

సం. 6_95_1

185. తే. ఇతఁడు పాంచాలు రాదిగ నెల్లబలముఁ
జంపి పాండుతనూజుల సమర[1]భూమి
గెలువఁ గలవాఁడ నని రాత్రి వలికె నేఁడు
దఱిమి [2]మనలావుఁ జేవయు మెఱయవలయు.

186. క. [1]అని యాడుతులువమాటలు
విని భీభత్సంబు సిగ్గు విపులవిషాదం
బును [2]నొక్కపెట్ట పుట్టఁగ
ననిమిషతటినీతనూజుఁ డతిదుఃఖితుఁ డై

---

182. 1. గెలుపు - కొన్ని ప్రతులు. 2. బలువు - కొన్ని ప్రతులు.

183. 1. పీడ్కొని - పెక్కు ప్రతులు. 2. సుఖతరనిద్ర - న. 3. మెనలు - చ. ట.

185. 1. కేలి - ర. 2. మనమును లావులు - ఐ, ఒ. ర; మనమన లావులు - శ. కొన్ని ప్రతులు; మనమొన లావులు - గ. ట.

186. 1. అనునతని తులువ - ఒ. చ. శ. ష. 2. మనమున బెనగొనగా - ఇ. ఈ.

187\. వ. తన్నుం దాన యుపశమించు[1]కొని యున్నం గనుంగొని కౌరవేశ్వరుం డతని కన్నెఱింగినవాఁడై దుశ్శాసనునితో ని ట్లనియె.

188\. క. మన మెల్లఁ బితామహునొ
ద్దన యుండుద మదియుఁ గా కితనిముందటఁ బె
[1]ట్టన వలయు శత్రుబలమ
ర్దను లిరువదిరెండువేలరథములవారిన్.

189\. వ. అని నియోగించిన నతం డట్ల చేసె నద్ధరణీశుండు గురుకృపాశ్వత్థామల నాలోకించి గాంగేయుం జూపి సత్యవ్రతుం డగునీతండు శిఖండి [1]పని మన మెత్తి విడియునాఁడ చెప్పుట మీరెఱుంగుదుర కాదె యన్నిచునకు గోచరంబు గాకుండ నిమ్మహానుభావుం బొదివికొని రావలయు ననిన వారలు నట్లకాక యని [2]రయ్యమరనదీసూనుండు సర్వతోభద్రవ్యూహం [3]బొనర్చె నందుఁ గృపాచార్యకృతవర్మ[4]శల్యశకునిసుదక్షిణసైంధవులును గురుకుమారులుం దానును ముందట నిలిచెఁ దదనుమతిం గుంభసంభవభూరిశ్రవోభగదత్తులు వలపటను సోమదత్తద్రోణపుత్రవిందానువిందులు దాపటను [5]హాలాయుధాలంబుసశ్రుతాయువులు వెనుకను ద్రిగర్తప్రకరపరివృతుం డై జననాథుండు నడుమను నిలిచి రంతకు మున్న కౌంతేయులు సైన్యసమేతంబుగా వెడలి రట్టియెడ నర్జునుండు మన[6]మొగ్గరంబు సూచి ధృష్టద్యుమ్నున కి ట్లనియె.

190\. తే. కంటె గాంగేయు నతనిచక్కటి శిఖండిఁ
బెట్టు మీతని మన మెల్లఁ బొండుగట్టి
పొదివికొని వత్త మిప్పనంబునకుఁ [1]దగ ద
శంబుగా మోహరింపు బలంబు నెల్ల.

---

187\. 1. కొనుచున్నం – కొన్ని ప్రతులు.

188\. 1. ట్టనువలయు – శ. కొన్ని ప్రతులు.

189\. 1. పనిమన మెత్తి – శ. ష. పెక్కు ప్రతులు; పై నేయ నని మనమెత్తి – వా. 2. రయ్యనిమిషనదీ – వీ. శ. ష; రయ్యవసరంబుననదీ – అ. ర. వ. 3. బమర్చె– బమర్చి – అని పాఠములు; బు పన్ని యందు – వ. 4. శైబ్య – మూలము. ల; శల – కొన్ని ప్రతులు. 5. మూలమునందు హాలాయుధుని పేరు లేదు. 6. మోహరంబు – పెక్కు ప్రతులు.

190\. 1. దగవ, లయముగా మోహరింపు బలంబు నెల్ల – ఇ.

191. వ. అనిన విని యతం డట్లు చేయుదు నని సాత్యకివిరాటులు వలపటను నభి
మన్యుపాంచాలకేకయులు డాపటను నకులసహదేవద్రౌపదేయపురస్సరుం
డై న యుధిష్ఠిరుండు నడుమను జేకితానకుంతిభోజులు వెనుకనుంగా [1]నొనర్చి
యగ్రభాగంబున శిఖండి నునిచి యతని కెలంకుల డాసి భీమసేనఘటోత్కచు
[2]లొక్కవలనను పార్థుండుఁ దాను నొక్కదిక్కునను నిలిచి తక్కినయోధ
వీరు[3]లఁ గలయం జేర్చి గట్టిమొనఁగా నమర్చె నిట్లుభయసైన్యంబులుం బన్ని
భేరీఝాంకారశంఖాదినిస్వనగర్జాస్ఫూర్జితబహుళంబుగా నొండొంటిం దాఁకె
నట్టిసమయంబున.

192. క. చెంగట నభిమన్యుండు పి
శంగతురంగప్రచారచంచద్రథుఁ డై
పొంగి మనదిక్కు ప్రజమీఁ
దం గవిసెం జిచ్చు దూది దరికొను మాడ్కిన్.

193. వ. ఇట్లు గవిసి.

194. తే. మెఱసి మండలచారి యై కొఱివి ద్రిప్పి
నట్లు గురుకృపసింధురాజాదు లైన
యోధవీరులు వెగడంద నులివు మిగిలి
తరువఁబడు న[1]బ్ధిక్రియ సేన [2]దిరుగఁ బడఁగ.

195. వ. ఇట్లు మాఱు లేక తఱుముచున్న సౌభద్రుం గనుంగొని కౌరవపతి యలం
బుసుతో ని ట్లనియె వీఁడు రెండవయర్జునుం డై మనబలంబులఁ గలంచు
చున్నవాఁ డర్జున[1]నందను నెదుర్కొన నీవకాని [2]మాఱు లే దేము పాండ
వుల కడ్డపడియెదము నీవు వీనిం బొదివి [3]భంజింపుము.

---

191. 1. మోహరించి – క. వ. 2. లొక్కవంకను – ఖ. చ. ఝ. డ. వ. హ. 3. లం
గలిపి కదియం బేర్చి గట్టి – కొన్ని ప్రతులు.

194. 1. నట్టిక్రియ – కొన్ని ప్రతులు. 2. దిరుగు బడగ, దిరుగ బడియె – అని పాఠములు.

195. 1. నందమునకు నీవకాని–కొన్ని ప్రతులు; నందను నెదుర్కొను మే మందు రాలేము,
ఐ. ఓ. మ. శ. 2. మందు – పెక్కు ప్రతులు. 3. బంధింపుము – వ.

-: అలంబసుఁడు దుర్యోధనప్రేరితుం డై యభిమన్యునిపైఁ గవియుట :-

సం. 6-93-24

196. క. అనవుడు నసురుండు దుర్దమ
దనుజావలి మున్ను గాఁగఁ దఱిమెం గుంతీ
తనయబలము గాలాకులు
పెనుగాలిం దూలునట్లు భీతిం [1]జెదరన్.

197. ఉ. అప్పుడు ద్రౌపదేయులు రయంబున నడ్డము [1]పొచ్చి దైత్యులం
గుప్పలుగా మహిం బెలుచఁ గూల్చిన దానవనాథుఁ డమ్మలం
గప్పెఁ గడంగి వారల నఖండపరాక్రమలీల వారు వాఁ
డొప్పఱ తేరికూబరము యూఁతగ [2]వ్రాలఁగ నేసి యార్చినన్.

198. క. ఆలోనన తెప్పిఱి లయ
కాలుండునుఁ బోలె నసురగన్నుల నిప్పుల్
రాలఁగ వారలసిడములు
నేలం బడనేసి చాపనికరము ద్రుంచెన్.

199. వ. త్రుంచి నవ్వుచు.

200. తే. ఒకనినొకని నైదైదు మహోగ్రఘాసు
రాస్త్రముల [1]నేసి నొంచిన నతనిమదము
సొంపు సోదరవ్యథయును [2]జూచి యడరె[3]
నప్పు డాతనిపై సుభద్రాత్మజుండు.

201. వ. అప్పు డుభయసైన్యంబులవారును [1]వెఱఁగంది.

---

196. 1. బరవన్ - కొన్ని ప్రతులు.

197. 1. వచ్చి - కొన్ని ప్రతులు. 2. గ్రక్కున - ఆ. ఐ. ఓ. న. మ.

200. 1. నొంచి యేసిన-అ; నేసి యార్చిన - ఇ. 2. జూచి యేచి యడరె నాతని-పెక్కు ప్రతులు. 3. రేఁదాను నాతనిపై సుభద్రాసుతుండు - ఏ. న. ర. శ. ష. హ.

201. 1. వెగడంది - ఖ. ట. న. హ; వెఱగొంది - కొన్ని ప్రతులు.

202. క. దనుజుఁడు మాయాధికుఁ డ
ర్జున[1]తనయుఁడు దివ్య[2]శరధరుం డెట్లగునో
యనుచుండఁగ నయ్యిరువురు
నని సేసిరి వృత్రవాసవాకృతి దోఁపన్.

203. క. ఇతరేతరశరకృతశో
ణితధారలు నిగుడ నపుడు నిర్ఝర[1]ధావ
ద్ద్యుతు లడరఁ బొలుచునగముల
గతిఁ [2]బొలిచిరి వా[3]ర లప్ర[4]కంపోన్నతులై.

204. క. దనుజేశ్వరుండు మాయం
బొనరించినఁ దమము గవిసె భూనాయక ఫ
ల్గునసుతుఁడు భాస్కరాంబక
మున వెలుఁ గొనరించె సురసమూహము వొగడన్.

205. తే. అసుర వెండియుఁ బెక్కుమాయ[1]లు ఘటింప
శక్రపౌత్త్రుండు దివ్యాస్త్ర[2]జాల మడరఁ
జేసి యన్నింటి నడఁగించి చెలఁగి నొంప
రథము డిగి పాఱెఁ బెలుచ నారాక్షసుండు.

206. క. రక్కసుఁడు విఱిగినం గడు
నుక్కున సౌభద్రుఁ డడరుసురవడి గని న
ల్దిక్కులఁ బఱచెం దమలోఁ
జిక్కువడుచుఁ గౌరవేంద్రుసేనలు భీతిన్.

207. వ. అప్పుడు పెక్కండ్రురథికులతోడం గూడి గాంగేయుం డభిమన్యుపయిం గవిసిన.

---

202. 1. సూనుడు – పెక్కు ప్రతులు. 2. చాపధరు డెట్లగునో – హ; శరవిందుం డెట్ల గునో, శరనిరూఢు డెట్లగునో – అని పాఠములు.

203. 1. ధాతుద్ద్యుతు లడర – ఒ. ఖ. ఝ. ట. డ. వ. వీ. శ. ష. 2. నొప్పిరి – పెక్కు ప్రతులు. 3. రఖండ గర్వోన్నతులన్ – మ. 4. కంపితు లగుచున్ – ఎ.

205. 1. ల నొనర్ప – ఉ. 2. సమితి యడర – క.

208. తే. అతఁడు దానికిఁ [1]దలఁకక యందఱకును
నన్నిరూపులై పోరంగ నర్జునుండు
సరభసంబుగ భీష్ముపై నురవడింపఁ
బొంగి యిరువాఁగు నిరువురఁ బొదివె బెరసి.

209. వ. అట్టిసంకులసమరంబున నభిమన్యుపై నడరుకృపాచార్యుం దాఁకి సాత్యకి [1]బెడిదంపునారసంబు లేసిన వాని నన్నింటిని నశ్వత్థామ తునిమి యతని [2]విల్లు ద్రుంచినం గోపించి.

210. క. ఆసాత్యకి వేఱొకవి
ల్లాసురగతి నెత్తి యుగ్రమగునారాచం
బేసిన [1]నాతఁడు కేతు
వ్యాసక్తుం డయ్యె మూర్ఛ వచ్చి నరేంద్రా.

211. క. ఆలోనన తెలిసి మెఱుఁగు
వాలిక[1]తూపాతఁ డతనివక్షము[2]నడుమం
గీలించి సిడము గ్రక్కున
నేలం బడ నేసి యార్చె నింగి వడంకన్.

212. వ. దానికిం గినిసి [1]శినిమనుమఁడు పొగరు మిగులునారాచనిచయంబులం బొదివిన నశ్వత్థామ రాహుగ్రస్తుం డగు నుగ్రగభస్తియుంబోలె [2]నైనం గనుం[3]గొని.

213. క. ద్రోణాచార్యుండు సుత
త్రాణపరత్వమునఁ గృష్ణుతమ్మునిపై న

---

208. 1. గలగక - ఊ. ఏ. త. బ. హ

209. 1. బెట్టిదంపు - క. హ. 2. ధనువు దునిమిన - కొన్ని ప్రతులు.

210. 1. నతండు - కొన్ని ప్రతులు.

211. 1. శరజాల మతనిఁద; తూపడర నతని - ఏ. 2. నాటం - అ. ఐ. ఓ. న. మ. వ.

212. 1. శినివరుండు - శ. ష. 2. నున్న గనుంగొని - కొన్ని ప్రతులు. 3. గొని
కోపించి - ఉ. క. వ.

క్షీణోద్ధతిఁ గవియుడు గి
ర్వాణాధిపసుతుఁడు వచ్చి వడి నెడఁ జొచ్చెన్.

214. చ. [1]అనవుడు నాంబికేయవసుధాధిపుఁ డిట్లను ద్రోణుఁ డాత్మ న
ర్జునునకుఁ గూర్చునాతఁడు [2]గురుం గని యెంతయు భక్తి సేయు వా
రనిఁ దమలోన నట్లు వెస నప్పుడు [3]దార్కొని [4]యెట్లు పోరిరో
వినఁ గల దేర్పడం జెపుమ విశ్రుతభంగిగ నాకు సంజయా.

215. వ. అనిన నాసూతనందనుం డతని కిట్లనియె.

216. క. ఛాత్త్రము వలకొని సంగర
ధాత్రికి నేతెంచి గురులు బంధులు దమ్ముల్
పౌత్త్రులు శిష్యులు మామలు
పుత్త్రు లనం గలదె తొడరి [1]పోరనవలయున్.

-: అర్జునుఁడు ద్రోణాచార్యులతో యుద్ధము సేయుట :-

సం 6_98_4

217. వ. వినుము.

218. సీ. అర్జునుం [1]డడరి ద్రోణాచార్యు [2]మూఁడు నారసముల నేసి యుగ్రంపుటంప
వెల్లువ వఱపిన వెగ డొంద [3]కాతఁ డాతని[4]మేనఁ దూపులు దఱుచు గాఁగ
నాఁటించె నంత భూనాథుండు పురికొల్పఁ గాఁ ద్రిగర్తులు గురుఁ గడచి కవియ
నరుఁ జేచి వాయుబాణమ్మున నమ్మొనఁ దూలింపఁ గుంభజుశైలశరము

214. 1. అనుటయు - వ. 2. గురుం డని - వ. 3. మార్కొని - ల. శ. ష. కొన్ని ప్రతులు. 4. యేమి సేసిరో - ఇ. జ. ర. వ.

216. 1. పోరఁగ - వీ. ష. కొన్ని ప్రతులు.

218. 1. డేచి - అ. ఓ. ఔ. వ. 2. నైదునారసముల - చ. ల. శ. ష. 3. కాతని తనువున దూపులు - ఎ. గ. ద. మ. 4. మేనఁ దూపులు-వీ. శ. ష. పెక్కు ప్రతులు; మేనిఁ దూపులు - వా.

ఆ. [5]వైచి యుడుప నలిగి వాసవినారాచ
వర్షమునఁ ద్రిగర్తవరునిపుత్ర
చయముఁ [6]దెరలుచుటయు జనపతి కృపశల్య
బాహ్లికులునుఁ దానుఁ బార్థుఁ దాఁకె.

219. వ. అట్లు [1]దాకుటయు వారల నతండు గన్నెరాకమ్ముల జీకాకుపఱిచె నట్లు గురుండు మొదలైనయందఱకును నాధనంజయుపోరు దలమునుక లయ్యెఁ గురుపితామహుండు ధర్మసూతి యున్న[3]ఠిట్ట కుఱికి తలలు చెండాడె శకునిభూరిశ్రవఃపులు గవల దలపడిరి కళింగపతియును భగదత్తుండును నిభ సేనలతోడం దొడరి భీమసే[4]నుం బొదివిన.

220. క. గిరి డిగు కేసరిచాడ్పున
నరదము డిగి భ్రమితపటుగదాభీలత నా
కరువలిపట్టియుఁ గవిసినఁ
గరులుఁ దెరలెఁ బవనధూతఘనపంక్తిగతిన్.

221. తే. క్రందుకొని యిట్లు మాతంగఘటలు విఱుగ
నాశ్రుతాయువుఁ బ్రాగ్జ్యోతిషాధిపతియుఁ
బోక నిలిచి యమ్మారుతపుత్త్రుఁబోడుఁ
[1]దనువుఁ జించిరి వివిధాస్త్రతతులు వఱపి.

222. వ. అప్పుడు గాంగేయుండు సేయుదారుణ[1]రణంబు ధర్మపుత్రునకు భరం బైన నతం డెలుం గెత్తి [2]పేరువేరం బిలిచి చేయి వీచిన నాకళింగనాథభగదత్తుల విడిచి యవుడుగఱచుచు.

---

5. వైచి యుడుప — ఊ. ఏ. వ; వచ్చి — వా. కొన్ని ప్రతులు. 6. దెల్చుట యును — కొన్ని ప్రతులు; తేల్చుటయును — శ. ష.

219. 1. దాకిన — పెక్కు ప్రతులు. 2. పేరాకుటమ్ములం — ఐ. న. మ. వ. 3. తెట్ట — ఆ. వ; దిక్కు — ఇ. ఈ. 4. ను పై నురవడించిన — ఈ.

221. 1. దారు చించిరి — కొన్ని ప్రతులు.

222. 1. రణంబు సమ్మర్దం బై ధర్మ — క. వ. 2. వేఱువేఱ — వీ. శ. ష.

223. క. కలఁయఁగఁ గరములఁ జరణం
బుల నురమున శోణితంబు బోరనఁ దొరఁగం
[1]దలి రెపఁగినవడమూమిడి
చెలువుఁ [2]బఱతెంచె భీమసేనుఁ డచటికిన్.

224. వ. అంతకు మున్న ధృష్టద్యుమ్నశిఖండి విరాటద్రుపదులు ధర్మనందనున [1]కడ్డ పడి భీష్ముపై నడరి బహుప్రకారవిశిఖంబుల వెగడు పఱచిన నతం డలిగి శిఖండి [2]నేయనొల్లక యమ్మువ్వురను మూఁడేసివాఁడితూపుల నేసిన నా వీరరథికులు హుతాగ్నిత్రయంబునుం బోలెఁ [3]బ్రజ్వలించి బాణజ్వాలలు నిగిడించి యతని [4]నొప్పించిరి వృకోదరుఁ డద్దెసం గపియుటం గనుంగొని కేకయగణశైనేయద్రౌపదేయులు గూడుకొని కవిసినం గౌరవసేనం జేయం గలమేటిమగ లెల్లను మిన్నేటికొడుకునకుం దలకడచి వారిం దలపడిన నిరు దెఱంగులదొరలును బలంబులును నొక్కుమ్మడిం గ్రందుకొన బెరసి పోట్లాడు చుండం [5]జండరశ్మి వినువీథి చక్కనగంబునకుం [6]జనుదెంచె నట్టియెడ.

225. తే. రథములను సామజములఁ దురంగమముల
నుఱక [1]నెత్రుటేఱుల నీఁది తఱియ నడచి
పోరి రేటును ద్రేటును బోటు నొక్క
[2]యలమిఁ జెలఁగంగ నుభయసైన్యపులవారు.

226. వ. అప్పుడు మనబలంబులజనంబులు.

227. క. ధృతరాష్ట్రుండును బుత్త్రులు
నతిలోభంబునఁ బ్రజాక్షయము నేసిరి ధ
ర్మతనూజు గెలువ[1]చ్చునె
మఱి [2]శేరై రింక నేటిమాటలు మనకున్.

---

223. 1. దలిరుల నలరెడు – ఝ. 2 జనుదెంచె – ఈ. ఉ. ఐ.

224. 1. కడ్డంబై తలకడచి – ల. శ. ష. కొన్ని ప్రతులు. 2. నేయక యమ్మువ్వర – కొన్ని ప్రతులు. 3. బ్రజ్వరిల్లి – పెక్కు ప్రతులు. 4. నొంచిరి – కొన్ని ప్రతులు. 5. జండరశ్మిరథంబు వినువీథి – ల. వ. కొన్ని ప్రతులు. 6. కరుగుదెంచె – కొన్ని ప్రతులు.

225. 1. నెత్తురుటేరుల దఱియ నడచి – ల. వీ. శ. ష. స. శ. 2. యలమిఁజెల్లంగ నుభయ సైన్యములవారు – ఆ. ఈ. ల.

227. 1. వశమే – ఆ. ఓ. ఔ. న. మ. వ. 2. దలపగ నింక – వ.

228. ఆ. అనుచు వగచుపలుకు [1]లాలించుభీష్మాది
యోధవరులతో సుయోధనుండు
చెనఁటిమాట లేమి వినియెద రనిన వా
రదియు [2]నదియు విననియట్ల పోలె.

229. వ. [1]పరాక్రమక్రీడలు సలుపుచుండి [2]రాసందడికయ్యంబునం గిమ్మీరమర్దనుండు
గదపండువు సేయుచుండె నప్పుడు.

230. క. సరభసముగ సారథి దన
యరదముఁ దెచ్చుటయు నెక్కి [1]యతనిశితశర
స్ఫురణాపరిణతి బాహ్లికు
విరథుం గావించె సురలు వినుతింపంగన్.

231. తే. చిత్రసేనుండు సౌభద్రుఁ జిత్రబాణ
పాతమున నొంచి యార్చినఁ బాండుపౌత్రుఁ
డతనిసారథిఁ బడ నేసి యంతఁ బోక
తురగములఁ జంపి యాతనిత్రుళ్లడంచె.

232. వ. అక్కుమారుండును దుర్ముఖునిరథం బెక్కెఁ బాంచాలపతి గుంభసంభవుపై
నడరి యతనిమేన నానాస్త్రంబులు [1]నించిన.

233. క. ద్రోణుఁడు గోపించి తను
త్రా[1]ణం బలువ్రుళ్లు సేసి తనువున [2]రాజ
ద్బాణంబులు గ్రుచ్చిన సం
క్షీణబలుం డై యతండు సిగ్గఱి [3]తొలఁగెన్.

---

228. 1. లాలించి – పెక్కు ప్రతులు. 2. వినియు వినని – ఆ. ఐ. ఓ. న. మ. వ.

229. 1. సమరక్రీడలు – ఇ. ఐ. మ. 2. రాసమయంబున – ఇ. ఈ. వ.

230. 1. యతినిశిత, యతిశాత, యలిగి శితశర – అనిపాఠములు.

232. 1. కీలించిన – అ. ఏ. ఘ. వ; ప్రయోగించిన – ఇ; నిగుడించిన – ట.

233. 1. ణము పరియలుగ జేసి – ఊ. 2. చంచద్బాణంబుల – అ. ఇ. ఎ. ఏ. ఘ. ర. ల.
3. పారెన్ – వ.

234\. సీ. తఱిమి సుశర్ముండు దాఁకి యర్జును నొంచి కృష్ణు[1]పై నమ్ములు గీలుగొలుప
నలిగి యన్నరుఁడు వాలంపకాలువ లోలి నడరించుటయు
వానియఖిలబలముఁ
[2]జెతిపమ్మెటలను చేరుకోలల వ్రేసి యంకుశంబుల [3]నూఁటి యతిరయమున
వాహనంబులఁ దోలువారును విండ్లను బలకలు వైచుచుఁ [4]బఱచువారు

తే. [5]నైన మీతండ్రి క్రీడిపై నడర నడుమఁ
జొచ్చె సాత్యకి యన్నదీసుతుఁడు శక్తి
వైవ [6]మెయి వాల్చి యది పట్టి వైచె [7]మగుడ
నాతఁ డాభీష్ముఁ డెడఁ దునుమాడె నధిప.

235\. వ. ఇట్లు ద్రుంచి.

236\. క. ఆలోనన మెయిఁ దొమ్మిది
వాలమ్ములు నాటఁ బాండవవ్యూహము కుం
డాల[1]రథఘోటసుభటా
భీలతఁ దల కడచి పొదివె భీష్ముని [2]నంతన్.

*-: దుర్యోధనుఁడు శకునిదుశ్శాసనుల భీష్మునకు సహాయంబుగాఁ బంపుట :-*

సం, 6_101_1

237\. క. కని కౌరవపతి దుశ్శా
సనుతో ని ట్లనియెఁ గంటెఁ శాంతనవునిపై

---

234\. 1. మై - ప. వ. 2. జేరి సమ్మెటలను - ఉ. శ. శర. ష. హ; చెడి సమ్మెటల చేరు - కొన్ని ప్రతులు. 3. నూది - అ. ఏ. ఔ. చ; నూరి, నూని, వ్రేసి, నెత్తి, నొత్తి - అనిపాఠములు. 4. జారువారు - అ. ఏ. ఓ. గ. జ. న. మ. ర. 5. నైరి - అ. ఏ. 6. మైడాచి - ఇ. ఈ. ఉ. వ; మై వ్రాల్చి-ఝ. ట. డ; దానిన దా బట్టి - ఓ. వ. వ. శ. 7. నాతఁ డంత నాభీష్ము - వీ. శ. ష.

236\. 1. దళ - వ. 2. కడకన్ - ఇ. ఈ.

ఘనసేన [1]ద్రోఁచెఁ జని కై
[2]కొనుఁ డీవును సౌబలుఁడు నకుంఠితవృత్తిన్.

238. క. అనవుడు నయ్యిరువురు నే
పునఁ [1]గదియుడుఁ జూచి ధర్మపుత్త్రుఁడు మాద్రీ
తనయులు నడరిన దుర్యో
ధనుఁ డపుడు తురంగమాయుతముఁ బురికొలిపెన్.

239. వ. ఆపడివేవురు నెఱ[1]రావుతులు నొక్కపెట్ట శకునిదుశ్శాసనులకుం దలకడచి [2]యెక్కినం బాండ[3]వబలంబు మహా[4]మత్స్యసమూహవిహారంబునం గలంగు మడువునుంబోలె సంక్షోభించినం గోపించి కౌంతేయాగ్రజుండును గవలును వివిధవిశిఖపరంపరలు [5]వరగింప ముందటికాళ్లు దునిసిన గ్రుమ్మగ్గతిలంబడియును [6]మోరలు పఱియలైన నెఱిదప్పం గూలియు గుండియ లవిసిన నెగసి కెడసియు వాగెలు [7]ద్రెవ్వినఁ [8]వలియం బాఱియు నాశ్వికులు నేల కొఱ గినం [9]జెనఁటి ఉరిగియు ననేకఘోటకంబులు రూపఱిన నేపఱి యత్తురంగని కరంబు లేటమొగంబు[10]వడి చెదరి కనుకనిం బఱచిన.

240. క. భేరీశంఖాదిరవ
స్ఫారత నప్పాండుపుత్త్రబల మేచుటయుం
గౌరవపతి శల్యునితో
గారవమున నిట్లు లనియెఁ గడు దీనుం డై.

241. క. వెలివిరిసి వచ్చుజలనిధి
పొలుపు[1]నఁ దోఁతెంచు ధర్మపుత్త్రునిబలుగో

---

237. 1. ద్రోచె – ఈ. ఏ. ఔ. న. బ. వ. ష. హ; దోఁచె – వా. కొన్ని ప్రతులు. 2. కొను మీవును – పెక్కు ప్రతులు.

238. 1. గవియుడు – కొన్ని ప్రతులు.

239. 1. రావుతులు, రాహుత్తులు – అని పాఠములు. 2. తాకినం – ఈ. ష. 3. వాసీకంబులు – చ. వ. శ. ష. 4. గజ – ఊ. 5. పరపిన – వ. 6. మొనలు – ఐ. బ. మ. వ. 7. ప్రస్సిన, తెగిన – అని పాఠములు. 8. గలయంబారియు – వీ. శ. ష. స. 9. జిమ్మతిరిగియు – ఈ. ద. 10. వడి బెదరి చెదరి, వడి బెదరి – అని పాఠములు.

241. 1. న నేతెంచు – చ. వీ. శ. ష. స.

ల్తుల నిలువరింప నీ వొక
చెలియలికట్ట [2]వయి మమ్ముఁ జేకొను మిచటన్.

242. ఆ. అనుడు నతఁడు పాండవాగ్రజుఁ గవలను
దాఁకి విపులబాహుదర్ప మొప్ప
నారసములఁ బొదివి మారిమసంగిన
ట్లయినఁ జూచి నరుఁడు ననిలసుతుఁడు.

243. క. ఒక్కటఁ గడంగి శల్యునిఁ
బెక్కమ్ముల నొంచుటయును భీష్మద్రోణుల్
గ్రక్కునఁ [1]దఱిమిన నయ్యిరు
దిక్కులసైన్యములు నత్యుదీర్ణత బెరసెన్.

244. వ. ఇట్లు గలయఁ బెరసి యపరాహ్ణంబున నుభయచతురంగమథనం బగు [1]ప్రధనంబు [2]చెల్లె నట్టియెడ భీష్మగ్రీష్మాదిత్యుండు వేఁడి మిగిలి వాఁడి మెఱసిననారసంబు లను కిరణంబుల పరగించి.

245. సీ. పంద్రెంటఁ బంద్రెంటఁ బాండవాగ్రజుని భీముని మాద్రికొడుకుల మూఁట మూఁట
నేడింట నేడింట నేచి సాత్యకిని ధృష్టద్యుమ్ను నొప్పించి సమదవృత్తి
నార్చిన మాత్స్యపాండ్యానీకములును సోమకవరూథినియును మగధబలముఁ
గాశిసైన్యంబుఁ గరూశసేనయు నొక్కపెట్ట రయంబున భీష్మమీఁద

తే. నురవడించిన బాండవోత్కరముఁ గృష్ణు
తమ్ము బాంచాలనందను సమ్ముఖమున
కడరనీ కాఁగి యందఱ కన్నిరూపు
లై మహారణ మొనరించె నస్త్రగురుఁడు.

---

2. క్రియ – కొన్ని ప్రతులు.

243. 1. బెరసిన – క; దరిసిన – న. ప.

244. 1. ప్రస్థానంబు – ఞ; భండనంబు–ప. 2. చెల్లె – ఉ. క. జ. ప. వ. ష; నేసి రట్టి–శ. కొన్ని ప్రతులు; నేసె నట్టి – వా.

246. ఉ. శాంతనవుం డనేకబలసంతతి నుద్భటశౌర్యసారదు
ర్గాంతపరాక్రమస్ఫురణ దాఁకి సముజ్జ్వలశాతసాయక
క్రాంతపరీతనిర్మథితకంపితపాతితమూర్తిఁ జేసి య
త్యంతరయంబునం దనరథంబుగతుల్ మెఱయం బ్రదీప్తుఁ డై.

247. మ. గజరాజోజ్జ్వలఘంటికావళిఁ దురంగప్రస్ఫురత్కింకిణీ
వ్రజముం గాహళదుందుభిప్రభృతితూర్యశ్రేణులన్ సుందర
ధ్వజఘంటాతతులః శరాసనగుణవ్రాతంబు దున్మాడి ధ
ర్మజసేనాతతి ముంపఁ జేసెఁ బటుదోర్గర్వం [1]బఖర్వంబుగన్.

248. వ. ఇట్లు బల్లిదుం డయి మల్లడిగొని మార్కొనుమగలు లేక మదంబునం బొంగి గాంగేయుండు పాండవేయులు వెఱఁగుపడి యుండ మఱియునుం గడంగి [1]దుర్వారంబు లగుదివ్యాస్త్రంబులు దీటుకొల్పి యేదిక్కు సూచినం దాన యై రథికులను హాస్తికులను నాశ్వికులనుం దునిమిన గంధసింధుర క్రీడనంబున మోడుపడిన యుద్యానంబు చందంబున నగుచున్న చోట్లును గాలుబలంబులం గనుపుకొట్టిన గాలు చేయి తల డొక్క యని [2]యేఱుపాటు లేక వండం దఱిగినయ ట్లున్నయెడలును బెక్కుదెఱంగుల చప్పుళ్లు నిగుడ రథచయం[3]బు నవయవంబులుం గరిహయనికరంబుల[4]యెమ్ములు విఱుగం గార్చిచ్చు పొదవిన వెదురుటడవితెఱంగునం దోఁచు[5]పట్లును దఱచు గొడుగులు విట[6]తాటనంబు సేసినం బెను[7]గాలిం జిక్కువడిన కుసు[8]మితకాశవనం బునుం [9]బోలుఁ జక్కట్లును బహురత్నమయమకుటాది భూషణవ్రజంబు వివిధవర్ణచామర[10]జాతంబు నఱికి పడవైచినం [11]బ్రబలోద్ధతలులాయలులితం బయి కమలకైరవోత్పలాకీర్ణం బగు[12]కొలని ననుకరించు ప్రదేశంబులును

247. 1. బవార్యంబుగన్ - హ.

248. 1. దుర్దాంతంబు - బ. 2. వేఱుపాటు - స. శ. 3. బులుం జదియురవంబులును- అ. ఇ. ఏ; బులయవయవంబులు - ఔ. వీ శ. ష 4. పల్లములు - ట. 5. నెడలును - అ. 6. తాటంబులు - ఝ. వ. శ. ష. 7. గాలి నిక్కడక్కడ వడిన కుసు - ఘ; గాలిం జిక్కు పరచిన - గ. ద. 8. మితాశోకవనంబునుం బోలు - ల. 9. బోలుచు - కొన్ని ప్రతులు. 10. జాలంబు - కొన్ని ప్రతులు. 11. ప్రభ సెడి ఘన లులితం బైన కమల-ల; ప్రభ సెడి ప్రబలోద్ధత-ఇ. ఈ. ద. 12. కొలంకుల-శ. ష.

నై పాండవసైన్యంబులు దైన్యంబు నొందియుఁ గలగుండు[13]గొనియు
బెండుకడియుఁ గలంగం బాటియుఁ దొలంగం దెరలియుం గోలాహలబహు
ళంబు లగుటం గనుం[14]గొని గోవిందుండు.

249. ఉ. అర్జున చూచితే మనబలావళి నెల్లఁ గలంచు చున్నవాఁ
డూర్జితశౌర్యసంపదయు నుగ్రభుజాబలవైభవంబు వి
స్ఫూర్జితవిక్రమోద్ధతియుఁ జూపె నదీసుతుఁ డిట్టిచోట నీ
దుర్జయ[1]దర్ప[2]విభ్రమము దోఁపఁగఁ జేయకయున్కి యొప్పునే.

250. వ. అనిన విస్వచ్ఛుండు విచారడోలాయ[1]త్తం బగుచిత్తంబుతోడ నిరుత్సా
హుం డై యున్నం జూచి వెన్నుం డతని కిట్లనియె.

251. క. మును మత్స్యనాథునగరం
బున సంజయుతోడ నీవు పొంగుచు [1]బెట్టా
డినమాట లెల్ల మఱచిన
నినునగరే రథికవరు లనింద్యచరిత్రా.

252. వ. అనుటయు నర్జునుండు.

253. ఆ. సకలబంధుజనులఁ జంపి కౌరవ[1]హీన
మైనరాజ్య[2]మహిమ యేను బడసి
యనఘ యేమిసుకృత మాచరించినవాఁడ
నగుదు మనసు గొలుప[3]దయ్యె ననికి.

254. వ. అయిన నీతో నప్పటప్పటి కేటిమాటలు గలవు మిన్నేటికొడుకుం బడవై
చెదం దేరు [1]నడపు మనుటయు నారాయణుండు నదీనందనుస్యందనంబునకు

---

13. వడియును – వీ. శ ష. 14. గొని కుపితుం డై గోవిందుండు – ర.

249. 1 బాహు – ఎ. గ. ద. 2. వైభవము – శ. ష.

250. 1. త్తచిత్తుం డై – ఇ. ద.

251. 1. బిట్టాడిన – ఊ. ఎ.

253. 1. నిభ మైన – కొన్ని ప్రతులు; రాజ్యవిభవ మేను వడసి ఏనుము మీద–ఝ. డ. బ.
2. విభవ మేను – వీ. శ. ష. స. శ. 3. దనికి నిపుడు – శ. శర. ష.

254. 1. గడపు మనుటయు – కొన్ని ప్రతులు.

సమ్ముఖంబుగా రథ్యమ్ములం ద్వరితగతి నడపినం [2]దెరలినసైన్యంబులు గూడికొని గాంగేయుపయిం గవియ నతండు సెలంగి మహాస్త్రనికరంబులు నిగిడించి యబ్బలంబు [3]నిలువరించి సింహనాదంబు సేసి.

255. మ. ఖరనారాచపరంపరోగ్రనిహతిం గాండీవియంగంబు లా
తురతం బొందఁగ నేసి బాణమయగాత్రుం జేసి గోవిందు ని
ష్ఠురలీలం దురగంబులం బటుశర[1]స్యూతాస్యముల్ గాఁగ స
త్వరుఁడై [2]యేసి రథంబు గూడఁ బొదివెం దాలంపమొత్తంబునన్.

256. వ. అప్పుడు.

257. తే. బీఱు వోయి రథ్యంబులు మాఱుమొగము
వడినఁ దా నొచ్చి యుండియుఁ [1]దడవి శౌరి
నూలుకొనఁ జేసి తఱిమిన వ్రాలి తీవ్ర
భల్లమునఁ గ్రీడి భీష్మునివిల్లు దునిమె.

258. క. అతఁ డొండొకవి ల్లెత్తిన
నతి[1]రయమున నదియుఁ దునుమ నాతం డౌరా
శతమఖనందన యనుచును
ధృతి వేఱొకవింట శరతతిం బరగించెన్.

259. క. ఆ బెట్టిదంపుటంపఱ
చే బీభత్సుండు నొచ్చి చేడ్పడి మఱియుం
దా బంటుతనము[1] పటుబా
హాబలముగఁ బోరుచుండె నంగము దూలన్.

---

2. నత్తెరపిన - ఇ. 3. ల మగుడించి - కొన్ని ప్రతులు.

255. 1. స్యూతాంగముల్ గాఁగ - అ. ఇ. ప. ర. 2 ద్రోచి - శ.

257. 1. నడచి శౌరి - తి; నడరి, దరమి, గడగి - అని పాఠములు.

258. 1. శీఘ్రమున - పెక్కు ప్రతులు.

259. 1. మ్మునై బాహాబలమునఁ - వీ.

260. క. ఎవ్వచ్చు[1]నొవ్వ నెంతయుఁ
గ్రొవ్వున భీష్ముండు గడఁగుకో ల్తలి[2]యుం డ
క్కెవ్వరు నాతనిఁ జేరక
దవ్వుల నిల్చుటయుఁ జూచి తన[3]చి త్తమునన్.

261. క. దారుణరోషం బడరఁగ
నారాయణుఁ డపుడు సై రణం [1]దొఱఁగి వెసం
దేరి నొగలఁ బగ్గము లిడి
క్రూరత [2]మునికోల యె త్తికొని యిల కుఱికెన్.

-: శ్రీకృష్ణుఁడు రథంబు డిగి భీష్మునిపైకి వోవుట :-

సం. 6_102_52

262. వ. ఇట్లు లంఘించి.

263. మ. ధరణీచక్రము [1]గ్రక్కునం గదల దిగ్దంతావళశ్రేణికం
ధరముల్ [2]మ్రొగ్గఁబడన్ దిశావలయ ముత్కంపంబు గా నీబలం
బురులం బాఱఁగ భీష్ముపైఁ గవిసె రౌద్రోద్రేకముం[3] జూచి ఖే
చరలోకంబును సంచలింప హరి చంచద్బాహుఘోరాకృతిన్.

264. తే. లలితపీతాంబరంబు విలాస మొప్ప
సింహనాదోద్భటం బగుచెలువుతోడ

---

260. 1. నొచ్చు టెంతయు - అ. ఇ. 2. కుం దా రెవ్వరు - వీ. 3. మదిలోనన్-కొన్ని ప్రతులు

261. 1. దొరఁగి - వీ. శ. ష.(సాధురేఫము తోడిరూపము) 2. ములుకోల, మునుకోల - అని పాఠములు.

263. 1. గ్రక్కతిల్లగను-ఇ. ఏ; తల్లడిల్లగను(డు) - ఉ. త. శ. హ; బిట్టు గ్రక్కదల - ష. 2. మ్రోడుపడన్ ఝ. డ; మ్రొగ్గిపడన్ - వీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. జూచుఖేచర - ఆ. ఈ. ఔ. వ. శ. ష.

మెఱుఁగు[1]వెలుఁగును గర్జయు మెఱయ వచ్చు
కారు[2]మొగి లనఁ గృష్ణునాకార మొప్పె.

265. వ. అట్టియెడ.

266. క. బలు[1]జీవము వోయిన వెలు
వెలఁ బాఱుచు నీదుయోధవీరులు [2]పొలిసెం
బొలిసె నదె భీష్ముఁ డనుచును
గలఁగం బడి యట్టు లెత్తి కనుఁగొనుచుండన్.

267. చ. కనుఁగొని భీష్ముఁ డుల్లము వికాసము నొందఁగ నల్ల నవ్వి యి
ట్లనుఁ జనుదెమ్ము వేగమ మహాత్మ వికస్వరపుండరీకలో
చన యిది లెస్స నా కిచట శాశ్వత మైనయశంబు నచ్చట
న్వినుతికి నెక్కుసద్గతియు నీదయఁ జేకు[1]ఱఁ జేయు మిష్టమున్.

268. వ. అని పలుకు నంత జంభాంతకసూనుండు సరభసంబుగా రథంబు డిగ్గనుఱికి వెన్నుని వెనుక నెయిది కరంబులఁ గ్రుచ్చి పట్టిన [1]నతండును దిగిచికొని వెండియుం బోవం బోవఁ బదియడుగులకొలంది నాకౌంతేయుండు పద స్థైర్యంబును బాహువీర్యంబును మెఱయ మహీతలం [2]బూని మెట్టి నిలువం బట్టి నిట్టూర్పు నిగిడించుచు నద్దనుజమర్దనుతో ని ట్లనియె.

269. ఉ. కయ్యము సేయ నే నని యకల్మష[1]బుద్ధిఁ బ్రతిజ్ఞ సేసి నీ
వియ్యెడఁ దప్పితేని జగ మేమను నించుకసేపు పోరులం
డయ్యుట దప్పె నాపయిఁ గడంగినభీష్మునిపాటు సూతు రా
వయ్య రథంబుమీఁది కిటు లాశ్రి[2]తమానము [3]వీటఁ బుత్తురే.

---

264. 1. ఉదర గర్జిల్లుచు మెరసివచ్చు - ఈ. 2. మొగులన - పెక్కు ప్రతులు.

266. 1. చేయువ - శ. 2. పెలుచన్ - గ. ద.

267. 1. రు నాకు నిష్టముల్ - అ. వ.

268. 1. నతం డీడ్చుకొని - ఇ. గ. ద. 2. బూది - స. కొన్ని ప్రతులు.

269. 1. వృత్తి - త. హా. 2. తుమానము - కొన్ని ప్రతులు. 3. తూలబుత్తురే - ఆ. ఐ. ఓ. ఔ. న. మ. శ.

270\. వ. అని ప్రార్థించినం బార్థుపలుకులకుం బ్రియం బంది ముకుందుం డూరక మరలె నయ్యెరువురు నెక్కినయరదంబు శిఖర[1]ద్వయసుందరం బైనశైలం బునుంబోలెఁ బొలిచి నిలిచినం బ్రళయకాలభైరవరవం బగు[2]వారిదంబు కరణి గర్జిల్లుచుఁ బటునారాచపటలాసారంబు నిగిడించి వారల వెగడు వఱిచి యచ్చట నొండొరుల మెచ్చక యఱిమి తఱిమిన వైరుల రూపు మాపి భీష్ముండు భీషణాకారుం డై పరిశ్రాంతు లయినకృష్ణార్జునులును భీతు లగు భీమసేనప్రముఖులును [3]జేయునది లేక చూచుచుండం బాంచాల బలంబుల బారిసమరునప్పుడు బలుమానిసి [4]చలిచీమలం గాలం జమురు చందంబు దోఁచె నయ్యవసరంబున.

271\. క. తా నస్తశిఖరి మఱువడఁ
[1]బోనియపుడు పాండురాజపుత్త్రవిరాజ
త్సేన పొడ వడఁగు నను[2]కృప
[3]నో నళినాప్తుండు గుంకె నుర్వీనాథా.

272\. వ. అట్టియెడ ధర్మతనయుం డతిఘోరం బగుసంధ్యాసమయంబునం [1]బంక నిర్మగ్న యైన [2]గోవునుం బోలె నున్న నిజసేనం జూచి యొక్కింతసేపు చింతాక్రాంతుం డై యప్పటికిం దిగుటయ కర్జంబుగాఁ దలంచి తగు వారల నెల్లం దివియ నియమించి.

273\. క. గాంగేయుచేత నెంతయు
భంగపడితి మనుచు [1]వగచుపార్థాదులు ద

---

270\. 1. యుగ, యుగళ – పెక్కు ప్రతులు. 2. వారిధి కరణి – ల. 3. చేద్వాడి, చెయ్వేది – అని పాఠములు. 4. బలుచీమలం – కొన్ని ప్రతులు; చిరుచీమలం – కొన్ని ప్రతులు.

271\. 1. బోనాడును – అ. వ. స. శ. కొన్ని ప్రతులు; బోనప్పుడు – కొన్ని ప్రతులు. 2. క్రియనో – ఝ. డ. త. ప. బ. శ. ష. హ. 3. నూని దినాధిపుడు – ఇ. ఈ; నూది దినాధిపుడు – గ. ద; నానలినాప్తుండు గ్రుంకె నవనీనాథా – వ.

272\. 1. బంకమగ్నం బైన – కొన్ని ప్రతులు. 2. గోగణంబు బాగున – వ.

73\. 1. భీమపార్థాదులు – అ. ఎ. ఏ. వ; నపుడు పార్థాదులు – న బ. వ.

న్నుం గొలిచి [2]చనఁగ విడిదల
కుం గడువిన్న నయి పోయెఁ గురుసంశసిధీ.

274\. వ. ఇట్లు పాండవవ్యూహంబు లోహటించి పోయినం దారును దమబలంబులఁ [1]దివియ నియమించి.

275\. చ. ఎలమి నమస్కరించుచు నహీనపరాక్రమభంగు లేర్పడం
బలికి [1]యుదాత్తవాక్యములఁ బ్రస్తుతి సేయుచు భీష్ము నందఱు
న్నలసి భవత్తనూజు[2]లు మనంబులు నిండి [3]ముదంబు మోములన్
[4]వెలి విరియంగ నేఁగిరి [5]నవీనవిభూతి నివాసభూమికిన్.

276 వ. ఇట్లు ధర్మతనయుండు దొమ్మిదవనాఁటి [1]బవరంబున బెండువడి యానిశా సమయంబునందు రహస్యప్రకారంబున.

277\. క. మనమున విషాద మడరఁగ
ననుజులఁ గూర్చికొని దానవాంతకుసదనం
[2]బునకుం జని యి ట్లను నా
తనితో నాత్మీయకార్యదశ [2]దెలియుటకున్.

278\. క. కార్చిచ్చు గవిసి మృగ[1]తతి
నేర్చుకరణి నేఁడు భీష్ముఁ డేచినకడిమిం

---

2\. రాగ – అ. ప. వ.

274\. 1. దివియించి – కొన్ని ప్రతులు.

275\. 1. యథార్థవాక్య – ర. 2. లును పండి మనంబులు నిండి – ఐ. మ. 3. మనంబు మోదమున్ – వ; న పేడ్క మోములన్ – త. హ. 4. దెలియగ నేగి రందరు నదీ సుతు డాది – ఓ. 5. యనింద్యవిభూతి – ఝ. డ. బ.

276\. 1. సమరంబున – చ.

277\. 1. బున కేగి యిట్టు లను; బున కేగి యి ట్లనియె నాతనితో–అని పాఠములు; బున కేఁగి– అని 'త' ప్రతిలో సార్ధబిందుకముగా నున్నది; బున కేగి యతని తోని, ట్లను డగ నాత్మీయ మగునడలు దెలుపుటకున్ – ఇ. ఈ. 2. దెలియంగాన్ – శ. ప. కొన్ని ప్రతులు.

278\. 1. ముల, పతి – అని పాఠములు.

చేర్చి మన[2]నేనఁ బోదివె శ
రార్చుల నవ్వీరుఁ గన్నులారం [3]గంటే.

279. మ. మనవా రెవ్వరు నోర్వ రాతనికి దుర్మానంబునం జేసి యే
మును గార్యస్థితిఁ గాన నైతి విను నిర్మూలంబుగాఁ బోరఁ [1]జ
చ్చిన సామ్రాజ్యము గొన్న యట్లగునె [2]నిశ్చింతంబునం గాననం
బునకుం బోయెదఁ దన్మూలం గొని తపఃపూజ్యుండ నై యుండెదన్.

280. క. [1]మున్నను నేఁ గారణముగ
నన్నియిడుమ లనుభవించి రనుజులు వీరిం
గన్నారఁ జూతుఁ గాని జ
గన్నుత భీష్మునకుఁ [2]గోలుగా నీఁ జాలన్.

281. వ. [1]నీకు మాదెస ననుగ్రహంబు గలదేని కయ్యంబు [2]దక్క ధర్మవిరోధంబు గాకుండునట్టియొక్కతెరువు సెప్పు మని సకరుణంబుగాఁ బలికిన విని శౌరి [3]సాంత్వనవచనంబుల [4]ననునయించి యతని కి ట్లనియె.

282. క. సత్యప్రతిజ్ఞుఁడవు నీ
[1]వత్యద్భుతబాహువీర్యు లనుజన్ములు దా
రత్యము గల్గునె నీకు న
మాత్యుఁడ నై యేను రాజ్యమహిమ [2]నొనర్తున్.

---

2. భీము బోదివె – ఆ. ఓ. 3. గంటిన్ – ఆ. ఓ. డ. న. మ వ. శ. శర. ష.

279. 1. జొచ్చిన – శ. ష. కొన్ని ప్రతులు. 2. నిశ్చిత్తంబుగా – శ. కొన్ని ప్రతులు.

280. 1. ము న్నేను గారణంబుగ – అ. ఎ. ర. వ. కొన్ని ప్రతులు; మున్నమ నాకారణముగ – వ. 2. కోరుగా – ఆ. ఎ; గోలుపుగా – స. శ. కొన్ని ప్రతులు; గోలుగా – ష; బోలుపుగా – శ. కొన్ని ప్రతులు; కొల్లగా – ఊ.

281. 1. నిక్కంబునకు మాదెస – ఓ. 2. దక్క ధర్మ – ఏ. ఐ. గ. ఘ. డ. త. బ. మ. ల. హ. 3. శాంతవచనంబుల – కొన్ని ప్రతులు. 4. ననూనయించి – కొన్ని ప్రతులు.

282. 1. వత్యుద్భటబాహు – అ. ఉ. ఊ. వ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నొనర్పన్ – కొన్ని ప్రతులు.

283. క. పగవంగ నేఁటికిం బార్థుఁడు
దెగువకుఁ జొరకున్న భీష్ముఁ దెగఁ జూచి వెసం
బగ యడఁగించెద నన్నుం
మగిడింపక చూచుచుండు మనుజాధీశా.

284. తే. సఖుఁడు సంబంధి శిష్యుండు సవ్యసాచి
నాకు నతనికి [1]నై యేను నరవరేణ్య
కూర్మిమై నిత్తుఁ గండలు గోసి యైన
నరయ నాతండు [2]నాయెడ నట్టివాఁడ.

285. వ. ఉపప్లావ్యంబున నితండు సంజయుతో నాడినబలుమాటలకు నులూకుండు వచ్చినప్పు డతనిపలుకులం బుట్టిన[1]బెట్టిదంపుఁదనంబునకుం దగినయంత నాకుం జేయవలయు నేను నీరెండెడలం బెక్కులు వలికినవాఁడ మీకిరువురకు నొండొరువులపలుకులు పరిపాలించుట సమయం బయి యుండు ననిన వసుదేవనందనునకు ధర్మనందనుం డి ట్లనియె.

286. క. కయ్యము సేయక తగుసా
హాయ్యము సేయఁ గలవాఁడ నని పలికితి ని
న్నియ్యెడ నేఁ బొంకింతునె
దయ్యము నా కేల యిట్టి దైన్యము దెచ్చెన్.

287. వ. నాకు దేవవ్రతునకు నొక్కసమయంబు గల దమ్మహాత్ముండు కౌరవు[1]లకు నయి కయ్యంబు సేయుటకును నాకు హితం బగుకార్యంబు బుద్ధిం దలకొనుటకుం బూనినవాఁ డతండు నాకు రాజ్యం [2]బొసంగు నని పలికి [3]సఖేదంబుగా ని ట్లనియె.

---

284. 1. నేనును-కొన్ని ప్రతులు; నయ్యె యో నరవ - వ; నయ్యెను - అ. ఐ. ఓ. ఔ. త. మ. 2. నాదెస - ఎ. ఏ. క. బ. ర.

285. 1. పరుసదనంబునకు - ఇ; భేదంబునకు - ద.

287. 1. లకై కయ్యంబు - పెక్కు ప్రతులు. 2. బు గలిగించి - శ. ష. 3. సంకేతంబుగా- ఘ. జ.

288. ఆ. అకట తండ్రి సచ్చి నంతనుండియు మమ్ము
నరసి [1]ప్రోచినట్టి యనుఁగుఁదాతఁ
జంప [2]మది దలంచు తెంపు సూచితె రాజ
ధర్మ మింత క్రూరకర్మ మగునె.

289. వ. అనవుడు.

290. తే. విని మురాంతకుఁ డితఁడు శాంతనవుకడకు
నరుగఁ జూచినవాఁ డని యాత్మ నెఱిఁగి
క్రమ్మఱంగ నేతెంచెదు గాక యనిన
యన్నదీసూనుతోంటి[1]వాక్యములు దలఁచి.

291. వ. అజాతశత్రున కిట్లనియె.

-: ధర్మరాజు రహస్యప్రకారంబున భీష్మునియొద్దకుఁ బోవుట :-

వం 6_103_50

292. ఆ. నీతలంపు తెన్ను నీవు మున్ననినట్లు
కాక భీష్ముఁ డలుక గదిరి పోరఁ
[1]జక్కఁ జూచెనేని శత్రువుల్ వొలియరె
యిప్పు డతనిపాలి [2]కేఁగు మధిప.

293. సీ. నీవు ద న్నడిగిన నిజవధోపాయం బవశ్యంబుఁ [1]జెప్పు దేవవ్రతుండు
మనము రహస్యవర్తనమున నందఱమును జని యమ్మహాత్మునకు భక్తి

---

288. 1. ప్రోచి పెంచినట్టి తాత – అ. ఆ. కొన్ని ప్రతులు; ప్రోచి మనిచినట్టి తాత – బ.
2. దలతు మేము జగతిలోపల రాజ – ద.

290. 1. వాక్యంబు – కొన్ని ప్రతులు.

292. 1. హరున కైన నెదుర నలవియె తలపోయ నిప్పు డతనిపాలి కేగు మధిప-అ; నడరి గెల్వ శక్య మగునె వే వేగ నీ విప్పు డతని-ప; జక్కజూచి చేరె సమయరే శత్రువు లిప్పు- ర. వ; 2. కేగు – అర్ధానుస్వార రహితముగా 'శర. ష' ప్రతులందును అర్ధాను స్వార సహితముగ వా. వీ. శ. సూ. శ. ప్రతులందును గలదు.

293. 1. దెలుపు దేవ – ఝ. డ.

నెఱఁగి తెల్లంబుగ హితకార్యగతి వినయంబుమైఁ బ్రార్థించి యడిగి యతని
సదయమంత్రోపదేశంబున నెగడుద మని యిట్లు హరి నిశ్చయంబు సేయ

ఆ. నయ్యజాతశత్రుఁ డనుజులు [2]నతఁడును
దాను సౌమ్యవేషధారణ మొప్ప
[3]నతినిగూఢవృత్తి నాపగాసుతుమంది
రమున కరిగి సముచితముగఁ జొచ్చి.

294. వ. అతనిం [1]గాంచి యధికభక్తిం [2]బ్రస్తవనపూర్వకంబుగాఁ దత్పాదంబులకుం
బ్రణమిల్లిన నతం డత్యాదరంబు[3]నఁ బేరువేర వారలందఱ సేమంబు లడిగి
యి ట్లనియె.

295. క. ఇచ్చటికి మీర [1]లందఱు
వచ్చినపని యేమి [2]యేది వలసిన నడుగుం
డిచ్చెద దుష్కర మైనను
జెచ్చెరఁ దలకొని ఘటింపఁ జేసెదఁ బ్రీతిన్.

296. వ. అని తెలి వొందిన మొగంబుతో నడిగిన దీనాననుం డగుచు ధర్మసూనుం
డతని కి ట్లనియె.

297. క. మా కెమ్మెయి సామ్రాజ్యము
సేకుఱు నెబ్భంగి బహుళసే[1]నోత్సాద
వ్యాకులత రాక తక్కుం
జేకొని యత్తెఱఁగు [2]కరుణఁ జెప్పఁగవలయున్.

---

2. కృష్ణుండు — ఔ; తానును — ప; కృష్ణుండు తాను సౌమ్యవేషధరణ మొప్ప—వ.
3. నడర గూఢ — ఓ. న;

294. 1. బ్రార్థించి — హ. 2. స్తుతివచనపూర్వకంబుగా — ఈ. 3. న వేరువేర — ఇ. ఏ. త. ద. ల. వీ. శ. ష; నం గూర్చుండ నియమించి వేరువేర — ఐ. మ. వ.

295. 1. లిందరు — ఎ. న. మ. వ. హ. 2. యెద్ది వలసిన — కొన్ని ప్రతులు; యింక వల సిన — వ.

297. 1. నోత్సాహవ్యాకులత — ఊ. ఏ. ఐ. గ. ద. మ. వ. వీ. ష; నోత్పాతవ్యాకులత — ఎ. ఓ. ఔ. వ. శ. 2. ప్రీతి జెప్పగ — కొన్ని ప్రతులు.

298. క. అనవుడు నేఁ జెనఁగఁగ మీ
కనఘా సైన్యద్వయంబు నగు సామ్రాజ్యం
బును గానేరదు గావున
నను నిర్జింపంగ శోభనము లెల్ల నగున్.

299. వ. అని పలికిన శాంతనవునకుం గౌంతేయాగ్రజుం డిట్లనియె.

300. ఉ. [1]చిచ్చఱకన్ను మూసి[2]కొని చేత్రిశూలము డాఁచి లీలమై
వచ్చినరుద్రుచందమున [3]వ్రాలుదు వీ వనిలోనఁ [4]నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిమగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చితి మెవ్విధిన్ గెలువవచ్చు మహాత్మ యెఱుంగఁ [5]జెప్పవే.

301. క. అనుటయు ని ట్లను గంగా
తనయుఁడు నీచెప్పినట్ల తథ్యం బది న
న్ననిమిషులు గెలుతురే చే
ధను వుండఁగ వినుము తద్విధము దేటపడన్.

302. తే. ఇట్టివానిఁగ నన్ను మీ రెఱిఁగి యిచటి
కిందఱును వచ్చి యక్కటా యిట్టు లడుగ
మీకుఁ బ్రియ మైనకార్యంబు [1]మెయికొనంగఁ
గనుటకంటెను సుకృతంబు గలదె [2]నాకు.

303. వ. ఏ నాయుధవ్యాపారంబువలన ను దా సీ న త్వ ం బు నొందిన నన్ను
జయింప స మ కూ రు ఁ గోడు పుచ్చినవానిని గై దువు [1]బెట్టినవానిని
సిడంబు [2]డించినవానిని నంగనను నంగనాపూర్వుని నంగనాభిధానునిఁ
దలచీర వీడినవానిని భ్రాతృహీనుని నపుత్రకునిం గని యేటుఁ బోటుఁ

---

300. 1. చిచ్చఱ - అ. వ; చెచ్చెర - చ. వ. 2. వలచేతి త్రిశూలము - ఓ. ఔ. ఖ. చ. ఝ డ. మ. ర. వ. శ. ష. 3. వ్రాలుదు నీ వనిలోన-కొన్ని ప్రతులు; 4. నోవగా-గ; నొంపగా - ద. 5 జెప్పుమా - బ.

302. 1. మేకొనంగ - కొన్ని ప్రతులు. 2. యెందు - ఐ. మ. వ.

303. 1. పట్టని వానివి - జ. ఝ. త. ద. ల; విడిచిన వానిని - వీ. శ. వ. 2. దునిసిన - ఖ. వ.

దక్కి [3]సమరంబు సేయ మానుదు మఱియు నొక్కవ్రతంబు పూనినవాఁడం బుట్టినప్పుడు లేక నడుమ [4]దైవం బిచ్చినపురుషత్వంబు గలవానితోడఁ గయ్యంబు సేయం గావున మీకు నొక్కయుపాయంబు సెప్పెద ద్రుపదు నపత్యం బైన శిఖండి యట్టివాఁ డగుట మీ రెఱుంగుదుర కాదె విశేషించి ముందటిపుట్టువున నంగన యగుట వాని కెదు రేయకుండుదు నర్జునుండు వానిం బురస్కరించుకొని వచ్చి యే నేయుట మానినయెడ నొప్పించి పడవైచునది పదంపడి బంధుమిత్త్రు లగుధార్తరాష్ట్రుల గెలుచుట సుకరం బగు నిది నాపను పేను బనిచి నట్ల చేయుం డని సహృదయంబుగాఁ జెప్పిన నట్లు దేవవ్రతుచేత ననుజ్ఞాతు లై వార లతనికి నమస్కరించి వీడ్కొని విడిదలకుం బోవుచున్న సమయంబున [5]బీభత్సుండు.

304. ఆ. సురనదీసుతుండు పరలోకగతి నిరీ
క్షించుటకును దాను గృతకవృత్తిఁ
జంపవలయుటకును సవిషాదమానసుం
డగుచు నిట్టు లనియె నచ్యుతునకు.

305. క. [1]గురునిఁ గృతప్రజ్ఞుని ధ
ర్మరతు వయోవృద్ధు లోకమాన్యు దయాళుః
సురతటినీసుతు వంచనఁ
బురుషోత్తమ చంప బుద్ధి వుట్టదు నాకున్.

306. ఆ. [1]నన్నుఁ బాంసుకేళి నున్న నర్మిలి నెత్తి
మేనిదూళి దనదుమేను వొరయఁ
బ్రీతిఁ గౌఁగిలించి మాతండ్రిగుణము ల
గ్గించి [2]కన్నునీరు నించు నతఁడు.

---

3. కడుపుదు మఱియు - పెక్కు ప్రతులు. 4. దైవనిర్మితంబునం బురుష - క.
5. వివ్వచ్చుండు - ఇ. ఈ.

305. 1. గురుని కులపవిత్రుని ధర్మరతు - బ.

306. 1. నన్ను బాలకేళి నున్నచో నర్మిలి తోడ నెత్తి, మేని ధూళి వొరయు - శ. మ. న. శ. కొన్ని ప్రతులు. 2. కంటినీరు - వ.

307. ఉ. అక్కట తండ్రి లేనిమము [1]నమ్మెయిఁ బెంచిన తాత నిమ్మెయిం
డ్రెక్కొనఁగా దతండు సముదీర్ణభుజాబలశౌర్యశాలి యై
యిక్కడి సేనఁ జక్కడిచె నేనియుఁ జూతున [2]కాక [3]ధర్మముం
దక్కుట కోర్వఁ [4]జాలుదునె ధర్మజుతమ్ములు క్రూరకర్ములే.

308. వ. అనిన విని కృష్ణుం డాజిష్ణున కిట్లనియె.

309. ఉ. క్రూరత కోర్చి [1]యించుకయు రోయక [2]పైకొని యెల్లభంగులన్
వైరులఁ జంపి భూప్రజకు వర్ధనముం గలిగించి పాడిమైఁ
గోరి గొంచు [3]సద్వ్యయము గోరి యొనర్చుట రాజధర్మవి
స్తారముగా బలారికి [4]వచస్పతి సెప్పుట యప్రసిద్ధమే.

310. చ. అనిమొన నోర్తు భీష్ము నని యాడిననీదగుపూన్కి లోక మె
ల్లను విని యుండఁగా నిటు చలం బెడలం జన [1]దెట్టు లైనఁ జం
పన తగు రాజధర్మపరిపాలన గా కిది క్రూరకర్మమే
నిను విధి పంచె శాంతనవునిం దెగ[2]టార్చఁగ వేయు నేటికిన్.

311. చ. [1]అనుటయుఁ గ్రీడి యిట్టు లను నాద్రుపదాత్మజుజన్మ మాపగా
తనయవధార్థ మం డ్రదియుఁ దప్ప దతండును వాని నేయఁ డే
[2]ను నతని నేయుచందమున నూల్కొని యన్యుల నేయుచుండు వాఁ
డనితర[3]వధ్యకాయుఁ డగు నాయనఁ దాఁ బడ [4]నేయు నుగ్రతన్.

312. వ. అనవుడు నవ్వి కవ్వడికిం గమలనాభుం డిట్లనియె.

---

307. 1. నర్మిలి బెంచిన – ఝ. ఙ. ర. వ. 2. కాని – కొన్ని ప్రతులు. 3. ధర్మవుం దక్కుట – ఐ. ఓ. ఝ. న. బ. వ. 4. జాలుదురె – న. వ. శర.

309. 1. యింతయును – ఔ. 2. రాజులు నెల్ల భంగులన్ – శ. 3. సద్రవ్యయము – ల. శ. ష. స. పెక్కు ప్రతులు. ద్రవయము అనురూపము నిఘంటువులలో కానరాలేదు. 4. బృహస్పతి – ఈ. వ.

310. 1. దిట్టు లుండ – అ; దెట్లు బోర జంపన – ఎ. ఔ. డ. 2. నేయుము – ఘ; టార్పుము – న. ప. వ.

311. అన విని, అనవుడు – అని పాఠములు. 2. నును నని సేయు – ఓ. ప. ల. 3. వధ్యుడయ్యు నగు – ప. 4. వైచు – ఎ. క. వ.

313. ఉ. నీ వొకరుండు [1]దక్కఁగ ననింద్యపరాక్రమశాలి భీష్మునిం
జావఁగ నేయ నెవ్వఁడును జాలఁడు నీ[2]తలఁ పెన్నిభంగులన్
దైవము [3]చూపువోలెఁ దుదిదాఁకు నె [4]యవ్విధ మిట్టు లుండఁగాఁ
ద్రోవఁగ వచ్చునే యెటులు ద్రోచినఁ బోవదు [5]చూచియుండుమీ.

314. వ. అని పలికిన విని యతం డట్లు గాక [1]యప్పటికి నె ట్లయిన నట్లయ్యెడు నని యర్జునుం డియ్యకొనిన గోవిందుండును ధర్మనందనాదులుం బ్రమోదంబు నొంది రివ్విధంబున శిబిరంబున కరిగి పాండవులు పుండరీకాక్షుని నిజనివాసంబున కనిచి తమ తమనికేతనంబులకుం జని యారాత్రి సుఖనిద్ర సేసి రని చెప్పిన సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

315. క. పాండుసుతు లేమిభంగి శి
ఖం[1]డిం గూర్చికొని యాపగాసుతుపై ను
ద్దండగతి నడచి రెట్లు ప్ర
[2]చండతతో సమరకేలి సలిపిరి చెపుమా.

### -: భీష్ముని దశమ దివసయుద్ధానుక్రమము :-

### సం. 6_104_2

316. వ. అనుటయు నాసూతనందనుం డతని కిట్లను సూర్యోదయసమయంబున బాండుసూనులు సేనాస[1]మేతు లై వెడలి మోహరించునప్పుడు ముందట శిఖండిని నిలిపి యతనికెలంకుల భీమార్జునులును వెనుక నభిమన్యుద్రౌపదే

---

313. 1. దప్పగ – ఇ. ఈ. 2. తల పేమి – ల. కొన్ని ప్రతులు. 3. పూఁపువోలె – వా. సూ (పూఁపు = పూనిక, ఉద్యమము, సంకల్పము – సూ.) చూపు – వీ. శ. ష. పెక్కు ప్రతులు. 4. యవ్విధి యట్టు – కొన్ని ప్రతులు. 5. చూచుచుండుమీ – వ. వీ. శ. ష.

314. 1. యెప్పటికి నె ట్లయిన – కొన్ని ప్రతులు.

315. 1. డి నొనర్చుకొని యాపగా – వ. కొన్ని ప్రతులు. 2. చండ సమర కేలి నేడు(నెట్లు) సలిపిరి – స. శ. కొన్ని ప్రతులు.

316. 1. మేతంబుగా – కొన్ని ప్రతులు.

యులును వారియిరువంకలం జేకితానకై నేయులును నట పిఱుంద ధృష్ట
ద్యుమ్నాది పాంచాలకుమారుల మున్నిడుకొని కవల నుభయపార్శ్వం
బులం బెట్టికొని యుధిష్ఠిరుండును వీరి నూరెలం బొదివికొని విరాటద్రుపద
[2]ముఖ్యు లగుపృథ్వీపతులు[3]ను గేకయపంచక ధృష్టకేతులును నిలిచి రి త్తె
ఱంగున గట్టిమోహరంబు దీర్చుకొని నడచి రంతకు మున్న మనవారును
వెడలి భీష్ముం డగ్రభాగంబున నుల్లసిల్ల నీకుమారు లమ్మహాత్ముం బరివేష్టింపఁ
గుంభసంభవతత్సంభవులుం దక్షిణవామ[4]భాగంబులను గృపకృతవర్మభగ
దత్తపురస్సరుం డై కురురాజు మధ్యభాగంబునను బృహద్బలకాంభోజ
ముఖ్యు లైన మహీపతు లమ్మనుజేంద్రుచుట్టును ద్రిగర్తు లపరభాగంబునను
బన్ని బలుమొన యమర్చుకొని త్రోచి నడచి [5]రి ట్లిరువాఁగునుం [6]గవిసి
వివిధతూర్యధ్వనంబులు నింగిముట్ట నొండొంటిం దాఁకిన.

317\. క. సమరం బప్పుడు దనుజులు
నమరులునుం బెనగు[1]చంద మై [2]తోఁపఁగ భూ
రమణ వినుమేలు సెప్పుదు
జమపురమున నగ్గలంపుసందడి యయ్యెన్.

318\. వ. అట్టియెడ.

319\. మ. కవ లుద్దామపరాక్రమస్ఫురణమైఁ గౌరవ్యసైన్యంబు ని
క్కువడం జేయఁగ భీమపార్థులును గో కొమ్మంచు నొక్కుమ్మడిం
గవియం బాండవసేన యుబ్బి యడరంగాఁ జూచి కల్పాంతభై
రవభీమాకృతి నేచి భీష్ముఁడు శరవ్రాతంబు [1]గుప్పించినన్.

320\. ఆ. కాలుకాలు [1]పెనఁగి కాలుబలంబులు
నొడ్డగెడవుగాఁ రథోత్కరంబు

---

2\. ప్రముఖు లగు – కొన్ని ప్రతులు. 3. ను ముంగలి వైు(బింగలివైు)కేకయ – ల. కొన్ని ప్రతులు; ను పింగళకేకయ – శ. ప. 4. పార్శ్వంబులను – ద. 5. రిట్లు రెండు వాఁగునుం – శ. కొన్ని ప్రతులు. 6. గదిసి – కొన్ని ప్రతులు.

317\. 1. చుండునటు లయ్యెను భూ – ఎ. 2. యమరగ భూ – వ.

319\. 1. నం గప్పినన్ – ఐ. మ. ర. వ.

320\. 1. పెనచి – కొన్ని ప్రతులు.

క్రొమ్మొగ్గతిలఁగ గుజ్జుములు నేల యద్రువ మా
తంగఘటలు గూలెఁ దక్షణంబ.

321. క. కనుఁగొని శిఖండి [1]వెస మా
ర్కొని భీష్ముని నేసె మూఁడుక్రూరాస్త్రములం
[2]గని యతఁడు మరల చూడ క
తని నుద్దేశించి పలికె దరహాసముతోన్.

322. ఉ. [1]ఎవ్వత నేని ధాత సృజియించెఁ దగ౯ మగవానిఁ గాఁగ నా
కొవ్వమిఁ [2]జేసి యట్టినిను [3]నుగ్మలి నేయఁగ [4]నొల్ల నావయిం
గ్రో వ్వేసలార నీవు శరకోటి వెసం బరగించితేని నే
నవ్వుదుఁ గాని కోపము మనంబునఁ బుట్టదు సూ [5]శిఖండినీ.

323. వ. అనివం [1]గోపించి శిఖండియు నతని కి ట్లనియె.

324. క. గెలిచితి రాజుల నెల్లను
బలియుం డగుపరశురాముప్రతివీరుఁడ వై
యలవుకలిమి [1]నెఱపిన నీ
చలము బలము నాకుఁ జూపఁ జాలవు కంటే.

325. క. ఏయు మొకనేర్పుమై [1]ని
ల్లేయక [2]క్రీడించి [3]యరుగు మెట్లయినను మ
త్సాయకముల నినుఁ గూల్చెదఁ
జూ [4]యెవ్వత నైతి నేమి [5]సూచెదు నన్నున్.

---

321. 1. వడి - హ. 2. గని యాతఁడు మరి చూడ కతని - ల. శ. కొన్ని ప్రతులు.

322. 1. ఎవ్వరె. ఎవ్వతె. ఎవ్వతి - అని పాఠములు; ఎవ్వత నేవిధాత - ర. 2. జేయ నట్టి - అ. ఉ. ఏ. క. స. 3. నుగ్రత-ఈ. 4 జాల - ఈ. ఖ. ట. వ. 5. శిఖండిపై - ల. వ.

323. 1. గోపించు నుడివదె శిఖండి - ఖ. ఝ. ట.

324. 1. నెరపితి నీచలము - కొన్ని ప్రతులు.

325. 1. నీ వేయక - ల. 2. కేడించి - పెక్కు ప్రతులు.(రేఫరహితరూపము) 3. జరుగు మెట్లయినను - ఇ. ఈ. ఔ. ఖ. గ. ఝ. ప. బ. మ. ర. హ. 4. యెవ్వతె, యెవ్వడ (నైన) - అని పాఠములు 5. చూడుము నన్నున్ - కొన్ని ప్రతులు.

326\. క. నేఁ డెమ్మెయి నైనను నీ
పోడిమి సెడఁ దోన [1]తవిలి పొదువుదు నిన్నుం
వాఁడిమగఁ డనుట యుడుపుదు
వేఁడిమి సొంపెసఁగ నస్త్రవిద్య [2]మెఱయుదున్.

327\. వ. అనుచు మఱియు నయిదమ్ము లేసె నప్పలుకులు విని ఫల్గునుం డాత్మగతంబున నేఁడు శిఖండిచందంబు వింత యయి యున్న యది నదీనందనుండు సమయుటకు సమయం [1]బై న[2]దైవదత్తోత్సాహంబున నేచి పలికెం గావలయు నని యూహించి యుపోద్బలంబుగా నతని కిట్లనియె,

-: అర్జునుఁడు శిఖండికిఁ బ్రోత్సాహంబు గలిగించి భీష్ముపైఁ గవియించుట :-

సం. 6_104_51

328\. ఆ. ఇట్టు లాడి పిదప నేమియుఁ జేయంగ
జాల కున్న మనల జగము నవ్వు
నేను గలుగ నిన్ను నెవ్వరి కేమియుఁ
[1]జేయరాదు భీష్ము [2]నేయు మదరి.

329\. వ. అనియె నప్పుడు గాంగేయుండు దొలంగి పాంచాల[1]బలంబుపైఁ దఱిమినం దెఱపి గని పాండవబలంబులు గాండీవి మున్నుగాఁ గవిసినం గౌరవసేన దెరలి మరలినం జూచి కురురాజు సురనదీసూనుతోడ నీవు గలుగ మన సైన్యంబు దైన్యంబు నొంద నగునే యనవుడు రారాజుతో నతండు.

---

326\. 1. తగిలి - కొన్ని ప్రతులు. 2. నెరపుదున్ - త.

327\. 1. బైన తెరంగున దైవ - ఇ; బైనచందంబున దైవ - ఈ; బైన దివసంబు దైవ - మ. వ. 2. దేవదత్తోత్సాహంబున - ఖ. డ. త. ర. ల.

328\. 1. దలపరాదు ద్రుపదతనయ వినుము - అ. 2. చిక్కుపరపు - ఉ. ఎ; నేయు మరలి - ల.

329\. 1. వ్యూహంబు - ఇ. ట. డ. త. ద. మ. ర. ల.

330. క. మును పదివేవురఁ జంపుదు
నని యిచ్చినబాస [1]వచ్చె నవనీశ్వర నీ
మనిచినఋణంబు దీర్చితి
విను లా విట[2]మీఁదఁ దఱుఁగువిధ మై తోఁచెన్.

331. ఆ. నేఁటిభంగి సూడ నృపవరపాండవు
లొండె [1]నన్ను వారి నొండె నేను
సమయఁ జేత గలుగు సమసెద రే యొక
మర్త్యుచేత వారమర్త్యబలులు.

332. వ. ఐనను నాచేతి[1]బలువు సూడుమీ యని పలికి పేర్చి పటుతరశరార్చులం బ్రచండనరనాథయూథంబులం బొదివికొని పాండవులకుం దేఱి చూడ[2]రాక నిర్ధూమదహనస్వభావుం డైన పితామహుప్రాపున భవత్పుత్త్రులు శత్రుబలంబుల బడలువడం జేయం దొడంగిన [3]వారిం గనుంగొని.

333. ఆ. పాండవేయమాత్స్యపాంచాలయాదవ
పాండ్యకేకయాదిబలము లొక్క-
మొగిన [1]త్రోవ నీదుమొనలు మార్కొనుటయు
నపుడు పోరు ఘోర మయ్యె నధిప.

334. వ. అట్టియెడ నర్జునుండు శిఖండి నాలోకించి.

335. తే. నీవు భీష్మున [1]కలికినఁ బోవ దేను
గలుగ వెఱ పేల యతనిపైఁ గవియు మెయిది
కొని మదీయబాణంబులఁ గుప్పఁ[2]గూరఁ
బఱపి కూల్చెద నీతనిఁ బటురయమున.

---

330. 1. చెల్లె - ఇ. 2. మీద విరుగు విధము - ల.

331. 1. వారిచేత నొండె నేను - వ.

332. 1. బిగువు - కొన్ని ప్రతులు. 2. నలవి గాక - వ. 3. వారల గలయం గనుంగొని- ఐ. మ. వ.

333. 1. తరుమ - బ.

335. 1. కలికిన - ఇ. వ. 2. గూళ్లు - ర.

336. వ. అనిన నాతనిపలుకులు విని యెలుంగెత్తి ధృష్టద్యుమ్నుండు.

337. క. మనయోధు లందఱును శాం
తనవునిపైఁ [1]దఱుముఁ డింద్రతనయుఁడు గలుగన్
[2]మన మతనికి శంకింపఁగఁ
బని లే దని పలికి యార్చి బలువిడి [3]నడరెన్.

338. వ. అప్పుడు ధర్మజభీమనకులసహదేవులును సుభద్రాతనయద్రౌపదేయులును ద్రుపదవిరాటులును సాత్యకిచేకితానధృష్టకేతుకేకయమాగధులును మఱి యునుం జేయంగల[1]దొరలు నొక్కపెట్ట బెట్టడరిన నిక్కడ గురుపుత్రభూరి శ్రవసులును గృతవర్మకృపకాంభోజపతులును వికర్ణదుర్ముఖ[2]వివింశవిచిత్ర సేనులును లోనైనయోధులు దేవవ్రతునకుం దలకడచి వారిం దలపడి రిట్లు మందాకినీనందనుపయిం గవియుపాండవసైనికులను నతని కడ్డుపడుకౌరవ్య వీరులును జూచునెడ సురల కనిమిషత్వంబు సార్థకం బయ్యె నయ్యవస రంబున.

339. క. [1]మొనసి శిఖండిని మున్నిడి
కొని యురవడిఁ దఱుము నరునకును వెస దుశ్శా
సనుఁ డడ్డపడియెఁ బొంగిన
వననిధికిని వేలవోలె వసుధాధీశా.

340. వ. ఇట్లు నిలువరించి.

341. క. ఇరువురఁ గృష్ణుల నాతం
డిరువదిబలునారసముల [1]నేసెం గ్రోధ

---

337. 1. గదియు డింద్ర, గవియు డింద్ర–అని పాఠములు. 2. మనమీతని కి ట్లులుకంబని – ర. వ. 3. నడచెన్ – పెక్కు ప్రతులు.

338. 1. దొరలు – ఐ. న. మ. వ; రథికులు – వా. కొన్ని ప్రతులు. 2. వివింశతి చిత్ర సేన – కొన్ని ప్రతులు.

339. 1. మొనను శిఖం – న. వ.

341. 1. నేసిన కోపస్ఫురితు డయి – కొన్ని ప్రతులు.

స్ఫురితుఁ డయి నొంచెఁ గ్రీడియు
నరనాయక యతని నూఱునారాచములన్.

342. తే. అతఁడు నొచ్చియు నాఁటించె నైదుతూపు
లింద్రసుతుఫాలమునఁ నాతఁ డేచి విల్లు
దునిమి వెల్లేయఁ [1]దలఁకక దుస్ససేనుఁ
డన్యధనువున నిరువదేనమ్ము లేసె.

343. క. ఆతూపులు నఱికి పరి
స్ఫీతం బగు నారసంబు పృథుతరవక్ష
స్స్యూతంబు సేసి విజయుఁడు
నీతనయుని మూర్ఛ [1]వుచ్చె నిష్ఠురవృత్తిన్.

344. వ. ఇట్లు దుశ్శాస[1]నుండు సొలి వ్రాలుటయు.

345. క. సార[1]థి యరదము భీష్ముని
తేరివెనుక [2]కెగిచె నంతఁ దెలివొంది ధృతి
స్ఫారుఁ డగు [3]నీకుమారుఁ డు
దారగతిన్ మగిడి వచ్చి [4]తాఁకెం గ్రీడిన్.

346. వ. తదవసరంబున సాత్యకితో నలంబుసభగదత్తులును నభిమన్యుతో సుదక్షిణుం డును విరాటద్రుపదులతో నశ్వత్థామయు సహదేవునితోఁ గృపాచార్యుం డును నకులునితో వికర్ణుండును ఘటోత్కచునితో దుర్ముఖుండును భీమ సేనుతో భూరిశ్రవసుండును చేకితానుతోఁ జిత్రసేనుండును ధర్మనందనుతో

---

342. 1. తెరలక, తరలక - అని పాఠములు.

343. 1. ముంచె - కొన్ని ప్రతులు.

344. 1. నుండు నొచ్చి సొలి - ల.

345. 1. థియురథము - కొన్ని ప్రతులు. 2. నిలిపె, కనిపె(చె) - అని పాఠములు. 3. నీకుమారు - అ. మ. వ; నక్కుమారు - వా. కొన్ని ప్రతులు. 4. తాకె గిరి టిన్ - కొన్ని ప్రతులు.

నస్త్రగురుండును దలపడిన [1]జెట్టిపంబగుబవరం బయ్యె [2]నం దిరుదెఱంగుల యోధులు నన్యోన్యధ్వజభంజనంబును బరస్పరతురగహననంబును నితరేతర సూతనిపాతనంబును మిథఃకోదండఖండనంబును జేయుచుండం బటుతర శరసంపాతసంపాదితశంపాజాలకాభీలంబును భీషణగుణరణనగర్జాస్ఫూర్జితంబును రక్తధారాసారఘోరంబును నగునపూర్వపర్జన్యసమయంబు దోఁచె నప్పుడు గయ్యంబుకలరూపంతయుం గనుంగొనుటకు మింటిక్రేవ నున్న వెరవు గాదను[3]పరుసున [4]సవిత్సుండు [5]సగమింటి[6]కిం జనుదెంచె నట్టియెడ.

347. మ. పటుదుశ్శాసనబాణపంక్తి నతిదర్పస్ఫూర్తిమైఁ ద్రుంచి యు
త్కటకోపానలదీప్తవక్త్రుఁ డగుచుఁ గాండీవి పెల్లేయుడుం
ద్రుతటిజ్యాలతికాధనుర్ధ్వజుఁడు [1]నిర్లూనాఖిలాంగుండు నై
రటదశ్వం బగు తేరితో నతఁడు సంత్రాసంబునం [2]బాటినన్.

348. తే. ఫల్గునుఁడు భీష్ముముందటిబలము నెల్లఁ
జటులరథవల్గనుం డయి చంపుచున్నఁ
జూచి ద్రోణుండు [1]గుణరవస్ఫురణ[2]ఘూర్ణ
రోదసీభాగుఁ డగుచు మార్కొనఁ గడంగి.

*-: ద్రోణాచార్యులశ్వత్థామను భీష్మునకు సహాయంబుగాఁ బంపుట :-*

సం. 6_108_1

349. వ. అక్కడ నడచినం గాంతేయాగ్రజుండు తోడన [1]తవిలి సేనాసమేతంబుగా నడ్డపడి పోనీక పెనంగుచుండ నక్కుంభసంభవుండు.

---

346. 1. జెట్టిదంపు బవరము - ర. 2. నట్లిరుదెరంగుల - కొన్ని ప్రతులు. 3. వరుసన - న. 4. సవితుడు - ప. ర. వ.(రూపము విచార్యము) 5.సగమింటికి - ఝ. డ; చక్క సగమింటికి - క. ఖ. ట. త; చక్కని మింటికి - వా. కొన్ని ప్రతులు. 6. నడిమికిం జనుదెంచె నను కరణి మధ్యాహ్నం బయ్యె నట్టియెడ-వీ; కిం జనుదెంచెనను కరణి మధ్యాహ్నం బయ్యె నట్టియెడ - శ. ష. స. ళ.

347. 1. నిర్ధూతాఖిలాంగుండు - ఎ. మ. వ. 2. బాసినన్ - ఆ. ఉ. ఏ. .కొన్ని ప్రతులు.

348. 1. గురురవ - వా. కొన్ని ప్రతులు; గుణరవ - వీ. శ. ష. ళ. కొన్ని ప్రతులు. 2. పూర్ణ - కొన్ని ప్రతులు.

349. 1. తగిలి - కొన్ని ప్రతులు.

350\. క. అప్పుడు క్రోధము[1]నం గను
నిప్పులు రాలంగఁ దనకు నెఱసంగడమై
యొప్పినతనయున కిట్లని
చెప్పెం దత్కాలగతివిశేషము లెల్లన్.

351\. చ. [1]తడఁబడె దివ్యబాణములతంత్రము మంత్రము దప్పెడుం గడు
న్వడఁకెడుఁ జాపదండము మనంబును నాకు వశంబు గాదు వీ
డ్వడియెడుఁ జెయ్వు లంగము గడంక దొఱంగెడు నేఁటిభంగిఁ గ
వ్వడి తనపూన్కి దీర్చుట ధ్రువం బని బుద్ధి జనించెఁ బుత్రకా.

352\. వ. అతనిమును [1]మటు తల యెత్తి చూడుము.

353\. క. కూలెడు గుఱ్ఱంబులు ధర
వ్రాలెడు నేనుఁగులుఁ గెడయు రథములు [1]నై యా
భీలయు[2]గాంతసముద్భట
కాలపురోభాగరేఖ గాఁనగ నయ్యెన్.

354\. వ. అదియునుం గాక.

355\. తే. అడరి [1]కురుసేనపై గ్రద్ద లాడఁ జొచ్చెఁ
బడుచునున్నవి యుల్కలిక్కడ వినంగ
వచ్చె నతి[2]రూక్షభంగి శివారుతంబు
లాపగానందనునకుఁ గీడావహిల్లు.

---

350\. 1. కన్నుల నిప్పులు – పెక్కు ప్రతులు; కన్నుల నిప్పులు రాల్చం(ల్పం)గ – ఖ. య. శర. సూ.

351\. 1. తడ బడి(డ) – కొన్ని ప్రతులు.

352\. 1. మొన – ఈ.

353\. 1. నయ్యాభీల – జ. ఝ. 2. గాంత్య – కొన్ని ప్రతులు.

355\. 1. మన – ఉ. ఎ. య. 2. ఘోరభంగి – ఎ.

356. వ. యుధిష్ఠిరు[1]మొగంబునం గ్రోధం బగ్గలం బై తోఁచుచున్నయది ద్రౌపదేయ
నకులసహదేవసహితుం డయి తఱుము నతని మిగిలి నాకు రా రాదు నీవు
దేవవ్రతుపాలికిం బోయి యతనికి [2]దాపట వలపటం బ్రాపై నిలువు మిది
ప్రాణంబులు [3]డాఁచుసమయంబు గా దని పలికి పనిచిన నశ్వత్థామ యుద్ధా
మగతిం జనియె నక్కడ భీమసేనుండు.

357. క. నరుఁ దేచి శిఖండిఁ [1]బుర
స్సరుఁగాఁ గొని యపుడు భీష్ముసమయింపఁగ స
త్వరుఁ డగుటకుఁ దగ రణత
త్పరుఁ డై కురుసేనమీఁదఁ దఱిమెం బెలుచన్.

358. వ. ఇట్లు దఱిమి గాంగేయుముందటిబలంబుల [1]బారిసమరం దొడంగిన భగ
దత్తకృపకృతవర్మశల్యసైంధవ చిత్రసేనదుర్మర్షణవిందానువిందవికర్ణులు
పదుండ్రు నొక్క పెట్ట [2]భీమునిం బొదివి నానాస్త్ర[3]సంతానంబుల నొప్పిం
చిన నొచ్చియుం జలింపక పోరునమ్మారుతిం గనుంగొని క్రీడి తోడై తఱియ
సంజికి [illegible] [4]తునియలను బాణంబులపఱియలను గేతుచ్ఛత్త్రచామరం
బుల[5]చెక్కలను భూషణంబులపొళ్లను బుడమిం గప్పినం జూచి సుయోధనుండు
సుశర్మాదిభూపాలకుల నాలోకించి యాభీమార్జునులం దాఁక నియోగించిన.

359. క. ముందటిపదుండ్రు నాన్నృపు
లందఱునుం గూడి [1]పెనఁగి యయ్యిరువురచే
తం దూలపోవఁ జొచ్చినఁ
గ్రందుగ [2]బలుమొనల నెల్లఁ గవియం బనిచెన్.

---

356. 1. ముఖంబున – కొన్ని ప్రతులు. 2. దావలను వలవలనుం – ఆ. 3. డాచుకొను సమ – ఉ; డాప – క. హ; కాచు – ల.

357. 1. బురస్సరుఁగాఁ గొని–శ. పెక్కు ప్రతులు; బురస్కరించుకొని – వా; పురస్కరుఁడు గ – ర. స. శ. హ.

358. 1. సమయింపం దొడంగిన – బ. 2. భీమునిం బొదివి – ఇచ్చట మూలము "దశైతే తావకా యోధా భీమసేన మయోధయన్" – భీష్మ. పుట. 272. చిత్ర శాలా ప్రతి; యతనిం – వా. 3. సంథానంబుల – ఆ. హ. 4. తునియలును...పరియలును...పొళ్లును – న. ప. బ. మ. వీ. శ. ష. 5. శకలంబులును – గ. ప. వ. శ. ష.

359. 1. కవిసి – హ; పెనగ నయ్యిరువుర – ర. వీ. శ. ష. 2. బతి మొదల – ర.

360\. వ. ఇవ్విధంబునం బెక్కుమొనలు పయింబడిన నయ్యిరువురకుఁ బోరు [1]భరం బగుట యెఱింగి సౌభద్రసాత్యకిప్రముఖులగురథికజనంబులు సైన్యోపేతం బుగాఁ ద్రోచి యేచిన.

361\. క. పాండవబలము లయత్యు
ద్దండపరాక్రమము సూచి [1]దర్పోద్ధత వే
దండములఁ గనిన కేసరి
చండత భీష్ముండు వొదివె శర[2]నఖరములన్.

362\. క. దొల్లెడుసూతులుఁ బెలుచం
ద్రెళ్లెడుతురగములుఁ గా నతిక్రూరగతిం
బెల్లేయుచు సత్వరముగ
నెల్లెడలం దాన యగుచు నేత్తెఱఁ [1]బొదివెన్.

363\. వ. ఇట్లు పెద్దయుంబ్రొద్దు విహరించి యపరాహ్ణం బగుటయు నతం డాత్మగతంబున.

364\. తే. ఉత్తమక్షత్రియుల నెల్ల నుగ్రవృత్తి
నేఁడుపది[1]నాళ్లగోలె నానిశితశరచ
యములఁ గూల్చితి వేసరినట్టు లయ్యె
మేనితోడి [2]పొత్తింకిట మాను టొప్పు.

365\. వ. అని తలంచి తొలంగి బలంబులం దెరల్చికొనుచుం గయ్యంబు సేయుచుందం బునం గాంగేయాగ్రజుం గదిసి [1]యల్లన యతనితో ని ట్లనియె.

---

360\. 1. బరవసం బగుటయు, ఘోరం బగుటయు - అని పాఠములు.

361\. 1. దర్పోద్ధతి వేదండ - ఎ. త. ప. మ. ర. వ. వీ. శ. ష. 2. నికరములన్ - ఏ. ఓ. ఘ. జ. త. న. బ. మ. య. ర. శ. హ; నిచయములన్ - ఈ. గ; పటిష్ఠుండై - ఝ.

362\. 1. పెనగెన్, పోరెన్, బొలిచెన్ - అని పాఠములు.

364\. 1. నాళ్లయేని - ఊ. ఓ. ఘ. మ. ర. శ; నాళ్లగోలె - ఝ. డ; నాళు లేని - వా. కొన్ని ప్రతులు. 2. పొందింతట - ఉ.

365\. 1. యల్లన - పెక్కు ప్రతులలో లేదు.

366. క. జనియించి నంతనుండియు
జనపతులం గ్రూరవృత్తిఁ జంపుచు నుండం
జనియెం గాలము విసివితి
ననఘా యే నింకఁ జాల నాసురవిధికిన్.

367. ఆ. మీరు [1]నాహితంబు గోరుదురేని శి
ఖండి మున్న గాఁగఁ గడఁగి యంత
వట్టువారు నొక్క[2]పెట్టకాఁ బైఁబడి
[3]యేయుఁ డింకఁ దడవు సేయ వలదు.

368. వ. అని పలికి సమరప్రకారంబునం దేరు [1]గ్రేళ్లు దోలి పాంచాలబలంబులపయి నడరె నప్పు డయ్యజాతశత్రుండు సమీపవర్తి యగుధృష్టద్యుమ్ను నాలోకించి.

369. క. దేవవ్రతుపలుకులు విం
టే వేగమ పనుపు మొక్కటిఁగఁ దఱుమఁగ యో
ధావళి నెల్లను భీముఁడు
నీవును నరుతోడఁ గూడి నిగుడుఁడు వెలుచన్.

370. వ. అనవుడు నతండు.

371. సీ. మాత్స్యకైకేయాది మనుజేంద్రులకుఁ జేయఁ గలయట్టియోధవీరులకుఁ జేయి
సూపి మరున్నదీసూనుపైఁ గవియింప బవనజపార్థులప్రాపుకలిమి
వెఱ వేది యందఱుఁ దఱుమఁ గౌరవపతి తమ్ములు దొరలును దానుఁదాతఁ
గడచి తాఁకినఁ బోరు ఘన మయ్యె నప్పుడు సౌభద్రుఁ డమ్మహీశ్వరుని
నొంచె.

తే. ద్రోణతనయుండు శైనేయుబాణమయశ
రీరుఁ గావించెఁ [1]చేదీశ[2]పౌరవు లస

---

367. 1. నాకు హితము(వు) - కొన్ని ప్రతులు. 2. పెట్ట పైబడి పడవేయు డింక - కొన్ని ప్రతులు. 3. వేయు డింక - ఔ. వ.

368. 1. మరలం దోలించి - వీ; పెల్లు దోలించి - కొన్ని ప్రతులు.

371. 1. చేదిధాత్రీపతి యస - గ. ద(అఖండయతి) 2. కౌరవు లసమాన - ఈ. ఝ. డ.

మాన [3]విక్రములై యొప్ప మారుతాత్మ
జుండు రారాజు [4]నేనికపిండుఁ జదిపె.

372. వ. మఱియు నందు నిందును మందాకినీనందనుపయిం ద్రోవను నతనిం గావ[1]ను
గడంగినసైనికు లనేకులు నానాప్రకారంబుల వివిధాయుధంబులం బెనంగు
చుండ.

373. క. మొనసి మృగేంద్రు మృగేంద్రుఁడు
చెనయంజను పగిది నరుఁడు శీఘ్రగతిం దాం
తనవుపయిఁ గవియ దుశ్శా
సనుఁ డడ్డము సొచ్చె దేవసంఘము వొగడన్.

374. ఆ. అతని కప్పు డెదుర [1]నమ్మొన నెవ్వరుఁ
జాల రైరి సవ్యసాచి యొకఁడ
నిశితవిశిఖపంక్తి నిగిడించి నొప్పించి
యొత్తి భీష్మువెనుక కొదుఁగఁజేసె.

375. వ. తదవసరంబున సరభసంబున.

376. క. భగదత్తుని నాకవ్వడి
వెగ డొందఁగఁ జేసి యతని[1]వెల్లేనుఁగుఁ గెం
పుగఁ [2]జేసిన నాతండును
నిగిడెం బాంచాలమేదినీపతిమీఁదన్.

377. వ. ఆఖండలనందనుండును శిఖండిం దఱిమి తెఱపి సూపి దేవవ్రతు నేయు మని
పురికొల్పె నంత.

---

3. విక్రములై యొప్ప – పీ. శ. ష. స; విక్రాంతి నొప్పగ – త; ఘోర పరాక్రమం బొప్పె – వా. కొన్ని ప్రతులు. 4. నేనుఁగు పిండు – పీ. శ. ష.

372. 1. ను దలంచి కడంగిన – వా; ను గడంగిన – పెక్కు ప్రతులు.

374. 1. నని మొన – ర; నమ్మొనవెవ్వరుల్ చాల రైరి – ఏ. బ.

376. 1. వెలియేనుఁగుఁగెం – ఐ. మ. పీ. శ. శర. ష. 2. జేయ జడిసి యాతడు – న. ప. మ. ర. ల. శ. హ. కొన్ని ప్రతులు.

378\. క. మనయోధప్రకరము శాం
తనవుం దలకడచి యత్యుదగ్రత నయ్యు
ర్జునుఁ బొదివె నతం డలిగినఁ
బెనుగాలిం దూలు[1] మొగిలుపిండునుబోలెన్.

379\. వ. ([1]తూలె) నట్లు దూలిన.

380\. ఆ. అట్టియెడ శిఖండి యాపగా[1]సుతుమీఁద
[2]వాలుటమ్ము లేయ వాని నేయ
నొల్ల కతఁడు గెలని యోధవీరావళి
నేయుచుండె శౌర్య మెసక మెసఁగ.

381\. క. నరుఁడు శిఖండిం దఱిమిన
శరము లతఁడు భీష్మునురుభుజామధ్యమునం
గురియఁగ నవ్వుచు నుండెం
[1]గరి యంత్రజలంబు దొరఁగఁగా నున్నక్రియన్.

382\. వ. ఇట్లు దేవవ్రతుండు శిఖండి యేయుట సరకుసేయక యతం డగ్గ మైన నేయక సాయకంబులు సవ్యసాచిపయి నిగిడింప మగిడి దుశ్శాసనుండు [1]గడంగి కవ్వడి [2]వెగడుపడునంతకయ్యంబు సేసి [3]నొచ్చి [4]పాసినం గౌరవ పతి గనుంగొని యెలుంగు సూపి చేయి వీచి పురికొల్పినం గళింగమాళవ బాహ్లికవిదేహసూరసేనప్రముఖబలంబులు బలమర్దనుతనయు[5] దెసకుం గవిసిన.

---

378\. 1. మొగులుపిండుం బోలెన్ – కొన్ని ప్రతులు.

379\. 1. (తూలె)నట్లు దూలిన – ఓ. ఘ. బ. ర. వ.

380\. 1. సుతునిపై – వీ. శ. ష; సుతునిపై వ్రాలి యమ్ము లేయ – ఆ. న. 2. వాలు రమ్ము లేయ – ల. శ. ళ. కొన్ని ప్రతులు.

381\. 1. గరయంత్రజలంబు – ఊ. క. ఖ. జ. ట. డ. త. ద. ప. బ.

382\. 1. డగ్గరి – జ. 2. వెరగు(వెగడు)పడునట్టి – కొన్ని ప్రతులు. 3. యొాడి, నోసి – అని పాఠములు; వో నేసి – ఎ. ఝ. డ. త. హ. ల. 4. పాఱిన – వీ. శ. మ. 5. దెసం గవిసిన – కొన్ని ప్రతులు.

383. తే. అతఁడు దివ్యాస్త్ర[1]జాలంబు నతిశయంబు
సూపి చతురంగ[2]బలముల రూపు మాపి
యుఱక తఱిమి శిఖండికిఁ దెఱపి సూప
వాఁడితూపులు భీష్ముపైఁ వాఁడు నినిచె.

384. వ. ఆసమయంబునం గృపశల్యవివింశతివికర్ణులం గూర్చికొని పేర్చి దుశ్శాసనుండు
శాంతనవున కడ్డపడినం బార్థుం డయ్యేవురను విరథులం జేసిన.

385. క. కురుపతియు[1] ననుజవర్గముఁ
బరమక్రోధమునఁ దెంపుబలుపును మెఱయన్ -
సురనాథనందనునిపై
నురవడిఁ [2]ద్రోచుటయు సేన లుగ్రత నడరెన్.

386. క. పాండవబలములు దలపడి
ఖండన మొనరింప నగ్రభాగంబున ను
ద్దండతఁ బోరెడు మనుమల
తండము గని మెచ్చి యప్పితామహుఁడు వెసన్.

387. తే. అరిబలంబుపై నొక్కదివ్యాస్త్ర మేయఁ
దలఁచి యరిఁ బోసి తిగిచి యుదగ్రవృత్తిఁ
[1]గవిసి ముందట నున్నశిఖండిచూడ్కి
దొడరుటయుఁ దాల్మి[2]మైఁ దెగ [3]యుడిపె నధిప.

388. వ. అంత.

389. క. [1]సోమకమాత్స్యప్రముఖో
ద్దామబలము లేచి పెలుచఁ దఱుముటయును సం

383. 1. జాల మత్యద్భుతముగ – ఇ. ఈ. 2. వితతులు – కొన్ని ప్రతులు.

385. 1. నిజానుజన్ములు – గ. ద. 2. నడచుటయు, నడరుటయు – అని పాఠములు.

387. 1. కడగి – కొన్ని ప్రతులు. 2. మై నేయు టుడిగె – వీ. శ. ష. 3. యుడిచె – ఊ. డ. స. శ. హ.

389. 1. సోమక కరూశ మా త్స్యోద్దామ – అ. ఐ. ఔ. చ. న. వ. వీ. శ. ష.

గ్రామతలము సేనాంగ
స్తోమాంగమయంబు సేసె దుర్దాంతగతిన్.

390. క. సేనల నిమ్మొయి భీష్ముఁడు
దీనతఁ బొందింప నలిగి ధీరత్వము వీ
రానీకం బగ్గింప శ
తానీకుఁ డెదుర్చె నతని నాసురభంగిన్.

*-: విరటుతమ్ముఁ డగు శతానీకుండు భీష్మునిచేఁ జచ్చుట :-*

సం. 6_113_24

391. వ. ఇట్లు దాఁకి విరటుతమ్ముండు వాఁడిమ్ముల [1]నొప్పించినం [2]గోపించి.

392. శా. విల్లుం గేతువుఁ ద్రుంచి సూతు వెస నుర్విం గూల్చి రథ్యంబులన్
డొల్లం ద్రెవ్వఁగ జేసి యాతఁడు భుజాటోపంబు శౌర్యంబు శో
భిల్లన్ వైచిన శక్తియుం దునిమి [1]యాభీలద్యుతిప్రస్ఫుర
ద్భల్లం [2]బొక్కటి భీష్ముఁ డేసి నఱకెం దన్మస్తకం బుగ్రతన్.

393. వ. ఇవ్విధంబున శతానీకుం జంపిన.

394. క. మొన లెల్ల [1]విఱుగ మధ్యం
[2]దినమున యనుమాడ్కి [3]బయలఁ దేజోనిధి శం
తనుసూనుఁ దొప్పె నప్పుడు
గనుఁగొని యి ట్లనియె శౌరి [4]గాండివితోడన్.

395. క. మనమోహ[1]రములు సెడి కను
కనిఁ బొఱెడు నిప్పు డాపగాసుతునకు గ్ర

---

391. 1. నొంచిన - వ. 2. కనలి - ఇ. ఈ.

392. 1. యాభీలంబుగా - ఐ. మ. వ. 2. బొక్కట - కొన్ని ప్రతులు.

394. 1. విరిగె - కొన్ని ప్రతులు. 2. దినమణి యనుమాడ్కి - ర. 3. మెఱయు తేజో - అ. ఆ. వీ. శ. ష. కొన్ని ప్రతులు: వెలయు - ఇ. ఈ. వ. 4. కవ్వడ తోడన్ - ఇ. ఈ. ఝ. డ.

395. 1. రంబు చెడి - ఈ. ఊ. వ.

క్కున నీవు మార్కొనక త
క్కినఁ గార్యము దప్పు బోదివి గెలువుము కడఁకన్.

396. వ. అనిన విని యతండు రథరథ్యసారథిసహితంబుగా సురనదీ[1]నందనునమంద మార్గణ[2]పుంజంబునం బొదివె శిఖండియుం జేరి నారాచంబుల నొప్పించిన దేవవ్రతుండు వాని నేయ [3]నొల్లనిసందున సవ్యసాచి యతనివిల్లు దునిమి వెల్లెయుచున్నం జూచి సైరింపక శలశల్యకృపకృతవర్మచిత్రసేనభూరిశ్రవః ప్రభృతివీరలోకం [4]బతిలోకంబుగ దివ్యాస్త్రజాలంబులు నెఱపుచు [5]నేయుచు భీష్మున కడ్డపడుండు దలకడవుం దనునెఱుంగులు నింగి ముట్ట బల[6]సమేతంబుగా నడరినం గని సమీరనందనసాత్యకిసౌభద్రవిరాటద్రుపదఘటోత్కచ ప్రముఖయోధవర్గం బనర్గళభంగిం దఱుమం దత్సైన్యంబులు గూడుకొని కవిసిన దివిజదానవసంపాత[7]సమయసమరం బయ్యె నందుఁ బురందరనందనుండు మనసైనికుల కందఱ కన్నిరూపు లయి యైంద్రవారుణాగ్నేయాది మహాశరంబులం దెరల్పుచు [8]సు ఱితుం డైనశిఖండిం బురికొల్పికొని మీ తండి నేయించుచు నతం డెన్నివిం డ్లెత్తిన నన్నిటిం దోడ్తోన తునుమాడు చుండె నాక్రీడిపై నతం డుగ్రశక్తి ప్రయోగిం[9]ప నదియునుం ద్రుంచి [10]సూతునిం గేతనంబునుం గూల్చిన.

397. సీ. మనమున భీష్ముఁ డిట్లని వితర్కించుఁ బాండవుల నాయొక్కనింటన కడంగి
గెలువనే వీరికిఁ గృష్ణుండు ప్రాపు [1] గాకున్న నిం కది యట్టు లుండనిమ్ము
కృష్ణుఁ దోడుగఁ గొని [2]కిక్వడి వీరలు వచ్చినఁ జెప్పితి వధవిధంబు
సమర ముపేక్షించి శాంతిమై నుండెద నశచిపాశేటికి ననఁగ నెఱిఁగి

---

396. 1. సూను నమంద – పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. సందోహంబునం – కొన్ని ప్రతులు. 3. నొల్లక నిల్చె నీ సందున – ర. 4. బెల్ల దివ్యాస్త్ర(జాల)ంబులు–ఇ. ఈ; బతిలోకం బగు, బతిభీకరం బగు – అని పాఠములు. 5. నేయుడు–కొన్ని ప్రతులు. 6. సమేతు డై – ఐ. మ. వ. 7. సమయ – ఇది పెక్కు ప్రతులలో లేదు. 8. సంరఙితుం డైన – వ 9. చిన నాతం డదియును – కొన్ని ప్రతులు. 10. సూత కేతనంబులు – అ. ఈ. ద.

397. 1. గాకున్నెని నదియట్టు – ఆ. న. పీ. 2. కిద్వడి – కొన్ని ప్రతులు.

తే. చదల సుర లిట్లు మే లిది సమ్మతంబు
మాకు నని ప్రీతిమైఁ జెప్పుమాట లాతఁ
డొక్కరుండును వినియె నే నొకఁడు వింటి
మునిమహానుభావంబున మనుజనాథ.

398. వ. తదవసరంబున సూక్ష్మజల[1]శీకరశిశిరం బగుమారుతంబు మరుత్తటినీతనయు
మీఁద [2]సుడిసె సురదుందుభులు మ్రోసెఁ గుసుమవర్షంబులు గురిసె నవియు
ననన్యగోచరంబు లయ్యె నిట్లు నిశ్చయించియు నమ్మహాత్ముం డూర కున్న
గెలని కొకభంగి యై తోఁచు నని తలంచి.

399. తే. ఒక్కవి ల్లెక్కువెట్టంగ నుఱక వెస శి
ఖండి పటుమార్గణంబులఁ గడఁగి యేయ
నతఁడు మిసిమింతుఁడును గామి కల్ల నవ్వి
పఱపెఁ దనయమ్ము లతనిపై ఫల్గునుండు.

400. వ. శాంతనవుండును సముల్లాసంబున నేసిన.

401. క. నరుఁడు దనమీఁదఁ దొరఁగెడు
శరములు వారించి యతనిచాపం [1]బధిక
[2]త్వరితగతిఁ ద్రుంచి యతని
క్షురనారాచంబు దనువు సొర నేయుటయున్.

402. వ. తమకుం దమయోధవరులకును వారింపం జేరం జెనయం గొలఁది గాక
వెల్లివిరిసినశరనిధిభంగిం [1]బొంగినవివ్వచ్చు వెఱఁగుపడి చూచుచుం దన్ను
విడువక కెలంకుల నున్ననీకొడుకులం గలయం గనుంగొని మీతండ్రి
రారాజుతో ని ట్లనియె.

403. మ. అని దేవాసురకోటి కైనను నశక్యం బిమ్మహావీరు మా
ర్కొన వీఁ డల్గిన మర్త్యులే యొదు రుదారుం డైన యాక్రీడి ద

---

398. 1. సిక్త శిశిరంబు – వ. 2. వీచె – అ. ఏ.

401. 1. బతిసత్వరవృత్తి – ల. వీ. పెక్కు ప్రతులు; బధికోద్ధురవృత్తి – ఇ. క. శ. ప.
2. స్ఫురణమెయి – ఐ. మ. వ.

402. 1. బొదివిన – వ.

క్కిన నిప్పాండవసైన్య మింతయును గ్రమ్మగింపంగ నేఁ జాలుదుఁ
విను సత్యం బిది వీనివింటి కెదురః వి ల్లెత్తలేఁ డెవ్వఁడున్.

404\. క. అనునెడ శిఖండిచాపము
వెనుకం దనవిల్లు నిల్పి వెస నాతం డే
సినభంగిగ నరుఁ డేసెను
జననాయక దొడ్డనారసంబులు భీష్మున్.

405\. వ. అప్పుడు దేవవ్రతుండు దుశ్శాసను నాలోకించి.

406\. సీ. అశనికల్పము లివి యర్జునుబాణముల్ గాని శిఖండివి గావు [1]సుమ్ము
కర్కటిగర్భంబు కరణి గాత్రము వ్రచ్చె నిట్టివి వీనికి నెందుఁ గలవు
బ్రహ్మదండంబులపాటి నై మర్మంబు లిట్టు[2]నోనాఁటునే యితని చేత
జముదూత లట్లు ప్రాణము[3]ల వెలార్పంగ నీద్రుపదాత్మజుఁ డెన్నఁ డేసె

ఆ. దృఢ[4]విముక్తములును దీప్తాకృతులు లత్య
శుద్ధ[5]మంతములును సునిశితములు
నైననారసంబు లతనివి గాక యీ
తనివి యగునె యెవ్విధమునఁ జూడ.

407\. క. అనుచుఁ బటుశక్తి నపా
ర్థుని వైచిన నది యతండు దునుమాడుడు శాం
తనవుఁడు వాలుం బలుకయుఁ
గొని యరదము డిగ్గఁ జూచుకొలఁదిం బెలుచన్.

408\. తే. పసి యారెంటిఁ దునియలు సేసి యెలుఁగు
సూపి యే నుండ వెలి పేల నాపగాత
నూజుఁ బొదువుఁడు మీ రని యోజఁ జెప్పె
శక్రతనయుండు దనయోధజనుల కెల్ల.

406\. 1. వినుము – అ. ఏ. 2. నోదాకునే – ల. కొన్ని ప్రతులు; 3. లు వెల్లార్వ – బ. 4. సుముక్త – కొన్ని ప్రతులు; సముక్త – స. శ. కొన్ని ప్రతులు. 5. వంత – అ. ఈ. ఉ. ఓ. ఔ. ఘ. న. ప. బ. వ. శ; మంత్ర – ఇ. ఝ. మ. ల.

409. వ. అప్పలుకు లాకర్ణించి.

410. క. [1]పయ్యుఁడు పొడువుం డడువుఁడు
వ్రేయుఁ డనుచు వారు జాహ్నవీతనయుఁ గడుఁ
డాయుఁడు మనసైనికులుం
గో యని తలపడ్డఁ బోరు ఘోరం బయ్యెన్.

411. వ. అప్పుడు.

412. తే. [1]ఏసి గాండీవి కురుసేన నెగువ నతని
వారు వెలువక భీష్మునిఁ జేరి యొడల
వ్రేతఁ జెడ లేనియట్లుగ వివిధ[2]భంగి
నిష్ఠురాస్త్రశస్త్రంబుల నినిచి రధిప.

*-: భీష్ముఁడు శరతల్పగతుఁ డగుట :-*

సం. 6_114_80

413. వ. అంత నంశుమం[1]తుఁడు శాంతుం డగుచు వచ్చె నట్టియెడం గదిసి కవ్వడి
గాంగేయుపైఁ గ్రూరనారాచనికరంబులు నిగిడించి పడం ద్రోచిన.

414. క. తూర్పు తల గాఁగ నీసుతు
[1]లేర్పడఁ గనుఁగొనుచు నుండ నిల గంపింపన్
దర్పోజ్జ్వలుఁ డాభీష్ముఁ డ
హార్పతి యస్తాద్రి సేరునట్లుగఁ బడియెన్.

415. తే. తనువు ధరఁ బొందకుండగఁ దల్పభంగి
శరము లూఁత యై పొలుపారె నరవరేణ్య

---

410. 1. పయ్యుం డడువుడు పొడువుడు – ర. వ. వీ. శ. ష.

412. 1. ఏచి – పెక్కు ప్రతులు. 2. గతుల – ఓ. ర. వ.

413. 1. తుం డస్తగతుం డగుచు – వ.

414. 1. డేర్పడ – ట.

యట్లు శరతల్పగతుఁ డగునమ్మహాను
భావు దేవవ్రతుని దేవభావ[1] మొందె.

416. చ. అనిమిషు లప్డు సూచి మృతుఁ డయ్యెడు నక్కట దక్షిణాయనం
బునఁ గృతపుణ్యుఁ డంచు వగఁ బొందినభీష్ముఁ డెఱింగి వారికి
ట్లను [1]సురలార కాలగతి నాత్మ [2]దలంచియ కాదె [3]మేనిలో
నునిచినవాఁడఁ బ్రాణముల నమ్మలికింపకుఁ డించు కేనియున్.

417. వ. సత్యవతీవివాహం బొనర్చుటకు మాతండ్రి మెచ్చి నా కవధ్యత్వంబును [1]స్వచ్ఛందమరణంబును నిచ్చినవాఁడు గావునఁ దద్వరప్రభావంబున నావ ధంబున కే నొడంబడక [2]కానేర దయ్యెఁ బ్రాణంబులు నావశంబ యనిన విని వారలు సంతోషించి రాసమయంబున భాగీరథిపనుపునం గొందఱు మునివరులు హంసరూపంబుల నమ్మహాత్మునకు దక్షిణాయనం బెఱింగింపం జనుదెంచి యతండు దెలిసియునికి నతనిచేత నెఱింగి ప్రియం బంది [3]యేఁగి రట్టియెడ దుర్యోధనుండు [4]వుచ్చిన దుశ్శాసనుండు గుంభసంభవుపాలికిం బోయి భీష్ముపాటు సెప్పిన నతండు మూర్ఛిల్లి [5]యొక్కింత దేఱి దీనాననుం డగుచు నమ్మహీనాథుకడకుం జనియె నయ్యవసరంబున.

418. సీ. పాండవేయులు మాత్స్యపాంచాల[1]యాదవసహితంబుగా
సంతసమునఁ బొదలి
రాదెస బొబ్బలు నార్పులు బహుతూర్య[2]కోటియుఁ జెలఁగె
నీకొడుకుగమియు
నీదిక్కు[3]దొరలును నెలుఁగెత్తి [4]యేడ్వంగ నంబరచరులహాహారవంబు
లులియంగ రోదసి గలయంతవట్టును ఘనశబ్దమయ మయ్యె మనుజనాథ

---

415. 1. మొక్క(ప్ప) – ఉ. ఋ. వ.

416. 1. విను డేను – ఐ. వ. 2. నెరింగియ కాదె – ఈ. ఐ. మ. వ. 3. మేనితో – త. న. వ.

417. 1. స్వేచ్ఛా – అ. త. 2 కానేరదు ప్రాణం – గ. త. శ. ష. 3. యరిగిరి – కొన్ని ప్రతులు. 4. వంచిన – కొన్ని ప్రతులు. 5. యొక్కింత వడికిం దెలిసి (దేఱి) – కొన్ని ప్రతులు.

418. 1. కేకయ – ఝ. డ. బ. 2. ఘోషంబు – ఐ. మ. 3. వారును(లు) – కొన్ని ప్రతులు. 4. యేడువ – కొన్ని ప్రతులు.

తే. కాలుసేయార్పు[5]టలు లేక కన్నుఁగవల
నశ్రు లొలుకంగఁ జిత్తంబు [6]లడలఁ బాండు
సూనుతతిఁ జూచుచుండిరి గాని యించు
కయును గడఁగరు మనవారు గయ్యమునకు.

419. వ. [1]తదవసరంబున నంబరమణి యపరరత్నాకరంబు [3]సొచ్చె ననిన విని ధృత
రాష్ట్రుండు సంజయున కిట్లనియె.

420. క. నాయుల్ల మరయ నినుమో
జాయో కా కిట్లు రూపఱక [1]విన నోర్చెఁ
సాయకసముదయఖరభవ
దీయవచనచయము గవియ [2]దేరం దిర మై.

421. వ. ఇంక నేమేనియుం జెప్పఁ గొఱంతగలదే యనుటయు నాసూతనందనుం
డిట్లను నప్పుడు కౌరవులుం దారును దమవారును మైమఱువు లూడ్చి
యాయుధంబులు వెట్టి గాంగేయుకడకుం బోయిరి కౌంతేయులు నట్ల
బంధుమిత్రసహితు లయి యచటికిం జనిరి ధనంజయుం డొక్కరుండును
ధనుష్పాణి యై యరిగె నిట్లయ్యిరుదెఱంగుల వారలుం దత్కాలప్రశాంత
[1]స్వాంతు లై యన్యోన్యవిషయరోషంబులు దక్కి తన్నుం బరివేష్టించినం
గులగురుం డగునమ్మందాకినీనందనుండు వారి నభినందించి కొలిపించికొని
యుండె.

422. తే. తనకుఁ [1]గ్రిందల యని భవత్తనయులకు నె
ఱుంగఁ జెప్పిన వారు గడంగి మెత్తఁ
దనముగలతలగడలు దేఁ బనుచుటయును
జూచి చిఱునవ్వుతో సవ్యసాచిఁ బిలిచె.

---

5. టకు లేక - పెక్కు ప్రతులు. 6. లవియ, లగల - కొన్ని ప్రతులు.

419. 1. తదనంతరంబున - కొన్ని ప్రతులు. 2. చేరె నని - ర.

420. 1. విన నోర్చెన్ - పెక్కు ప్రతులు; విన నేర్చెన్ - వా. 2. తెరలి తిరం బై - గ. ద.

421. 1. చిత్తు లై - ఆ.

422. 1. గ్రిందల యని - వ. ష. పెక్కు ప్రతులు; కుం గ్రేవల నున్న నీ తనయు-శ; కుదల గడ - మ.

423. క. పిలుచుటయు నతఁడు బాష్పము
లొలుకఁగ గాండివము వెట్టి యొయ్యన[1] చనినం
దలగడ[2]తూపులు సెజ్జకు
నలవడఁ బెట్టు మని భీష్ముఁ [3]డాతనిఁ బనిచెన్.

424. వ. ఇట్లు పనిచినం బార్థుం డట్ల చేయుదు నని గాండివంబు పుచ్చికొని మఱియు నను జ్ఞ గొని మూఁడువాలమ్ము లభిమంత్రించి వెడతలఁ [1]దాఁకి యెత్తి పట్టుకొని పుంఖంబులు భూమి [2]మోచి నిలుచునట్లుగా [3]నేసినం దాత ప్రీతుం డై తల్పంబునకుం దగినయుపధానంబు వెట్టి తని యతనిం గొని యాడి సకలపౌత్రులను ధాత్రీపతులను [4]నవలోకించి.

425. క. రవిఁ [1]గొల్పి యుత్తరాయణ
మవునంతకు నంపపాన్పునం దిట్లు మహో
త్సవలీల నిలుతు నా కీ
దివసంబులఁ జేయవలయుఁ దృఢ[2]తరరక్షన్.

426. క. అలయ క[1]రయ నోపినవా
రలు గ్రక్కునఁ బరిఖతోడి ప్రాకారం బి
ట్టలముగఁ గావింపుఁ డనుడుఁ
దలకొని నీసుతులుఁ బాండుతనయులు భక్తిన్.

427. వ. అత్తెఱం గాచరింపనుం దాత్పర్యంబున రక్షింపనుం దమతమయందుఁ దగిన వారల నియోగించి రంతఁ జికిత్సకులు [1]వచ్చి శల్యచికిత్స సేసెద మని

---

423. 1. నఁజని – శ. ప. 2. యలుగుల – శ. ప. 3. డానతి యిచ్చెన్ – అ. ఇ. ఓ. ఘ. ద. ర. వ.

424. 1. గాడి – ఉ. ఐ. త. మ. వ. 2. మోపి – కొన్ని ప్రతులు. 3. నిలిపి – ఝ. ట. 4. నాలోకించి – కొన్ని ప్రతులు.

425. 1. తిరిగి – అ. 2. రక్ష దగన్ – వా. పెక్కు ప్రతులు; తరరక్షన్ – శ. ప.

426. 1. యిరుదెరగుల వారలు – ఇ.

427. 1. వచ్చి యతని తనువున గొమరారు క్రొత్తగంట్ల రక్తంబు లొత్తిశల్యచికిత్స – ఐ. మ. వ.

తొడంగిన గాంగేయుండు వారించి వారి కభిమతార్థంబు లొసంగి వీడు కొల్పె గీతవాద్యనృత్తప్రవీణంబు లగుపాత్రంబు లమ్మహాత్మునకు వినోదంబు సలుపు[2]చుండె నట్టియెడ నాదేవవ్రతుండు నీళ్లు ద్రావ నడిగి[3]నం దనుపారుసీ రనేకులు గొనివచ్చిన నతండు.

428. తే. వినుఁడు శరతల్పగతుఁడ నై యునికిఁ జేసి
యన్యసలిలంబు సేవించు టనుచితంబు
నాకుఁ దేజోమయాస్త్రవిన్యాసవిధిస
ముత్థితం బైన భూజల [1]మొకఁడు దక్క.

429. వ. [1]అనుటయుఁ గౌరవులును దక్కటిరాజులును [2]వెఱఁగుపడి యున్నం గవ్వడిం గనుంగొని గాంగేయుండు.

430. క. శరవేదన సర్వాంగము
లెరియఁగ నా కిపుడు పెదవు [1]లెండెడుఁ ద్రుష్ణా
భర [2]ముడుపఁ దగిన[3]నీళులు
వెరవునఁ దే నేర్తు వీవ వే తెమ్మనఘా.

431. వ. అనిన నట్లకాక యని యతం డతనికిం బ్రదక్షిణంబు సేసి తేజోమయంబయిన మార్గణంబు పర్జన్యమంత్రాభిమంత్రితంబుఁ గావించి మహీతలంబు గాఁడ నేసిన భాసురచ్ఛాయం బగుతోయంబు ధారారూపంబున దివ్య[1]గంధరసోపేతం బయి [2]యెగసిన.

---

2. చుండిరి – కొన్ని ప్రతులు. 3. న మనవారు, న దగువారు, న తమవారు, నీ నందను దెసవారు – అని పాఠములు.

428. 1. మొకటి దక్క – కొన్ని ప్రతులు.

429. 1. ఈ వచనము నకు మారుగా. 'ఒ. ర' ప్రతులలో నీ క్రింది కందపద్యము కలదు.
క. అనుటయు గౌరవులును ద, క్కిన రాజులు వెరగు పడగ గ్రీడిదెస గనుం
గొని ప్రీతి తోడ శంతను, తనయుం డిట్లనియె గాఢతాత్పర్యమునన్.
2. మిన్న కున్న గాంగేయుడు – ఇః విచారంబు గదుర నూరక యున్నం–ఐ. మ. వ.

430. 1. లెండెడి – కొన్ని ప్రతులు. 2. ముడుగ దగిన – కొన్ని ప్రతులు. 3. జలములు – వీ. శ. ష. స. కొన్ని ప్రతులు.

431. 1. రసగంధోపేతం బై – వీ. శ. ష. 2. యుద్భవించిన – ఐ. మ.

432. ఆ. కౌరవులు ప్రకంపగాఢ[1]విస్మయు లై రి
పాండుసుతులు వారిబలము నుబ్బి
యార్చి నంకు లొత్తి రాజలంబుల నమ్మ
హాత్ముఁ దృప్తుఁ జేసె నర్జునుండు.

433. వ. ఇట్లు తృప్తిఁ బొంది మందాకినీనందనుండు పురందరనందనున కిట్లనియె.

434. ఉ. నారదుచేత నిన్ను ముని[1]నాథునిఁ గాఁగ నెఱింగి యుండుదుః
శౌరియు నీవుఁ గూడిన నసాధ్యము లెవ్వియు లేవు [2]దర్పదు
ర్వారుఁడ వై ననీవలనివై రము గీ డని చెప్పఁ జెప్ప నీ
కౌరవరాజు మానఁడు [3]దెగం జెడుఁ గా కిటమీఁద భీముచేన్.

435. వ. అని పలికి దీనమానసుం డగు చున్న[1]భవత్సూనుతో ని ట్లనియె.

436. మ. నరుఁ డ[1]త్యద్భుతవిక్రముం డతని కానారాయణుం డాప్తుఁ డె
వ్వరికిన్ వీరి జయింపరాదు సమరావష్టంభ[2]ముం దక్కి ధ
ర్మరతుం డై నయజాతశత్రునకు నింద్రప్రస్థ మి మ్మర్ధరా
జ్యరమం బొందుము మీరు గొందఱయినం జాకున్న [3]నీ కొప్పదే.

437. వ. అని పలికి యూరకుండెం గౌరవపాండవులును మాఱుపలకక యతనికి నమస్కరించి నిజనివాసంబులకుం జని రట్లు సనునెడ [1]గోవిందుండు గొంతే యాగ్రజుం గనుంగొని.

---

432. 1. విస్మయ, చిత్తులై రి పాండు సుతుల వారలుబ్బి – బ. ర.

434. 1. నాథుడు గాగ – కొన్ని ప్రతులు. 2 మీకు – కొన్ని ప్రతులు. 3. దెగంగల వా డిట బంధుయుక్త మై – వ.

435. 1. భవదగ్రనందనున కి ట్లనియె – ప.

436. 1. త్యుద్భట – వ. కొన్ని ప్రతులు. 2 ము ల్మాని – ద. 3. యి ట్లొప్పదే – ల.

437. 1. ఈ సందర్భమున శ్రీకృష్ణయుధిష్ఠిరుల నడుమ జరిగిన సంభాషణ ములకు భండార్కరు, చిత్రశాలాప్రతులం దాకరము కన్పించలేదు.

438\. క. సురలకు [1]నజయ్యుఁ డగునీ
సురసరిదాత్మజుని గెలువఁ జొప్పడునే యె
వ్వరి కైన నద్భు[2]తావహ
పరికరు [3]లగు మీకుఁ దక్కఁ బౌరవముఖ్యా.

439\. క. [1]అనుటయు నతఁ డిట్లను నే
మనఁగా నొక[2]మానిసులమె యప్రతిహత[3]వీ
రుని నిన్నుఁ బడసి యింతటి
పనులకుఁ జాలితిమి గాక భక్తాధీనా.

-: కర్ణుఁడు భీష్మునియొద్దకుఁ బోయి వినతుం డగుట :-
సం. 6_117_1

440\. వ. అని యిట్లియ్యిరువురు నొండొరులం బ్రశంసించుచు నఖిలజనపరివృతు లై శిబిరంబుల కరిగిరి తదనంతరంబ కర్ణుండు గాంగేయుకడకుం బోయి భక్తి వినయంబులు దోఁపం బాదప్రణామం [1]బాచరించి.

---

438\. 1. నజేయు – పెక్కు ప్రతులు. తాహవపరికరు లగు – ఆ. ఇ. ఈ. ఎ. ఐ. ఓ. గ. ఝ. డ. వ. 3. లకు మీకు – ప. వ.

439\. 1. ఈ పద్యమునకు మాఱుగా 'ఊ, ఖ, ఝ. డ' ప్రతులలో నీ క్రింది వచనము కలదు.

వ. "అనిన విని(అని మరియు)యిది యంతయు నీకృపాతిశయంబున గదా సమకూరె నిందులకు నీవు గలిగియుండ మాకేమి విచార మనియె" ధర్మ రాజి ట్లనుటయే ఔచిత్యముగా నున్నది.

2. మానుసుల – ఆ. ఇ. ఉ. ఓ. ఔ. ల. ష. కొన్ని ప్రతులు.. 3. వీర్యుని పెక్కు ప్రతులు.

440\. 1. బు లాచరించి – ఈ. ఏ. గ. చ. జ. త. ద.

441\. ఆ. [1]అలుక దక్కి నన్ను నధికవాత్సల్యశీ
తలము గాఁగఁ జూచి [2]తగినమాట
లాడవే మహాత్మ యనుటయు నాతండు
గారవమున నతనిఁ జేరఁ బిలిచి.

442\. వ. ఒక్కకరం[1]బు మలంచి కౌఁగిలించుకొని యచ్చట నున్నరక్షకాదిజనంబుల నవులం బోవం బనిచి యతనితో ని ట్లనియె.

443\. క. నీదెసఁ గోపింతునె కుల
భేదముగాఁ బలుకుటయును బిడ్డలఁ జెఱుపం
గా దని కినియుదు లే దన
[1]రా దదలుతు నిన్ను నిష్ఠురంపుఁ బలుకులన్.

444\. వ. అది శిక్ష గాని రోషంబు గా దట్లుంగాక.

445\. క. నీయుదయము దైవికగ
ర్వాయత్తము నీకు మర్త్యు ల[1]సదృక్షులు గాం
తేయుఁడవు గాని విను రా
ధేయుఁడవు గావు నీవు ధీరవిచారా.

446\. వ. ఇది కృష్ణద్వైపాయనుండు నాకు నేకాంతంబున నెఱింగించె నేనును భవదీయతేజోవిశేషంబువలననుం గనుంగొనియుండుదుఁ బాండుతనయుండ

---

441\. 1. ఈ పద్యమునకు ముందు. ఇ. ఈ. ఔ. ఘ. చ. ఝ. డ. ప. వీ. (పాద సూచిక) శ. ష. ప్రతులలో నీ క్రింది పద్యమధికముగా కలదు. ఈ పద్యమే ద్రోణపర్వమున 1 - 40 వ పద్యముగా గాన్పించు చున్నది.
క. వచ్చితి రాధేయుఁడఁ గను, విచ్చి ననుం జూడు భరతవీరాగ్రణి నీ
సచ్చరితకు(ము) ఫల మేయి, ట్లిచ్చిట నీ పడుట ధాత నేమన నేర్తున్.
2. లలితభాష - త.

442\. 1. బక్కిలి మలంచి - ఓ. ఘ. ఝ. బ. ర. స. శ. హ; బంకిలి మలంచి - కొన్ని ప్రతులు; బక్కున నమరించి - ఈ. శ.

443\. 1. రా ద, దలుతు నిన్ను - వీ. ష. శ. హ. కొన్ని ప్రతులు; రా దలుతును - వా.

445\. 1. సదృశులు - ఊ. గ. ఘ. ఝ. డ. ప.

వగుటం జేసి నీయెడవాత్సల్యంబు కాని మాత్సర్యంబు లే దింకనొక్కటి సెప్పెద విను మేను గురుపాండవులవైరం [1]బుడిపి పుచ్చితి నప్పాండవేయు [2]లజయ్యు లప్రమేయుం డగు కృష్ణుండు వారికి విధేయుండు గావున వారల తోడివిరోధం బొప్పదు నీవును నొండుదలంపు దక్కి యక్కౌంతేయులం గలిసి యుండు మనినఁ గర్ణుం డతని కి ట్లనియె.

447. క. [1]కౌంతేయుండ నగుదు నిది
యంతయుఁ దొల్లియును వింటి నార్యులచే ని
[2]ట్లింతయు నెఱిఁగినఁ గుంతీ
సంతానముతోడి[3]పొత్తు సనునే నాకున్.

448. ఉ. వారు మహాబలుల్ హరియు వారికిఁ బ్రాపు గలండు వారలం
బోర జయింప[1]రామియును బుద్ధి నెఱుంగుదు నైనఁ గౌరవ
ప్రారమణుండు సేయుతగుమన్నన లెల్లఁ దలంచి[2] చూచినం
భూరివివేక యే విడిచిపోవుట ధర్మమె వీరకర్మమే.

449. వ. అదియునుం గాక.

450. ఉ. మాటలు పెక్కు లాడి యనుమానము లేక సభం గడంగి ప
ల్మాటుఁ బరాభవించితిఁ జలంబునఁ బాండవకోటి నెప్పుడుం
జేటు దలంచి [1]యే బలువు సేసితి వైరము నాకు నింక నీ
వీటికి వారివీటికిని వెక్కస మయ్యెడు కయ్య మొప్పగున్.

451. శా. దైవాధీనము సర్వముం మన[1]మతిం దప్పింపఁగా వచ్చునే
నీ వింకన్ నను నొండు వల్కకక పరానీకంబుపైఁ బంపు మ

---

446. 1. బుడిపింపం జూచితి – కొన్ని ప్రతులు. 2. లజేయులు శ. ష. పెక్కు ప్రతులు.

447. 1. కౌంతేయుడ నగుదున – ఊ. జ. ఖ. మ. ర. శ; కౌంతేయుడ నగుదును నది యంతయు – కొన్ని ప్రతులు; కౌంతేయుడ నగుదు నదియంతయు – వీ. ష. 2. ట్లెంత యెరింగిన – కొన్ని ప్రతులు. 3. పొందు – కొన్ని ప్రతులు.

448. 1. రా దనియు, బోలమియు, రాకునికియు, బోల దనియు – అని పాఠములు 2. పవచ్చినన్ – కొన్ని ప్రతులు; పువచ్చినన్ – ఏ. గ. ట. ద. ప.

450. 1. యేవములు – డ.

451. 1. మదిన్ – కొన్ని ప్రతులు.

త్సేవాధర్మము నిర్వహించెద బలోత్సేకంబు లోకంబు సం
భావింపఁ విహరించెదఁ మురరిపుం బార్థుం దలంకించెదన్.

452. చ. [1]అన విని భీష్ముఁ డిట్టు లను నంతకుఁ జాలు వెఱుంగనే[2] సుయో
ధనునకు నెప్డు నీదుభుజదర్పమ[3] కాదె సహాయ మెద్ది యా
తనికిఁ[4] బ్రియంబు దానిన యుదాత్తమతిం దగ నాచరింపు నీ
మనమున [5]సంతసిల్లు మనుమానము దక్కు మనుజ్ఞ యిచ్చితిన్.

453. వ. అని తెలి వొంది పలికిన దేవవ్రతుబంధుభావంబునకుం బరమానందంబు నొంది రాధేయుండును నిజనివాసంబునకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.

454. ఉ. మర్దిత[1]తాపసంకలన[2]మంజులనామ దురంతదుర్దశా
కర్దమ[3]లేపనిర్హరణకారికృపామృత[4]పూరకర్మసం
మర్దనిరాసకర్మఠసమత్వపరిస్ఫుటరూపభావనా
నిర్దళితారివర్గమహనీయ మనోరమణీయవైభవా.

455. క. ఖసిత[1]పరభాగ[2]హేలా
లసితశ్రీవత్సలలితలాంఛనపించ
ప్రసృమరరుచిశబలోరగ
విసృమరదీధితికలాపవేష్టిత[3]మాళీ.

---

452. 1. అనుటయు – పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. మే – కొన్ని ప్రతులు. 3. మెలర్పగ జేయు మాపృథాజనితులకున్ హితంబగుట సన్మతి గోరుము పొమ్ము నీవునీ – బ. 4. కిహితంబు – పీ. శ. ష. 5. సంతసింపు – పీ. శ. ష. కొన్ని ప్రతులు.

454. 1. తామసాకుల సమంజుల – న. శ; తామ సాదిగుణ – బ. 2. మానితనామ – ర. 3. లేపనా హరణకారి – న. శ. 4. పూర్వకర్మ . ఇ. ట. త. పీ. స. శ; పూర్ణ – ప.

455. 1. పరిభాగ – పీ. ష. స. శ. కొన్ని ప్రతులు; పరాగవి భాసి తలసిత – అ. ఆ. ప. 2. లీలా – పీ. ష. స. శ. 3. మూర్తి – ఏ. ఝ. ట. డ. హ.

456. మాలిని. [1]శరణరహితవృత్తి గ్రాహ్యా[2]భక్త[3]ప్రవృత్తీ
[4]కరణగమనలీలా గాఢకారుణ్యశీలా
స్మరణ[5]శుభదమూర్తీ [6]మధ్యరశ్మి[7]ప్రవర్తీ
చరణవినమదింద్రా సంతతానందసాంద్రా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన
శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు
సర్వంబును తృతీయాశ్వాసము.

## శ్రీమదాంధ్రమహాభారతమునందలి భీష్మపర్వము సమాప్తము

---

456. 1. కరుణ విహిత – చ. 2. భక్తి – కొన్ని ప్రతులు; నిత్య – ట. ప. 3. ప్రవర్తీ – పెక్కు ప్రతులు. 4. గరుడగమన – క. శ. స. శ; కరుణ – ఏ. ఘ. జ. న. మ. ష. 5. శుభద – ర. శ. ష. పెక్కు ప్రతులు; సుభగ – ఇ. ఈ. ఊ. క. డ. త. బ. వీ; భయద – వా. 6. చండరశ్మి – పీ. ష; సర్వలోక – ఆ. ఓ. ర; మధ్యలోక – ఆ. శ. 7. ప్రవృత్తీ – జ. ఝ. ర. హ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - ప్రథమాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీ[1]సంశ్రయమంగళగౌ
రీసంగమవిభవపుణ్యరేఖాసంప
ద్భాసితవక్షోవామాం
గాసూత్రితచిత్రమహిమ హరిహరనాథా.

*-: సంజయుఁడు యుద్ధభూమికిఁ బోయి మరలివచ్చి యందలి వృత్తాంతంబు ధృతరాష్ట్రునితోఁ జెప్పుట :-*

సం. 7_1_5

2. వ. దేవా వైశంపాయనునకు జనమేజయుం డిట్లనియె.

3. క. మునిజనవల్లభ యివ్విధ
మున దేవవ్రతుఁడు శాంతిఁ బొందినక్రమ మె
ల్లను ధృతరాష్ట్రనృపాలుఁడు
విని యెయ్యది యాచరించె [1]వినిపింపు తగన్.

4. వ. అని యడిగిన జనమేజయునకు వైశంపాయనుం డిట్లనియె

---

1. 1. సంశ్రిత - జ. ట.

3. 1. వివరింపు - ల.

5. క. అనిమిషనదీతనూజుఁడు
[1]సనుటయు విని యవ్విభుండు సంజయుఁ బోవం
బనిచెను దనయునికడ[2]కు న
తని[3]విజయము కాంక్ష దనహృదయమున మొలవన్.

6. క. పనిచి కృతపడినగాంగే
యుని[1]దెస యుమ్మలిక నాతఁ [2]డుల్లము నానా
ఘనతరచింతాభర మొం
దినఁ గుందుచు నుండఁ గొన్నిదివసంబులకున్.

7. క. వ్యాసప్రసాదమహిమం
జేసి యుభయసైన్య[1]గతవిశేషజ్ఞుం డై
యాసంజయుఁ డొకనాఁటిని
శాసమ[2]యమునందుఁ గడువేసం జనుదెంచెన్.

8. వ. ఇట్లు శిబిరంబుననుండి సూతనందనుండు గరినగరంబునకు వచ్చి యంతఃపురంబున నున్న [1]ధృతరాష్ట్రు నుచితప్రకారంబునం గనిన నమ్మనుజవల్లభుం డతనిం దనచేరువ నునిచికొని యాదరించి.

9. చ. అమరనదీతనూజు సమరావనిఁ గోల్పడి నాదు యోధవ
ర్గము మఱి యెవ్వరిం గొని పరాక్రమదుర్దమపాండుపుత్రసై
న్యమునకు మార్కొనం [1]దలఁచె [2]నక్కట కౌరవు లేమి సేసి రా
సమయమునన్ బలప్రచయ[4]సంఘటనం బెటు లయ్యె సంజయా.

---

5. 1. సనుట వినిన యవ్విభుండు – క, గ. వీ; చనిన పిదప నవ్విభుండు – ఊ. ఎ. 2. కాతనిరణజయకాంక్ష – ఎ. 3. విజయపుకాంక్ష – ఖ. ట. న. బ. వ.

6. 1. దెస నుమ్మలికము – వీ. ష. కొన్ని ప్రతులు. 2. డుల్లంబున దా – ఉ. ఊ. ఎ. ఏ. ఒ. గ. చ. ఠ. త. వ.

7. 1. గతి – వ. వీ; రణ – ఊ. ఎ. 2. యంబున గడున్ వేసం – కొన్ని ప్రతులు.

8. 1. ధృతరాష్ట్రుని సముచితప్రకారంబున – వీ; యాంబికేయు నుచిత – చ. వ. శ. ష.

9. 1. గడఁగె – ఆనం. ఔ. క. గ. ణ. న. ర. 2. నంతట – అ. 3. సంచరణం బెటు– ఝ. శ.

10. క. అనిన విని సూతసుతుఁ డి
ట్లను నక్కురునాథుతోడ నవహితమతి వై
విను మంతయుఁ జెప్పెదఁ గ్రమ
మున [1]నీయడిగినతెఱంగు భూవర తెలియన్.

11. వ. దేవవ్రతుండు దేవభావంబునం బొందినయప్పుడు కురుపాండవు లతని[1]కడకు వచ్చుటయు నాసమయంబునఁ బుట్టినవిశేషంబులు నాఁడు నీ కెఱింగించితి శరతల్పగతుం డై నశాంతనవుండు [2]సెప్పినహితవచనంబు లాద[3]రింపక రోష సంరక్తనయను లగుచు నతని వీడ్కొని యట్లు సనినకౌరవులు నాఁటివేకువ నీకడనుండి యేను బోయి శిబిరంబు సొచ్చునవసరంబున.

12. మ. సమ[1]రోద్యోగము వీటికిం దెలుపునిస్సాణాదితూర్యంబు లొ
క్కమొగిన్ మ్రోయఁగ వారణాదిచతురంగస్ఫారసన్నాహసం
గమనాటోపము మిక్కుటంబుగఁ గడంకన్ వీరనై పథ్యవి
భ్రమలోలాకృతు లై రి మోముల వివర్ణత్వంబు సంధిల్లఁగన్.

13. వ. [1]ఇట్లు సన్నద్ధు లై వెడలి [2]యస మెడలినబలంబులం గూర్చుకొనుచుండి.

14. ఉ. అప్పుడు భీష్ములేమి హృదయంబుల నుమ్మలికంబు [1]గూరఁగా
నెప్పటిచందముల్ విడిచి యే త్తెఱఁ దక్కినచూడ్కు లొండొరు
న్నెప్పలమాటునం [2]బొలయ నీసుతు[3]పాలికి వచ్చురాజులం
దిప్పు డతండు రా వలవదే యని కర్ణుఁ దలంచి [4]రందఱున్.

15. వ. అట్టియెడ.

---

10. 1. నాయెఱిగిన తెరంగు - అ. వ. శ. ష.

11. 1. పాలికి - ఇ. ఖ ఠ. వ. 2. చేసిన - వ. 3. రింపక నీ కొడుకులు రోష - డ.

12. 1. రోత్సాహము - ద. ప.

13. 1. ఇట్లు యుద్ధసన్నద్ధు లై - ప. వీ. 2. నయ మెడలిన - శ.

14. 1. దూరగా - జ. ట. బ. 2. బొరయ, బెరయ - అని పాఠములు. 3. వెంటను - హ. 4. రయ్యెడన్ - గ.

16\. చ. పతిరహితాత్మ యైనసతి[1]భంగియు గోపకహీన [2]మైనగో
ప్రతతివిధంబు సస్యవిధురస్థితి యైనధరిత్రిచాడ్పు ను
ద్ధతహరిశూన్య మైనవసుధాధరకందర[3]భూమి [4]చందముః
మతి మనసేనఁ దోఁచె బుధమాన్యుఁడు భీష్ముఁడు [5]లేకయుండుటన్.

17\. ఉ. అంగద నాథు మ్రింగినవృకావలి దః వెస [1]ముట్టికొన్న స
ర్వాంగములుం జలింప [2]వెగ డందుచు దిక్కులు సూచు చున్న సా
రంగియపోలె నుండెఁ గురురాజ భవత్సుతుసేన భీష్మునా
జిం గబళించి పాండవులు జృంభితవిక్రమ[3]లీలఁ [4]బొల్చుటన్.

18\. ఆ. కర్ణ కర్ణ [1]వచ్చి కావు మనాథుల
మైతి మనునెలుంగు [2]లగ్గలముగ
బలములోన నెల్లఁ గలయంగ వీతెంచె
నార్తి దెల్లముగ జనాధినాథ.

19\. వ. [1]తదవసరంబున.

20\. క. పిలువుఁడు దడయక కర్ణుని
బలవిక్రమశాలి యతఁడు పది[1]దివసములుం
గలనికి రాఁడు నదీసుతు
పలుకులకుం గనలి [2]సచివబంధుయుతముగన్.

---

16\. 1. భావము–ఊ. ఎ. ప. ఓ. చ. జ. ట. బ. వ. 2. యైన–ల. శ. కొన్ని ప్రతులు. 3. కాననంబు నై – డ. 4. బోలుచున్ – వ. 5. లేని పిమ్మటన్ – ఓ. స; లేక యుండినన్ – ఐ. స; లేక యుండగన్ – గ. వ.

17\. 1. జుట్టుకొన్న – గ. జ. ట. న; వెను చుట్టుకొన్న – వ; ముట్టుకొన్న – పీ. 2. బెగ డొందుచు – ఝ. ద. వ; వెసగుందుచు – ర. వ. 3. కేలి దేలినన్ – ఊ. ఏ. 4. గెల్చినన్ – ల.

18\. 1. కావు కావు మనాథుల – వ. 2. లార్తరవము – ఈ.

19\. 1. తదవసరంబున – పెక్కు ప్రతులు; తదనంతరంబున – వా.

'0. 1. దివసంబుల్ – కొన్ని ప్రతులు. 2. సబల, పుత్ర – అని పాఠములు.

ౌరవులును దక్కటిజనపతులును దగుజనంబులును నతని నాసపడి చుండి రాతనితెఱంగు దొల్లియు నీ వాకర్ణించి తది యెయ్యది
.

ఽ పరిత్ప్రతుండు దను నర్థరతుం డని పల్కినఁ మనం
గడు నొచ్చి నీ వనికిఁ బోయిన [2]నద్దెస రాను నీజయం
వనవాసి నయ్యెద రిపుల్ నిను నోర్చిన వారి నోర్చెదఁ
ఽజశక్తి నే ననియెఁ గాదె నృపుల్ విన [3]నమ్మహాత్ముతోన్.

నతం డంతకు మున్న కయ్యంబునకుం దొలంగి యుండె నాఁ డట్లు
ఽనంబు లెల్ల నాసూతనందనుదెసకుం జాఱె ననిన విని యాంబికే
డు సంజయున కిట్లనియె.

మ్మెయిఁ [1]దలఁచిన య
ఽజేంద్రులఁ గౌరవులను మనమూఁకల న
ఽఁ గర్ణుఁడు గాచెనె తన
రథము లెల్ల ఫలస[2]మగ్రతఁ బొందన్.

ఽ నమ్మనుజపతికి నతం డిట్లనియె.

[1]నడునీటఁ గలము
ఁగిన బెగ డందుచిత్తములు గలిగినత
ఽక్రియ నున్న సేన[2]లు
: గాన దివిగతిఁ దోఁచెఁ గర్ణుం డంతన్.

---

మిషవాహినీతనయు డర్థ – ఉ. ఓ. ర; అనఘ నదీ సుతుండు – ఎ. ణ. ద.
2. నీదెస – ఇ. 3. నా హవోద్ధతన్ – ద. వ.

రిన యమ్మను – అ చ. వ; రావించిన మనుజేంద్రుల, రాదలచిన మను ల. డాసిన యమ్మను, పిలిచిన యమ్మను – అని పాఠములు. 2. మహిమం న్ – గ.

ఽమను మిక్కిలి మునిగిన – హ; నడుదెస గల మటు మునిగిన – వ. 2. లగను కివి – వ. శ. ష. శ.

27. వ. ఇట్లు [1]పురంబు వెడలి యతండు కురుపతికడ కేతెంచి ప్రీతుం డగునతనిచేత నభినందితుం డై రాజలోకంబు నాలోకించి.

28. చ. దమమును సత్యముం దపము దానము శీలము నస్త్ర[1]వీర్యశౌ
ర్యములును భీష్మునంద కల వట్టిమహాత్ముఁడు పోర నీల్గె నిం
క మనకు నేటిబాహుబలగర్వము లెక్కడి సేన లక్కటా
సమసెనె కౌరవేశ్వరునిసంపద [2]యంచు విషణ్ణ[3]మూర్తి యై.

29. క. కన్నీ రొలుకఁగ వగచిన
నన్నర[1]పతు లెల్ల నేడ్చి [2]రార్తరవంబుల్
మిన్నంద నశ్రు[3]జలములు
విన్ననివద[4]నంబులందు వెల్లి గొనంగన్.

30. వ. అప్పుడు దన్నుం దాన యుపశమించుకొని యందఱు డెందముల యుమ్మలి కంబులు వాయ రాధేయుం డి ట్లనియె.

31. క. మీ రెల్లఁ జూచుచుండఁగఁ
గౌరవ[1]నికురుంబమునకుఁ గన్నా కై యొ
ప్పారెడు భీష్ముఁడు వడియెను
మేరు వొఱఁగినట్టు [2]లసము మిగుల నరునకున్.

32. వ. నాతెఱంగు వినుండు.

33. క. కలఁగిన సేనలఁ గాచెద
నిలిపెద నర్జునునికడఁక నెఱపెద బాహా

---

27. 1. శిబిరంబు - ఒ. ట. డ. త. ప. మ. వ. పీ. హ.

28. 1. శస్త్ర వీర్యములు - ఓ. ద. ప. వీ. స; శస్త్ర శౌర్యములు - ల. 2. లంచు విషణ్ణ - కొన్ని ప్రతులు; నంచు నుదగ్రమూర్తి యై - జొ. 3. చిత్తు డై - ఈ. గ.

29. 1. వీరులెల్ల - డ. ద. ప. 2. రాత్రిరవంబుల్ - బ. వ. 3. కణంబుల్ - వ. 4. నములయందు వెల్లి - అ. ఎ. ఏ. చ. శ. శర. ష.

31. 1. నికరంబునకును - కొన్ని ప్రతులు. 2. లబ్బు మిగుల నరుచేతన్ - ద. వ; లసము మీర నరునకున్ - ఈ.

బల మాభీష్మం డె ట్ల
గ్గలిక [1]మెఱసె నట్లు మీకుఁ గన్నులు దనియన్.

34. ఉ. ధర్మజభీమపార్థులును దమ్ములు నుద్భటసంగరక్రియా
[1]కర్మఠు లచ్యుతానుజునిగర్వము దర్పవహంబు వారి మ
త్కార్ముకముక్తచండశరఖండితదేహులఁ జేసి యిత్తు నేఁ
జెర్మిగఁ గౌరవేంద్రున కభీష్టత రాజ్యరమావిలాసమున్.

35. క. కాదేని గాండివజ్యా
నాదము సురదుందుభిప్రణాదంబును నిః
ఖేదుఁడ నై [2]వించు నధిక
మోదంబున నిత్యసౌఖ్యముం గై కొందున్.

36. క. కౌరవులం గాచుచు రణ
శూరులఁ బాండవుల [1]నోర్చుచుం గీర్తికర
స్ఫారవిహారత భీష్మునిఁ
జేరం జనుకంటె [2]నొప్పు సెప్పం గలదే.

37. వ. అని పలికి తనసారథిం గనుంగొని.

38. సీ. మణిగణోజ్జ్వల మైన మనయరదంబున జవనాశ్వములఁ [1]బూన్పు చాపబాణ
ఖడ్గాదిసాధనోత్కర [2]మొడఁగూర్పుము రత్నధ్వజం బెత్తు రశ్ము లడర
శంఖమృదంగనిస్సాణాదితూర్యముల్ సంఘటింపుము రభసమున ననుడు
వాఁ డట్ల చేయ దుర్వారగర్వోద్ధతి నగ్నిప్రభం బగునారథంబు

తే. పటురయంబున నెక్కి భూపతికి మ్రొక్కి
యాతఁ డెల్లకౌరవులును నఖిలనృపులుఁ

---

33. 1. నెరపె - కొన్ని ప్రతులు.

34. 1. కర్ములు నచ్యు - హ.

35. 1. నిష్ఖేదుఁడనై - ప. శ. 2. వించుంగడు - వ. పీ. శ. ష.

36. 1. నొంచుచుం - ఓ. న. బ. వ. 2. నొండు సెప్పంగలదే - ఓ. పా. ణ; నొప్పు సెప్పం గలదే - సం.

39. 1. బూన్చి - శ. ష. కొన్ని ప్రతులు. 2. మొనగూర్పుము - కొన్ని ప్రతులు.

దన్నుఁ గొనియాడఁ గర్ణుఁ డుత్సాహలీల
నిజబలాఖిలసుందరధ్వజము లొప్ప.

39. వ. నడచి నదీనందనుఁ డున్నయెడకుఁ జేరం బోయి [1]శోషించిన సముద్రంబు చందంబున విమానంబు విఱిగిపడినదివ్యుని తెఱంగున భూతలపతితుం డయిన పతంగు[2]భంగిని భగ్నపక్షుం బైనమైనాకంబు మాడ్కిం బొలుచు నతనికడకుం బాదచారి యై యఱిగి ఫల్గుననారాచనిచయంబునం బొదువంబడి యమునా [3]నదీప్రవాహస్థితంబును మదనిమీలితాక్షుంబును నై శోభిల్లు శుండాలంబు ననుకరించుచు వీర[4]శయనమహనీయుం డైన యమ్మహానుభావుని యడుగులపైఁ గన్నీరు [5]దొరఁగం బ్రణమిల్లి కేలు మొగిడ్చి వినయవినమిత [6]శరీరుం డై.

40. క. వచ్చితి రాధేయుఁడఁ గను
విచ్చి ననుం జూడు భరతవీరాగ్రణి నీ
సచ్చరి[1]తముఫలమే యి
ట్లిచ్చుట నీ[2]యునికి ధాత నే మన [3]నేర్తున్.

41. ఆ. పావనంబు లయినపలుకులు నాచెవు
లార [1]నెమ్మి నన్ను నాదరింపు
మయ్య ధర్మనిత్య యంచితసత్య శం
తనుకుమార గాఢధైర్యసార.

42. ఉ. పేర్చినమూఁకఁ గూడ నడపింపఁగఁ గో ల్తల [1]సేయఁ దీవ్రబా
ణార్చుల మార్పులంబుల రయంబున నీఱుగఁ గాల్ప నాజి నీ
నేర్చినభంగి నొం డొకఁడు నేర్చునె పాండవబాహుసంపదల్
[2]పేర్చు నెలర్చు నింకఁ గురుబృందము లెల్లను దల్లడిల్లఁగన్.

---

39. 1. రోదించిన, రోషించిన – వ. 2. పగిదిని – పీ. శ. ష. కొన్ని ప్రతులు. 3. నదీ – కొన్ని ప్రతులలో లేదు. 4. శయ్యా – కొన్ని ప్రతులు. 5. దొరుగన్ – కొన్ని ప్రతులు. 6. శిరస్కుం డై – గ. న. మ.

40. 1. తకుఫలమే – ద. పీ. శ. ష. 2. పడుట – పెక్కు ప్రతులు. 3. వచ్చున్ – చ.

41. 1. వినగ – పీ. శ. ష. కొన్ని ప్రతులు.

42. 1. జేయ–ఇ. ఖ. ర. ల. శ. 2. పేర్చి తలిర్చు – వ. పీ. శ. ష; పేర్చి యెలర్చు – ల.

43. క. శరజిహ్వో[1]భీకరుఁ డగు
నరుఁ డనుశిఖ నిగడఁ జేసి నారాయణుఁడు
ర్భరపవనుఁ డింక బంధుర
కురుసేనాకాననంబు క్రొ వ్వడఁగించున్.

44. మ. భరితాశాంతరపాంచజన్యరవ[1]దృప్యద్దేవదత్తధ్వని
స్ఫురణఁ బీనులు వ్రయ్యఁ గేతనకపి[1]స్ఫూర్జత్ప్రభం జూడ్కి లా
తురతం బొందఁగఁ జండగాండివసముద్భూతాస్త్రజాలంబు తె
వ్వరు సైరింతురు నీవు దక్కఁ భుజగర్వస్ఫూర్తినిర్వాహకా.

45. ఆ. మెయి మెయిం బెనంగి [1]మెచ్చించి ముక్కంటి
చే వరంబు గొని విశిష్టదివ్య
[2]కర్మదీప్తుఁ డైన గాండివి [3]నోరుఁ డాజిఁ
జెనయఁ జాల కునికి సెప్ప నేల.

46. క. అని పెక్కుమాట లాడిన
విని యాదరభరితనేత్రవిస్తారుం డై
యనిమిషనదీతనూజుఁడు
గనుఁగొనుటయు మఱియు మ్రొక్కి కర్ణుఁడు [1]వలికెన్.

47. ఉ. ఆనరు నే నొకండన విషానలదుస్సహదృష్టిభీషణం
బైనమహాభుజంగమము నద్భుతమంత్రనిరస్తదర్పముం
గా నొనరించు[1]నట్లు భుజగర్వ మడంచెద నస్త్రశస్త్రవి
ద్యానిపుణత్వసంపద నుదాత్త[2]గుణోత్తర నీవు పంపఁగన్.

---

43. 1. భీషణు డగు - వ. హ.

44. 1. శుంభద్దేవదత్త - ర. 2. స్ఫూర్తిప్రభన్ - వ. స. శ.

45. 1. మెప్పించి - ఈ. ఏ. ద. వీ. హ 2. కాండ - అ. 3. నెవ్వరు జెనయ - అ. చ. వ. శ. ష.

46. 1. పలుకున్ - కొన్ని ప్రతులు.

47. 1. భంగి - అ. చ. వ. 2. గుణోత్తము - చ. ల. గుణోన్నత - ఐ.

48. వ. అనిన గాంగేయుండు రాధేయున కిట్లనియె.

49. మ. తగఁ బర్జన్యునిసొంపునఁ బ్రతుకు భూతవ్రాతముల్ వార్ధి సొ
చ్చి గరిష్ఠస్థితి నుండునేఱులును సంక్షీణంబు లై యుర్వి ని
ల్చి గుణాధిక్యముఁ బొందుబీజములుఁ బోలెం గౌరవుల్ విశ్రుతం
బగునీప్రోపును బ్రాపుఁ గాఁ గని సౌఖ్యం బొందు టొప్పుం గడున్.

50. చ. అరయఁగ బంధుకోటులకు [illegible]రునాథునియట్ల కావె నీ
వరిబలభేది జన్మమున నయ్యెడు చుట్టఱికంబుకంటె సు
స్థిరతర మైన [1]సంగడముచే నగుబాంధవ మెక్కు డండ్రు నా
నరపతి రాజ్యభారము మనంబు నీయదిగాఁ దలంపుమీ

51. వ. అంబష్ఠవిదేహపౌండ్రాదిదేశాధీశుల గెల్చి దుర్యోధనాధీనవర్తులం[1]గా నిర్వ
ర్తించిన నీకు [2]నిట్లు సెప్పవలయునే యండజంబులు పండినవృక్షంబు నుప
జీవించు చందంబున నిన్నుం జెంది బంధువులు సుహృజ్జనులు సుఖు లై
యుండువారు గాక నాకు నీవును సుయోధను నట్ల కావున మే
లాడెదఁ గౌరవుల నడిపికొని యమ్మహీవిభునకు విజయంబు గావింపుము
పొమ్మని సమ్మదంబునం బలికిన సూతనందనుండు ప్రీతుం డై యద్దేవవ్రతు
చరణంబులు శిరంబు సోఁక వినతుం డై పీడ్కొని యరదం బెక్కి యరుగు
దెంచి భవదీయసైన్యంబు దైన్యంబు వాపి [3]యే పగ్గలించి కలయం
గనుంగొని.

52. క. నరపతి యలరఁగ రథకరి
తురగసుభటసముదయముల దోర్గర్వధురం
ధరలీల మెఱసి యతిబం
ధురములు గా సంఘటించె దురమునకుఁ దగన్.

53. వ. అట్టియెడ.

---

50. 1. సంగరము – అ. స. శ. కొన్ని ప్రతులు; సంగమము – ల. కొన్ని ప్రతులు.

51. 1. గావించిన – కొన్ని ప్రతులు. 2. నింత – ఈ. 3. యేపు గలిగించి – ల. కొన్ని ప్రతులు.

54. క. అరుణాశ్వములు రుచిరరు
క్మరథంబుఁ బ్రదీప్తవేదికాధ్వజమును ను
ద్ధురగాత్రకలితసితభా
సురబంధురకంటకంబు శోభిల్లంగన్.

55. క. మొగమునఁ గయ్యపు[1] వేడుక
చిగురొత్త నుదాత్తమూర్తిఁ జెలువొందు గురుం
డగుడాజులుఁ గౌరవులును
బొగడి [2]రుబివు మిగులఁ బ్రమదపూర్ణహృదయులై.

56. తే. అపుడు నీపుత్త్రగనందనుఁ [1]డల్లఁ దనదు
తేరు రాధేయునరదంబు సేరఁ బోవ
నిచ్చి మనమున సంతస మెసక మెసఁగ
నాదరంబున నిట్లను నతనితోడ.

57. క. నీవలన సనాథంబై
యీ వీ డెంతయును మెఱసె నింకిట మనకుం
గావింప వలయు కార్యము
నీ వెఱిఁగింపంగవలయు నెయ్యం మెలర్పన్.

58. క. అనిన నతం డిట్లను బహు
జనరక్షకులైన నృపులు [1]సద్బుద్ధులు గా
వున నీవు [2]సెప్పఁగా నే
వినియెద నెయ్యది దలంపు వివరింపు తగన్.

59. ఉ. నావుఁడు గర్ణుతోడ నరనాయకుఁ డిట్లను సర్వయోధసం
భావితుఁడైన శాంతనవుబాహులమాటున నస్మదీయసే
నావిభవంబు సెల్లెఁ బదినాళ్లును నీమది కెక్క నాదుయో
ధావళిలోన నింకఁ బృతనాధిపుఁ గాఁ గొన నెవ్వఁ [1]డర్హుఁడో.

---

55. 1. వేడ్కలు – వ. 2 రెలమి మిగుల – బ.

56. 1. డట్లు తనదు – జ. ఝ. ట. ద. బ ల.

58. 1. సద్బంధులు – ర. హ. 2. సెప్పినను, సెప్పినది – అని పాఠములు.

59. 1. డొప్పునో – ఊ. ప.

-: ద్రోణాచార్యులకు సర్వసేనాధిపత్యంబు నిర్ణయించుట :-

సం. 7-5-8

60. క. సేనాపతిత్వమునకుం
బూని యొకఁడు నడపకున్నఁ బోఁడ వడఁగదె యా
సేన యనిఁ గర్ణధారవి
హీనం బగుకలము జలధి నెడలినభంగిన్.

61. వ. కావున [1]నొక్కరు [2]నిరూపింపు మనవుడు గాంధారేయునకు రాధేయుం డిట్లనియె.

62. సీ. అధిప నీయోధులయందు సేనాపతిత్వమునకుఁ జాలని[1]వారుఁ గలరె
యందఱు నయవిక్రమాదిగుణంబుల మాననీయు[2]ల యట్టు లైన నెల్ల
వారి ముఖ్యులఁ జేయవచ్చునే [3]యొక్కరు గై కొన్న మత్సరగ్రస్తబుద్ధి
నన్యులు విపరీతు లై కలంగక [4]యుండువాఁడు గావలయు నెవ్వరును ద్రోణుఁ

తే. [5]డనినఁ గా దన రాతండ యర్హుఁ డాధి
పత్యమునకు నాచార్యుండు బ్రాహ్మణుండు
వివిధరణకోవిదుఁడు వయోవృద్ధుఁ డధిక
బలుఁడు శూరుండు గట్టుము పట్ట [6]మతని.

63. వ. అనుటయుం గురురాజు దగురాజులం గూర్చుకొని గురుం డున్నయెడకుం జని సవినయంబుగా నతని కిట్లనియె.

64. ఉ. ప్రాయముకల్మి నొక్కటన భవ్యధృతిన్ మహనీయశీలతన్
సాయకసంపదం బటుభుజావిభవంబునఁ గార్యతంత్రతన్

---

61. 1. నొక్కరుని, నొక్కని - అని పాఠములు. 2. నిరూపింప వలయు ననవుడు - త. ల. వ.

62. 1. వాడు గలడె, వారు లేరు - అని పాఠములు. 2. లరయనైన - ఉ. ర. స. 3. యెక్కడు - ప. పీ. 4. యుండవలయును గాన నెవ్వరును - చ. వ. 5. డన్న గావన రాతండ - పీ. శ. మ. పెక్కు ప్రతులు; డనిన గారన రాతండు - వా. 6. మధిప - ఝ.

[1]ఙ్ఞాయుతబుద్ధి వృద్ధుఁడవు [2]గావె ధరాసురవర్య మున్ను గాం
గేయుఁడు మాకు [3]నెల్ల నెఱిఁగింపఁడె నీదుమహానుభావమున్.

35. వ. అని వెండియు.

36. క. కనువెలుఁగు నీవు గా నీ
వెనుక భవన్మతమ [1]యూఁది [2]వీరలు నేనుం
జనుదెంచెద మూఁటట [3]నెల
కొన వృషభముఁబజ్జ నడచుగోవుల [4]పగిదిన్.

37. ఆ. అనుచు నచట నున్న యవనీ[1]పతులఁ జూపి
మఱియు నిట్టు లనియె మనుజవిభుఁడు
దేవసేన నడపి దితిజుల గెలిచిన
షణ్ముఖుండు నీవు సరియ కారె.

38. వ. కావున.

39. తే. సర్వసేనాధిపత్యంబు నిర్వహింప
వలయు ననవుడు [1]నమ్మహీశ్వరులు నట్లు
చెప్పి గెలువుము నీ వని చెలఁగి యతనిఁ
బ్రస్తుతించి ప్రార్థించిరి భరతముఖ్య.

40. వ. మఱియు నమ్మహీశ్వరుండు.

---

34. 1. ఙ్ఞాయతబుద్ధి – ఏ. ఐ. ఔ. ఘ. ట. ఠ. డ. ణ. త. ద. న. ర. శ. ష. హ. ఇచ్చట నఖండ యతిగా గ్రహింపవలెను. 2. గాక మహీసుర – పెక్కు ప్రతులు. 3. దొల్లి – ఖ. వ.

36. 1. యూని – ఊ. ఏ. 2. వీరులు నేనుం – ఖ. ద. ల. 3. నెలకొని – ఈ. చ. వ. 4. కరణిన్, భంగిన్ – అని పాఠములు.

37. 1. పతులు విన – పీ. ష; పతులు దాను – శ; శులును దాను – జ. ద. ప. వ; పతుల జూచి – పెక్కు ప్రతులు.

39. 1. నమ్మహీవరులు నట్లు – కొన్ని ప్రతులు.

71. క. సేనాసముదయ[1]వర్తకుఁ
గా నిను నేఁ బడసినపుడ కౌంతేయులు నా
చే [2]నడఁగ రెట్లు భీష్మవి
హీనుల మగుమమ్ముఁ గావు మెల్లవిధములన్.

72. వ. అని వేఁడి[1]కొనిన నయ్యంధఱం గలయం గనుంగొని యాచార్యుఁ డి
ట్లనియె.

73. ఉ. వేదములుం దదంగములు వింతలుగా నొక[1]కొన్ని నేర్తు ధై
ర్యాదిగుణంబు లెందుఁ గల వైనను నింతటివానిఁ గాఁగ న
త్యాదరవృత్తి మీరు విజయాశ ననుం గొనియాటఁ జేసి [1]యాఁ
గా దన కియ్యకొంటిఁ దగఁ గౌరవనాథునికోర్కి దీర్పఁగన్.

74. శా. భవ్యం బైనబలాధిపత్యమునకుం బట్టంబు గట్టుండు న
న్నవ్యాకీర్ణగజాది యై మెఱయు సైన్యశ్రేణిఁ బాలించి కౌ
రవ్యోత్సాహముఁ [1]బెంచి మార్కొనినవీరవ్రాతముం ద్రుంచి నా
దివ్యాస్త్రం[2]బుల ముంచి పాండ[3]వులదీ[4]ప్తిం మాయఁ జేయించెదన్.

75. వ. అని పలికినం బ్రీతచేతస్కుం డయి నీతనూభవుండు గనకకలశంబులం బావన
జలంబులు దెప్పించి [1]మంగళోపకరణశోభితంబు గావించి పుణ్యాహ[2]నాదం
బులుం బరమాశీర్వాదంబులుఁ మాగధగీతంబులుఁ వందిజనస్తుతివ్రాతం
బులు౦ జెలంగఁ బ్రభూతభూపతులుం దాననుఁ ద్రోణాచార్యునకు సేనాధి

---

71. 1. రతుకుగా – ఒ. బౌ. ల. వీ శ. ష. శ; భర్తనుగా – ఊ. ఎ. ఘ. ట. ణ. న. బ. వ. శ. 2. నడ(ఱ)గిరెట్లు – కొన్ని ప్రతులు; నడగుదు రిటు – ఏ. క. ఘ. ర. శ. ష.

72. 1. కొనుటయు – ఉ. ఠ.

73. 1. కొన్ని – వీ. శ. ష; కొంత – వా. కొన్ని ప్రతులు. 2. యే గాదన – కొన్ని ప్రతులు.

74. 1. బేర్చి – కొన్ని ప్రతులు. 2. లముంచి – వ. వీ. ష; లఁబంచి – వా. కొన్ని ప్రతులు; లనించి – ఎ. ఏ. బౌ. 3. వబలోద్రేకంబు మాయించెదన్ – వీ. శ. ష. స. శ. 4. కీర్తిన్ – ఒ. చ. ల.

75. 1. మంగళవిహితోపకరణములు – కొన్ని ప్రతులు; 2. వాచనంబులు – ఊ. ఠ. ల.

పత్త్యాభిషేకపట్టబంధం [3]బొనర్చి పేర్చినం గని రథికవరు లార్చి నిజశంఖం బులు పూరించిన నఖిలసైన్యంబులందును భేరీమృదంగపణవాదితూర్య[4]నినాదంబులు [5]పగిడి నింగి ముట్టె నిట్లు సకలచమూపతిత్వపదభాసితుం డై భారద్వాజుండు.

76. సీ. కౌరవసేనా[1]ముఖంబునఁ దిలక మై [2]యొప్పి రాధేయాదియోధవరులఁ
[3]గొని పాండురాజ[4]నందనుల సైన్యములతోఁ దొడరి ధైర్యంబు
నద్భుతమహాస్త్ర
వీర్యంబు ననివార్యశౌర్యంబు దోర్బలౌదార్యంబు [5]మెఱయ నీతన
యువలని
[6]కూరిమి వెలయ నక్షౌహిణిపైఁ గొంతబల[7]మును దొర ల[8]నేకులను గూల్చి

తే. చామరచ్ఛత్రకేతుభూషణతురంగ
దంతిరథహేతివర్మయోధ[9]వ్రజంబు
తుని [10]యలిల [11]నించి కతిపయదినము లరులు
సురలు వినుతింప విహరించె ధరణినాథ.

77. క. అడవుల దవశిఖి దరికొను
వడువున ని ట్లరిబలం బవారణఁ బొడిగా
నడరి యతఁ డాజి ద్రుపదుని
కొడు [1]కార్వ నుభయజనములకు నెవగ మిగులన్.

---

3. బాచరించి, గావించి - అని పాఠములు. 4. రవంబులు, రణనంబులు - అని పాఠములు 5. నిగుడి - కొన్ని ప్రతులు.

76. 1. ముఖమునకు, మొగమునకు - అని పాఠములు. 2. యొప్పె - కొన్ని ప్రతులు. 3. రంజిల్ల గని పాండురాజ సైన్యములోడ దొడరి - ఈ. 4. నందన సైన్యముల తోడ - కొన్ని ప్రతులు. 5. వెలయ, నెరయ - అని పాఠములు. 6. గారము - వీ; కూడిమి నెరయ-ల. 7. ములనేకుల నిలను గూల్చి - ఊ. 8. లను గలన గూర్చి-ద. ప; లభూపతుల గూల్చి - న. 9. వ్రజముల - పెక్కు ప్రతులు. 10. యలుగ నొంచి (ద్రుంచి, సించి) - అని పాఠములు. 11. నిండగా నై దుదినము - శ. ష.

77. 1. కార్వగ నుభయ సేనకున్ వగ - ఓ. గ. ఘ. చ. ఐ. వీ. శ. ష; కార్వగ నుభయ బలము గుందుచు బొగులన్-వ; కార్వగ నుభయ బలముకున్ వగ - కొన్ని ప్రతులు.

78. క. దుష్టమనస్కుం డగునా
ధృష్టద్యుమ్నుండు దక్క దేవా సుజనో
త్కృష్టుం డగు[1]గురునితెగుటకు
నిష్టాపముఁ బొందె భూతనికరము లెల్లన్.

79. వ. అనిన విని యాంబికేయుండు హృదయంబు [1]జల్లనఁ జెదర వదనంబు వెల్ల
నయి మొగుడ నివ్వెఱఁ గంది కొండొక[2]ప్రొద్దు నిశ్చేష్టితుం డై యుండి
గద్గద[3]వికలకంఠుం డగుచు సంజయుతో ని ట్లనియె.

-: ద్రోణాచార్యునిమరణంబు విని ధృతరాష్ట్రుండు పరితపించుట :-

సం. 7_8_1

80. సీ. అస్త్రశస్త్రంబుల నధికుండు వెరవరి భుజబలవిక్రమంబుల ఘనుండు
గురుఁ డట్టివానిఁ దేఁకువ [1]లేక [2]కదిసిరే [3]పాంచాలు రతనిచాపంబు దునిసె
నో తేరు విఱిగెనో సూతుండు వడియెనో [4]యేమఱి యలసత నెదిరి సరకు
[5]సేయని మఱి పాత్మఁ జెందెనో హీనాత్ముఁ డై నధృష్టద్యుమ్నుఁ
డతనిఁ జంపె

తే. నట్టె యచ్చెరు విది దైవ మగ్గలంబు
పౌరుషముకంటె ద్రోణునిపాటు వినియు
[6]వేయిపఱియ లై పోవదు ఱాయి గాఁగ
నోపు నాగుండె యే మని యుమ్మలింతు.

81. వ. అని యడ లూని పొగిలి వెండియు.

---

78. 1. గురుండు తెగుట - అ. ఘ. డ. వ; గురుడు దెగుటకు - ఝ; గురుని బడుటకు - ఊ. ఏ; గురుని పాటుకు - ఐ.

79. 1. ఝల్లని - పెక్కు ప్రతులు. 2. ప్రొద్దు - పెక్కు ప్రతులు; సేపు - వా. వీ. శ. ష. 3. వికలుం డగుచు - ఎ. ఏ.

80. 1. సెడి - ఈ. 2. చంపిరే - ఉ. ఠ; కవిసిరే - కొన్ని ప్రతులు. 3. పాంచాలు డతని - కొన్ని ప్రతులు. 4. యేమర దలసత - ఖ. ఐ. న. వ; యగ్గురు డలసత యడరి - హ. 5. సేయని మర పాత్మ - ఊ. ఏ. క. జ. ఝ. త. ద; సేయమి పరమాత్ము జెందెనో - ద. వ; 6. సేయమి - వా. వేయు - పెక్కు ప్రతులు.

82. తే. మేరు వ్రాలగుట యినుఁ డిలమీఁద బడుట
యబ్ధి యింకుట గాదె ధైర్యమునఁ జేర్చి
ప్రభ వెలింగి [1]గభీరత రాశి కెక్క
యెందుఁ బొగ డొందునాచార్యుఁ [2]డిట్టు లగుట.

83. క. అతిలోకపరాక్రమనిధి
మతిసురగురు [1]మిగులుఁ గురుకుమారుఁడు దు
ర్మతు లగుమత్సుతులకుఁ గా
మృతుఁ డయ్యెఁ బరోపకారమ్మతి [2]యొప్పఁ గదా.

84. తే. విల్లు వట్టెడు[1]వా రెల్ల వెరవు గఱచి
పోవ నెల వైనద్రోణుని[2]భుజము నిలువ
రించి పాంచాలనందనుఁ బంచి పార్థుఁ
డిట్లు [3]సేయించెఁ గా కొరుఁ డేల చాలు.

85. క. పాముఁ బొదివి పడఁ [1]దిగిచిన
చీమలగములట్లు ద్రోణుఁ జిక్కువఱిచెఁ గా
కేమి బహుదేశసైన్యము
లే మనఁ గల దింక నూత యెవ్వరు మనకున్.

86. వ. [1]అని పలుమాట లాడి యెల్లంబోయి యాలోనన కొంత దెప్పిఱి యంగంబులు వడంకుచుండ మఱియు నమ్మానవేశ్వరుండు సూతనందనున కిట్లనియె.

---

82. 1. యభీరుత వాసి కెక్క – హ; గంభీరత – కొన్ని ప్రతులు. 2. డిట్లు దెగుట; డిట్లు బడుట – అని పాఠములు.

83. 1. మీరు గురుడు మహాత్ముడు దుర్మ–ఊ. ఎ. ఏ ద. వ. 2. బొందె గదా–ణ.

84. 1. వారికి నెల్లయొజ్జ ప్రోవ – ణ. 2. లావు – ఒ. క. ఖ. ఘ. డ. ర. వ. 3. సమయించె – వ. వీ. శ.

85. 1. దించిన, దివిచిన, వైచిన – అని పాఠములు.

86. 1. అని పలికి వెల్లబోయి – ణ; అని పలుమారు మాటలాడి – ర.

87. తే. ప్రథమగిరిమీఁదఁ [1]దోఁతెంచుభానుఁ బోలి
ధర్మపుత్త్రుండు దోఁచినఁ [2]దళము విరియు
నట్లు విరియక గురునకు నడ్డపడఁగ
వచ్చునే తమ్మి మెఱసి యెవ్వరికి నైన.

88. క. [1]సింధురము [2]మహోద్రేకమ
దాంధం బై వచ్చు[3]లీల నాచార్యునిపై
గంధవహసుతుఁడు [4]గవియ న
మంధరగతి నెవ్వఁ డాగు మనయోధులలోన్.

89. చ. ఉఱుముచు నెల్లెడం బిడుగు [1]లుగ్రగతిం బడ ఘోరమూర్తి యై
యఱిముఱిఁ గప్పుదెంచువిలయాభ్రము చాడ్పున మౌర్వినాద మే
ర్తైఱఁ జెలఁగ౯ వడిం [2]దొరఁగుదివ్యశరం[3]బులు ద్రోణు తేరిపై
బఱపుకిరీటి [4]మీధరణిపాలకుఁ జోదులచేత నిల్చునే.

90. క. ఎవ్వఁడు దెరలెనొ [1]తిరుగక
యెవ్వఁడు నిల్చెనొ కడంగి యెవ్వఁడు బిరుదై
[2]క్రొవ్వునఁ జచ్చెనొ కుంభజు
నెవ్వఁడు గావంగ[3]లేఁడ యెయ్యది [4]దుదియో.

91. ఆ. గురుఁడు పడినయపుడ కురుసైన్యములఁ గల
వారణాశ్వసుభటవర్గములును
బడియెఁ గాక యేల పడకుండు నాధర్మ
పుత్త్రుభాగ్య మలఁతిఁ బోవు నెట్లు.

---

87. 1. నేతెంచు - వ. 2. దళము మెరసి - అ. ట. బ; దళము మీద - వ.

88. 1. బంధురగజము మహోగ్రమదాంధ - ఙ. య. 2. మదోద్రేక - కొన్ని ప్రతులు. 3. నోజ - గ. ఙ ఛ. 4 గవియం బంధురగతి - వీ. స.

89. 1. లొక్కమొగిన్ - ఈ. 2 దొరుగు - కొన్ని ప్రతులు. 3. బుల తెప్ప ద్రోణుపై - క. ర. 4. తా ధరణిపాలకయోధుల - హ.

90. 1. తరలక, విరుగక - అని పాఠములు. 2. క్రొవ్వడి - ఊ. ఏ. 3 లేద, లేడె - అని పాఠములు. 4. తెరువో - ఝ.

92. చ. [1]నడిఁకెడువాఁడు గాఁడు గురునందనుఁ డక్కట తండ్రిచావు న
ప్పుడు మొగ తప్పి యొండు[2]గడఁ బోరుచు నుండెనొ యడ్డపాటు క
వ్వడికతనన్ ఫలింపమి నవారణ నాద్రుపదాత్మజుండు బె
ట్టడరి వధింపఁగా వికలుఁ డై [3]దురపిల్లుచుఁ జూచుచుండెనో.

93. ఆ. అని [1]సనవి [2]వనట [3]నలఁదురి
నిను [4]నెద్దియు నడుగ నాకు నీ వేమియుఁ జె
ప్పను వలవదు సంజయ మఱి
వినియెద మది గలఁగె ననుచు [5]వివశాత్మకుఁ డై.

94. వ. తనకొడు[1]కుల గెలుపునెడ నాస[2]మాలుటం జేసి.

95. ఆ. [1]సొమ్మ వోయి పడిన సుదతు లాక్రందన
రవముతోడ సత్వరముగ నెత్తి
యానృపాలు సెజ్జయం దిడి మెలపున
శిశిరవిధులు సేయ సేద తేఱి.

96. వ. ఆసీనుం డై [1]యాతండు సూతసుతున కిట్లనియె నరనారాయణులు [2]రథి
సారథు లైనయారథం [3]బెందు సిద్ధమనోరథం బగుఁ గవలు గడిందిమగలు
సాత్యకి సత్యపరాక్రముండు పాంచాలోత్తముం డగు నుత్తమౌజుండుదాత్త
బలుండు శిశుపాలతనయుం డగు [4]ధృష్టకేతుండు ధీరుండు భీష్మపాతనహేతు
వయినశిఖండి [5]యఖండపరాక్రముండు సౌభద్రుండు రెండవరుద్రుండు

---

92. 1. నడకెడు – కొన్ని ప్రతులు. 2. దెస – ఊ. ఎ. 3. దురటిల్లుచు – కొన్ని ప్రతులు.

93. 1. పలికి, వినివి – అని పాఠములు. 2. పనవి – అ. గ. జ. వ. కొన్ని ప్రతులు. 3. వందురి – ఉ. ఘ. ఝ. ట. ఠ. వ. కొన్ని ప్రతులు. 4. నేమియు – కొన్ని ప్రతులు. 5. వికలాత్మకు డై – ఊ. ఎ. ఏ.

94. 1. కుల దెస గెలుపు నాస మాలుట – ద. స. హ. శ. 2. మానుటం జేసి–వి. శ. ష.

95. 1. సొమ్మసిల్లి – అ.

96. 1. వైచిత్రవీర్యుడు, విచిత్రవీర్య నందనుడు – అని పాఠములు. 2. రథిక సారథు లైన – పెక్కు ప్రతులు. 3. బెందున ప్రతిహతమనో – ఆ. గ. 4. దృష్ట కేతుండు – శ. ష. పెక్కు ప్రతులు. 5. యఖండవిక్రముండు – పెక్కు ప్రతులు.

యాదవశ్రేష్ఠుం డగుచేకితానుండు మాన[6]ధనుండు ద్రౌపదేయు లజేయులు గేకయు లేవురు వేవురపెట్టు యుయుత్సుండు బహుళమత్సరుండు ద్రోణ వధంబ పనిగాఁ బుట్టినధృష్టద్యుమ్నుం[7]డు భుజసారద్యుమ్నుండు ఘటోత్కచుండు ఘనఘోరమూర్తి కృష్ణాశ్రితం బైనవృష్ణికుమారలోకం బ[8]లోకమాన్యం బన మిగిలిన బిరుదు[9]తనంబునం బేర్చినయది భీమగదాభీషణుం డైన భీమసేనుం డెవ్వరికి నలవిగాక యుండుఁ బాండవసేనం గావను గౌరవసైన్యంబు సమయింపను దాన చాలు నట్టిపరికరంబును గల దను కొలంది గాదు కార్యవివేకశౌర్యోద్రేకధుర్యుండు ధర్మదేవతకొడుకు ధార్మికత్వ[10]సత్యాది మహాగుణగరిష్ఠుండు యుధిష్ఠిరుం డతని గెలువ దేవతలకు నశక్యంబు మఱియు నొక్కవిశేషంబు సెప్పెద నాకర్ణింపుము.

97. మ. యదువంశంబున లోకరక్షణపరుం డై పుట్టి [1]వ్రేపల్లె ను
న్మదబాల్యంబు నటించి కంసముఖనానాదైత్యులం ద్రుంచి బ
ల్లిదుఁ డాయింద్రుని[2]పారిజాత [3]మిలకుఁ లీలాగతిం దెచ్చి శి
ష్టదయాళుత్వము పూని యున్నహరి నిష్ఠం జెంది రప్పాండవుల్.

98. వ. కావున వారల గెలుచు టరిది యట్లుం గాక.

99. క. హరి[1]యాత్మ యర్జునున కా
హరి కర్జునుఁ డాత్మ హరియు నర్జునుఁడును నా
నిరువు[2]రగుట క్రీడార్థం
బరయఁగ నది యొక్కవెలుఁగ యతులం [3]బెందున్.

---

6. ఘనుండు – ఈ. వ   7. దష్టమూర్తి సమానుండు – గ.   8. కృష్ణాహూతం బైన – అ. ఐ. ఓ. మ. య. శ. కొన్ని ప్రతులు. లోకసామాన్యం బన – జ. ట. పి.
9. మగల పేర్చిన – ఝ. వ.   10. సత్త్వాది – ఈ. క. గ. ర. వ.

97. 1. రేపల్లె – ఈ. ఉ. ఝ. ఞ. ర. ల. పి.   2. ఇచ్చట మూలము
"వైనతేయం సమారుహ్య త్రాసయి త్వామరావతీం
మహేంద్రభవనా ద్వీరః పారిజాత ముపానయత్"
ద్రోణ – 11 – 22 శ్లోకము. చిత్రశాలాప్రతి.
3. మెలమిన్ – ఒ.

99. 1. యాత్మ నర్జునుం డాహరి కర్జును డాత్మ – జ. ట. ప.   2. రనుట – వ.   3. బన ఘా – పెక్కు ప్రతులు.

100. క. ఆవెలుఁగు గనువెలుంగు గ
[1]దా వెలసినపుణ్యమూర్తి ధర్మసుతుం డే
లా వెఱచు రణమునకు నా
చే వచ్చెం గౌరవులకు జే చేమందున్.

101. వ. అని వెచ్చనూర్చి [1]యూఱక కుండి వెండియు.

102. చ. గురుఁడును భీష్ముఁడుం గలనఁ గూలుదు [1]రట్టె కిరీటి [2]కింక నె
వ్వ రెదురు కౌరవక్షయ మవశ్యము నయ్యెడు వార్త లేమిగా
బురపురఁ బొక్కుచుణ్ వినఁగ బుద్ధిఁ దలంచెద నైన ద్రోణుసం
గరపరిపాటి యెల్ల వినఁగా వలతుణ్ వివ[3]రించి చెప్పుమా.

103. తే. అనిన సంజయుఁ డి ట్లను నాంబికేయు
తోడ నేను దెల్లంబుగ ద్రోణుసమర
మెఱిఁగి వచ్చితిఁ జెప్పెద నెల్లఁ దెలియ
వినుము [1]దిర మయి మాటలు వేయు నేల.

## –: ద్రోణుఁడు దుర్యోధనునకు ధర్మరాజుం బట్టి యిచ్చునట్లు వరం బిచ్చుట :–

సం. 7_11_1

104. వ. అట్లు సేనాధిపత్యంబు పూని కుంభసంభవుం[1]డు ముదిత[2]మనస్కుం డై
గారవంబునం గౌరవేంద్రునకు నరేంద్రులు విన ని ట్లనియె.

---

100. 1. త్రావల మై – ఈ.

101. 1. రిచ్చపడి వెండియు – ఎ; ఫొగిలి వెండియు – ఝ.

102. 1. రట్టి కిరీటి కింక – ఈ. ఉ ఊ. వీ. కొన్ని ప్రతులు. 2. కిన్క కెవ్వ రెదురు–ల. 3. రింపు సంజయా – ఇ.

103. 1. దీనపుమాటలు – వీ. స; దీఱ వో మాటలు – స. ళ; ధీరత మాటలు – జ. ఝ. ట.ద. ప. వ; తిరముగ – కొన్ని ప్రతులు.

104. 1. డకుంఠితమనస్కు డై – వ. 2. చేతస్కుం డై – ఊ. ఏ: మానసుం డై, హృదయుం డై – అని పాఠములు.

105. క. నను భీష్ముని[1]పిదప బలం
బున కెల్లను ముఖ్యుఁ జేసి పూజించితి [2]పి
[3]వినుతాచరణ[4]ఫలంబును
గనువాఁడవు వరము[5] గోరు కౌరవనాథా.

106. వ. అనిన విని యతండు కర్ణ[1]దుశ్శాసనాదిసుహృజ్జనంబులతో నాలోచనంబు సేసి సవినయంబుగా గురున కి ట్లనియె.

107. క. వర మిచ్చెదేనిఁ గోరెదఁ
బరమహితము ధర్మపుత్త్రుఁ బ్రాణముతోడన్
దురమునఁ బట్టి భుజాభీ
కర కొని రావలయు [1]మత్సకాశంబునకున్.

108. వ. అని కోరుటయు భారద్వాజుండు నీకొడుకువదనం బవలోకించి.

109. చ. అకట యజాతశత్రుఁ [1]డనునప్పలు కిప్పుడు [2]నిక్క మయ్యె వా
నికిఁ గురునాథ యిట్టు లతనిం దెగఁ జూచుట గోర కాజిఁ బ
[3]ట్టికొనుట గోరి [4]తివ్విధము దెప్పర మెంతయు నిత్తెఱంగుగో
ర్కికిఁ గత మేమి పాండవుల గెల్చి ధరన్ సగ [5]మీఁ దలంచితే.

110. వ. నీదునిశ్చయం బెట్టిది యతనిం బట్టి తెచ్చిన నేమి సేయం గలవాఁడ వని యడిగిన నమ్మనుజవరుం డుప్పొంగి తనమనంబున నున్నకార్యం బాచార్యునకుం [1]దక్కటి[2]దొరలకుం దేటపడ ని ట్లనియె.

---

105. 1. వెనుక – ఆ. 2. ధీవినుతాచరణంబు – స. శ; నీవినుతా – అ. ఈ. ఊ. కొన్ని ప్రతులు. 3. మనమున గల కోరికె వేడ్క నొనర్చెద – ఓ. ఔ. 4. ముఫల మిదె, ములఫల మిల – అని పాఠములు. 5. వేడు – ఎ. ఝ.

106. 1. దుశ్శాసనులతో నాలోచించి – ఊ. ఎ. క.

107. 1. నీదు కౌశల మొప్పన్ – ఎ.

109. 1. డన నంచర కిప్పుడు – త. 2. తెల్లమయ్యె – ఊ. ఏ. డ. ర; 3. ట్టికొనగా – ఐ. ఖ. వ. 4. తవ్వరము – ఎ. వ. 5. మియ్యజూచితో – ఖ; మీదలంచితో – కొన్ని ప్రతులు.

110. 1. దక్కిన – ఖ. ఘ. ట. 2. దొరలకుం – పెక్కు ప్రతులు; వారికిం – వా.

111. సీ. ఆధర్మసూనుఁ గయ్యంబునఁ జంపినఁ గోపించి గాండీవి కురు[1]బలంబు
సమయించు మన మోపి సర్వపాండవులను జంపితిమేనిఁ బ్రచండచక్ర
ధారఁ గౌరవకోటితల లేటి రాజ్యంబు గోవిందుఁ డీకున్నె గొంతి కయినఁ
గాన యుధిష్ఠిరుఁ గాయంబు నొంపక తెచ్చి జూదం బాడు తెఱఁ గొనర్చి

తే. మగుడ నడవికి [2]ననిచినఁ దగిలి యతని
[3]తోడఁ దమ్ములుఁ బో వంతతోన యెల్ల
దొసఁగు [4]మాలు నప్రతిహతదోర్విభూతిఁ
బెద్దకాల మే [5]నేలుదుఁ బృథివి యెల్ల.

112. వ. అనిన విని కుటిలం బగునతని[1]యభిప్రాయంబునకు రోసి యస్త్రగురుం డవ్వ
రంబునకు నేమేనియు నెడవెట్టి యిచ్చువాఁడుగా నూహించి యొక్క
తెఱంగుఁ [2]గాంచి యన్నరనాథున కిట్లనియె.

113. చ. నరుఁ డెడ సొచ్చెనేని విను నా కది [1]దుష్కర మే నొకండనే
సురగణ మైన వ్రేలఁ గొని [2]చూపఁగఁ [3]జాలరు వాఁడు లేనిచోఁ
దిర మయి పోర నిల్చిన యుధిష్ఠిరు ద్రౌపదిపుట్టినింటివే
వురు వెఱఁగంది చూడ నలవుం జలముం జెడఁ బట్టి తెచ్చెదన్.

114. తే. అనుడు బాలిశు లైన నీతనయు లెల్ల
ధర్మజుఁడు పట్టు[1]వడునకాఁ దలఁచి రపుడు
పాండుసుతులకు మొగమోడకుండ గురుని
ప్రతిన [2]యెల్లెడఁ జాటించె రాజరాజు.

---

111. 1. కులంబు - అ. ఔ. డ. ల. 2. ననిచిన - అ. ఊ. డ. ర. స. శ. కొన్ని ప్రతులు; నె(గి)గచిన - ఇ. ఉ. ఒ. ఖ. గ. ల. శ; నడిచిన - వా. 3. తోన దమ్ములు - పెక్కు ప్రతులు. 4. దీరు - ఆ. ద. ప. వ; మాలి యప్రతిహత - ఇ. ఏ. ఖ. వ. శ. ష. కొన్ని ప్రతులు; మాలి నప్రతిహత - కొన్ని ప్రతులు. 5. నేలెద - అ. ఉ. ఐ. చ. శ. ష.

112 1. మనంబునకు - ఖ. గ. 2. విచారించి - జ.

113. 1. దుస్తర మే నొకండ - ఇ. 2 చూపను జాలరు - ఆ. ఒ. 3. జాలదు - ఉ. ఒ. ఓ. గ. ఘ. ఠ.

114. 1. వడియెకా దలచి - ఇ; వడుటకా దలచి - కొన్ని ప్రతులు. 2. జాటించె నిశ్శంక రాజరాజు - ఔ. ణ; జాటించె శంకించి(చె) రాజరాజు-ఆ. ఇ. ఈ. ఉ. ఊ. ఎ. ఏ - ఐ. ఖ. గ. చ. ఠ. బ.

115. వ. ఇట్లు శిబిరంబునను సేనాస్థానంబునను [1]గలయ నాఘోషణంబు సేయిం చినం [2]జెలంగి సకలసైనికులును సింహనాదంబులు సేయ శంఖభేరీరవంబు లుల్లసిల్లం గౌరవసైన్యంబు [3]వొంగె నది యంతయుం గాంగేయాగ్ర జుండు దనచారుల[4]చేత విని యనుజులం గూర్చి వినిపించి వివ్వచ్చు నాలోకించి.

116. ఆ. గురునిప్రతిన [1]వింటె వెరవున లావునఁ
జేసి దీని బొంకు సేయవలయు
నెఱుఁగు [2]నతఁడు నిన్ను నెడ వెట్టి పలికిన
వాఁడు గానఁ జెప్పవలసె నీకు.

117. క. నాయున్న [1]చోట నెప్పుడుఁ
బాయక కనుగలిగి నిలిచి ఖండనము దగం
జేయంగవలయు నక్కురు
నాయకు [3]కోరికి ఫలంబునకు విముఖముగన్.

-: అర్జునుండు ధర్మరాజుతో ద్రోణునిప్రతిజ్ఞకు వెఱవకుండునట్లు సెప్పుట :-
సం. 7_12_7

118. వ. అనుటయు నర్జునుం డతని కిట్లనియె.

119. క. గురుని [1]వధించుటయు ధూ
వర నీ వని నొవ్వ నొందువలను సనుటయుం
బరికింప నొక్క[2]రూ పవి
దురితంబులు [3]వీనిఁ జేయుదునె [4]యే నెందున్.

---

115. 1. గలయ గోసనంబు – అ. ఈ. ఎ. డ. ర. వ. కొన్ని ప్రతులు. 2. సెలంగ – ఔ. 3. పొంగారె – కొన్ని ప్రతులు. 4. వలన – కొన్ని ప్రతులు.

116. 1. వింటి – ఇ. చ. 2. మతడు నిన్ను – పెక్కు ప్రతులు.

117. 1. చోనయప్పుడు – అ. ఈ. ఔ. ఖ. ప. 2. కోరిన ఫలంబునకు విఫలతగాన్ – వీ. శ. ష; కోరిన వరంబునకు విఫలముగాన్ – కొన్ని ప్రతులు; కోరిన ఫలంబునకు విఫలతగాన్ – స.

119. 1. వధియించుటయును – కొన్ని ప్రతులు. 2. రూ పివి – కొన్ని ప్రతులు. 3. వినియు జేయుదునె – ఉ. ఐ. ఔ. గ. జ. ట. శ. ద. 4. యే నెట్లున్ – పెక్కు ప్రతులు.

120. క. క్షోణీవల్లభ విను మేఁ
ప్రాణముతో నుండ [1]నిన్నుఁ బట్టి[2]కొనఁగ నా
ద్రోణునక కాదు నగణ
స్థాణున కైనను వశంబె తలఁ కేమిటికిన్.

121. చ. అలవి యెఱుంగ కిమ్మెయి దురాశఁ దలంచిరి గాక ధార్తరా
ష్ట్రులు త్రిజగంబులుం గొని పటుస్ఫురణం జనుదెంచి రేనియుఁ
బలవదరాతిపుంజమదభంజన నీ వని [1]భంగపడ్డ [2]నీ
యిల శకలంబు లై [3]చెడదె యింకదె వారిధి నింగి గూలదే.

122. ఆ. వారితలఁపు వొసఁగ [1]నేరదు పోరఁ బ
రాభవంబు మనకు రా దెఱుంగు
[2]కలన నద్దురాత్మకులచేత నాతలం
పిట్టు లున్నయది నరేంద్రముఖ్య.

123. వ. అని పలికిన విని యుధిష్ఠిరుండు సంతుష్టాంతరంగుం డై శంఖభేరీమృదంగాది సంగరమంగళతూర్యస్వనంబులు సెలంగ సకలసైన్యసమేతంబుగా వెడలి నడచి మొగంబున నెలమి నెలకొనం గ్రౌంచవ్యూహం [1]బమర్చె నం దగ్రభాగంబున.

124. మ. ధవళాశ్వంబులుఁ [1]బూని కేతనకపీంద్రస్ఫూర్తిమార్తాండమూ
ర్తి విడంబింపఁగఁ జక్రగాండివధరుల్ దేజోమయాకారవై

---

120. 1. మిమ్ము – ఇ. త. 2. కొన దరమా – ఒ.

121. 1. చిక్కుపడ్డ – ఓ. ద. వ. పట్టుబడ్డ – ఖ. గ. ఘ. జ. ఝ. ట. ణ. న. బ. 2. నియ్యల – కొన్ని ప్రతులు. 3. పడదె – ఊ. ఎ. క. ద.

122. 1. నేరమి బోర – ఒ. 2. కలన నద్దురాత్మకుల – శ. ష; కలుగ దద్దురాత్మకుల – వా. కొన్ని ప్రతులు; కలుగ దద్దురాత్మకులచేత నాపద వెరవ వలదు మనకు నృపవరేణ్య – మ (యతి చింత్యము.)

123. 1. బు సంఘటించునెడ నందగ్ర–ఇ. ఠా; బొనర్చి యంచగ్ర – ఈ. బొనర్చె నందగ్ర – ఉ. ఒ. ఠ. ణ. శ. ష.

124. 1. బూన కేతన – కొన్ని ప్రతులు.

భవ మూరం దనపై వెలుంగ నతిదీప్తం బైనతే రొప్పె శా
త్రవ[2]సంఘంబు మనంబునం భయము [3]గూరం గాలచక్రాకృతిన్.

125. క. ఆరథము కెలన నుజ్జ్వల
ధీరోద్భటరేఖ మెఱసె ధృష్టద్యుమ్నో
దారస్యందన ముద్ధత
సారథికముఁ జారు[1]రంగచటులాశ్వము నై.

126. వ. మఱియు వృకోదరాదిసోద[1]రులను నభిమన్యుప్రభృతికుమారులను బాంచాల పతిప్రముఖబాంధవులను ధృష్టకేతుముఖ్యదండనాయకులను దక్కనుం గల పరివారంబును దగ నయ్యైయెడల బలుపును బొలుపును గలుగ నిలిపి యుధిష్ఠిరుం డమ్మోహారంబునడుమ నుదాత్తసన్నాహంబునను గంభీరో త్సాహంబునను బొలిచి నిలిచె నంతకు మున్న యక్కడ.

127. క. మనవారును రణకౌతుక
జని[1]తోద్యమతీవ్రు లగుచు శకటవ్యూహం
బొనరించి[2]రి [3]యొప్పును బెం
పును దర్పము నుల్లసిల్ల భూవరముఖ్యా.

128. వ. అందు వలపట సింధురాజకళింగపతి[1]సంగతుం డయిన [2]వికర్ణుండును నతనికి దాపట నై చటులహయబహుళం బగుబలంబులతో నక్కెలన సౌబలుండును [3]డాపటఁ గృతవర్మవివింశతిచిత్రసేనసమేతుం డై దుశ్శాసనుండును నతనికిఁ

---

2. సైన్యంబు మనంబు – జ. ద. వ. వ. 3. నం గ్రాలంగ చక్రాకృతిన్ – బ. వ; దూరన్ గాల – చ. వ.

125. 1. తురగసంశోభియు నై – ష. శ; తురగసంశోభిత మై – ఔ; తురగ చటులత్వము నన్ – ల.

126. 1. రులు నభిమన్యు – పెక్కు ప్రతులు.

127. 1. తోద్ధతి తీవ్రు లగుచు – అ. గ. వ; తోద్యమదీప్తు లగుచు–హ; తోద్ధతి దీప్తు లగుచు – వ. 2. క్రొవ్వునుం బెంపును – ర. 3. యేపును – జ. ట. బ.

128. 1. సహితుం డయి, సమేతుం డై–అని పాఠములు. 2. కృపాచార్యుండును – ఔ. 3. దాపట – పెక్కు ప్రతులు.

గ్రాహై తత్పార్శ్వంబునఁ గాంభోజశకయవనమహీశ్వరులును నడుమం గ్రిగర్తమద్రదళిలకూరసేనదేశాధీశపరివృతుండును గుంభసంభవపురస్సరుం డును నై కురుభుండును నాముందట నంగజనపనచతురంగప్రధానసేనా సమాకీర్ణుం డై కర్ణుండును నిలిచిరి వెండియుం గల[4]వారల నెడ నెడం బన్ని రట్టియెడ.

129\. తే. దర్పదస్సహతేజు రాధాతనూజుఁ
డెక్క మై సైన్యముఖమునఁ బొలుచువాని
సైనికులు సూచి కడసంశసమున నేచి
యెలుఁగు లడరంగఁ దమలోన నిట్టు లనిరి.

130\. మ. అని రాధేయుఁడు పాండునందనులబాహాశక్తి వారించు నీ
తని దేవాలి యైన మార్గణునకె దుర్దాంతుండు భీష్ముండు పో
రినయన్నాళ్లును బాకపాకవును వారిం బట్టి [1]పాలార్చెఁ గా
క నిజం బగ్గ నితండు ధీరు [2]లగు డింకం జెల్లునే వారికిన్.

131\. వ. అని [1]యుబ్బుచుండి రివ్విధంబున సన్నాహంబు [2]సునిహితం బై నయనం తరంబ.

132\. చ. తగ మనసైన్య[1]ము గురుఁ డుదగ్రగతిఁ నడపింపఁ జొచ్చుడుఁ
గగనతలంబు నెత్తు[2]రులుఁ గండలు నెమ్ములు నొక్కయుమ్మడిఁ
[3]మొగిళులు లేకయుం గురిసె మొత్తము లై పెనుగ్రద్దలాడె బె
ట్టుగ [4]వినిచెన్ శివారుతము డుల్లెఁ గడుఁ వడి నుల్క లెల్లెడన్.

133\. తే. అమ్మహోత్పాతములకు భయంబు గొనక
కౌరవులు శంఖములు మ్రోయ భేరు లులియ

---

4\. వారలు గలయ నెడ నెడ – కొన్ని ప్రతులు.

130\. 1. పల్లార్చె – ఊ. 2. లగు డింకన్ – అ. ఆ. ఎ. ఏ. ఒ. ఔ. ఖ. ర.

131\. 1. యగ్గించుచుండిరి – ఈ. 2. సన్నిహితం బైన – అ. ఆ. గ. చ. ట. బ.

132\. 1. మగ్గురుడు – ఐ. ఔ. 2. ను – పెక్కు ప్రతులు. 3. మొగుళులు – శ. ష. సూ. కొన్ని ప్రతులు; మొగులులు – శ. 4. గడువీచె వాయుతతి – అ; గవిసెన్ – ఐ. ఓ. ఔ. జ. ర; నినిచెన్ – వ; విసరెన్ సమీరములు – ఝ. ద. బ.

నగ్గలిక సేన నడపించి రంత సమద
గమనమున వారి[1]సేనయుఁ గదియ నడచె.

134. వ. అప్పుడు.

135. క. నరుఁడును రాధేయుఁడు నొం
డొరువులతోఁ బెనఁగు వేడ్క లుల్లంబులలోఁ
గరువులు వాఱఁగ [1]నిలిచిరి
యిరుదెఱఁగుల [2]సైనికులకు నేత్రైక [3]మిగులన్.

136. తే. ఇట్టు లొండొంటిఁ గదియంగ నేమి నడచి
బలము లొక్కింతసేపు నిశ్చలతఁ [1]బొలిచె
[2]మవ్వ మెసఁగువనంబుల [3]మావు లెంత
[4]యైనఁ జెలు[5]వారఁ [6]సొగసి యున్నట్ల పోలె.

137. క. తదనంతరంబ ద్రోణుం
డుదితార్కునిఁ గేణిసేయు నుజ్జ్వలరథ మె
ల్ల[1]దిశలు వెలిఁగింపఁగ బె
ట్టిదముగ మును గవిసె మొన గడిమితోఁ గదియన్.

138. క. మసబలము [1]గదియుబలుఁ బిడిఁ
గనుఁగొని యర్జునుఁడు [2]దొలుతఁ గవియఁగఁ బేరు

---

133. 1. మొనయును - అ. ఇ. ఈ. ఉ. ఊ. ఎ. ఏ. ఐ. ఒ. ఔ. క. ఝ. డ. త. ద. ప. ర. ల. స. హ.

135. 1. బొలిచిరి - అ. ఆ. ఇ. ఈ. ఉ. ఊ. ఏ. ఓ. ఔ. క. ఖ. గ. ఘ. చ. త. బ. మ. య. ర. శ. ష. 2. వారు జూడ నేత్రైర - హ. 3. నిగుడన్ - ఘ. శ. ష.

136. 1. బొందె - అ. బ. 2. మవ్వమగునుపవనముల - ఎ. 3. మావులింత - ఒ. ఔ; మావులింత - పెక్కు ప్రతులు. 4. నలవుదళు కొత్త సొగసి యున్నట్లు - ఐ. 5. వేది సొగసి - అ. చ. శ. 6. నాగి యున్నట్లు - ఊ. ఎ.

137. 1. దెసలు - పెక్కు ప్రతులు.

138. 1. గవియ - పెక్కు ప్రతులు. 2. దొలుత గదలగ బేరుక్కన - ఇ. ఈ. ఎ. ఒ. వ. హ

బ్బునఁ దాఁకె వారిసైన్యము
వినువీథి నమర్త్యగణము వేడుకఁ [3]జూడన్.

139. సీ. రథకరితురగోత్థ పృథివీపరాగంబు దెసల నాకసమున దీటుకొనఁగ
బాణాదిహేతిసంపాత[1]జాతము లగుమంట లర్కాంశుల [2]మరలఁ ద్రోవ
[3]హస్తికపాలరథావయవములు భగ్నము లగురవము లుగ్రముగఁ జెలఁగ
వివిధ సేనాంగాంగవిదళనంబునఁ గ్రమ్మ రక్తపూరములు ఘోరంబు గాఁగఁ

తే. గలయ బెరసినపాండవకౌరవప్ర
చండసైన్యద్వయంబు నుద్దండసమర
గతులు వెక్కస మొనరించె ఖచరసాధ్య
సిద్ధులకు నను[4]బోటులకుఁ జెప్ప నేల.

140. వ. ఇవ్విధంబునం దొడంగి చెల్లు సంకులసమరంబునం దనకనకరథం బరుణతురంగంబుల చటులచిత్ర[1]సంచారంబులం గొలిపి త్రిప్పిన తెఱంగున [2]నెక్కు సూచినం దానయై పెక్కురథంబు లనుబుద్ధి పాండవపాంచాలయోధులకుఁ బట్టినట్లుగా విహరించి వివిధ విశిఖ[1]నిచయంబులు నిగిడించుచుఁ గుంభసంభవుండు.

141. క. కూల్చుచు గజముల నెత్తుటఁ
దేల్చుచుఁ దురగముల వీఁకఁ [1]దేరులు మరలన్
వెల్చుచుఁ గాల్బలములఁ బోరి
మాల్చుచు [2]రౌద్ర[3]ముగ మారిమసఁగినభంగిన్.

---

3. బొగడన్ - ఇ. ఒ.

139. 1. జాలము లగు . కొన్ని ప్రతులు. 2. మగుడద్రోవ - ఇ. ఐ. 3. నస్థికపాల - కొన్ని ప్రతులు. 4. బోటికి - అ. ఇ. ఈ. ఉ. ఊ. ఎ. ఏ. ఐ. ఒ. ఔ. క. ఘ. చ. ఝ. ఠ. డ. త. ప.

140. 1. ప్రచారంబుల - ఒ. ఓ. 2. నెక్కడ - పెక్కు ప్రతులు. 3. నికాయంబులు - కొన్ని ప్రతులు.

141. 1. దెరలుచు - ఇ. ఊ. ఎ. ఏ. ఒ. వ. శ. ష. స. క్ష; దేర్చుచు - శ. ర. 2. కుంభజుడు మారి మసగిన - ద. ప. 3. మున - కొన్ని ప్రతులు.

142. వ. సంగరక్రీడ సలుపు నయ్యవసరంబున.

143. క. సాయవడు రథచయంబులు
సాయకహతిఁ జెదరుఁ బ్రళయ జలధర పటుగ
ర్జాయతతర్జనలీలఁ బ
లాయిత మగు పాండు[1]సుతబలంబు నరేంద్రా.

144. క. పొదువుచు విచ్చుచు బలువిడి
నెదురుచుఁ బాయుచును మఱి మహీభాగము గ్ర
క్కదలం గార్ముకవిద్యా
విదుఁ డగుగురుతోడఁ బోరె వివిధబలంబుల్.

-: ద్రోణుఁడు పాండవసైన్యంబుపైఁ గ్రేఁగి దివ్యాస్త్రంబులశక్తి సూపుట :-

వ. 7_13_1

145. వ. అట్టి యెడ నాచార్యుం డసమానశౌర్యంబును [1]మాననీయదోస్సారంబును దివ్యాస్త్రప్రభావంబును జూపినం గౌంతేయసైన్యంబునందు.

146. సీ. తఱుచుగాఁ దెగిపడ్డ ధవళచామరములు డిండీరములయొప్పుఁ బుండరీక
ములు మరాళంబులపొలుపును గరవాలములు మీనభంగియుఁ దలలు శిలల
చాడ్పును దేశముల్ శైవాలరేఖయు మాంసంబు పంకసమానతయును
దాల్ప భటాశ్వమాతంగాంగభగ్నరథముల తిట్టలు [1]పులినములు గాఁగఁ

తే. [2]ధీరవరకోటి ద్రెళ్ళిన వీరతతికి
సంభ్రమము పుట్ట సంకృతోత్సాహలీల
నబ్బి భూతబేతాళంబు లోలలాడ
నిట్టలం బగు నెత్తురుటేరు పఱచె.

---

143. 1. సుతుల బలము – కొన్ని ప్రతులు.

145. 1. మహనీయ – అ. త.

146. 1. పులినములు – పెక్కు ప్రతులు; సైకతములు – వా. 2. ద్రెళ్ళ నపుడు ధర మీద దేవతతికి సంభ్రమము – అ. ణ. చ; వీరకోటీరరత్నముల్ వెలయ నిసుము చందము వహింప సంభ్ర – ఓ; వీరభటకోటి తగ్రాహావితతి గాగ – గ. ట.

147. వ. అప్పుడు.

148. తే. గగనమధ్యంబునకు వచ్చి ఖరకరుండు
దేఱి [1]చూడంగ [2]రాక యుద్దీప్తుఁ డగుచు
నెట్లు వెలుఁగొందు ద్రోణుండు నట్ల వెలుఁగు
చున్నఁ [3]గనుఁగొని ధర్మజుం డురవడించి.

149. వ. ధనంజయ ధృష్టద్యుమ్నుల నాలోకించి యమ్మహావీరు వారించుటకు నియో గించిన.

150. శా. చంచత్తుంగతురంగ[1]సత్వరగతి [2]స్ఫారీభవత్కేతనో
దంచద్దీప్తులు [3]ప్రజ్వరిల్ల నతిసాంద్రం బై [4]శరశ్రేణికా
సంచారంబు నితాంతఘోరముగ నాచార్యుఁ బడిం దాఁకె న
ప్పాంచాలక్షితి[5]పాలనందనుఁడు శుంభద్వీర్యసంరంభుఁ డై.

151. వ. తదనంతరంబ.

152. క. నరుఁ డగ్గలికం దఱుముచుఁ
బురికొలిపిన గండు మిగిలి భూరిబలంబుల్
గురునిఁ బొదివె [1]నప్పార్షతు
నరదమునకు మించి రభస మత్యుగ్రముగన్.

153. క. పొదువటయుం గనుఁగవఁ గెం
పొదవఁగ [1]మెయి వొంగి ద్రోణుఁ [2]డున్మదలీలం

---

148. 1. చూడను – ఇ ఈ. కొన్ని ప్రతులు. 3. రాకయు దీప్తు డగుచు – ర; రాకయు దీర్ణు డగుచు – ఊ. ఎ. ఏ. ఝ; రాకప్రదీప్తు డగుచు – ర. 3 గని ధర్మజుడు వడి నురవణిం(డిం)చి – వ.

150. 1. సంగర – వ. 2. స్ఫాయల్లసత్కేత – వ. 3. నుల్లసిల్ల – ఉ. ర. 4. నర, రథ–అని పాఠములు. 5. నాథ – కొన్ని ప్రతులు.

152. 1. నప్పార్షదు నరదము – ఐ. ఒ. ఓ. గ. శ. ష.

153. 1. మై వొంగ – ఇ. ఉ. ఊ. ఎ. ఓ. ఖ. గ. ఘ. ట. ఠ. ణ. ద. ప. బ. 2. డున్మద లీలన్ – ర; డున్మత్తగతిన్ – పెక్కు ప్రతులు; డున్మత్తుగతిన్ – వా. వీ.

దదనీకములఁ [3]గలంచుచు
ముదకం డయ్యును గుమార[4]మూర్తిం బోలిచెన్.

154. క. విను మప్పుడు [1]నిజశక్తుల
కనురూపము గాఁగ నిలిచి యుద్దేస[2]పిరుల్
[3]వెనఁగిరి రథ్యంబులు నా
తనిసూతుని మేను శోణితం[4]బునఁ దోఁగన్.

155. క. [1]గురుఁ డలిగి వెలుచ నడరినఁ
గరిఘోటకభటనికాయకాయముల సమి
ద్ధరణి వొలిచె నరుణపయో
ధర[2]సంవృత మైనగగనతలము [3]చెలువునన్.

156. క. అప్పుడు ధృష్టద్యుమ్నుఁడు
నిప్పు లురుల [1]చూపు లడర నిశితాస్త్రములం
గప్పె గురునిఁ దత్సైన్యం
బొప్పరి తన బెట్టిదంపు[2]టురవడిఁ [3]దెరలన్.

157. క. ద్రోణుని శరములు నిలుపుచు
బాణవితతి సేనమీఁదఁ బరగించుచు గీ

3. గలంచెన్...మూర్తియ(యు)పోలెన్ – కొన్ని ప్రతులు; నలంచుచు – వ.
4. మూర్తి వెలింగెన్ – అ.

154. 1. నిజశక్తుల – ఐ; గురుశక్తుల – ఒ. ఓ. య. ర; కలశక్తుల – ఖ. గ. ఝ. ట. ణ. బ. వ. హ; కులశక్తుల – వా. 2. బిరుదుల్ – క. ర. 3. నిచిరి నారాచము లాతని – ఈ. 4. బులు దొరగగన్ – కొన్ని ప్రతులు.

155. 1. గురు డగ్గలిక నన్నదరిన – గ. చ; గురు డగ్గలిక నెన్నదిరిన – ట. 2. సంభృత మైన – ఆ. ఈ. ఉ గ. ఝ ణ. త ప. బ. ర. శ. ష. 3. విధమునన్ – పెక్కు ప్రతులు; ను బోలెన్ – ఊ. ఏ. ఓ. త.

156. 1. చూడ్కు లడర – ఈ. ఊ. ఎ. ఏ. 2. టురవడి – పెక్కు ప్రతులు. 3. దర లన్ – ఆ.

ర్వాణనుతు లెసఁగ నతఁడ
క్షీణోద్ధతి [1]నట్లు సమరకేళి సలుపఁగన్.

158. క. ఏచినరథికవరులు ధను
రాచార్యునియిరుగెలంకులందుఁ దఱిమినం
జూచి వడి సవ్యసాచి శ
రాచితదేహులుగఁ జేసె నందఱఁ [1]గడిమిన్.

159. వ. ద్రోణుండు పదిబాణములు ద్రుపద[1]సూనుమేనం గీలించినం దూలక యతం
డతనిపై నిశితవిశిఖవర్షంబు గురిసె నయ్యుభయవీరశరనికరంబు లంబరంబు
[2]గప్పె నట్టియెడఁ బాండవాగ్రజపురోగములగుదొరలు గడంగి కుంభసంభవు
దెసకుం దఱిమిన మనవలసిఘనయోధవరులు వారిం దలపడి రందు శకుని
సహదేవుం దాఁకి.

160. మ. తురగవ్రాతము నొంచి కేతువు వేసం ద్రుంపంగ నాతండు గ్రో
ధ[1]రయం బుగ్రము గాక యుండియును గాంధారేశు వీతధ్వజుఁ
విరథుఁ విస్ఫురితాస్త్రముట్టితునిఁ గావింపఁ గదాఖిలమూ
ర్తి రథం బుద్ధతి [2]డిగ్గ పాఱి యతఁ డుర్విం గూల్చెఁ దత్సారథిన్.

161. క. సహదేవుండును గద గొని
మహి [1]కెరఁగినయప్పు డొప్పె మనుజేశ్వర య
మ్మహితసుభటయుగము శిఖర
సహితమహాశైల[2]యుగ్మసదృశాకృతి యై.

162. క. వింశతిశరముల నేసె వి
వింశతి నని నఁ జుఁ డతండు వీఁక నగుచుఁ ద

---

157. 1. నిట్లు - పెక్కు ప్రతులు.

158. 1. బెలుచన్ - ఈ.

159. 1. సుతు - ఖ. డ. ణ. ద. న. ప. వీ. 2. నంబర్వె - ట. ర.

160. 1. రయంబు - పెక్కు ప్రతులు; రసంబు - జ. వా. వీ. ష. 2. డిగ్గి చేరి(వచ్చి, సాగి) - అని పాఠములు.

161. 1.కినురికి - ఖ. గ. ఝ. 2. యుగళ సదృశ - పెక్కు ప్రతులు.

[త్ర్యాంశుఘనర్గండము రెం
డంశములుగ నేసె వెడఁదయన్నునఁ జెలుచన్.

163. సీ. మనబల మార్గినఁ గినిసి భీముఁడు గద నతనియశ్వంబుల నవనిఁ గూల్చె
భూరిశ్రవుఁడు పొలుకారి ధృష్టద్యుమ్నుఁ గప్పె నస్త్రముల శిఖండి యేచి
యాతని నిలునిలు మని తాఁకి శరవృష్టిఁ బొదివె పిశాచముల్ పూనుతేరు
లెక్కి కప్పారెడు [1]నెలువుచర్మపుఁ గత్తళములతో ఖరనిస్వనములు సెలఁగ

తే. నసురవల్లభు లగు[2]నలంబుసఘటోత్క
చులు సముద్ధతిఁ దొడరి మాయలు వొనర్చి
పేర్చి యిరు దొరు నొంచుచు బెనఁగి పెనఁగి
తెల్లముగఁ [3]జూడఁ జూడ నద్భుతము లైరి.

164. వ. అయ్యవసరంబున,

165. సీ. తత్త్రచేవుండు లక్ష్మణుతోడ సంగరంబు సేసె నుగ్రంబుగఁ జేకితానుఁ
[1]డనుపండుఁ దలపడి యద్భుతగతిఁ బోరె శల్యుండు నవ్వుచు శరచయమున
నకులు నొంచినఁ గేఁడము నాతపత్రంబు వెసఁ ద్రుంచి [2]యాతని
విరథుఁ జేసి
శంఖంబు పూరించె శారద్వతునిమీఁద ధృష్టకేతుఁడు సత్తతిప్రదీప్త

తే. విశిఖములు నింప నతఁడస్త్రవృష్టి [3]పెల్లు
గురిసె సాత్యకికృతవర్మ యురము నారి
సముల నొప్పించి డెబ్బదిసాయకంబు
లేయ డెబ్బది[4]యేడమ్ము లేసె నతఁడు.

166. క. సేనాపతి యగుద్రుపద
తనూనాథసనూభవుఁడు సుశర్మనిమగ్న

---

163. 1. నెలుగు చర్మపు – పీ శ. ష. పెక్కు ప్రతులు. 2. నలంబస – పెక్కు ప్రతులు. 3. నెల్లజూడ – ర.

165. 1. డాచార్యుసుతుతోడ – గ. చ. జ. ట 2. యత డుబ్బి – అ. ఇ. ఉ. ఊ. ఎ. ఏ. ఏ. క. ఝ. ఠ. డ. న. ప. ర. వ. 3. పెలుచ గురిసె–ఝ. స. 4. యేనమ్ము – కొన్ని ప్రతులు.

స్థానంబు నొంచె హాతఁడ
దీనుం డై యతని జిత్రదేశం బేసెన్.

167\. చ. బలమును దాను మత్స్యనరపాలుఁడు గర్ణునిఁ దాఁకి రెండుసే
నలు వినుతింప [1]నుద్భటరణం బొనరించినఁ [2]గంటిక్రేవఁ గెం
పొలయఁగ నీతనూభవుల కుబ్బుగఁ దద్రథ[3]దంతిఘోటకం
బుల నుఱుమాడె నారథికపుంగవుఁ డంబరచారు లార్వఁగన్.

168\. క. వేడుకమై దలపడి పో
రాడిరి ద్రుపదభగదత్తు లస్త్రబలము శౌ
ర్యాడంబరమును నెఱుఁగులుఁ
జూడను [1]వినఁ జిత్రములుగ శుంభద్భంగిన్.

169\. సీ. పౌరవుం డభిమన్యు [1]బలువిడిఁ దాఁకి బాణాసారమున [2]ముంప నతఁడు గినిసి
యతని ధనుఃకేతనాతపత్రంబులు ద్రుంచి [3]యేనింటఁ దత్తురగములను
సారథి నొప్పించి శరము లేడిట ద్రుక్కఁ జేసి దర్పంబున శిరము ద్రుంచు
టకు [4]భల్ల మరిఁ బోయుటయుఁ గృతవర్మ రెండమ్ముల విల్లు
నయ్యమ్ము దునిమెఁ

తే. బలుకయును వాలుఁ గొని నరుపట్టి గవిసి
పౌరవునిరథ్యముల నేలపాలు సేసి
[5]యుఱికి [6]సూతునిఁ బడఁ దన్ని యురగవిభునిఁ
బట్టు[7]గరుడునిక్రియఁ దల వట్టి కొనియె.

---

167\. 1. నద్భుత – అ. ఆ. ఇ. ఐ. ఓ. ఖ. గ. చ. జ. ణ. త. వ. వీ. శ. ష. 2. చూచి కంటికెం – ఓ. 3. సూత ఘోటక – అ. ఆ. ఔ. చ. డ. వీ. శ. ష. స. శ; పంక్తి ఘోటక – వ.

168\. 1. విన విచిత్రమైన శుంభద్భంగిన్ – హ.

169\. 1. పైకి లంఘించి బాణా – న. 2. గప్పి – ఇ. న. 3. యేడింట – అ. ఇ. ఝ. ద. వ. 4. భల్ల – పెక్కు ప్రతులు; శర – వా. వీ. శ. ష. 5. యురక సూతుని – ఇ. ఈ. ఖ. ద. న. వ. 6. సారథి – చ. వ. శ. ష. 7. గరుడని – కొన్ని ప్రతులు.

170. వ. ఆలోనసైంధవుండు[1] సంభ్రమంబున శాతకృపాణ[2]చర్మంబులు గొని రథంబు డిగ్గ నుఱికి రయంబున [3]నెయిది యదల్చినం గని జనకద్వేషి యగునతని [4]వలనిరోషం బగ్గలింప నా పురందరపౌత్రుండు పౌరవుని విడిచి యద్దెసకు లంఘించి కవిసె నప్పుడు.

171. తే. వికట[1]విస్ఫురదసిచర్మవివిధచిత్ర
గతులు చూపఱయెడఁద కద్భుత [2]మొనర్ప
నార్జునియు సింధురాజుఁ బహ్వాభిరామ
సింహశార్దూలగతి విలసిల్లి రథిప.

172. వ. అట్టియెడ.

173. క. అఱిముఱి వ్రేసినఁ బలకం
గఱచినసైంధవునియలుఁగు గని నరసుతుఁ డే
డ్తెఱ మఱిసిన నది రూపఱి
[1]విఱుగుటయును వెస నతఁడు వెనుకకు విఱిగెన్.

174. క. విఱిగినచో నిలువక [1]వెఱ
నుఱికెం దనరథము మీఁది కోడితి పోపో
పిఱికి యని పలికి నుఱుముగ
నఱికెం దత్సేన బార్థనందనుఁడు వడిన్.

175. క. తెఱలిన సైంధవుఁ గని నృప
వరు[1]లుపలువు రొక్కపెట్ట వాసవిసుతు పై

---

170. 1. డు ససంభ్రమంబున – కొన్ని ప్రతులు; డుసన్నద్ధనిశాత – హా. 2. వర్మంబులు – అ. ఊ. ఏ. వ. హా. 3. నెగిరి – హా; గదిసి – ఊ. ఏ.; నెదిరి – ఆ. జ. ట. ణ; నంటి – ద. వ. 4. వలన – పెక్కు ప్రతులు.

171. 1. నిష్ఠురతర చర్మ – ఎ. ఐ. 2. యొనర్ప – పెక్కు ప్రతులు; మునేయ – వా.

173. 1. విరిగె నతడు నిలువలేక వెనుకకు నరిగెన్ (బరచెన్, జరిగెన్) – అని పాఠములు.

174. 1. వెస నురికెన్ – కొన్ని ప్రతులు.

175. 1. లందరు నొక్క (మొగిని) పెట్ట – అని పాఠములు.

నురవడిఁ దఱిమురి మద్రే
శ్వరుఁడు గదిసి [2]దీప్తశక్తి వైచెం బెలుచన్.

176. క. ఉరగాంగన [1]నలిఁ బట్టెడు
గరుడునిక్రియ శక్తి [2]పట్టి క్రమ్మఱ వైచెన్
నరసుతుఁడు శల్యసూతునిఁ
బొరివోవఁగ నార్చెఁ బాండుపుత్రబలంబుల్.

177. వ. అయ్యవసరంబున విరాటుండును ద్రుపదుండును ధృష్టకేతుండును యుధిష్ఠి
రుండును సాత్యకియును కేకయపతులును భీమసేనుండును ధృష్టద్యుమ్నుం
డును శిఖండియుం గవలును ద్రౌపదేయులును సౌభద్రుం బొగడు నెలుం
గులు సింహనాదంబులు నింగిముట్ట నతనికి నుల్లాసంబును నీకొడుకులకు
రోసంబును జనియింప నతనిఁ బరివేష్టించిన తద్విజయంబు సైరింపక కూడు
కొని నీకొడుకు లతనిపైఁ బటుశరంబులు గురియ నక్కుమారసంతతికి
సంతసంబుగా శల్యుండు గదగొని యభిమన్యున కభిముఖుండై [1]కవిసె ననిన
విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

178. తే. ఎక్కటెక్కటి పెనఁగిన నింతవట్టు
పెనఁకువలు [1]నిట్టు లేచునే పృథివి నింక
జనము లీకురుపాండవసంగరంబు
సెప్పికొంద్రు [2]మనంబు లచ్చెరువు నొంద.

179. క. [1]అని సొంపు వినియు నాకుం
దనివి సనదు శల్యపార్థతనయులసమరం
బున తెఱఁగు సెప్పు మేర్పడ
ననవుడు సూతసుతుఁ డిట్లు లనుఁ బతితోడన్.

---

2. తీవ్రశక్తి - వ; సప్తశక్తి - వ.

176. 1. వడి - వ. 2. చమరి - శ.

177. 1. నడచె నని - ఔ. పీ. శ. ష.

178. 1. పీనులకు నింపు పెనిచె నింక; వీనులిట్లించు ననఘ యింక - అని పాఠములు.
2. మనంబులు చెవులు నిండ - వ.

179. 1. అని చెప్ప వినియు - ణ. త. ప. వ; అనిశంబు వినియు - ట.

-: భీమసేనశల్యుల గదాయుద్ధము :-

వం. 7-14-4

180. ఉ. అమ్మెయి సూతుఁ డీల్గుటయు నగ్గలికన్ గద వుచ్చికొంచు రౌ
ద్రమ్మున వచ్చుశల్యుఁ గని తానును జండ[1]గదావిలాసనో
గ్రమ్ముగ లీల మార్కొనియె రమ్మిట రమ్మనుచున్ సమస్తసై
న్యమ్ములుఁ బిచ్చలింపఁగ సురాధిపపౌత్రుఁడు దీప్తగాత్రుఁడై.

181. ఉ. అంతకు భీమసేనుఁడు రయం బెసఁగం [1]గద నెయ్యిపట్టి య
త్యంత[2]బలంబు మైఁ బిఱిఁది కాతనిఁ ద్రోచి కనద్గదాపరి
[3]భ్రాంతి వెలుంగ నిల్చినఁ దిరం బయి శల్యుఁ డుదాత్తరేఖఁ గా
లాంతకదీప్తమూర్తి యగునాతనిఁ దాఁకె [4]బలంబు లార్వఁగన్.

182. వ. అట్టియెడ.

183. క. ఇతనికి నితండ యితనికి
నితఁ[1]డ యెదురుఁ గాక యొరుల కీయిరువురయు[2]
ద్ధతి కెదుర వశమే యను వా
ర్తతియును దూర్యస్వనములు గడుఁ [3]బెల్లెసఁగెన్.

184. వ. ఇట్లు దలపడి శల్యసమీరనందనులు మండలప్రచారంబులను విచిత్రగదా
[1]ప్రసారణంబులను మెఱయుచు.

---

180. 1. గదానుశాసనోగ్రమ్ముగ - హ.

181. 1. దగ చేయిపట్టి - అ. ఆ. చ. ల; సుతు నెయ్యిపట్టి - ఈ. హ; దగ (వెస) నేగు డెంచి- ఉ. ర. వ. 2. బలంబు - కొన్ని ప్రతులు; రయంబు - వా. కొన్ని ప్రతులు. 3. శ్రాంతి - ఎ ఔ. చ. త. ద. ల. వ; క్రాంతి - హ. 4. సురల్ నుతింపగన్ - వ.

183. 1. డేసరి కాని యన్యు లీయిరువుర - ఖ. వ. 2. నుద్ధతి నెదుర - శ. ష. పెక్కు ప్రతులు. 3. బెల్లగసెన్ - ఊ. ఏ. ఐ. వ. హ.

184. 1. ప్రహారణంబులను - ఒ. గ. వ. వీ. శ. ష. స.

185. మ. గద లన్యోన్యసమాగతిన్ [1]మిడుఁగుఱుల్ [2]గ్రక్కంగ [3]సారించుచుం
గదియం [4]బాయఁగ వ్రేటు దప్ప నుసలంగా [5]నేర్పు లంగంబులం
దొదవన్ ఘోర[6]పరస్పరప్రహతు లత్యుగ్రంబుగా [7]నెత్తురుల్
సెదరింపం బదశబ్దహుంకృతులు దిక్సీమంబులన్ [8]దాఁటఁగన్.

186. క. పోరెడునప్పుడు లావును
వీరోద్రేకంబుఁ జలము వెరవును సరియై
మారుతియు మద్రపతియు ను
దారగతుల మెఱసి రమరతతి వినుతింపన్.

187. వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు పెనంగి.

188. క. అఱిముఱి నొండొరు వ్రేసిన
నెఱకులు [1]దాఁకుటయు నొచ్చి నేల కొఱగ వి
ట్టిఱి యాసుభట[2]ద్వితయము
వెఱచఱచి బలద్వయంబు వెగ[3]డందంగన్.

189. వ. అయ్యవసరంబున.

190. క. కృత[1]వర్ముఁడు మద్రమహీ
పతి గ్రక్కున గ్రుచ్చియెత్తి పాయంగొని యు
ద్ధతి[2]వాయఁ జనియె మారుత
సుతుఁ [3]డాలోఁ దెలిసి లేచి శోభిల్లెఁ గడున్.

---

185. 1. మిణుగురుల్ - కొన్ని ప్రతులు. 2. గ్రమ్మంగ - ఊ. ఏ. క. 3. వారించుచున్, దా మెచ్చుచున్ - అని పాఠములు. 4. బాయుచు - ఆ. ఏ. క. ద. స. శ; బారుచు- ఇ. ఎ. ఝ. డ. ర; బోయిన - స. శ. 5. నుబ్బుగాత్రంబులన్ - హ. 6. పరంపరాప్రహతు - త. 7. రక్తముల్ - వీ. శ. ష. కొన్ని ప్రతులు. 8. పర్వగన్, గప్పగన్ - అని పాఠములు

188. 1. నాటుటయు - వ. 2. ద్వయమును - న. 3. డొందంగన్ - కొన్ని ప్రతులు.

190. 1. వర్మయు - కొన్ని ప్రతులు. 2. మాయ జనియె - కొన్ని ప్రతులు; తోడ జనియె - ఆ. జ. ట త. వ; తొలగ జనియె - ఓ. ఖ. 3. డంత దేరి - ఊ. ఎ.

191 క. గద సారించుచు [1]జయమునఁ
బొదలు నతనిఁ జూచి నీదుపుత్త్రులు గోపం
బొదవ [2]నడరి రుద్భట[3]గతి
మదవత్కరిచటులరథసమాజంబులతోన్.

192. వ. [1]ఇట్లడరి వివిధాస్త్రశస్త్రంబు [2]లేయుచుం బొదివిన.

193. మ. కవలుం దానును నేచి [1]యుద్ధురగతిం గాంగేయముఖ్యుండు వీ
రవరానీకము [3]వీఁకఁ గూడికొని సంరంభంబు శోభిల్లఁ గౌ
రవసంఘంబుఁ గలంచినన్ [3]విఱిగె దర్పం బేద నీసేన [4]య
బ్దవితానంబు మహాసమీరణనిరస్తం బైన చందంబునన్.

194. వ. అంత నపరాహ్ణం బయ్యె నప్పుడు శంఖభేరీమృదంగాదితూర్యస్వనంబులు సెలంగ సింహనాదంబులం బేర్చిన పాండవసేనం జూచి వృషసేనుండు రోషావేశభీషణుం డై మార్కొని మార్గణనికరంబులు నిగిడించిన.

195. మ. కరిగాత్రంబుల ఘోట[1]కాంగకములం గప్పెన్ సవి ద్యోమి య
చ్చెరు వై యుండఁగ రథ్యసూతరథికశ్రేణీవపుఃఖండముల్
దొరఁగెం దుత్తుము రయ్యెఁ గార్ములము లస్తోకప్రవాహంబు లై
పరగెన్ రక్తనదుల్ [2]పిశాచకుల మంతఃకేళిలోలంబుగన్.

196. తే. కర్ణనందనుఁ డిట్లత్యుదీర్ణభంగిఁ
బాండురాజతనూజుబలము నెల్లఁ

---

191. 1. రయమున – కొన్ని ప్రతులు. 2. నడచి – ఊ. ఎ. ఏ. ఘ. 3. హరి మద – పెక్కు ప్రతులు; హయ – వ.

192. 1. ఇట్లు దరిమి – య. 2. లు గురియుచు – పెక్కు ప్రతులు.

193. 1. యుద్ధతగతిన్ – కొన్ని ప్రతులు. 2. నొక్కపెట్టరణ(కడు)సంరంభ – అ. చ. ట. ణ; తోడ గూడికొని – ఓ. ఖ. గ. వ. 3. విరిసె – ద. న. వ. శ. ష. 4. యభ్ర వితానంబు – శ. ష. పెక్కు ప్రతులు (యతి తప్పినది).

195. 1. కాంగములనున్ – శ. ష. కొన్ని ప్రతులు. 2. పిశాచిచయ – య, పిశాచచయ – కొన్ని ప్రతులు.

గనుపుగొట్టంగఁ [1]జొచ్చినఁ గినిసి నకులు
నాత్మజుండు శతానీకుఁ డతనిఁ దాఁకి.

197. క. వాలమ్ములు [1]పది మేనం
గీలించిన నాతఁ డతనికేతనము ధరం
గూలిచి చాపముఁ ద్రుంచిన
నాలోనన ద్రౌపదేయు లందఱుఁ బెలుచన్.

198. వ. తోడంబుట్టువునకుం దలకడచి వివిధశిఖంబుల వృషసేనుం గప్పిన నశ్వత్థామ ప్రముఖులై [1]కడిసి కౌరవానీకంబు శతానీకునిం దత్సోదరుల ననేకక్రూరాస్త్రనిచ[2]యావృతులం జేసినం గని కౌంతేయాగ్రజుండు గడంగి కేకయమాత్స్యపాంచాలప్రభృతిబలంబులతో నురవడించిన సురాసురసంగ్రామ సన్నిభసమరం బయ్యె నందు భీమకర్ణకృపద్రోణద్రౌణిధృష్టద్యుమ్న విరాటులు ప్రతాపదీపితులై మార్తాండుండు సప్తమూర్తులు దాల్చి ధరణి విహరించినట్లు [3]వెలింగిరి కొండొక సేపునకుఁ బాండవసేనాసాగరసంరంభంబు [4]సహింపఁజాలక మనమున దెరలి మరలినం జూచి యాచార్యుండు గోపాటోపంబును బటువిక్రమంబును నావేశింప నీసైనికుల నిలునిలు మని యదల్చి తూణీరంబు బిగియించి గుణంబు సారించి సారథితో ని ట్లనియె.

199. సీ. చలమేది కౌరవసైన్యముల్ వాఱెడు ధర్మనందనునియుద్దండవృత్తిఁ
గంటె యీతనిఁ దాఁకి గర్వంబు మాన్పక నిలిచిన నిమ్ముఁక నిలుచునెట్లు
ధర్మజభీమసాత్యకిమాత్స్యపాంచాల తత్తనూజులు నాకుఁ దరమె క్రీడి
చాపంబు వేఁవు నాచూపిన యదిగాదె విను మట్లు గాకయుఁ దనువు దాఁచు

తే. ననుయమే యిది సంభృతోత్సాహలీల
జయముఁ గీర్తియుఁ గోరి యస్ఖలితభంగిఁ

---

196. 1. దొడగిన - ఇ. ట. ద.

197. 1. వడి - కొన్ని ప్రతులు.

198. 1. కవిసి - పెక్కు ప్రతులు. 2. యని పీడితులం జేసిన - కొన్ని ప్రతులు. 3. వెలుగొందిరి - మ. 4. సైరింప జాలక - పెక్కు ప్రతులు.

దేరు [1]నడుపుము చేతులతీఁట వోవ
నడరె రథికజనంబు [2]వేఁటాడవలయు.

-: ద్రోణాచార్యులు ధర్మరాజుతో యుద్ధంబు సేయుట :-
సం. 7-16-19

200. చ. అన విని మేను వెంచి రయ మారఁగ సూతుఁడు దేరు వోవ ని
చ్చినఁ గని వారిసైన్యములు చెచ్చెర ధర్మజు మించి త్రోవఁ జే
ర్చినభుజసంపదం [1]గడఁగి సింధురలీలఁ దెరల్చి తాఁకె న
మ్మనుజవిభుం గురుండు పటుమార్గణ[2]సంపిహితాంబరంబుగన్.

201. క. తాఁకినఁ బోగడం దగియెడు
పోఁకం బతి ద్రోణు బాణవృతుఁ జేయ నతం
డాఁక గొనక యతనిధనువు
వ్రేఁకనిభల్లమున ద్రుంచి వెస డగ్గఱియెన్.

202. వ. [1]ఇట్లుద్ధతుం డై యగ్గురుండు పొంగినజలనిధియుం బోలెం గవిసిన ధర్మనం
దను చక్రరక్షకుం డగుసుకుమారుండు చెలియలికట్ట [2]తెఱంగున నిలువ
రించి నిశితశరం బతని యురంబున నాఁటించిన నప్పాంచాలవరుం బ్రశం
సించు నెలుంగులు నెలంగఁ బాండవబలంబులు పేర్చి యార్చిన.

203. క. పెనుగాలిఁ బెఱుగు కార్చి
చ్చునుబోలెం [1]బొదలి గురుఁడు సుకుమారునిఁగాం
చనపుంఖశరజ్వాలా
విని[2]పాతితుఁ జేసి తఱిమి విభు[3]నిం గదిసెన్.

---

199. 1. గడుపుము - ఔ. య. 2. చెండాడ వలయు - జ.

200. 1. సమదసింధుర - ఖ. య. ల; ప్రమద సింధుర - వీ. శ. మ. పెక్కు ప్రతులు.
2. సంభరితాంబరంబుగన్ - అ. ఆ. గ. జ. వ.

202. 1. ఇట్లుద్ధురుం డై - ఈ. త. హ; ఇట్లుద్దండుం డై - ఊ. ఏ. 2. చందంబున - పెక్కు ప్రతులు; బోలి నిలువరించిన - ర.

203. 1. పెరిగి - ఉ. ఖ; బొదివి - ఇ. ఐ. ఒ. శ. 2. హతుని - ఎ. హ. 3. నొప్పించెన్ - ఆ. ఈ; డగ్గరియెన్ - వ.

204. వ. అప్పుడు పాండవయోధు లొండొరుల [1]మీఱి యుధిష్ఠిరుముందఱికి వచ్చి యాచార్యుం బొదివిన నతండు నలిరేఁగి.

205. సీ. నకులుని నైదుసాయకముల[1]ద్రుక్కించి సహదేవు నేడింట సాధుఁ జేసి
నవవిశిఖముల మాత్స్యవరేణ్యు నడఁగించి యేనింట సాత్యకియేపు మాపి
ద్రౌపదేయుల [2]శరత్రయము[3]లఁ గలఁచి వింశతి నుత్తమౌజుని చలము[4]మాన్పి
పండ్రెండుపండ్రెండు పటు[5]మార్గణంబులఁ బాండవాగ్రజుని శిఖండి నొంచి

తే. మఱియు మార్కొన్న రథికుల మదము [6]సెఱచి
మెఱుఁగుఁదూపు లా ధర్మజు [7]మీఁద నిగుడ
నడర [8]నఱిమి యుగంధరుఁ డడ్డపడిన
నవ్వి యవ్విభుఁ దెగటార్చె నారసమున.

206. వ. అట్టియెడఁ గేకయపతులును బాంచాలనాథుండును దదీయజ్ఞాతు లగుసింహసేనవ్యాఘ్రదత్తులు లోనైనయోధు లనేకు లాచార్యుం బొదివి శౌర్యబాహువీర్యంబులు నెఱపి రందు సింహసేనుండును [1]వ్యాఘ్రదత్తుండును నెట్టన నానాస్త్రంబుల నొప్పించిన నాధనుర్ధర[2]గురుండు.

207. తే. కన్నుఁగవఁ గెంపు గదురంగఁ గౌరవులకు
[1]చిత్త మలరంగ [2]నావ్యాఘ్రదత్త సింహ
సేన మస్తకములు రెండు శితశరములఁ
గుండలంబులతో నేలఁ గూల నేసి.

---

204. 1. మిగిలి - ద.

205. 1. నొప్పించి - ఇ. ఈ. ఎ. ఔ. క. - కొన్ని ప్రతులు. 2. నిషు త్రయమున - వ. 3. న - కొన్ని ప్రతులు; గీలించి వింశతి - ఉ. జ. ట. ఠ. హ. 4. మాన్పి - ఎ. ఏ. ఓ. ర. హ. 5. నారసంబుల - ణ. 6. లణచి - హ. 7. మీఁద - వీ. శ. ష. స - పెక్కు ప్రతులు; మేన - వా. 8. తరిమి - అ. ఆ. ఇ. ఈ. - కొన్ని ప్రతులు; నడుమ - ఊ. ఎ. ఏ. ర. శ.

206. 1. వ్యాఘ్రఘవంతుండును - ఒ. ఓ. ఔ. ఖ. ఝ. 2. వరుండు - కొన్ని ప్రతులు.

207. 1. సంతసంబుగ - అ. ఆ. ఇ. ఉ. ర. పెక్కు ప్రతులు. 2. ఇచ్చట కొన్ని ప్రతులు 'వ్యాఘ్రవంత' అను పాఠమును గ్రహించుటచే యతి సమన్వయమైనది. మఱి కొన్ని ప్రతులలో పూర్వపు లేఖనసంప్రదాయమునుబట్టి పూర్వానుస్వారము తరువాత వచ్చు నక్షరమును ద్విత్వముగా గైకొని "సంత్తసమున" అన్నట్లు పాఠము గ్రహించి 'దత్త' శబ్దముతో ప్రాస యతిని పాటించినట్లు తోచును.

208. క. తక్కటి రథికుల [1]నెల్లను
చిక్కువడం జేసి పురుషసింహుండు మదం
బెక్క యుధిష్ఠిరుఁ బొదివెడు
నెక్కుడు [2]తనుకమునఁ గదిసె నేత్రైల మెఱయన్.

209. వ. అయ్యవసరంబున నాసైన్యంబుల జనంబులు.

210. క. అదె పట్టు వడియె ధర్మజుఁ
డదయుం డగుద్రోణుచేత నక్కట నేఁ డు
న్మదుఁ డై సుయోధనుఁడు [1]దం
ద్రి దలిర్పఁగ నేఁగు గఁపురికిఁ [2]గొని యెలమిన్.

211. వ. అనుచు సంభ్ర[1]మాకులచిత్తు లగుచు నున్నంత.

212. మ. ధరణీభాగము గ్రక్కునం గదల రథ్యాఘాతచంచ[1]ద్గతి
స్ఫురణం బొప్పఁగ బాణజాలము నభంబుం గప్ప నత్యంతని
ష్ఠురసంతర్జనఘోషభీషణమహాటోపంబు [2]దిగ్గంతు లా
తురతం బొందఁగఁ [3]జేరవచ్చి వడిఁ బార్థుం డగ్గురుం దాఁకినన్.

213. వ. కౌరవయోధవరు లొక్కపెట్ట భారద్వాజునకు బాసట యై ససైన్యంబుగా సవ్యసాచిం బొదివిన నవ్వీరుండు ఘోరాకారుం డయి గాండీవచండనిస్వనంబు లొండొండ నిగుడ నిశితసాయకపరంపరలు [1]గురిసి కపా[2]లోపలంబును మేదోమాంసపంకంబును నస్థిచూర్ణ[3]సికతంబును నగు శోణితనదీ[4]ప్రక

208. 1. నేకుల - గ. చ. ణ. బ. 2. మదమునను - క. ఝ. డ. ర.

210. 1. కోర్కి దలిర్పగ - హ. 2. మోదముతోన్ - ణ.

211. 1. మాకులిత - అ. ఇ. ఈ. ఝ; మాయత్త - ద. వ.

212. 1. ద్రథస్ఫురణంబు - క. జ. 2. దిగ్భిత్తు లా - పెక్కు ప్రతులు. 3. జేరవచ్చి - చ. జ. ఠ. ణ; జేయవచ్చి - వా. కొన్ని ప్రతులు.

213. 1. గురియించి - ఈ; నిగుడించి - ఇ. 2. ల కమఠంబును - అ. 3. సైకతంబును - ర. వ. వీ. శ. ష. హ. కొన్ని ప్రతులు. 4. ప్రవాహంబు - కొన్ని ప్రతులు.

రంబును బఱపె నంత గభస్తిమంతుం [5]డస్తశైలాంతరితుం డయినఁ బార్థబాణాంధకారంబునకుఁ దోడు సంధ్యా[6]సంతమసంబు గవిసినం గురుసైనికులకుఁ దమవారలు నెదిరివార లని నిరూపింప నశక్యం బగుటయు ద్రోణదుర్యోధనులు [7]సమరంబు సాలించి వాహినులఁ దివియించినం దిరంబై ధనంజయుండును జయతూర్యస్వనంబులును బాంచాలకేకయాది బంధుమిత్త్ర ప్రశంసావచనంబులును వీనులం బొలయఁ దనబలంబుల మరల్చి ధర్మనందనుం గొలిచి చనియె [8]నిట్లుభయగుడ రెండుసేనలు దమతమ విడివలల కరిగి యథోచిత వ్యాపారంబుల నుండి నాఁటిరాత్రి సనిన మఱునాఁడు.

214. క. రేపకడ [1]యుభయబలములు
నేపున నెలమియును నెసకమెసఁగ వెడలి యా
టోపంబున రణసజ్జా
వ్యాపక్రమలీల మెఱయ నుజ్జ్వలభంగిన్.

215. వ. ఉన్నసమయంబున లజ్జావిషాదంబులు మొగంబునం దోఁప ద్రోణుండు దుర్యోధనున కి ట్లనియె.

216. చ. నరవర మున్ను చెప్పితి రణంబున నర్జు[1]నుఁ డొద్దనున్న నె
వ్వరికిని ధర్మసూనుఁ బొదువంగ నశక్య మొకండు పార్థును
ద్ధరుఁ డయి నేల వాపికొని దోర్బల మొప్పఁగఁ బోవఁ జాలినన్
వెరవునఁ బట్టెదం బరులు వేవురు మార్కొనినం గలంచెదన్.

---

5. గిరిమస్తకాంతరితుం డైన - ఆ. ఖ. ప. వ. 6. సంతమసంబు - అ. ఆ. శ. పెక్కు ప్రతులు; సమయంబు - వా. 7. దురంబు సాలించి - ఆ. ఇ. ఈ. ఎ. ల. కొన్ని ప్రతులు; దివిపించిన - క. ఘ. ఝ. డ. ర; దివియం బంచిన - ఉ. శ. ల; వా; దివియ నియమించిన - ఇ. ఈ. ఐ. 8. నిట్లు సేనలు రెండును - పెక్కు ప్రతులు.

214. 1. నుభయ - వీ. శ. ష.

216. 1. ను తోడనున్న - ఊ; ను దుండె నేని - గ.

-: ద్రోణాచార్యుల రెండవనాటి యుద్ధము :-

సం. 7_16_3

217. ఆ. నరుఁడు లేనిచోట ననుఁ గని వెన్నిచ్చి
పాఱకున్నఁ బట్టు[1]వడియెఁ గాఁగఁ
దలఁపు ధర్మపుత్త్ర ధరణీశ పాఱుట
గలిగెనేని [2]నంతకంటె మేలు.

218. వ. అనిన విని సుశర్మ దుర్యోధనున కిట్లనియె.

219. క. ఆనరుఁ డెప్పుడు మము నవ
మా[1]నించుచు [2]నునికిఁ జేసి మనుజేశ్వర కో
పానలము సంతతము మా
మానసములఁ [3]బొదువ నతని మార్కొను కడఁకన్.

220. వ. [1]తమకించుచుందుము నీకు బాస యిచ్చి పెద్దకాలం బయ్యె నేఁడు రణభూమి యందు నర్జునుం డొండెఁ ద్రిగర్తు లొండెం గావలయు నే మతనిఁ బెద్ద కయ్యంబులోనం బాపికొని పోవుట నీచిత్తంబునకు వచ్చున కాదె యనవుడు నతనితమ్ములు [2]సత్యవ్రతుండును సత్యకర్ముండు[3]ను సత్యవర్ముండును నిబ్బంగిన పలికిరి వారల[4]పతుం బైనరథిక[5]వర్గంబు నిత్తెఱంగున నియ్యకొని యుల్లసిల్లె నిమ్మెయిం ద్రిగర్తులు పదివేవురు దొరలు గడంగినం గని [6]తుండి కేరళమాళవ[7]శిలింధ్రమగధమచ్ఛిల్లికాది దేశాధీశులును బంధుమిత్త్రసహితంబుగా నివ్విధంబునవారితోడివారై పంతంబులు వలికి యుబ్బునం బొంగి రట్లప్పరుసున నగణ్యరథికోత్తము లుత్సహించి కృతస్నానులై యగ్నులం బూజించి తత్సన్నిధి సర్వయోధులు నాకర్ణింప నందఱు నిట్లనిరి.

---

217. 1. వడియు, వడుట, వడును గాక - అని పాఠములు. 2. యంతకంటె - పెక్కు తాళపత్ర ప్రతులు.

219. 1. నింపు చునికి - అ. ఎ. ఐ. శ. ష. కొన్ని ప్రతులు. 2. మనికి జేసి - ల. 3. బొదువు - ఆ. ఇ. ఈ. ఉ. శ. కొన్ని ప్రతులు.

220. 1. తమకింపుచుండుదుము - అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు; తలకించు - ర. 2. సత్యరథుండును - శ. ష. పెక్కు ప్రతులు. 3. ను సత్యసేనుండును - కొన్ని ప్రతులు. 4. వర్గం బైన - పెక్కు ప్రతులు. 5. ముఖ్యులు - పెక్కు ప్రతులు. 6. తుండీర-ఇ; తుండి - వీ. శ. ష. కొన్ని ప్రతులు. 7. పుళింద, కళింగ - అని పాఠములు.

221. సీ. అర్జునుఁ [1]జంపుదు మతని కోడితిమేని గోవధంబును [2]వనితావధంబు
బ్రహ్మవధంబును [3]బరదారగమనంబు బ్రహ్మస్వహరణంబుఁ బరధనాప
హరణంబు గురుజనత్యాగంబు శరణాగతారక్షణము [4]నన్నృతాభిరతియు
మద్యపానము [5]నర్థిమానవవైముఖ్యమును గృహ[6]దాహంబు జనుల [7]నెట్టి

ఆ. గతులఁ బుచ్చు నట్టిగతులు వాటిలు నక్కి
రీటికోలుతలకు నోట లేక
[8]దురము సేసి తగినతుది గన్నపుణ్యాత్మ
కలితగతుల మేలు గలుగుమాకు.

222. వ. అని [1]సంశాపంబులు పలికి సంశప్తకు లనేకరథికముఖ్యులు బహుళచతురంగ
బల పరివృతులై కురురాజు సంతసిల్ల నుల్లాసంబునం జనిరి గురుండును
గరుడవ్యూహంబు సమకట్టి దానికిఁ జంచువై తాను నిలిచె దుర్యోధనుం
డును దమ్ములుం దలయును గృపకృతవర్మలు గన్నులును [2]సింహళాభీర
శూరసేనకేకయప్రముఖులు మెడయును బాహ్లికభూరిశ్రవస్సోమదత్తశల
శల్యులు వలపలిఱెక్కయు నశ్వత్థామ సుదక్షిణ విందానువిందులు డాపలి
ఱెక్కయు శకునిపౌండ్రకళింగాంబష్ఠమాగధులు వెన్నును నానాజనపద
సేనాసమన్వితుం డై సూతపుత్రుండు పుచ్ఛంబును సైంధవాదివివిధదేశా
ధీశులు నెడనెడం గలయఁ బెరసి యొడలిపొలుపును బలుపును నై నిలువ
నియోగించిన నవ్యూహంబు మహాపవనసముద్ధూతసాగరాకారం బై
యుత్సాహనృత్యంబు సేయు చందంబునం జూడ నొప్పె నందు మధ్యమ
ప్రదేశంబున భగదత్తుండు గజారూఢుం డై యుదయాచలంబుపైఁ బొలుచు
భానుండునుంబోలెఁ దేజరిల్లుచు నుండె నంత నక్కడం ద్రిగర్తాదులు పాండవ

221. 1. జంపెద మతని – అ. ఒ. క. కొన్ని ప్రతులు. 2. శిశుస్త్రీ వధంబు – హ. 3. బతిధనాప – ఐ. ఓ. ఖ. ఘ. కొన్ని ప్రతులు. 4. నకృతాభిరతియు – ఆ. డ. 5. నార్తి మానవ – ఈ; దీన మానవ – ఉ. ఊ. ఎ. ఏ. 6. దహనంబు – ఆ. ఉ. ఐ. ఒ. ల. కొన్ని ప్రతులు. 7. నింద – ఉ. ఎ. 8. దురము సేసి తగిన తుది – ట. ద. ప. వ. పీ. శ. ష; దుష్కరంబు సేసి తుది – హా. కొన్ని ప్రతులు.

222. 1. శపథంబులు – ఇ. ఐ. ఓ. జ. ట. ల. వ. 2. సింహళ కాశ్మీర, సింహ సౌవీర – అని పాఠములు.

సేనదక్షిణదిక్కునకుం జని సమరంబునకు సవ్యసాచిం దొలంగం బిలుచుటయు నన్నరశార్దూలుం డన్నతో ని ట్లనియె.

223. చ. తలఁచి సుశర్మ దిమ్ములును దానును నాజికి నన్నుఁ బిల్వ నే
నెఱుఁగనియట్టు [1]లుండు టిది యే పురుషార్థము వారి నెల్ల నే
డ్తెఱ నుఱుమాడఁ బంపుము కడింది గఁ జూడకు నీకు నేమియుం
గలఁగొలఁ గాదు పోమి గడ (గష్టము నాకు నుదాత్తమానసా.

224. వ. అనుటయు నయ్యుధిష్ఠిరుండు.

225. తే. గురునిబలశౌర్యములు నెఱుంగు[1]దువు మనకు
నతనిపూనికి బొంకు సేయంగ వలయు
దీని కెయ్యది కార్యంబు దాఁప నీవు
బుద్ధి సుచితంబుగాఁ గల[2]పోయు మనుడు.

226. వ. ధనంజయుం డతని కి ట్లనియె.

227. చ. పిలిచినఁ బోవకుండు టిది [1]బీ తనం బగుఁ గాన నేర్పుగాఁ
దలఁపదు లోక మే నరివధం బొనరింపఁగ నెట్లుఁ బోయెదం
జలము బలంబు ధైర్యమును[2]శౌర్యమునుం గలవాఁడు వీఁడు నేఁ
డలఘుఁడు గుంభసంభవుని నాఁగు భవత్పరిరక్షు[3]ణార్థి యై.

228. వ. అని పాంచాలవరుం డగు సత్యజిత్తుం జూపి.

229. క. ఇతఁ డున్నయంతసేపును
మతి నేమియు వెఱవ వలదు మా ర్తురచేతన్
హతుఁ డయ్యోనేని నిలుచుట
చతురత గా దనికిఁ దొలఁగి చనవలయు నృపా.

---

223. 1. లుండు డిది – ఖ. జ. ర. డ; లుండ నిది – ర. పీ. శ. ష.

225. 1. దువు – ప. క. జ. డ. ణ. 2. పోయవలయు – ఒ. ద.

227. 1. పెంటితనం, పెట్టతనం, బెండుతనం, పేదతనం – అని పాఠములు; బెంటితనం – వ. శ. 2. సాహసముంగల – న. వ; సత్యమునుం – ఊ. ప. క. వ. 3. ణార్థ మై – శ. ష. కొన్ని ప్రతులు.

-: అర్జునుఁడు ధర్మజుచే ననుజ్ఞాతుం డై సంశప్తకులపైఁ బోవుట :-

సం. 7–16–44

230. తే. అనిన నొడఁబడి యట్ల కా కనుడు నన్న
రేంద్రునకు భక్తి మ్రొక్కి సురేంద్రపుత్రుఁ
డతనిచేత దీవన గొని యవ్విరోధు
లున్న [1]దెస కేఁగె సంతోష ముత్కటముగ.

231. వ. ఇట్లు ధర్మజుని[1]యొద్ద వాసి విజయుండు చనుటకు నుబ్బినమనసై న్యంబులం గనుఁగొని యమ్మహీపతి ధృష్టద్యుమ్నుతో గౌరవులు గరుడవ్యూహంబుగా మోహరించినవారు దీనికి నీవుం దగ మండలార్ధవ్యూహంబు [2]సమకట్టు మని పనిచిన నతం డట్ల చేసె నిట్టిధంబున నుభయవ్యూహంబులును గాఢసన్నాహంబులై శంఖభేరీ ప్రముఖతూర్యస్వనంబులు సెలంగ నడువానకాలంబునం బొంగిన గంగాయమునలుం బోలె నొండొంటిం [3]దార్కొనుసమయంబున నయ్యజాతశత్రుండు ద్రుపదపుత్త్రు నాలోకించి గురుం జూపి.

232. క. నేఁ డీబ్రాహ్మణుచేతం
బోఁడిమి సెడి యేను జిక్కి పోవక యుండన్
వేఁడిమి [1]మెఱయుశరంబుల
వాఁడిమి[2]సొం పెల్లఁ జూపవలయుం జుమ్మీ.

233. క. అనుడు నతఁడు నవ్వుచు ని
ట్లను నే నా గంగ దోణుఁ డవి నినుఁ గదియం
[1]జనువాఁడె యింత యేటికి
నను నీఁడు గెలువ లేఁడు నమ్ము [2]మధీశా.

---

230. 1. యెడ కేగె – కొన్ని ప్రతులు.

231. 1. నొద్ద వాసి – కొన్ని ప్రతులు. 2. సంఘటనం బొనర్పు మని, సంఘటింపు మని – అని పాఠములు. 3. దాకు సమయంబున – ఇ. ఎ. జ.

232. 1. గల్గు – ఊ. ఎ. ఏ. ఐ. 2. పెంపెల్ల – కొన్ని ప్రతులు.

233. 1. గను వాడె – అ. ఈ. ఉ. ఊ. కొన్ని ప్రతులు 2. మహీశా – కొన్ని ప్రతులు.

234. వ. అని పలికి పారా[1]వతవర్ణాశ్వవర్ణనీయరథుం డగునయ్యతిరథుండు గుంభసంభవునకు సమ్ముఖంబుగా నడచుటయు నాధృష్టద్యుమ్నుదర్శనంబు దనకు నరిష్టం బగుటయు నగ్గురుం డొక్కింత విన్ననై యతనిదిక్కు దేఱిచూడం జాలక క్రీడించి పాంచాలబలంబుపై నిశితవిశిఖంబులు [2]పరగించుచుం బాయ వడ నడరె నంత నక్కడ.

235. సీ. క్రీడి [1]యాఁకొని యున్న కేసరి హరిణచయముమీఁదఁ జనునట్టు లాత్రిగర్త
వరులపై నరుగంగ వా రటము న్నర్ధచంద్రాకృతిగ నొడ్డు సంఘటించి
కొని యుండి యాతనిఁ [2]గని ప్రీతి నార్పులు బొబ్బలుఁ జెలఁగంగఁ బొంకుటయును
చూచు నాసవ్యసాచి మందస్మితుం డై కృష్ణుతోడ ని ట్లనియెఁ జూడు

ఆ. [3]మెక్కు డై నరవము నెసకంపుటుబ్బునఁ
బొదలుచున్నవారు [4]మదము కతన
నెదిరిఁ దమ్ము నించుకేనియు నెఱుఁగరు
వీరు క్రొవ్వి చావ వేఁడి రకట.

236. వ. అని మఱియును.

237. క. తగు సంతసింపఁ గుజనుల
కగపడనివిశిష్టగతికి నస్మద్దివ్యా
శుగముల[1]చేఁ బోఁ గనుటను
విగతభయత్వంబు సమరవిధి కొప్పుఁ గదా.

238. వ. అనుచుం జేర నడచి దేవదత్తంబు పూరించిన.

---

234. 1. వత సవర్ణాశ్వంబులు - ఎ. ఒ. క. 2. నిగుడించుచు - ఔ. య.

235. 1. యాకలి గొన్న - ఝ. డ. ద. న. 2. కోల్తలల - బ. 3. మిప్పు డేమి కతము నెసకంపు - వ. వీ. శ. ష. స. శ; యేపు బరవసము నెసకంపు - ఓ. ఔ. ణ. 4. మదముకతన - పెక్కు ప్రతులు; ముదము - వా. వీ. శ. ష.

237. 1. బోరి గొనుటను(కు) ఇ. వ; జచ్చుటకును - ఊ. ఎ. ఏ. ణ; బొగ రణచుట - య.

239. ఉ. ఆనినదంబు సాంద్రముగ నాకస మంతయు నిండఁ [1]బర్వుడున్
మానసముల్ గలంగి యభిమానము ధైర్యముఁ దూలి విద్విష
త్సేన నితాంతనిశ్చలతఁ జిత్ర[2]సమర్పితమూర్తియో యనం
గా నలి వేది యుండియును గ్రమ్మఱఁ [3]దేఱి రవంబు [4]మీఱఁగన్.

240. వ. ఇట్లు దెలివొంది యొండొరులం బురికొలిపికొని సంశప్తకు లొక్కపెట్ట ఫల్గునుపయిం బటుశరపరంపరలు గురిసి రతండు [1]దవ్వుదవ్వులఁ బదియేను వేలరథంబులవారిం గూల్చినం బెలుచ నబ్బలంబు లడరి.

241. క. శరము లొకఁ డొకఁడు పదిపది
పరగింపఁగ మూఁట మూఁటఁ బార్థుఁడు నొంచెన్
సరి నైదై దేయఁగ న
న్నరుఁ డందఱ రెంటరెంట నలి నొప్పించెన్.

242. వ. అట్టియెడ సుబాహుండు [1]గ్రిడికిరీటంబు దశవిశిఖంబుల నేయ నతం డతని పై ననేకశరంబులు పరగించిన సుశర్ముండును సురథుండును సుధన్వుండును బాసట యై యప్పార్థుం [2]దాఁకిన.

243. ఆ. వారికేతనములు వడిఁ ద్రుంచి యవ్వీరుఁ
డాసుధన్వహయశరాసనముల
తునియ లవనిమీఁదఁ దొరఁగించి తన్మస్త
కంబుఁ దునిమె తేరుగముల కుఱికి.

244. క. ఇరువే యుద్భటరథములఁ
బొరిగొనుటయుఁ [1]బెఱబలంబు పురికొనక [2]వెఱం

---

239. 1. బర్వినన్ – అ; బర్వ దుర్మానసముల్ – ఊ. ఏ. క. ద. ర. 2. సమన్విత, సముజ్జ్వల – అని పాఠములు. 3. మూర్ఛలు దేరియుండగాన్ – న. 4. మీఱఁగాన్ – పీ. శ. ష. స; మానఁగాన్ – వా. కొన్ని ప్రతులు.

240. 1. దౌదవ్వుల – కొన్ని ప్రతులు.

242. 1. కిరీటి కిరీటంబు – అ. ట. బ. పీ. శ. ష. 2. బొదివిన – ఈ.

244. 1. పర – కొన్ని ప్రతులు. 2. వెసన్ – ఇ. ఈ. ఉ. ఊ. కొన్ని ప్రతులు.

దెరలుచు గుంపులు [3]గట్టుచుఁ
గురుపతిసైన్యంబుపొంతకుం జను[4]చుండెన్.

245. వ. ఇట్లు భయభ్రాంతు లైనసైనికులం గనుంగొని సుశర్మ యెలుంగెత్తి.

246. క. వెఱవకుఁ [1]డిట మరలుఁడు ము
న్నెఱుఁగరె యర్జునునిఁ గురుమహీపతి[2]కడ నే
డ్తెఱఁ బలికినపంతంబులు
మఱచిరె [3]నో రెద్ది రిత్త [4]మరలిన మనకున్.

247. వ. అని బరాసంబు సేసిన నాసైనికులు గోత్తల సేసి రప్పుడు నారాయణ గోపాలు [1]రెక్కడెక్కడ యని వారిం గూడి కడంగిన నిస్సాణాదితూర్య రావంబులు సెలంగుటయు వాసవి వాసుదేవు నాలోకించి.

248. చ. ఒకఁ[1]డును బ్రాణముల్ గలుగ నూరక యుండుదురే త్రిగర్తు లి
ప్పుడ నఱుమాడి పోద మటు వోవఁగ నిమ్ము రథమ్ము నావుడుం
గడువెస నాధనంజయునికాంక్షిత మెక్కడ నక్కడెల్ల నె
క్కుడు ముద మొప్పఁ దేరు [2]రథికోటులపై బఱపెన్ ముకుందుడున్.

249. క. విమలాంబుదములు పూనిన
విమానమో నాఁగ మెఱసె వెలిమావులవే
గమునం బొంపున నయ్యరదం
బమరేంద్రునిలీలఁ బొలిచె నతనిసుతుండున్.

250. వ. ఇట్లు మండ[1]లప్రచారగతప్రత్యాగతాది వివిధగతులం దేరు సంచరింపం జేయుచు నిలింపకోటికిం గన్నులపండువు సేయం బుండరీకాక్షుం గనుం

---

3. గూడుచు – ట. బ. 4. డెంచెన్ – ఉ. ఎ. ర.

246. 1. డిట మరలు డిక – ఆ; డు వెరవకుడు ము న్నెరుగరె–ఎ. ఒ. హ. 2. సభ – బ. వ.
3. నేఁ డెద్ది రిత్త – హ; యపయశము మగుడ మరలిన మనకున్–ఐ. 4. మగు (గి) డినమనకున్ – ఆ. ఇ. ఉ. క. ఘ. ర.

247. 1. రొక్కపెట్టిన కూడుకొని – ఉ. ర.

248. 1. కుఁ – ఇ. ఔ. ఖ. డ. ర. ల. వ. 2. రథకోటులపై–శ. ష. పెక్కు ప్రతులు.

250. 1. లాకారగత – ఆ. ఈ. ఊ. ఏ. కొన్ని ప్రతులు.

గొని నారాయణగోపాలురు గుపితాత్ము లై యర్జునదుర్యోధనులు ద్వారకానగరంబునకుం బోయిననాఁడు కృష్ణుతోడి సరిగా దుర్యోధనుఁడు దమ్ముఁ గోరికొనినవాఁ డగుటం జేసి యీసునం బేర్చి యన్నరనారాయణుల మేనుల నానాస్త్రంబులు నినిచిన నరుండు దేవదత్తంబు పూరించి యవష్టంభంబునం ద్విష్ట యిచ్చినమహాస్త్రంబు ప్రయోగించినం దత్ప్రభావంబున.

251. క. గాండీవిచంద [1]మయి వా
రొండొరులకుఁ దోఁచి యొకళు లొకళుల నానా
చండాస్త్రశస్త్రసముదయ
ఖండితులుగఁ జేసి పడిరి కలనం గలయన్.

252. వ. [1]ఇమ్మెయిఁ గృతార్థం బయినదివ్యాస్త్రంబు పదంపడి శాంతం బగుటయు హతశేషులు వోక పొదివి రథ[2]రథ్యకేతుసహితంబుగా సవ్యసాచి నాఖిల శరజాలసంవృతుం జేసిన.

253. క. ఆపార్థుఁడు కోపానల
దీపితుఁ డై విశిఖశిఖలతీవ్రనిహాతి న
త్తాపులగమి నేర్చి జముని
[1]ప్రోపు గుడువఁ బుచ్చె వారిఁ బురువంశనిధీ.

254. వ. ఇవ్విధంబున విజృంభించి యట్టహాసంబు సేయుటయుం దుండి[1]మగధకేరళ మచ్ఛిల్లికాదు లడరి సాయకనికాయంబులం గప్పిన.

255. క. నానాస్త్రంబుల నాతఁడు
పీనుఁగు పెంటలుగఁ జేయఁ బిఱుసనక మహా

---

251. 1. మున వారొండొరులకు - ఔ. ఐ. వీ. శ. ష. స.

252. 1. 'హ' ప్రతిలో యీ వచనము లేదు. 2. రథ్యకేతు సహితంబుగా - ఒ. ఓ. ఔ. వ. వీ. శ. ష. స; రథ్యకేతన సహితంబుగా - అ. ఆ. ఇ. ఐ. ఖ. గ; రథ్యకపికేతు గరుడకేతు సహితంబుగా - వా. కొన్ని ప్రతులు.

253. 1. కోపు...కురువంశనిధీ - తి. హా; ప్రాపు...బంచె...పార్థివముఖ్యా - ఏ. వ.

254. 1. మగధ - [illegible] ప్రతులలో లేదు.

సేనలు దోత్తో డగ్గఱి
యానరుపైఁ [1]బెల్లు గురిసె నమ్ములవానల్.

256. క. కరితురగరథపదాతులు
బెరసి [1]కదిసి చుట్టుముట్టి భీషణహేతి
స్ఫురణ మెఱయఁ జేరిన న
చ్చెరువుగ విజయుండు సించి చెండాడె వడిన్.

257. వ. సంశప్తకులు మఱియును.

258. క. [1]పెరయీఁగలగతిఁ గవియుచుఁ
బోరిఁబోరిఁ గడుఁదురులపగిదిఁ బొదువుచు [2]నెరకై
వెరవునఁ గాకులుఁ [3]గ్రోఁతులుఁ
బరువడిఁ జీకాకుపఱుచుభంగి [4]నలఁచుచున్.

259. వ. పెనంగి రందుఁ గొందఱు వీరావేశంబున.

*-: సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జునరథంబుపైఁ బడుట :-*

సం. 7_18_20

260. క. అరదంబులు మొదలగు ను
ద్ధురవాహనకోటి డిగ్గి దుర్దాంతగతిం
దురగంబుల పై వారిపై
నరుపై [1]నూఁడుకొనఁ బడిరి నలి నార్పులతోన్.

---

255. 1. బెట్టు - వ. హ.

256. 1. కవిసి - కొన్ని ప్రతులు.

258. 1. తెరయీఁగల - అ. ద. న. బ. శ. ష. సూ. 2. నెర వై - శ. ష. స. శ; నెఱ పై - సూ; నరుపై - వీ; పెక్కై, కడిమిన్ - అని పాఠములు. 3. పికములు - ద. వ. శ. సూ; గ్రద్దలు - ల. 4. నలంచెన్ - ఈ. హ; దలంపన్ - శ. ష. సూ, కలంచెన్ - చ. ట. ద. ప. మ.

260. 1. నూఁది - వీ. స; నూఁదు - ద. ప. వ. శ. ష. హ.

261. వ. ఇత్తెఱంగునం జేయిగా లార్పనుం జూడ్కి వఱ[1]పను రాకుండునట్లుగా [2]గుంపులు గొనం బైపయిం దొరంగినం గృష్ణు లగపడిరి తెగిరి మడిసిరి [3]క్రమ్మగ్గి రనుమాటలతోం దత్సైన్యంబుల సింహనాదంబులుం దూర్యనినదంబులుం జెలంగె నప్పుడు [4]సెమర్చి చేడ్పడి వసుదేవనందనుండు.

262. ఆ. ఎచట నున్నవాఁడ వే మైతి ప్రాణానఁ
గలవె యేను నిన్నుఁ గాన కునికిఁ
దలఁకుచున్నవాఁడ ధైర్యధౌరేయ నీ
యెలుఁగు సూపవే సురేంద్రతనయ.

263. వ. అనిన విని యతండు ముకుందునిమానుషభావం బూహించుచు నుత్సాహంబు వాటించి.

264. క. అనిలాస్త్రంబు ప్రయోగిం
చిన సంశప్తకులు దెసలఁ జెదరి [1]చొరువు చా
ద్పునఁ దూలఁగ బహువిధశర
వినిహతి బడలువడఁ జేసె వెన్నుఁడు మెచ్చన్.

265. క. శిరము లురంబులు గరములు
చరణంబులు రూపు మాయ శకలములై సం
గరధరఁ దొరఁగిరి యోధులు
గరితురగ రథాస్త్రశస్త్రఖండంబులతోన్.

266. వ. అట్లు గసిమసంగి కిరీటి కల్పాంతపురాంతకుండునుం బోలె బారిసమరుచుండ వెండియు వెఱచఱవక తఱిమి పెనంగునబ్బలంబు లతని బాణపరంపరల బలితంపుఁ [1]బరపునం జేసి.

---

261. 1. పను వెరవు గాకుండు – వ. హ; పను నెళవు గాకుండు–త. 2. కుప్పలు –కొన్ని ప్రతులు. 3. క్రుంది ర – హ; త్రుంగి ర – ఐ. 4. చేయార్ప చేడ్పడి – ఖ.

264. 1. చొరుగు – అ.

266. 1. రయంబునం జేసి – ఓ. త. వ. హ.

267\. ఆ. కూలురూపుఁ దన్నికొనియెదురూపును
నొఱలురూపు [1]నేల కొఱగురూపుఁ
బొరలురూపు నయ్యె నరవాజిగజములు
ప్రధనభూమి ఘోరభంగి గాఁగ.

268\. వ. ఇవ్విధంబున ననుసమరశత్ప్రదులై తనవలన నేనుటి యామఱందియు
బావయు నట్లుండఁ [1]నిక్కడ ధర్మజుండు పురికొల్ప నుదగ్రసైన్యంబులు
మనమొనలు దలంకం దటిమె నాచార్యుండును ధర్మసూనుసైన్యంబులు
దలం[2]కఁ దటిమె నప్పుడు నీ కొడుకు దుర్ముఖుం డతనికిఁ
బ్రియంబుగా ధృష్టద్యుమ్నుం దలపడినం గురుపాంచాలకుమారవర్గంబు లగ్గ
లికం గవిసి పోరె నట్టియెడ.

269\. చ. గుఱుఁ దనుతీవ్రమారుతము కోల్తల కోర్వక ధర్మపుత్రబం
ధురబలవారిదోత్కరము దూలుడు నాతఁ డదల్చి వీరసుం
దరముగఁ జేయి వీచిన నుదగ్రగతిం బురికొన్నఁ గౌరవ
స్ఫురణము నుద్భటం బగుడు సూర్యుని [1]ద్రిమింగె ధరాపరాగముల్.

270\. వ. ఇబ్భంగి నుభయసైనికులును గలయఁ బెరసిన మణిభూషణకిరణజాలంబుల
కతంబున ధూళీకృతంబు లగుతిమిరంబుల గెలిచి [1]పోరుచుండ [2]ధారాళ
రక్తసిక్తం బై యారజఃపటలం బడంగుటయు.

271\. క. ఇరువాఁగును దార్కొని వి
స్ఫురణ [1]మెరయ నాయుధముల పొగ లేనిశిఖల్
దరతరమ యెగయఁ బోరఁగ
ధరఁ జతురంగములు నద్భుతంబుగఁ [2]గెడసెన్.

---

267\. 1. నల్ల నొఱగు – కొన్ని ప్రతులు

268\. 1. నిక్కడ ధర్మజుండు.......దటిమె – ఈ భాగము పెక్కు తాళపత్రప్రతులలో లేదు. 2. క నెదిర్చె – ర. పీ. శ. ష.

269\. 1. గప్పె – ఊ. ఏ. ఐ. ఔ.

270\. 1. పొదలుచుండ – ర. 2 ధరాతలంబు రక్తసిక్తం బగుడు – ఊ. ఎ. ఏ. ఒ.

271\. 1. మెరయు నాయుధముల – ఆ. 2. నణగెన్ – కొన్ని ప్రతులు.

272. క. కరిఘటలు దురగములదళ
మరదంబులమొత్త మనక యడరి పడిం గా
ల్వురు మ్రగ్గఁ జేయుచును మ్ర
గ్గిరి విస్మయ మొలయఁ జూచు ఖేచర తతికిన్.

273. ఉ. తేరులయొప్పు మ్రోడుపడఁ దేఁకువ [1]లేనిపదాతికోటి ను
[2]గ్గై రుధిరంబులో మునుఁ[3]గ నానినయేనికపిండు [4]పక్షముల్
ఘోరము గాఁగ [5]ద్రెవ్వి [6]వెసఁ గూలుకులాద్రులఁ బోలు నాశ్వికుల్
వీరవినోదముల్ సలుపువేడుక సొంపునఁ [7]గూడి యెక్కినన్.

274. చ. నిలిచినరూపు డొల్లి ధరణిం బడి యున్న శరీర మింత లిం
తలు శకలంబులై నెఱయ దండడిమూఁక [1]గలంగ నొంటి గుం
పులు [2]పఱివోవ రక్తజలపూరము రొంపులు ధూళిగా రథం
బులు రభసంబునం బఱపి పోరిరి యోధులు గ్రోధదీప్తులై.

275. క. కొమ్ములఁ [1]గ్రుమ్మియుఁ బాదత
లమ్ములఁ [2]జమరియును గరములం బఱపఱియై
యి మ్మెడలఁగఁ గిఁగిచియు నర
దమ్ముల నేనుఁగులు వీటతాటము సేసెన్.

276. క. తురగమున నరుని [1]వ్రేయుచుఁ
[2]గరిదంతము వెఱికి యన్యకరి వైచుచును

---

273. 1. లేమి - ద. వ. 2. గ్గై రుధిరంబు గ్రమ్మిన యేనుగు పిండు వక్షముల్ - ఆనం. య; అఖండయతిగా సమర్థించెను. 3. గు నచ్చిన యేనుగు - ఇ. క. ర. శ. (యతి భంగము); గ గ్రచ్చర, గ గప్పిన - కొన్ని ప్రతులు. అఖండయతిగా చూడవలెను. 4. వక్షముల్ - ఐ. ద. య. వీ. హా. 5. వ్రస్సి - య; ద్రెళ్ళి - ఔ. ణ. 6. ధరఁ గూలు - వీ. శ. ష. 7. రూఢి కెక్కినన్ - ద. వ.

274. 1. గలంక నొంది - ట. వ. 2. వడిపోవ - ద. వ. బ. వీ; పొలివోవ - ల. హ.

275. 1. గ్రుచ్చియు - ద. య. వ. 2. జదిపియు - ఇ. ఈ. ఉ. ఊ. మ. య. వ. శ. ష. కొన్ని ప్రతులు.

276. 1. వైచుచు - కొన్ని ప్రతులు. 2. నరునిం దురగంబుమీద నలి వైచుచు - ఆ. జ. ట.

ద్ధురరథము [3]చదలఁ ద్రిప్పుచుఁ
గరులు వినోదంబు సేసెఁ గనుఁగొను ప్రజకున్.

277\. వ. ఒక్కొకక్కచోట.

278\. చ. మెఱుఁగులు గర్జితంబులును మిక్కిలిసోనయుఁ గల్గుమేఘము
ల్గిఱిగొన నొప్పు నాకసములీల రణక్షితి సూడఁ బొల్పగుం
దఱి చగుభూషణద్యుతివితానము పర్వ గజవ్రజంబు పె
ల్లొఱలుచు నెత్తురుల్ దొరఁగుచుండ [1]నొగిం బడి యున్కి నత్తఱిన్.

279\. ఆ. అశ్వసుభటతతుల యంగఖండంబులు
రుధిరకర్దమమున గ్రుంగి యున్న
పెల్లు చూడ రౌద్రబీభత్సకరు[1]ణభ
యానకైకహేతు వయ్యె నధిప.

280\. వ. అట్టిసమయంబున నారోహకులు వడినం దెరలం బాఱువారణహయంబులును వాహనంబులు[1] నిహతంబు లయిన వెడవెడ మెలంగు వివిధయోధులును రుధిరమాంసమస్తిష్కమయమహాపంకంబునం గలయ మునింగియుం గాళులు వెలుక రాకుండియు గొరిజ దిగంబడియును రథకరిఘోటకంబులు సంచరింప నేర కునికి వెడంగు వడుచుం బెనంగు కడిందిమగలును రక్తాంబుతురగావర్తకరిగిరికలితం బై నసమరాంగణసాగరంబు నానావిధ[2]వాహనయానపాత్రగతులం దఱియం జొచ్చి తమయట్టివారు గొందఱు మునింగినను వెండియు విజయధనవాంఛం జేసి [3]వెఱవక వర్తించు వీరవ్యవహారులునయి [4]యెయ్యది సూచిన నెత్తుటం గెం పెక్కు సైనికు లుక్కునం బొంపిరివోవుచున్న సంకులసంగ్రామంబునం జెక్కు సెమర్పక దర్పంబునం జెలంగుచు ద్రోణుం డెలుంగు సూపి కడంగి.

---

3\. సడల ద్రిప్పుచు – త. బ.

278\. 1. మొగింబడి – ఆ. ఇ. ర. కొన్ని ప్రతులు.

279\. 1. ణాభయాన – ద. ప. బ. వీ. శర. హ.

280\. 1. లు వినిహితంబు లయిన – ఈ. ఊ. ఓ. కొన్ని ప్రతులు. 2. రథ – అ. జ. ప. బ. 3. వెరవక – ట. వీ. శ. ష. శ; వెఱవేది – వా. కొన్ని ప్రతులు. 4. యెయ్యెడ జూచిన – ణ. య. ర. హ.

281. క. కరియూథనాథుఁ బోదువం
ద్వరితోద్ధతి యానదుర్ని[1]వారం బై కే
సరి సనియెడుపగిది యుధి
ష్ఠిరుదెస[2]కుం జనియె నతనిసేన దలంకన్.

282. క. అతికోలాహలవికల
స్థితి యగుతనబలము మిగిలి ధీరత్వమహో
న్నతుఁ డగునతండు విశిఖ
ప్రతతి [1]వఱపె గురునిపై నరాతులు వొగడన్.

-: ద్రోణాచార్యునిచేత సత్యజిత్తు సచ్చుట :-
సం. 7_20_1

283. చ. కని ద్రుపదాన్వయోత్తముఁ డకంపితశౌర్యుఁడు సత్యవిక్రముం
డనుపమధైర్యధుర్యుఁడు మహాబలదీప్తుఁడు సత్యజిత్తు ద్రో
ణుని వెసఁ దాఁకి తత్తనువు నొవ్వ దశోగ్రశరంబు లేసి సూ
తునిమెయిఁ గ్రుచ్చెఁ బేర్చి పదితూపులు ధర్మజుఁ డుల్లసిల్లఁగన్.

284. ఆ. గురుఁడు సత్యజిత్తు కోదండదండంబు
దునుముటయును వేఱుధనువు పుచ్చి
కొని యుదాత్తరేఖఁ గ్రూరభల్లంబులు
ముప్పదింట [1]నతనిఁ గప్పె నతఁడు.

285. వ. తదవసరంబున సత్యజిత్తుం గూడికొని.

286. క. వృకుఁ డనుపాంచాలకుమా
రకుఁ డఱువదితూపులం గరం బరుదుగ న
స్త్రకళాచార్యుం బొదివిన
వికాసముం బొందెఁ బాండవేయబలంబుల్.

---

281. 1. వారణమై - అ. 2. కు నడచె - అ. ఇ. ఈ. కొన్ని ప్రతులు.

282. 1. గురిసె - ఎ. ప.

284. 1. గురుని - అ. ఆ. క.

287. చ. ఘనతరకోపవేగమునఁ గన్నుల నిప్పులు రాల సత్యజి
త్తనువు వృకాంగముల్ విశిఖధారల ముంచె గురుండు వార లా
తనివడి కోర్చి మై గలయఁ దాఁకఁగ సారథియు బ్బడంగ వా
హనములు బీఱువోవ సిడ మల్లల నాడఁగ నేసి రుద్ధతిన్.

288. ఆ. సత్యజిత్తుమేన సాయకదశకంబు
నాఁటి కుంభజుండు నగుచు విల్లు
దునుమ నొండువింట ద్రోణుని నొప్పించె
నతఁడు వృకుఁడుఁ బెలుచ నడరి యేసె.

289. క. కినిసి వెసన్ సత్యజితుని
ధనువు నఱికి గురుఁడు వృకునితల దునియఁగ నా
తనిహయములు సారథియును
మును డొల్లఁగ నాఱుబాణముల్ వి ట్టేసెన్.

290. ఆ. అన్యచాపహస్తుఁ డై సత్యజిత్తుసం
రంభజృంభణమునఁ గుంభజన్ముఁ
[1]దలర నేయుటయు నతండు గెంపారెడు
నాననంబుతోడ నవుడు గఱచి.

291. ఉ. ఖండము లై పడం ధనువు గ్రక్కున నేయుడు సత్యజిత్తు వి
ల్లొండు గొనం గొనం దునియ నుద్ధతి నేయుచుఁ బెక్కు[1]విండు లు
ద్దండత నుగ్గుసేసి భుజదర్పధురంధరుఁ [2]డీతఁ డింత ద
క్కండని యర్ధచంద్రవిశిఖప్రహతిం దల డొల్ల నేసినన్.

292. క. సాహంకారుం డగుగురు
బాహుబలంబునకు నులికి పాఱఁ [1]దొలంగెన్
వాహములఁ దోలుకొని యు
త్సాహంబుఁ జలంబు నెడల ధర్మజుఁ డధిపా.

---

290. 1. దరల నేయుటయు - ఇ. ఉ. ద. శ. కొన్ని ప్రతులు.

291. 1. విండ్లనుద్దండ - కొన్ని ప్రతులు. 2. డింత తోడ - స. శ; డీత డింక - వీ.

292. 1. దొలంగెన్ - ద. హ.

-: ద్రోణాచార్యునిచేత సూర్యదత్తుఁడు సచ్చుట :-

సం. 7-20-20

293. సీ. ఆతని వెనుకొన నాచార్యునకు నడ్డపడి వారిమొన లెల్లఁ గడక నొక్క
పెట్ట ద్రోచిన దూదితిట్టలపైఁ బ్రాఁకు నగ్నిచందంబున ప్రగ్గఁ జేయు
నగ్గురుఁ దాఁకి [1]మాత్స్యానుజుఁ డాలుదూపుల నొంచి యార్చిన నలిగి యతని
తనకుండలములతో నిలఁబడ నతఁ డేసె ధరణినాయక [2]సూర్యదత్తుఁ డిట్లు

---

293. 1. మత్స్యానుజుఁడు - ద. బ. వీ. హ. 2. ఇచ్చట మూలమునందు ద్రోణు నెదిర్చి యతనిచే సంహరింప బడినవాఁడు శతానీకు డని యున్నది.

"నిర్దహంత మనీకాని తాని తాని పునః పునః ।
ద్రోణం మత్స్యాదవరజః శతానీకోఽభ్యవర్తత".

భం. 7-20-20 చిత్రశాలాప్రతి 7-21-25. కుంభకోణప్రతి 7-21-25. భండార్కరుప్రతి పాఠసూచికయందు "మత్స్యాదవరజః అనుటకు "మాత్స్యాదవరజః" అను పాఠము ప్రదర్శింప బడినది $T_1$, $G_2$, 5. ప్రతులు.

శతానీకుఁ డనువాఁడు (విరటుని తమ్ముఁడు) భీష్మునిచే నిహతు డైనట్లు భీష్మ పర్వము తృతీయాశ్వాసమున గలదు. భీష్మ-3-391 తిక్కన భారతము. 6-113-24 భండార్కరు ప్రతి.

భీష్మపర్వములోనే సంహరింపబడిన శతానీకుడు ద్రోణపర్వము నందు తిరిగి కన్పించుట అసంగతముగా తోచును. దీనిని గుర్తించియే కాబోలు కొన్ని సంస్కృత ప్రతులలో ($T_1$, $G_2$-5) "మాత్స్యాదవరజః" అను పాఠము గ్రహింపబడినది. మాత్స్య డనగా మత్స్యరాజుకుమారు డగు ఉత్తరు డని గ్రహించినచో శతానీకుడు వాని తమ్ము డగును. ఇట్లు విరటుని తమ్ము డొకడును, కుమారు డొకడును శతానీక నామము గలవారు ఇద్ద రుండి రని గ్రహించినచో వైరుధ్యము తొలగును.

తిక్కనసోమయాజి దీనిని గుర్తించియే కాబోలు ఈసందర్భమున శతానీకుని పేరువిడిచి "సూర్యదత్తుడు" అనుపేరు గ్రహించెను. ఈతడు విరటుని తమ్ము డనియే తిక్కనభావము. "మాత్స్యానుజుఁ డాలుతూపుల" ద్రోణ-1-293. సూర్యదత్తుని పేరు ఈఘట్టమున మూలసంస్కృతప్రతులందు కాన్పించుట లేదు.

సూర్యదత్తు డనువాడు విరటుని యనుచరు డనియు ద్రోణునిచే వధింపబడె ననియు సోరన్సన్ 'మహాభారత నామానుక్రమణిక' యందు కలదు పుట. 664. మత్స్య అనగా విరాటు డనియు మాత్స్య అనగా ఉత్తరు డనియు సోరన్సన్ వివరించెను.

ఆ. వడినఁ జూచి మత్స్యబలకోటి విచ్చినఁ
జేదిమగధకేకయాదిసేన
లెల్లఁ జెదరఁ దల్లరఁ దల్లడపడఁ గల
గుండుకొనఁగఁ జేసెఁ గుంభజుండు.

294. క. [1]మెఱుమ ధనుర్దండము గుణ
ముఱుమఁగ విశిఖతతి [2]దొరుఁగ నొక్కటఁ దఱ చై
[3]పఱవ రుధిరంపుఁగాలువ
లఱిముఱి ఘనభుజుఁడు ద్రోణుఁ డడరె నరేంద్రా.

295. క. వీరాస్థిశర్కరాఘన
భేరీమండూకకవచపృథులోర్మిరథ
స్ఫారావర్తగజమకర
ఘోరమహిమ రక్తనదులకుం దగియె నృపా.

296. వ. ఇవ్విధంబునం గాండవాగ్రజుం బట్టికొన నప్పళించి తఱుము నమ్మహావీరు మార్కొని యుధామన్యుండును [1]నుత్తమౌజుండును [2]వసుదానుండును శిఖండియును నైదై దుశరంబు లేసిరి సాత్యకిక్షత్ర[3]ధర్ములు వరుసన నూట యిరువదంటఁ బదింటం గప్పి రయ్యుధిష్ఠిరుండును మరలి బాణశతత్రయ ప్రయోగతీవ్రు లగుధృష్టద్యుమ్నచేకితానుల మున్నిడికొని [4]పొంగి తానును బంట్రెంట నొప్పించె నప్పు డాభారద్వాజుని మఱియునుం బలువురు పాండవపక్ష యోధవీరులు వొదివినం గని [5]నీమన్నించురాజులు రాజకుమారులు నతనికి బాసటయై కవిసి రతండు [6]వసుదాను వసుధం గూల్చి క్షేము జము కడ కనిచి యుధామన్యుని నుత్తమౌజుని శిఖండిని సాత్యకిని బెక్కమ్ము లెమ్ములం [7]గీలించి తన్నుం గదిసినం గని యయ్యజాతశత్రుండు వెండియుఁ గైతవంబున రణంబు [8]దక్కి తొలంగం బాఱిన.

---

294. 1. మెరుపు – వ. న. ప. బ. వీ. 2. గురియ – పీ. శ. శర. 3 పరపె – ద. బ. వీ.

296. 1. నుత్తమౌజుండు – కొన్ని ప్రతులలో లేదు. 2. వసుదానువసుధులును – కొన్ని ప్రతులు. 3. ధర్మక్షత్రవర్ములు – ఖ. ప. బ. య. వ. 4. కడంగి – ఒ. ఔ. ఖ. ఘ. మ. య. వ. కొన్ని ప్రతులు. 5. నీకొడుకు మన్నించు – ఐ. ఒ. ణ. ల. 6. వసుదానువసుదుల వసుధంగూల్చి – ణ. శ. ష. కొన్ని ప్రతులు. 7. గీరనేసి – ఆ. ఈ. ఐ. గ. ల. కొన్ని ప్రతులు; నాటనేసి–కొన్ని ప్రతులు. 8. దక్కి తొలగం – పెక్కు ప్రతులు; నకుం దొలగం – హ.

297. క. గురుదృఢసేనుఁడు దాఁకిన
హరిసారథి [1]కేతురథశరాసనశకలో
త్కరములతోడ నతండును
దొరఁగించెఁ దదీయతనువు [2]దునియలు ధరణిన్.

298. వ. ఇత్తెఱంగునం దునిమి తఱుమునతనిదోర్విలాసంబు దుస్సహం బగుటయుం బాండవబలంబులు దెరలినం గురుసైనికులు నలుగడలకు నెగచి రట్లు విజృంభించినకుంభసంభవు నెదుర్కొని [1]వార్ధక్షేమియుఁ జిత్రసేనుండును సేనాబిందుండును [2]సువర్చసుండును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును శిఖండియు సాత్యకియును సుమిత్రుండును సాయకజాలంబులు నిగిడించిన.

299. తే. అందఱకు నన్నిరూపులై యతఁడు వోరి
యాసుమిత్త్రునిఁ గూల్చిన [1]నతనిఁ గేక
యులును మాత్స్యపాంచాలురు నొక్కపెట్ట
కవిసి [2]విరిసిరి తచ్ఛరాఘాతభీతి.

300. వ. ధృష్టద్యుమ్నసాత్యకిసేనాబిందుప్రముఖరథికవరులును [1]వసమటి యుండి రనిన విని ధృతరాష్ట్రుం డచ్చెరు[2]వడి యిట్లు పేర్చినయాచార్యు శౌర్యభుజవీర్యంబులు సైరింప నక్కడ నెవ్వరు లేరైరి గదే యనుటయు సంజయుం డది సెప్పెద నాకర్ణింపు మని యిట్లను నట్లు గలంగినకౌంతేయసేనం గనుంగొని కలకల నవ్వుచుఁ గురువిభుండు గర్ణునితో ని ట్లనియె.

301. క. పెనుగాలిని వెసఁ గూలిన
వనముక్రియం బడినపాండవబలముఁ గంటే
విను మింక నెన్నఁడును [1]మొగ
కొన రీయోడిచనువారు గురుకోత్తలకున్.

---

297. 1. కదలికాశరాసన - ఈ. ఉ. క. ఠ. ల. 2. దునుకలు ధరణిన్ - త. వ. పీ. శ. ష.

298. 1. పార్థక్షేమియు - ఇ. ఈ. ఉ. ల. ష. కొన్ని ప్రతులు; ధార్త్తక్షేమియు - గ. ణ. ర. శ. 2. సుధర్ముండును, సువర్మ్ముండును - అని పాఠములు.

299. 1. యలిగి - కొన్ని ప్రతులు. 2. విరిగిరి - కొన్ని ప్రతులు.

300. 1. నిశ్చేష్టితులై - చ. పీ. శ. ష. స. 2. వంది - కొన్ని ప్రతులు.

301. 1. మొనకొన - చ. ఝ. ణ. త. య. ర. వ.

302. చ. పవనతనూజుఁ గంటె నిజపార్శ్వములం దననారు లేక కౌ
రవులు మహోగ్రభంగి నడరం గడుదైన్యముఁ బొంది యున్నవాఁ
డవిరళదివ్యమార్గణదురాసదు ద్రోణునిఁ జూచి వీఁడు రా
జ్యవిభవకాంక్ష యెల్లఁ దెగటాఱుఁగఁ జాఱెడు నట్లు సూడుమీ.

303. వ. అనిన విని కర్ణుం డతని కిట్లనియె.

304. ఉ. భీముఁడు నట్టివాఁడె యరిభీషణవిక్రముఁ డస్మదీయసం
గ్రామజయంబు ప్రాణములు గ్గఁగ సైఁచునె పాండవేయు లు
ద్దామబలాఢ్యు లాహవము దక్కుదురే యది గాక వారు నీ
చే మును పడ్డపాట్లు దమచిత్తములం మఱవంగ నేర్తురే.

305. చ. వినుము తదీయయోధులును వీర[1]గుణాఢ్యులు భీము మున్నుగాఁ
గొని గురుఁ దాఁక కుందుదురె కూడుద మీతఁడు నొవ్వకుండఁగా
మనముఁను [2]నీతనిం బలసమగ్రుల మై యటు గాక యోడి రం
చునికి ప్రమాద [3]మేను మొగమోడక చెప్పితిఁ గౌరవేశ్వరా.

306. వ. అని పలుకునంతకుం గూడుకొని.

307. సీ. హంస[1]గౌరము లగుహయములు నమృతాంశుకేతువు మెఱయ నజాతరిపుఁడు
[2]రురునిభాశ్వంబులు హరికేతనంబును బ్రస్ఫురితములుగఁ బవనసుతుఁడు
శుకవర్ణహరులు ప్రస్తుతశరభధ్వజంబును నొప్ప సహదేవపూర్వజుండు
నంబుదచ్ఛాయరథ్యములు కుండాలపతాకయు శోభిల్లఁ దదనుజుండు

తే. గడఁగి తమతమసిడములు గ్రాల ద్రుపద
మాత్స్యసాత్యకి[3]ముఖయోధమండలములు
దారుణాటోపవిక్రమోత్సాహలీలఁ
[4]దోడు నడవంగ నడరిరి ద్రోణుమీఁద.

---

305. 1. గణాఢ్యులు – వ. 2. నిత్తరిన్ – కొన్ని ప్రతులు. 3. మోను – వ.

307. 1. వర్ణము లగు – ఉ. ఊ. ఎ. ప. ఐ. య. ల. వ. వీ. 2 హారిణనిభాశ్వముల్ హరికేతనంబును – ఒ. ణ. య ల. 3. కేకయమాగధులును–అ. గ. జ. 4. తోడ నడవంగ – కొన్ని ప్రతులు.

308. వ. ఇట్లు పాండవబలంబులు జలధరంబులు శైలంబు గప్పుకరణిం గుంభసంభవుం బొదివిన దృష్టిపథం బవరుద్ధం బగుటయు నతండు [1]దెగియె ననుదిగులు మనవారికిం బుట్టె నట్టియెడ నీకొడుకు గడంగి సేనలకుం జేయి వీచి [2]యందు ముంగలి యై నడచువడముడిం దాఁకినం దమకించి సాత్యకిని గృతవర్మయు క్షత్త్ర[3]ధర్ముని సైంధవుండును యుయుత్సుని సుబాహుండును నకులుని దుశ్శాసనుండును సహదేవునిఁ జిత్రవర్ముండును ధర్మనందను శల్యుండును ద్రుపదుని బాహ్లికుండును విరాటుని విందానువిందులును శ్రుతకీర్తిని వివింశతియు శ్రుతసేనుని సాల్వుండును శ్రుతసోమునిఁ జిత్రసేనుండును శతానీకుని [4]శ్రుతవర్మయుఁ బ్రతివింధ్యుని నశ్వత్థామయు సౌభద్రుని లక్ష్మణుండును శిఖండిని వికర్ణుండును గుంతిభోజుని దుర్ముఖుండును గేకయపంచకంబును గర్ణుండును గాశీశ్వరుని జయుండును బాండ్యుని [5]జయత్సేనుండును ధృష్టద్యుమ్నపుత్త్రుల బృహద్ధనుర్జయమిత్త్రులును వార్ద్ధక్షేమిని గృపాచార్యుండును మణిమంతుని భూరిశ్రవుండును ఘటోత్కచుని నలంబుసుండును దలపడి రెన్నం గొలఁది గాదు గాని మఱియు ననేకుల మార్కొని రిబ్బంగి భారద్వాజునిం బరిమార్పను గావను బూని యక్కడి యిక్కడి [illegible] విఁగిలి యొండొరుల కేతనంబులు గూల్చి[illegible]టకకంబుల ప్రాణంబులఁ దీర్చియు సారథుల రూపుమాపియు నరదంబులు పఱియలు వాపియు నాతపత్త్రచామరంబుల బడలు వఱిచియుఁ జాపంబులు విఱిచియుఁ గత్తళంబులతునియలు ధరఁ దొరఁగించియు నెత్తురు [6]లురలించియు నిత్తెఱంగున ఘోరసంగ్రామంబు సేయుచుండ మధ్యాహ్నం బయ్యె నప్పుడు దన్నుం గవిసినధృష్టద్యుమ్ను నమ్మల నవలీలం గుదియించి యగ్గురుండు వెండియుం గొందఱం జిక్కువఱిచె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

309. క. వీరిచట నివ్విధంబునఁ
బోరఁగ నర్జునునితోడఁ బోక వెనఁగున

---

308. 1. దెగియెనో యను దిగులు – ఇ. ఈ. ఎ. ఏ. ల. కొన్ని ప్రతులు. 2. తాను ముంగలి యై – ఇ. ఉ. ఏ. కొన్ని ప్రతులు. 3. వర్ముని – శ. ష. కొన్ని ప్రతులు. 4. భూతవర్మయు – శ. కొన్ని ప్రతులు. 5. విజయుండును – శ. కొన్ని ప్రతులు. 6. గురియించియు – ఆ. ద. ప. శ.

వీరులు సంశప్తకు లె
బ్బెరొకొ యాతనిపరాక్రమాతిశయమునన్.

310. చ. అనవుడు నాతఁ [1]డిట్టు లను నవ్విభుతో నది వెండి చెప్పెదన్
వినుము నరేంద్ర యట్టియెడ వీరరసస్ఫురణంబునన్ భవ
త్తనయుఁడు గంధసింధురవితానముపై నడరించి భీమసే
నునిఁ [2]గినియించె నాతఁడు గనుంగవ నిప్పులు రాలుచుండఁగన్.

311. క. శరజాలమహావాత
స్ఫురణంబున నుగ్రదంతిభూరిఘటాబం
ధుర వారివాహపటలము
విరియించుచు బెట్టు గవిసి విభు నొప్పించెన్.

312. వ. అట్లు కురురాజు నొచ్చిన నడ్డంబు సొచ్చి.

313. శా. వంగాధీశ్వరుఁ డేనుఁగుం గొలిపి గర్వస్ఫూర్తి [1]దీవ్రాస్త్రవి
ద్ధాంగుం జేసె మరుత్తనూజు నతఁ డుద్యత్క్రోధుఁడై వానిమా
తంగంబుం బడ నేసి వాఁ డొఱగుచోఁ దన్మస్తకం బుర్వి డొ
ల్లం గేలివిధ మొప్ప నేయ బల మెల్లం బెల్లగిల్లెన్ వడిన్.

314. వ. ఆసమయంబున.

*-: భగదత్తుఁడు సుప్రతీకముఁ బఱపి పాండవసైన్యంబులం గలంచుట :-*
సం. 7_25_19

315. క. దానవజయ మింద్రున కె
ద్దానివలనఁ గలిగె మున్ను [1]దానోగ్రము న
ద్యేనుఁగు భగదత్తుఁడు పవ
మానతనయు దెసకుఁ గొలిపె మద మెలరారన్.

---

310. 1. డి ట్లనియె - అ. ఈ. ఎ. ఏ. ర. వ. హ. 2. గదియించె - ఊ. ఏ. వ. శ; గది యంగ - హ.

313. 1. దివ్యాస్త్ర - ఓ. ఔ. ప. బ. స. కొన్ని ప్రతులు.

315. 1. దామోగ్రము - హ.

316. వ. ఇట్లు మనసైన్యంబు దైన్యంబు వాయం గొలుపుటయు నగ్గజంబు.

317. సీ. కినుకమై [1]నిగిడిన కనుఁగవమెఱుఁగుల[2]గముల [3]ముందటఁ గెంపు గడలు [4]కొనఁగఁ
చెవులు మ్రొగ్గించి [5]పూఁచినరౌద్రతరరేఖ వినువీథిఁ జూపఱవేడ్కఁ [6]బెనుప
గండునఁ జాఁగినతొండఁబు లయసమవర్తి దండముఁ లీలఁ బట్టువఱుపఁ
గడుఁబెట్టిదపుటురవడిఁ బదన్యాస మిలాస్థలి గ్రక్కదలంగఁ జేయ

ఆ. ననిలపుత్రుదెసకు నడరినఁ గని ధర్మ
తనయుసేన జనులు దల్లడిల్లి
చంపెఁ జంపె భీముసామజం బనియెడు
నులివు గలయఁ జెలఁగఁ గలఁగి రధిప.

318. వ. తదవసరంబున యుధిష్ఠిరుండు.

319. క. అలుకొందుమనముతోఁ దన
బలముం బురికొలిపి పొదివి భగదత్తుని న
మ్మ్మలఁ గప్పె నతఁడు వానిఁ
విలసిల్లుమహాంకుశమున విరియ జడియుచున్.

320. క. గజముఁ గొలిపి యాదిక్కున
గజఘోటకభటనికాయకాయములు రథ
వ్రజములుఁ బొడిపొడిగా న
క్కజముగ విహరించె [1]బాహుగర్వస్ఫూర్తిన్.

321. వ. అప్పు డాలోకించి.

322. చ. అలిగి దశార్ణభూరమణుఁ డాతనిఁ దాఁకినఁ జూడ నొప్పె ఱె
క్కలుగలపర్వతద్వయముకై వడి వారల దంతియుగ్మ మి

---

317. 1. నిగుడిన - పెక్కు ప్రతులు. 2. గజము ముందట - స. 3. మంటలు - ర. 4. కొనఁగఁ - వీ. శ. ష. స. హ. కొన్ని ప్రతులు; కొలువఁ - వా. 5. యూఁదిన - వీ. ష. 6. బెంప - వీ. శ. ష. కొన్ని ప్రతులు.

320. 1. బహుళగర్వ - ఉ. ఎ. ఏ. ఐ.

ట్టిల సుగుఁడీకఁ దత్కరిఁ బడం బొడిచెఁ గడి సుప్రతీక ము
త్తలపడువానిఁ జంపె భగదత్తుఁడు తోమరసప్తకంబునన్.

323. ఆ. చఁపి విక్రమంబు సొంపారఁ బాండవ
బలము [1]బడలు వడఁగ భద్రదంతిఁ
జటులగతులఁ బఱప సాత్యకి యడ్డంబు
నడచి యేసె దొడ్డనారసమున.

324. చ. కరిపతి జిట్టనం దిరిగి క్రమ్మఱ [1]నూలొ్కని వృష్ణివీరు ను
ద్ధురరథ ముద్ధతిం బెనఁచి తొండమునన్ వెస నెత్తి వీచి వై
చె రయముమై నతం డిలకుఁ జిత్రముగా [2]నెడ దాఁటి పోయెఁ తె
చ్చెర గజ మొండుమైఁ గవిసి చింపఱవందఱ సేసె మూఁకలన్.

325. క. సారథి తురంగముల మెలు
పారంగాఁ [1]దఱిమి తెచ్చి యవికల మగునా
తేరల్లఁ దేర సాత్యకి
బీరము వోలి వోవకుండఁ బ్రియమున నెక్కెన్.

326. ఉ. భీముఁ డుదగ్రతం గవియఁ బెల్లగునాకరిచేతిశీకర
స్తోమమునం దురంగములు దోఁగి కడున్ వెగడొంది యీడ్చె సం
గ్రామవినోదలీలకు విఘాతము గాఁగ రథంబు నప్పు డు
ద్దామపరాక్రమస్ఫురణఁ దాకి సుపర్వుఁడు సచ్చె హస్తిచేన్.

327. వ. ఆతఁడు పడుట గనుంగొని సౌభద్రుండును ద్రౌపదేయపంచకంబును జేకితా నుండును ధృష్టకేతుండును యుయుత్సుండును గడంగి సామజంబుపై శర వర్షంబులు గురిసిన నది కోపించి యురవడించి.

328. క. పదముల రథవాహంబులఁ
జదుపుచుఁ బైకొని యుయుత్సుసారథిఁ జంపఁ

323. 1. ఔచ్చవడగ - హ.

324. 1. మార్కొని - హ. 2. వెసదాటి - ఉ. ఊ. ఘ. జ. య.

325. 1. దరమితెచ్చి, దడమితెచ్చి - అనిపాఠములు; ఋూన్చి తెచ్చి - వా.

బెదరక యభిమన్యునితో
రొదవిన నది యెక్కి యాతఁ డుద్ధతి సేసెన్.

329. క. నరతనయప్రముఖరథికవరులు
నిభముమీఁద [1]నేయువాలమ్ములు ని
ష్ఠుర[2]గతి శరదభ్రముపైఁ
బరగుతరణికిరణచయము పగిదిం గ్రాలెన్.

330. క. రభసంబునఁ బ్రాగ్జ్యోతిష
విభుఁడు గరం గొలుపుటయును వెస నది యరివీ
రభయంకరముగ వారల
ప్రభ సెడ నరదములు వైచెఁ బలుదెసలఁ బడన్.

331. ఆ. ఇట్లు భీమసేనునేపు నర్జునసుత
ప్రముఖులైన యలఘురథికవరుల
జృంభణంబుఁ జెడినఁ జేడ్పడి చెడి పాఱఁ
జొచ్చెఁ బాండురాజసుతులసేన.

332. క. [1]నలి భగదత్తుఁడు గదుపుల
వెలుచుపసులవానియట్ల విలసద్గతి న
బ్బలము నెగువ [2]ధూళియు నా
కులసంరావంబు గగనకుహరము నిండెన్.

333. క. అని చెప్పి సంజయుఁడు గురు
జననాయక యపుడు సవ్యసాచిరణము ది
క్కునఁ జిత్తం బిడి యడిగితి
విను మయ్యోధవరుతెఱఁగు విస్పష్టముగాన్.

334. వ. అనవుడు నాంబికేయుం డాకర్ణనవాంఛ మిగుల నది సెప్పు మనుటయు నాతనికి నాసూతినందనుం డిట్లనియె.

---

329. 1. గురియు - ఖ. ద. న. వ. 2. జలగళదభ్రముపై - హా.

332. 1. లలి, అలరి, యుల - అనిపాఠములు. 2. దోలెడు - జ. ట. ద. బ. శ.

-: అర్జునుఁడు భగదత్తునిదెస రథంబు దోలు మని కృష్ణునితోఁ జెప్పుట :-

సం. 7-28-1

335. క. అంతకు మును భగదత్తుని
దంతి యసమసమర[1]కేళిఁ [2]దాఁ గని హరితోఁ
గుంతీసుతుఁ డిట్లను మన
మెంతయు వెస బలములోని కేఁగఁగవలయున్.

336. వ. అది యెట్లంటేని.

337. చ. [1]బిరుదు జితశ్రమంబు బలభేదనశాలి మహాస్త్రశస్త్రపా
తరయము సైఁప [2]నోపు భగదత్తునియేనుఁగు దానికోత్తలం
[3]దిరుగక పోర నెవ్వరికిఁ దీఱదు నీవును నేను లేనిచోఁ
భర మగు నేఁడు రాజునకుఁ బావనికిం దలఁ కొందెడుఁ మదిన్.

338. ఆ. అనిన నట్లకాక యని శౌరి యరదంబు
ద్రిప్పి యాత్మసేనదిక్కు వోవ
నిచ్చుటయును వెనుక నెయిది సంశప్తకు
లార్చి [1]పేర్చి కురిసి రస్త్రసమితి.

339. వ. ఇట్లు చతుర్దశసహస్రరథికముఖ్యులు బెట్టు ముట్టిన.

340. క. బలములఁ గావఁగఁ జనుటయు
నలవు మెఱయ [1]మగిడి వీరి నడఁగించుటయుఁ
వలయుపనులయం దిప్పుడు
దలఁకొని [2]యెద్దానిఁ [3]జేయఁ దగవో నాకున్.

---

335. 1. లీలఁ - ట. ద. వీ. శ. ష. 2. దాకగ - వ.

337. 1. కరువలిపట్టి శత్రుజనఖాదనశాలి - వ. 2. నేర్చు - జ. బ. 3. దిర మయి పోర. జొ. ఖ దిరముగఁ బోర - శ.

338. 1. పెలుచ కురిసి - అ. ఆ. ఇ. ఈ. పెక్కు ప్రతులు.

340. 1. వేగ - హ. 2. మును జేయ నేది తగవో నాకున్ - హ. 3. సేత - ల.

341. వ. అని వితర్కించి వివ్వచ్చుండు సంశప్తకవధంబ యుచితంబుగా నిశ్చయించి మరలి గాండీవ[1]గుణక్వణనమేదురరోదసీకుహరుండును దేవదత్తధ్వానవిదళిత[2]దళదిశాసందోహుండును నై దివ్యబాణంబులు పరగించినం గేతనాతపత్రచామర[3]వ్యజనంబులును భేరీశంఖకాహళమృదంగంబులును యుగాక్షరథాంగకూబరంబులును దంతశుండాల[4]కుంభాకుశదండంబులును ఖురస్కంధవాలంబులును ధను[5]శ్శరముసలముద్గరఛురికాకుంతంబులును దనుత్రాణకంకట మస్తకచ్ఛేదంబులును మకుటకేయూరహార కంకణాంగుళీయకంబులును శిరఃకరవక్షఃకుక్షికటిచరణంబులును దునియలుం బలియలుం దుమ్ములుం బొళ్లు నై రాలినన న్నేల ఘోరంబును నభిరామంబు నై యుండె సర్వభూతంబులును బీభత్సుం బ్రశంసించెఁ గంసారి విస్మయప్రమదమగ్నమానసుం డయి కిరీటిం గరతలంబున నప్పళించి యగ్గించె నివ్విధంబున నవ్వీరరథికులం బిలుకుమార్చి పేర్చి రథాంగపాణిం జూచి రథం బింక రయంబున నక్కడకు నడపు మనుటయు.

342. ఆ. ఆతఁ డట్ల చేయ నరవాయి గొనక సు
శర్మ దాను ననుజచయముఁ బెలుచ
[1]నెయిది పార్థపార్థ యిట్లు వోఁదగునె యే
మనికిఁ బిలువఁ బిలువ ననిన నతఁడు.

343. క. పిలిచిన మరలమి దగ ద
బ్బలములఁ గాచుటయు వలయుపని యైనది నీ
[1]వలసినవిధంబు సేసెదఁ
దలఁకొను [2]మొకతెఱఁగు దైత్యదర్పధ్వంసీ.

344. చ. అనుచు మురారిఁ జూచుటయు నాతఁడు దేరు మరల్చ మోమునం
గినుక మునుంగ న వ్వాలయఁ గ్రీడి త్రిగర్తుని చాపదండకే

---

341. 1. గుణచండక్వణన – హ. 2. దళ – పెక్కు ప్రతులలో లేదు. 3. ధ్వజంబు – ఈ. త. 4. కుంభవంశ – వా; కుంభాంకుశ – కొన్ని ప్రతులు. 5. శ్శరాసిముసల – కొన్ని ప్రతులు.

342. 1. నేగి – ఈ; నడరి – వ.

343. 1. వలచిన – ఇ. ఉ. ఊ. ఎ. ర. కొన్ని ప్రతులు. 2. మేపనికినైన – ఊ. ఎ. వ.

తనములు ద్రుంచి పైపడినతమ్ముల నంతకుఁ బోలి కన్పి యా
తని నవలీల నొంచిన నతఁడు [1]వెసం బడి మూర్ఛ వోవుడున్.

345. వ. మగిడి యట నిరూపించి నారాయణు నుద్దేశించి.

346. సీ. [1]పాఱెడుమనసేన మఱగెడుఁ [2]బెందూళి నభము గోలాహలక్షుభిత మయ్యె
భగదత్తుకుండాల మెగచుచు నున్నది యలఘుము వేగదానిపై రథంబు
నావుఁడు నతఁడు మహావేగమున రథ్యములఁ దోలఁ[3]గఁ గిరీటి యలవుఁ జలము
మెఱయంగ నీమొన మెఱుఁగువాలమ్ముల [4]ఱుము సేయుచు సింహ
నాదమునకుఁ

తే. బ్రాపులై దేవదత్తంబు [5]రవము గుణము
రావమును దిక్తటంబుల బ్రయ్యఁ జేయ
వచ్చి విచ్చుఁ డడ్డంబు సొచ్చె వీఁకఁ
జండ[6]చేష్టితోద్దండవేదండమునకు.

347. క. అనిన విని ధృతరాష్ట్రుం డి
ట్లను సంజయుతోడ భీషణాటోపత న
ర్జునుఁ [1]డిక్లెయిదిన భగద
త్తుని కతనికి నేమిభంగి దుర మయ్యెనొకో.

348. ఉ. నావుడు నాతఁ [1]డాధరణీనాథున కిట్లను నట్లు దాఁకినం
జేవ దలిర్ప విక్రమ[2]విశృంఖలుఁ డై భగదత్తుఁ డుగ్రబా
ణావళిఁ బార్థుపైఁ బఱపె [3]నన్నియు నవ్వుచుఁ ద్రుంచి వైచి య
ద్దేవసముండు నొంచె దృఢదీప్తశరంబుల దంతి నాతనిన్.

---

344. 1. వసంబరి – అ. ఆ. ఈ. ఉ.

346. 1. పాఱెడి – అ. ద. న. శ. 2. గెందూళి – పెక్కు ప్రతులు. 3. నలిగిట్టి – ఆ. ఉ. ఊ. ఏ. ర. కొన్ని ప్రతులు. 4. నఱకుచుఁ దగ సంహ – శ. ష. 5. పాంచజన్యరావమును – ఏ. ఐ. 6. దోర్దండవేదండతండ – జ. ట. బ.

7. 1. డక్లైదిరిన – ర. వీ. శ. ష. కొన్ని ప్రతులు; డట్ల యడర – హ.

3. 1. డమ్మనుజ – ఊ. ఎ. ఏ. 2. విజృంభితు డై – ఊ. ఎ. ఏ. 3. నవ్విశిఖంబులు – వీ. శ. ష.

349. తే. అలుఁగుటమ్ముల దాఁకిన నలిగి భద్ర
[1]కుంభి రౌద్రంబు సొంపారఁ గొలిపె నతఁడు
వారిసేనల గోపికాకారుఁడు నరుడు
దెగిరి తెగి రనుపలుకుల దిగులు పుట్ట.

350. క. బలువిడిఁ గరి గవియుఁడు వెసఁ
దొలఁగించె రథంబు వెరవుతో హరి యది యి
ట్టుల మగురయమునఁ జని త
ద్బలము బడల్పడఁగఁ జేసెఁ బార్థసముఖ్యా.

351. క. హరి నేమియు నన నేరక
కరిదెసఁ గనుఁగొనుచు నవుడు గఱచుచుఁ బో ని
నిమ్మరద మని పలికెఁ గవ్వడి
హరులను సమ్ముఖము సేసె నతఁ[1]డు గరటిన్.

352. క. శౌరిమెయిని భగదత్తుఁడు
నారసములు [1]నినిచి యేసె నరుఁ డగ్గి మహో
దారోద్ధతిఁ దచ్చాపని
దారణ మొనరించి గ్రుచ్చెఁ దనువునఁ దూపుల్.

353. సీ. కోపంబు గదిరి ప్రాగ్జ్యోతిషపతి చతుర్దశతోమరము లింద్రతనయుమీఁద
నడరించుటయు [1]నవి పొడి సేసి క్రీడి యేనుంగు పక్కెర చిలునుగ్గు సేయ
నది గప్పియున్న [2]మేఘాలి విచ్చిన [3]కొండచందంబున నుండె శక్తి
గొని భగదత్తుండు దను[4]జభంజను వైవ నడుము [5]ముత్తునియగా
నఱికెఁ బార్థుఁ

---

349. 1. దంతి...దఱిమె నతఁడు - పీ. శ. ష. స. శ.

351. 1. డుం గరిటిన్ - వ. కొన్ని ప్రతులు.

352. 1. నించి - అ. ఊ. ఎ. ప.; గ్రుచ్చి - ద. వ.

353. 1. నెడ పొడి సేసి - ఈ. ఉ. ఊ. ఎ. ర. స. హ. శ. కొన్ని ప్రతులు. 2. మేఘాలి విచ్చిన పొల్చుకొండ - క. డ. వ హ. 3. నొప్పారు గిరిభంగి - ఈ. 4. జాంతకుని వైవ, - పెక్కు ప్రతులు. 5. తు త్తునియగా - అ. ర.

తే. డాతపత్రంబు [6]దునిమిన [7]నతనిమకుట
మతఁడు [8]ఘనతోమరంబున నఱలఁ జేయ
మెచ్చెఁ గిరుకయుఁ బొడను విశ్వచ్చుఁ డుగ్ర
విశిఖసంతతిఁ జొనిపె నశ్వరు[9]మేన.

354\. మ. రథసో[1]ద్రగతిఁ [2]బూన్చి దీప్త లడరం బ్రాగ్జ్యోతిషాధీశ్వరుం
డభిమంత్రించి నిజాంకుశంబు ననిజేంద్రాపత్యవక్షంబు సూ
చి భుజోల్లాసవిభాసి యై వెఱచ వైచెం దద్బలం బెల్ల భూ
రిభయోద్రేకతరంగితం బగుచు ఘూర్ణిల్లంగ రౌద్రాకృతిన్.

355\. ఉ. అప్పుడు శౌరి పార్థునకు నడ్డముగాఁ దన[1]మే నమర్చి ను
న్గ ప్పెసలారు [2]పేరురము[3]నఁ ధరియించిన నమ్మహాస్త్ర[4]మం
దొప్పె నవారుణాంబుజ[5]కృతోజ్జ్వలమాలిక యై [6]చిరస్థితిం
జొప్పడి నూతనాత్రతఁశోభిత మైన మెఱుఁగుచాడ్పునన్.

356\. చ. కనుఁగొని ఫల్గునుండు మురభున్మర యిట్లగునయ్య [1]సొంపు నొం
దినకరుణావిశేషమునఁ దేరికి సారథి వైతి గాక యే
పను[2]లును బూని [3]చేయు టిది పాడియె తేజము నీవు దప్పఁ జూ
చిన [4]జెడదే నసుం జులుకఁ జేసితి మాటలు వేయు నేటికిన్.

---

6\. ద్రుంచిన – ట. ద. నరికిన – ఔ. న. 7. నలిగి – వ. 8. శిఖర తోమరమున– హ. 9. నొడల – ఆ. ఇ. ఈ. ల. కొన్ని ప్రతులు.

354\. 1. ద్రేకముతోడ – ప. బ; ద్రేకత బూన్చి – ఒ. 2. జూచి – ఖ. జ. ఝ. ట. త. వ; బూని – హ.

355\. 1. మేను సేర్చినన్, మేన జేర్చుదున్–అని పాఠములు. 2. వక్షమున గ్రక్కున నిల్చిన నమ్మహా – అ. 3. గ్రాల ధరించిన యమ్మహాస్త్ర – పీ. 4. మట్లొప్పి – ఊ. ఎ. ఏ; ఔ. 5. సముజ్జ్వల – గ. జ. ట. బ. 6. రణస్థలిన్ – గ. జ. బ; రణస్థితిన్ – అ. ప. వ.

356\. 1. పెంపు నొందిన–ష. 2. లకు బూని–ఇ. ఊ. ఏ; లకు బూని నీకిదియు పాడియె– ఊ. ఏ. 3. చేయు డిది పాడియె – అ. ఆ. ఉ. ఒ. ఖ. కొన్ని ప్రతులు; చేయనని పాడియు దేజము – ర. 4. నగరే – ద. వ.

357\. వ. అని దూఱినం గృష్ణుండు దొల్లి భూమిదేవి గామించి యోగనిద్రాసమయావసానసుప్రబుద్ధుం డై యున్నవిష్ణుకడకుం జనుటయు నతండు తత్సంగతిం బ్రీతుం డై యున్నాతికి వరం బిచ్చుటయు నవ్వరంబున [1]నవ్వేలంది యం దుదయించిన నరకునకు వైష్ణవాస్త్రంబు విధేయం బగుటయు నది భగదత్తాయత్తం బై యునికియుం [2]దద్ఘోరసాధనంబు దనకుఁ దక్క నొరులకు నోర్వ రామియు నెఱింగించి యది యట్లు కాక దీన [3]నెగ్గేమి యని మఱియుం దగుమాటలం గిరీటి [4]ననునయించి విరోధిం జూపి వీఁ డిప్పరమసాధనంబు వృథ [5]యగుటం జేసి వెఱంగు పడియున్నవాఁడు వీనితండ్రిని నేను దెగఁ జూచిన ట్లీ కూరకర్ముని బిలుకుమార్పు మనినఁ గొండొక [6]దేఱి యాతండు గాండీవగుణంబు సారించి దృఢముష్టి నేయుటయు.

*-: భగదత్తుండు సుప్రతీకంబుతోడ నర్జునుచేఁ జచ్చుట :-*

సం. 7-28-40

358\. ఉ. వాలిక దొడ్డనారసము వజ్రము శైలము దాఁకునాకృతిన్
ఫాలముమీఁదఁ దాఁకిన నిభంబు [1]వెసం బడి కొమ్ము లూఁతగా
వ్రాలుడు నర్ధచంద్రరుచిరప్రదరంబునఁ ద్రుంచె బాణవి
ద్యాలసితుండు గ్రీడి భగదత్తునికంఠ మకుంఠితోద్ధతిన్.

359\. వ. ఇట్లు దంతిని భగదత్తునిం [1]బరిమార్చి మాఱు లేక మలయు మధ్యమపాండవునిం గనుంగొని శకునితమ్ములు [2]వృషకుండును నచలుండును దాఁకిన నతండు వృషకుని రథరథ్యసూతధ్వజచ్ఛత్రచామరంబులు రూపఱ నఱకుటయు నాతండు సోదరునిరథం బెక్కె నప్పుడు వారి కడ్డుపడిన గాంధార

---

357\. 1. నన్నాతియందు - ఊ. ఎ. ప. 2. దద్ఘోరాపాతంబుదనకు - అ. ఆ. ఇ. ఈ. పెక్కు ప్రతులు. 3. నెగ్గేమి - పెక్కు ప్రతులు; నేమి - వా. 4. ననూనయించి - శ. ష. పెక్కు ప్రతులు. 5. యగుటకు - కొన్ని ప్రతులు. 6. దెలిసి - కొన్ని ప్రతులు.

358\. 1. ధరంబడి; వసంబరి - అని పాఠములు.

359\. 1. బిలుకుమార్చి - స; దునిమి - ట. ద. 2. వృతుండును - పెక్కు ప్రతులు.

వీరరథికపంచశతంబుఁ బంచత్వంబు నొందించిన సంక్రందననందను నరవడికిం దెరలక యేకరథస్థు లగునయ్యిరువురుం బరాక్రమించిన.

360. తే. చేరి యుండుట ననువైనవారి నొక్క
నారసంబునఁ బడ నేసె నరుఁడు దానిఁ
జూచి కన్నీరు [1]నించి నీసుతులు సాలఁ
గుంది రర్జును నపుడు మార్కొనియె శకుని.

361. వ. అతండు మాయావి యగుట ననేకమాయలు గల్పించిన మొగిళ్లు [1]వరపి పాషాణశస్త్రవివిధాయుధంబులు విచ్చుపైఁ గురిసెం బదంపడి తమం బడరెఁ బిదప నీళ్లు వెల్లిగొనియె మఱియు మహోరగశార్దూలాది క్రూర సత్త్వంబులు గవిసె వారి నెల్లను దోడ్తోన దివ్యాస్త్రవేది యగునాసవ్యసాచి యడంగించి యల్లని నగవుతో ని ట్లనియె.

362. క. మాయలు జూదముతోడన
పోయెం గా కింక నిచటఁ బోసఁగునె యవి మ
ఱ్ఱాయకము లడ్డసాళ్లే
నీ[1]యాచవి లేదు పొమ్ము నిలువక మామా.

363. క. అని [1]పలికి [2]వాలుటమ్ములు
తనువున నినుచుటయుఁ గలఁగి ధైర్యము మానం
బును విటిఁబోవఁ బాఱెను
జననాయక నీమఱంది సరివారు నగన్.

364. ఉ. ఆతఁడు వాటినం [1]దెరలు నచ్చటిసేనలఁ [2]గాల్కొనంగ నీ
కాతతబాహువీర్యులు బకారియు సాత్యకియుం గడంగి తో

---

360. 1. దొరుగ నీ – న.

361. 1. బరగించి – ఈ.

362. 1. యాసది – అ. ఊ. ఎ. ఏ: యాసలు విడిచి – జ. శ.

363. 1. పలుకుచు వాలమ్ములు – ఊ. ఎ. జ. బ. హ; 2. వాలురమ్ములు – ఇ. ఈ. క. ఘ. చ. శ. కొన్ని ప్రతులు.

364. 1. దెరలె ... సేనలు – కొన్ని ప్రతులు. 2. నూల్కొనంగ – ట. ఠ. త. వ. శ. ష.

దై తనపార్శ్వభాగముల నార్చుచుఁ దోలఁగఁ దోలె ఖేచర
వ్రాతము మెచ్చఁ గ్రీడి కురురాజును ద్రోణుఁడు నున్న నేలకున్.

365. ఆ. బలము విఱిగి రెండుపాయ లై యిట్టు ల
మ్మనుజవిభుని గురుని మఱువు సొచ్చె
ద్రోణుఁ బోదువుఁ డనుచు దుర్దమలీల నా
దిక్కు వారు గవిసి రుక్కు మిగిలి.

366. క. చనుఁ డడ్డం బాచార్యున
కనువెలుఁగులతోడ నీ[1]సుతావలి వెస మా
ర్కొనుటయు మనసేనలు పురి
కొని పాండవబలముఁ దాఁకెఁ గురువంశనిధీ.

367. క. గురుఁ డొడ్డుగఁ దమకంబునఁ
గురువీరులుఁ బాండుపుత్రకులయోధులు ని
ర్భరసమరద్యూతకళా
నిరతిం గ్రీడించి [1]రుగ్రనిపుణత మెఱయన్.

368. క. శరగురుఁ డెచటికిఁ దఱిమిన
వెరవున నచ్చటికి [1]నెల్ల విక్రాంతిధురం
ధరుఁ డగుధృష్టద్యుమ్నుఁడు
బరవసము దలిర్ప నడ్డపడి [2]పోరాడెన్.

369. చ. కురుపతి ధర్మనందను లకుంఠితవిక్రమకౌతుకంబునం
బురికొలుపంగ సైన్యములు పోక పెనంగెడు రౌద్రభంగి క
చ్చెరువడి [1]యున్కి [2]నిట్టు లని చెప్పఁగ [3]నిప్పుడు నేర నయ్యోదం
గరిపురనాథ చూడ వినఁ గల్గునె యమ్మొయికయ్య మెయ్యెడన్.

---

366. 1. సుతానీకముమా - ట. ద. ప.

367. 1. రస్త్రనిపుణత వెలయన్ - ఊ. ఎ. ఏ.

368. 1. వీరవిక్రాంతి - హా; దరమి - ఊ. ఎ. ఏ. 2. పోరె నృపా - హా; పోరాడున్ - ర. వ.

369. 1. యున్న నిట్టు లని - హా; రెల్ల రి ట్లనియు - ణ. 2. నీసుతుని సేనకు పాండు కుమారు సేనకుం - గ. జ. బ. 3. నేనును నేర - ణ. వీ. శ. ష.

370. వ. అట్టియెడ.

371. క. నీలుఁ డనురాజు గురుసుతు
పై లీలం [1]దేలు వఱపఁ బటువిశిఖమునం
గీలెడపినజంత్రముక్రియ
నేలం బడ నేసె నతఁడు నృపుఁ డగ్గింపన్.

372. క. చచ్చిననీలునిఁ గనుఁగొని
విచ్చినసైన్యంబు గురుఁడు వెనుకొనుటయు వే
వచ్చినధృష్టద్యుమ్నుని
నచ్చినయబ్బలము మగిడినం బోరొప్పెన్.

373. వ. అప్పుడు సంశప్తకులు నారాయణగోపాలబలంబులం గూడికొని వఱతెంచి.

374. క. ఓడితిమె మేము రణమునఁ
గ్రీడికిఁ గ్రేడించి రాక గెలుపే యతఁ [1]డేఁ
డీ డాఁగి పోయెనొక్కో మా
తోడిబవరి మిట్లు జాను [2]దొలఁగినఁ దెగునే.

375. వ. అనునెలుంగులు నింగి ముట్ట దక్షిణభాగంబునం గవిసినం గవ్వడి యట నడచి వారికిం గయ్యం బిచ్చిన నత్తెఱపి గని తఱుము కౌరవయోధులకోలు తలకిం గాక దమసేనలు దెరలిన భీమసేనుం డదల్చి మార్కొని.

376. క. ఎఱ మిగిలి వచ్చు బాహ్లికు
నిలు మని విశిఖముల [1]నొంచె నృపతియు గురుక
ర్ణులు నశ్వత్థామయు న
ప్పలవానలు గురిసి రొక్కమొగి నతనిపయిన్.

---

371. 1. దేరు (సాధురేఫముతో) - వీ. శ. ష.

374. 1. డిచ్చో డాగి - ఖ. శ. శర. ష. సూ; డున్, వేడి చెడి దాగెనొక్కొ మా, తోడి - గ. చ. దేవేడీ డాగె నొక్కోమా - గు. తి. ద. స. శ. 2. దొలగుం జనునే - గు. తి.

376. 1. నొంప - పెక్కు ప్రతులు.

377. వ. అంతం దంపలు కన్నిరూపులై యార్చుచు నేట్లాడెనిట్లొక్కనిం బెక్కండ్రు వొదివినం గనుంగొని కౌంతేయాగ్రజుండు పురికొలుప నకులసహదేవ సాత్యకిసౌభద్రు లాసమీరపుత్త్రునకు బాసటయై దుర్యోధనాదులం దల పడుటయు రెండుసేనలు గలయఁ బెరసె నిట్లపరాహ్ణంబునం గ్రందుకయ్యం బయ్యెనం దరదంబులు దాఁకుపెల్లున డొల్లుకరులును గరవాలధారలం గానవగు కుంభికుంభమౌక్తికంబులును దురగఖురపుటంబులం గరటి[1]రదం బులను బెనంగొనుచు వ్రేలువ్రేవులును దెగిపడియు నంకుశంబులు విడువక మిట్టిమిట్టిపడుబాహువులును దొండంబులం బెనఁచి యెత్తినం [2]దారును హయంబులు వ్రేలురావుతులును ముందఱికాళ్లు దెగ వేసిన మ్రొగ్గి కూలు శుండాలంబులును సామజంబు లడరి రథ్యసారథిరథికసహితంబుగా మల్లడి గొనం ద్రొక్కిన నేలం గలసినరథంబులును నాశ్వికు లొక్కమొగిఁ జెక్కినం దునిసి పడి యేమిటియంగంబులో యనుసందేహంబునకుం బట్టయి యున్న పదాతిగాత్రఖండంబులును జూచుఖేచరులకు వెక్కసం బొనర్చె నట్టిసంకుల సమరంబున ధృష్టద్యుమ్నుండు.

378. క. మన కిది సమయము సుండీ
యని ద్రోణునిఁ జూపి తలుమ నమ్మొన రథికుల్
గని [1]పొదువుఁడు సంపుఁడు పొరి
గొనుఁడు దునుముఁ డనుచుఁ గూడుకొని యతనిపయిన్.

379. చ. కవిసిన నమ్మహాభుజుఁడు గన్నుల దట్టపుఁగెంపు పెల్లరప్ప హై
రవముగ దివ్యబాణనికరం బడరించినఁ దేఱి చూడ రా
క వెఱఁగు నొంది చి తము ల్కై వడి [1]నాఘనయోధు లుండ నీ
రవుతులు జోదులుఁ రథికరాజియు వారమొనల్ గలంపగాన్[2].

380. మ. తను నత్యు[1]ద్ధతిఁ బిల్చి దుర్దమభుజాదర్పంబు శోభిల్లఁ దాఁ
కినసంశప్తకకోటి [2]నొంచి సమరక్రీడాకళాకౌతుకం

---

377. 1. పదంబులను, రవణంబులను - వ. 2. దొరగు, తూగాడు - అని పాఠములు.

378. 1. పొడువుడు - క. డ. త. ళ.

379. 1. నాహవయోధు లుండ - ర. ఈపద్యము తరువాత 'ఇ' ప్రతిలో నీక్రింది వచన మధికముగాగలదు. వ. అంత నక్కడ నర్జునుండు.

380. 1. త్యుగ్రత - ద. ప. వ. 2. నొర్చి - ఈ. ఖ. వ.

బున నాభీలకపీంద్రకేతనపరిస్ఫూర్జత్ప్రభాజాలముల్
వినువీథిం బరగంగ వచ్చె మగుడన్ విస్వచ్ఛుఁ డచ్చోటికిన్.

381. క. చిచ్చునకుఁ దోడు గరుఁగాలి
వచ్చినక్రియ భీముకడకు వాసవి యిమ్మై
వచ్చిన మనయోధావళి
చిచ్చువడియె వారిమొన దటిమికొని వచ్చెన్.

382. ఉ. బాసట యై వృకోదరుఁడు పార్శ్వమునం దలుమంగ వైరిసం
త్రాసనమూర్తి వాసవి శరప్రతతిం దొరఁగించి ద్రోణును
ల్లాసము [1]మాన్చి కౌరవబలంబులు నెత్తురువెల్లిఁ దేలఁగాఁ
జేసినఁ గర్ణ కర్ణ మముఁ జేకొనవే యనుచున్ భయంబునన్.

-: కర్ణార్జునులయుద్ధము :-

సం. 7-31-49, 50

383. క. తనవెనుక [1]దెసకు పాటిన
ఘనయోధులఁ జూచి బాహుగర్వస్ఫూర్తిం
దనరుచు నోడకుఁ డోడకుఁ
డని పలుకుచుఁ దాఁకెఁ గర్ణుఁ డమరేంద్రసుతున్.

384. వ. ఇట్లు దాఁకి యతనిపై నాగ్నేయాస్త్రంబు బ్రయోగించిన నతండు వారుణ
బాణంబున [1]వారించి వాలమ్ములు గురియం గూడ కొని భీమసాత్యకిధృష్ట
ద్యుమ్నులు శరత్రయంబులు సూతసూనుమేన నాఁటించిన నతండు గాండీవ
నిర్గతచండమార్గణంబుల మగిడించుచు నమ్మువ్వురచాపంబులు నవ్వుచుం
ద్రుంచి వారలు శక్తులు వైవ వానిం దునిమి పేర్చి యార్చిన నర్జునుండు
నారాచ[2]నిస్తరంబున నవ్వీరు నొప్పించి యతనిం దలకడచి తమ్ముఁ దల
పడినయతనితమ్ములతలలు మూఁడను భూమిదేవికి బలి సేసె నంత భీముండు

382. 1. మాపి - పెక్కు ప్రతులు; మాయ - హ.

383. 1. దెసకు - పెక్కు ప్రతులు; కోడి - వా.

384. 1. మరలించి - ఊ. ఎ. ఏ. 2. నిచయంబున - ఊ. ఎ. ఏ.

రథంబు డిగ్గి వచ్చి గదాదండంబునఁ గర్ణబంధువులం బదివేవురం [3]బడలు వఱచి మరలి రథస్థుఁ డై వేఱొక్కవిల్లు గొని విశిఖంబులు వఱపి యంగ పతియంగంబులం దురంగశరీరంబులను నొప్పించె నాలోనన యప్పాంచాల వరసుతుండును శైనేయుండును నొండు[4]విండ్లు గొని యతనిసారథి యొఱ గను జాపంబు విఱుగను నేసి రాసమయంబున దుర్యోధనుండును ద్రోణ జయద్రథులును [5]నెయిది శాత్రవసముద్రంబున మునుంగకుండ నారాధేయు నుద్ధరించి రట్టియెడ.

385. క. ఉభయబలంబులుఁ బురికొని
[1]యిభరథతురగభటతతి మహిం గూలఁగ [2]న
తుభితము లై పోరాడెం
బ్రభువులు వెను దన్ని చూడఁ బార్థివముఖ్యా.[3]

386. సీ. కాలువ లై పాఱుకీలాలజలములఁ దేలి [1]పోయెడుమృతదేహములును
బ్రేవులప్రోవుల బెల్లునఁ జిత్రితచ్ఛాయమౌ లగుమాంససంచయములుఁ
గరిహయంబులకళేబరములక్రిందఁ గొండొకతోఁచు భటగాత్రనికరములును
దలలపెందఱచులో మిలమిల మెదలెడు కరపదం[2]బుల నవఖండములును

తే. రౌద్రభీభత్సనర్తనరంగభంగి
నపుడు సమరాంగణము ఘోర మయ్యెఁ జూడ
ద్రోణఫల్గుననిష్ఠురోద్ధురనిపాత
జాత మగు నమ్మహోత్కటో[3]సంకులమున.

---

3. బడనేసి - కొన్ని ప్రతులు. 4. విళ్ళు - కొన్ని ప్రతులు. 5. నెదిరి - అ. ఊ. ఏ. ట.

385. 1. యిభాది చతురంగబలములు మహిం - అ. ఆ. ఈ. ఉ. శ. హ. పెక్కు ప్రతులు. 2. సంతుభితము లై - ఆ. ఉ. ఊ. ర. వ. హ. కొన్ని ప్రతులు. 3. ఈపద్యము తరువాత 'న' ప్రతిలో నీక్రింది వచనమధికముగా గలదు. వ. అట్టి యవసరంబున.

386. 1. పారెడు, యాడెడు - అని పాఠములు. 2. బులు నూరు ఖండములును - ఖ. గ. శ. ష. 3. సంగరమున - ఇ. ఔ. చ. జ. బ.

387. వ. అంతం బతంగుండు పశ్చిమా[1]చలంబునవులకుం జనిన సంధ్యారాగంబు సొంపునం గెం పినుమడించునెత్తురుమడువుల నోలలాడుభూతబేతాళంబులను శవకబళనలోలంబు లగుసృగాలంబులను [2]మాంసచర్వణకోలాహలబహుళంబు లగుకంకగృధ్రాదిపక్షికులంబులుసుం జూచియుఁ బాండవబలంబు సమయసముచితం బగుసమర[3]విరామంబునకు నున్ముఖం బగుట యెఱింగియు మున్ను సవ్యసాచియురవడికిం గాక తమమొన దెరలుచునికిం జేసియు [4]నదియు మెయిగా నాచార్యుండు దొరలకుం జెప్పి సేనలం దివియ నియోగించెఁ బాండవసైన్యంబులును మఱి నిర్విధంబున నుభయసైన్యంబులు నిజస్కంధావారంబులకుం జనునవసరంబున మనజనంబులు ద్రోణుప్రతిజ్ఞాభంగంబును ఫల్గునుపరాక్రమస్ఫురణంబును నతనియెడ నచ్యుతునకుం గల [5]సౌహార్దవిశేషంబును నుగ్గడించుచు విన్ననై పోయిరి వేగుటయుఁ గయ్యంబునకు వెడలునప్పుడు విషాదవివర్ణవదనుం డగుచు నీతనయుఁ డెల్లయోధులు వినం గుంభసంభవున కిట్లనియె.

388. మ. పెనుపారఁ వర మిచ్చి [1]తట్లు [2]గడిమిఁ భీమాగ్రజుం డాఁటఁ గి
ట్టినఁ బట్టం గడునగ్గమైనయెడఁ గ్రేడిం దెప్ప నిల్లైనఁ జా
లనివాఁ డందురు నిన్ను నన్నుఁ గుటిలాలాపంబులఁ వెట్టిఁ జే
సిన నీకైనది యేమి యాశ్రితగుణశ్రేష్ఠుండు వంచించునే.

389. వ. అనిన విని గురుం డప్రీతుం డయ్యును గటకటం బడక యతనితో ని ట్లనియె.

390. ఆ. నరునివిక్రమంబు నారాయణునిమహ
త్త్వంబు నెఱిఁగి యెఱిఁగి తగునె యిట్లు
వలుక ధర్మపుత్త్రుపైఁ జేయి [1]వదలక
వారు రారె పెక్కువరుస లధిప.

---

387. 1. చలశృంగంబునవుల – కొన్ని ప్రతులు. 2. మాంసాక్రమణ – శ. ష. పెక్కు ప్రతులు. 3. విహారంబునకు విముఖంబు గాకునికి యెఱింగి–పీ. శ. ష. కొన్ని ప్రతులు. 4. నదియ మేలుగా – ఖ. డ. త; నదియ మెల్పుగా – ఊ. 5. స్నేహార్ద్రి – హ.

388. 1. యట్లు, తెట్లు – అని పాఠములు. 2. కరుణన్ – ఎ.

390. 1. పుచ్చగ – కొన్ని ప్రతులు.

391. ఉ. ఎవ్వరి నెట్లు సేసెదనొ యేర్పడఁ జూడుము [1]నేఁడు పోరికిన్
గవ్వడి రాకయుండఁ దొలఁగం గొనిపోవఁగఁ జాలువారి నీ
వెవ్వరి నైనఁ బంపు మిది యేటికి నొండొకబుద్ధి సేసెదే
నవ్వుచుఁ బల్కినన్ ధరణినాథ య[2]సత్యము గల్గ నేర్చునే.

392. వ. అనవుడు.

393. మ. విని సంశప్తకు లేము దక్క నొరు లావివ్వచ్చు భంగించి బె
ట్టనికిం బాపి [1]యలంప నేర్పు గలరే యంచున్ వెసం బోయి పి
ల్చిన నప్పార్థుఁడు నుద్ధతిం జనుడు నక్షీణోగ్రశస్త్రాస్త్రవ
ర్తనఘోరం బగుసంగరం బచట [2]రౌద్ర[3]స్ఫీత మైఁ జెల్లగన్.

394. వ. ఇక్కడ భారద్వాజుండు పద్మవ్యూహంబు [1]గావించినం గౌంతేయాగ్రజునను[2]మతి నభిమన్యుం డయ్యొడ్డు భేదించి చొచ్చి బృహద్బలలక్ష్మణప్రభృతులగు భూపతులను భూపకుమారులను బెక్కండ్రం బొరిసమరి యనేకయోధవీరవిక్రమసంకులంబునం జిక్కువడి యుక్కు[3]మురిసినట్లు సమసిన మనమొనలు సెలంగుచుం బాండవబలంబులు పొగులుచుం దమతమ[4]యునికిపట్లకుం జనియె నని సంజయుండు ధృతరాష్ట్రునకు సౌభద్రుండు పడుట సెప్పె ననిన విని నాఁటికయ్యంబుకలరూపంతయు నేర్పడ నెఱింగింపు మనుటయు.

395. ఉ. సాత్త్యవతేయవాఙ్మయవిశాలగృహస్ఫురితప్ర[1]దీపికా
ప్రత్త్యయగోచరా విహృతిభగ్ననిశాచరశాంతబోధసం
పత్త్యవినాభవన్మహిమభాసురసంభృతభూ[2]సురాశిసాం
గత్త్యవివిక్తయుక్తజనకౌశలభావిత దేవసేవితా.

---

391. 1. నేటిపోరికిం – ఓ. ర. 2. సత్యత – ల. శ. ష. కొన్ని ప్రతులు.

393. 1. యలర్ప – న. బ. హ. 2. నుగ్రస్ఫీత మై – ల. హ. 3. స్ఫీత – పెక్కుప్రతులు; స్ఫూర్తి – వా.

394. 1. సంఘటించిన – ఊ. క. డ. ర. వ; పన్నిన – ఒ. 2. మతంబున – ఈ. ఊ. ఔ. గ. 3. మడిసె – అ. ఎ. 4. విడిదలలకుం – ఊ. ఎ.

395. 1. దీపికా – అ. ఊ. ఎ. ఘ. ఝ. ర. స. శ. హ. 2. సురాది – కొన్ని ప్రతులు

396. క. వేదశిరోమణిచరణా
నాదాంత[1]స్ఫారకరణ నైమిక[2]తరణా
భేదరహితప్రకారా
వాదవిదూరా విరించి[3]వర్యవిహారా.

397. మాలిని. అనుపమహితవిద్యా వ్యక్తయోగానురక్తా
దనుజమథనలీలా స్తవ్యశాంతానుభావ్యా
జననమరణదుఃఖో[1]త్సారి [2]సర్వోపకారి
సనకముఖయతీంద్రాసన్న నిత్యప్రసన్నా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధానవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన
శ్రీమహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము



---

396. 1. స్ఫార, స్ఫురణ - అని పాఠములు. 2. శరణా, కరుణా - అని పాఠములు.
3. వర్ణ - శ. పెక్కు ప్రతులు; వర్ణ్య - క. ష. స. శ; వర్ణ ప్రవరా - హ.

397. 1. త్సాది - ఊ. ఏ. ఘ. ఝ. 2. సంహారకారి - జ. బ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - ద్వితీయాశ్వాసము

—o—o—o—

1. క. శ్రీకర భక్తాంభోధిసు
ధాకర చక్రత్రిశూల[1]ధారణ రక్షో
భీకర నిర్భరతరకరు
ణాకరదృగ్దీప్తినికర హరిహరనాథా.

*-: ద్రోణుని మూఁడవనాఁటి యుద్ధము :-*

**సం. 7_32_25**

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దనమనుమండు మృతిం బొందుట విని ధృతరాష్ట్రుండు.

3. ఉ. చిత్తము వొక్కెడుం బురుషసింహునిఁ బౌత్త్రకులాగ్రగణ్యు న
త్యుత్తమతేజు భూరిగుణు నొప్పెడు మెత్తనిమేనివాని నె
ట్లుత్తలపెట్టిరో పలువు రుగ్రమనస్కులు గూడి యక్కటా
యత్తెఱఁ గెల్లఁ దేటపడు[1]నట్టులుగా వివరించి చెప్పుమా.

4. వ. [1]అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను నట్లు భారద్వాజుండు పద్మవ్యూహంబు [2]సంఘటించునెడ వివిధదేశంబులరాజులు దళంబులును

---

1. 1. దారుణ - ఝ.

3. 1. నట్లుగ నాకెఱిగించి - వ; నట్లుగ నా కెఱిగింపు సంజయా - అ. ఓ. చ. జ. బ; నట్లు దగన్ వివరించి, నట్లు కడున్ వివరించి - అని పాఠములు.

4. 1. అని యడిగిన - పెక్కు ప్రతులు. 2. సమకట్టునెడ - త.

రాజకుమారులు గేసరంబులును గర్ణదుశ్శాసనబహుళసేనాపరివృతుం డయి కురువిభుండు గర్ణికయునుం గా నభేద్యభంగి నొనర్చిన నది వలయాకారం బగుటం జేసి చక్రవ్యూహంబు నాం జను నమ్మొగ్గరంబు[3] మొగంబునం దాను దర్పంబు మెఱయ నెఱయం బొలిచి నిలిచె మఱియు వలయునెడలకు లావై జయద్రథగురుపుత్రకృపశకునికృతవర్మభూరిశ్రవశ్శల్యులును నీకొడుకు లును మనుమలును రక్తమాల్యానులేపనాంబరాభరణంబులు శోభిల్ల నిలిచి రంత భీమసేనప్రముఖం బైనపాండవబలంబులు గదియ నడచె నందు సాత్య కిధృష్టద్యుమ్నకుంతిభోజులును జేకితాన[4]క్షత్రధర్మక్షత్రవర్ములును ధృష్ట కేతునకులసహదేవులును నుత్తమౌజశ్శిఖండియుధామన్యులును ఘటోత్కచ విరాటద్రుపదులును ద్రౌపదేయకేకయసృంజయసముదయంబును [5]నుక్కునం దఱిమి యక్కుంభసంభవుం దలపడిన నవ్వి యవ్వీరుండు వాఁడి మిగులు బలుతూపులం దనవేఁడిమి సూపిన నమ్మేటివిలుకాని మొగంబున నిలువ నోర్వక యాసైనికప్రకరంబు దిరుగుడు వడిన వెక్కసంబును వెఱఁగుపాటును వెల్లఁ దనఁబునుం గదుర గౌంతేయాగ్రజుం డూరకుండి కర్ణికారకేతుస్ఫీతుండును నుత్సాహశౌర్యసంపద్దుర్నిరీక్ష్యుండును నగు సౌభద్రుం గనుంగొని వీఁడు దక్క నొరు లీధృఢవ్యూహంబు భేదింపం జాల రని మనంబున నిశ్చయించి యక్కుమారు నుద్దేశించి.

5. సీ. ఈయొడ్డు భేదింప నే మెవ్వరము [1]నేర మర్జునుండును నీవు నచ్యుతుండుఁ
బ్రద్యుమ్నుఁడును [2]దక్కఁ బార్థుఁడు మనల నుల్లస మాడకుండ
నీలావు మెఱపి
భేదించి మాకెల్ల బ్రియ మొనర్పు కుమార యనవుడు నతఁ డాననాబ్జ మలర
దీనిముఖంబు భేదించుతెఱంగు నా కెఱిఁగించె మాతండ్రి యేను దెఱపి

ఆ. సేయ నేర్తుఁ జొచ్చి చించి చెండాడెద
మూఁక [3]లెల్లఁ జుట్టుముట్టినపుడు

---

3. ముఖంబున – కొన్ని ప్రతులు. 4. క్షత్రధర్మ – ఈపేరు కొన్ని ప్రతులలో లేదు.
5. నుక్కు మిగిలి – కొన్ని ప్రతులు.

5. 1. జాల – ఊ. ఎ. ఏ. ఘ. 2. గాని – కొన్ని ప్రతులు. 3. పోర జుట్టుముట్టి – అ. ఆ. ఉ. ఊ. ర. కొన్ని ప్రతులు.

వెడలు నట్టి [4]వెరవు విన దాని కేమి నా
చొచ్చునేర్పు [5]బలువుఁ జూడు మధిప.

6. వ. అనిన విని ధర్మనందనుండు ధనంజయనందనున కిట్లనియె.

7. క. తెలిపి గొని నీవు సొచ్చినఁ
దలియఁదన చొచ్చెదము రిపులు పెల్లగిలఁగ నం
దలమును మా కిది యెంతయు
నులునట్టి[1]వరంబు దీని నొసఁగుము పుత్రా.

8. చ. అనవుడు భీముఁ డిట్టు లను నర్జుననందన నీవు ముంద లి
మ్మొన [1]యొకయింత సించిన నమోఘరయంబునఁ బార్షతుండు నే
నను ద్రుపదుండు సత్యకతనూభవుఁడుఁ విరటుండు నంతనం
త నడరి [2]చింతు మెల్లెడలు దారుణవిక్రమ [3]జృంభణంబునన్.

9. వ. అనిన విని యభిమన్యుం డాతనియాననం బాలోకించి.

10. చ. నను విను కీచకాంతక [1]మనంబున ద్రోణుఁడు మెచ్చఁ జొచ్చి య
మ్మొనఁ గలఁగింప కిట్లు [2]కురుముఖ్యుఁడు ధర్మసుతుండు గారవిం
చినజతనంబు నిష్ఫలము సేయుదునే నరుఁడుఁ సుభద్రయుం
దనయునిఁ గాంచి సంతసము దాల్చుట యంతయు రిత్తఁ బుత్తునే.

11. చ. ఇదె యొకపిన్నవాఁ డడరి యెక్కుడు మూఁకల క్రందు దోలెడుం
గడుపు [1]లవెల్చు గోపకుని కైవడి నంచు జనుల్ నుతింపఁ జే
సెద విని మామ ప్రీతి విలసిల్లఁగఁ దండ్రియు సంతసిల్లఁ బె
ట్టిదుఁ డగుకౌరవేంద్రునకు డెప్పర మయ్యెడుభంగిఁ బేర్చెదన్.

---

4. తెరగు (వు) – ఊ. ఎ. ఏ. య. ల. హ. 5. బలుపు, చెలువు – అని పాఠములు.

7. 1. పదంబు, హితంబు – అని పాఠములు.

8. 1. యిక యింత సొచ్చిన – చ. ద. ల. 2. సొత్తు – ఏ. 3. జృంభణంబునన్ – ఊ. ఏ. గ. వ; ణక్రమంబునన్ – వా. కొన్ని ప్రతులు.

10. 1. రణంబున – ద. ప. వ. 2. కులముఖ్యుడు – ఒ. క. ట. డ. వ. హ.

11. 1. మరల్చు – ద; దెరల్చు – ప; లమేల్చు – హ.

12. క. అనిన విని ధర్మసూనుఁడు
దను బ్రీతిం జూచి నీదుధైర్యము శౌర్యం
బును బలమును గీర్తియు వ
ర్ధన మొందెడు మనుడుఁ బార్థతనయుం డెలమిన్.

13. వ. తనసారథి గనుంగొని మనయరదంబు ద్రోణానీకంబుపైఁ బఱపు మనుటయు
నాసుమిత్త్రుం డర్జునపుత్త్రున కిట్లనియె.

14. తే. బాలుఁడవు నీవు కుంభజ[1]ప్రముఖసైన్య
పతులు ప్రౌఢులు [2]పెక్కులు బవరములకుఁ
జొచ్చి యెఱుఁగనినీచేతఁ జచ్చువారు
గారు బహువిధసమరకర్కశులు వారు.

15. చ. అనవుడు నల్ల నవ్వి యతఁ డాతని కిట్లను దేవయుక్తుఁ డై
యనికి బలారి వచ్చినఁ బురారిగణంబులుఁ దానుఁ [1]బన్నినం
గినిసి కడంగి క్రీడియును గృష్ణుఁడు దాఁకిన నే జయింతు మా
ర్కొని యనుచుండుదుఁ జరకు గొందునె ద్రోణునిఁ దోడియోధులన్.

16. వ. అని పలికి వానియాలాపంబు నాలంబు సేసి యభిమన్యుండు పెలుచం
దఱిమిన వాఁ డనుమానించుచు మనసైన్యంబునకు సమ్ముఖంబుగాఁ దేరు
నడపుటయు వారి[1]సేనయుం దోడన కడంగుటయుం గనుంగొని భారద్వాజ
ప్రముఖయోధు లొండొరులకుం దలమిగిలి యేచి [2]యెదుర్కొని పెలుచ
నిలిచిన సంకులసమరం బయ్యె నట్టియెడ.

-: అభిమన్యుఁడు పద్మవ్యూహంబు భేదించుకొని చొచ్చుట :-
సం. 7-36-14

17. ఆ. మెఱుగు మెఱచినట్లు మెఱయంగ నగదంబు
కర్ణికార కేతుకాంతి వెలుఁగ

---

14. 1. ప్రభృతి - ఖ. వ. పీ. శ. ప. 2. కొక్కొండ్రు బరవసమున - ద. వ.

15. 1. వచ్చినన్ - ద. వ.

16. 1. మొనయును - ప. 2. యెదుర్కొ[illegible] సంకులసమరం - పెక్కు ప్రతులు.

నంపగముల గురుని నలయించి కడచి యిం
ద్రజునికొడుకు మొగ్గరంబు సొచ్చె.

18. వ. ఇట్లనన్యభేద్యం బగునాపద్మవ్యూహంబు భేదించి సొచ్చి సౌభద్రుండు రౌద్రరసోల్లసితమూర్తి యై యందు మహార్ణవంబునం దిరుగు మందర నగంబు చందంబునం గాననంబునం జరియించు తీవ్రానలంబు తెఱంగునం గాలపక్వజనసమాజసంహరణక్రీడనంబు సలుపు శూలి పోలికం గేలిగతుల మెలంగి యమ్మెయి నమ్మోహరంబు [1]ద్రిప్పి కొలిపియుం బోడి సేసియు రూపుమాపియు రణవిహారం బొనరింప నవ్వీరవరు నారాచాదినానావిధ విశిఖవ్రాతంబులు హేతిసంఘట్టనంబున మండుచుం గరుల నుచ్చి పోవుచుం దేరుల విఱుచుచు హయంబుల ధట్టంబుల నుఱుము సేయుచుం గాల్బలం బులం జదుపుచుం గేతువులం ద్రుంచుచు నాతపత్రంబుల నుఱుమాడుచు రథ్యంబులం గూల్చుచు సూతుల గీటడంగించుచు ధనువులం దునుముచు మైమఱువుల వ్రచ్చుచు భూషణంబుల డుల్చుచుం గరవాలంబులం ద్రోయుచు మేనులు సించుచుం దూపులు దూలించుచుం జేతుల నఱకుచు సబళంబులు జడియుచుం దలలు చిదుముచు నంకుశంబులు రాల్చుచు నెత్తురు లురలిం చుచు గండలు సెక్కుచు నెమ్ములు నలంచుచుం బరగిన నమ్మొన చిక్కు వడియును సుడివడియును గలంగియుం దొలంగియు వెఱచఱచియు విచ్చి పఱచియు దీనదశకు వచ్చినం గనుంగొని.

19. క. వీఁక మెయిం గ్రీడికొడుకుం
దాఁకఁగ నీకొడుకు తలఁచి తఱిమి కవిసెం బే
[1]రాకలితో నున్నవారిం
దేఁకువ సెడి చేరుకరిగతిం గురుముఖ్యా.

20. వ. ఇట్లు సౌభద్రుఁ డెనయం జూచుసుయోధనుం జూచి శరాసనగురుండు సైనికవరులకుం జేయి వీచి యెలుం గెత్తి.

---

18. 1. త్రుప్పు డులిపియు - వ.

19. 1. రాకటితో - ఓ. త. శర.

21. క. సరసుతున కగ్గమయ్యెం
గురుధరణీవల్లభుం డకుంఠితగతి మీ
ఱరుగుం డేయుం డడ్డము
చొరుఁడు వెరవు లావు [1]నెఱయ శూరత మెఱయన్.

22. వ. అనుచుఁ దనయరదం బద్దెస మొగంబు సేసి పురికొల్పిన.

23. ఆ. కృపుఁడు గురుసుతుండు గృతవర్మ గర్ణుండు
సౌమదత్తి శలుఁడు సౌబలుండు
పౌరవుండు మద్రపతి వృషసేనుండు
గౌరవేశ్వరుండుఁ గడఁగి రపుడు.

24. వ. అట్లు గడంగి.

25. చ. ప్రకటబలాఢ్యు లొక్కటఁ దిరం బయి పల్వురు పేఁక భూమిపా
లకునకు నడ్డ మైనఁ దవులం బడి హుమ్మని నోరికండ నాఁ
చికొనిన ప్రోఁగు బెబ్బులివిశేషము దోఁపఁగఁ బార్థుపట్టి సా
యకముల నొంచినం దెరలి రందఱు [1]లేళులపిండు [2]నాకృతిన్.

26. వ. ఇవ్విధంబున నయ్యోధవరులు విచ్చిన విచ్చుకొడుకు పేర్చి యార్చుటయు
నాచార్యుండు వీడు వీరిచేత నిలువం డని తా నరిగి యన్నరనందను నెదు
ర్కొనిన వారును గూడుకొని పొదివిన.

27. క. అతఁ డందఱమార్గణములు
నతిరయమునఁ ద్రుంచుచుం దదంగముల శర
ప్రతతులు నించుచుఁ బోరఁగఁ
బతి సేనకుఁ జేయి వీచె బరవస మలరన్.

---

21. 1. మెఱయ - కొన్ని ప్రతులు.

25. 1. లేడులపిండు - వ శ. ష. హ. ,కొన్ని ప్రతులు. 2. చాడ్పునన్, కైవడిన్ - అని పాఠములు.

28\. క. మనసేన పెలుచఁ [1]గడఁగిన
వననిధి వొంగెడు విధంబు వాసవిసుతుఁ డే
చినఁ జెలియలికట్టెలఁ
గును గావఁగ నయ్యె నపుడు కురువంశనిధీ.

29\. వ. ఆసమయంబున.

30\. సీ. రారాజుఁ గృపుఁడును భూరిశ్రవుండు మూఁడేసి యమ్ములు పదియేడు గురుఁడు
వినుము వివింశతి వింశతివిశిఖంబు లాచార్యసుతుఁడు బృహద్బలుండు
నైదు నెన్మిదియును నాలు శల్యుఁడు సప్తశరములు కృతవర్మ సౌబలుండు
రెండు బాణములు పండ్రెండుఁ దొమ్మిదియును దుశ్శాసనుండును దుస్సహుండు

తే. నేసి రర్జునసుతుమీఁద నెల్లవారి
తనువులందును సాయకత్రయము లతఁడు
గ్రుచ్చె నశ్మకుఁ డడరినఁ గూల నేసెఁ
దురగసూతకేతనముల తోడఁ గూడ.

*-: దుర్యోధనప్రభృతిమహారథికు లందఱు నొక్కుమ్మడి నభిమన్యునిపైఁ గవియుట :-*
సం. 7-36-22

31\. వ. ఇవ్విధంబున నశ్మకుండు పడినఁ దెరలుబలంబుల మరలనీక పురికొల్పుకొని యప్పటియాచార్యప్రభృతియోధులను నీకొడుకులలోనఁ గొందఱును గ్రందుగం దఱిమి యనేకాస్త్రశస్త్రపరంపరలం బొదివిన నొదవినకినుకం గిరీటినందనుం డందఱమేనులు నానానిశితవిశిఖవేగంబున నెత్తుట జొత్తిల్లం జేసి కర్ణుపయిం గవిసి.

32\. తే. కంకటము దూఱి యంగంబు గాఁడి [1]పోవఁ
గ్రూరనారాచ మేసిన స్రుక్కె నతఁడు

28\. 1. నడరిన - కొన్ని ప్రతులు.

32\. 1. పార - కొన్ని ప్రతులు.

లీల నట్టిప పఱపి భూపాల నీదు
సుతుల వెనుకకుఁ బఱపె నుద్ధతి దలిర్ప.

33. చ. అడరి నరేంద్రకోటి [1]నుఱుమాడఁగ నత్తఱి శల్యుఁ డెంతయున్
వడిఁ దనుఁ దాఁకినన్ మెఱుఁగు వాలికతూపుల మూర్ఛ వుచ్చి క
వ్వడికొడు కేచి యుద్భటరవంబున నార్చినఁ బెల్లగిల్లి న
ల్గడలకుఁ బాఱె నీవ్వక బలంబులు ద్రోణుఁ డెలుంగు సూపఁగాన్.

34. వ. అప్పుడు.

35. క. సురలును సిద్ధులు విద్యా
ధరులుఁ బొగడుచులిపుఁ జూచుధరణీశులబం
ధురనుతినాదంబులు నం
బరధరణీమధ్యభాగభరితము లయ్యెన్.

36. చ. అన విని యాంబికేయుఁడు మహాద్భుతవిక్రమశాలిఁ [1]బార్థునం
దను మఱి యెవ్వ రట్టియెడఁ దాఁకిరొ నావుడు సూతపుత్రుఁ డి
ట్లను నటులైన శల్యుఁ గని యాతనితమ్ముఁడు మేను వెంచి మా
ర్కొని పదితీవ్రబాణములు గ్రుచ్చెఁ దదంగములం జెలంగుచున్.

37. వ. అట్లు బెట్టేసిన [1]వాసవికొడుకు కోపించి.

38. చ. హయములఁ జంపి సూతుఁ దెగటార్చి పతాక ధరిత్రిఁ గూల్చి చా
పయుతము గాఁగ వానిఘనబాహులు రెండును ద్రుంచి యెంతయున్
రయమునఁ దేరు చక్కడిచి రాజులు రాజతనూజులుం గడున్
భయమునఁ దూలిపోవఁ బటు[1]భల్లహతిం దల డొల్ల నేసినన్.

39. వ. ద్రోణకృపద్రౌణికృతవర్మబృహద్బలకర్ణప్రముఖయోధవరు లొండొరులఁ బేరువేరం బిలిచి బలంబులం బురికొలిపిన రథనేమిగజఘంటాతురంగకింకిణీ

---

33. 1. దునుమాడగ - వ.

36. 1. పార్థనందను - పెక్కు ప్రతులు.

37. 1. వాసవపౌత్రుండు - చ. జ. వ. శ. ష.

38. 1. భల్లమునన్ (లన్) - పెక్కు ప్రతులు.

స్వనసింహనాదమేదురరోదోంత[1]రరౌద్రంబుగా సౌభద్రుం జుట్టుముట్టిన
నతం డట్టహాసంబు సేసి లాఘవలక్ష్యశుద్ధిచిత్రత్వదృఢత్వంబులు [2]మెఱయం
గృష్ణార్జునులు గావించునేర్పు మెఱయం బోరునవసరంబున మండలీకృత
కోదండుండును [3]బటుసంధానస్ఫురితశరనికరుండును నై పరివేష
వలయంబులోనం గిరణస్ఫురణదుర్నిరీక్ష్యుం డగుతపను ననుకరించుచు
గుణఘోషభీషణంబుగా బెడిదంపునారసంబులు వరగించి యార్చి యూర్జిత
గర్జితం బగుచుఁ బలుపిడుగులు దొరఁగించు ప్రళయకాలవలాహకంబు విడం
బించుచు విజృంభించి భల్లాంజలికక్షురప్రకూర్మనఖరప్రభృతిబాణవేణికావితా
నంబుల వెగడుపఱిచిన విచ్చినవాహినుల నిలువరింప నేరక నివ్వెఱపడి
యాచార్యుండు సూచుచుండె ననవుడు ధృతరాష్ట్రుండు సంజయున కి
ట్లనియె.

40. క. మనమున ఖేదము మోదముఁ
బెనఁగొనియెడు మద్బలంబుఁ బీడించెడు నా
మనుమఁ డని వినికి నాతని
[1]యనిపని యటమీఁద నెట్టు లయ్యెం జెపుమా.

41. క. అనుటయు సంజయుఁ డిట్లను
వినుము జనాధీశ యిట్లు విఱిగినసేనం
గనుఁగొని పోవఁగ నీక
ర్జునతనయుఁడు దనరథంబు [1]చుట్టం బఱపున్.

42. వ. కొఱవి ద్రిప్పినతెఱంగు దోఁపఁ బొదివి పోనీక పీనుంగుపెంటలు సేసిన
నప్పు డక్కుమారు నాలోకించి వికాసభాసితవదనుం డగుచు గురుండు కురు

39. 1. రాళంబు నిండరౌద్రంబు - ప. హ. 2. నెఱయ - ఎ. ఔ. వ. శ. ష. 3. బటు శరసంధానస్ఫురిత కరుండును, పటుశరసంధానస్ఫురితదళశతకరుండును - బ. స. శ.

40. 1. పనియటమీఁద నదెట్లువాటిలె చెప్పుమా - వ.

41. 1. చుట్టుం బరపెన్ - కొన్ని ప్రతులు.

పతి[1]నెఱను దాఁకఁ బలుకవలయు ననుతలంపున నతండు వినుచుండం గృపాచార్యుతో ని ట్లనియె.

43. ఉ. తమ్ములు నన్నలుం జెలులుఁ దండ్రులు మామలు భృత్యులుం బ్రమో
దమ్మునఁ దేల నిట్లు వడిఁ దాఁకెడునే విజయాత్మజుండు ఘో
రమ్ములఁ గుంజరమ్ములు బడల్పడఁ దేరులు నుగ్గు గాఁగ నా
నమ్మినయోధవీరులు వినాశము భంగము నొంద [1]నొక్కఁడున్.

44. ఆ. అనిన వెలుకఁ బాటి యతిదీన మగు నాన
నమున నవ్వుగానినవ్వు [1]నెఱయ
సౌమదత్తికర్ణశల్యాదు లగుయోధ
జనులతోడ నిట్టు లనియె విభుఁడు.

45. చ. పలుకులు వింటిరే ధనువు పట్టెడివారికి నెల్ల నొజ్జ దో
ర్బలవిదితుండు గుంభజుఁడు బాలుని నొక్కరుఁ జంచలాత్మువెం
గలిఁ గడుఁ బెద్దఁ జేయుచుఁ బొగడ్తకుఁ జొచ్చె నితండు నొంపఁగాఁ
దలఁపఁడు పీనిఁ బార్థునకుఁ దాఁ గడుఁ గూర్చుట [1]నెంత ద్రుళ్ళినన్.

46. చ. గురుని యుపేక్షఁ జేసి తనకుం సమరోద్ధతి నెల్ల [1]దాని నీ
వెరవిఁడి గాన లేఁడు దనవీరము కాఁ గొని విఱ్ఱవీఁగెడుం
బొరిగొనుఁ డందఱుం గడఁగి పోవఁగనీక దృఢాస్త్రశస్త్రని
ష్ఠురపరిపాతనోగ్రముగఁ జుట్టును ముట్టి చలం బెలర్పఁగన్.

47. వ. అనిన విని వార లందఱు నవ్యాసవపౌత్రుం బొదువం బోవ నవ్వీరుల వారించి దుశ్శాసనుం డి ట్లనియె.

---

42. 1. నెనరుదాఁక – ర. ల. పీ. శ. ష. హా. కొన్ని ప్రతులు.

43. 1. నొక్కఁడన్ – కొన్ని ప్రతులు.

44. 1. నవ్వి – వ; వొలయ – ఒ. త. వ. హా.

45. 1. నెందు వింతయే, నేడు వింతయే – అని పాఠములు.

46. 1. గాని యూవెరవిడి – ఇ. పీ.

48. చ. ఇనుఁ గబళించు రాహు క్రియ నే నొకరుండన పోయి పార్థపు
త్రునిఁ బరిమార్తు నీతఁడు మృతుం డగు పేర్పడ విన్నఁ గేశవా
ర్జునులును బిట్టు సత్తు రతిశోకభరంబునఁ జేసి యంతతో
మనపగ దీఱుఁ దీవ్ర మగుమద్భుజదర్పమునొంపు సూడుఁడీ.

—: దుశ్శాసనుఁ డభిమన్యుతోడం బోరి పాఱిపోవుట :—

సం 7_38_26

49. వ. అని పలికి యార్చి యమ్ములు నిగిడించుచు ధనంజయుతనయుం దాఁకిన నతండు షడ్వింశతిసాయకంబులు దనువునం జొనిపినం గనలి దుశ్శాసనుండు శరాసారఘోరంబుగాఁ గవిసినం గిరీటికొడుకునుం బేర్చి పెనంగ నయ్యిరువురకరలాఘవశరలాఘవప్రకారంబులు రథచిత్రప్రచారంబులుఁ జూప అగ్గించి రప్పు డగ్గలికసొంపున సుభద్రాసూనుండు నీసుతువిల్లు ద్రుంచి భల్లంబుల మేను సెక్కి ప్రుక్కించి యతనితో ని ట్లనియె.

50. చ. అనఘుని ధర్మనందనుని నాసభ నమ్మోయి నీవు నొవ్వఁ బ
ల్కినఫల మందఁ జేసెదఁ జలింపక యించుకసేపు నిల్వుమీ
నిను లఘుచిత్తుఁ గ్రూరు నవినీతు మదాంధునిఁ ద్రుంచి నన్నుఁ బెం
చినగరుసంపుఁదండ్రులకుఁ జిత్త మెలర్ప ఋణంబు దీర్చెదన్.

51. క. అని యతనిజత్రుదేశం
బున నొకవాలమ్ము వఱమునఁ బెక్కును గ్రు
చ్చినఁ ద్రెళ్ళి యెన్నడో చ
చ్చినయట్లు రథంబుమీఁదఁ జేడ్పడియుండెన్.

52. వ. ఇట్లు మూర్ఛిల్లిన దుశ్శాసనుతేరు సారథి దొలంగఁ దోలుకొని పోయె నంతకు మున్న కౌంతేయులు సౌభద్రుండు సొచ్చినపథంబున నాపద్మవ్యూహంబు సేనాసందోహసహితు లై చొచ్చి యెడనెడ నడ్డపడుసైన్యంబులతో సంగరంబు సేయుచు నక్కుమారుం దల లెత్తి చూచుచు నతం డరిబలంబులం గలంచుటకు సంప్రీతు లగుచుఁ దోఁతెంచువారు మునుపట దుశ్శాస

ముందు భంగపడుట గనుంగొని పొంగి యార్పులు నింగి ముట్ట నయ్యభి
మన్యు ననేకభంగులం [1]బ్రశంసించుచుం దఱిమి రట్టడియెడ.

53. సీ. రాధేయుఁ జూచి రారాజు దుశ్శాసనుఁ డభిమన్యుచే నొచ్చె నకట కంచె
యనవుడు నతఁడు సేనాన్వితంబుగ నక్కుమారుపై నడర నప్వీరుఁ డేచి
మూండటిమూఁకల బ్రమందించి కదిసి డెబ్బదిమూఁడుదూపులఁ బటురయమున
నొంచిన రక్తాననుం డయి దివ్యాస్త్రజాలంబు వఱపునాజామదగ్న్య

తే. శిష్యుభుజవీర్యశౌర్యవిశేషభంగి
సరకుగొనక యబ్బాలుండు [1]సమదలీలఁ
బెనఁగ నయ్యంగరాజు డస్సిన నెఱింగి
యతనితమ్ముఁ డయ్యర్జునసుతుని దాఁకి.

54. చ. హయములమీఁద సూతుపయి నాతని యంగములందు నస్త్రసం
చయ మడరించినం గమలచారుముఖంబున నెత్తురవ్వ చె
న్నయి విలసిల్ల భల్లమున నన్నరసూనుఁడు ద్రుంచె విద్విష
ద్భయదవిలాస[1]హాహసముదగ్రత వానిశిరంబు గ్రక్కునన్.

55. ఉ. ఇమ్మెయిఁ దమ్మునిం దునుమునేపు గనుంగొని యోహటించి శ్రీ
ఘమ్మనఁ బెంపఱం దొలఁగెఁ గర్ణుఁడు పెక్కుబలంబు లప్డు డొ
క్కుమ్మడిఁ ద్రోచి యుద్ధతమహోదధిఁ బోలఁగ మందరమ్ము చం
దమ్మున నొప్పె నుద్భటవిధస్ఫురణుం డగు[1]పార్థపుత్త్రుఁడున్.

56. వ. ఇట్లు మూఁకలం గలంచి.

57. క. వెస రాధేయునితోఁ గిన
దెసకుం జనుటయు నతండు ధృతి సెడి విఱిగెం

---

52. 1. స్తుతించుచు - కొన్ని ప్రతులు.

53. 1. సమదలీల - వ.

54. 1. రేఖ - వ. స.

55. 1. పాండుపౌత్త్రుడున్ - చ. జ.

[1]బస పొడ వడఁగఁగ బెఱయో
ఘనమూహము వాఱె ధరణితల మద్రువంగన్.

58. వ. ఇవ్విధంబున సైన్యంబులు దారును బఱచువారలం జూచి యాచార్యుండు.

59. చ. నిలు నిలు కర్ణ యోనృపుఁడ నీ విటు తేల [1]కడంక దక్కె సౌ
బల ధృతి [2]దూల నేటికి బాహ్లిక యుత్తమ గౌరవేంద్ర నీ
బలిమిఁ జయంబుఁ జూపి నిలుపం దగు సేనల నంచుఁ బెక్కుభం
గులఁ బురికొల్ప నెవ్వరును గోత్తల సేయర యేమి సెప్పుదున్.

60. వ. ఇట్లు ప్రళయసమయధారాధరస్ఫీతనిర్ఘాతచ్ఛటాభీలం బగునబ్బాలునిబెడిదంపుటంపఱ సైరింపంజాలక నిబలంబులు వాఱిన నక్కుమారకంఠీరవుండు సింహనాదంబు సేసి శంఖంబు పూరించి గుణంబు సారించి యనికిం దనివి సనక వెనుకం దవిలి పట్టి యడవి ముట్టి యేర్చుకార్చిచ్చు చందంబునం జతురంగబలంబులం జారిసమరినం దేరులు [1]నలియం ద్రెళ్ళినశుండాలంబులును గాలుబలంబుల పీనుంగుపెంటలమీఁద [2]నూఁదుకొనం గూలినఘోటకంబులును గుఱ్ఱపు[3]టట్టలరాసులు మూసికొని యఱవఱ లై యొరగినయరదంబులును గరటికళేబరంబులు వొదవినం గాలుగాలం బెనఁచుకొని పడియున్న సుభటసమూహంబులును గంకణాంగదకాంతంబు లైన కరకాండంబుల గములును ముసుఁగువడ డొల్లినసకుండలమస్తకంబులును వీరకటకంబులు మెఱయఁ జిక్కువడి యున్నచరణంబులును గ్రిందుపడం దొరఁగినగాత్రఖండంబులును దునియ లైనధనురాదిహేతివ్రాతంబులపై [4]బొడవు సెడక బాహువులతోడం [5]బొలుచు కృపాణప్రముఖప్రహరణంబులును గొడుగుల కుప్పలును జామరంబులప్రోవులును సిడంబులతిట్టలును నయి సంగరాంగణంబు ఘోరభంగి యయ్యె నప్పుడు గగనమధ్యభాగంబున భాసమానుం డయిన మార్తాండు రెండవమూర్తియుం బోలె నయ్యేకవీరుండు వెలింగె నవుడు నాంబికేయుండు సంజయున కిట్లనియె.

---

57. 1. వసుధపొడ వడగగ — వ; వసమరి వడకగ నెఱయోధ—స; వసమరి వడకగ — శ; వసమరి చెడంగ పెరయోధ — ఊ.

59. 1. తలంకె దిందు — ఇ. ఝ. డ. స; తలంకి పొర—ఎ. 2. మాల — ర. న. భాకూ. ల, ష; మాన — బ. వ.

60. 1. నులియు — న. ప. ద. శ. 2. నూదుకొనం గూలిన — వ. స. శ. 3. తిట్టల — ఏ. ఒ. ఓ. వ. హ. 4. బొలుపు సెడక — బ. వ. వీ. శ. ష. హ; బలువు సెడక — ఊ. ఏ. 5. బొంపిరి వోవు — శ. షే.

61. ఆ. వాలుఁ డొంటి యిట్లు పలువురతోడఁ బో
రంగఁ జూచి పాండురాజతనయు
లందుఁ దోడుపడుటకై యోధుఁడును
గడఁగ కునికి కేమి కారణంబు.

-: పద్మవ్యూహంబు సొచ్చు పాండవులకు సైంధవుం డడ్డపడుట :-

సం. 7-41-3

62. వ. అనవుడు సంజయుం డి ట్లనియె.

63. చ. వినుము నరేంద్ర పాండవులు విక్రమదుర్దముఁ డైనపార్థనం
దనునకుఁ దోడ్పడం గడఁగి దంతితురంగ[1]రథోత్కరంబులం
దునుముచు సత్వరస్ఫురణఁ [2]ద్రోచిన నీపెనుమూఁక పాయ[3]వి
[4]చ్చి నిలిచి చూచుచుండె నవిచేష్టితు లై రి బలాధినాథులున్.

64. వ. పాంచాలయాదవపాండ్యకేకయమాత్స్యప్రముఖమహనీయసైన్యంబులతో
న ట్లురవడించిన నయ్యుధిష్ఠిరుం డనుమహావాయువునకు జయద్రథుం డద్రియ
పోలె నడ్డపడియె నని చెప్పుటయు విస్మితుం డగుచు వైచిత్రవీర్యుం డతని
కి ట్లనియె.

65. చ. తనయునిమీఁదికూరిమి నుదగ్రత సేనలతోడఁ బాండునం
దనులు రయంబుమై నడరఁ దా నొకరుండ భుజాబలంబు నే
పునఁ గుదియించె నే యతఁడపో కురుసేనకు మేటి సింధురా
జున కది యేమహాతపముసొంపున నత్తటి సంభవించెనో.

66. వ. అనిన విని సూతసూనుఁ డమ్మానవపతి కి ట్లనుఁ బాండవు లరణ్యంబున
నున్ననాఁ డతండు ద్రౌపదికతంబున భీమసేనుచేత భంగపడి సంతప్తచిత్తుం
డై చిత్తజారాతి నారాధించిన నతనిగరిష్ఠనిష్ఠాతిశయంబునకు భక్తవత్సలుం
డగునప్పరమేశ్వరుండు ప్రీతుం డై పొడసూపిన జయద్రథుండును గౌంతే
యుల నివారించునట్లుగా వరం బొసంగవలయు నని విన్నవించిన నద్దేవుండు

63. 1. భటోత్కరంబులం - వ. 2. దోచిన - డ. న. ల. సూ. 3. యిచ్చి - ఊ.
ఎ. ఏ. ఐ. ల. కొన్ని ప్రతులు. 4. చ్చిన నవి జొచ్చిరప్పు డవిచేష్టితు - స. శ.

([1]నర్జునుండు దక్క దక్కిననలువురు) పాండవులు నీచేత నివారితు లగుట యొక్కదివసంబునం గలుగుఁ గాక యని పలికి యంతర్హితుం డయ్యె నది కారణంబుగా నట్టిగౌరవం బాధికవరునకు దొరకొనియెఁ దత్పరాక్రమంబు తెఱం గెఱింగించెద నాకర్ణింపుము.

67. సీ. సింధుదేశోద్భవస్థిరవాహనంబులఁ బూనినయరదంబు పొలుపు మిగుల
రత్నమయోగ్రవరాహధ్వజంబు నభస్స్థలిఁ జంచలప్రభ[1]ల మెఱయ
సాంద్రచంద్రాతపసదృశ మై యుజ్జ్వలచ్ఛత్త్రచామరములచాయ నిగుడ
వజ్రముక్తాఫలవ్రజకిరణావళి కలితభూషణములు వెలుఁగుచుండఁ

తే. జిత్తమున వరగర్వంబు చిగురు లొత్తఁ
బాండుపుత్రులదుర్దాంతబాహుబలము
మొనలపెల్లును సరకుగాఁ గొనక యేచి
యార్చి వారికి నీయల్లుఁ డడ్డపడియె.

68. వ. ఇవ్విధంబున నడ్డపడి సాత్యకిని సాయకత్రయంబునను భీమసేనుని బాణాష్టకంబునను ధృష్టద్యుమ్నుని నిరువదియమ్ములను విరాటుని శిఖండిని బదిపదితూపులను పాంచాలపతి నేడింటను ద్రౌపదేయులం బదియేనింటను గేకయుల నిరువదేనింటను ధర్మసూను సప్తశిరంబులను నేసి యాసేన నానాస్త్రంబులం గప్పె నప్పు డప్పాండవాగ్రజుం డతనికోదండంబు దుండంబులు సేసిన నాసైంధవుం డొండువింట మంటలుం బోనిమార్గణమ్ము లమ్మనుజపతిమీఁదను దదనుచరులయంగంబులందును బరగించినం బవనతనయుండు దలకడచి రథసంబున.

69. క. ఛల్లముల మూఁట గొడుగును
విల్లును బడగయును ద్రుంప వేఱొకవిలు నీ

---

66. 1. నర్జునుండు దక్క దక్కిన నలువురు - ఈ భాగము శ. ష. మొదలైన పెక్కు ప్రతులలో లేదు. కాని మూలమునందు అర్జునుడు దక్క తక్కిన నలువురని యే యున్నది. "దదామి తే వరమ్ సౌమ్య వినా పార్థం ధనంజయమ్ వారయిష్యసి సంగ్రామే చతురః పాండునందనాన్." చిత్రశాలాప్రతి. ద్రోణ. 42 అధ్యాయము

67. 1. లునిగుడ - ఎ. ఒ. చ. జ. ట.

యల్లుఁడు గొని భీముఁగొడుగు
విల్లును బడగయును ద్రుంచి విరథుం జేసెన్.

70. వ. ఇట్లు వికలసాధనుం డై.

71. సీ. అనిలసుతుండు సాత్యకితేఁ మీఁదికి నరిగిన నీసేన యార్పుటయును
సైంధవుపై వారసైనికోత్తము లనేకాస్త్రముల్ వఱపిన నతఁడు వాని
మరలింప మున్న భిమన్యుచేఁ గూలినరథదంతిహయభటరాజి[1] కతన
నతివిషమం బైనయానేల నవిహతగతి నరదంబులు [2]గ్రందు పఱపి

ఆ. వారు నేసి రాహవము దాని కోర్చి యం
దఱును దమక తమక తనిసి వెనుక
కొదుగు నట్లుగాఁగ నుజ్జ్వలశరనికా
యములు గురిసె నాజయద్రథుండు.

72. వ. ఇత్తెఱంగున సింధురాజు పాండవులవేఁడిమి యుడిపిన నుభయపార్శ్వంబు
లకు మున్న దొలంగి యున్ననిబలంబులు గోత్తల నేసి యక్కౌంతేయ
సైన్యసంతానంబుతోఁ దలపడినం బోరు ఘోరం బయ్యె నక్కడఁ గుంభ
సంభవ పయత్నవిశేషంబునం జేసి కురువాహిని మగుడ నడరి యభిమన్యుం
బొదివిన నక్కుమారుఁడు నుక్కునం గడంగి.

73. క. అభిముఖసంవృత్తము లగు
నిభతురగస్యందనంబు లిలఁ గూల్పఁగ న
తుభితుం డగువృషసేనుఁడు
రథసంబున నతనిఁ బటుశరంబుల నొంచెన్.

-: వృషసేనుం డభిమన్యుం దాఁకి మూర్ఛితుం డగుట :-

సం. 7_43_5

74. ఉ. నొంచినఁ గెంపుసొంపునఁ గనుంగవ యొప్పఁగ సూతుఁ ద్రుంచి విల్
ద్రుంచి తురంగవక్త్రములఁ దూపులు నించి యలంచి మేను నొ

71. 1. వలన - కొన్ని ప్రతులు. 2. గ్రందవఱపి - వి. కొన్ని ప్రతులు.

ప్పించినఁ దేరితోడ [1]నఱపినుఁగు నీడిచికొంచుఁ బాఱె సే
వాంచలభూమికిం [2]బెలుచ నత్తురగంబులు విహ్వలంబు లై

75. వ. ఇట్లు వృషసేనునరదంబు పఱపినతెఱపిన యభిమన్యుండు నిజస్యందనంబు
పఱపించినం బటుసంరంభంబున నెదుర్కొని.

76. ఆ. శౌర్యధుర్యుఁ డగువసాతిభూపతి షష్టి
శితశరంబు లేయ నతఁడు దొడ్డ
నారసమున వాని [1]నలిఁ దూల నేసినఁ
గూలి పెలుచఁ దన్నికొనుచుఁ జచ్చె.

77. క. చచ్చినవసాతిఁ గనుఁగొని
యచ్చటిభూపతులు పెలుచ నడరుటయును వి
వ్వచ్చుకొడుకు కోపించినఁ
జిచ్చు మిడుతపిండు [1]నేర్చుచెలువము దోఁచెన్.

78. వ. ఆసమయంబునం జేడ్పడి నీసేనలు దీనదశకు వచ్చిన నానాదేశాధీశులు పర
స్ప[1]రాహ్వాననాదంబులు సింహనాదంబులు శింజినీస్వనంబులుం జెలంగ
ధనంజయతనయుపై నొక్కుమ్మడి నురవడించిన నయ్యతిరథవర్యుండు
[2]లేళ్ళగమిం గనిన బెబ్బులియుబ్బు దోఁప నలిరేఁగి యందఱ నుఱుమాడిన
నఁగకంబులవివిధఖండంబులకెంపునను గరితురగనరశవంబులవికృతాకారం
బుల నాయుధంబులమెఱుంగుల నాభరణంబులతఱచునం దత్ప్రదేశంబు
దారుణాప్రియదర్శనం బయ్యె నప్పుడు దెరలినమూఁకలు దన్నుఁ దేఱి
చూడనుం జాలక యంతంత ఱిచ్చవడిన నాగుంపులకుం గవిసి నిలింపపతి

---

74. 1. నడపీనుగు - ఇ. ఈ. హ. 2. దొలగ - ఈ. ఎ. వ. శ. ష. హ

76. 1. నవ్వుచు నేసిన, నాటగనేసిన - అని పాఠములు; నందరంటనేసిన - గ. చ. వ. స. శ. (అఖండయతిగా భావించవలెను); నడు ముచ్చి పో నేయ - వ; నట్టౖరు (జ్రు) వేసిన - ఈ. ఓ. ఘ. డ. త. స. శ$_1$. (నడికంఠమున అని అర్థము).

77. 1. పొచ్చు - ఉ. ర.

78. 1. రాహ్వానంబులు - పెక్కు ప్రతులు. 2. గమి లేళ్లం గనిన - ఇ. ఔ. క. ఖ. ఘ. ర. ల. వ.

మనుమండు సత్యశ్రవః ప్రభృతిభూపాలలోకంబు జములోకంబున కనిచినం
జుట్టునుండి చూచుచునారథను లగుమానవపతులు [3]నేన నేన యని కడంగి
యక్కుమారునిమీఁద [4]కుఱికి పెనుఁ జోఱ మొగంబునం బడిన చిఱుచేఁప
తండంబుల చందంబున దావానలంబు దఱియం జొఱినమృగకులంబు
చాడ్పున సముద్రంబు సొచ్చిన యేఱులచందంబున నతని[5]యందఁ డిందిన.

79. ఉ. [1]అప్పట సైన్యమంతయు భయాకులతన్ నలుదిక్కులన్ వెసన్
విచ్చిన శల్యనందనుఁడు వీరికి నోడఁగ నేల మీకు నే
వచ్చితిఁ బట్టి తెచ్చెద నవారణ [2]బెట్టు పెసంగెనేనియుం
జచ్చు మదీయభూరిభుజశక్తి గనుంగొనుఁ డంచు నుద్ధతిన్.

80. వ. రుక్మరథుం డనువాఁడు పాండుపౌత్త్రుం దలపడి తొమ్మిదియమ్ము [1]లుర
మ్మున భుజమ్ముల రెండును నాటించి వెండియు నేయం గడంగునెడ నా
సుభద్రాసూనుండు.

81. ఆ. శరముతోడ నొక్కకరము చాపముతోడ
నొకటి బొమలు గడసియున్న యుగ్ర
రేఖతోడఁ దల ధరిత్రిపైఁ బడ నేసె
రయము మెఱయఁ బటుశరత్రయమున.

82. వ. ఇట్లర్జునపుత్రుండు చిత్రకౌశలంబు సూపిన.

83. ఆ. రుక్మరథుఁడు [1]పడిన రోషాత్తచిత్తులై
యతనిచెలులు పలువు రవనిపతులు
గవిసి రపుడు తేరుగములతో వడి భవ
త్పౌత్రుమీఁద నీదు[2]పుత్త్రు లలర.

---

3. లేమేమ - కొన్ని ప్రతులు. 4. గవిసిన - ఎ. చ. జ. పీ. శ. ష. 5. యందణ (డ)ఁగిన - అ. ఆ. ఈ. కొన్ని ప్రతులు.

79. 1. అచ్చటి - పెక్కు ప్రతులు. 2. బిట్టు - వ. వీ. శ. ష.

80. 1. లురమ్మున గీలించి భుజ - వ.

83. 1. పడుడు - కొన్ని ప్రతులు. 2. పుత్రు డలర - శ. ష. కొన్ని ప్రతులు.

84. క. అమ్మనుజవిభులబహులశ
రమ్ములచే సూతకేతురథరథ్యసమే
తమ్ముగఁ బొదువంబడు తన
తమ్మనిసుతుఁ జూచి పతి ముదమ్మునఁ దేలెన్.

85. వ. ఇట్లభిమన్యుండు మడిసెనకాఁ దలంచి దుర్యోధనుండు సంతోషింప నాసౌభద్రుండు భద్రగజంబు [1]బరిగోలలపోట్లం గనలుకైవడిం గినిసి గాంధర్వియైనమాయ గావించె నది దొల్లి ధనంజయుతపంబునకుం బ్రియం బంది తుంబురుప్రభృతు లొసంగినట్టిది దానం జేసి యమ్మానవనాథులయాలోకనంబులకుం బెక్కురథమ్ములవారు దమ్ముఁ బొదివికొని యనేకాస్త్రశస్త్రంబులు [2]ప్రయోగించినచందంబు దోఁచిన వారు వెగడుపడి చూచుచుండ నతండు మండలప్రచారంబులం దేరు మెఱయ మెఱుంగువాలమ్ములం గూలనేసియు వెడందతూపులం ద్రుంచిపడవైచియు బడలు వఱచిన నన్నరపతులు నఱుకుడు వడిన యెలమావిజొంపంబులచందం బగుటయు నుబ్బు దక్కి వెక్కసంబును వెల్లఁబాటునుం గదిరి యక్కురువిభుండు దనకొడుకుకడిమి సైరింపంజాలక యతనిపై నడరి కొండొకసేపు గన్నులపండువుగా భండనంబు సేసి సంరంభవిజృంభితుం డగునవ్వీరవరు విశిఖవేగంబునకుం గాకవిముఖుం డయ్యె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె.

86. ఉ. ఇమ్మెయి బాలుఁ డొక్కరుఁడ యిందఱఁ [1]దోలి వధించె నన్న నే
నమ్మఁగ నేర నయ్యెద వినం గడునక్కజ [2]మట్టు లేల చి
త్తమ్మున సంశయింప విను ధర్మ మధర్మము నోర్వ కున్నె క
య్యమ్ము తెఱంగు సెప్పు మెటు లయ్యెఁ బదంపడి సూతనందనా.

87. వ. అనిన నమ్మనుజవల్లభునకు సంజయుం డిట్లను నట్లు పెక్కండ్రురాజులు నచ్చుటయును సుయోధనుండు దెరలుటయును గని భవత్కుమారవర్గంబును దోడియోధవరులును మేనులు సెమర్ప మొగంబులు [1]వెలువెలంబాఱ నొల్లెండం గాళ్లు వడంక నలుదిక్కులుం జూచుచు ధృతి దఱిగి పోయిన

85. 1. పరికోలల – ద. న. శ. ష. 2. పరగించిన – అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు.

86. 1. బోరి – ఝ. డ. ద. వ. 2. ఘంతవట్టు – స.

87. 1. వెల్లంబార, వెలుకంబార – అని పాఠములు.

వెఱచఱచి విఱిగి రప్పుడు మగుడం గో_ల్తల సేసి కురువిభుండు గురుపుత్ర కృపకర్ణకృతవర్మబృహద్బలసౌబలసమేతంబుగా సౌభద్రు నెదుర్కొనిన నతండు గెలుపునుబ్బునం గొండొకపెద్ద యనక పిడుగుచందంబునఁ గర్జిలి యుఱికిన నయ్యరదంబుఁ దండంబులు లేటమొగంబు వడియె నట్టియెడ.

-: *దుర్యోధనపుత్త్రుం డగులక్ష్మణకుమారుం డభిమన్యునిచేఁ జచ్చుట* :-

సం. 7-46-8

88. చ. అదలిచి లక్ష్మణుండు విజయాత్మజుఁ దాఁకినఁ జూచి యుమ్మలం
బొదవఁగఁ బుత్త్రుఁ బెట్టి చన నోపక క్రమ్మఱురాజుఁ గాంచి యం
బుదములు గొండపై నడరుపోలిక నన్నరుపట్టి నందఱుం
బొదువ నతండు ఘోరశరఘోరసమీరమునం [1]దెరల్చుచున్.

89. క. కదిసి లక్ష్మణునిం బులి
కొదమను సింగంపుఁగొదమ గొదగొని లీలం
బొదువుగతిఁ గిట్టి మోదము
మదము నెలర్పంగ నింద్రు[1]మనుమఁడు గడిమిన్.

90. చ. ఉఱక యురంబు బాహువులు నొక్కొకయమ్మున నొవ్వ నేసి నీ
వెఱఁగి యెఱింగినఁ దొడరి తెక్కడఁ [1]బోవఁగవచ్చు నంచు నే
_ర్తెఱఁ దలఁ గుండలస్ఫురితదీప్తులతో నిల డొల్ల నేసె నం
దఱుఁ బఱియుం గనుంగొనఁగ దైన్యరవంబు నెలంగ సేనలన్.

91. తే. మిడుక మిడుక ని_ర్తెఱంగునఁ గొడుకుఁ దునిమి
యక్కుమారుండు మెఱయుట నడలుఁ గనలుఁ
గడలుకొనుమదితోడ నీకొడుకు వీని
నొంపుఁ డందఱుఁ బైపడి చంపుఁ డనుడు.

---

88. 1. దెరల్చినన్ - పెక్కు ప్రతులు.

89. 1. మనుమం డెమిలన్ - ఝ. డ.

90. 1. బోయెద వింక నంచు - ఊ. ఏ.

92. క. కృతవర్మయుఁ గృపుఁడు గురుఁడు
నతనిసుతుఁడుఁ గర్ణుఁడును బృహద్బలుఁడును భా
సితశరములు గురియుచు న
చ్యుతునల్లునిఁ బొదివి రొక్కయుమ్మడిఁ బెలుచన్.

93. క. అతఁ డందఱ విశిఖంబులు
వితథమ్ములు సేసి వారి వెగడుపఱిచి యు
ద్ధతి సైంధవుపోరెడు [1]నెడ
కతిరయమునఁ దేరు [2]నడపు నాసమయమునన్.

94. వ. నిషాదులు గళింగులు గజబృందంబులతో నష్టపడిన నయ్యతిరథసింహుండు [1]దరువాయి గొని తునుమాడ నెప్పటియోధవీరు [2]లెయిది పెక్కాఁబోతు లొక్కపులిం జుట్టుముట్టినచందంబునం బొదివి పెనంగ నాజయద్రథుండును పాండవబలంబులం ద్రోచి రానీక రథసాతిశయఘోరంబుగాఁ బోరు చుండె నక్కుమారుండు గురుం బంచాశద్బాణంబులను గృతవర్మ నశీతిసాయకంబులను గురుతనయు దశవిశిఖంబులను గర్ణు నొక్కబలనారసంబునను ద్రుక్కించి కృపుని విరథుం జేసి బృహద్బలుమేన ముప్పదినారసంబులు నాటించి వారలకు బాసట యయి కదిసినసైనికులం బెక్కుతెఱంగుల తూపులఁ జిక్కు వఱిచి యుక్కునం [3]గ్రోధపుత్ర[4]బృందారకు లనురాజులను రూపడంచె నప్పుడు శారద్వతుండు దేరాయితంబు సేసికొని కడంగి తోడి యేవురం గూడుకొని యాక్రీడికొడుకుమీఁద మార్గణపరంపరలు వరగింపం బెరిఁగినవర్షంబునం గసిమసంగి యతండు నొప్పించిన బెఱవారు బీఱువోవ బృహద్బలుండు బిట్టు గవిసి నిశితశరంబులు [5]నిగిడించిన నన్నరనందనుండు.

95. ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధించుడుం
గోప మెలర్ప ఖేటకముఁ గ్రూరకృపాణముఁ గొంచుఁ దేరు సా

---

93. 1. దెస - వ. 2. వరపు - కొన్ని ప్రతులు.

94. 1. దరవాయి - ష. కొన్ని ప్రతులు; నరవాయి - శ. 2. లెదిరి - కొన్ని ప్రతులు. 3. గ్రోధపుత్ర - భాకూ. మ. ర. ల. శ. పెక్కు ప్రతులు; గ్రోధలిప్త - వా. వీ. ష. శ. 4. వృందారకుఁ డనువాఁడు, ధృతరాష్ట్రుని కుమారు డని సోరెన్సన్ మహాభారత నామానుక్రమణిక యందు చెప్పబడినది. 5. నిగుడించిన - పెక్కు ప్రతులు.

టోపత డిగ్గి వే కవియుడుం బటుభల్లహతిం గృతాంతసే
వాఁకరుఁ జేసె [1]హృత్పుటము వ్రచ్చి బృహద్బలు భూరిదోర్బలున్.

96. వ. ఇట్లింద్రపౌత్రుండు గోసలేంద్రునిం [1]దెగఁ జూచినఁ జూచి యేచి తదీయ బంధుభూపతు లొక్కమొగి నురవడించిన నతండు వారలయేపు మాపి కర్ణుండు డాసినం గర్ణోపాంతంబు [2]గర్ణికానారాచంబుల నొప్పించె నయ్యిరువురు నొండొరులమేనులు నెత్తురుల జొత్తిల్లం జేసిన సంధ్యాసమయ సూర్యబింబప్రతిబింబంబులుం బోలెఁ బొలిచి రాసమయంబున సూతనందను నాయకు లార్వురు గర్వంబులఁ దన్నుం గడసినం గవ్వడికొడుకు చిత్రవధ విహారంబు సలుపునప్పుడు కుంభసంభవప్రభృతిరథికవరులశరంబులు మగిడించుచు వారిపైఁ దూపులు నిగిడించు చునికి యద్భుతం బయ్యె నట్టియెడ.

97. తే. మగధపతిసూనుఁ డైన [1]యశ్మంతకుండు
బాలుఁ డయ్యును బ్రౌఢదోర్బలము మెఱయఁ
దాఁకుటయు సూతుతలయు రథ్యములతలలు
నతనితలతోన యభిమన్యుఁ డవనిఁ గూల్చె.

98. వ. ఇట్లు పూర్వవైరంబు దలంచి తలపడినమాగధకుమారు నవలీల నేలం గలిపి సింహనాదంబు సేసినం దత్సంరంభంబు సైరింపం జాలక దుశ్శాసనసూనుండు [1]సరభసంబుగాఁ గవిసి ఘోటకంబుల నంబకచతుష్టయంబునను సారథి నొక్కనారసంబుననుం దదీయతనువు పదిబాణంబులను బెలుచ నొప్పించినం జంచదరుణకమలచారువిలోచనుం డగుచు సౌభద్రుం డతనిఁ బ్రదీప్తసప్తనారాచనిపాతపీడితుం జేసి డగ్గఱి.

---

95. 1. హృత్పటము, హృత్తటము - అని పాఠములు.

96. 1. దెగటార్చిన - ఖ. గ. వ. పీ. శ. ష. 2. క్రూరనారాచంబుల - ఇ. ఓ. లక్ష్య గా విల్దిగిచి నిశితనారా - ఊ. ప. 3. నుందుమొదలగు - ఔ. పీ. ష.

97. అశ్వకేతువు - అనిమూలము. ద్రోణ. 47-7. భం.

98. 1. సంరంభంబుగా - కొన్ని ప్రతులు.

99. ఉ. ఇంతకు మున్న నీజనకుఁ డెంతయు నోటఁటి సాటె నీవె నా
పొంతకు వచ్చి తింక నెట వో నగు నం చొకదొడ్డనారసం
బెంతయు బెట్టిదంపువడి నేయుడు ద్రోణసుతుండు దాని నిం
తింతలు సెక్కలై యిలపయిం దొరఁగన్ వెస నేసె నేసినన్.

100. తే. అతనిదిక్కును జూడక [1]యతఁడు రయము
మెఱయ నీపౌత్రుచాపంబు నఱికి సూతుఁ
గూల్చి యాఱమ్ము లురమున గ్రుచ్చుకొనుచు
వొండుదేరిపై కళ్యాలుఁ దుఱికె నధిప.

101. వ. అంత నపరాహ్ణం బయ్యె నాసమయంబున శత్రుంజయుండును జంద్ర
కేతుండును [1]సువర్చసుండును సూర్యభానుండును మేఘవేగుండును మొత్తం
బై తాఁకిన ధనంజయతనయుండు మేటిమగ లగువమ్మహీశులమేనులు
నానాస్త్రంబుల ననేకఖండంబులు గావించి గాంధారపతి నేరినం గ్రూర
నారాచజాలంబుల జర్జరితశరీరుం జేసి దుర్యోధనుదెసకు నడరుటయు నంగ
పతి యాచార్యున కిట్లనియె.

102. క. చండగతివీరరథికులఁ
జెండుచు నేతెంచి రాజుఁ జేరెడు సౌభ
ద్రుం డిట్టులు నీ కూరక
యుండ నగునె ప్రతివిధాన మొనరింపు తగన్.

103. క. అని పలికి పతికి నడ్డము
సనుటయు గురుఁ డచటియోధ[1]చయముం గలయం
గనుఁగొని యభిమన్యుఁడు
నర్జునుఁడును నని నొక్కరూప చుండీ తలఁపన్.

104. వ. చూడం జిన్నవాఁడు గాని యలంతులం బోయెడి [1]వాఁడు గాఁడు మన
మందఱముం గూడికొని యొక్కపెట్ట యక్కుమారుపై నురవడింప వలయు

---

100. 1. యతఁరయమున – ద. వ.

101. 1. సుపర్వుడు – కొన్ని ప్రతులు.

103. 1. జనముల – కొన్ని ప్రతులు.

104. 1. పొడవు. – ఉ. ఒ. క. ఘ. ఝ. ఠ. డ. వ.

నని పురికొలిపి బరవసంబు సేసె నప్పు డప్పాండుపౌత్రుబాణంబులం బీడితుం డై సూతపుత్రుండు గుంభసంభవు నాలోకించి నాదెస నూఁడుము వీఁడు నొప్పించె నిలువం దగునెల వగుట ననము డింపక [2]యీాల గఱచుకొని యున్నవాఁడ గాండీవిఁ గలనం [3]గలసి యెఱుంగుదుము కాదె యతనిచే యింతశెట్టిదంబు గా దని చెప్పిన విని యల్లన నగి యతం డతని కిట్లనియె.

105\. సీ. కవచధారణ మనుఘునవిద్య గవ్వడి కే నెఱింగించితి నితఁడు దాని
నేర్చుట నీతని [1]నెట్టన నొప్పింప శక్యంబు గాదు వంచనగుణంబు
నఱకంగఁ జాపంబు విఱుగ నేయఁగ ఘోటకములఁ జంపఁగ సూతు
సమయఁ జేయ
నగుఁ జాలు దేని నీ వట్లు సేయుము జేత ధనువుండ నవ్వీరుఁ జెనయ వశమె

ఆ. దేవతలకు నైనఁ గావున నొక్కమై
విల్లు ద్రుంచి తఱిమి విరథుం జేసి
చూచికొంద [2]మలవు[3]సొంపునఁ దెగునె యీా
రథికవరుని పటుపరాక్రమంబు.

-: కర్ణుఁడు మొదలగు యోధులు వంచనచే నభిమన్యుని విరథుఁ జేయుట :-

సం. 7_47_31

106\. చ. అన విని సూతసూనుఁడు భయం బెడఁ [1]గూరినవాఁడపోలె నై
వెనుక కొదింగి యారథికవీరుపిఱిందికిఁ జుట్టి వచ్చి వం
చనకు సహాయు లై యచటినైనికు లన్నరపుత్రు బిట్టు మా
ర్కొని పెనఁగంగఁ [2]జేరి యలఘుప్రదరంబున విల్లు ద్రుంచినన్.

---

2\. యాదుగఱచుకొని - ఊ. ప. క. పీ. ష. శ; యీాలుగఱచుకొని - వ. స. శ$_1$.
3\. గదిసి - కొన్ని ప్రతులు.

105\. 1. వేయింత - జ; నేరికి - ట; చేయింత - లు. 2. మలవుచొప్పున - త. బ. 3. సొంపున - ఐ. ఒ. ఔ. గ. ఝ. డ. వ.

106\. 1. బెడగూరిన - కొన్ని ప్రతులు. 2. జేసి - వ. పీ. ష.

107\. వ. ఆలోన.

108\. క. గురుఁ డశ్వంబులఁ గూల్చెను
సరభసముగఁ గృపుఁడు సంపె సారథి నిమ్మై
నరసుతుఁ డనాయుధుండును
విరథుండును నగుట సూచి వెఱపేదిమనిన్.

109\. శకుని కృతవర్మశలబా
హ్లీకగురుసుతు లాదిగా ననేకు లడరి య
స్త్రకలాపంబుల శస్త్ర
ప్రకరంబుల నొంచి చిక్కువఱచి యలఁచినన్.

110\. క. వాలును బలకయుఁ గొని య
శ్వాలుఁడు రయమార గగనభాగంబున కు
న్మీలితధృతిసారుం డై
లీల నెగసి పోయె మండలీభూతగతిన్.

111\. క. తనవిద్యకలిమి వినతా
తనయునిభంగిం జరింపఁ దమతమపైఁ దెం
పున నుఱుకు ననుతలంపున
మనయోధులు భయము గొనిరి మనుజాధీశా.

112\. చ. ఎడగని వాలుభల్లమున నేసె వెసం దునియంగఁ ద్రోణుఁ డ
ప్పుడు శకలంబు లై పలక భూమిపయిం దొరఁగంగఁ జేసె నె
క్కుడువడిఁ గర్ణుఁ డాశిశు వకుంఠగతిం దన తేరిమీఁద నొ
ప్పెడుఘనచక్రముం గొని యుపేంద్రుని లీల [1]నటించు చాడ్పునన్.

113\. వ. సంరంభవిజృంభితుం డై.

114\. సీ. నెత్తుట జొత్తిల్లి నెఱసినయలుక నుగ్రం బై నవదనంబు కాంతి [1]పరఁగఁ
గౌరవసైనికోత్కరమున కతిభయదం బగుసింహనాదంబు సెలఁగ

---

112\. 1. [illegible]ంచు — వ.

114\. 1. [illegible] వెలుగ, దరుగ — అని పాఠములు.

నింగికి నిగుడురథాంగరోచులు మణికంకణద్యుతులతోఁ గలసి వెలుఁగ
సిల్లు సూపినగంధసింధురం బనురేఖ దలఁపించు[2]పటుగతి చెలువు మెఱయఁ

తే. కుంభసంభవుఁ డున్నదిక్కునకుఁ గవిసి
యడ్డపడుసేనఁ జించి చెండాడు నక్కు
మారవరుమేని యొప్పును మగతనంబుఁ
జలము బలముఁ [3]గీర్తించె నిర్జరగణంబు.

115. వ. అట్టియెడ.

116. తే. శకునికృతవర్మకృపకర్ణ[1]శల్యముఖ్యు
లైనయోధులు పెక్కండ్రు రథులదిశలఁ
బొదివి యతనికరంబునఁ బొలుచుచక్ర
మలతితునియలుగా నేసి రాగ్రహమున.

117. వ. ఏసిన నతండు రయంబున.

118. క. గద గొని యశ్వత్థామం
[illegible]కోదముకైవడి మెఱుఁగుల్
వొందలంచుదానఁ గని కడు
బెదరి యతఁడు రథము డిగ్గి పిఱిఁదికిఁ [1]జనియెన్.

119. వ. సుభద్రాతనయుం డతని రథ్యంబులను సారథినిం జదియ మోఁది మన
జోదులయమ్ముల నేదు వెఱఁగినచందంబున సౌబలునిదెసకు నడచి యాత
నికి నడ్డపడినగాంధారుల సప్తవింశతిరథికులం బొరిగొనుటయుం బురికొని
తన్ను మార్కొనిన వసాతీయులం బదుండ్ర నేనుంగులతోడన పీనుంగులఁ
గావించి [1]యందంద తఱిమిన కేకయసప్తకంబు రథసహితంబుగా నగ్గలిక
నుగ్గ నేసి డస్సి తూఁగాడుచుఁ బోరు దొలంగినయోధుల నుల్లసం బాడుచు
నఱిమినవారి నుఱుమాడుచు వీరవ్రతంబు ధీరత్వనిష్ఠం జలుపుచుండె.

---

2. గతితన – ట. వ. 3. నగ్గించె, నుతించె – అని పాఠములు.

116. 1. శల్యు లాది యైన – గ. ఙ. వ.

118. 1. నరిగెన్, జారెన్, జరిగెన్ – అని పాఠములు.

119. 1. నంగ్రందం దరిమిన – కొన్ని ప్రతులు.

120. ఉ. ఆసమయంబునం గడఁగి యాయుత మైనరథంబుతోడ దౌ
శ్శాసని రా నతం డడరి సారథిఁ జంపి హయంబులం బడన్.
ద్రేసిన నాఁత డల్గి గద వేకొని యుద్ధతిఁ దేరు డిగ్గ ను
ద్భాసితమూర్తులం బొలిచె భ్రాతృకుమారయుగం బుదాత్త మై.

-: అభిమన్యుదుశ్శాసనసుతు లిరువురుఁ జచ్చుట :-

సం. 7_48_8

121. తే. ఇవ్విధంబునఁ గదిసి నరేంద్రముఖ్య
సీదు[1]మనుమలు సూపర నెమ్మనముల
కద్భుతంబును శోకంబు నావహిల్ల
లావు వెరవును మెఱయఁ బలంబు నెఱయ.

122. ఉ. ఒండొరు[1]మీఱుకోపమున నుగ్రతఁ బోరి రుదగ్రు లై గదల్
మండఁగ నెత్తురుల్ సెదర మాంసము పిండిగ [2]నెంప నుగ్గు లొం
డొండ ధ[illegible]పైఁ దొ[illegible] [illegible]డు మేనులు వ్రాల వానిలో
నుండక ప్రాణముల్ వెడలె నుబ్బునఁ గ్రాలఁగ దేవకామినుల్.

123. వ. ఇత్తెఱంగున.

124. చ. వనగజ మంబుజాకర మవారణఁ జొచ్చి కలంచి యాడఁగా
మనమునఁ గొంకు లేక కృప మాలినబోయలు [1]ముట్టి చంపు[2]చా
డ్పున భవదీయసేన పొరివుచ్చఁగఁ జుట్టును ముట్టి పార్థనం
దను నలయించి నిర్దయవిధంబునఁ జంపి రనేకసైనికుల్.

125. వ. అట్టియెడ.

---

121. 1. మనమలు – కొన్ని తాళపత్రప్రతులు.

122. 1. మీఱు (రు) – ఎ. ఖ. భాకూ. వ. శ. ష. స. శ$_1$; మీఁది – వా. కొన్ని ప్రతులు.
2. నిమ్మునుగ్గు – ఔ. క. జ. వ. బ. ర. ల. శ. ష.

124. 1. చుట్టుముట్టు చాడ్పున – ఊ. 2. చొప్పున – మ.

126. సీ. జగము లన్నియును దేజంబున వెలిఁగించి యపరాద్రి సేరినతపను మాడ్కిఁ
దఱచైనకానలు దరికొని [1]నీఱుగాఁ జేసి యాఱినదవశిఖి విధమున
గగనంబుతో రాయు [2]కరడులు గల జలం [3]బివురఁ బాఱినమహార్ణవము కరణి
నున్నతగతి సెడి యుర్విపైఁ గడువిన్ననై పడియున్న సుధాంశుభంగి

తే. తీరమునఁ దమవారికిఁ బెం పొనర్చి
యరుల సమయించి వస మఱి యనువు దప్పి
తెగియుఁ జూడ్కికిఁ జాలవ్రే గగుచుఁ బొలిచె
మహితమూర్తిశోభితుఁ డభిమన్యుఁ డధిప.

127. ఉ. నెత్తుటఁ దోఁగి నేల యొఱనింగితెఱంగున నుండె నక్కుమా
రోత్తముఁ డందుఁ జంద్రుక్రియ నొప్పె సితాయుధఖండభూషణో
దాత్తమణిప్రతానములు తారల చందము నొంది యంద మై
యత్తఱి నుల్లసిల్లె వసు[1]ధాధిప చూపఱపిందు చూడ్కికిన్.

128. సీ. కరికళేబరములు ధరణీధరములు దురంగగాత్రమ్ములు గ్రాహసమితి
నరశరీరములు మీనములు గౌక్షేయకక్షురికాదిశస్త్రంబు లురగకులము
రుధిరార్ద్రశరములు రుచిరప్రవాళముల్ ప్రేవులప్రోవులు ఫేన[1]తతులు
నెత్తురువెల్లువ నీళులు భూషణస్తోమాస్థిచయము తుమురు లిసుక

ఆ. గాఁగ నంబురాశికరణి సంగ్రామభూ
భాగ మొప్పు మిగుల భవ్యయోగ
నిద్ర నున్న విష్ణునికిఁ బాటి యగుచు శో
భిల్లె నమ్మురారియల్లుఁ [2]డందు.

129. వ. అబ్బాలుండు.

---

126. 1. నీఱు – పీ. శ. ప. పెక్కు ప్రతులు; నివుఱు – వా. 2. కడళులు, కరళులు – అని పాఠములు. 3. బివిరిపాడరిన యర్ణవము కరణి – ఒ. ఓ. ఔ. భాకూ. వ. శ. శర. ష. స. హ. $శ_1$.

127. 1. ధావర – కొన్ని ప్రతులు.

128. 1. సమితి – ఎ. ఖ. చ. న. వ. శ. 2. డధిప – కొన్ని ప్రతులు.

130. తే. మహితలావణ్యమును సుకుమారమైన
యంగమును బూర్ణచంద్రనిభాననంబుఁ
గ్రొత్త[1]పెంపుగ నెంతయుఁ గొమరు మిగిలి
చెన్నుఁ దలకట్టునై పడియున్నఁ జూచి.

131. క. నీసైనికు లెంతయుఁ సం
తోసిల్లుచు నార్చి రపుడు దుఃఖితులై కుం
[1]తీసుతులవారు దీనద
శాసంగతులైరి బాష్పజలములు [2]దొరఁగన్.

132. క. నెటి దప్పంబడి పెల్లుగ
నొఱలెడి నరవాజికరులయులి వభిమన్యుం
డటిముటిఁ బడుటకు వగ మదిఁ
బటిగొన నిల పెలుచ నఱచుభంగిఁ జెలంగెన్.

133. వ. ఆసమయంబున.

134. క. పెక్కండ్రు గూడి యిమ్మెయి
నొక్కనిఁ జంపుట యధర్మ మోహో యని న
[1]ల్దిక్కులను బెద్దయెలుఁగున
నక్కజముగ భూతసంచయంబులు వలికెన్.

135. వ. ఇట్లు శౌర్యసారసంపాదితరౌద్రుండైన సౌభద్రుండు వడుటయు వారిబలంబులు విచ్చవడి ఖండనంబు దక్కి [1]తలరిన ధర్మపుత్రుండు ప్రబల యోధవీరలోకంబు నాలోకించి యి ట్లనియె.

136. సీ. మార్బలంబులు సొచ్చి మాతంగములఁ గూల్చి రథరాజిఁ గలఁచి తురంగములఁ
ద్రుంచి పదాతులం దునుమాడి పెక్కండ్రుసైనికప్రవరుల సమయఁ జూచి

---

130. 1. పెనుపుగ, పెంపున - స. శ$_1$. కొన్ని ప్రతులు.

131. 1. తీసూనువారు - ఇ. ఐ. 2. దొరుగన్ - పెక్కు ప్రతులు.

134. 1. ల్దిక్కుల పెద్దయెలుంగున - కొన్ని ప్రతులు.

135. 1. తల్లడిల్లిన - ఇ.

మూఁకల విరియించి వీఁక నాచార్యాదియోధుల నెల్లను నొక్కదెసకు
వెలిచి వియచ్చరుల్ వినుతింప నాకంబు చూఱ గొన్నట్టి యర్జునతనూజుఁ

ఆ. జూచి మనకు నేల శోకింప వైరు[1]ల
గండడంచి గెలుపు గండ ముచిత
భంగిఁ బ్రొద్దుకోలుఁది పరికించి మనసైన్య
ముల మరల్తి మెలఁచుదుఁ ననంగ.

137. వ. అని పలికి బరవసంబు సెస సేనలం బురికొల్పికొని యవష్టంభవిజృంభితుం డయి నిలిచెఁ బదంపడి యరుణకిరణుం డపరమహీధరంబుమౌళికి సరసీరుహశేఖరం బై చెలువారం దదనంతరంబ రక్తచోట్లును నెత్తుటఁ జొత్తిల్లుచున్నట్లుండెఁ బిండుగట్టి పిశాచనిశాచరులు నలిరేఁగి రక్తపానంబును మాంస[1]ఖాదనంబునుం జేయుచు మోదంబునం బొందుచు నాడుచుం బాడుచుండు కలకలంబునను గుణపభక్షణవ్యగ్రవిహంగసముదయతుములంబునను బలలఖాదనసంరంభశివానివహకోలాహలంబునను బరమాభీలం బై నసంధ్యాకాలంబు నిరూపించి నిజశిబిరంబులకు నుభయబలంబులుం బోయె నప్పుడు నీకొడుకులుబ్బునం గొమర మిగిలి యరిగిరి కౌంతేయులు చిన్నఁబోయినయాననంబులతో శోకసంతప్తచిత్తు లయి చని రివ్విధంబున ధర్మతనయుండు దననికేతనంబున కరిగి యచట నిఖిలపరిజనంబులుం దానును సన్నాహంబు లెడలించి శూన్యాకారు లై యున్నసమయంబునం దమ్ముని[2]దెస కూరిమి నారం గూరిన వగ పెంపున ధైర్యంబు ఫొంపఱి వివర్ణవదనుం డగుచు ని ట్లనియె.

*-: అభిమన్యునిమరణమునకు ధర్మరాజు దుఃఖించుట :-*

సం_7_49_1

138. మ. గురుశారద్వతముఖ్యయోధవరసంగుప్తంబు నిర్భేద్య ము
ద్ధుర మాసైన్యము దానిఁ జొచ్చి నమఁ బ్రీతుం జేయఁగాఁ బూని యొ
క్కరుఁడుఁ గోవులలోనఁ జొచ్చుబలుసింగం బొక్కొ నా నట్లు సొ
చ్చి రయం బార ననేకవీరశిరముల్ చెండాడె నుద్దండుఁ డై.

---

136. 1. లఁ గూల్చి కలఁచి గెలుపు గొంద - ఖ. చ. భాకూ. వ. వీ. శ. ష.

137. 1. కబళన - కొన్ని ప్రతులు. 2. వలని - ఊ. ఏ.

139. క. ఈసును రోసముఁ గలదు
శ్శాసను నొప్పించి పఱపి చతురంగములన్
గాసిలఁ జేయుచు న ట్లు
ల్లాసముతో [1]మెలఁగ గాఁ [2]దలంచె యొరులకున్.

140. తే. కొడుకుఁ బొడగాన కర్ణునుఁ డడిగెనేని
వానితో నింక నే మనువాఁడ వారికి
నతని[1]గారాబుచెలియలి కధికదుఃఖ
మే[2]న చేసితి [3]వగవంగ నేమి గలదు.

141. క. బాలుఁడు సుకుమారుఁడు పె
క్కాలములం జొచ్చి యెఱుఁగఁ డనక మొన సొరం
జాలుదు చొరు మని పనిచితి
నేలా [1]న వ్వాస దోస మెఱుఁగఁగ నిచ్చున్.

142. క. కుడువను గట్ట బూయను
దొడువను బోఁ బనిచి కాక తొలుత మొన సొరం
గొడుకుం బనుచుట కెవ్వఁడుఁ
గడఁగునె నాయట్టిపాపకర్ముఁడు దక్కన్.

143. తే. వానితోడిద లోక మై యేను బోవ
నై తిఁ బోఁ గన్నఁ బుత్రశోకాతురత్వ
మున నితాంతవివర్ణతఁ బొందుచుండఁ
జూడ [1]కుండెడివాఁడ నర్జునుమొగంబు.

---

139. 1. బెనగగా - కొన్ని ప్రతులు. 2. దరంబె - ఎ. ఐ. ఔ. ఖ. ల. కొన్ని ప్రతులు.
ఇచ్చట 'ల' 'ర' వర్ణములకు మైత్రి కన్పించుచున్నది.

140. 1. గారాపు - ర. వ. శ. ష. హా. కొన్ని ప్రతులు. 2. నొనర్చితి వగవంగ - వ.
3. వనరంగ - ఆ. ఈ. ఉ. ఔ. ఠ. డ. స. $శ_1$.

141. 1. నాయాస దోస - వీ. శ. ష.

143. 1. కుండెడు వాడ - కొన్ని ప్రతులు.

144\. ఉ. వాసవునంతవానికిని వచ్చినయాపద దీర్పఁ గాలకే
యాసురు లట్టిబల్వగలు నైనను వ్రేల్మిడిఁ ద్రుంచు నాజి న
వ్వాసవియాత్మజుండు పగవారలచే హతుఁ డై నదుర్దశం
జేసి యలంతఁ జేడ్పడఁగఁ జేసె విధాత్రుని నేమి సెప్పుదున్.

145\. చ. కొడుకు వధించి రన్నఁ గురుకోటికి నెట్టన యగ్గి రూపు మూ
పెడును కడంగి పార్థుఁ [1]డెదఁ బేర్చినశోకము [2]నార్పఁ జాలునే
పుడమి ధనంబు నాకమువిభూతియుఁ జేరెనయేని నల్ల న
వ్వెడునభిమన్యునెమ్మొగము వే యగుపాలును బోల నేర్చునే.

146\. వ. [1]అని మఱియు ననేకప్రకారంబులం బలవించుచున్న సమయమునం
గృష్ణద్వైపాయనమునీంద్రుం డయ్యెడకు విజయంచేయుటయు నవ్విభుండు

---

145\. 1. డది – పెక్కు ప్రతులు. 2. దీర్పఁజాలునే – జ. ప. బ. వ.

146\. 1. వేదవ్యాసాగమనము, నారదుఁ డకంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱిం గించుట, సువర్ణష్ఠీవిచరిత్రము, షోడశరాజ చరిత్రము, అనువృత్తాంతములతో కూడిన కథాభాగము (ద్రోణ – 2-146-224) భండార్కరుప్రతి ప్రధాన పాఠమునందు విడువఁబడినది. అనుబంధమునందు 920 పంక్తులు గల ఈ గ్రంథభాగము చేర్పఁబడినది. (అను 1-8 పుట 264) ఈభాగము చిత్రశాలాప్రతి, పి. పి. యస్. శాస్త్రి ప్రతి, కుంభకోణ ప్రతి – వీనియందు ప్రధాన పాఠముగా చేర్పఁబడియున్నది.

భండార్కరు ప్రతిసంపాదకవర్గమువా రీలోపము నీక్రింది విధముగా సమర్థించి యున్నారు "ఈ కథలన్నియు శాంతిపర్వమున కన్పించుచున్నవి. శారదా ప్రతి యందు ద్రోణపర్వమున నీభాగము విడువబడినది శాంతిపర్వమునం దీకథలు సంద ర్భోచితముగా కాన్పించుచున్నవి. ద్రోణపర్వమునం దివి యంతగా తగియుండలేదు. ద్రోణ పర్వమునందలి షోడశరాజ వృత్తాంతమున ఒక అసందర్భమును కలదు. పరశు రాముని పదునార్గురు మహారాజులలో చేర్చుట యుక్తము కాదు. సంస్కృత శాంతి పర్వమునందు పరశురాముని స్థానమున సగరుడు పేర్కొనఁబడి యున్నాడు. ఇది యుచితముగా కాన్పించును. మృత్యుదేవతాప్రభావము తరువాత ద్రోణపర్వమున ఫలశ్రుతికూడ చేర్పబడి యున్నది. ఈ అంశములనుబట్టి చూడగాఁ బై వృత్తాంతము లన్నియు, శాంతిపర్వమున మొదట వ్రాయబడె ననియు, తరువాత ద్రోణపర్వము నందు ప్రక్షిప్తములుగా చేర్పఁబడినట్లును విశద మగుచున్నది."

తెలుఁగుభారతమునందు, ద్రోణపర్వమున వేదవ్యాసాగమనము, నారదుఁ డ కంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱింగించుట, సువర్ణష్ఠీవిచరిత్రము, షోడశరాజ

ప్రత్యుత్థానంబు సేసి దండప్రణామం బాచరించి యాసనవిన్యాసనప్రముఖ పూజావిశేషంబుల [2]నారాధించి యమ్మహాత్మునితో ని ట్లనియె.

147. సీ. పరసేన భేదింపఁ బనిచితి నేను సౌభద్రుని వాఁడు నబ్బలము సొచ్చె
[1]వెనుక నేమును జొచ్చి చనఁగ సైంధవుఁడు మమ్మాఁగినఁ [2]దోడ్పడ ననువు దప్పె
[3]నప్పుడు పెక్కంద్రు రపాపడి నవ్వీరుఁ బొదివిన నాఁడి బోయె నట్లు
సుకుమారమూర్తిఁ బ్రతుకు నొంటిమైఁ బిన్నపాపని నలుఁగుల పాలుపడఁగఁ

ఆ. బనిచి తాను బ్రతుకుపాపాత్ముఁ డెందును
గలఁడె విపులశోకజలధి మునిఁగి
పేర్చుతల్లడమున [4]బిమ్మిట గొనియెదుఁ
జిత్త మింక నేమి సేయువాఁడ.

148. వ. అనిన విని మునీశ్వరుం డమ్మనుజేశ్వరున కి ట్లనియె.

149. చ. పలువురురాజులం దునిమె [1]బల్లిదుఁ డాతఁడు పిన్నపాపఁడే
యలుఁగులపాలు సేయ కథియాతులు పువ్వులకోల సాఁతురే
కలఁగుదురే విపద్దశల కాఱియ నార్యులు సావు లింతవిం
తలె గరుడోరగద్యుచరదానవకోటులచావుఁ జూడమే.

---

చరిత్రము అను ఘట్టములు కలవు. శాంతిపర్వమున నీకథాంశములు కొన్ని మార్పులతో తిరిగి కాన్పించును. ఇచట అకంపనుని వృత్తాంతము లేదు. పర్వతనారదవృత్తాంతమధికముగా నున్నది. (శాంతి 229-290) తెలుఁగుభారతమున ద్రోణపర్వమున గాని, శాంతిపర్వమున గాని షోడశరాజ చరిత్రమునందు సగరుని ప్రశంస చేర్చబడలేదు. పరశురాముని వృత్తాంతమే యున్నది. షోడశరాజ వృత్తాంతమునకు సంబంధించిన పద్యములు తెనుఁగున రెండు పర్వములందును ఒకేరీతిగా నున్నవి.

2. నాదరించి – ద. ప. బ.

147. 1. నాతనిపిరుదన యరుగ సైంధవుడు – జ. బ. 2. దోడ్పడుననువు – కొన్ని ప్రతులు. 3. బలువురు యోధులు పైబడి యబ్బాలు బొదివిన – ఆ. ఖ. చ. వ. వీ. శ. ష 4. బిమ్మిటి – భాకూ. వ్యా; బిమ్మట – కొన్ని ప్రతులు.

149. 1. బల్విడి నాతడు – అ. ఆ. ఇ. ల. కొన్ని ప్రతులు.

150\. క. ఎప్పాట నెవ్వరికి విధి
దప్పింప వశంబె ధైర్యధనఘనుఁడవు నీ
విప్పరుసన నడలుట గడు
నొప్పదు శమియింపవలయు నుర్వీనాథా.

151\. వ. అనిన సాత్యవతేయునకుం గౌంతేయాగ్రజుం డి ట్లనియె.

152\. చ. వెరవును లావునుం గలిగి విక్రమసంపద [1]నొప్పి [2]ధీరు లై
పరగిర కాని తమ్ము [3]మృతభావవికారము వొందకుండ సు
స్థిరముగఁ ద్రాణరక్షణము సేయఁగ రాజులు సాల [4]రై రె యె
వ్వరుఁ దలపోయ మృత్యు వనివార్యమె తాపస[5]ముఖ్య యిమ్మెయిన్.

153\. వ. అనుటయుఁ బారాశర్యుండు పాండవాగ్రజున కి ట్లనుఁ దొల్లి యిట్లు పుత్రమరణశోకాతురుం డై నయకంపనుం డనురాజు నారదమునిచేత మృత్యు[1]ప్రకారంబు దెల్లంబుగా విని యుపశమితశోకుం డయ్యె నని విందు మయ్యితిహాసంబు తెఱం గెఱింగించెద నది నీయంతఃకరణంబు సంతాపంబు మాన్చి శాంతి యొనర్చు నవ[2]హితుండ వై యాకర్ణింపుము.

154\. సీ. పగతుఁ డకంపనుపై నెత్తి వచ్చి కయ్యము సేసి యాతని నడఁగఁ బట్టి
కొనుటయుఁ జూచి తత్తనయుండు [1]హరి యనువాఁడు [2]దోర్దర్ప
దుర్వారమూర్తి
యవ్విరోధులమీఁద నడరి బల్విడిఁ దండ్రి విడిపించి విక్రమవిహరణమునఁ
దనివోక మఱియు [3]నుద్ధతిఁ గరిరథఘోటభటనికాయంబుల బడలుబఱుప

ఆ. నుగ్రు లగుననేకయోధులు చలమునఁ
గూడుకొని మహాస్త్రఘోరశస్త్ర

---

152\. 1. నొంది – ఊ. ఏ. ఐ. ద. న. బ. వ. 2. వీరులై – ల. కొన్ని ప్రతులు. 3. మృతిభావ – ఇ. ఈ. ల. 4. రై రి యెవ్వరు – కొన్ని ప్రతులు. 5. వర్య – వ. వీ. శ. ష. కొన్ని ప్రతులు.

153\. 1. ప్రభావంబు – ఊ. ఏ. క. ర. 2. హితమతి వై – ఈ. ఉ. ఓ. ఘ. ఝ. ట.

154\. 1. ధృతి – శ. ష. పెక్కు ప్రతులు. మూలమునందు 'హరి' అనియే యున్నది. 'తస్య పుత్రో హరి ర్నామ నారాయణసమో బలే' ద్రోణ – 52-27. చిత్రశాలాప్రతి. 2. భుజబలదుర్వారమూర్తి – భాకూ. 3. నుద్ధతకరిరథ – ఇ. ఊ. ఏ. వ.

తతుల నక్కుమారు మృతుఁ జేసి రప్పుడు
గనలి రభసమున నకంపనుండు.

155. క. విపినంబు నడఁచుదవశిఖ
కుప[1]మాస్థాన మయి పగలఱయొప్పు సెఱచి యా
త్మపురమ్ము సొత్తెంచెం దూ
ర్యపటుధ్వను లెసఁగ ననిమిషాధిపుభంగిన్.

156. వ. ఇట్లు గెలిచి వచ్చియు.

157. ఆ. పుత్రుఁ దలఁచి తలఁచి [1]పొగులుచు నున్నయ
న్నరవరేణ్యుకడకు నారదుండు
నెమ్మి వచ్చుటయును నిభృతుఁ డై యాసనా
ర్ఘ్యాదిపూజనంబు లాచరించి.

158. వ. అతనికడనుండి యమ్మహీపతి యత్తాపసముఖ్యునకు నిజవృత్తాంతం బెఱిం గించి కొడుకుగుణంబు లగ్గించి వానిం గోలుపోవుటం జేసి విజయంబు ప్రియంబు సేయ [1]కున్న దనితనవగపును దెలిపి మఱియును.

159. క. మునినాయక మృత్యువు ప్రభు
వని విందుము లోకమునకు నది యెట్లొకొ త
జ్జననంబుఁ దత్ప్రభావము
వినఁ దలఁచెద నుచితమేని వినిపింపు తగన్.

*-: నారదుఁ డకంపనునకు మృత్యుదేవతాప్రభావం బెఱింగించుట :-*

సం. అను_1_8_67 పంక్తి

160. వ. అనిన విని యమ్మహాత్ముండు గరుణాయత్తచిత్తుం డై యతని కిట్లను బంధు మరణశోకం బుడుపం జాలెడుమృత్యుప్రకారకథ వినుట మేలు నీవవధాన

---

155. 1. మానం బగుచు పగఱ - స. శ₁. కొన్ని ప్రతులు.

157. 1. పొక్కుచు నున్న - వ.

158. 1. కున్నయది యని - కొన్ని ప్రతులు.

పరుండ వై వినుము సెప్పెదం బ్రజాపతి ప్రజల సృజియించి పదంపడి [1]సంహారంబు లేమిం జేసి భూమికిఁ దదీయభారంబు దుర్భరం బగుటయు ననుసంధించి చింతాక్రాంతుం డై [2]తత్సంహారంబునకు నుపకరణంబు గానక కటకటంబడిన నతనియింద్రియంబులవలన మహోజ్వలనంబు జనియించి యెల్ల దిక్కులం బరఁగి చరాచరాత్మకం బైన భూతవ్రాతంబు దహింపం గడం గుటయు భువనహితార్థంబుగా భవుండు సని కమలభవుశరణు సొచ్చినం బ్రజ్వరిల్లు చున్న యమ్మహానుభావుం డద్దేవు నాలోకించి యాదరభరితాం తఃకరణుం డై.

161\. క. నీకోరికి యప్రతిహత
మేకార్యము గోరి వచ్చి తెఱఁగింపు మమే
యాకార కామహర యది
సేకొని యాతుణము యేను జేసెద ననుడున్.

162\. ఆ. అభవుఁ డిట్టు లనియె నఖిలసృష్టిక్రియా
కర్త వగుట నీవ కలుగఁ జేయఁ
గలిగి భూతకోటి యెలమిఁ బొందఁగఁ గోప
మెత్తి యాపుమాప నేల యిపుడు.

163\. వ. నాకుం గా లోకంబులం గరుణాలోకంబున నావరింపు మనిన విని యంబు జాసనుండు నాయందుఁ గోపంబును గామంబును లేవు వినుము ప్రజాభార పీడిత యైన భూమిదేవి దన[1]డప్పి యెఱింగించినం దదీయహితంబు సేయం బూని సంహారంబు గావించువాఁడ నై దానికి నుపాయంబు విచారించి యెద్దియుం గాన నై తి నది గారణంబుగా నన్నుఁ గ్రోధంబు వొందె నన వుడు భూతనాథుండు.

164\. చ. అనఘవిచార నీ వరయ మన్నఁ దగం గడునిష్ఠ లోకపా
లన మొనరింతుఁ గాన యనలం బయి నీదగునల్క లోక[1]ము

---

160\. 1. తత్సంహారంబు – వీ. శ. ష 2 తత్సంహారణంబునకు – ట. ర. ణ. త.

163\. 1. దప్పి – కొన్ని ప్రతులు.

164\. 1. మున్ ల్) మునుకొని – ఖ క. చ. జ. భాకూ. వ. శ. ష.

న్మను మిడి కాల్పఁ జొచ్చినఁ గనుంగొని యేఁ గృప పుట్టి చెప్పెదం
జను నె మహోగ్రకోపవివశత్వము నీకుఁద్రిలోకనాయకా.

165. వ. చరాచరంబు లన్నియు నొక్కపెట్ట భస్మీభూతంబులు సేయ నేల ధరణీ భారంబు [1]వాయుటకై యుచితసంహారంబు గలుగునట్లుగ నొండుదెఱంగు దలంపుము కోపం బుపసంహరింపు మివ్వరంబు నాకొసంగు మనవుడు నిహత పాపకళంకుం డై నయాశంకరుపలుకులకు నతం డయ్యాలుక నడంచిన నయ్యా నలం బాఱుటయును భువనంబులు ప్రమోదంబు నొంది యాశంకరళతా నందుల నభినందించె నట్లు క్రోధోపశమనం బాచరించుసమయంబున.

166. సీ. కమలాసనునియింద్రియముల రక్తాస్యయు [1]నసితాంగియును
నరుణాంబరయును
నగునింతి జనియించి యల్లన నగుచుఁ గెంజాయ రంజిల్లులోచనము లలర
నాజగన్నాథు[2]ల నలవోకవోలెఁ గన్గొని దక్షిణమునకుఁ జననజుండు
మొలుపుతో మృత్యువ మృత్యువ యెట వోయె దని
పలుమాఱు సాంత్వనము దోఁపఁ

తే. బిలిచి సంహారబుద్ధి నాకొలయఁ బొడము
కనలునం దుద్భవించితి గాన నీవు
దొడగి [3]వాసి లే కెల్ల జంతువుల సంహ
రింపు నావంపుమై నీకుఁ బెంపు [4]గలదు.

167. వ. అనిన విని మృత్యుదేవత దుఃఖిత యయినం గన్నీరు దొరంగె నయ్యశ్రుబిం దువులు పద్మజుండు [1]పాణీపుటంబునం బట్టి లోకహితార్థంబుగా ననేకభం గుల [2]ననునయించిన నక్కాంత గాడ్పున నల్లాడుతీఁగ తెఱంగునం జలించి యంజలి ఘటించి యవ్విరించి కి ట్లనియె.

---

165. 1. వాయుటకు నై - కొన్ని ప్రతులు.

166. 1. నసితాంగయు - వ. శ. కొన్ని ప్రతులు. 2. ని - ఊ. ఏ. 3. గాసిలకెల్ల - ఎ ట. ప. 4. కలుగు - పెక్కు ప్రతులు.

167. 1. పాణితలంబు - ఉ. త; పాణిపుటంబు - ల. శ. ప. 2. ననూనయించిన - పెక్కు తాళపత్రప్రతులు.

168. తే. నీవు సృజియించి [1]తలఁచె నన్ను దేవదేవ
యేను గ్రూరకర్మమునకు నెట్టు లోర్తు
బంధుమరణశోకార్తులై పనవుజనుల
వివిధ[2]భంగులయెలుఁగులు వినఁగఁ జాల.

169. వ. ఈయధర్మంబునకు [1]వెఱతు నీవు నాఁకీడ కృప సేయు మిట్లు నన్నుం బను
పక తపశ్చరణంబునకుం బనుప వలయు నివ్వరం బిమ్ము భవదనుజ్ఞ వడసి
ధేనుకాశ్రమంబునకుం జనియెద నని పలికినం బరమేష్ఠి యన్నీరజాక్షి
[2]నిరీక్షించి.

170. సీ. నినుఁ బ్రజాసంహారమునకు [1]నై కల్పించినాఁడఁ గావున నీమనంబునందుఁ
బొడమువిచారంబు నుడిగింపు మిట్లు గాఁ గలయది యైనయిక్కార్యమునకు
నన్యథాత్వం బేల యగుఁ బ్రజాసం[2]హారణము వనిందితసమయము[3]గఁ జేయు
మీ వవశ్యంబును నావుడుఁ గడుభయంబున నప్పటికి నియ్యకొని మృగాక్షి

తే. నలువవదనంబు సూచుచు నిలిచె నతఁడు
ప్రీతుఁడై లోకములఁ గృప పెంపుతోడి
దృష్టిఁ గనుఁగొని నవి పరితుష్టిఁ బొందెఁ
జంద్రమౌళియుఁ దనయిచ్చఁ జనియెఁ బ్రీతి.

171. వ. మృత్యుదేవియుం బరమేష్ఠికిం బ్రణమిల్లి.

172. తే. అచటు వాసి రయంబున నరిగి ధేను
కాశ్రమంబున నియమంబు లాచరించి
నంద [1]కాశికి యనియెడునదులఁ బెక్కు
వ్రతము లొనరించి మఱియుఁ దీర్థముల నెల్ల.

---

168. 1. తిట – కొన్ని ప్రతులు. 2. వాక్యభంగులు మది – గ. ఞ. వ.

169. 1. వెరతుం గాన – ల. 2. నాలోకించి – ఇ.

170. 1. సంకల్పించి – అ. ఆ. ఈ. కొన్ని ప్రతులు. 2. హారమును సమయోచితముగను
జేయు – ఆ. జ. ట. 3. ల. న – అని పాఠములు.

172. 1. కాశిక – కొన్ని ప్రతులు.

173\. వ. అద్దేవు నుద్దేశించి పెద్దకాలం బనేకవిధంబుల దుష్కరంబు లగుతపంబులు సేయుచుం బోయి హిమశైలశిఖరంబున [1]సంయతాత్మ నై యున్నం జతురాననుం డమ్మానినికిం బొడసూపి మృత్యువ నీ వత్యంతనిష్ఠురనిష్ఠానియమంబు లేల యనుష్ఠించెద వనిన నయ్యంగన సమాధానంబున నున్న ప్రజల మొదలు [2]నులిచి చంపంజాల నన్ను నీపనికిం బంపకు మధర్మభయంబున ని న్నాశ్రయించెద నార్త నైననాకు శరణంబ వగు మని ప్రణమిల్లిన నతం డి ట్లనియె.

174\. ఆ. ఇంతి నీ కధర్మ మేల యయ్యెడు నాదు
[1]పనుపు సేయ నిన్ను బరమధర్మ
మొందు విమలకీర్తియును జెందు నట్లుగా
వరము లిత్తు మేను [2]హరుఁడు నీకు.

175\. వ. ఏ ననుసంధించినపనికి నీకు భయం బేల చతుర్విధభూతకోట్ల నుపసంహరింపు మనిన న త్తన్వి దేవా దేవరయాజ్ఞ దలమోచి చేయు దానం గాక యొక్క విన్నపం బవధరింపుము లోభంబును గ్రోధంబును నీర్ష్యయు నసూయయు కలిగించి జంతువుల శరీరంబుల వికృతిం బొందింప వలయు ననవుడు నతం డట్లు యయ్యెడు నదియునుం గాక నీయశ్రుబిందువు లెన్ని యన్నియు రోగంబు లై [1]జనంబులం [2]జావం జేయం గలయవి దానం జేసి యధర్మంబు నిన్నుం బొరయ నేరదు ప్రాణిమారణంబు నీకుం బరమధర్మం బగు బవదీ యశుభం బేను గోరెద నీవు ధర్మస్వరూపంబ వీవిశ్వంబునకు నీశ్వరి వట్లు గావునఁ [3]బ్రాణసంయమనంబు భవదధీనంబు సర్వజీవుల[4]యెడం గామరోషంబు లుడిగి జీవంబుల నాకర్షింపుము త[5]త్ప్రకారంబు ధర్మతత్త్వంబు నీకు [6]భయం బేమి మిథ్యావర్తనుల నధర్మంబ సమయించుఁ బొమ్మనిన నమ్మా

---

173\. 1. నియతాత్మ నై - ల. పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నులిమి, దునిమి, విరిచి - అని పాఠములు.

174\. 1. పంపు - వ. పీ. శ. ష. 2. సురలు నీకు - భాకూ.

175\. 1. జంతువులం, జీవులం - అని పాఠములు. 2. బాధచేయ గలయవి - ఐ. ఓ. 3. బ్రాణిసంయమనంబు - ఉ. భాకూ. ల; ప్రాణిసముదయంబు - ఏ. ర. 4. యెడల- కొన్ని ప్రతులు. 5. తంత్రంబు - జ. ద. బ. వ. 6. భరం బేమి, భారం బేమి - అని పాఠములు.

నిని శాపభీతిని దన్ను నధర్మంబు వొందదను [7]మాటను దన్ని యోగం బంగీకరించె నవ్విరించివచనంబుల తెఱంగున నాధివ్యాధులు గాత్రహానిం జేయ నామృత్యుదేవత ప్రాణాపహారిణి యగుటం [8]బ్రాణంబులు దేహంబులం బాసి దేవాదిభావంబుల బొందుచు మగుడ [9]మనుష్యత్వంబు నొందుచుండు.

176. తే. భీమ[1]నాదుండు భీముఁ డుద్దాముఁ డప్ర
తర్క్యతేజోమయుఁడు జగత్ప్రాణుఁ డొడలు
మనుపఁ జెఱుపంగ నొడయండు సనుట మగుడ
నరుగుదెంచుట వింత గా దతని కెందు.

177. క. నరు లమరు లగుదు రమరులు
నరు లగుదురు గాన నీదునందనునకు భూ
వర వగవ నేల యతనికిఁ
జిరవీరస్వర్గసుఖము [1]నేకుఱి యుండున్.

178. క. అగణితదుఃఖాత్మక మి
జ్జగ మాతఁడు దీని దొఱఁగి సౌఖ్యాత్మక మై
వగ చెంతలఁ జేరనియ
జ్జగమునఁ బుణ్యాత్మపురుషసంగతి [1]వడసెన్.

179. వ. నీకు వగవఁ బని లేదు బ్రహ్మకల్పితం బైన యీ[1]నిశ్చయంబు నిరూపించి ధీరులు దెగినవారలకు వగవ రని చెప్పిన నారదునకు నయ్యకంపనుం డి ట్లనియె.

---

7. పలుకులను – ఖ. చ. వ. పీ. శ. ష. 8. బ్రాణిజాలంబులు–ఈ. ఐ. ఔ. ఘ. ల. కొన్ని ప్రతులు. 9. మనుష్యభావంబు – వ.

176. 1. నాథుండు – శ. ష. పెక్కు ప్రతులు. మూలమునందు భీమనాదుడనియే యున్నది. "వాయుర్భీమోభీమనాదోమహౌజా / భేత్తాదేహాన్ ప్రాణినామ్ సర్వగోఽసౌ." చిత్రశాలాప్రతి. 7–54–47

177. 1. నేకొనియుండున్ – కొన్ని ప్రతులు.

178. 1. వెలసెన్ – కొన్ని ప్రతులు.

179. 1. విశ్వంబు – ల. శ. కొన్ని ప్రతులు.

180\. క. మునినాథ నీవు సెప్పఁగ
ననఘం బగునీసమంచితాఖ్యానం బే
విని గతశోకుఁడ నైతిని
మనము ప్రియం బందె నతిసమాధానమునన్.

181\. వ. అనుచు వినతుం డగుటయు నమ్ముని దనదైన [1]యశోకవనంబునకుం జనియె
నని పలికి పారాశర్యుండు.

182\. క. ఈయితిహాసం బాయువు
శ్రీయును నారోగ్యమును విశిష్టగుణంబుం
జేయు జనములకు జగతీ
నాయక వ్రాసినఁ బఠించినం దగ వినినన్.

183\. వ. అభిమన్యుండును భండనంబునఁ బిఱుసనక [1]శరశరాసనాదివివిధాయు
ధంబులఁ బరబలంబులఁ బడలు వఱచి వీరస్వర్గసౌఖ్యంబును బ్రఖ్యాతియుం
బడసె నీకు నడలం బని లే దని చెప్పిన విని ధర్మతనయుండు దనమనంబున
నుత్తమక్షత్త్రధర్మంబు లెఱుం గిట్టిద యగుట దలపోసియు శూరులు పుణ్య
లోకంబున సుఖం [2]బుండుటయుం దెలిసియు నెవ్వగ విడిచి వెండియు వేద
వ్యాసమునీశ్వరుతో ని ట్లనియె.

184\. ఆ. మును ప్రసిద్ధిఁ బొంది చనినభూపాలక
శ్రేష్ఠు లెవ్విధమునఁ జేసిరొక్కొ
క్రతువు [1]లవ్విశిష్టకర్మ[2]జాతముఁ దెలి
యంగఁ జెప్పి నన్ను నాదరింపు.

185\. వ. అనిన విని యమ్మనుజపతితలంపు గనుంగొని కృష్ణద్వైపాయనుండు నీ వి
ట్లడుగుట నీకొడుకు దొంటిమహారాజులయట్టివాఁడు గావున నక్కుమా
రునకు వారలకుం బుణ్యగతిదారతమ్యం బెట్టిదియో యని యర

---

181\. 1. తపోవనంబునకుం — ల.

183\. 1. శర — పెక్కు ప్రతులలో లేదు. 2. బుల బొందుటయు — కొన్ని ప్రతులు; బుండుట వినియు, దెలిసియు — ల.

184\. 1. లవ్విశేష — ఔ. వ. 2. జాతంబుల నానతిచ్చి — ఐ.

[1]యుట గా నోపు నని యూహించె దనప్పుడు నతఁడు [2]మీదివ్యచిత్తంబున నవధరించినదానిం గా దన నెట్లు వచ్చు నవ్వానిని విన వలతు నానతి యిందు.

186\. చ. [1]అనుటయు నమ్మునిప్రవరుఁ డాతని కి ట్లను నధ్వరప్రవ
ర్తనులు దపః[2]ప్రదీప్తులును దానసమగ్రులు [3]దాత్తశీలురుం
జని యెదు నట్టి[4]చోటు లోఁ[5]సంపద యే రణశూరకోటి క
ర్జునసుతుఁ డత్యుదాత్త మగుచోట సుఖస్థితి నుండు భూవరా.

187\. వ. అది యట్లుండె మహితాత్ము లయినమహీపతుల [2]వరిష్ఠకర్మానుష్ఠానంబుల తెఱం గెఱుంగుట మేల కాదె యంత లంతలు మానుసులు మడిసిరి గాని పుడమి నిత్యులై నిలువంబడ రది వినుటయు నీ[3]మనశ్శోకోపశమనంబు సేయుం జెప్పెద నాకర్ణింపుము.

-: వేదవ్యాసమునీంద్రుఁడు ధర్మజునకు సువర్ణష్ఠీవిచరిత్రంబు సెప్పుట :-

సం. అను 1_8_300 పంక్తి

188\. క. జనపాలక సృంజయుఁ డను
మనుజేంద్రుఁడు పుణ్యమూర్తి మహిమాస్పదుఁ డి
వ్వననిధివలయములోని య
వని నొక్కఁడ యేలు దుర్నివారస్ఫురణన్.[1]

---

185\. 1. యుటకుం గానోపు – ల. స. శ$_1$. కొన్ని ప్రతులు. 2. మీరు దివ్య – పెక్కు ప్రతులు.

186\. 1. అనవుడు – ఖ. చ. వ. శ. ష. 2. ప్రసిద్ధులు – ల. శ. కొన్ని ప్రతులు. 3. శాంతిశీలురుం, దాంతిశీలురుం–అని పాఠములు. 4. చోట్లకట – ఖ. చ. జ. బ. వ. శ. 5. సంప్రతి – చ. భాకూ. ల. వ. శ. స. శ$_1$; సమ్మతి – ఈ. వ.

187\. మహాత్ములయిన – పెక్కు ప్రతులు. 2. విశిష్ట, గరిష్ఠ, పటిష్ఠ – అని పాఠములు. 3. మనశ్శోకోపశమనంబు – పీ. శ. ష. కొన్ని ప్రతులు; మనోరోగశమనంబు – వా. కొన్ని ప్రతులు.

188\. 1. "52 అధ్యాయములో సృంజయ వృత్తాంతమందు పర్వతనారదులు అన్యోన్యము స్వర్గమునకు వెళ్లకుండా శపించుకొన్న కథ తెనిగించలేదు." వ ప్రతిలో బ్రౌన్ వ్రాసిన నోటు.

189. వ. సంతానార్థి యయి సంతతంబును భూసురపూజనంబులు సేయుచుండు నానరపతికి నారదుండు సఖుం డగుట నతనిపాలికిం బలుమాఱు నరుగు దెంచుచుండు నొక్కనాఁడు విప్రవరు లతి[2]ప్రయత్నంబునం గూడికొని యమ్మునివరునితో నిమ్మహీపతికోర్కి దీర్ప వలదే యని చెప్పిన.

190. క. అతఁ డతనితోడ భవదీ
ప్సిత మెయ్యది నాకు నేల చెప్ప వనుడు నం
చితగుణుఁడు రూపసియు నగు
సుతుఁ గోరుదు నెపుడు నేను సురగణవంద్యా.

191. వ. అక్కుమారుండును మూత్రపురీషలాలాశ్రుస్వేదంబులు సువర్ణంబు లగునట్టి వాఁడు గావలయు ననిన నమ్మహీపతికి నమ్మహాత్ముం డవ్వరం బిచ్చె నాసృంజయుండు నత్తెఱంగు తనయుం బడసి సువర్ణష్ఠీవి యనుపే రిడి ప్రియంబునం బెనుచుచు వానివలనం గనకం బనుదినంబు నుత్తరోత్తరాభి వృద్ధి యగుచుండ సమృద్ధి నొంది శయనాసన[1]సదనప్రాకారప్రభృతిసమస్త వస్తువులును గాంచనమయంబులు గావించికొని యసమానమహి[2]మా నందంబునం [3]బ్రకాశుం డై.

192. క. విలసిల్లుచు నుండఁగ మ్రు
చ్చిలి పట్టి కుమారునోరఁ జీరదుఱిమి వెం
గలు లగుక్రూరులు గొందఱు
వెలువడఁ గొనిపోయి యొక్కవిపినములోనన్.

193. ఆ. కడుపు వచ్చి యొడలు గలయంగ [1]జల్లించి
పాపి పాపి చూచి పసిఁడి గాన
కచట శవము వైచి యరుగుచునుండి త
త్కర్మఫలముఁ దమ్ముఁ గలచుటయును.

---

189. 1. దెంచుటం జేసి - కొన్ని ప్రతులు. 2. ప్రియంబున - కొన్ని ప్రతులు.

191. 1. గృహోపకరణ - ఇ. ఎ. 2. మోన్నతి - ఇ. ఉ. ఖ. ఝ. వ. కొన్ని ప్రతులు.
3. బ్రకాశితుం డై - ఆ. ఇ. ఔ. త.

192. 1. వెడలం గొనిపోయె - ఆ. ఈ. ఢ. య. ర. కొన్ని ప్రతులు.

193. 1. పరికించి - ఇ; జీరించి - ఉ. ఠ.

194. వ. అప్పాపాత్ములు దమలోనం గలహించి యొండొరుల వధించి యందఱు
నధోగతిం [1]జెందిరి సృంజయుండును గొడుకుం గానక వెదకి తత్కళేబరంబు
గని పరలోకక్రియలు నిర్వర్తించి శోకంబునం బలపించుచున్న నన్నరేంద్రు
కడకు నారదుం డరుగుదెంచి యతనిచేత నర్చితుం డై.

195. క. జననాథ యిట్లు శోకం
బునఁ గుందినఁ దనువు విడిచి పోదె యసుఁలు స
చ్చినవారలు వత్తురె యే
డ్చినఁ దెలిమిం జేసి హితము సెప్పెద నీకున్.

-: షోడశరాజచరిత్రము :-

సం. అను 1_8_360 పంక్తి

196. వ. అవధానాయత్తం బగుచిత్తంబుతో విను మని యి ట్లనియె.

197. సీ. సంవర్తుఁ డనుమహాసంయమి దేవతాగురుతోడి యీసున నరుగుదెంచి
పూని యుపద్రష్ట యై నడపంగ హిమాచల[1]పాదంబునందు శక్ర
వరుణప్రభృతు లై నసురలు మహామునీంద్రులును సహాయు
లై మెలఁగుచుండ
శాలాప్రముఖ భవ్యసాధనంబులు గనకమయంబులుగ వస్త్రకాంచనాజ్య

ఆ. దధిపయఃఫలాదితర్పణద్రవ్యస
మృద్ధి సకలజనులు మెచ్చఁ బెక్కు
లధ్వరములు సేసె నట్టిమరుత్తుండు
నిత్యపదవి [2]నుండ నేర్చెనయ్య.

198. సీ. సన్మార్గమున రాజ్యసంపద నొంది భూసురపూజ లొనరించి సువ్రతముల
బృందారకులఁ బ్రీతిఁ బొందించెఁ దన కర్థిఁ బర్జన్యుఁ డేఁచుటఁ బసిఁడివాన

---

194. 1. బొందిరి - పెక్కు ప్రతులు.

195. 1. మే నలంత బొందదె - అ. జ. ట. బ.

197. 1. ప్రాంతంబునందు - ఐ- క; శృంగంబునందు - ఓ. 2. నొంద నేర్చె - కొన్ని ప్రతులు.

కనకమయము లైనకర్కటఝషవక్రకూర్మచయముతోడఁ గురియు చుండ
నయ్యర్థ మెల్ల ధనార్థుల కిచ్చుచుఁ గురుజాంగలంబునఁ బరమనిష్ఠ

ఆ. నశ్వమేధముఖము లైనరాజాఖ్యాయ
జ్ఞములు పెక్కు సేసె సకలజనులుఁ
బొగడునట్టిపాడి నెగడె సుహోత్రుఁ డ
న్విభుఁడు దెగియె [1]నన్నఁగ వినమె యధిప.

199. సీ. కాంచనాలంకారకాంతంబు లై యూధి కెక్కినగజములు పెక్కువేలు
జవసత్వరూపాదిసకలగుణములఁ బెం పెసఁగినహయము లనేకలక్ష
[1]లమలసువర్ణమయము లగుకొమ్ములం గొమరారుపశువులు గోటు లూర్జి
తాంగకవిలస[2]దజావికంబులు గణనాతీతములు కన్య లప్రమేయ

ఆ. లఖిలరత్నవిరచితాభరణంబు ల
నల్పములు మహీసురావళులకు
నిచ్చి చేసెఁ గ్రతువు లెన్నియేనియు నంగుఁ
డతఁడు నన్యలోకగతుఁడు గాఁడె.

200. సీ. ఏడుదీవులయందుఁ గ్రీడాగతులఁ దనరథము చరింప నరాతు లనఁగ
వినియు నెఱుంగక విభవ మార్జించుచోఁ బ్రజల నొప్పింపనిపరమపుణ్య
కర్మంబునకు మెచ్చి గారవంబునఁ దన [1]కక్షయధనము ఫాలాక్షుఁ డొసఁగ
నశ్వమేధములు జాహ్నవిపొంత శిష్టజనాకీర్ణములుగఁ బెక్కాచరించెఁ

ఆ. దారకములు వృష్టిధారలు లెక్కింప
వచ్చుఁ గాని యతనియిచ్చుగోవు
లెన్నఁ గొలఁది గాదు సన్నుతిపాత్ర మా
శిబికి నుర్వి నునికి [2]సెల్లె నయ్య.

---

198. 1. ననుట – పెక్కు ప్రతులు.

199. 1. లమరిన స్వర్ణమయ – కొన్ని ప్రతులు. 2. దజానీకములు – కొన్ని ప్రతులు.

200. 1. కక్షిలాపధనము – వ. 2. సెల్లెనెట్లు – వా. కొన్ని ప్రతులు; సెల్లెనయ్య – ఊ.
ఎ. ఏ. ఐ. ర. వ.

201\. సీ. యౌవనంబునఁ దప మాచరింపఁగఁ దండ్రి పంపున నరిగిన పెంపుకలిమి
సేతువు జలధిఁ బ్రఖ్యాతంబుగా నొనర్చినమర్త్యలోకపావనవిభూతి
త్రైలోక్యకంటకు దశముఖు బంధుయుక్తంబుగాఁ జంపిన కలితనమ్ము
బాలురమరణంబు వాటిల్ల కుండంగఁ జేసినయత్యంతచిత్రమహిమ

ఆ. గలిగి యశ్వమేధములు మున్నుగా ననే
కాధ్వరము లొనర్చి యఖిలజనులఁ
[1]దల్లి వోలె నరసి దశరథరాముండు
గాలవశత నొందెఁ గాదె యధిప.

202\. సీ. పూర్వవంశ్యులఁ గావఁ బూని వియద్గంగ నవని భాగీరథి యనఁగఁ బఱపి
శక్రుండు మెచ్చఁ బరాక్రమంబునఁ జేర్చి యప్రతిహతముగ నశ్వమేధ
యాగంబు లొనరించు నప్పుడు వేయువే లరదంబులందుఁ గన్యల నలంకృ
తలఁ జేసి యునిచి రథంబు రథంబున కిభములు నూఱు [1]నూఱుచేసి యేమఁ

తే. గేనుఁగు నకు గుఱ్ఱములు వేయేసిపాటి
హాయముహాయమున కట్ల గోచయ మమర్చి
భూరిభూరియుతంబుగ భూసురులకు
నొసఁగినట్టి భగీరథుఁ డున్నవాఁడె.

203\. సీ. అర్థి విశ్వావసుం డాదిగాఁ గలుగుగంధర్వులు హృద్య[1]వాదన మొనర్ప
నప్సరోనికురుంబ మాటలుఁ బాటలు నై వినోదింపంగ నమరగణము
బహువిధాలంకారభంగులు విన్నాణములు నూప దివ్యమునులు నుతింప
మనుజలోకం బెల్లఁ గనకాన్నవస్త్రభూషణదానములఁ దృప్తి సనఁగ నశ్వ

ఆ. మేధసమితిఁ జేసి మెప్పించె నింద్రుని
శతతమాధ్వరమున నతఁడు హయము
నాస పడిన నిచ్చె నాదిలీపునిఁ జూపు
మా ధరిత్రి నిప్పుడు మనుజనాథ.

---

201\. 1. దండ్రివోలె - ఊ. ఏ. వ.

202\. 1. నూఱుచేర్చి - ర. వ. స. శ$_1$. పెక్కు ప్రతులు.

203\. 1. వాద్యము లొనర్ప - ఐ. వీ.

204. సీ. జననమాదిగఁ బాకశాసనుకరమునఁ బ్రభవించు నేయును బాలుఁ ద్రావి
ద్వాదశదినము లాతఁడు గారవింపంగ వర్ధిల్లి పండ్రెండువత్సరముల
ప్రాయమై రాజ్యసంప్రాప్తికి నేతెంచి యర్కునియుదయంబు నస్తమయము
నగుపట్లు పొలిమేర లైనమహాక్షేత్ర మంతయు నొక్కండ యనుభవించి

ఆ. యన్నపర్వతముల నాజ్యనదుల విప్ర
భోజనము లొనర్చి రాజసూయ
ములును నశ్వమేధములుఁ జేసె మాంధాతృఁ
డింద నిలిచెనే నరేంద్ర[1]ముఖ్య.

205. సీ. అనిమిషాసురయుద్ధమున నసురావళి సమయించి వర్ణాశ్రమముల నేర్ప
రించి భూమి యలంకరించి యగ్నిష్టోమ హయమేధ వాజపేయాతిరాత్ర
పౌండరీకము లనఁబరంగిన యధ్వరంబు లనేకములు సేసి భూసురులకు
నఖిలభూములఁ గలయర్థంబు లెల్లను దన కని యేమియు నునుప కిచ్చె

ఆ. శుక్రునల్లుఁ డనఁగ శోభిల్లుతనయందు
ధర్మతత్త్వ మూర్జితముగ నియమ
నిష్ఠుఁ డైనయయాతి నెగడె శాశ్వతుఁ డయ్యె
నే నృపాల యమ్మహీశ్వరుండు.

206. సీ. ఓర్వక [1]పెక్కండ్రు దురీశు లొక్కటఁ బైనెత్తి వచ్చిన భండనమున
వారిహేతిచ్ఛత్రవాహనధ్వజములు నఱికిన నడు[2]నడు నడిఁకి వార
లభయంబు వేడిన నంధఱఁ గృపఁ గాచి [3]యేలె నీపెన్నేల యెల్లఁ దాన
కొని యధ్వరములు [4]పెక్కు లొనర్చి వేడుకఁ బాయసమ్ములు
నపూపములు మోద

ఆ. కములు లోనుగాఁగఁ గలవంటకముల ను
ర్వీసురావళులకుఁ బ్రీతిఁ జేసి
దక్షిణలుగ మణివితానంబు లిచ్చిన
యంబరీషుఁ డేమి యయ్యెఁ జెపుమ.

---

204. 1. చంద్ర — ఊ. ఏ. మ.

206. 1. పెక్కండ్రయు (ను) ర్వీశు — కొన్ని ప్రతులు. 2. నడనడికి — కొన్ని ప్రతులు.
3. యెలమి నీపెన్నేల — ఎ. ఖ. చ. జ. శ. 4. పెక్కొనరించి—ఒ. ఓ. ఔ. క. ఖ. ష.

207. సీ. లక్షభార్యల నుపలాలించి యొక్కొక్క వెలఁదికి వేవురు వేవు రాత్మ
జులు గాఁగఁ బది[1]కోటు లలఘుమూర్తులఁ గాంచె వారును
దోర్బలోజ్జ్వలులు నార్య
చరితులు నై పేర్చి తురగమేధంబు లందఱు బహుదక్షిణోదాత్తభంగిఁ
జేయుచుఁ దనపంపు సేసి వర్తింపంగఁ దానును విశ్రుతాధ్వరము లొప్పఁ

తే. పెంపు[2]సొంపును సువ్రతసంపదయును
నిర్మలశ్రద్ధయును కర్మనిపుణతయును
నెఱయ శశిబిందుఁ డొనరించి నెగడె నతఁడు
వడయఁ జాలెనె యెన్నఁడుఁ జెడనియొడలు.

208. సీ. అధికతపంబున నగ్ని నారాధించి ప్రత్యక్ష మగుటయు బ్రహ్మచర్య
వృత్తంబు దమమును [1]వేదవిత్త్వము నహింసయు బాత్రదానంబు
శమము వరము
గాఁ గోరికొని వేదికాస్థలి మణికనకాత్మక యై ముప్పదాఱుయోజ
నముల దైర్ఘ్యము నంత కమరువిస్తారంబుఁ గలుగంగ నొనరించి క్రతువు సేసి

తే. విప్రతతులకు దాని నతిప్రియముగ
నిచ్చి తనపేర గయ నుతి కెక్క వటము
పొగడు వడయంగఁ బుణ్యుఁ డై నెగడె గయుఁడు
భూవరోత్తమ యతఁ డెందుఁ బోయెఁ జెపుమ.

209. సీ. ఇరువదివేవురు పరిణత[1]పాచకు లభ్యాగతులకును [2]నతిథులకును
బాటించి క్రొత్తగాఁ బవలును రేలును వలయునన్నము లిడ వెలసెఁ బశువు
ల్ల నుత్తమగతికై [3]తామ చనుదేర విశసించు నమరులు వేడ్కతోడఁ
బొడసూపి కడుపారఁ గుడువ హవిర్భాగములు వెట్టు నివ్విధమున మహోద్భ

207. 1. కోట్లయలఘుమూర్తుల – ఇ. ఈ. ఎ. 2. మెయిఁజేసి – శ. ష.

208. 1. వేదవృత్తము – హ.

209. 1. యాజకుల – ఖ. చ. జ. భాకూ. వ. శ. 2. నర్థులకును – వ. 3. తార చను దేర – పెక్కు ప్రతులు.

తే. తముగ నొనరించె సత్త్రయాగము దదుత్స
వంబు గొనియాడవచ్చిన వార లెల్ల
[4]ప్రచురపుణ్యాత్ముఁ డన నొప్పె రంతిదేవుఁ
డవ్విభునకును వలసె లోకాంతరంబు.

210 సీ. శరభ[1]సింహవ్యాఘ్రసత్త్వచయంబుల నేడిక [2]లెట్లట్ల యెక్కి యాడి
కట్టుచు విడుచుచుఁ గణ్వాశ్రమంబున దమియింపఁగా సర్వదమననామ
మిడిరి యె నమ్మని పదంపడి మహారాజ్యపదస్థుఁ డై కాళిందితటమునందు
భాగీరథీతీరభాగంబునను సరస్వతిసమీపంబున [3]వాజిమేధ

తే. రాజసూయాదివివిధాధ్వరము
లొనర్చి కనకనిర్మితకరితురంగమరథంబు
లసదృశప్రీతి విప్రుల కొసఁగె భరతుఁ
డన్న రేంద్రచంద్రుండును జన్న వాఁడ.

211. సీ. మిట్టుఁ బల్లంబు నై మెలఁగంగఁ దనరథప్రముఖవాహనములఁ బఱప ననువు
గా కున్న మేదినిఁ గడుసమస్థలి గాఁగ వెరవున నొనరించి విశ్రుతముగఁ
దనపేరఁ బృథివి నాఁ జనఁ జేసి గోరూప యైనయవ్వసుమతి నమర[1]గణముఁ
బనిచి యోషధులును బహురత్నములుఁ బిదికించి [2]జగంబుఁ బోషించెఁ బృథుఁడు

తే. సేసె నానాధ్వరము లవి సెప్ప నేల
సకలధాత్రియు బ్రాహ్మణసమితి కిచ్చె
నమ్మహానుభావునకును నతులయశము
కాక సుస్థిర మయ్యె నే కాయ మనఘ.

---

4. ప్రచురపుణ్యు డన - పెక్కు ప్రతులు; ప్రకటపుణ్యాత్ముఁ డన - వా.

210. 1. సింహోత్వ్యాగ్ర - కొన్ని ప్రతులు. 2. లట్లట్ల - పీ. కొన్ని ప్రతులు. 3. వాజ
వేయ - అ. ఇ. ఊ. ఎ. ఏ.

211. 1. నగము - ఒ. ర. ల. హ. 2. జనంబు - కొన్ని ప్రతులు.

212. సీ. బ్రహ్మవిద్వేషంబు పరికించి కోపించి [1]యవిధేయుఁ డైన సహస్రబాహుఁ
బరిమార్చి నృపతులఁ దర మిడి తునుమాడె నిరువదియొక్కమాఱెల్లచోట
నందఱ యేలెడునన్నిభూములుఁ దాన యేల ధర్మోజ్జ్వలపాలనమున
రాజయోగ్యములు ధరాసురార్హంబులు నగునధ్వరమ్ములు పెక్కాచరించెఁ

ఆ. గశ్యపునకు నిచ్చి కాశ్యపి యనుపేరఁ
జనఁగఁ జేసె నుర్వి జామదగ్న్యు
[2]వినమె యమ్మహాత్ముఁడును బరితోషవి
శ్రాంతి గలిగె నేని బ్రదుక లేఁడు.

213. చ. నలుమడి నీకు నమ్మనుజనాయకు [1]లేమిటఁ జూడ వచ్చినం
దలఁప భవ[2]త్సుతుండు ననుదాత్తుఁడు వారలకంటె నెందునుం
గలయది దీని కేలయధికం బగునెవ్వగ నింత నొవ్వని
త్తెలివి మనంబునం [3]జొనుపు ధీరతసారత గూర్చి నేర్పునన్.

214. వ. అని నారదుండు.

215. తే. ఆయువును బుణ్యమును జిరశ్రయుఁ జేయఁ
జాలుషోడశరాజన్యచరిత మిట్లు
సెప్ప నేర్పడఁగా విని సృంజయుండు
పాండవాగ్రజ యేమియుఁ బలుకకుండె.

216. చ. పలుకక యున్న యద్ధరణిపాలుఁ గనుంగొని యమ్మునీంద్రుఁ డేఁ
చెలియఁగఁ జెప్పినంతయు నతిస్థిర మై భవదీయబుద్ధియం
దొలసెనొ బాదిలోనఁ గ్రమ మొందఁగ వేల్చిన[1]నేయి వోలె ని
ష్ఫల మయి పోయెనో యనుడుఁ బ్రాంజలి యై తగ నాతఁ డిట్లనున్.

---

212. 1. యవిజేయు డైన - భాకూ. ర. ల. వీ శ. ప. కొన్ని ప్రతులు. 2. డనగ యమ్మహాత్ము డతులసంతోష విశ్రాంతి - ల.

213. 1. లెమ్మెయి - ఔ. ణ. 2. త్సుతుండునను దాత్తుడు - భాకూ. ఇచ్చటమూలము "అయజ్వాన మదాక్షిణ్యం మాపుత్ర మనుతప్యథాః/ ఏతే చతుర్భద్ర తరా స్త్వయా భద్రశతాధికాః". చిత్రశాలాప్రతి. 7-70-15; త్సుతుండు ననుదాత్తుఁడు - వా. పెక్కు ప్రతులు. 3. నినుపు - ల; నినుపు - వ.

216. 1. నెయ్యివోలె - ఆ. ఇ. ఈ శ. కొన్ని ప్రతులు.

217. తే. పుత్రశోకాపహంబును బుణ్య[1]తమము
నై నయాఖ్యానమున నాదుమానసంబు
కలఁకయంతయుఁ బాసె నిష్కల్మషుండ
నై తి నీదయఁ జేసి సంయమివరేణ్యా.

218. వ. అనిన విని యత్తపోధనుండు ప్రీతుం డై నీ కెద్ది [1]వలయు నడుగు మిచ్చెద ననుటయు సృంజయుండును దేవా నీవు ప్రసన్నుండ వగునంతకంటె మిక్కిలి వలయు నది యెయ్యది భవత్ప్రసాదభాజనంబు లయినవారికి దుర్లభంబు లగువస్తువులుం గలవే యనుటయు నమ్మునివరుండు.

219. క. ప్రముచ్చులమూఢత్వమునం
జచ్చి నరకవాసమునకుఁ జనినతనయు నేఁ
డెచ్చెద [1]మగుడఁగ వే నీ
కిచ్చెద వగ పుడుగు మింక నేనియు నధిపా.

220. వ. అని చెప్పిన.

221. క. దేవముని యిమ్మెయిం దగు
దీవన యిచ్చుటయు నరుగుదెంచె సువర్ణ
ష్ఠీవి గడు నద్భుతంబుగ
నావిభుఁడు ప్రమోదసంభృతాత్ముం డయ్యెన్.

222. వ. ఇవ్విధంబున నత్తపస్వి యిచ్చిన యక్కుమారునకు సృంజయుం డస్త్రశిక్షగావించి వివాహం బొన[1]రించి యతండు యాగంబులఁ ద్యాగంబుల భోగంబులం దనమనంబునకుఁ బ్రియంబు సేయుచు సంతానవంతుం డై నెగడిన నతం డత్యంతసంతోషంబునం బొదలె నిట్లాసువర్ణష్ఠీవి యశిక్షితాస్త్రుండును నకృతవివాహుండును నయాగకర్తయు నత్యాగవిదితుండును నభోగభాగియు న[2]సంతానవంతుండును నగుసమయంబున సమయుట కారణం

---

217. 1. తరము - కొన్ని ప్రతులు.

218. 1. ప్రియంబు - ఖ. చ. బ. భాకూ. వ. వీ.

219. 1. సంతోషముతో నిచ్చెద - హ.

222. 1. రించె నతండు - కొన్ని ప్రతులు. 2. సంతానమహితుండును - ఇ. ఈ. ఉ. ల. కొన్ని ప్రతులు.

బుగా నన్నారదుండు గారుణ్యంబునం గ్రమ్మఱ వానిం [3]గలిగించె నది య ట్లుండె నవ్వివేషంబు లన్నియు సంపన్నంబు లయి శౌర్యంబున శత్రు [4]ధైర్యంబు దూలించి మేలిమి వడసి నాక[5]లోకసౌఖ్యంబునం బొందిన వాసవపౌత్రునకు వగచుట వివేకంబుతెరువు గాదు విను మీలోకంబు [6]దుఃఖబహుళం బగుటయుఁ దపోదానాద్యనుష్ఠానంబుల మానవులు సురలోకంబు సాధింపం [7]జూచుట సుప్రసిద్ధంబు గాదె నీ వయ్యర్జుననందనుం డెట్టి పుణ్యపరులకుం బడయ నరిది యగుపదంబున నునికి దెలియుటకును భావనంబు లైన పలువురు భూపతుల వృత్తాంతంబులు వినుటకును ఫలం బయిన పరిజ్ఞానంబున సమాధానసుస్థిరుండ వై యుండుము పోయివచ్చెద నని పలికి పారాశర్యుం డంతర్ధానంబు సేయుటయు ధర్మసూనుం డుపశమితశోకుం డయ్యును విష్వచ్చుండు వచ్చిన వానితో నే మనువాఁడ ననుతలంపు వుట్ట నూరకుండె నని సంజయుండు సెప్పుటయు.

223\. తే. అతనితో ధృతరాష్ట్రుఁ డిట్లనియెఁ గ్రీడి
సంగరమున సంశప్తకసమితి నేమి
సేసె మఱువార్త యెవ్వరు సెప్పి రాతఁ
[1]డట్లు దెగుట యెటింగె యె ట్లయ్యెఁ జెపుమ.

224\. క. అనిన విని సూతసుతుఁ డి
ట్లనుఁ జేరడవులు దహించునవలము చందం
బున సంశప్తకసేనల
ననిమిషపతిసుతుఁడు [1]దీప్రుఁ డై [2]పొరి వుచ్చెన్.

*-: అర్జునుఁడు శిబిరంబునకు వచ్చునెడ దుర్నిమిత్తంబులం గని కృష్ణునితోఁ జెప్పుట :-*

సం. 7_50_1

225\. వ. అట్లు మర్దించి మగుడ నప్పుడు మాధవు నాలోకించి.

---

3\. గరుణి చె - జ. ఒ 4. సైన్యంబు - ఏ. ణ. 5. లోకానందంబు - పెక్కు ప్రతులు. [illegible]ఖరూప మగుటయు - భాకూ. 7. బూనుటయు - కొన్ని ప్రతులు.

223\. 1. డట్టు [illegible]కు యెరింగి - అ. కొన్ని ప్రతులు.

224\. 1. దీప్తు [illegible] - [illegible] ఊ ఏ. ఒ. 2. పొలియించెన్ - అ.

226. చ. కలయఁగ దుర్నిమిత్తములు గానఁగ నయ్యె మదీయచిత్తముం
గలఁగెడు మేను బ్రామానుపడఁగాఁ దొడఁగెన్ గురుఁ డారయంగఁ గే
వలుఁడె నృపాలుఁ [1]డేదెసకు వచ్చెనొ యన్న నతండు రాజుఁ ద
మ్ముఁలు సుఖులొండుమై నశుభముం గల దిప్పు డెఱుంగ నయ్యెడున్.

227. వ. అని పలికెఁ దదనంతరంబ యద్దామోదరధనంజయులు సంధ్యాసముచిత
కరణీయంబు [1]లాచరించి యరుగుదెంచి నిజశిబిరంబు [2]సొత్తెంచి రది చిట్లిన
చిత్రరూపంబులు గలకుడ్యంబునుం బోలె వివర్ణాకారులైన జనులవలనం
బాడఱి యున్నం దత్ప్రకారం బనుసంధించి యన్నరుండు నారాయణున
కి ట్లనియె.

228. క. సైనికులు నన్నుఁ గనుగొని
యాననములు [1]వాంచి తొలఁగి యరిగెద రది యే
మో నేఁడు వేణువీణా
గాన[2]స్వనములును వీటఁ గలుగవు కృష్ణా.

229 క. ఈమేలు ప్రజ కొనర్చిన
యామహిమకు నెలవు గొంతి యగ్రతనయుఁ డో
భీముఁ డొకో [1]తమ్ముఁగుఱ్ఱలొ
కో మఱి యెవ్వరొకొ తలఁపు గొలఁదికి మీఱెన్.

230. ఆ. అలరుమొగముతోడ నభిమన్యుఁ డేలకో
యెదురు రాఁడు నాకు నెట్టి[1]వార్త
చెవులు సోఁకు నొక్కొ చే వెట్టికలఁచిన
భంగిఁ ద్రిప్పుకొనఁ దొడంగె మనము.

---

226. 1. డద్దెసకు వచ్చెనొ – ఇ. ఈ. ఉ. ర. ల. హ.

227. 1. లు దీర్చి – ఏ. చ. భాకూ. వ. శ. ష. 2. ప్రవేశించి రది – పెక్కు ప్రతులు.

228. 1. వంచి – కొన్ని ప్రతులు. 2. స్వరములును వీట – ట. ల; క్వణనములు వీట–ఎ.

229. 1. తమ్ముకుఱ్ఱలొ – శ. శర. ష.

230. 1. మాట – పెక్కు ప్రతులు.

231. క. పలు[1]మాటల కిటు మఱుమా
టలు వలుకని కృష్ణుతో నడలు మది మొలవం
బలుకుచు ధర్మసుతుని విడి
దల కరిగెను మోము వెల్లఁదనము[2]నఁ గదురన్.

232. వ. ఇవ్విధంబున నరిగి యన్నరపతిబంధుమిత్త్రులును మాన్యరాజన్యులుం దానును
నొక్కయెడ మన్నం దత్త్పదేశంబునకుం గేశవుండును దోడన చనం జని వా
రుమ్మలించి యునికియు వారలలోన సుభద్రాసూనుండు లేమియుం జూచి
సవ్యసాచి యడుగులు దొట్రు[1]పడ నక్కొలువులోనికిం బోయి కలయం
గనుంగొని యెలుంగు రాల్పడ ని ట్లనియె.

233. క. ఆననములు వెలువెల్లం
గా నడ లొదవినది మీకుఁ గానఁ [1]దడవ మీ
లో నభిమన్యు[2]ఁడు లేఁ డే
మో నాకుం జెప్పఁ డేల యూరక యుండన్.

234. క. ధనురాచార్యుఁడు దగఁ బ
న్నిన్న పద్మవ్యూహ మెరుగు నేరరు [1]చొరు మం
చనుమానింప కతనిఁ జొరు
మనరు గాదా మీ[2]యుపాయ మాఱడిఁ బోవన్.

235. ఉ. అమ్మొన నొచ్చుచొప్పు దెలియక్క విసె నంతియ కాని యిమ్ములం
గ్రమ్మఱుభంగి వాఁడు విన గానఁడు దీని నెఱుంగకున్కిఁ బా
పమ్మునఁ బోయి మీరు నొరఁబంచిన నుక్కునఁ జొచ్చి యోధబృం
దమ్ములచేత గ్రమ్మగ్గఁడు గదా కురువీరులు సుట్టు [1]ముట్టినన్.

---

231. 1. మారునిట్లు – అ. ఉ. ఊ. శ. కొన్ని ప్రతులు. 2. ననూనన్ – అ. ఆ. ఏ. ట.

232. 1. కొన – కొన్ని ప్రతులు.

233. 1. దడవి – కొన్ని ప్రతులు. 2. నినిదియేమో నాకుం – అ. ఆ. ఈ. కొన్ని ప్రతులు

234. 1. చొరనంచును – డ. ణ. న. ప. శ్ర. ష. 2. వివేక, విచార – అని పాఠములు.

235. 1. మంబడన్ – కొన్ని ప్రతులు.

236. మ. హరిమేనల్లుఁడు గొంతికూర్మిమనుమం డస్మత్తనూజుండు సం
గరకేళీనిపుణుండు దివ్యశరశిక్షాశాలి యవ్వీరు నె
[1]వ్వరొకో నేలకుఁ దెచ్చి రొక్కరునిచే వాఁ డేల చిక్కుం బోరిం
బోరిఁ బెక్కం[2]డ్రురు విచ్చుచుం బొదువుచుం బోరాట [3]గగ్గెం జుమీ.

237. క. గురువులకు భక్తుఁ డుదారుఁడు
గరుణ గలఁడు శౌర్యధైర్యగాంభీర్యధురం
ధరుఁడు మొగమోడు [1]నాసుర
వరపౌత్రుఁడు లేమి కోర్వవచ్చునె చెపుఁడా,

238. క. అన్నగుమోమును నత్తెలి
గన్నులు నవ్వెడఁదయురముఁ గన్నారంగాఁ
గన్నను బ్రదుకుదుఁ గానక
యున్నను బ్రాణంబు లెట్టు లుండఁగ నేర్తున్.

239. సీ. హంసతూలికపాన్పునందుఁ [1]బొందెడుమేను కఠినంపునేలతోఁ [2]గదిసె నేఁడు
గొడుగులనీడ పై నడరఁ జెన్నగుమోము పోరిఁ బర్వు[3]పెందూళి గ్రుంగె నేఁడు
లలనలు లీలమైఁ గొలువ నుండెడుభోగి వఱుకులలో నున్నవాఁడు నేఁడు
నానాజనములకు నాథుఁ డై శోభిల్లు దొర యనాథత్వంబుఁ బొరసె నేఁడు.

ఆ. వినయరతుఁడు హృదయవిదుఁడు సుభద్ర[4]గా
రాబుపట్టి మగలరాజు మాన
ధనుఁడు దివిజరాజుమనుమఁడు నాచెలి
కాఁడు ముద్దులాఁడు లేఁడు నేఁడు.

---

236. 1. వ్వరకో - వ. శ. కొన్ని ప్రతులు. 2. డ్రును - కొన్ని ప్రతులు. 3. పుట్టెంజుమీ-వ.

237. 1. వే సురవర - జ. ఠ. ణ. స. $శ_1$.

239. 1. బండెడుమేను - స. సూ. $శ_1$; నుండెడు, నొందెడు - అని పాఠములు. 2. గలసె నేడు - కొన్ని ప్రతులు. 3. పెంధూళి - పెక్కు ప్రతులు; కెంధూళి - ఈ. త. ప. ల. హ. 4. గారాపు - శ. ష. పెక్కు ప్రతులు

240. ఉ. అక్కట మందభాగ్యునకు నట్టితనూభవరత్న [1]మెవ్విధిఁ
దక్కు విధాత నిర్దయుఁ డొడంబడునే కడుమేలివస్తువుల్
పెక్కుదినంబు లున్కి యరిబృందము [2]పిల్చినఁ బోటుబంట నై
యక్కడ కేల పోయితి మహాగుణభూషణుఁ గోలుపోయితిన్.

241. వ. అనుచుఁ జదికిలం బడి ఫల్గునుండు.

242. ఉ. హా యను ధర్మరాజతనయా యను నన్నెడఁబాయ నీకుఁ జ
న్నె యనుఁ దల్లి [1]నేఁపఁ జనునే యనుఁ గృష్ణుఁడు వీఁడె వచ్చె రా
వే యను నొంటి వోకఁ దగవే యను నేగతిఁ బోవువాఁడ నే
నోయభిమన్యుఁడా యనుఁ బ్రియోక్తుల నుత్తరఁ దేర్పవే యనున్.

243. వ. అని మఱియు ననేకప్రకారంబులం [1]బలవించి యుధిష్ఠిరు నాననం
బాలోకించి.

244. ఉ. పావని సేరి యుండఁడొకో పార్షతుఁ డచ్చట లేఁడె [1]యొండుమైఁ
బోవఁగఁ బంచితే ద్రుపదుఁ బోరికి సాత్యకి రాక తక్కెనే
భూవర మత్స్యనాథుఁ డెట వోయెనొ డెప్పర మైన నీకునుం
గావఁగ రాక [1]తక్కెనొ తెగంగత మేమి సుభద్రపట్టికిన్.

*-: అర్జునుఁడు ధర్మరాజు నభిమన్యుండు నచ్చినవిధంబు నడుగుట :-*

సం 7-50-45

245. క. పడుఁ గాక యేమి వగఱం
గడిమి [1]మెఱసి చంప నొంపఁ గనియెనె నృప నీ
కొడుకిట యట సూడక యె
క్కుడు [2]మగఁటిమి నురికి పేరు గొనియెనె పోరన్.

---

240. 1. మేటికిన్ - తి. 2. విచ్చిన - కొన్ని ప్రతులు.

242. 1. నొంప దగునే - అ. ఆ. ఇ. ఈ. పెక్కు ప్రతులు; నొంప దగవే - వ.

243. 1. బలవరించి - ద. న. వ.

244. 1. యుండెనె - ఇ. ఈ. ఔ. క. న.

245. 1. మెయింజంప - ల. 2. మదమున - జ. ద. వ; ముదమున - బ.

246. వ. అని పలికి నిట్టూర్పు నిగిడించి చింతించి.

247. చ. పలువురు సుట్టుముట్టుకొని బాణకృపాణముఖాస్త్రశస్త్రసం
క్షతుఁ [1]గడు నొంపగాఁ దనకుఁ దోడ్పడువారలు లేక నట్టి మదిం
దలఁపడ యత్తఱిన్ రిపువధంబున [2]కెయ్యము తండ్రి యేను గొం
దలమునఁ బొందకుండ నని తాఁ బలుమాఱును జీర కుండునే.

248. క. అక్కట తప్పఁ దలంచితి
నక్కొలఁదులవాఁడె కృష్ణునల్లుఁడు పోరన్
స్రుక్కునె బాహాగర్వము
దక్కునె నాకొడుకు మిన్ను [1]దలపైఁ బడినన్.

249. ఆ. [1]పిన్ననగవుతోడఁ జెన్నెసలారు సౌ
భద్రు మొగము సూడఁ బడయ కున్న
వాఁడ నామనంబు వ్రయ్యలై పోదిది
ఆతఁ జేసినది యొకో తలంప.

250. క. పలువురు క్రూరత బాలునిఁ
బలముకొని వధించునపుడు శౌరిని నన్నుం
దలఁప[1]రొకో మనము[2]ల వా
రలు దానికి [3]నేమి సీఁగరా దయ్యెడినో.

251. క. కటకట పేరినపెన్నె
త్తుట జొత్తిల్లి యున్న మేని[1]తోఁ గొడు కేచ

---

247. 1. దను నొంపగా-కొన్ని ప్రతులు; తగ నొంపగా - జ. ద. బ. వ. 2. జేయుము, కేయుము - అని పాఠములు.

248. 1. దనపై బడినన్ - కొన్ని ప్రతులు.

249. 1. చిన్నినగవు - డీ. ఎ. ఏ. జా. ఖ. శ.

250. 1. రకో - కొన్ని ప్రతులు. 2. నవారలు - కొన్ని ప్రతులు. 3. నేమి యెరుగ- బ. వ. స. $శ_1$; నేమనంగ రాదయ్యెడినో - ఓ. గ. ట. శ. ష.

251. 1. తోడం గొడు కెచ్చుట-అ. ఆ. ఖ. ల. వ. వీ. శ. ష; తో నాకొడు కెచ్చుట-ఓ. ఛ.

క్కటిఁ బడి యున్నాఁడో [2]యి
చ్చోటు సూపెడువారు లేరె చూచెద వానిన్.

252. సీ. [1]పడియుండి వాఁ డిలఁ బొడిచినచందురు క్రియఁ [2]దత్తలము
వెలిఁగింప కున్నె
యే మని నాతోడఁ బ్రేముడించునొకో సుభద్ర[3]పుత్రునిఁ జూడఁ
బడయ [4]కున్కిఁ
బగతుర నిర్జించి మొగముపోటుల నొచ్చి పొడసూప రాఁడయ్యెఁ
గొడుకు నాకు
నడ[5]లునఁ దల్లడపడియెడు ద్రౌపది వంత [6]మాన్పింప నెవ్వరికి వశమె

తే. యని యలంతమైఁ బలుమాట లాడుచుండి
తలఁచి మఱియును ధర్మనందనునియాన
నంబు వీక్షించి నిర్జరనాథతనయుఁ
డెలుఁగు గుత్తుకఁ దగులంగ నిట్లు లనియె.

253. వ. సంశప్తకసమితితోడ దమ[1]కించి పోరి పోరి కౌరవసైనికుల సింహనాదంబుల
వింటి నప్పు డెలుంగెత్తి యుయుత్సుం డాడినమాటలు నాకర్ణించితి.

254. సీ. పెనఁగంగఁ జాలరు బీభత్సుతో మీరు బాలుని [1]నొక్కరుఁ బలువు రిట్లు
సంపితి రిది మీకు సంతోషకాలమే యెదురుగా కార్యనేల చెపుఁడ
హరికి నర్జునునకు నప్రియం బొనరించి బ్రతుకంగ వచ్చునే భవున కైన
నది యట్టు లుండె నీయధికపాపముఫలం బెట్లును [2]జెలుపక యేల తక్కు

2. యచ్చటు సూపెడు...చని యే జూతున్ – ఎ.

252. 1. పడు గాక వా డిల – ఊ. ఎ. ఏ. జ. బ. వ; పడియున్న వా డిల–అ. ఈ. ఐ. క. ర. హ. 2. రణస్థలి – న. 3. పుత్రకు – కొన్ని ప్రతులు. 4. కున్న, కుండి – కొన్ని ప్రతులు. 5. లంది, లొంది – అని పాఠములు. 6. వారింప – హ; మానింప – అ. ఆ; మాన్పంగ – ద. న. ప. వ.

253. 1. కింపుచు బోరునప్పుడు పొరింబొరి కౌరవ – వ.

254. 1. నొక్కని – కొన్ని ప్రతులు. 2. కుడువక – ఊ. ఏ. చ. వ.

ఆ. ననియె నవ్విధమున [3]నరిసేనయోధుల
నతఁడు వలుక వీనులార వినియుఁ
దెలియ నైతి వాసుదేవుండు విని[4]యెన
యని తలంచి దాని నంత [5]గొనక.

255. క. మనుజాధిప [1]తగుసమయం
బున నీ వెఱఁగింపఁ గన్నఁ బోరి వుచ్చనె వే
[2]చనుదెంచి నీసుతుం బొది
విని[3]యెడఁ దత్క్రూరయోధవీరుల నెల్లన్.

256. క. అని పలికి మఱియుఁ గొడుకుం
బనవుచు శోకమున మునుఁగుఫల్గునునిఁ దగం
దనకరములఁ బొదువుచు ని
ట్లను హరి చిత్తంబులోన [1]నడ లూనంగన్.

257. చ. ఇటు దగునయ్య శూరులకు నెల్లను బోకడ [1]యిట్ల కాదె యే
మిటికి నలందురక్ మొనలు మేకొని యాయుధజీవనంబు నూఁ
దుటయు నెఱుంగవే రిపులఁ ద్రుంచి యశం బిల నించి పుత్త్రుఁ డె
క్కటి దివి చూఱకోల్ ప్రియము గా కిది యప్రియమే తలంపఁగన్.

258. ఆ. ఎఱుగవలయు దాని నెఱిఁగి కోవిదుఁ [1]డగు
నట్టినీకు వగవ నగునె పార్థ
నీదువంత సూచి నీవార[2]లందఱు
దీను లైరి వీరిఁ దేర్పవలదె.

---

3. నద్దెస - ల. 4. యెనే యని తలంచి - స. శ$_{1}$; యెనా యని తలంచి-వీ.
5. గొనన - ఇ. ఉ. క. ఖ. డ. ఘాకూ. వ. స. శ$_{1}$. హ.

255. 1. తెగు సమయంబున - బ. 2. తనయుని కపటంబున బొదివిన - ఊ. ఎ. ఏ; తనయుని బేరుక్కున బొదివిన - ద. 3. యధమ క్రూరయోధ - ల. పెక్కు ప్రతులు.

256. 1. నడలు కొనంగన్ - ద.

257. 1. యట్లకాదె - కొన్ని ప్రతులు.

258. 1. డన దగుదు వట్టినీకు దగునె పార్థ - ద. ప. వ. 2. లెల్లను - పెక్కు ప్రతులు.

259\. వ. వీరలం జూచి తగుమాట లాడు మనిన నత్యంతశోకా[1]క్రాంత స్వాంతుం డగుచు సుభద్రాకాంతుండు గద్గదకంఠంబుతోడం దోడంబుట్టువుల కి ట్లనియె.

260\. చ. మనసిజమూర్తి యైనయభిమన్యునిమాటలు వీనులార నే
విన వలతుం దదీయస్మృతి వేడ్క నొనర్చి వారు గ్రక్కునం
[1]జని తగ వానిం గాంచి సుఖసంగతిమైం జరియించునట్లుగా
ననిచెద నేఁటిపోరు దెలియం గలభంగి[2]యు మీరు సెప్పుఁడా.

261\. వ. అని మఱియును.

262\. చ. అలవుఁ జలంబు [1]శౌర్యమును నస్త్రమహత్త్వముఁ గల్గునిందఱుం
గలుగఁగ నెట్లు సచ్చు [2]బలఘస్మరుచే నయినం బ్రచండదో
ర్బలవిభవాభిరాముఁడు సుభద్రసుతుం డిది యెన్నిభంగులం
దలఁచినఁ బోల దేమిటికితంబున వా[3]ఘనుఁ డిట్టు లయ్యెనో.

263\. క. మిమ్మును బాంచాలురఁ గడు
నమ్మి చెడితి వాని రక్షణమ్మునఁ బ్రౌఢ
త్వ మ్మిట్లు లేమి యెఱిఁగిన
నెమ్మెయిఁ గాచికొన నేరనే యశ్వాలున్.

264\. క. రథవితతి వఱపి మీ రవి
తథముగఁ [1]గవియంగ మిమ్ముఁ దాఁకి కలఁచి యే
రథికులు సమయిం[2]చిరి యరి
మథనభుజావిభవు నక్కుమారోత్తమునిన్.

265\. వ. అని యంతకంత కగ్గలించుచు నుమ్మలికంబునం గలంగి యంత నిలువక.

---

259\. 1. క్రాంతుం డగుచు - కొన్ని ప్రతులు.

260\. 1. జన గలవారు - ద. వ. 2. యెఱుంగ సెప్పుడా - వ. పీ. శ. ష. కొన్నిప్రతులు.

262\. 1. కార్యమును-ద. వ. 2. పురఘస్మరుచే - ద. ప. వ. 3. ఘను డిట్టు లయ్యెనో - ఘ. ఝ. డ; మన మిట్టు లయ్యెనో - వా. కొన్ని ప్రతులు.

264\. 1. నేయంగ - అ. ఆ. ఇ. ఈ. పెక్కు ప్రతులు. 2. చెద రరిమధన-వ. శ. ష. హ. పెక్కు ప్రతులు

266. క. ఉక్కును నస్త్రబలము మీ
కెక్కుడియది సాల రైతి రిందఱు నని న
య్యొక్క[1]రుఁ గావఁగ [2]మీరి
తక్కువ కోర్చితిరి మిమ్ముఁ [3]దక్కన నేలా.

267. క. బలహీనులు సంగరభీ
తులు నగుమి మ్మెఱిఁగి యెఱిఁగి తొలఁగి తనూజుం
దలఁపక యొంటి మెలఁగు వెం
గలి నగునను దూఱుకొందుఁ గా కేమందున్.

268. తే. మానుషులువోలె నున్నార లేను లేని
తఱి మహాగుణశాలి నాతనయుఁ గాచి
[1]కొనఁ గడంగర సింగారమునకుఁ గాక
మఱువులును గైదువులు మీకు [2]మానమునకె.

269. వ. అని [1]భంగించి యూర్పులు సందడింప మొగంబు బిగువారం గ్రోధశోకం
బులు మనంబునఁ [2]బెనంగొనం [3]గన్నీ రొలుక నూరకున్న నెల్లవారు నతనికి
మాఱుపలుకను దేఱిచూడను వెఱచి యుండి రప్పు డచ్యుతుం డొక్క
[4]రుండు ననునయాలాపంబులం దేర్చుచుండం బాండవాగ్రజుండు గుపితా
ఖండలనిభుం డగు నాసవ్యసాచితో [5]సాంత్వనస్వరంబున ని ట్లనియె.

-: ధర్మరా జర్జునుని కభిమన్యుండు సచ్చినవిధంబు సెప్పుట :-

సం. 7-51-1

270. సీ. అనఘ సంశప్తకాహ్వానంబునకు నీవు సనిన నొద్దన మేర్చికొని గడంగి
నడచి ద్రోణునిఁ దలఁపడితి మవ్వీరు మోహర మేము సొరఁజాల మైతి మనఁగ

---

266. 1. నిగావగ - కొన్ని ప్రతులు. 2. లేరి - కొన్ని ప్రతులు. 3. దప్పననేలా, దడవగనేలా - అని పాఠములు.

268. 1. కొనఁగజాలర - వ. పీ. శ. ప. కొన్ని ప్రతులు. 2. మానుషములె - గ.

269. 1. పలికి - ఈ. 2. ముప్పిరిగొన - గ. వ. స. 3. గన్నీరు దొరుగ - పెక్కు ప్రతులు. 4. రుండ యనునయా - పీ. శ. ప. కొన్ని ప్రతులు. 5. శాంతస్వరంబున - కొన్ని ప్రతులు.

నేల దద్భాణార్పు లేర్చిన నక్కడఁ దేఱిచూడను [1]లేక త్రిప్పికొంటి
మమ్మొన భేదింప నభిమన్యుఁ డోపుఁ బో మ్మనియెడు [2]తలఁపు నా
కపుడు పుట్టి

ఆ. వానిఁ [3]బిలచి నీవు వాకిలిఁ బుచ్చు మం
దఱము మొగ్గరంబు దఱియఁ జొచ్చె
దము వడిని భవత్ప్రథంబున ననుఁడు నం
భోధి సొచ్చు[4]కరటిపోల్కిఁ జొచ్చి.

271. క. నీయుపదేశము దనచే
దోయి[1]బలుఁవుఁ దోఁడు గాఁగ ద్రోణుఁ గడచి వే
పోయి [2]మొనఁ జొచ్చి సైన్యము
పాయవడఁగఁ గలఁగఁ జెదరఁ [3]బఱవఁగఁ జేసెన్.

272. క. కని కుంభజముఖ్యులు వా
నిన పొదువఁగ నేముఁ జొచ్చి నిరతిశయరయం
బున వానికిఁ దోడ్పడుటకు
జనఁ జనఁ జన మా [1]కడ్డపడియె సైంధవుఁడు వడిన్.

273. వ. అతండు రుద్ర[1]వరానుభావంబునం జేసి యతుద్రబలుం డగుట నే మతని
మిగులం జాలక చిక్కితి మాసౌభద్రుం జుట్టుముట్టి గురుకర్ణకృతవర్మకృప
గురుపుత్రాదియోధవీరులు పెక్కండ్రు సిక్కువఱుపం జేవ సెడక వాఁడు
[2]బలంబు మెఱయఁ జలంబు నెఱయ నారాధేయప్రముఖులం బఱపియు

---

270. 1. రాక - అ. ఆ. ఇ. ఈ. ర. ల. కొన్ని ప్రతులు. 2. బుద్ధి నాకు - వ. వీ. శ. ష. న. 3. జూచి - కొన్ని ప్రతులు. 4. గరుడి (డు) పోల్కి, తార్క్ష్య పోల్కి - అని పాఠములు.

271. 1. బలువు - కొన్ని ప్రతులు. 2. సనజొచ్చె - భాకూ. పెక్కు ప్రతులు. 3. బర పెన్ పెలుచన్ - ల.

272. 1. కడ్డ మయ్యె - ప. వ.

273. 1. వరప్రసాదంబున - ఇ; వరమహామభావంబునం జేసి - ల. 2. చలంబు బలంబు - కొన్ని ప్రతులు.

బృహద్బలలక్ష్మణప్రభృతు లగురాజుల రాజకుమారులం బలువురం జంపియు సొంపారం బదంపడి పదాతియు గదాపాణియు నై రథాంగపాణియల్లుండు దూగాడుచుం బోరాడు నెడ దుశ్శాసనతనయుండు దాఁకి వానిచే విరథుం డై తానును గద గొని పెలుచం దలఁపడియె నత్తెఱంగున నై నగదారణంబున వారిరువురుం బరస్పరనిహతు లై పడి రివ్విధంబున నక్కుమారుండు దనతండ్రులకును మామలకును రూఢియగు రణక్రీడం గీర్తిపరిస్ఫూర్తియు తనకు నాకలోకసుఖంబునుం జేకొనియె నని చెప్పుటయు.

274. క. తెల్లముగ సుతుపడుట విని
[1]జల్లని డెందంబు సెదర సంధులు ప్రిదులం
దల్లడ మగ్గల మై మూ
ర్ఛిల్లె నరుఁడు బంధు లెల్లఁ జేష్టలు దక్కన్.

275. వ. ఇట్లు పరవశుం డైనఁ గృష్ణయుధిష్ఠిరులు గరతలంబుల నెత్తి నొక్కింతసేపునకు సేదదేటి సైంధవుం దలంచి యతండు.

276. ఆ. అవుడు గఱచి యెఱ్ఱనగునాననంబుతో
బొమలు ముడిచి చెమట పొడమ మేను
కంప మొందఁ గనలు గదిరినకటికి న
వ్వెసక మెసఁగ నన్న కి ట్టు లనియె.

277. మ. వినుఁడీ నాదుప్రతిజ్ఞ నీవు నిఖిలోర్వీనాథులుఁ సింధురా
జు నవశ్యంబును నెల్లి [1]సంపుదు ధయస్థుం డై నినుం జొచ్చినఁ
వనజాతుఁ శరణంబు వేఁడినను గర్వం బేది నన్నుం దగం
గనినం బోరు [2]దొలంగి పోయిన నెఱుంగం గాని సత్యవ్రతా.

278. క. కాలధ్వంసకు నాదు
శ్శీలుం గాచుటకు నన్నుఁ జెనకిన నస్త్ర

---

3. డుచున్నెడ - ఖ. చ. వ. 4 నిపాతితు లై - ఇ.

274. 1. ఝల్లని - పెక్కు ప్రతులు

277. 1. సంపెద - కొన్ని ప్రతులు 2 దొలంగి - అ. ఉ. ఔ. ఝ. ట. ణ. త. ల. శ. ష.

జ్వాలలఁ గౌరవయోధులఁ
దూలించుచు వానిఁ [1]గవియుదుం జటులగతిన్.

279. ఆ. ఇట్లు సేయ నైతినేని గురుద్రోహి
గతికి బ్రహ్మఘాతిగతికి మద్య
పానరతునిగతికి మానార్హజనవరి
వాదిగతికిఁ బోవువాఁడ నధిప.

280. వ. మఱియు నొక్కప్రతిన యవధరింపుము.

281. చ. అనిమిషదైత్యకింపురుషు లాదిగ నెవ్వరు వచ్చికాచినం
దునుముదు నెల్లి సైంధవునిఁ దోయజమిత్రుఁడు గ్రుంక కుండుము
[1]న్న నరవరేణ్య యిత్తెఱఁగు నా కొనరింపఁగ రాక [2]యున్న నే
ననలము సొచ్చువాఁడ నృపులందఱుఁ జూడఁగ గాండివంబుతోన్.

282. వ. [1]అని పెలుచం బలికి యప్పరమశికోదండంబు దెప్పించి సజ్యంబు గావించి గుణధ్వని నిగుడం జేయుటయుఁ బద్మనాభుండు పాంచజన్యంబు పూరించె దేవేంద్రపుత్రుండు దేవదత్తం బొత్తె నన్నాదంబులును దత్సైనికసింహానాదంబులును దూర్యనినదంబులును నింగి [3]వొంగం జెలంగె నగ్గాండీవంబును [4]నృత్తంబు సేసిన[5]చందంబు నొందె నస్త్రంబు గవదొనలు వెలువడి వెలింగె నయ్యవసరంబునం [6]గొండొక దెలివొంది పవననందనుం డప్పురందరనందనువదనంబు వీక్షించి.

---

278. 1. చెరుపుదు – ర; గదియుదు – పెక్కు ప్రతులు.

281. 1. న్ననఘవరేణ్య – న. ప. బ. య. వ. హ; న్ననఘ చరిత్ర – వ. 2. తక్కనేననలము – ఔ. క.

282. 1. 281 వ. పద్యము తరువాత 'త' ప్రతిలో అధర్వణాచార్యుల దని యీ క్రింది పద్య మధికముగా కలదు

ఉ. వారిజనాభ యెల్లి......నువాసవు డడ్డము వచ్చి కాచినన్
వారిజబాంధవుం డపరవారిధి గ్రుంకకమున్నె సైంధవుం
జేరి శిరంబు ద్రుంతు అటు శాయని నాదిది గాండివంబె నా
పేరు కిరీటియేనినదభీషణ శంఖము దేవదత్తమే.

2. సాధనంబు – ఆ. 3. ముట్టంజెలంగె – ఇ. న. 4. నృత్యంబు – ల. పెక్కు ప్రతులు. 5. చందంబున నుండె – ద. ప. బ. శ. ష. 6. గొండొకసేపునకు దెలివొంది – ర. హ.

283. క. అతితీవ్రమైననీదగు
ప్రతిన [1]కుపోద్బలము గాఁగఁ బరగినధీరో
ద్ధతి పాంచజన్యరవమున
ధృతి [2]తూలకయున్నె కురుపతికి నింద్రసుతా.

284. వ. అని యగ్గించె నాసమయంబునం గోపంబు పెంపునను బూనికిపై భరంబునను భీమసేనుని సల్లాపసౌహార్దంబునను దనడెందంబు శోకంబు డిందువడ నందఱుఁ గలయం గనుంగొను విజయుని వందిమాగధసందోహంబులు సంస్తుతించె నట్టియెడ నిక్కడ.

285. క. జననాథ పాంచజన్య
ధ్వనిఁ గూడి చెలంగు దేవదత్తరవంబుల్
విని భీతిసంభ్రమంబుల
మనసైన్యము లెల్ల ఘూర్ణమానము లయ్యెన్.

286. క. అప్పుడు [1]వేగులవారలు
సెప్పిన నంతయు నెఱింగి సింధువిభుఁడు దగ
[2]గప్పెడు నెవ్వగ[3]పెల్లున
నిప్పులఁ బడినట్లు గాలు నిలువఁగ లేమిన్.

*-: అర్జునుని ప్రతిజ్ఞ విని సైంధవుఁడు భయంపడి దుర్యోధనునితోఁ జెప్పుకొనుట :-*

**సం. 7-52-1**

287. క. చని యాప్తులైన బలవ
న్మనుజేంద్రులు గొలువ నున్న మానవనాథుం
[1]గని యిట్లను [2]సిగ్గు [3]గడచి
తనయుల్లముఁ గలఁచి వెఱపు దల్లడపెట్టన్.

---

283. 1. కుబ్రోద్బలము కాగ – అ. ఐ. ఓ. గ. చ. 2. మూలక – ణ. వ.

286. 1. వేగుల వారలు – ఊ. ద. వ. వీ; వేగపు చారులు – న. బ. శ. ష; వేగపుఁ జారులు – వా. కొన్ని ప్రతులు 2. గప్పిన – కొన్ని ప్రతులు. 3. పెంపున – ఊ. ఏ.

287. 1. గనుగొని యిట్లను సిగ్గరి తన–ఓ. 2. యెరుక గడచి – ఈ. స. శ1. 3. విడిచి, వదలి – అని పాఠములు.

288. ఉ. ఏ నొకరుండనే తనకు నెగ్గొనరిం[1]చితి నేల నాపయిం
బూనినవాఁడు ఫల్గునుఁడు పోర వధింపఁగ నెట్టిపాడి మీ
కీనెఱిసంతసంబు వగ పేటికి నా కెట యేని పోయెదన్
వానిప్రతిజ్ఞ కడ్డపడువారె సురాసురసిద్ధసాధ్యులున్.

289. వ. అనుచుం గొలువు గలయం గనుంగొని.

290. ఆ. ద్రోణకర్ణశల్యదుర్యోధనులుఁ గృప
బాహ్లికులును జముఁడు వట్టికొన్న
వానినైనఁ గావ వలతురు [1]వలచిన
నొల్లకున్న నెట్టులొకొ యెఱుంగ.

291. వ. అని వెండియు.

292. క. పెదవులు దడుపుచుఁ గాళ్లన్
గుదివడ వడఁకుచు మనంబు గొందలపడఁగా
నిది యేటిమాట లాడెదఁ
మదిఁ బార్థుఁడు [1]గానకుండఁ [2]దొలఁగన వలయున్.

293. వ. మీయందఱచేత ననుజ్ఞాతుండన కదా పోయి వచ్చెద ననవుడు
నిజకార్య[1]ధురంధరుం డగునక్కురుధరణీవరుం డతని కిట్లనియె.

294. మ. మును నీ వెన్నితి విక్రమాఢ్యు లని మమ్ముం గొందఱన్ ద్రోణిపెం
పును హార్దిక్యుబలంబు సౌబలునియేపుం జేవయున్ సోమద
త్తుని[1]ధైర్యంబును [2]శౌర్యమున్ శలుమహోదోర్దర్పముం గూడ నె
న్నిన నీ కెట్లగుఁ జూడు మిట్టిమగలు న్వేయేల ని న్నిత్తురే.

---

288. 1. చినవాడ – ఉ. జ. ర. వ.

290. 1. వలసిన – కొన్ని ప్రతులు.

292. 1. చంపకుండ – గ. జ. బ. వ. 2. దొలగగ వలయున్ – కొన్ని ప్రతులు.

293. 1. భారపరుం డగు – మ. య. ల. పీ. శ. ష.

294. 1. శౌర్యంబును శల్య కర్ణుల మహో – ల. 2. దుస్ససేనుని మహో – ద. ప. పీ. 3. లున్నే
నుండ – ఐ. ఓ. ల. స; లున్వేయేల నిన్నిత్తునే – ష; లన్వేవేల నే నిత్తునే – శ.

295. క. నమ్ముము వెఱవకు మేనును
దమ్ములునుం గోట నీకుఁ దాత్పర్యముమై
నిమ్మేటిమగలు నూఱెల
నెమ్మి నిలువ నింద్రుఁ డైన నీ కెదు రగున్.

296. వ. అని చుట్టు నున్న రాజులం జూపిన నూఱడిల్లి యంత నిలువక నీకొడుకుం దోడ్కొని ద్రోణునికడకుం జని జయద్రథుండు దనకు నర్జునునకు ధనుర్విద్యా విభవంబునందలివాసి యెట్టి దని యడిగిన నతఁడు నీకు నతనికి [1]నాచార్య కంబు సమప్రకారంబ యవ్వీరుండు వివిధ[2]క్రమంబులయలజడి కోర్చి యలఘుప్రయోగంబులు పెక్కులు సాధించుటం జేసి నీకంటె నధికుం డై యుండు నది యట్లుండె నేను గలుగ నీ నాసవ్యసాచికి వెఱవ వలదు మద్బాణంబులమఱువున నున్న నిన్ను దేవతల కైనను దేఱి చూడ వచ్చునే విచ్చునకుం బ్రవేశింపరాని బంధురవ్యూహంబు వన్నించెదఁ గులధర్మంబు శిథిలంబు గాకుండ సమరంబు సేయు మని చెప్పి వెండియు.

297. క. శ్రుతు లభ్యసించి [1]తతుల
క్రతువులు సేసితి కులంబు రక్షించితి నీ
పితరులక్రియ మృత్యుభయా
న్వితుఁడవు గాఁ దగునె మేదినీవర యింకన్

298. క. యాదవకౌరవపాండవు
లాదిగఁ గల యఖిలనృపులు నవ్యయవృత్తిన్
మేదిని నిలుతురె క్రమమునఁ
బోదురుగా కెల్లజనులుఁ బోవు[1]తెరువునన్.

299. క. తపములు దానంబులుఁ జే
సి పడయులోకంబు లెల్లఁ [1]జేయలఁతులు భూ

---

296. 1. నాచార్యకత్వంబు — కొన్ని ప్రతులు. 2. ప్రకారంబుల — ద. ప. వీ; క్రమంబుల — హ; విక్రమంబుల — ఊ. ఞ. ల.

297. 1. తమల క్రతువులు — వ.

298. 1. తెరగునన్ — వ.

299. 1. జేవలతులు — భాకూ. వ.

మిపులకు సంగరవిద్యా
నిపుణతఁ [2]దలఁ కుడిగి పోర [3]నేర్చినఁ జాలున్.

300. క. అని యూఁటడిల్లఁ బలికిన
వివి యతఁడు గలంకు దేఱి విభుఁడుం దానుం
జని సంగ్రామోత్సాహం
బునఁ బొదలిరి తూర్య[1]ఘోషములు దివి ముట్టన్.

301. వ. సర్వసైన్యంబులును దైన్యంబు వాసి కయ్యంబుకడంక నుల్లసిల్ల సైనికోత్తముల సింహనాదంబులు నెలంగె నిత్తెరంగున భవత్తనయు శిబిరంబు సముద్యమసుముఖం బయ్యె నంత నక్కడఁ బాండవాగ్రజుండు పాంచాల మాత్స్యపాండ్యయాదవకేకయాదిరాజలోకంబు శోకంబు దగుమాటల [1]మలుఁగం జేసి విడిదలకుం జన నియమించి యనుజుల నచ్యుతునిం బెట్టికొని యున్న యెడ నగ్గోవిందుండు గాండీవి కిట్లనియె.

302. క. నాతోఁ దలపోయక [1]రో
షాతురతం బ్రతిన వట్టి తపనీనాథ
వ్రాతంబు వినఁగ నిట్టులు
చేతోఁకున డెప్పరంబు నేసితి కంటే.

303. క. అస్తమయమునకు మును రిపు
మస్తకముం దునుమవలయు మన కిది సాలన్
దుస్తర[1]ము నగు దురస్త
వ్యస్తం బగు [2]నేని నాకు వగపు గదిరెడున్,

---

2. తల కడచి – ఓ. జ. ట. బ. హ. 3. నిల్చిన జాలున్ – ఝ. డ. స. శ$_1$; నేర్చిన – పెక్కు ప్రతులు; నేనియు – వా.

300. 1. నినదములు – పెక్కు ప్రతులు.

301. 1. మరువంజేసి, మరలంజేసి – అని పాఠములు.

302. 1. శోకాతుర – ద. ప. వ.

303. 1. మునగు దురస్తవ్యస్త – అ. ఆ. ఙ. ఖ. వ. శ; మగు దురస్తవ్యస్తం బగునేని – ఇ. ఏ. భాకూ; మునునగునస్త – వా. 2. ననుచు, ననియు – అని పాఠములు.

304. వ. మనవేగులవారు వచ్చిరి వారు సెప్పినతెఱంగు వినుము నీవు ప్రతిజ్ఞ సేసి నప్పుడు మ్రోసిన చిందంబుల [1]పెల్లునఁ బెదరి యప్పీటివారు కొడుకు చావునకుం గవ్వడి కోపించి యిప్పుడ యెత్తివచ్చు నని రథకరితురంగంబుల నాయితంబు సేయుచుండ సైంధవుఁడు దనచారులచేత నీయాడినమాటలు విని వెఱచఱచి కురురాజు కొలు వున్నచోటికిం జని సిగ్గఱి నగ్గించి నీప్రతిన యెఱింగించి యతం డలిగిన మీరు గావలె రని పలికి తా నెంచేనియుం బోయెద ననిన నమ్మనుజపతి గరుకృతవర్మకృపకర్ణశల్యాశ్వత్థామప్రభృతు లగుమేటిమగలం జేర్కొని వీరు నేనును నాతమ్ములును గలుగ నరునకు నిన్ను జుట్టన వ్రేలనుం జూప వచ్చునే యని భయంబు వాపె భారద్వా జుండును మహోత్సాహుం డై దురవగాహవ్యూహవిధానంబున జయద్రథుం జేరకుండ నిన్ను నిలువరించువాఁ డయ్యె నది యట్టిద వా రొక్కొక్క రుండ గెలువరానియట్టి జెట్టిజోదు లందఱు నొక్కపనికిం దలకొని నిలిచిన గెలుచుట యశక్యంబు గాదె యిక్కార్యం బార్యు లగునాప్తజనంబులం గూర్చికొని విచారింపవలయు ననవుడు వివ్వచ్చుండు నవ్వుచు ని ట్లనియె.

-: అర్జునుఁడు కృష్ణునితోఁ దనప్రతిజ్ఞావిషయంబు లైనవాక్యంబులు సెప్పుట :-

సం. 7_53_31

305. క. వారి నెఱుంగుదు నేనును
వారలు న న్నెఱుఁగుదురు భవత్సాహాయ్య
స్ఫార[1]బలోద్ధతి గలుగఁగ
వారే తప్పింపఁ జాలువా రిపుఁ గ్రీడిన్.

306. వ. ఏను జయద్రథుం జంపుటకుం దమకించి తఱుము నప్పుడు నాకు నెవ్వ రడ్డంబు సొచ్చి రేనియు.

307. మ. పటునారాచపరంప[1]రాప్రసరదర్పం బేర్పడం బేర్చి త
ద్భటసంఘంబును ఘోటకవ్రజము శుంభత్స్యందనౌఘంబు ను

304. 1. వలన బెదిరి – వ.

305. 1. బలోదధి – ఛాకూ. వ.

307. 1. రాస్త్ర శరదర్పం – ఏ; రా ప్రష్ఠాతిదర్ప – ఖ. చ. వ. శ. ష; రా ప్రచుర, రాప్ర చయ, రావిసర, రాప్రకట – అని పాఠములు.

ద్ఘటకుంభిప్రకరంబునుం బొదివి [2]విధ్వంస్తంబు గావించి నె
త్తుట జొత్తిల్లెడునట్లు సేయుదు సమిద్భూభాగ మత్యుగ్రతన్.

308. క. కౌరవసైన్యంబులఁ గల
వీరులయస్త్రములు నాదువివిధాస్త్రగతి
క్రూరప్రవాహముల కెదు
రే రాజీవాక్ష యాదరింపకు వారిన్.

309. క. [1]వెఱఁగుపడి [2]కుంభభవుఁడుం
బెఱరథికులుఁ జూచుచుండ భీరము లాహా
మెఱయఁ జలము నెఱయఁగఁ దల
దఱిఁగెద సైంధవుని నేల తలఁకెదు [3]కృష్ణా.

310. క. కురుపతి[1]బలముల యేలా
చరాచరము లైనభూతజాలము లెల్లం
దరతరమ యడ్డపడినం
దెరలిచి పడవైతు సింధుదేశాధీశున్.

311. ఆ. గురుని[1]యలవుఁ జలము వెరవును [2]గలఁచి నీ
యాన గాండివంబు నాన దివ్య
శరము లాన యెల్లి సైంధవుతల యెల్లి
ఖంగిఁ [3]దునిమి వైతుఁ బగలు దలఁక.

312. చ. కనియెదు సైంధవుం గడచి క్రందుగ నాకు నెదుర్చురాజులం
దునుమఁగ భూషణోత్కరముతోఁ బదహస్త[1]శిరంబు లుర్విపైఁ

---

2. విద్వస్తంబు - ప. అ.

309. 1. వెఱఁ ఁది కుంభ - ఈ. ఊ. మ. వ. హ. 2. ధార్తరాష్ట్రులు - అ. ఆ. గ. జ. ట. బ. [illegible] కుంభజుండును - [illegible]. 3. చెపుమా - ద. వ.

310. 1. బ[illegible] లేటికి - ఘ. జ. డ. వ.

311. 1. భరప[illegible]లావువెరవు - గ. వ. యలుక - ట. వ. 2. చెరచి - ఊ. 3. దృంచి వైతు - కొన్ని ప్రతులు.

312. 1. తలంబు లుర్విపై - శర.

వెనఁగొని చారుభంగియును భీషణరేఖయుఁ దాల్చి నెత్తురుల్
నెనడును గ్రోలి భూతములు నిక్కుచు నీల్గుచుఁ జొక్కుచుండఁగన్.

313\. క. అవ్వలి[1]సైనికు లడలఁగ
నవ్వుచు మనవార లార్వ నారాయణ న
న్నెవ్వరు మార్కొన లేమికి
నొవ్వం గురురాజు నేఁ దునుముదును [2]ద్రోహిన్.

314\. తే. సాధనము గాండివం బదె సమరకర్త
యర్జునుం డదె సారథి యబ్జనాభుఁ
డదె మరల్పఁగ వచ్చునే యీరథంబు
హరునకైనను నెఱుఁగక యంటిగాక.

315\. క. పూనఁగ రాదే నాకె
ద్దానిం బూనినను నీవు దలకొని తీర్పం
గా నునికి గలుగ నే నీ
చే నుండఁగ నిట్టు లేల చెప్పెదు [1]చెపుమా.

316\. క. ఈ ప్రతిన యెట్టితెఱఁగున
నప్రతిహతవృత్తి నెగడునట్టితెఱఁగు లో
కప్రభువ నీవ [1]చేయ న
తిప్రకటపరాక్రమదీప్తుఁడ నగుదున్.

317\. క. [1]మమ్మర నరయుభరమున నీ
విమ్మెయిఁ దలపోసి తింక నిచ్చట నేలా
నెమ్మది నిద్రింపంగాఁ
బొమ్ము ప్రభాతమున రథముఁ బూన్పఁగ వలయున్.

---

313\. 1. సేనలు దలకగ - వ. 2. ద్రోహున్ - ర. వ. శ. ష. కొన్ని ప్రతులు.

315\. 1. కృష్ణా - ట. న. వ.

316\. 1. చేయు మతిప్రకట - శ. శర. ష.

317\. 1. మమ్మరయు భారమున నీ - కొన్ని ప్రతులు; మమ్మరయు భరము నీ దనియి
మ్మెయి - వ.

318. వ. అని యివ్విధంబున సల్లాపంబులు సేయుచు నరనారాయణు లత్యంతకుపితాంతఃకరణు లగుచుఁ బాములు రోఁజుపోల్కి నిట్టూర్పులు నిగిడించుచున్న నప్పుడు పురందరాదిబృందారకులు భయంబు గొని దీన నేమి [1]పుట్టునో యని చింతాక్రాంతు లైరి వారిధులు సంక్షోభించె సరిత్ప్రవాహంబులు ప్రతిగమనవ్యాకులంబు లయ్యెఁ గాననశైలసహితంబుగా మహి సంచలించె మఱియు మాతంగతురంగనరనికరంబులనాళంబులు దెలుపునుత్పాతంబు లనేకంబులు దోఁచె విశేషించి కౌరవస్కంధావారంబున దారుణవాయువులు విషమగతులం జరించుటయు [2]నుల్కానిర్ఘాతంబులు నలుగడలం బడుటయుఁ గరిహరినికరంబులు బహుళంబు లగు బాష్పజలంబులు విడుచుటయు మొదలుగాఁ బెక్కుదుర్నిమిత్తంబులు పుట్టినం బోటుమగ లగు భూపతులు లోనుగా నెల్లజనంబులుం బుల్లవడి యుండి రనవుడు సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

319. తే. అట్లు దమలోనఁ దగుమాట లాడి యాడి
కోపరసవేగమునఁ గుంది కుంది వగలఁ
బొంది పొంది పురందరనందనుండు
నచ్యుతుండు నారాత్రి యె ట్లైరి చెపుమ.

-: శ్రీకృష్ణుండు పుత్రశోకాతుర యైనసుభద్ర నూఱడించుట :-

సం. 7-54-11

320. వ. అని యడిగిన నాసూతసూనుం డంబికాసూనున కి ట్లను నమ్మురారిచిత్తం బారాధించి యర్జునుం డట మున్న యొక్కనాఁడు శిబిరంబునకు సుభద్రయుం బాంచాలియు నుత్తరయును వచ్చి యచ్చటన యునికిం జేసి యచ్చెలువల శోకానలంబు [1]లుడుగునట్టిమాట లాడ నతనిం బ్రార్థించి పంచిన.

---

318. 1. పుట్టెడినో యని - కొన్ని ప్రతులు. 2. నుల్కానిర్ఘాతంబు - ఉ. ఘు. ట. త. మ. య. ర. ల. శ. ష. హ; శుష్కనిర్ఘాతంబు - వా. కొన్ని ప్రతులు.

320. 1. మల(లు)గు - మ. య. ర. ల. వ. స. శ1. కొన్ని ప్రతులు.

321. తే. అమ్ముకుందుండు గ్రొత్త యై యడలు దనదు
డెంద మలఁపంగఁ [1]జెలియలిమందిరమున
కరిగి పురపుఁ బొక్కెడునాసుభద్రఁ
గాంచి యిట్లను నెంతయు గారవమున

322. క. రాచూలికి నుచితం బగు
నాచారము గాదె రణమునం దరులఁ దెగం
జూచుచుఁ దిరుగని [1]నడపున
నేచి యమరలోకమునకు నేఁగుట తరుణీ.

323. క. నీకొడుకు తుచ్ఛ మగునీ
లోకంబు దొరంగి పుణ్యలోకమ్మునకుం
బోకకు ని ట్లధికం బగు
శోకముఁ బొందంగ నగునె సుదతీ నీకున్.

324. ఆ. బ్రహ్మచర్యమునఁ దపంబున నుత్తమ
దానములను బడయఁ దలఁచునట్టి
గతులకంటె సౌఖ్యకారిణి యగుగతిఁ
బొందె నీసుతుండు [1]కుంద నేల.

325. ఉ. క్షత్రియకాంత పుత్రకునిఁ గాంచుట వాఁ డతిలోకవీరుఁ డై
ధాత్రిఁ బ్రసిద్ధి కెక్కుట[1]కుఁ దా నట గాకయు వీరపత్ని నా
నీత్రయి నెందునుం బ్రణుతి కెక్కనదీవు తనూజువీరముల్
శత్రువధోత్సవంబు విని సంతస మందక కుందఁ జాడియే.

326. వ. అట్లుం గాక.

---

321. 1. నాతని మందిరమున - కొన్ని ప్రతులు.

322. 1. మగటిమి - ఐ. ఔ. గ. ణ. ల. స. శ$_1$.

324. 1. వంద నేల - కొన్ని ప్రతులు; పొగుల నేల - ఓ. మ. వ.

325. 1. కదా - వ. స. శ$_1$. హ. కొన్ని ప్రతులు.

327. క. కాలం [1]బైనం బోవక
యీలోకమునందు నిలువ నెవ్వరివశ మి
ట్లేల యవివేకజనముల
[2]పోలిక శోకానలమునఁ బొగులుచు నుండన్.

328. క. తగుమాట లాడి కోడలి
వగ పుడుపు[1]ము నీవు ధైర్యవతి వి ట్లడలం
[2]దగునె నినుఁ జూచికాదే
[3]మగుడుం జిత్తముల వగలు మా కందఱకున్.

329. ఉ. నీమగఁ డెల్లి సైంధవు [1]ననిం దెగటార్చి శిరంబు దెచ్చినం
గోమలి నీదుపాపములకుం దగుపిరము సేయు మాతఁ డు
ద్దామ[2]భుజాబలాఢ్యుఁ డది దప్పదు వాని ప్రతిజ్ఞ దప్పినన్
భూమి వడంకదే తరణి పొల్పు [3]దలంకదె వార్ధి యింకదే.

330. క. నాపలుకు నమ్ము మర్జునుఁ
డాపాపాత్మకుని నెల్లి యనిఁ జంపి ముదం
బాపాదించుం గులమున
కీపెంపున కెలమి [1]పొందుఁ డీవును నతఁడున్.

331. వ. అని యనేకప్రకారంబులం బలికె నప్పు డగ్గోవిందుం గనుంగొనుట నుత్కటం
బయినశోకంబున సుభద్ర యాకులతం బొంది.

---

327. 1. బైనను - కొన్ని ప్రతులు; బగుటయు - ర. 2. పోలెను - అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు.

328. 1. వివేకధైర్య - ట. ద. ప. వ. 2. దగుదె నిను - వీ. 3. మగిడెం జిత్తముల - ద. ప. వీ. శ. ష; మగుడెన్ - ల.

329. 1. నినెమ్మి వధించి - వ. 2. బలాఢ్యు డీ పలుకు - ల. 3. దలంకదె - వీ. శ. ష. పెక్కు ప్రతులు; దొలంకదె - వా.

330. 1. బొందు దీవును నతడున్-ఆ. ఇ. ఐ. ఒ. కొన్ని ప్రతులు; బొందు మీవు నతండున్- కొన్ని ప్రతులు.

332. ఉ. అక్కట పుత్ర నిన్నుఁ [1]గనినంతియపుణ్యము కాని నాకు నీ
వెక్కుడు భక్తి నేసి [2]నను నెప్పుడు నారయ నీకుమారకు
లక్కువ నాకడం [3]దిరుగ లాలన సేయుచు [4]నుండునట్టియా
మిక్కిలినోము లేద యిటమీఁదికి నెవ్వరు దిక్కు సెప్పుమా.

333. ఉ. బాలుఁడ [1]వైననీ వరిదిబంటుతనంబునఁ [2]బ్రౌఢవీరభూ
పాలురఁ గుంభజప్ర[3]భృతిబాహుబలాఢ్యులఁ గిట్టి నేలకుం
గోలకుఁ దెచ్చి యిట్లగుటకుఁ వెఱఁగందుచు వంతఁ బొందుచుఁ
లోలతఁ జూడ కున్నె జనలోకము నీదగురూపురేఖయున్.

334. తే. మేను మృదుశయ్య [1]సగము నామేనిమీఁద
సగముఁ గాఁ జేర్చుకొని ముద్దు మిగుల నిద్ర
సేయు[2]నట్టి నీ విప్పుడు చెనఁటి నేలఁ
దనువు వొందుట కోర్చితె తండ్రి చెపుమ.

335. క. వందిజనంబులు మాగధ
బృందంబులు [1]సంస్తుతింపఁ బెంపొందుదు మ్రో
లం దిరిగెడు క్రవ్యాదుల
క్రందున నీవీను లిపుడు కటకటఁ బడవే.

336. చ. అనిలతనూజులావు గలఁ డందురు సాత్యకి శౌర్యశాలి నాఁ
జను ద్రుపదుండు సంగరవిశారదభావము పూని యుండు మా
త్స్యని బటువిక్రమాఢ్యుఁ డని చూతురు పాండవు లింద ఱుండి యె
క్కసికిఁ గడంగ [1]లేర నినుఁ గావఁగ నే మన నేర్తుఁ బుత్రకా.

---

332. 1. గనునంతియ – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. నుతి కెక్కగ బాయక – గ. జ. బ. వ. 3. మెలుగ(మెలగ) – ఊ. ఏ. 4. సంతసిల్లగా – హ.

333. 1. వయ్యు – చ. ట. ద. ప. వ. శ. ష. 2. బ్రౌఢులైన – ఇ. 3. ప్రముఖ – డ. ద. ప. ల.

334. 1. సాము – ఓ. ఔ. క. వ. కొన్ని ప్రతులు. 2. దీ విప్పు డిట్టుల చెనటి – కొన్ని ప్రతులు; దీ విడ్డు రణములో – ర.

335. 1. సందడింప – ప.

336. 1. లేద – కొన్ని ప్రతులు.

337. సీ. ఈలోక మెల్లఁ బాడిల్లును బోలె నై యున్నది [1]నీవు లేకునికిఁ జేసి
నీవు వేగమ [2]గండు నెఱసి బంధులఁ బ్రీతిఁ బొంద జేయుట గలవోలె నయ్యె
జిష్ణుని కొడుకవు కృష్ణునల్లుండ వీ వరులచేఁ బడుట చోద్యంబు గాదె
చెలువంపు మేనును జెన్ను మొగంబు నై యెప్పుడు పొడసూపె దింకఁ [3]గుఱ్ఱ

తే. యకట యుత్తర [4]యొప్పెడునది మనంబు
దీని కెంతయు మెత్తన యేను నిన్ను
వేఁడికొని యెద వచ్చి యివ్వేలఁదివంత
[5]దీపి దకుకొత్తుపలుకులఁ దేర్ప వన్న.

338. ఉ. అలఘుతపంబులం బ్రకటయాగములన్ మునిచోదితవ్రతం
బుల మహనీయదానములఁ బుణ్యచరిత్రములన్ మహాత్ము లెం
తలు రమణీయవిశ్రుతపదంబుల కేఁగుదు రంతకంటె ను
జ్జ్వల మగుసద్గతిం బడయు వాసవపౌత్ర పవిత్రవర్తనా.

339. వ. అని బహుప్రకారంబులం బలవించుచున్న సమయంబునం బాంచాలి యే
తెంచి యిరు[1]గేల నుత్తరాసుభద్రలం బొదివి తానును వారును నడలూని
పుడమిం బడి వివశతం బొంది వికలాక్రందనంబు సేయుచున్న నన్నారాయ
ణుండు ను శోకసంతాపితాంతఃకరణుం డగుచు నుచితవచనంబుల నయ్యు
విదల శోకంబు దొలగఁ జెట్టకేలకు నూఱార్చి మగుడి పాండవులపాలికిం
జనుదెంచె నప్పుడు ధర్మనందనుం డమ్మాధవధనంజయులను భీమసేనునిం
గవలను నితరపరిజనంబులను నిజనివాసంబులకుం బోవం బనిచి తాను నభ్యం
తరమందిరంబునకు నరిగె గృష్ణుండును జిష్ణుతోన తదీయ[2]సదనంబునకుం
జని విమలజలంబులం గృతాచమనుం డయి యొక్క వివిక్తప్రదేశంబున
దర్భ[3]శయ్య గావించి దాని నతతగంధపుష్పంబుల నలంకరించి యాయు
ధంబు లర్చించి చుట్టు నిడి కావ్వడి నం దుండు మని [4]నియోగించి నీవు నిశా

---

337. 1. కొడుక మాకొకఁడవ గురుబంధులను – ద. ప. వ. శ. 2. గడు నెరసి – ప. హా.
3. చూపవింక గుఱ్ఱ – అ; చూపుదింక – కొన్ని ప్రతులు. 4. గుందెడునది – జ. ట. బ.
5. దీర్ప – భాకూ. కొన్ని ప్రతులు.

339. 1. గెలంకుల – ఇ ఊ. ఏ. ట. వ. 2. మందిరంబునకు – పీ. శ. ష. కొన్ని ప్రతులు.
3. శయనంబు – ద. ప. 4. నియమించి – పెక్కు ప్రతులు.

సమయంబునం జేయుదేవపూజ యింతకు మున్న [5]చేయ వని తలంపించిన
సతండును బాదప్రక్షాళనంబు నుపస్పర్శనంబును నాచరించి తాను నిత్యం
బును నడపుత్ర్యంబకపూజనంబు తెఱంగున మాల్యానులేపనధూపదీపనై వే
ద్యంబు జనార్దనునకు సమర్పించిన నమ్మహాత్ముండు [6]సంభావించి యాప్తు
లగుదౌవారికజనంబుల శస్త్రహస్తులై [7]కాచికొని యుండునట్లుగా
సంఘటించి యాసవ్యసాచిం జూచి నీవు సుఖనిద్ర సేయు మేన నీకు
శుభంబు గోరియుండెదం బోయి వచ్చెద నని పలికి దారుకుండు దోడ
నరుగ నాత్మగేహంబునకుం బోయి.

340. ఆ. సెజ్జయందు మేను సేర్చి యర్జునకార్య
చింతం బలుక కుండి కౌంతవశికిం
బవ్వళించెం గురున్నృపాలక జలశాయి
దారుకుండు గొలిచి యూర[1]కుండ.

341. వ. ఆసమయంబున నవ్వీటివా రెల్లను దమయుల్లంబుల నెవ్వగలు నివ్వటిల్లం
గన్నుమూయక విన్న నయి యుండి.

342. సీ. అభిమన్యుం డీల్గిన నర్జునుం డధిక[1]శోకావేశ మొంది సాహసికవృత్తి
నతిదుష్కటం బైనప్రతిన [2]యిట్టులు పట్టునే కౌరవులు దీని నెట్టు లైనం
దప్పింపం జూతురు దర్పంబు వెరవును గలవారు వారి కగ్గలము గలరు
కడుదెప్పరం బైనకార్యంబు వాటిల్లె నెమ్మెయి నిది నిర్వహించువాండో

ఆ. యకట [3]దనములోన నాసైంధవునిం జంప
నబ్బ[4]కున్న నతని కగ్ని సొరంగ
వలయు నాతం డన్నృతవాదిగాం [5]డికార్య
మెట్టు లగునొ మనకు నేది గతియొ.

---

5. చేయు మని–అ. ఇ. శ. హ; చేయవైతి వని, చేయవలయు నని – అని పాఠములు.
6. సంతోషించి – ఉ. ఖ. ఠ. వ. 7. కాచికొని – పెక్కు ప్రతులు; కొలిచి
యుండు – హి.

340. 1. కుండె – కొన్ని ప్రతులు.

342. 1. రోషావేశ – ఐ. 2. బట్టినవాడు మానుగా గౌరవుల్ దీనినెల్ల – ఎ. ౬. దివము
లోన – శ. ష. పెక్కు ప్రతులు. 4. కుండెనేని యగ్ని – అ. 5. డీపని యెట్లు –
పెక్కు ప్రతులు.

343. వ. అని వెండియు.

344. క. మనచేసినసుకృతంబుల
వినుతఫలము లెల్ల నెల్లి విస్వచ్చుఁడు సిం
ధునరేంద్రుఁ జంపునట్లుగ
[1]నొనరి యొదవవలయు నని దృఢోక్తిఁ బలుకుచున్.

345. ఆ. అగ్రపుస్తకంబు లర్చించి చూచుచుఁ
బరమనియతిమై సుపశ్రుతులకు
బోవుచును శుభంబు లావహించుటఁ గాంచి
చెలఁగి యొండొరులకుఁ జెప్పికొనుచు.

346. క. గురునట్టివారు పదివే
వురు గాచిన నెల్లి సైంధవుని [1]బగలిటిలోఁ
బొరిగొనునట్లుగ నరునకు
వర [2]మిండీ వేల్పులార వారసి[3]కరుణన్.

347. వ. అని ప్రార్థించుచు దైవంబుల [1]కేటికోళ్లు నిరూపించుచు మఱియు బహుప్రకారంబులం బలుకుచుండిరి రాత్రి సాలం జనిన మేలుకని దామోదరుండు [2]దారకు నాలోకించి.

-: శ్రీకృష్ణుండు దారుకతో నర్జునప్రతిజ్ఞావిషయంబు లైనవాక్యంబులం గొన్ని సెప్పుట :-

సం_7_66_27

348. చ. నరుఁ డిటు లాడునే నృపగణంబు వినంగ జయింపవచ్చునే
[1]గురుకుగు సేనలం దరణి గ్రుంకకమున్న [2]తలంపఁ జాల దు

---

344. 1. నొనరింపగ వలయునని దృఢోక్తి – కొన్ని ప్రతులు.

346. 1. మాపటిలో – ఊ. ప. 2. మొసగుడు – ఇ. ప. వ. శ. ష; మీరే – ఓ. 3. కణకన్ – బ.

347. 1. కెదురుకోళ్ళు – ఆ. ఉ. ఊ. కొన్ని ప్రతులు; కేడుకోళ్ళు–ఝ. వ; వేఁడికోళ్ళు – ష; కెత్తికోళ్ళు – ఇ. ఓ. ఖాకూ. త. 2. దారకు – పెక్కు ప్రతులు.

348. 1. గురుతుగ సైంధవున్ దరణి – ద. వ. 2. జయింప – అ. ఉ; శిరంబుద్రుంప – హా.

స్తర మిది యాతఁడీ ప్రతిన దప్పక యుండఁగఁ దీర్చునట్లుగాఁ
[3]బొరయక యున్న దుర్దశలఁ బొందనె పాయనినిందఁ గుందనే.

349. క. కడుఁ గూర్తుఁ గవ్వడికి [1]న
య్యొడలు గలుగ నేను బ్రదికి యుండుదుఁ గా కె
క్కడి బ్రదుకు నాకు నాతం
డెడలిన నప్పార్థుఁ గాతు నెల్లవిధములన్.

350. క. వాలో పగ మఱుఁ దే
వాలమునం దతని కగుట [1]యరుదే యెమ్మె
వ్రాలెదనో రిపు లెట్టులు
గూలెదరో చూడు నాకుఁ గురుబల మెదురే.

351. తే. ఎల్లి [1]సచరాచరము లగునెల్లభూత
ములును [2]నాదగునేర్పును బలముఁ బాండు
[3]తనయులకు నేను గూర్పుటయును నెఱుంగ
వలయు జాఱక [3]యేచెదఁ గలనిలోన.

352. క. అనుఁ డస్తమింప కుండఁగ
మును సైంధవుఁ [1]జంపువాఁడ మునుకొని పరు లే
చినఁ [2]జిత్రవధవిహారం
బున నప్పుడు రౌద్రరసము పొడ [3]వేర్పఱతున్.

---

3. బొరలక యున్న - పెక్కు ప్రతులు.

349. 1. నే యొడలు - గ. జ. బ.

350. 1. యరిదియె - అ. ఈ. ర. ల. కొన్ని ప్రతులు.

351. 1. సమరాంగణంబున - ఉ. ఠ. హ. 2. జూడంగ గురుసైన్యముల గలంచి, యంధపతి సుతుల్ నివ్వెరగందుచుండ, చెలగి బొలువువరి యిచ్చెద గలనిలోన - ఊ. ఏ; జూడంగ గురు సైన్యముల గలంచి యంధపతి సుతుల్ నివ్వెరగందుచుండ, చెలగి బలుపారి యేర్చెద కలనిలోన - ఐ. 3. యేర్పడ గలనిలోన - ద. శ. ష; యెంచెద గలనిలోన - వ.

352. 1. దునుమువాడ - పెక్కు ప్రతులు. 2. తీవ్రవధ - ఇ. గ. జ. ది. 3. వేర్పడగన్ - కొన్ని ప్రతులు.

౩౫౩. ఉ. సైంధవుఁ ద్రొక్కఁ గేల యనిఁ జావక[1]పోవఁగ నేర్తు రెట్లు గ
ర్వాంధుఁడు గౌరవేశ్వరుఁడు నందఱు దమ్ములు నెల్ల[2]మిత్త్రులున్
బంధులుఁ దోడు వచ్చిన నృపాలురుఁ బాండవకీర్తి సర్వది
క్సింధుపదంత కాండములఁ జెందఁగఁ జేయుట కేను[3]బూనఁగన్.

౩౫౪. వ. అది క్రమంబునం జూచెద వెల్లి నీవు మనయరదంబు వన్ని [1]శైబ్యసుగ్రీవ మేఘపుష్పవలాహకంబులను గనకమణిమాలికాలంకృతంబులం జేసి పూన్చి గరుడ[2]ధ్వజంబు సంఘటించి చక్రగదాశార్ఙ్గప్రముఖాస్త్రశస్త్రంబులు దగుతెఱంగున నునిచికొని మైమఱువు దొడిగి రమ్ము పాంచజన్య[3]రవం బాకర్ణించినప్పుడ వేగంబ యెయిది[4]కొను మనిన విని దారుకుండు.

౩౫౫. చ. అలఘువిచార యట్లు [1]తగు నప్పని సేసెద నంత సేయఁగా
వలయునె యెవ్వ రక్కడ నవార్యులు గ్రీడికి సారథిత్వముం
దలకొని నీ వనూనశుభదం బగువర్తన మాచరింప నీ
[2]నిలుపును బార్థుచాలుటయు నేఁడు గదా భువనం[3]బెఱింగెడున్.

౩౫౬. వ. అని సవినయంబుగాఁ బలికి దనుజమర్దనుతమకంబు వారించె నంతఁ బాంచజన్యరవాభిజ్ఞానంబు సవిశేషంబుగా నతనిచేత [1]వినికొని తత్కాలంబున నాలంబులోనికి నరదంబు గొని వచ్చెద ననియె వెండియు వాసుదేవుండు సూతునితోడ సముచితసల్లాపంబులు సేయుచుండె నంత నట బీభత్సుండు ప్రతిజ్ఞోత్సాహంబు నిర్వహించుతెఱంగు దలంచుచు దామోదరకృతస్థండిలశయనంబున నుండి శోకనిద్రావివశుం డయ్యె నయ్యవసరంబునం గలలోనం గృష్ణుం డతనిపాలికిం బోయిన నాతండు భక్తిం బ్రత్యుత్థానంబు సేసి తన యున్న సెజ్జ యిచ్చి తొలంగి నిలుచుండ నమ్మురారి యాసీనుం డై యుండి యతని కిట్లనియె.

---

353. 1. నిల్వగ - ఉ. మ. 2. భృత్యులున్ - ఈ. వ. 3. బూనినన్ - కొన్ని ప్రతులు.

354. 1. సైన్య సుగ్రీవ - భాకూ. శ. ప. పెక్కు ప్రతులు. 2. ధ్వజంబెత్తి - కొన్ని ప్రతులు. 3. నినదం - పెక్కు ప్రతులు. 4. కొమ్మనిన - ఇ. ఊ. ప. ఐ.

355. 1. తగ - కొన్ని ప్రతులు; యగు - ల. 2. నిలువును - ఎ. ఐ. వ. శ. 2. బెరుంగుటల్ - ప.

356. 1. నెఱింగి - ఊ. ప.

357. క. వగపున కెడ యీకుము నె
వ్వగఁ గుందినమానవుండు వైరులచేతం
దెగుఁ గాని [1]తనదుకార్యముఁ
దగ నొనరింపంగ లేఁడు తగునే వగవన్.

358. వ. అనిన విని యతం డతని కి ట్లనియె.

359. క. వగ పింక నెన్నఁటికి [1]దెగు
మిగిలి ప్రతిన పూరగింప మేకొని చనునా
[2]మగఁటిమి [3]లావు మాన్పుట
[4]తగవే గురునకు నతండు [5]దానికిఁ బూనన్.

360. క. [1]ఇనతనయసహిత మడ్డము
సనుదెంచుజనంబు పెల్లుసైంధవుఁడు బలం
బున కెల్ల వెనుక మనికియు
మనము నఁ [2]దలపోయ [3]వగపు మానునె నాకున్.

-: కృష్ణార్జునులు స్వప్నమందుఁ గైలాసంబునకుఁ బోవుట :-

సం. 7-57-24

361. వ. అనిన నచ్యుతుం డది యట్టిద కాదె యని పలికి తదీయహితార్థి యై [1]యుపాయంబు విచారించి యుపస్పర్శనం బాచరించి తూర్పుమొగం బై యుండి యవ్విజయు వీక్షించి శూలపాణికిం బరమసాధనం బైనపాశుపతంబు నీకుం [2]బ్రస్ఫుటపరిజ్ఞానం బయిననీవు జయద్రథవధం బవశ్యంబును [3]జేయుదు

357. 1. కార్యకృత్యము - ఎ. ఒ. ఖ. చ. వ. శ.

359. 1. దనుమిగిలి - ల. శ. శర. ష. పెక్కు ప్రతులు; నగు మిగిలి - న. వ. వ. 2. మగతనము - ద. వ. వ. 3. నలవు - ఊ. ఏ. ఒ. ఖ. 4. తగదగ్గురునకు - ఊ. ఎ. ఏ. త. 5. తలకొనునేలా - దానికపూనన్ - స. శ[1].

360. 1. ఇనుతేరి రయము నడ్డము - ష. పెక్కు ప్రతులు. 2. బెట్టంగ, బుట్టంగ, బట్టంగ - అని పాఠములు. 3. వగలు - కొన్ని ప్రతులు.

361. 1. యుపాయంబు విచారించి - పెక్కు ప్రతులలో లేదు. 2. బరమమంత్ర పరిస్ఫుట పరిజ్ఞానం బైన - ఔ. 3. జేయంజాలుదు వమ్మహాస్త్ర - కొన్ని ప్రతులు.

వమ్మహాస్త్రంబు కలిమి సమంత్రకముష్టికస్థానకవిజ్ఞానంబుగాఁ గ్రొత్త సేసి కొనుట మేలు తదర్థంబుగా నద్దేవుఁ జిత్తంబున నిలిపి సభక్తికధ్యానంబు సేయు మనవుడుఁ గిరీటియుం గృతాచమనుండును భూసమాసీనుండును నై పరమేశ్వరస్మరణతత్పరత్వంబున నుండి కృష్ణుండును దానును గగనంబున కెగయుటయు నతండు దనవలచేయి వట్టికొని చనుదేరం [4]దా రిరువురు నుత్తరాభిముఖు లై పోవుటయుం గాంచె నవ్విధంబున వారలు చారణసిద్ధ గంధర్వసేవితం బైనపథంబున వివిధవిశేషంబు లాలోకించుచుం బోయి కైలాసంబు గని యందు సరిత్సరోవరసుందరంబును బుష్పలతాభూషితం బును రమ్యతరుసంతానకాంతంబును నయిన కుబేరవిహారస్థానంబు సూచు చుం జని చని దాని కనతిదూరంబున మహనీయమణిమయం బయి తేజరిల్లు మహామందిరంబు సొచ్చి యచ్చటఁ బ్రమథగణపరివృతుండును బార్వతీసహి తుండును బ్రద్యోతనసహస్రప్రభావిభాసమానుండును దివ్యోత్తమసేవ్యమా నుండును మహామునిప్రస్తూయమానుండును నప్సరో[7]జనసంగీతమంగళ మహితపురోభాగుండును నై పేరోలగంబున నుండి శోభిల్లు శంకరు దర్శించి సప్రణవోచ్చారణంబుగా దండప్రణామంబు లాచరించి యున్న నన్నరనారా యణులదెసం బ్రసాదమందస్మితసుందరవిలోకనంబు లొలయ నయ్యిందు ధరుండు మధురస్వరంబున ని ట్లనియె.

362. క. స్వాగత మేమీ యిద్దఱ
యాగమనంబునకు హేతు వగుకోర్కి [1]యను
ద్వేగంబున నెఱిఁగింపుఁడు
వేగమ యొడఁగూర్తు నెల్లవిధముల దానిన్.

363. వ. అనినం బ్రీత[1]చేతస్కు లగుచు నుత్థితు లై లలాటంబుల నంజలిపుటంబులు ఘటించి నిలిచి వాసుదేవార్జునులు దమచిత్తంబులు భక్తిరసంబున జొత్తిల్లు చుండ.

---

4. దారిరువురు – ఇ. ఈ. గ. జ. వ. శ. వ. శ; హారిరువురు – వా. 5. తుల్లైగగన గమనంబున – గ. జ. బ. 6. శోభితంబును – ఎ. 7. గణ. – కొన్ని ప్రతులు.

362. 1. యనుద్వేగంబున (?) – కొన్ని ప్రతులు; యనుదోగ్యంబున – ఎ. ఏ. చ. ద. ర. హ.

363. 1. చేతస్కులు నానందితు లై – ఊ. ఎ. ఏ.

364. చ. రవిశశివహ్నిలోచన సురప్రతివీరవిమర్దన[1]క్రమా
భువన[2]మయాత్మకా భుజగభూషణ పోషితభక్త సంయమి
స్తవనకథా[3]విధానపర దర్పకదర్పహరా నిరస్తసం
భవమరణాదివైకృత యపారగుణాగుణదోషవర్జితా.

365. క. జగములు గలిగిం[1]పఁగ నవి
దగు[2]వర్ధన మొంద నిలుపఁ దఱితో వానిం
దెగఁ జేయ నీవ నేర్పరి
వగుట శ్రుతులు సెప్ప నిర్మ[3]లాద్భుతమూర్తీ.

366. క. ప్రకృతి యనఁ [1]బురుషుఁ డనఁగా
వికృతు లనం బరగుచున్న వీనికి నెల్లన్
సకలాత్మక నీవిభవము
[2]యకృతిమాధారభూత మై యుండు శివా.

367. క. అవ్యక్త మప్రమేయము
నవ్యక్త మనాది [1]భక్తిసుగమ మగమ్యం
బవ్యయము త్రిలోచన నీ
దివ్యమహిమ యోగమోపదేశము రుద్రా.

368. వ. అని మఱియు ననేకప్రకారంబుల నవాఙ్మనసగోచరుం డగునప్పరమేశ్వరుం బ్రస్తుతించి యప్పు డచ్యుతుండు పార్థునిం బాశుపతం బర్థింపు మని కఱపిన నతం డవ్వరంబు వేఁడుటకై విశ్వేశ్వరుం దప్పక చూచి తాను మున్ను ముకుందునందు సమర్పించిన నిశాసమయపూజాద్రవ్యంబు లగుమాల్యాను

---

364. 1. విభ్రమా – అ. ఇ. ఓ. క. మ య. వ. హ; విక్రమా – కొన్ని ప్రతులు; నక్రియా– చ. ట ద. ర. 2. శివాత్మకా – వ. 3. విధాన – కొన్ని ప్రతులు.

365. 1. పను – కొన్ని ప్రతులు. 2 వర్ధన – ఇ. ఉ. ఐ. క. వ కొన్ని ప్రతులు; వర్తన – వా. 3. లావ్యయ – ఊ. ఎ. ఏ.

366. 1. బుధులనంగా – గ. జ. బ. 2. యకృతి సమాధార(న) – అ. ఆ. ఇ. ఈ. ఉ. ఊ. ల. కొన్ని ప్రతులు.

367. 1. భక్తి, బుద్ధి, వస్తు – అని పాఠములు.

లేపనంబు లద్దేవునిదివ్యదేహంబునం గాంచి యచ్చెరువంది యమ్మురహర పురహరులయేకత్వంబు మనంబునం గొనియాడి దేవా భవదీయ[1]దివ్యాస్త్రంబు దయసేయు మని విన్నవించుటయు భక్తవత్సలుం డగు[2]శక్తినాథుండు కృష్ణు లిరువురను దరహాసంబుతో నవలోకించి.

369. తే. అమృతమయ మగు[1]నల్లపద్మాకరమున
నాదుబాణాసనంబు బాణములు నున్న
యవి [2]దృఢవ్రతులార మీ రచటి కరిగి
వానిఁ దెం డిచ్చటికి నని యానతిచ్చె.

370. వ. [1]అట్లనుగ్రహించినఁ జిత్తానువర్తనతత్పరు లగుతత్పరిసరవర్తులు గొందఱు తోడ్కొనిపోవం బోయి పరమమును లగునన్నరనారాయణులు [2]త్రిణయన నిర్దిష్టం బైనయద్దివ్యసరస్సునందు.

371. క. నాలుకలు [1]గ్రోయుచు విష
జ్వాలలు నిగుడంగ నుగ్రసర్పద్వయ మా
భీలాకృతి నుండఁగ వి
ట్టాలోకించి జనితాద్భుతాత్మకు లగుచున్.

372. వ. అవ్విధం బద్దివ్యాస్త్రవిలాసంబుగా నెఱింగి పాదప్రక్షాళనోపస్పర్శనంబు లాచరించి యమ్మహోరగంబుల [1]కుపస్థానంబు సేసి వేదవిదు లగునమ్మహాత్ములు నియతాత్ము లై శతరుద్రీయంబు జపియించుచు నప్రమేయప్రభావుం డగుభవునిం దమభావంబులలో నిలిపికొని యుండం దదీయానుభావంబునం జేసి యాదందశూకంబులు ముందటిచందంబు విడిచి విల్లును నమ్మును నై యున్నం జూచి యాసవ్యసాచియు శౌరియు సమ్మదంబునం బొదలి వానిం బుచ్చుకొని వచ్చి శంభుసన్నిధిం బెట్టుటయు.

---

368. 1. మహాస్త్రంబు - పెక్కు ప్రతులు. 2. భవానీనాథుండు - ఇ. ఎ. ఐ.

369. 1. నల్లపద్మాకరమున - ల. పీ. శ. ష. శ. పెక్కు ప్రతులు. 2. దృఢత్వ మహితులార యచటి - ఉ. ఠ.

370. 1. అట్లానతిచ్చిన - ఇ. 2. త్రినయన - పీ. కొన్ని ప్రతులు.

371. 1. గోయుచు - శ. ష. కొన్ని ప్రతులు.

372. 1. నుపాసనంబు సేసి - గ. జ. ఐ.

373. తే. నీలలోహితవర్ణుండు బాలుఁ డొక్క
బ్రహ్మచారి [1]మహాబలభవ్యమూర్తి
హరునిపార్శ్వంబునం దుండి యలిగి యాశ
రాసనము పుచ్చికొని శర మరి నమర్చి.

374. వ. తెగ వాపుటయుం దదీయస్థానకంబును ముష్టిప్రకారంబును నేకాగ్రదృష్టిం గనుంగొనుగాండివికి మన్మథమథనుండు మంత్రస్వరూపం బనుగ్రహించినం బరిగ్రహించి.

375. క. పురహరుఁ డనుమతి సేయఁగ
శరము శరాసనము దివ్యసరసిన యిడి య
న్నరుఁడు సనుదెంచి యాశం
కరుముఖకమలంబు[1] తెలివి గాంచి ముదమునన్.

376. వ. తనకు నరణ్యంబున నయ్యాశానుం డిచ్చినవరంబును దత్కాలసందర్శన ప్రకారంబునుం దలంపించిన నెఱింగి యప్పశుపతి యతనిపైఁ గరుణార్ద్రంబగుకటాక్షవీక్షణం బొలయ నది యట్ల కాక దానికి నన్యథాత్వం[1]బు గలదే యనియె నప్పుడప్పాశుపతాస్త్రంబుఁ బ్రస్ఫుటంబుగాఁ బడసినవాఁ డై పార్థుండు పులకపటలపరికలితదేహుం డగుచుం దనయుత్సాహం బప్రతిహతం బయ్యె నని మనంబున నిశ్చయించెఁ దదనంతరంబ.

377. తే. భవునిచే సాదరానుజ్ఞ వడసి [1]శౌరి
ఫల్గునులు వలుమాఱుఁ దత్పదయుగంబు
[2]ఫాలములు సోఁకఁ బ్రణమిల్లి బహుళరోమ
హర్ష[3]సంభృతగాత్రు లై యరుగుదెంచి.

---

373. 1. మహోభిలభవ్య – ల; మహాద్భుతభవ్య – జ. బ.

375. 1. తెరువు – మ.

376. 1. జేల యగు ననియె – న.

377. 1. శార్ఙ్గి – పెక్కు ప్రతులు. 2. భావమున సోఁక – వ. 3. సంభ్రమ – ఎ. ఐ; సంపద – మ.

378. వ. నిజశిబిరంబు సొత్తెంచి రథ్యవిధంబున నర్జునుండు గల గాంచెఁ గృష్ణుండు దారుకుతోడం దగుమాట లాడుచుండెఁ దెలతెల వేగె నది యాధనంజయ స్వప్నాంతసమయం బై సంఘటించె నని యిట్లు సంజయుండు సవ్యసాచి యంతర్వర్తనంబు తెఱంగు ధృతరాష్ట్రున కెఱింగించె ననుటయు.

379. క. మునినాథ దేవకీసుతుఁ
డును సంక్రందనతనూజుఁడుం బూనినయా
పని యెమ్మెయిఁ గడతేఱెనొ
వినవలతుం దేటపఱుపవే పరిపాటిన్.

380. వ. అని యడుగుటయును.

381. చ. లలితచతుర్ద[1]శాఢ్యకమల[2]ప్రసవప్రసరత్సరస్వతీ
విల[3]సన[4]సౌరభోద్గమ[5]నివిష్ట మహామహిమాభిరామ కే
వల[6]సుఖతానుభూతిమయవై భవ[7]సార జగజ్జనిస్థితి
ప్రళయవిధానకేళి[8]పరిపాటివికస్వర నిత్యభాస్వరా.

382. క. హృదయసరసిరుహ[1]మధుపా
స్పదవిహృతినికేత నిహతపాపోన్మేషా
వదన[2]సముత్థిత వేదా
మదవదసురహరణకరణమంత్రవినోదా.

383. మాలిని. మునిసముదయహృద్యా మూలవిద్యా[1]నవద్యా
వినమదమృతసృష్టీ విశ్వలోకైకదృష్టీ
[2]మననసుగమమూర్తీ మంత్రరూప[3]ప్రకీర్తీ
జనిమృతిభిదగాత్మా శశ్వ[4]దాప్తోదవర్త్మా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన శ్రీమహాభారతంబున
ద్రోణపర్వంబునందు ద్వితీయాశ్వాసము.

---

381. 1. శాఢ్య – ఇ. ఈ. క. ద. న. వ. 2. ప్రకర – పెక్కు ప్రతులు. 3. సితసౌరభోద్గమ – ఆ. గ. ప. బ. య. వ. 4. సౌరభోద్గతి – మ. 5. వివేక – ఐ. ఔ. ణ. 6. సుఖితానుభూతి – వ. హ. 7. ధామ – ర. వ. స. శ. కొన్ని ప్రతులు. 8. పరిపక్వ – ల.

382. 1. మధురాస్పద – పెక్కు ప్రతులు. 2. సముద్గతి (మ) – కొన్ని ప్రతులు.

383. 1. ప్రపద్యా – ల. శ. ష. కొన్ని ప్రతులు. 2. మనసిజనిభమూర్తీ – ఎ. ణ. హ. 3. ప్రవర్తీ – ఆ. ఇ. ఓ. మ. వ. 4. దానందమార్గా – ఈ; దానందవర్త్మా – న. బ.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - తృతీయాశ్వాసము

—o—o—o—

1. క. [1]శ్రీరమ్యశైలాద్రివరపు
త్రీ[2]రమణీయత్వ సుభగదివ్యవిలాసో
దార వనమాలికోరగ
హారపరిష్కార[3]సార హరిహరనాథా.

-: అర్జునుఁడు నిజస్వప్నవృత్తాంతంబు ధర్మజాదులతోఁ జెప్పుట :-
సం. 7-58-1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. ఆ. పార్థుఁ డిట్లు ప్రతిన [1]వట్టిన నది నిర్వ
హించుపనికిఁ గృష్ణుఁ డిం వ్యథమునఁ
[2]బూని రాత్రి [3]యన్నివోకలఁ బోవుట
విని విచిత్రవీర్యతనయుఁ డుఱికి.

4. క. ఇమ్మెయి వేగినఁ బాండవు
లెమ్మెయిఁ గార్యంబు నడపి రెఱిఁగింపుము చి

---

1. 1. శ్రీరమణీ నగవరపుత్రీరమ-ట. బ. వ. 2. రమణీయాంగ శుభగ-ఊ. ఎ. ఏ. 3. భరణ - ఉ. త.

3. 1. బలికిన - న. 2. బొదలి - వ; బొరలి - ద. 3. యిన్ని - పెక్కు ప్రతులు.

త్తమ్ము గలంగెడు సంజయ
[1]నమ్మితి నగ్గురుఁడు గాచెనా [2]మిమ్ము ననిన్

5. వ. అని యడిగిన నమ్మహీశ్వరునకు [1]సూతసూనుం డిట్లను నట్లు ప్రభాతం బగుటయు.

6. క. వందిజనతుములముల యా
[1]నందితమాగధసుగీతనాదంబుల ప్ర
స్పందితపాఠక[2]రవముల
క్రందున ధర్మజుఁడు మేలుకనియె నరేంద్రా.

7. వ. [1]ఇట్లు మేలుకని నగుతెఱంగున మజ్జనశాలకుం జని మంత్రపూతంబు లగు జలంబులు సముచితపరి[2]చారికాజనంబులు గనక[3]కలధౌత కలశంబులం దేరఁ గృతస్నానుం డయి లఘుధౌతాంబరపరిధానంబును బరిమళబహుళాంగ రాగానులేపనంబును సురభికుసు[4]మమాలికాభరణధారణంబును నాచరించి దేవార్చనంబు దీర్చి యగ్నికార్యంబు నిర్వర్తించి కక్ష్యాంతరంబు[5]నకు వెడలి విప్రనికరంబులకు ధేనుప్రకరంబులుఁ గాంచనసంచయంబులు వస్త్రవిసరంబులు మణిభూషణపుంజంబులుం జిత్తం[6]బు రంజిల్ల నొసంగి తదాశీర్వాదంబులు గైకొనుచు నేనుంగుమొగసాల గడచి యాస్థానమండపంబునకు వచ్చి.

8. తే. ఉదయధరణీధరంబుపై నొప్పుదివస
నాథు నెనయుచు సింహాసనంబుమీఁదఁ

---

4. 1. నమ్మిన యగ్గు – ఓ. త. ర; నమ్మితిర(మ)గ్గురు – కొన్ని ప్రతులు. 2. మిము వాజిన్ – ఆ. జ. త. ర; మిము బోరన్ – ఐ.

5. 1. నాసూత – కొన్ని ప్రతులు; సూతనందనుం – కొన్ని ప్రతులు.

6. 1. నందన – కొన్ని ప్రతులు. 2. జనముల – కొన్ని ప్రతులు.

7. 1. మేలుకని – పెక్కు ప్రతులు. 2. చారకా – కొన్ని ప్రతులు. 3. కలధౌత – కొన్ని ప్రతులలో లేదు. 4. మమాలికాచరణంబును – ష. న; మాభరణ ధారణంబును – కొన్ని ప్రతులు; మాభరణంబులు బరమాభరణధారణంబును – కొన్ని ప్రతులు. 5. లు గడచి – ద. వ. వి శ. ష. న. 6. బులురంజి – కొన్ని ప్రతులు.

బొలిచె లీలావతీకర[1]కలితచామ
రములు వొలయంగ నుచితజనములు గొలువ.

9. వ. కొలు వున్నసమయంబున దౌవారికుండు వచ్చి [1]దామోదరుండు వచ్చె నని యెఱింగించిన నవ్విభుండు వేగంబ తత్ప్రవేశంబు నడపు మనిన వాఁ డట్ల చేయ [2]నమ్మహాత్ముండు ప్రీతి నేతెంచుటయు నుచితాసనవిన్యాసంబున నత్యాదరముఖవికాసంబున నతనికి సత్కారంబు సేసి గారవించి తదాననం బాలోకించి యి ట్లనియె.

10. క. [1]జ్ఞానమ్ములు దెలివొందం
గా నత్యంతంబు సుఖముగా నింద్రియసం
తానంబు ప్రసన్నముగా
నీ[2]నిశ[3]సుఖవృత్తిఁ గడపితే మధు[4]మథనా.

11. క. అనుటయు [1]హరి ధర్మతనూ
జున కి ట్లనుఁ బ్రీతి నిన్నుఁ జూడఁగ నెపుడున్
జననుత శోభనములు నా
[2]కనూనములు కావె దీని నడుగఁగ నేలా.

12. వ. అని పలికె నట్టియెడ భీమనకులసహదేవులును సాత్యకిద్రౌపదేయఘటో త్కచులును బాంచాలమాత్స్యకేకయులును మఱియుం దగువారుం జను దెంచి సముచితంబుగాఁ బ్రవేశించి యుధిష్ఠిరునకుం బొడసూపి యతండు నియోగింప నుచితాసనంబుల నుండిరి సాత్యకిం గృష్ణుండు నిజాసనంబున నునిచికొనియెం దదనంతరంబ [1]యెల్లవారలు వినుచుండ నన్నరపతి నారయణున కి ట్లనియె.

---

8. 1. కమల – ఉ. ర.

9. 1. దేవా దామోదరుండు – ఒ. ఓ. ఔ. త. 2. నమ్ముకుందుండు–కొన్ని ప్రతులు.

10. 1. జ్ఞానములు దెలివి నొందంగా–పెక్కు ప్రతులు. 2. నిశి–పెక్కు ప్రతులు. 3. సుఖ వృత్తి – ఉ. ఊ. ఏ. ట. ర. డ. సుఖనిద్ర – ఈ. ఔ. ద. 4. వైరి – ణ.

11. 1. ధర్మతనూజుని గనుగొనినను బ్రీతి జూడగల్గుట నెపుడున్–ట. బ. వ. 2. కనుకూ లము గాక – మ. య. ర; కనూనములు గాక దీని – పెక్కు ప్రతులు.

12. 1. యెల్లవారలు – వ; వారలు – హ.

13. ఉ. పంకజనాభ మాపడినపాటులు రాజ్యము గోలుపోకయుం
గింకకు మూలమై కడఁగి గెల్పు కిరీటికిఁ నీఁదలంచి యీ
వంకకు [1]వ్రాలి భక్తజనవత్సలతన్ రథచోదకుండ వై
తింకిట మమ్ముఁ [2]గావు మని యేటికిఁ [3]జెప్పఁగ మాటిమాటికిన్.

14. వ. అర్జునుప్రతిన చిత్తంబున [1]నిలుపుము దుఃఖామర్షమహార్ణవమగ్నుల మైన [2]మమ్ముం [3]దీరంబు సేరుపం దేవవు నీవ కావె యనిన విని యచ్యుతుం డతని కిట్లనియె.

15. మ. విను నేఁ డర్జునుఁ [1]డన్యసైన్యముల నుర్విం గూల్చుచుం బ్రేతభూ
తనికాయంబులు మాంసభక్షణము రక్త[2]స్వైరపానంబుఁ జే
సి నలిం గ్రాలఁగఁ[3] గీడ సల్పు నిను మెచ్చించుం దుర్జ సైంధవుం
డనువానిం దెగటార్చి పేర్చు రిపుధైర్యక్షేపణాటోపతన్.

16. వ. క్రోధశోక[1]జ్వరవిముక్తుండ వై శాంతిం బొందు మనునవసరంబున ధనంజయుండు వచ్చి ధర్మనందననకు [2]మ్రొక్కి నిలిచినం జూచి యతండు సంతసంబున సముత్థితుం డై కౌఁగిలించుకొని దీవించి [3]దరస్మితరుచిరాననుం డై.

17. క. గెలుపు [1]ధ్రువము నీకును మెయిఁ
దలతల [2]మనుచాయ దోఁచె దైత్యాంతకుఁడుం

---

13. 1. వచ్చి – ఉ. ఊ. ఏ. ఐ. ఠ. 2. బ్రోవు మని – ఆ. జ. 3. జెప్పను – ప. ద. ర.

14. 1. నిలిపి దుఃఖా – ట. బ. వ. 2. మమ్మిం దర – ర. 3. ఘారంబు – ఖ. గ. ఙ. వ; దరి జేర్ప – ల హ.

15. 1. డెల్ల – గ. జ. బ. ర. వ. 2. స్ఫీత – కొన్ని ప్రతులు; స్వేద – ర. వ. 3. గేలి – ఖ. వ. పీ. శ. ష; గ్రీడ సల్పి – పెక్కు ప్రతులు; గ్రీడ సల్పు – వా.

16. 1. జ్వర – కొన్ని ప్రతులలో లేదు. 2. మ్రొక్కినం జూచి – ఖ. గ. పీ. 3. మంద స్మిత – ఓ. జ; ఆదరస్మిత – ఘ; సాదరస్మిత – వ; దరస్మిత వదనుండై – ఖ. గ. చ. వ. శ.

17. 1. దృఢ మగుచు నీమెయి – గ. జ. బ. వ; ధ్రువము నీ(కి)కెమ్మెయి – మ. ల. పీ. కొన్ని ప్రతులు. 2. యను(ని) – కొన్ని ప్రతులు.

దెలివొంది యున్నవాఁడని
పలికిన నావిభునితోడఁ బార్థుఁడు నెమ్మిన్.

18. క. దేవరకు నధికభద్రమ
యీవసుదేవసుతుకరుణ [1]నేనత్యాశ్చ
ర్యావహముఁ గంటి నది వినఁ
గావలయును బంధుమిత్త్రగణసహితముగన్.

19. వ. అని పలికి [1]స్వప్నంబున ఫాలలోచను[2]వలనం బరమోత్కర్షం[3]బు వడసిన తెఱం గేర్పడం జెప్పిన నతండును గొలువువారును విస్మయప్రమోదంబులతో వృషభధ్వజు నుద్దేశించి నమస్కరించిరి తదనంతరంబ యన్నరపతిచేత ననుజ్ఞాతు లయి యాసకలయోధులుం బోంగి సంగరసన్నాహంబులు మెఱయ వెడలిరి కృష్ణార్జునసాత్యకులు నతనికి నభివాదనంబులు సేసి సహర్షంబుగా వెలువడి యర్జునావాసంబున కరిగి రందుఁ గృష్ణుండు [4]రథంబు వన్ని జైత్రంబు లగుమంత్రంబులు [5]ప్రయోగించి యుజ్జ్వలంబు సేసిన నది బాలభానుండునుంబోలెఁ దేజోమయం బై వెలుంగుచుండ సమరసన్నద్ధుం డై ధనుర్బాణపాణి [6]యై యర్జునుండు విప్రాశీ[7]ర్వాదంబుల[8]తో నమ్మహనీయస్యందనంబునకుం బ్రదక్షిణంబును బ్రణామంబునుం జేసి యారోహణం బాచరించి మేరుశిఖరంబునం బోలుచు భాస్కరుని భంగి శోభిల్లెఁ గృష్ణసాత్యకులు నొగలను నతనిపిఱుందను గూర్చున్న నాఫల్గునుండు బుధశుక్రసమేతుం డగు చంద్రుచందంబున [9]నొప్పె నట్లొప్పి వారు పుణ్యపాఠకరవంబులును వందిమాగధధ్వనులును వినుచుం జని రప్పుడు దమకు విజయప్రదంబులుఁ గౌరవులకు విపరీతంబులు నైనగంధవాహాది [10]నానానిమిత్తంబు లనుసంధించి యాసవ్యసాచి [11]సాత్యకితో ని ట్లనియె.

---

18. 1. నిది యొక యాశ్చ – ఇ. జొ. ణ.

19. 1. స్వప్నంబున – పెక్కు ప్రతులలో లేదు 2. కరుణవలన – కొన్ని ప్రతులు. 3. బగువ (శ)రంబు వడసిన – కొన్ని ప్రతులు. 4. స్యందనంబు – ణ. 5. పఠియించి యుజ్జ్వల – వ. 6. యగు నయ్యర్జు – పెక్కు ప్రతులు. 7. ర్వాదంబులతో – పెక్కు ప్రతులు; ర్వాదనాదంబులతో – వా. 8. తో వచ్చి యమ్మహ – పెక్కు ప్రతులు. 9. నయ్యె నిట్లొప్పి పుణ్యపాఠక – కొన్ని ప్రతులు; నొందె నట్లొప్పి – గ. బ. హా. 10. నానా శుభ – వ. హ. 11. కృష్ణానుజులతో – న.

-: అర్జునుఁడు సాత్యకిని ధర్మరాజురక్షణంబునకు నియోగించుట :-

సం 7_60_27

20. క. మనకు నిమిత్తము లెంతయు
ననుకూలము లయ్యె గెలుతు మాహవమున [1]కేఁ
జనియెదఁ బ్రతిజ్ఞ దీర్పఁగ
ననఘా [2]ధర్మసుతురక్ష కరుగుము నీవున్.

21. క. విను సింధురాజవధయును
మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా
వున నే నొకపని నీ వొక
పని [1]మేకొని [2]చేయు టరయఁ బాడియ కాదే.

22. ఆ. [1]పను నిలిచినట్లు కా నూఱడిల్లు నీ
వున్న నన్నరేశ్వరోత్తముండు
[2]నిర్భరుండ వగుము నీవు నా దెస నాకు
హరి గలండు గలఁడె యచట నితఁడు.

23. వ. ఎల్లభంగుల [1]రాజరక్షణార్థంబుగా నీకుం బో వలయును బరాక్రమధుర్యుం
డగు నాచార్యుప్రతిన యెఱుంగవే యనుటయు నట్లకాక యని యతండు
ధర్మనందను పాలికిం జనియె నజ్జనపాథుండు సమరోత్సాహసముజ్జ్వలుం
డయి వచ్చి నిజ సైన్యంబు [2]నలంకరించి చిహ్నంబులు [3]మెఱయ నెఱయం
బొలిచి నిలిచె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

---

20. 1. నే - పెక్కు ప్రతులు. 2. ధర్మజుని - ఊ.

21. 1.చేకొని - వ; మైకొని - కొన్ని ప్రతులు. 2. చేయు దరయ - కొన్ని ప్రతులు.

22. 1. భీముడును గవలునుం గూడి పేర్మితోడ హత్తు కొని నీవు నున్ననరోత్తముండు - న. 2. నిర్భయుండ - కొన్ని ప్రతులు.

23. 1. చతురంగబలసమేతంబుగా నీవు - న. 2. నలంకరింపుచు - న. ర. వ. పీ.
3. మెరయం బొలిచి - కొన్ని ప్రతులు.

24. సీ. పుత్రశోకానలంబును గ్రోధవహ్నియు మనమున ముప్పిరి గొనఁగ మృత్యు
భంగి [1]నేతెంచు బీభత్సునిఁ గౌరవుల్ సెనకఁ[2]జాలర యేమి చేటు మూఁడె
నో పురిలో నొక్కయుమ్మడి నిఁటింట నార్తనాదములు [3]పెక్కయ్యె నెల్ల
రవముల మిగిలి సైంధవు నింటి దిక్కున నాక్రందనధ్వను లతిశయిల్లె

తే. నేను [4]ద్రోణుండు భీష్ముండుఁ బూని చెప్ప
శౌరిమాటలు మీరాజు సరకుగొనఁడ
సంధి గానీక కర్ణుండు సౌబలుండు
దుస్ససేనుండు నందఱుఁ ద్రుంచికొనిరి.

25. ఉ. ఎక్కటి [1]పోరె రుద్రునకు నేమిటఁ దక్కువ ఫల్గునుండు వాఁ
డొక్కఁడ [2]యయ్యెనే జగము లొక్కట [3]మ్రింగఁగఁ జాలు కేశవుం
డెక్కినవాఁడు వాని నొగ లేల చలం బని యెంత సెప్పినం
[4]దక్కఁడు రాజ్యలోభము మదంబున నాకొడు కేమి [5]సేయుదున్.

26. వ. అది యట్లుండె.

27. తే. క్రీడి యమ్మెయి వచ్చినఁ గూడఁ బాటి
[1]యెడలు గలఁగంగఁ గొంచపు లేమి సేసి
[2]రది యెఱుఁగంగఁ జెప్పవే యనఘ నీతి
యయ్యె నేమి దా [3]దుర్ణయ మయ్యె నేమి.

28. వ. అనుటయు నాసూతనందనుం డంబికానందనున కి ట్లనియె.

29. సీ. [1]అధిప [2]చెప్పెద నీకు నంతయు నిర్విలాపము గతజలసేతుబంధనంబు
మాయజూదము మున్న మాన్పవ పదపడి సంధి గావింపవ సకలజనులు

---

24. 1. దోతెంచు - ఝ. డ. వ. 2. జాలిరె - కొన్ని ప్రతులు. 3. పెల్లయ్యె - గ. 4. విదురుండు - ఉ.

25. 1. పోతె - క. న. ప. శ. సూ. 2. యయ్యనీ - కొన్ని ప్రతులు. 3. గెల్వగ - ఊ. ఏ. న. బ. 4. దక్కెడు - సూ. 5. చెప్పుదున్ - న.

27. 1. యెడద - వ. స. 2. రట. - ణ. స; రదియ నెరుగంగ - హ. 3. దుర్నీతి - యయ్యె - పెక్కు ప్రతులు.

29. 1. అనఘ - అ. త. 2. నే చెప్పెద, నంతయు - ల; చెప్పెద విను మంతయు - కొన్ని ప్రతులు.

[3]నిను లుబ్ధుఁడు నధ[4]ర్మనిరతుండు నని దూఱుదురు దూఱ కే
లుండుదురు నరేంద్ర
పాండుఁడవ్విధమునఁ బాలించె రాజ్యంబు పాండవు లెక్కుడు [5]ప్రబ్బి యశము

తే. లాభమును భరతాన్వయోల్లాస మెసఁగఁ
దగ [6]నొనర్చిరి వారలఁ దగునె వారి
తండ్రి[7]పాలై నసిరి [8]వాపఁ దనయుమీఁద
బెట్టె [9]దేల నీదుర్నీతి [10]ముట్టవచ్చె.

30. ఉ. కౌరవు లేమి సేయుదురు గాండివఘోషముఁ బాంచజన్యతీ
వ్రారవమున్ సహింప దివిజావలి[1]కిన్ వశమే వియచ్చరుల్.
పేరుకొనంగ నాధృతకపిధ్వజ మైనరథంబుతోడనుం
బోరిరి [2]పోరుభంగి విను భూవర శోకము దక్కి ధీరతన్.

31. వ. అని పలికి యిట్లనియె నారేపకడ గురుండు సంగరోత్సాహదీప్తుం డయి వెడలి శంఖంబు పూరించి సైన్యంబులోనం గలయ మెలంగు నప్పుడు మన యోధు లాయుధంబు [1]లంకించుచు నొండొరులతోడ [2]బిరుదులు వలుకుచు నిది యేమి యర్జునుండు [3]దడసె గోవిందుండు దఱిమికొన రాఁడు భీమసేనుండు గడంగి పొడసూపం డనుచు సింహనాదశంఖరవజ్యాఘోషంబులు సెలంగం బొంగుచున్న సమయంబున నా కుంభసంభవుండు సైంధవుం గనుంగొని నీవును భూరిశ్రవుండును గర్ణుండును శల్యుండును నశ్వత్థామయు వృషసేనుండును గృపాచార్యుఁడునుం గూడుకొని [4]యుండుండు మన బలంబులలో మేలేటి పదునాలుగువే లేనుంగులను నఱువది[5]వేలు రథంబు

---

3. నిన్ను లుబ్ధు డధర్మనిర - పెక్కు ప్రతులు. 4. ధర్మినీచవాదని - కొన్ని ప్రతులు; ధర్మినీచువాడు - ర; ధర్మినీచుడంచును ట; ధర్మనిరతాత్ము డని - ఆ. ఇ. గ. జ. బ. 5. ప్రజ్ఞ-హ. 6. నొనర్చిన - సూ. 7. పాలిక సిరి వాప - వ. 8. వాపి - కొన్ని ప్రతులు. 9. దిక్లేల దుర్నీతి - ఔ. ణ; దిపుదేల-వ; దేటికి- ఆ. ట. బ. వ. 10. ముట్టె వచ్చి - ఖ. గ. వ.

30. 1. కేని వశంబె దేవతల్ - ఊ. ఎ. ఏ. 2. వారిభంగి - ర. వ. హ.

31. 1. లమర్చుచు - ల. వ. 2. బీరంబులు - ఊ. ఏ. 3. నుం దడసి - హ. 4. యుండెడు బలంబులలో - హ; యుండుండు బలంబులలో - కొన్ని ప్రతులు. 5. వేల - కొన్ని ప్రతులు.

లను లక్షగుఱ్ఱంబులను బదిలక్షలు పదాతులను గైకొనుండు గా తీర్పు మోహరంబు[7]నకు యోజనత్రయ మాత్ర ప్రదేశంబునం బిఱిఁది దెస బలసి నిలువుం [8]డగ్లైన నిన్ను దేవతలకుం దేఱిచూడ రాదు పాండవు లెంతటివా రనిన విని [9]యతండు పెద్దయు నూఱడిల్లి యారథికవరులు పరివేష్టింప నరిగె భారద్వాజుండును ద్వాదశగవ్యూతిదీర్ఘంబును [10]బంచగవ్యూతి[11]విస్తృతంబును గా శకటవ్యూహంబు [12]సమకట్టి దానికిఁ [13]బశ్చిమార్ధంబున గర్భవ్యూహంబుగాఁ బద్మవ్యూహంబు వన్నించి తన్మధ్యంబు మొదలుకొని [14]యోలిన సేనాముఖంబు దెసకుం [15]జాలి సిగుడునట్లుగా సూచీవ్యూహంబు గావించి సూచీముఖంబునం గృతవర్మయు [16]నట పిఱుందం గాంభోజ రాజును మఱియుఁ [17]బిఱుసన నాప్తులైన శతసహస్రయోధుల మున్నిడికొని కురురాజును సూచీమూలస్థానంబునఁ బూర్వోక్త ప్రకారంబున నాజయద్రథుండును నిలుచునట్లుగా నొనర్చిన నమ్మహావ్యూహంబు వేడుకం జూచి ఖేచరు[18]లు మెచ్చి రట్టియెడ.

-: ద్రోణుని నాలవనాఁటి యుద్ధము :-

సం 7_63_28

32. క. మొనలోన నిలువ నొల్లక
తనచతురంగములతో నుదగ్రుం డై య
ర్జును నాఁగుదు నే[1]నొకఁడన
యని దుర్మర్షణుఁడు పనియె నార్పులు [2]నిగుడన్.

33. వ. చని యయ్యోధనంబునకు [1]వేయు నేనూఱు విండ్లపెట్టుదవ్వున ముందటం బన్నె దుశ్శాసనవికర్ణులు సింధురాజ[2]రక్షణకార్యార్థు లై నిజబలంబులతో

6. కొని యుండుండు - ఓ. ఔ. ణ. 7. నందు - కొన్ని ప్రతులు. 8. డని నియమించి యగ్లైన - ఆ. జ. ట. వ. 9. సైంధవుండు - ద. ప. వ. 10. వెనుకం బంచ - కొన్ని ప్రతులు. 11. విస్తీర్ణంబు - ఊ. ఏ. హ. 12. సంఘటించి - గ. జ. 13. బశ్చార్ధంబున - పెక్కు ప్రతులు. 14. యోలిన - పెక్కు ప్రతులలో లేదు. 15. జాల - కొన్ని ప్రతులు. 16. నతని - కొన్ని ప్రతులు. 17. బిరిం దెస - అ. ఆ. ఇ; బిరుందు - కొన్ని ప్రతులు. 18. లగ్గించి రట్టి - గ. వ.

32. 1. నొకరుడ నని - హ; నొక్కఁడ నని దుర్మ-ఆ. వ. 2. నెలగన్ - కొన్ని ప్రతులు.

33. 1. వెయ్యిన్నేనూరు - కొన్ని ప్రతులు. 2. రక్షణ - పెక్కు ప్రతులలో లేదు.

నమ్మెయి నచ్చేరువకుం బోయి సన్నద్ధులై రి ద్రోణాచార్యుం డభేద్యం బగు నాశకటవ్యూహంబుముఖంబున నిలిచి ధవళ[3]వస్త్రంబులు [4]సితోష్ణీషంబును శ్వేతవర్మంబును నరుణాశ్వంబులును వేదికాధ్వజంబును [5]వెలయ నుద్దండ కోదండుం డై దండధరు కై వడిం బొలిచె [6]నట్లు కుంభసంభవసంరక్షితం బయిన యా సైన్యంబు [7]సాగరగిరిగహనసహితంబుగా మహియెల్ల మ్రింగ నప్పళించున ట్లున్నం గనుంగొని కౌరవులును గురుపతియును బ్రముదిత హృదయు లై రాసమయంబున.

34\. క. చూపులు మిఱు[1]మిట్లు గొనఁగ
నేపారిన వానరేంద్రు నెసకంబున ను
ద్దీపిత మగుపడగ భయద
రూపంబునఁ గ్రాలఁగా [2]నరుఁడు దోఁతెంచెన్.

35\. సీ. అమ్మహావీరున కనతిదూరంబున బిరుదుమూఁకల నడ[1]పించి ద్రుపద
సూతియు నకులునిసుతుఁడు శతానీకుఁడును మొగ్గరం బమర్చిన మృదంగ
శంఖభేరీధ్వానసంగమమేదురసింహనాదంబులు సెలఁగ నొప్పె
[2]నప్పార్థుఁ డొడ్డరయం బెట్టుకొలఁది నబ్బలముముందటఁ దేరు నిలిపి యొత్తు

తే. దేవదత్తంబురవముతోఁ దీవ్రపాంచ
జన్యనినదంబు [3]ఘూర్ణనిస్వనయుతముగ
నిగుడు వానరరావంబు నింగిముట్టె
నపుడు మన సేన బెగ్గల మగ్గలించె.

---

3\. వసనంబులు – పెక్కు ప్రతులు. 4. శ్వేతోష్ణీ – వీ. శ. మ. 5. మెరయ – పెక్కు ప్రతులు. 6. చినిలిచె నట్లు – కొన్ని ప్రతులు. 7. సాగరంబు మహియెల్ల నప్పళించు – హ.

34\. 1. మిట్టులు గొన నేపారిన – అ. ఖ. వ. 2. నరుండును దోచెన్ – న. వ. హ.

35\. 1. పించు – కొన్ని ప్రతులు; పించె – ఈ. ఘ. వ. 2. నప్పార్థుడును గృష్ణునను మతి తోడ నబ్బల – ట; నట్లు పార్థుండు దానంప వేటు కొలంది బలము – ఠ; న ప్పార్థు డొండొండ నంప వేటు కొల్లంది బల – వ; నప్పార్థు డొడ్డనయమ్ము పెట్టు కొలంది బల – హ. 3. ఘూర్ణ – కొన్ని ప్రతులు.

36. ఆ. మొరప వానపెల్లు గురిసె నుల్కాతతి
[1]డొల్లెఁ బడియెఁ బిడుగులెల్ల [2]కడల
నస్మదీయబలమునందుఁ బదంపడి
యధిప తూర్యనినద మతిశయిల్లె.

37. వ. అయ్యవసరంబున నీ యోధు లొండొరులం [1]బిలిచికొని పురికొలిపికొనుచు
సింహనాదంబులతోడం జెలంగి రంత.

38. క. చెలియలికట్ట సముద్రము
నిలిపినక్రియ సేన పార్థు నిలిపెద ననుచుం
దల [1]మిగిలి వెడలె మొనకును
బలువిడి దుర్మర్షణుండు పార్థివముఖ్యా.

39. క. కని విజయుఁ డలరి హరి కి
ట్లను సేనికగముల తోడ నడరెడుఁ [1]గడఁకన్
మును దుర్మర్షణుఁ డిదె యిం
దు నడపు [2]మరదంబు వీఁడు దొలుముద్ద యగున్.

40. ఆ. అనిన నట్ల చేసె నతఁ డాధనంజయుఁ
డగ్గజేంద్రరాజి నస్త్రసమితిఁ
బొదివెఁ గారుమొగులు భూధరనికరంబు
బహులవృష్టిఁ గప్పుభంగిఁ దోఁప.

41. క. ఒక్కఁ డని కడఁగి రథికులు
పెక్కండ్రు నిశాతవిశిఖభీమాకృతిఁ బే
[1]రుక్కునఁ బొదివిరి నరు నతఁ
డెక్కుడుమద [2]మొలయఁ జేతి యేత్తెఱ నూఁపెన్.

---

36. 1. డుల్లె - కొన్ని ప్రతులు. 2. యెడల - పెక్కు ప్రతులు.

37. 1. బిలిచి కొని - పెక్కు ప్రతులలో లేదు.

38. 1. మిగిలెం దన మొన - కొన్ని ప్రతులు.

39. 1. జెలుచన్ - కొన్ని ప్రతులు. 2. మన రథము - అ. హ.

41. 1. రుక్కున నాతని బొదివిరి యెక్కుడు - హ. 2. మలర - అ. ఈ.

42. వ. [1]అప్పుడు.

43. క. [1]పలుతలలు ముఖ[2]వికాసము
వోలియక పడి యున్నసమరభూభాగము పె
[3]ల్లలరిన తామరకొలనిం
దలఁపించెన్ గగనచరవితతి [4]పులకింపన్.

44. తే. తొడవు [1]లొప్పార నెత్తుటఁ దోఁగి పెక్కు
గజము [2]లొక్కయెడన పడి కరము వొలిచె
జంట మెఱుఁగులతో నెఱసంజకెంపు
గదురఁ జెలువొందు [3]మొగిళులగమియుఁ బోలె.

45. వ. ఇట్లు గనుపుకొట్టుకవ్వడికి నోహటింపక నీసైనికులు పైపయిం గ్రమ్మి వివిధాస్త్రశస్త్రంబు లతనిపైఁ గురియ నతండు హస్తిహస్తంబుల నశ్వ[2]శరీరంబుల రథికసారథిరథావయవంబులఁ బదాతిగాత్రఖండంబులం బ్రధనభూమిం గప్పె నట్టియెడ మఱియును[3].

46. క. [1]పార్థుఁడు వేఁడీ [2]పొదువుడుఁ
బార్థుఁడ యెట వోయె దింకఁ బార్థుఁడ [3]రావే
[4]పార్థుఁడ యిక్కడ నెన్వయుము
పార్థునిఁ [5]బట్టుఁ డను[6]నులివు [7]బహుళం బయ్యెన్.

---

42. 1. అప్పుడు – కొన్ని ప్రతులలో లేదు.

43. 1. పదు తలలు – ఈ. హా(లడ ప్రాసమైత్రి) 2. విలాసము – ఔ. చ. త. ఠి. ల్లడ రిన – వ. 4 తిలకింపన్ – హా; పరికింపన్ – ఐ.

44. 1. లొప్పారి – కొన్ని ప్రతులు; లొప్పారె – కొన్ని ప్రతులు. 2. లొక్కెడ బడి యున్న కరము – కొన్ని ప్రతులు; లొక్కొక్క యెడ బడి కరము – ల. హా. 3. మేఘసంఘములు వోలె – హా.

45. 1. కెంపుమై గ్రమ్మి – ఓ. ర. వీ. శ. ష. 2. శిరంబుల – ఆ. ఐ. చ. ప. వ. శ. 3. గ. జ. బ. ప్రతులలో ఈ వచనము తరువాత 47 వ వచనము కలదు.

46. 1. పార్థుండు వెండి పొదు – కొన్ని ప్రతులు; పార్థుండు వీడె – శ; పార్థుండు వాడె– ఞ; పార్థుండితనిం – చ. 2. పొదువుడు – సం. 3. రారా – ఎ. ఫ. వ. 4. పార్థుని నొక్కట దునిమెద – ఉ. త; పార్థుడ నిలువుము తునిమెద – ఖ. చ. వ. వీ. శ. ష. వ; పార్థుడ యిక్కడ దునిమెద – ర. స. 5. బొదువు – కొన్ని ప్రతులు; వ్రే(వే)యుడను – కొన్ని ప్రతులు. 6. నెలుగు – కొన్ని ప్రతులు. 7. ప్రబలం – వ.

47. వ. ఇవ్విధంబున సంకు[1]లసమరంబుగాఁ బెక్కు లట్టి లాడ నమ్మోహరంబు [2]వోక పెనంగిన.

48. సీ. అలిగినగాండీవి[1]యమ్ము లొక్కుమ్మడి ముందటిదెసను బిఱిఁది[2]వలన
వలపట దాపట నెలలు పెక్కనిసినతెఱఁగునఁ గవిసిన విఱుగు [3]విల్లుఁ
దునియు[4]ఖడ్గంబును దొరఁగు[5]నెత్తురు మ్రొగ్గు నేనుంగుఁ బడుకాలు
మానిసియును
డొల్లు గుఱ్ఱంబును ద్రెళ్లు తేరును గూలురథికుండు నొఱగుసారథియు నైన

తే. మరలె దుర్మర్షణుఁడు దోన తెరలె సేన
యపుడు సమ్మెటకోలల [6]సంకుశములఁ
[7]జేలుకోలల[8] వ్రేటుల నీఱుతాఱు
యదలుపుల వాహనంబులు సెదరి పఱచె.

49. క. అనుటయు ధృతరాష్ట్రుం డి
ట్లను సూతతనూజుతోడ నప్పుడు నరు మూ
ర్కొన నెవ్వఁడేనిఁ గలిగెనొ
చనిరో యందఱును ద్రోణు[1]జంటకు భీతిన్.

50. ఉ. నావుడు నాతఁ [1]డమ్మనుజనాథున కిట్లను నట్టిచోట దం
తావళరాజి మున్నుగ నుదాత్తగుణస్వనఘంటికామహా
రావము లుల్లసిల్ల సమరప్రియుఁ ఖాండవసింహుఁ దాఁకి య
స్త్రావళిఁ గప్పె దీప్తముఖుఁ డై యువరాజు మహోద్భుతంబుగన్.

---

47. 1. లంబుగా బెక్కు - కొన్ని ప్రతులు. 2. లొక్కమొగిన వోక. ఎ. ఏ. ఐ.

48. 1. యలుగులో - హ. 2. దెసను - ఐ. 3. విండ్లు - ఉ. జ. హ. 4. కాండంబు - బ. హ. 5. సిడంబును - వ. 6. యంకు - ప్రౌ. శర. సం. 7. నద లలువు వాహనంబులు చెదరి పరచె చేరుకోలల పదఘాతచేష్టితముల - జ. బ; చేరు కోలల - సం. 8. పదఘాతచేష్టితముల - ట. వ; జల్లుల - ర; దిట్టుల - కొన్ని ప్రతులు; వ్రేటుల యీఱు తాఱు - శర.

49. 1. చట్టకు - ఎ; చాటుకు - ఖ. చ. జ. వ. శ; చక్కకి - ద. ర. హ; సరసకు - ప. ఝ.

50. 1. డాథరణి - ఈ. ఒ. ణ. స.

51. వ. ఇట్లు దుశ్శాసనుండు దలపడినం గ్రోధావేశంబునం బెలుచ నవ్వి కవ్వడి దేవదత్తం బొత్తి గాండీవజ్యానినాదంబు రోదసీకుహరంబున మేదురంబుగాఁ జిత్రంబు లగురథయాతాయాతంబులనుం బటుబాణ[1]పాతంబులను నగ్గజంబులు వెగడుపడి పంకనిమగ్నంబు[2]లుం బోలె నిశ్చేష్టితంబులుగాఁ దదారోహకులతలలు డొల్లుచప్పుళ్లు మహావాతపతితంబు లగుతాళఫలంబుల రవంబు ననుకరింప మఱియును గరవాలగదాధనుస్సాయకసహితంబు లగు బాహువులు బహువిధమహానాగంబులభంగి రణభూమి నభిరామ[3]ఘోరంబుగా ననేకప్రకారక్రూరశరంబులు దాఁకి తునియురూపును రుధిరంబు దొరఁగురూపును [4]నొఱలురూపును [5]ద్రుళ్లి కెడయురూపును దూఁగురూపును బడి పొరలురూపును నెత్తురు గ్రక్కురూపును [6]జిక్కురూపును [7]రూపుసెడురూపును నై కరితురగనరనికరంబులు వికలంబులుగా విజృంభించిన నతనిసంరంభంబు [8]సైరింపం జాలక సబలంబుగా నయ్యువరాజు వాఱిన వెనుకొని యప్పాండవమధ్యముండు.

52. చ. నిలు నిలు మెండుఁ బోఁ [1]గలవు నీ విటు వాఱినఁ జావు దప్పునే
యలవుఁ జలంబుఁ బోవిడిచి యాసభ నించుక శంక లేక నీ
పలికిన[2]యన్నియుఁ మఱచి భంగపుఁ [3]జచ్చుట దెచ్చికొంటి వె
ద్దలు వగఁ బొంద నన్నకును దమ్ములకుం దలవంపుగా నిసీ.

53. వ. అని [1]పలుకుచు నీకొడుకు వెడతలయు వెన్నును బడితూపుల నేపారి [2]యేసిన నతండు మరలియుం జూడక ద్రోణాచార్యుం జూచుచుం జూచె బీభత్సుండును సైంధవు[3]నిదెసకు మనసు నిగుడ మనమొన[4]పయి నడచి

---

51. వ్రాతం – అ. గ. ట. బ. 2. లగు గోవులుంబోలె – న. ర. 3. భీమంబు – ఎ. 4. నొరగు – కొన్ని ప్రతులు. 5. ద్రెళ్లి – కొన్ని ప్రతులు. 6. జిక్కురూపును – పెక్కు ప్రతులలో లేదు. 7. సెడురూపు – కొన్ని ప్రతులు. 8. సహింప – కొన్ని ప్రతులు.

52. 1. గలదు – కొన్ని ప్రతులు; గిలవు నీ కిటు – కొన్ని ప్రతులు. 2. వన్నియున్ – కొన్ని ప్రతులు. 3. జావిటు – ఇ. ఔ. వ.

53. 1. పలికిపి – కొన్ని ప్రతులు. 2. యేయనతండు – కొన్ని ప్రతులు. 3. దున్న – హ; దెసకు – పెక్కు ప్రతులు. 4. కై నడచి – పెక్కు ప్రతులు.

యగ్రభాగంబున నున్నయగ్గురుం గనుంగొని యనతిదూరంబున నిలిచి నమస్కరించి కృష్ణుం డనుమతి సేయ జేతులు [5]మొగిచి యి ట్లనియె.

-: అర్జునుఁడు ద్రోణునిచే ననుజ్ఞాతుఁ డై మొగ్గరంబు సొచ్చుట :-

సం. 7-66-1

54. ఉ. మేలు దలంపు శోభనము మేకొని [1]చేయుము నాకుఁ బాండుభూ
పాలుని ధర్మనందనుని పంకజనాభునియట్ల కావె మ
త్పాలనవృత్తి [2]కీవు నినుఁ బ్రార్థన సేసి భవత్ప్రసాదలీ
లాలసి[3]తుండ నై మొన దలం[4]కఁగఁ జొచ్చెద భూసురోత్తమా

55. క. నను నశ్వత్థామను నీ
వనఘా సరికూర్మిఁ బెనిచి తల్లగుటను ద్రో
[1]హిని సైంధవుఁ జంపఁగఁ బూ
నిన నాయుచితప్రతిజ్ఞ నెఱపుము [2]కరుణన్.

56. తే. [1]అనుఁడు బిన్నన వ్వొలయఁగ నస్త్రగురుఁడు
నరునిపైఁ జూడ్కి [2]నాటించి నన్ను గెలువ
కెట్లు సైంధవుఁ [3]జేరెదం చేసె రథ్య
ములును [4]హరియును నతఁడు నమ్మొల మునుంగ.

57. వ. ఇత్తెఱంగున సేయుటయు నని సేయుటకై [1] యమ్మహా[3]త్మునకు విజ్ఞాపనంబు సేసి.

---

5. మొగిడ్చి - కొన్ని ప్రతులు.

54. 1. పల్కుము - కొన్ని ప్రతులు. 2. నీవు - కొన్ని ప్రతులు. 3. తోక్తి నీమొన - ణ. 4. కకచొచ్చెద - పెక్కు ప్రతులు.

55. 1. హాని - పెక్కు ప్రతులు. 2. కణకన్ - వ.

56. 1. అనిన చిరునవ్వు వొలయ - ణ. వ. 2. నిగుడించి - ఐ. 3. జంపెదం - ణ. 4. రథియును - వ.

57. 1. కునై - కొన్ని ప్రతులు; కైనడచి యమ్మహా - ఓ.

58. క. అనుమతుఁ డై విజ[1]యుం డా
తనిమీఁద నిశాతవిశిఖతతి నఱపి రయం
బున నవనారాచము లే
సి[2]న నడుమన నఱకె [3]నతఁడు శీఘ్రత మెఱయన్.

59. తే. నఱికి తోడన హరిమేను నరుని యొడలు
[1]నేయ గురువిల్లు [2]విఱుగంగ నేయఁ దలఁచె
నక్కిరీటి యాలోనన యతనిమౌర్వి
వికల[3]ముగఁ [4]జేసె నాధనుర్వేద[5]విదుఁడు.

60. క. రహితగుణచాపుఁ డగున
య్యహితాంతకుఁ బొదివెఁ గేశవాశ్వపతాకా
సహితంబుగ రుచిరస్మిత
మహి[1]తుఁ డగుచు నగ్గురుండు మార్గణవితతిన్.

61. వ. ఇవ్విధంబున గుంభసంభవుండు విజృంభించిన వివ్వచ్చుం డలిగి సజ్యశరా
సనుం డై యా[1]ధనురాచార్యుం బటు[2]బాణవిసర వేగంబున నతిక్రమించి
కెలంకుల బలంబుల నాక్రమించిన.

62. సీ. కులిశంబు తాఁకునఁ గూలినకులపర్వతంబుల[1]కరణి మత్తద్విపములు
బలుగాలిఁ దూలిన జలధరపంక్తులచాడ్పున నుద్భటస్యందనములుఁ
గీలుకాఁ[2] డెడలింపఁ గెడసిన బొమ్మలకై వడిఁ [3]బటుతురంగవ్రజంబు
[4]బెడితంపు[5]వట్టోడిఁ బడిన పేరడవిచందంబున బహులపదాతిచయము

---

58. 1. యుడు నాతని — పెక్కు ప్రతులు. 2. ననరి కె నతండు గినిసి శీ — బ; ననునడుమ నరకె — ల. 2. గురుడు — గ. వ.

59. 1. నేయు — కొన్ని ప్రతులు. 2 దునియంగ — పెక్కు ప్రతులు. 3. లగా జేసె — కొన్ని ప్రతులు 4. నేసె — పెక్కు ప్రతులు. 5. గురుడు — ద.

60. 1. తుండగునగ్గు — కొన్ని ప్రతులు.

61. 1. శరాసనాచార్యుం — పెక్కు ప్రతులు. 2. నారాచపరంపరావేగం — వ.

62. 1. మాడ్కి — ఎ. ఏ. ఐ. 2. కాలెడలిన కెడ — న. వ. 3. పడు — పెక్కు ప్రతులు. 4. బలితంపు — ఇ. 5. వట్టొడ్డి — వీ. ష. హా. ల; దవవహ్ని — న; దావాగ్ని — వ; గాలిచే — ఔ; వడోతోడ — జ.

తే. వికీ[6]టముగఁ ద్రెళ్లె నలుగడ విచ్చె నొక్క-
పెట్ట వెస డొల్లె [7]నిలఁ జాఁపకట్టు పడియెఁ
జండగాండీవ[8]నిర్ముక్తశాత[9]వివిధ
కాండదారుణ[10]ప్రహతులఁ గౌరవేంద్ర.

63. ఆ. అడ్డపడి గురుండు దొడ్డనారసము వ
త్తుంబు దూఱ నేయ సవ్యసాచి
యొల్లఁ బోయి తెలి[1]సి వెల్లెసె నక్కుంభ
జన్మమీఁద నిశిత[2]సాయకములు.

64. వ. [1]అతండును.

65. క. హరి [1]నైదువిశిఖముల న
న్నరు డెబ్బదిమూఁట [2]గేతనము మూఁటను స
త్వరుఁడై [3]యేయుచు శితశర
పరంపరలు తద్రథంబుపైఁ [4]బరగించెన్.

66. క. కరములు నిగుడఁగ నొప్పెడు
తరణిఁ బోదువ వర్షదంబుదము క్రియ నట్లా
స్ఫురితాస్త్రుఁ బార్థు నత్యు
ద్ధురబాణసమగ్రుఁ డై నద్రోణుఁడు వొదివెన్.

67. వ. పొదివిన[1]యగ్గురుప్రాపున భవదీయసైనికులు గొంద ఱాకృష్ణులం జేరి
పరాక్రమించుట గుండ్లు దేలి బెండ్లు [2]మునింగిన ట్లయ్యె నిబ్భంగి నక్కిరీటి

---

6. లముగ - ద. ప. వ. 7. వడిజాప - ఖ. చ. వ. హ. 8. ముక్తనిశాత - ఊ. ఎ. ఏ. 9. విశిఖ - ఊ. ఏ. ల. 10. ప్రతతు - ఈ. ఉ. ఔ. క. ణ. య. ళ.

63. 1. సియుక్కున గురుమీద నిశితసాయకములు నినిచె నతడు - ఐ. 2. శరచయములు - ఇ. ఎ. ఐ.

64. 1. ఈవచనము కొన్ని ప్రతులలో లేదు.

65. 1. నేడు విశిఖ - ద. ప. వ. 2. హరుల నాల్గింటను - బ. య; హరుల నారింటను - గ. జ. బ. 3. యేసి నిబిడశర - కొన్ని ప్రతులు; యేసి నిశిత - యే. ర. ల. 4. దొరగించెన్ - పెక్కు ప్రతులు; గుదియించెన్ - వ.

67. 1. నగ్గురు - పెక్కు ప్రతులు. 2. మునుంగునట్లయ్యె - కొన్ని ప్రతులు.

[3]కుమారుం డయ్యును వృద్ధుం డగు [4]కలశభవునిం [5]గడవం జాలక [6]చిక్కు-
వడి యున్నం జూచి విచారించి యచ్యుతుం డతని కి ట్లనియె.

68. క. రి త్త దడవు గా కుండఁగ
ని త్తఱి నాచార్యుతోడి యీ పుడిగి వేసం
జొ త్తము శకటవ్యూహము
చి త్తంబున నొండుదలఁపు సేర్పకు మింకన్.

–: అర్జునుఁడు ద్రోణాచార్యుల నతిక్రమించి కురుసైన్యంబు సొచ్చుట :–

సం. 7_66_30

69. చ. అనవుడుఁ గ్రీడి నీదుహృదయంబున నెయ్యది దోఁచెఁ గృష్ణ దా
నిన తగఁ జేయువాఁడ నని నెమ్మిగఁ బల్కినఁ బ్రీతిఁ గుంభజు
న్మనకుఁ బ్రదక్షిణంబుగ సముద్ధతి నాతఁడు దేరు వోవని
చ్చిన శరజాల[1]ముల్ వరగఁ జేయుచుఁ బార్థుఁడు వోవుచుండఁగన్.

70. వ. క్రమ్మంగొని నవ్వుచు భారద్వాజుండు.

71. క. కలవే యెందును నిట్టివి
బలసూదనతనయ [1]పగఱఁ బరిమార్పక వి
చ్చలవిడిఁ [2]బ్రతిష్ఠితుఁ డవుగఁ
దలఁచెదు పోలునొకో యనుచుఁ [3]దగిలెఁ బిఱుందన్.

72. వ. ధనంజయుండును.

73. క. గురుఁడవు గాక పగతుఁడవె
దురమునఁ గుపితుఁ డగుని న్నెదుర్కొన నా కొ

3. కుమారుం – పెక్కు ప్రతులు; గుమారుం – వా. 4. నగ్గురుం – కొన్ని ప్రతులు.
5. మిగులం – కొన్ని ప్రతులు. 6. రిచ్చపడి – ఒ.

69. 1. ముంబరగ – పెక్కు ప్రతులు; ముల్పరప – చ.

71. 1. నన్నుబరి – వ. 2. నమ్మెయి బ్రోవం – న. 3. దర మెం బెలుచన్–ఇ. ఓ. త. ర;
దగిలెం బెలుచన్ – మ. య.

క్కరునకు శక్యమె [1]యాపుర
హరున కగుం గాక యనుచు నరుగుచునుండెన్.

74. వ. ఇవ్విధంబున సైన్యంబు సొచ్చి[1]నాసవ్యసాచిచక్రరక్షకు లగు పాంచాల కుమారులు యుధామన్యుండును నుత్తమౌజుండును దోడన [2]వచ్చి చొచ్చి రప్పుడు కృతవర్మయుం గాంభోజుండును శ్రుతాయువుం దనతోను [3]యున్న చోట్లన యుండి తల యెత్తి చూచి కపిధ్వజవేదికాకేతనంబులకతంబునఁ గవ్వడివెనుకం గలశభవురాకయుం గని యుత్సాహంబు మిగిలి తగులు వడ నడ్డపడుటకు నప్ప[4]ళించుచుండ నప్పు డప్పాండవవీరునిం గేకయ ప్రభద్ర[5]కనారాయణగోపాలప్రభృతులు వోదెవి రెవ్వ రెట్లు వోదివినం బ్రతిజ్ఞాతత్పరుం డగునన్నరుండు సామజంబు సరోవరంబు దఱి[6]యం జొచ్చు తెఱంగున నబ్బలప్రకరంబు బడలువడం జేయుచుం [7]బోవం బోవ.

75. క. కదిసి శరాసనగురుఁ డిరు
వదియేనుశరంబు [1]లేయఁ బార్థుఁడు వానిం
గుదియించి విశా[2]లాస్త్ర
ప్రద[3]రము లడరింపఁ గుంభభవుఁ డెడఁ ద్రుంచెన్.

76. క. విజయుం డను[1]శైలము గల
శజధారాధరము గప్పె శరవృష్టి మహా
ద్విజు నతఁ డేయక కడున
క్కజముగ నయ్యుంప[2]సోన గ్రక్కున మాన్పెన్.

---

73. 1. మార్గాన హరున - కొన్ని ప్రతులు; యాపురహరునకు గాకనుచు నెలమి నరుగుచు - కొన్ని ప్రతులు; యాపురహరునకు గాకనుచు నాత డరుగుచు - ఇ. ఎ. జొ. ణ. ల

74. 1. నా - పెక్కు ప్రతులలో లేదు. 2. వచ్చి - పెక్కు ప్రతులలో లేదు. 3. యున్న - కొన్ని ప్రతులలో లేదు. 4. ళింప నప్పాండవ - పెక్కు ప్రతులలో లేదు. 5. కప్రభృతులు - ద హ. 6. యుతెఱంగు - పెక్కు ప్రతులు. 7. బోదవం బోవ - వ.

75. 1. లే[illegible] వా[illegible]వి వానిన్ - కొన్ని ప్రతులు. 2. లోగ్ర - వ. 3. రంబులు వఱప - [illegible] ష.

76. 1. కొం[illegible]ను - ద. వ. 2. వాన - పెక్కు ప్రతులు.

77\. ఆ. మఱియు నిరువదేను మార్గణంబుల నరు
డెబ్బదింటఁ గృష్ణు నుబ్బి యేసి
గురుఁడు నారసములఁ గురియంగ నవి యాఁగ
నలవి గామి నతఁడు [1]నతఁడు నొచ్చి.

78\. వ. అమ్మేటివిలుకాని వంచించి కృతవర్మనిసైన్యంబు సొచ్చుటయు నగ్గురుండు [1]సేయునది లేక సేనాముఖరక్షణంబునకుం జనియె నప్పార్థు మార్కొని కృతవర్మ పదియమ్ము లేసిన నక్కిరీటి యొక్కవాల మ్మురమ్మున నాటించి మఱియును నారాచత్రయంబున [2]నొప్పించె నాభోజపతి యన్నరనారాయణులం గనుంగొని నవ్వుచు నిరువదేనేసితూపు లేపునం [3]బరగించిన ధనంజయుం డతని[4]ధనువు దునిమి యేకవింశతివిశిఖంబుల నొప్పించిన నొండు కోదండంబు గొని హార్దిక్యుండు బాణపంచకయుగంబు విశ్వచ్ఛువక్షుంబునఁ గ్రుచ్చె నవ్వీరుండును దదీయస్తనాంతరంబునఁ దొమ్మిదియంబకంబులు దూర్చె నప్పు డాసవ్యసాచిం జూచి యితండు [5]దవులు వడియె నిది గాదని తలంచి [6]దామోదరుండు.

79\. క. తడ వయ్యె [1]నితఁడు మన కె
క్కడి బంధుం డేల కృప దెగం [2]బాఱుము నా
వుడుఁ గి లెడ[3]పినజంత్రము
వడువునఁ బడ నేసె నతని వాసవి యధిపా.

80\. వ. ఇట్లు భోజపతిం గ్రూరనారాచంబుల మూర్ఛితుం జేసి.

81\. తే. [1]కడచి కాంభోజసైన్యంబు [2]గలఁగఁ బెలుచఁ
జొచ్చువివ్వచ్ఛు వెనుకన చొరక యుండ

---

77\. 1. హరియు – పీ. శ. ష. కొన్ని ప్రతులు.

78\. 1. నచటసేయు – వ. 2. నొంచె – కొన్ని ప్రతులు. 3. గేలించిన – జ. ట. వ. 4. మార్కొని ధనువు – ఊ. ఎ. ఏ. 5. దవులంబడియె – పెక్కు ప్రతులు. 6. నారాయణుండు – ఊ. ఏ.

79\. 1. మనకు నిత డెక్కడి – కొన్ని ప్రతులు. 2. జూడుము – ఉ. ఓ. శ. ణ. ల. 3. లిన– ఓ. య. వ.

81\. 1. కడగి – స. కొన్ని ప్రతులు. 2. గలచి పెలుచ – కొన్ని ప్రతులు.

మ:ట్టి యాఁగె నాకృతవర్మ మూర్ఛ దేఱి
వచ్చి రథచక్రరక్షకద్వయముఁ గడిమి.

82. వ. ఇవ్విధంబున నుత్తమౌజుని యుధామన్యుం బోనీక భోజపతి శరచతుష్టయం బును సాయక[1]త్రయంబును దనువులం గీలించిన నయ్యిరువురుం బదేసిబాణం బుల నతని నేసి తత్కోదండంబు [2]దుండంబులు సేసిన నతండు.

83. ఉ. వేఱొకవిల్లు పుచ్చుకొని విండులు రెండును ద్రుంచి మేనులం దూఱఁగ నేసె బెట్టిదపుఁదూపుల వారును వాని[1]యమ్ములన్ గీఱఁగ [2]నొండువిండ్లు గొని కిన్క యెలర్పఁగ నేసి [3]రెమ్మెయిం [4]దీఱద [5]గండి గాంచి నరు తేరుపథంబునఁ [6]బోవ వారికిన్.

–: అర్జునుఁడు శ్రుతాయుధప్రముఖమహారథికులం జంపుట :–

సం. 7–67–36

84. వ. అట్లు [1]చొచ్చువివ్వచ్చుం జూచి శ్రుతాయు[2]ధుం డనురాజు రథసంబున నెనెర్చి మార్గణత్రయంబున నేసి వాసుదేవునిపై సప్తతిప్రదరంబులు [3]నిగి డించి.

85. తే. వెడఁద[1]తూపునఁ గేతు[2]వు ద్రేయఁ గ్రీడి
నవతివిశిఖంబు లేయ నన్నరవరుండు
దెబ్బదే[3]నమ్ము లడరింప నుబ్బి విల్లు
ద్రుంచి యుర [4]మేడుశరముల నొంచె [5]నరుఁడు.

---

82. 1. త్రితయం – కొన్ని ప్రతులు. 2. ఖండంబులు – వ.

83. 1. యంగముల్ – ఈ. స; యెమ్ములన్ – ఆ. స. సూ. 2. రెండు – ట. ద. వ. వ. 3. రిమ్మె – పెక్కు ప్రతులు. 4. దీరమి – కొన్ని ప్రతులు; ధీరత – కొన్ని ప్రతులు. 5. సందు – ఆ. ఒ. 6. బోయి రేపునన్ – శర. కొన్ని ప్రతులు.

84. 1. సొచ్చిన – ఉ. ర. 2. వుండను – కొన్ని ప్రతులు. 3. పరగించి – ఈ. ఐ.

85. 1. యమ్మున – ఖ. శ. ష. 2. వేయుడును – కొన్ని ప్రతులు. 3. డమ్ముల – ఆ. క. త. వ. 4. మేను – హ. 5. నతడు – కొన్ని ప్రతులు.

86\. క. [1]కోపించి యాతఁ డొండొక
చాపము గొని [2]నవనిశాతసాయకములు బా
[3]హాపరితలముల నురమున
[4]నేపున నాటుటయుఁ [5]బార్థుఁ డెలన వ్వోలయన్.

87\. ఉ. సారథిఁ గూల్చి యశ్వములఁ జంపి తదంగములందు స ప్తతి
క్రూరశిలీ[illegible] లతిఘోరముగాఁ [1]దొరఁగింపఁ బ్రస్ఫుర
ద్భూరిగదాభిరాముఁ డయి దుర్దమలీల రథంబు డిగ్గి యా
ధీరగుణో త్తరుం డతని తేరి[2]దెసం గవిసెౘ [3]రయంబునన్.

88\. వ ఆరాజు [illegible] నియు నగ్గద వరుణువరంబున వచ్చిన దనియును
వరుణుం డతనికి దాని నిచ్చునప్పుడు దీని ధరించినవాఁడు రిపుల కజయ్యుం
డగుఁ [1]బోటెక్కించుకొననివానిమీఁదం బ్రయోగించిన వానిన మరలి వధి
యించు నని చెప్పె ననియును బెద్దలవలన వినుదుము.

89\. ఉ. కాలము [1]ప్రాప్తమైన మదిఁ గానఁడ యన్నియమంబు మేదినీ
పాలకుఁ డప్పు డ ట్లగుటఁ బంకజనాభుని పైచె నాతఁ డా
భీల[2]గదం ద[3]దంసమునఁ బెట్టిన నూతనపుష్పమాలయుం
బోలి వెలింగెఁ గాని యది భూవర నొంపద యించుకేనియున్.

90\. వ. ఇట్లు గోవిందునకుఁ గుసుమాభరణం బై పొలిచి [1]యాతుణంబ.

91\. ఆ. అశనికరణి వచ్చి యాశ్రుతాయు[1]ధుని పై
నమ్మహోజ్జ్వలాయుధమ్ము [2]వడిన

---

86\. 1. కోపమున నాత - ఊ. ప. ణ. 2. వడినిశాత - ఐ; నవతిశాత - ఈ. ఊ. ప. వ. 3. హాపరిఘచయము నరుపై నేపున - పెక్కు ప్రతులు; హాపరిఘముల నురంబున - కొన్ని ప్రతులు 4. నేపర - కొన్ని ప్రతులు. 5. గ్రీడి - ర.

87\. 1. బరగింప - హ. 2. పయిం - కొన్ని ప్రతులు. 3. సముద్ధతిన్ - కొన్ని ప్రతులు.

88\. 1. జోడె - హ.

89\. 1. పక్వ - అ. వ. శ. 2. గతిం - కొన్ని ప్రతులు. 3. దంగమున - కొన్ని ప్రతులు.

90\. 1. తతుణంబ - పెక్కు ప్రతులు.

91\. 1. వునిపై - ఐ. క. ప. 2. వడిరాకు - కొన్ని ప్రతులు.

పార్థుచేత మున్ను బాహులు దెగిపడ్డ
యతఁడు గొండ గూలినట్లు గూలె.

92. వ. ఇట్లు వరుణతనయుఁడు వడినం గనుంగొని.

93. క. అచ్చటిబల[1]ములుఁ బ్రభువులు
నచ్చెరువును భయము మనములం దడరంగా
విచ్చిన నట చనియెడు వి
వ్వచ్చునిఁ గాంభోజ[2]విభుఁడు వడి మార్కొనియెన్.

94. వ. [1]ఇట్లు మార్కొనుటయును.

95. సీ. అర్జునుం డతని నేడమ్ముల నేసినఁ బదియే[1]నుశరములఁ బార్థుఁ గృష్ణు
విశిఖత్రయమున నవ్విభుఁ డేయ నాతని విజయుఁ డస్త్రద్వయ విహతుఁ [2]జేయ
[3]బాణముల్ మూఁటను బటుశక్తిఁ గ్రీడి నొప్పించి కాంభోజుండు పేర్చి యార్చె
నరుఁ డల్గి వేసఁ బదునాలుగుదూపుల సూతాశ్వకోదండకేతనములఁ

తే. [4]గూల్చి దొడ్డనారసమున గుండెకాయ
వగుల బెట్టేయుటయు నతిప్రబలపవన
భూరిరయమునఁ [5]గూలు మహీరుహంబు
తెఱఁగు దోఁప సుదక్షిణుఁ [6]డొఱలి కెడసె.

96. వ. ఇట్లు కాంభోజపతి పడుటయు శూరసేనశిబివసాతిప్రముఖానేకదేశంబుల బలంబు లబ్బలమర్దననందనుం జుట్టుముట్టిన నతండు దఱచు[1]వాలంపగముల

---

93. 1. ములు భ్రమయుచు – వ. 2. రాజు – ఇ. ఔ. ణ.

94. 1. ఈవచనము పెక్కు ప్రతులలో లేదు.

95. 1. డు – కొన్ని ప్రతులు. 2. జేసె – కొన్ని ప్రతులు. 3. బాణత్రయంబున – ఇ. 4. నలి గూల్చి యొక దొడ్డనారసనమున గుండె వగలుచుటయు నతి ప్రబల వదన – వ. 5. గూలెడు భూమిరుహము – ఓ. ర; గూలెడు భూధరంబు – త 6. డొరగి – హ; డొరిగె నేల – ఊ. ష.

96. 1. వాలమ్ముల – కొన్ని ప్రతులు.

నాలువేలరథంబుల రూపుమాపినం గనుకనిం దెరలినం గని శ్రుతాయువు నయుతాయువును గాండీవి రెండుగెలంకుల సాయకసహస్రంబులు నిగిడించుచుం [2]గవిసి రప్పుడు శ్రుతాయువు చేతితోమరంబున నొచ్చినవివ్వచ్చుం బిడుఁగు [3]వడినవానిం గొఱవిఁ జూఁడిన తెఱఁగున నయుతాయువు[4] వాలోనన శూలంబు వైచి సోలం జేసిన విషాదంబున గరుడధ్వజుండు [5]సొగయ నాకపిధ్వజుండు నిజధ్వజదండం బొక్కింత యూఁతగొని[6]న నక్కురుసైన్యంబుల సింహ[7]నాదంబులుం దూర్యనినదంబులుం జెలంగె [8]నంత శౌరి ప్రబో[9]ధింపం దేఱి ధనంజయుం డైంద్రాస్త్రంబు ప్రయోగించుటయు నది వివిధాయు[10]ధాకారంబు[11]నం గవిసి యయ్యిరువురహస్తమస్తకశకలంబులు ధరం దొరంగించి తదనుచరులం బంచ[12]శతరథికవీరయోధుల వధియించి చూపఱకు విస్మయం బాపాదింప నిలింపపతిసుతుండు దఱిమికొని పోవుతఱి [13]నయ్యిద్దఱకొడుకులు నియుతాయువు దీర్ఘాయువును [14]శోకవేగంబున నరవాయి గొనక పయిం బడిన [15]నుద్దవిడిఁ గవ్వడి వారలం దండ్రులం గూడ [16]ననిచి మహార్ణవంబు గలంచుమందరంబుచందంబు[17]న నీబలంబులం దిరుగుడుపడం జేయుచు నురవడించు [18]సమయంబున.

97\. ఆ. కురునరేశ్వరుండు పురికొల్పఁ బ్రాచ్యక
ళింగదాక్షిణాత్య లంగబలము
మ్లేచ్ఛ[1]తతియు [2]బెరయ మెయికొని తాఁకిరి
గజఘటాసమృద్ధిఁ గారు[3]కొనుచు.

---

2\. గదిసి – కొన్ని ప్రతులు. 3. పడ్డవానిం – కొన్ని ప్రతులు. 4. వాలోనన – కొన్ని ప్రతులు. 5. సొగియ – పెక్కు ప్రతులు. 6. నంగురుసైన్యం – పెక్కు ప్రతులు. 7. నాదంబులు సెలంగె – పెక్కు ప్రతులు. 8. నంత – కొన్ని ప్రతులలో లేదు. నప్పుడు – ద. ప. హ. 9. ధించినం దేఱి – పెక్కు ప్రతులు; ధించినం దెలిసి – ఊ. ఏ. 10. ధప్రకారంబుల – వ. హ. 11. లం – కొన్ని ప్రతులు. 12. శతయోధుల – పెక్కు ప్రతులు; వింశతి రథికుల – జ. బ. వ. 13. వారిద్దఱ– కొన్ని ప్రతులు. 14. పితృమరణశోకవ్యాకులవేగం – వీ. శ. ష. స. 15. విజయుండు వారల – పెక్కు ప్రతులు. 16. సూతరథరథ్యంబులతోడ ననిచి – వీ. శ. ష. స. 17. నుంబోలె – పెక్కు ప్రతులు. 18. నవసరంబున – కొన్ని ప్రతులు.

97\. 1. బలము – ల. 2. మెఱచు – కొన్ని ప్రతులు; గడిమి – ణ. 2. కొనగ – స. కొన్ని ప్రతులు.

98. వ. అట్టియెడ గాండీవము క్తమార్గణ[1]వర్గంబు వేగంబున.

99. క. చేతులుఁ దొండములు శిరో
వ్రాత[1]ముఁ గుంభస్థలములు వడిఁ దొరఁగె ధరి
త్రీతలమున నంకుశబహు
హేతి[2]శకలసహితముగ మహీవరముఖ్యా.

100. తే. ఇవ్విధంబున నుఱుమాడ నీడఁ బోక
యవన[1]పారదశకబర్బరాదు లైన
మ్లేచ్ఛ[2]బలములు ధైర్యంబు మిక్కుటముగఁ
బొదివి [3]పోరెను గ్రీడి యద్భుతము [4]నొంద.

101. క. తుంగ[1]మదువుఁ జొచ్చినమా
తంగ[2]మునకు మిగిలి యడవి దరికొను కార్చి
చ్చుం గడచి [3]యబ్బలంబుల
భంగించె నతండు ఘోరబహువిధగతులన్.

102. వ. ఇట్లు నారాయణమారుతప్రేరితం బగునరజ్వలనంబు శరజ్వాలా[1]జాలంబున భవత్సేనాకాననంబు రూపుమాపె నప్పుడు.

103. తే. అర్జునుం డనుపర్జన్యు [1]నస్త్రవృష్టిఁ
బల్లమును [2]మిట్టు నని యేఱుపఱుపరాక

---

98. 1. వర్గంబు - కొన్ని ప్రతులలో లేదు.

99. 1. ములును గుంభములును - వ. వీ. హ. 2 నికరశకలములు మహీ - గ. జ. వ.

100. 1. పారశీకాంగవంగాదు లైన - ఉ. ఊ. ఎ. ఏ. ఠ; పారశ శక కిరాతాదు - వ; పారద శక కరూశాదులైన - ఐ. ఓ; పారద శక విషయాధి నాథులైన మ్లేచ్ఛులు ధైర్యంబు లక్కజముగ - వ. 2. గణములు - పెక్కు ప్రతులు. 3. పోరిరి క్రీడి - పెక్కు ప్రతులు. 4. బొంద - కొన్ని ప్రతులు.

101. 1. మదువు గలచెడు - కొన్ని ప్రతులు; మడుగులో జెలగు మతంగజమును - ర; మదువు గలచెడుమాతంగంబును మిగిలి - కొన్ని ప్రతులు; మదువున జెలగు - తి. 2. విభుని - కొన్ని ప్రతులు 3 శత్రుబలముల - ట; యచటి బలముల - తి.

102. 1. కీలజాలంబుల - ఐ. ర; జాలంబుల - పెక్కు ప్రతులు.

103. 1. దస్త్ర - పెక్కు ప్రతులు. 2.* మిత్రయును - న.

యుండ నెత్తురు [3]వెల్లు లొండొండ [4]పెరిఁగె
నుబ్బి భూతభేతాళంబు లోలలాడ.

104. వ. ఇమ్మెయి నద్భుతవిక్రమంబున [1]నతిక్రమించి కడంగుకవ్వడి నంబష్ఠపతి యగుశ్రుతాయువు మార్కొని నొగ నొగం దాఁక నరదంబు వఱుపుటయు.

105. చ. అతనిశరాసనంబును హయంబులఁ ద్రుంచిన నాశ్రుతాయు వు
ద్యత[1]గద నొప్పఁ బట్టి దనుజాంతకు [2]వ్రేసె నరుండు దగ్గదా
హతి యొనరించె నొండుగద నాతఁడు వెండియు విక్రమించినన్.
శతమఖసూతి యాతనిభుజంబులఁ [3]గంఠముఁ ద్రుంచె వ్రేల్మిడిన్.

106. వ. ఇత్తెఱంగున ద్రోణాచార్యుం గడచి కృతవర్మని [1]బెట్టుపఱిచి శ్రుతాయుధునిం గూల్చి కాంభోజపతిం బడవైచి శ్రుతాయుఃప్రభృతుల నుఱిపి తఱిమి [2]భవదీయసైన్యంబు సొచ్చి బహువిధయోధప్రాణంబుల [3]బాణ నాళంబులం బీల్చికొనుచుం చెలుచ నడరుఫల్గునుం గనుంగొని నీకొడుకు దేరు దోలుకొని [4]యొంటిమై నక్కుంభసంభవుకడకుం జని కటకటం బడుచు నతని కి ట్లనియె.

### -: దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట :-

సం. 7_69_1

107. చ. నిను నవలీల దాఁటి ప్రజ నేలకుఁ గోలకుఁ దెచ్చుచున్నయ
ర్జునుఁ దలయెత్తి యైన నటు సూడవు పాండవపక్షపాతి నీ

---

3. లేఱులొం - కొన్ని ప్రతులు; వెల్లువొండొం - కొన్ని ప్రతులు. 4. పరపె - కొన్ని ప్రతులు.

104. 1. విక్రమించు - ర. వ.

105. 1. గతిగిట్టి యొప్పి - ర; గద యొప్ప గిట్టి - పెక్కు ప్రతులు; గద నొప్ప ద్రెప్పి - ఊ. ఎ. ఏ. 2. వైచె - ఏ. 3. రెండును - ర.

106. 1. బెండు పఱిచి - శ. ష; బెట్టు పఱుపి - ఐ. 2. భరతసైన్యం - పెక్కు ప్రతులు; పరసైన్యంబు - వ; కురుసైన్యంబు - ఈ; భవత్సైన్యంబు - ఐ. ఓ. ర. 3. బాణాన లంబునం - ద. హ. 4. యొండుమై - వ.

మన మటు [1]గాన నెప్పుడును మాదెసఁ గప్ప యెలుంగుఁ బాము వై
యునికి యెఱుంగ వచ్చె [2]నటు లూఱట గావర మిచ్చినాఁడవో.

108. క. నిను నమ్మి యొండువలనికిఁ
జనక జయద్రథుఁడు నిలిచి సైన్యములో నా
తనిఁ జంపెడు తేనియపూ
సినకత్తివి గాక మానిసివె యూహింపన్.

109. వ. అని పలికి కార్య[1]దావాంబునం జేసి తనరాజసం బడంచుకొని యతండు.

110. తే. సైంధవున కడ్డ మున్న రాజ్యవజంబు
పార్థురాకకు [1]వెలువెలఁ బాఱఁ జొచ్చె
నార్తిఁ బలుకు నా[2]మాటల కలుగ కకట
చావకుండంగ నాతనిఁ గావ వయ్య.

111. వ. అనిన విని యాచార్యుం డతని కిట్లనియె.

112. క. నీమాటకు మాయశ్వ
త్థామవచన[1]ములకు నేఁ బదరుదునె విను మా
దామోద[2]రుమతి ముంగలి
గా మారుతవేగఘోటకస్ఫురణ[3]మెయిన్.

113. క. చనునప్పు [1]డతని[2]యమ్ములు
[3]వెనుకఁ బ్రజం దాఁకుచుండు విష్వచ్చుని నే

---

107. 1. గాక – కొన్ని ప్రతులు; గాననెప్పు – ఎ. శ. ష. సూ; గానయెప్పు – వా. కొన్ని ప్రతులు. 2. నిటు – కొన్ని ప్రతులు; నెటు – స. కొన్ని ప్రతులు; నటు లూరడగా – ఘ. ఝ. మ. వ. శ. హ.

109. 1. వాంఱు – ప.

110. 1. వెలవెల – కొన్ని ప్రతులు. 2. మాటకు నలుగ – ఱ. త. శ. ష.

112. 1. నమాటు – కొన్ని ప్రతులు. 2. రుండు ముంగలి – ర. 3. మునన్ – పెక్కు ప్రతులు

113. 1. డేఁగు శరములు – హ. 2. శరములు – పెక్కు ప్రతులు 3. వెనుకప్రజన్ – పెక్కు ప్రతులు

జన నీక యాఁగుపాఁడనె
కని కని యిటు లేల పలుకఁ గౌరవనాథా.

114. వ. అది యట్లుండె నొక్కహితంబు సెప్పెద నాకర్ణింపుము సేనాముఖంబు విడిచి యే నర్జునువెనుకం బోయినం బాండవబలంబు లురులం [1]దోఁతెంచు మనయొద్దు గలంగిన సైంధవుం గాచు టరిది యట్లుంగాక రాజమధ్యంబున ధర్మరాజుం బట్టెద నని యాడిననాకు నప్పని యేమఱం దగునే యతనిన వేచి నిలిచెద విశేషించి వృద్ధ నగుటంజేసి శీఘ్రయానం [2]బశక్యం బయి యుండు గాండీవియు నీవును దుల్య[3]వయోవర్తనులరు శంక లేక వానితో విరోధంబు గొన్నవాఁడవు తగుసహాయులం [4]గూర్చికొని యద్ధపడుము చయ్యనం జను మని పలికిన నతండు.

115. చ. నినుఁ గృతవర్మ [1]గెల్చి యవనీ[2]పవరప్రకరంబు [3]నోర్చి పే
ర్చిననరు సేన కాదు సురసేనయు నింద్రుఁడు నైనఁ దాఁక నే
ర్చునె [4]యది కార్యతంత్రముగఁ జూచిత యేని భవన్నియోగముఁ
గొనకొని చేసెదఁ యశము గోల్పడ [5]కుండఁగఁ జూడు మెమ్మెయిన్.

116. వ. అనుటయు [1]నగ్గురుం [2]డక్కురుప[3]తిఁ గనుంగొని [4]నీవు నిక్కంబ పలికితి కిరీటి యట్టివాఁడ [5]నేఁ డొక్క యద్భుతంబు సూపెద నిక్కవచధారణంబు చేత రక్షితుండ వై యతనిం దలపడుము [6]కృష్ణుండును సమస్తజనంబులు వెఱఁగుపడం దదీయశరంబులు నీతను[7]వు దాఁక కుండం గలయవి యని చెప్పి యొక్కపసిండి కత్తళంబునం దాళక్తి యావహించి యిచ్చినం బుచ్చు

---

114. 1. ద్రోచి యేతేర – వీ. శ. ష. 2. బుశక్యంబై యుండదు – కొన్ని ప్రతులు. 3 వంశ – కొన్ని ప్రతులు; వంశవయస్కులరు – ఇ. ఊ. ప. 4. గూడికొని – చ. వ. ష.

115. 1. నేచిన యనేకనృపప్రక – అ. గ. జ. బ. వ. స. నోర్చి – కొన్ని ప్రతులు. దొట్టి– కొన్ని ప్రతులు. 2. రమణప్రక – కొన్ని ప్రతులు; వరముఖ్యుల నొంచి మించి – ఐ. 3. లీల నోర్చిన – కొన్ని ప్రతులు. 4. యిది – కొన్ని ప్రతులు. 5. కుండుట చూడు – కొన్ని ప్రతులు.

116. 1. గురుండు – పెక్కు ప్రతులు. 2. డుకురు – కొన్ని ప్రతులు 3. తితో నీవు – కొన్ని ప్రతులు. 4. నీవు – పెక్కు ప్రతులలో లేదు. 5. నేనొక్క – కొన్ని ప్రతులు. 6. గృష్ణుండు – అ. ఊ. ఒ. ణ. 7. వునందాక – ఊ. ఐ. ద.

కొని ప్రీతుం డగుచు నియతాత్ముం డై దానిం దొడుగునప్పు డాచార్యుం డిది దొల్లి దేవసంరక్షణార్థంబుగా నజుండు దేవేంద్రున [8]కిచ్చె నది[9] యతం డంగిరసునకు నంగిరసుండు బృహస్పతికి బృహస్పతి యగ్ని వైశ్యునకు నగ్ని వైశ్యుండు నాకును దీని నొసంగి[10] రని [11]యెఱింగించి సమంత్రకంబుగాఁ [12]దొడిగి నానావిధవాక్యంబుల దీవన లిచ్చి పొ మ్మని యనుజ్ఞ [13]సేసిన నమ్మహీపతి యుబ్బి యరదంబు సత్వరంబు సేసి యనేకరథకరితురగ[14]నరనికరంబులు [15]దన్నుం బరివేష్టింప వివిధతూర్యనాదంబులు నింగి ముట్ట విచ్చు వెనుకొనియె [16]నట్టియెడ [17]నిక్కడ.

117. చ. సురభసవృత్తిఁ బాండుసుతసైన్యము లొక్కట నేచినం గడుం
దిర మయి [1]నిబలంబులు నుదీర్ణత సూపిన జాహ్నవీసము
ద్ధురయమునా[2]భిఘట్టనముతో [3]నెన వచ్చె నరేంద్ర యప్డు సం
గర మతిఘోర మయ్యె నొకకాలము నట్టివి సూడ మెయ్యెడన్.

118. వ. [1]అయ్యవసరంబున.

119. ఆ. నడుమ ఖానుఁ దాల్చి నాకముఁ గనుంగొని
దాని మిగులు [1]బుద్ధి ధరణి ఖాను
యుగముఁ దాల్చె ననఁగ నొప్పిరి తీవ్రతే
జమున గురుఁడు ద్రుపదసంభవుండు.

---

8. కిచ్చిననది-ఈ. ఖ. డ. 9. నతండ - కొన్ని ప్రతులు. 10. గెనని-ఇ. ఏ. జ. బ. ర. వ. 11. యెరుంగించి - గ. ఛ. ర. ల. 12. దొడివి - స. పెక్కు ప్రతులు; దొడిపి - ఈ. చ. స; దొడివిం(గిం)చి - అని పాఠములు. 13. చేసిన - పెక్కు ప్రతులు; యిచ్చిన - ఓ. త. ర. 14. నరనికర - పెక్కు ప్రతులలో లేదు; పదాతులు - ర. 15. తనుంబ - ఓ. వ. 16. నట్టియెడ - పెక్కు ప్రతులలో లేదు; నంత నిక్కడ - కొన్ని ప్రతులు. 17. నిక్కడ - కొన్ని ప్రతులలో లేదు.

117. 1. మార్బలంబులు - పెక్కు ప్రతులు. 2. వి. - ఇ. ప. వ. హ. 3. సరి - ద. ప. బ. వ; నెనవచ్చి - కొన్ని ప్రతులు.

118. 1. ఈవచనము కొన్ని ప్రతులలో లేదు.

119. 1. భంగి - ఒ న. ల.

120. వ. ఇట్లు ద్రోణధృష్టద్యుమ్నులు మెఱసి పోరి [1]రప్పు డప్పాంచాలవరుండు గురునిశరవర్షంబులు వారించుచు మిగిలి మనవాహినిపై నడరి నేల నెత్తు టం [2]దోఁచిన నతనికో ల్తలకుం గాక యొదిఁగి యచ్చటిప్రజ మూఁడు[3]గుంపు లయ్యె [4]నప్పుడు ద్రోణుండు గినిసినం బాంచాలకేకయప్రముఖబలంబులు గలంగం బడిన [5]మగుడ [6]నస్మత్సైన్యంబు పురికొనుటయు ధర్మసూనుండు సోగఁగాఁగి యోధవీ[7]రసహితంబుగా నురవడించినం గని నీకర్ణవివింశతిచిత్ర సేనులు భీమసేనుని బాహ్లికుండు ద్రౌపదేయులను దుశ్శాసనుండు సాత్యకిని శకుని నకులసహదేవులను సోమదత్తుండు శిఖండిని నలంబుసుండు ఘటోత్కచునిం దలపడిరి శల్యుండు సింధురాజుకడ నుండియు నగ్గలిక నమ్మొగ్గరంబు మొగంబునకుం జనుచు [8]మరలుచునికిం జేసి తత్కాలసన్ని[9]హితుం డయిన యుధిష్ఠిరుం దాఁకె నివ్విధంబు[10]నం దార్కొనిన [11]యద్దొరలు నానాప్రకారదారుణవిచిత్రసంగరంబులు సేసి పల్లవితాశోకపుష్పితకింశు[12]కవనంబులం బోలి పొలిచి రాసమయంబున దుస్ససేనుండు శైనేయుని మూర్ఛితుం జేసిన నాలోనన తెలిసి యితండు ప్రచండభంగిం బెనంగెఁ గవల యమ్ముల కోపాటించి గాంధారరాజు ద్రోణు దెసకుం బాఱె నట్టియెడ.

121. క. మనమూఁక యొదిఁగి గుంపులు
గొని యెప్పటియట్ల యగుడు గురుఁ డతిరథసం
బున ధృష్టద్యుమ్నుని భీ
ముని ధర్మజుఁ బొదివి యుగ్రముగ నేసె నృపా.

122. వ. [1]అయ్యవసరంబున.

123. క. ఉభయబలంబులుఁ బురికొని
యిభతురఁగస్యందనంబు లిలఁ బ్రోవులుగా

---

120. 1. రప్పాంచా – పెక్కు ప్రతులు 2. జొత్తిల జేసిన – న. 3. మూకలయ్యె – గ. జ. బ. వ. 4. నప్పుడు – కొన్ని ప్రతులలో లేదు. 5 మగుడ – కొన్ని ప్రతులలో లేదు. 6. మనసైన్యంబు – కొన్ని ప్రతులు; యుష్మత్సైన్యంబులు – కొన్ని ప్రతులు. 7. వీరులతో నురవణించి – ల. 8. మగుడు – ఖ. చ. వ. 9. హితుండై యుధి – పెక్కు ప్రతులు. 10. నమార్కొ – ఏ. ద. 11. యొండొరులు – ఝ. డ. 12 కాకారంబులం బొలిచిరి – పెక్కు ప్రతులు

122. 1. ఈవచనము ట. ఐ. ప్రతులలో లేదు.

[1]సభయాశ్చర్యాత్మకులై
నభశ్చరులు వొగడ నీసునం బోరాడెన్.

### –: ధృష్టద్యుమ్నద్రోణాచార్యులయుద్ధము :–

సం. 7–72–22

124. వ. అట్టిసంకులసమరంబున సుస్థిరోత్సాహులం డై నిజవ్యూహం బభేద్యం బగున ట్లుగా శుంభదవష్టంభంబునం బేర్చి కుంభసంభవుండు ధృష్టద్యుమ్ను [1]మిగిలి పాండవసైన్యంబు దైన్యంబు నొందించుచున్న [2]నప్పాంచాలకులప్రదీప కుండు గోపోద్దీపి[3]తుం డయి పారావతవర్ణంబు లగుతన[4]రథ్యంబుల నగ్గురు నరుణాశ్వంబులం బెరయ నరదంబు వఱపించి [5]పలకయు వాలునుం గొని సాహసికత్వంబున నతని తేరికడ [6]నొగఁ ద్రొక్కి [7]యెక్కి కాఁడిపయిం జిత్ర గతులు మెఱసి తఱచై తొరఁగు తదీయశరంబులు నిజశరీరంబుఁ [8]జోఁక నీ కుండెడు[9]నాలోఁ జేయార్పు రాకుండియుఁ దమకంబునం గృపాణంబు విసరినం దద్రథతురంగంబులయంగంబులు వెసవెస దాఁకకొలఁది నయ్యా చార్యుండు రయంబున.

125. తే. అలుఁగు చెక్కులు[1]గాఁ జేసి హరుల సూతుఁ
దునిమి సిడమును [2]బలకయుఁ ద్రుంచి వైచి
మేను లఱుంచి కులిశంబుఁ బోనిదొడ్డ
వారసం బేయ సాత్యకి నడుమ [3]నఱకె.

---

123. 1. రథసాశ్చ – ల.

124. 1. నింగడచి – ఈ. 2. సమయంబున పాంచాల – వ. 3. తముఖుండై – కొన్ని ప్రతులు. 4. గుఱ్ఱంబుల – హ. 5. పలుక – పెక్కు ప్రతులు. 6. నొగలు – కొన్ని ప్రతులు. 7. యెక్కి – కొన్ని ప్రతులలో లేదు. 8. జేర పేర – అని పాఠములు. 9. నట్లుగా జడియుచు నాలోగాలు చేయార్ప – ఓ. ద. ప. వ. వీ. శ. షు హ.

125. 1. గావించి – హ; గానేసి – న. ఫ. ర. వ. 2. బలుక – కొన్ని ప్రతులు. 3. నఱికె – కొన్ని ప్రతులు.

126\. వ. ఇట్లు శినిపుంగవుండు సింగంబు [1]పొదివిన[2]కురంగంబుఁ గాఁచుచందంబున ధృష్టద్యుమ్ను రక్షించి తొలంగం గొనిపోయె ననిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె.

127\. క. పులివాఁతికండఁ గొనుగతి
నలవునఁ బాంచాలతనయు [1]నయ్యెడరునకుం
దొలఁగించిన సాత్యకిపై
నలుక వొడమకుండు [2]నెట్టు లాచార్యునకున్.

128\. వ. [1]అనుటయు నమ్మానవపతికి సూతసూనుం డిట్లను నట్లు సేసినం గినిసి గురుం[2]డు ఱెక్కలు గల పెనుఁబాముకై వడి సాత్యకిపై [3]గవియుటయు నతండు నిజసారథి నాలోకించి యివ్విప్రుండు ధర్మతనయభయంకరుం డితని మార్కొనవలయు నని పలికి తేరు సమ్ముఖంబు సేయిం[4]చె నిత్తెఱంగున.

129\. క. తలపడి చాపరుచులు మెఱుఁ
గులగములుగ గుణనితాంతఘోషంబులు గ
ర్జలుగా నారథికోత్తమ
జలదయుగము [1]మెఱసి సాంద్రశరవర్షము[2]లన్.

130\. వ. అంతకంతకుం [1]గదిసి భల్లంబుల నేట్లాడం దొడంగిన.

131\. చ. గొడుగులు గేతనంబులును గూ[1]లెఁ దనూద్గతరక్తధార [2]లొ
ల్కెడుగజదానతోయముల లీల వహించె బలద్వయంబు న

---

126\. 1. అలోని - త. 2. మాతంగంబు - ల. శ; కరింద్రంబు - ఇ.

127\. 1. నట్టియెడరునం - కొన్ని ప్రతులు. 2. ఎట్లునా - కొన్ని ప్రతులు.

128\. 1. అనవుడు సూత సూను(నందను, సుతు) డమ్మానవపతి కిట్లను - అని పాఠములు; అనిన విని - ర. 2. డెరకలు - ద. ప. వ. 3. నడరుటయు - కొన్ని ప్రతులు. 4. చిమహాస్త్రంబులు నిగుడించె - ఎ. ఓ.

129\. 1. మెఱసె - పెక్కు ప్రతులు; పొదవె - ల. 2. నన్, గన్ - అని పాఠములు.

130\. 1. గడ(ఱ)గి - కొన్ని ప్రతులు; గవిసి - ల. వ.

131\. 1. లగనుద్ధత (నుద్గత) - కొన్ని ప్రతుల్. 2. తెల్లడ - వ.

160. క. పెటిికిటి నలుఁగులు మేనులు
నెటిఁ బడ నెల్లెడలఁ గలయ [1]నివిరిటి హారు లి
త్తటి [2]నీళులు ద్రావక తె
ప్పిఱ [3]వెల్గొకొ శత్రుసైన్య[4]భీకరమూర్తీ.

161. క. వెన్ను [1]మునుఁగఁ దివియఁగ లే
కున్నను ద్రావఁ దగునీళు లొందవిన హాయముల్
నిన్ను గెలిపించు ననవుడుఁ
గన్నుల నగి యర్జునుండు [2]గల విచె యనుచున్.

:- అర్జునుఁడు దివ్యాస్త్రముల ధరఁ బగిల్చి కొల నుత్పాదించుట :-

సం. 7_74_32

162. మ. [1]ధర దివ్యాస్త్రహతిం [2]బగిల్చి కొల నుత్పాదించి వే దానికి
న్శరజాలంబుల [3]నిల్లు గట్ట మనసైన్యంబుల్ వెఱం [4]బొంది న
చ్చెరు వందెఁ సురసంఘముల్ హరి నుతించెం బొంగి యప్పార్థు భూ
వర మున్నిట్టివి సూడరుఁ వినరు నెవ్వారుం ద్రిలోకంబులన్.[5]

163. తే. హర్షమందస్మితముతోడ నమ్మురారి
యపుడ హాయముల మెయి [1]వెట్టునట్లు నేసి
[2]తటిమి నీళులు ద్రావించి తడవి మగుడఁ
దెచ్చె మనయోధు లెల్లను విచ్చలింప.

---

160. 1. నిమిరిటి – కొన్ని ప్రతులు. 2. నీరులు – అ; నీళ్లు ద్రావకయ(యు) – కొన్ని ప్రతులు. 3. వెల్లకొ – కొన్ని ప్రతులు. 4. భీషణ – కసం. శర. పెక్కు ప్రతులు.

161. 1. లుమును(నుం) గ దివియలే – కొన్ని ప్రతులు; మునుంగ గడులే – ఉ. బ.
2. గలవే యను – పెక్కు ప్రతులు.

162. 1. వరదివ్యాస్త్ర – వ. 2. బెకల్చి – ఆ. హ. 3. గట్టుగట్టి, గట్టగట్టి – వ.
4. గంటె – ద. వ. హ. 5. ఈ పద్యము తరువాత అట్టి యెడ, – అను వచనము కొన్ని ప్రతులలో గలదు.

163. 1. పట్టునట్లు – వ. కొన్ని ప్రతులు. 2. తడిమి...కడిమి, మగుడ – కొన్ని ప్రతులు; తరిమి నీళ్లు ద్రావించి యంతటను – గ. జ. బ. వ; తవిలి మును నీళ్లు ద్రావించి తరిమి మగుడ – వ.

164. వ. [1]ఇట్లు సేద దేర్చి.

165. క. మును దివ్యాస్త్రబలంబున
జనియించిన[1]నీరితోన సంభూతంబై
యొనరిన[2]ఖాణము మేపెం
[3]దనివుసనం దురగములకు [4]దర్ప మెలర్పన్.

166. వ. మేపి కట్టాయితం [1]బయి మనమూకలనడుమం బడంతులపిండులోనం గ్రాలెడు [2]విలాసియుం బోలె విలసిల్లుచు నమ్మహనీయరథ్యంబులం బూన్చినఁ బాండవమధ్యముం [3]డారథం బల్లన యెక్కె నాతడవున దుర్యోధనుం [4]డనతిదూరవర్తి యై వారలం గని వేగంబున వచ్చుచుండె వారలక్కడ [5]చూడ రయ్యవసరంబున నచ్చటిభూవల్లభు [6]లెల్ల వెల్లనైన మొగంబులతోడ వెఱఁగంది డెందంబులు గుందుచుండం దమలో నిట్లనిరి.

167. మ. చతురంగంబులు[1] నొక్కపెట్టి వివిధాస్త్రజ్వాలలం [2]గప్పంగా
నతివేగంబున [3]మ్రింగెఁ గ్రోలె ఘనమాయల్ రూపడంగించె నా
నితఁ డన్నింటిని రిత్త వుచ్చుచు మదం బేపార నిమ్మైమ్మ రణ
క్షితియుం బీనుఁగుపెంటఁ జేసెఁ [4]జెనయం [5]జెట్టాడఁగా శక్యమే.

168. సీ. కురుసేనపైఁ బడ్డ సరకు సేయక మంచు విరియించుభానుని వెరవు మెఱసి
యిది నడ[1]గల నని యించుక గొంకక తనఘోటకంబులఁ [2]దడవఁ బనిచి

---

164. 1 ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

165. 1. నీటి – అ; నీరువలన – ద. వ; నీరిలోన – ర. 2. ఘాసము – అ. గ. వ. హ; ఖవణము – వ. 3. దనిపుగనత్తురగ – స; దనిపుగ (దనివిగ, దనుపుగ), నత్తురగ – అని పాఠములు; దనువుల నత్తురగ – వ. 4. దర్పం బెసగన్ – పెక్కు ప్రతులు.

166. 1. బైనమన – కొన్ని ప్రతులు. 2. విలాసుడుం, విలాసినియుం – అని పాఠములు. 3. డు – కొన్ని ప్రతులు. 4. డతిదూర – ఒ. క. ర; డనతి దూరంబున వర్తిల్లు వారలం – వ. 5. చూడక సైంధవుని వలనిక యడరి రయ్యవ – కొన్ని ప్రతులు. 6. లువెల్ల – కొన్ని ప్రతులు; లువెలువెలనై – వ.

167. 1. ల – కొన్ని ప్రతులు. 2. దెల్పితా – హ; గప్పితా – ఆ. 3. మ్రింగ గోరి – స; మ్రింగబోలె – ఘ. డ. 4. నితనిం జెట్టాడ – పీ. శ. ష. 5. జెండాడగా – చ.

168. 1. వలనని – వ. 2. దడుమ, దడుప – అని పాఠములు.

తే. [7]సురవడింపవు వీరల సరకు గొనక
వీని [8]నిప్పుడ యట్టులు విడిచి [9]తడవు
[10]మనుడు నతఁ డిది వోలున యనుడుఁ దేరు
డిగ్గి సారించెఁ గ్రీడి గాండివగుణంబు.

152. చ. ఎడఁ గని యబ్బలంబు గడునేత్తెఱఁ గిట్టి మహాస్త్ర[1]శస్త్రము
ల్గడువడిఁ గుప్పఁ [2]గూరగఁ జలంబునఁ బైఁ దొరఁగింప నేచి క
వ్వడి వివిధోజ్జ్వలాస్త్రముల వాని వెసఁ మగిడించి తాఁకుపె
ల్లడరఁగఁ జేసె మింటికలయంతయుఁ [3]జిట్టలు గట్టుమంటలన్.

153. వ. ఇత్తెఱంగున.

154. క. లావును [1]వెరవును మెఱయఁగ
నీవీరులు పాండుపుత్రునిం బొదివినచో
నావీరునియక్కజ [2]మగు
లావు వెరవుఁ గరతలామలక మై తోఁచెన్.

155. వ. అట్టియెడఁ జతురం[1]గంబులు.

156. క. నొచ్చినఁ జచ్చినఁ దెరలిన
విచ్చిన నయ్యోడరు సూచి [1]విసువక పైపైఁ
జొచ్చి[2]నఁ గడుఁ గ్రిక్కిఱిసిన
నచ్చట మనసేనలోన నార్పులు [3]వెడలెన్.

---

7. నురువణింపకు – పెక్కు ప్రతులు. 8. నీవిప్పుడట్టులు – శర. కొన్ని ప్రతులు. 9. తడుము, తరుము – అని పాఠములు. 10. మనుకు నిది వోలు నని హారియని నదే – ద. వ.

152. 1. వర్షముల్ – ఈ. వ. 2. గూర తురగంబులపై – ఐ. ల; గూలగ బలంబులపై – ఒ. 3. జంటలు గట్ట, జిట్టలు గట్ట – స. కొన్ని ప్రతులు.

154. 1. బీరము మెర – ఓ. త. 2. ముజనావలికిం దోచె గర – ణ.

155. 1. గ బలంబులు – కొన్ని ప్రతులు.

156. 1. విడువక – ణ ర. 2. కదుంగ్రిక్కి – క. ణ. ర. హ. 3. నిగుడెన్ – అ. జ. ప. వ.

157. వ. [1]ఆఫల్గునుండు పాదచారి యై[2] యునికిం దేకువ సెడియును గెలుపున కాసపడియును నిట్లు గ్రమ్మిన కౌరవసైన్యంబు పొంగి[3]నసముద్రంబుపోలిక యగుటకుం దగి[4]నతరంగంబులచందంబున నిగుడు శరపరంపరలవలనను ఘోషంబు చాడ్పునం జెలంగు తూర్యనాదంబులవలనను వివిధసత్త్వంబుల విధంబున నుల్లసిల్లు మాతంగతురంగసుభటస్యందనసందోహంబులవలనను జలియింపక చెలియలికట్టయుం బోలె నవి నిలువరించి [5]యవ్విక్రమకుతూహ[6]లి విజృంభిం[7]చిన.

158. సీ. పటుభల్లనికరంబు పర[1]గినం బఱియలై యఱవఱ లయ్యెడు నరదములును
[2]నానార్ధచంద్రబాణవ్రాత మడరినం దునియలై మేదినిం [3]దొరఁగుకరులు
శాతనారాచ[4]పుంజం[5]బులు నిగిడినం [6]గుదురులై కూలెడు ఘోటకములు
వివిధాస్త్రతతులు పర్వినం [7]గండలై వండఁ దఱిగిన ట్లుండుపదాతి[8]చయము

తే. నగుచు [9]బీభత్సరౌద్రమహాద్భుతములు
మూర్తిమంతంబులుగ మనమొనలు రక్త
మాంసమేదోస్థిమస్తిష్కమయ[10]తం జూడ
ఘోరరూపంబులై పరిశోభ మొందె.

159. వ. ఇవ్విధంబునం గురుసేనం గనుపు[1]కొట్టి నవ్వుచున్నకవ్వడిం గనుంగొని కమలనాభుండు.

---

157. 1. అట్టియెడ నాఫ - కొన్ని ప్రతులు. 2. యని తేకువ - పెక్కు ప్రతులు. 3. న - కొన్ని ప్రతులలో లేదు. 4. న - కొన్ని ప్రతులలో లేదు. 5. యధికవిక్రమ - ఉ. ర. 6. లియై - కొన్ని ప్రతులు. 7. చె - ఉ. ర.

158. 1. పిన - కొన్ని ప్రతులు. 2. నాగార్ధ - చ. వ; నానాశరార్ధ చంద్ర వ్రాత - ఇ. త. 3. దొరుగు - పెక్కు ప్రతులు. 4. వ్రజం - వ; 5. బులచే గుప్పగుదుపలై - వ. 6. గుదుపలై - ఖు. ఝు. డ. ర; గుదులునై, గుదిగొని - అని పాఠములు. 7. గండ్రలై - ర. 8. కులము - పెక్కు ప్రతులు; కులును - ఈ. 9. రౌద్రభీభత్సమహా - పెక్కు ప్రతులు; రౌద్రబీభత్సభయానకములు - ఈ. ఎ. ఏ. 10. తజాతఘోర - ల.

159. 1. కొట్టిన కవ్వడిం - శర. హ.

142\. వ. ఇవ్విధంబున రౌద్రరసంబు దళుకొత్త దర్పంబున సైంధవుం డున్నదిక్కునకుం బోవంబోవ.

-: విందానువిందు లర్జునుచేత మృతి బొందుట :-

సం. 7_74_17

143\. క. విందానువిందు లేక
స్యందనగతు లై కడంగి సైన్యంబులఁ దా
రుం [1]దెప్పదెరల వాసం
క్రందననందనునిమీఁదఁ [2]గవిసిరి గడిమిన్.

144\. వ. ఇట్ల[1]వంతీశ్వరు [2]లురవడించి.

145\. చ. హరులపయిం మురారి[1]పయి నాతని[2]మేనను బాణ[3]వర్షముల్
గురిసి రతండు వారి నతిఘోరశరంబుల [4]నొంప ధీరతం
దెరలక వారుఁ దద్రథము దేల్చిరి తూపుల వెల్లి నల్గి య
య్యిరువుర [5]విండులుం దునిమి యేపున మూఁకల[6]పె ల్లడంచుచున్.

146\. క. తోడన కడువేగంబునఁ
గ్రీడి తురంగముల సూతుఁ గేతనమును దు
న్నాడుచు విందునితల యిల
పై డొల్లఁ[1]గ నేసెఁ [2]దీవ్రభల్లప్రహతిన్.

---

143\. 1. దెంపుదెరల - ర; దెప్పదేల - కొన్ని ప్రతులు. 2. గడగిరి, గణగిరి - అని పాఠములు; గదిసిరి - ఊ. ఎ. ఏ.

144\. 1. వంతి దేశాధీశ్వరు - ల. హ. 2. లురువణించి - పెక్కు ప్రతులు.

145\. 1. మెయి - కొన్ని ప్రతులు. 2. మేనున - కొన్ని ప్రతులు; పైదగ - ట. వ. 3. జాలముల్ - వ. 4. నొంచి - కొన్ని ప్రతులు; ముంప నెంతయున్ - ద. వ. 5. విండ్లునుం దునిమి - పెక్కు ప్రతులు; విల్లునుం - ట. ణ. 6. పేళ్లడంచు - వ.

146\. 2. గ జేసె - కొన్ని ప్రతులు. 2. గ్రూరభల్ల - పెక్కు ప్రతులు; దీవ్రభల్లి - వ; ఘోరభల్ల - ణ.

147. వ. ఇట్లు దల [1]దునుముటయు బలుగాలిం [2]గూలుతరువుపో[3]లికం బడినయగ్రజు
నాలోకించి యనువిందుం డలుకయు నుమ్మలి[4]కంబు నుల్లంబునం బెనంగొన
గద గొని [5]సంరంభంబున.

148. చ. అరదము డిగ్గి తీవ్రగమనాతిశయంబునఁ గిట్టి బాహువి
స్ఫురణ దలిర్ప దానవనిషూదనుఫాలము వ్రేసి యార్వ ను
ద్ధురరభసం బెలర్ప గదఁ ద్రుంచి పదంబులు బహుశాఖలుఁ
శిరమును [1]ద్రెంచి వాని బలి సేసె ధనంజయుఁ [2]డాజిభూమికిన్.

149. ఆ. దొరలు వడిన సేన[1]దూలక యవ్వీరుఁ
జుట్టుముట్టుటయును బెట్టు [2]గవియు
కాఱుచిచ్చు దఱుచుఁ [3]గానల నీఱుగఁ
జేయుపగిదిఁ దోఁపఁ జేసె నతఁడు.

150. వ. [1]ఇవ్విధంబున.

151. సీ. అచ్చోటు [1]గదలి వివ్వచ్చుండు సనఁ జన నతని[2]మై వాఁడును హాయువయుంబు
[3]డప్పియు నతనికి నప్పుడు సైంధవుఁ డున్నెడ దూర మైయుండుటయును
గని సంత[4]సము [5]నొంది కౌరవయోధులు సింహనాదంబులు సేసి తఱుచు
నారథికోత్తముఁ డచ్యుతుఁ జూచి [6]రథ్యమ్ములు మేనుల నలుఁగు లుండ

---

147. 1. దున్మాడుటయు – గ. వ. 2. దూలు – స. కొన్ని ప్రతులు. 3. కిం గూలిన యగ్ర – క. ఘ. ఝ. డ. ర. వ. 4. కయుంగదుర గద గొని – ద. వ. 5. రభసంబున – ణ. త.

148. 1. ద్రుంచి – పెక్కు ప్రతులు. 2. డాహవంబునన్ – వ.

149. 1. దెరలక – కొన్ని ప్రతులు. 2. గిట్టి – కొన్ని ప్రతులు. 3. గాన నీఱుగ (నివ్వరుగ)జేయుపగిది దోప జేసి నిగిడె నతడు – వ. స. పెక్కు ప్రతులు.

150. 1. ఈ వచనము ఒ. ఓ. ట. ప్రతులలో లేదు.

151. 1. గడచి – పెక్కు ప్రతులు; వాసి – ఇ. ఓ. ద. ప. 2. పై – ఎ. ల. 3. దప్పియు–శర – పెక్కు ప్రతులు; దద్దయు – ల. 4. సంబంది – ల. 5. బొంది – పెక్కు ప్రతులు. 6. రథ్యంబుల – పెక్కు ప్రతులు

ప్పుడు వెఱఁ గం[3]దె [4]నచ్చెరువుఁ బొందె వియచ్చరకోటి[5] యిట్లు పో
రెడునెడ ద్రోణువిల్లు వెస రెండుగ సాత్యకి ద్రుంచెఁ ద్రుంచినన్.

132. క. గురుఁ డొండొకవి ల్లెత్తిన
సరభసము[1]గ నదియుఁ [2]దునిమె సాత్యకి మఱియుం
ద్వరితముగ నెక్కు వెట్టఁగ
శరాసనము లెన్ని[3]యేనిఁ జక్కడిచె వడిన్.

133. వ. అట్టియెడ నాచార్యుం డాత్మగతంబున.

134. తే. రాముసందును గార్తవీర్యక్షితీశు
నందు నరునందు భీష్మునియందు దక్కఁ
గలుగునే యెందు నీయస్త్రబలము వీని
[1]యాశువిక్రమ మద్భుతం బయ్యెఁ జూడ.

135. వ. అని యగ్గించెఁ జారణసిద్ధసాధ్యులు సంకీర్తనంబులు సేసిరి [1]వెండియు
నొండుకోదండంబు గొని యగ్గురుండు [2]దొరంగించినశరంబులు శైనే
యుండు [3]దుత్తుమురు సేసిన.

136. క. ఏపీఱు[1]న కైనను నిది
[2]భావారూఢంబు గానిపనియే యనుచున్
[3]మీవా రెల్లను [4]బెలుచం
గైవారము సేసి రతనిఁ గౌరవనాథా.

---

3. దిచూచెను బ్రమోదము తోడను దేవకోటి పోరెడు - ర. 4. విస్మయము - కొన్ని ప్రతులు. 5. టులంత - వ.

132. 1. న - కొన్ని ప్రతులు; నమరియు - వ. 2. ద్రుంచె - కొన్ని ప్రతులు. 3. యెన్ని - ర. వ; యన్ని - క. ఖ. ఝ.

134. 1. యమిత - ట. వ; యందు - ర.

135. 1. మరియు - కొన్ని ప్రతులు; వెండియు నొండొక కోదం - హ. 2. దొరంగించు - ట. వ; దొడగిన - ఈ. 3. దుత్తునియలు - కొన్ని ప్రతులు; దుత్తుమురుగా జేసి - కొన్ని ప్రతులు.

136. 1. లకై - కొన్ని ప్రతులు. 2. భావాంతర్గతము - ట. 3. నీవా రెల్లను - పెక్కు ప్రతులు. 4. నాతని....రపుడు గౌవవ - ఇ. త. ల; నతనిం... రెలమి గౌరవ-వ.

137. వ. అప్పలుకులు [1]సహింపక.

138. శా. ఆగ్నేయాస్త్రము ద్రోణుఁ [1]డేసిన సముద్యజ్జ్వాలికామాలికో
ద్విగ్నం బయ్యె [2]నభంబు వారుణశరావిర్భావముం జేసెఁ [3]గ్రో
ధాగ్నిస్ఫూర్తి వెలుంగ నాతనివరుం డబ్బాణముల్ ద్రావని
ర్మగ్నవ్యోమచరంబు [4]లై తొడరి పోరం జొచ్చె నొండొంటితోన్.

139. క. [1]ఘోరంబు గాఁగ హాహా
కారము లెసఁగంగ బలయుగంబును దయ్యం
[2]బోరి పెడఁబాసి శాంతము
లై రెండును నిలిచె నమ్మహాస్త్రము లధిపా.

140. వ. ఆసమయంబున ధర్మజభీమనకులసహదేవులు శైనేయునకు బాసట లై [1]తఱిమిన ధృష్టద్యుమ్నప్రముఖరథికవరులుం దలకడచి భారద్వాజుం దాఁకుటయు దుశ్శాసను మున్ని[2]డుకొని మనదిక్కు రాజకుమారవర్గంబు వారలతోఁ దలపడిన నుభయబలంబులుం బురికొని యోహారిసాహారిం బెనంగుచుండె [3]నప్పు డక్కడ.

141. క. నరుఁడు దనతేరు వోయె[1]డు
తెరువున [2]కై నంతసేనఁ [3]దివ్యాస్త్రములన్
ధరఁ [4]గూల్పఁగ నయ్యెడ న
య్యరదముఁ గృష్ణుండు [5]వడుపు టద్భుత మయ్యెన్.

---

137. విని సహిం - హ.

138. 1. డేసెను - ర. హ. 2. జనంబు - కొన్ని ప్రతులు; జగంబు - కొన్ని ప్రతులు. 3. గోపాగ్ని - పెక్కు ప్రతులు; రోషాగ్ని - వ. బ. వ. 4. పైఁ దొడరి - వ; లై కణగి - ఊ. ఎ. ప.

139. 1. ఘోరములు గాగ - ద. వ; 2. బోరబెడ - ర.

140. 1. తరమిన - పెక్కు ప్రతులు. 2. డుకొని - కొన్ని ప్రతులు. 3. నంత నక్కడ - కొన్ని ప్రతులు.

141. 1. డి - కొన్ని ప్రతులు. 2. నున్నంత - స. కొన్ని ప్రతులు. 3. దివ్యాస్త్ర - కొన్ని ప్రతులు. 4. గూల్పగా నాతనియరదము - హ. 5. నడపు - ఖ. చ.

కోల నక్కజంబుగ [3]నలుఁగులమొన ఘటియించి [4]యమ్ముల దాని కిల్లు గట్టి
సారథి లీల నశ్వములఁ[5]గార్యము దీర్చునంతకు [6]నవ్వుచు [7]సవుల నిలిచి

ఆ. [8]గారవమునఁ దాను గానివాఁడును బోలె
నరద మెక్కె [9]నింక నడ్డపడఁగ
[10]నలవియే పురారి కైనను వీనిచేఁ
జచ్చు[11]వాఁడు గాక సైంధవుండు.

169. వ. అనుచు [1]నీయోధవీరు లందఱును బెండువడి యుండిరి గాని [2]యందు నొకండేని[3]యు నక్కున మాఱ్కొనువాఁడు లేఁ డయ్యె నట్లు [4]గోపాలదేవుండును [5]గ్రిడియు [6]బాలక్రీడవిధంబుగా విహరించి యనాయాసగమనవిలాసంబు మెఱయం జని చని ప్రొద్దు వాలుట గనుంగొని పాంచజన్యదేవదత్తంబు లొత్తి రయంబు గైకొని యరిగి యాచక్కటిం గొందఱు నరపతు లొండొరులం బురికొల్పికొని యడ్డపడి [7]తవులు వెట్టి బెట్టు పెనంగి సముద్రంబు సొచ్చినయేఱులుం బోలె నడంగి రట్లు సైన్యంబు గడచి బలితంపు వల ద్రవ్చికొని వెలువడినమహామత్స్యంబు[8]లును రాహుముఖంబు [9]వెడలిన [10]చంద్రార్కులుం బోలెఁ బొలిచి యట వోవుచుండ నయ్యెడ సైనికులు సింధురాజుపని సాలించి తొలఁగి రిత్తెఱంగున దుస్తరంబులగు[11]బహుళబలంబుల నిస్తరించి యయ్యిరువురుం దల యెత్తి చూచి తమలో ని ట్లనిరి.

---

3. నలుగుల ఘటియించి యమ్ముల దాని కి ల్లమరగట్టి – కొన్ని ప్రతులు; నలుగుల నెడ(నిగు)డించి యమ్ముల...గట్టి – ర. హ. 4. యిమ్ముల...గట్టి – వ; యిషువుల...గట్టి – ఐ. ఓ. 5. దాహము – ఉ. ఠ. 6. నరదంబు – అ. గ. జ. బ. 7. నవల – కొన్ని ప్రతులు. 8. గౌరవమున – కొన్ని ప్రతులు. 9. నితనికడ్డ – ఇ. ఐ. 10. నరిదియే – చ. హ. 11. గాక నేడు సైంధ – ఊ. ఏ.

169. 1. నయ్యోధులు బెండు – కొన్ని ప్రతులు; నయ్యోధవరులు బెండు – కొన్ని ప్రతులు; నయ్యోధముఖ్యులు బెండు – ఓ. హ; నీయోధులందఱు బెండు – ఐ. ఒ. ద. శ. ష. 2. యందొక్కండేని – కొన్ని ప్రతులు; యందొక్కరుండేని – కొన్ని ప్రతులు. 3. యుమాఱ్కొను – కొన్ని ప్రతులు. 4. గోపాలుండును – కొన్ని ప్రతులు. 5. గిరీటియు – ప. వ. 6. నతి మనోహరంబుగా – ద. వ; బాలక్రీడావినోదంబుగా – న. 7. తవులు వడి పెనగి – స కొన్ని ప్రతులు; తడవు పెనగి – ఎ. స; తవులు వెట్టి పెనంగి – పెక్కు ప్రతులు. 8. లుంబోలె – కొన్ని ప్రతులు; విధంబున – ఊ. ఏ. 9. వెలువడిన – కొన్ని ప్రతులు. 10. చంద్రాదిత్యు – ఘ. ఝ. డ. వ; చంద్రసూర్యు – ఊ. ఏ. 11. బహుజలంబుల – పెక్కు ప్రతులు; బహువ్యూహంబుల – ఇ. ణ.

170. ఆ. వీఁడె సైంధవుండు వీని[1]చుట్లను గృప
శల్యగురుతనూజసౌమదత్తి
కర్ణకర్ణసుతులు గావలియున్నారు
పోటుమగలు గాన పూఁచి పట్టి.

171. వ. అని పలికి వార[1]లలో నాజయద్రథుం దప్పక చూచి వెండియు.

172. క. వీ రేమి గాచెదరు తా
నేరూపున బ్రదుకు వీర [1]లేల సురలు జం
భారియుఁ గాచినఁ దన్నును
శౌరి[2]సమరి కాక నింగిఁ బడనిచ్చెదమే.

173. క. అనుపలుకులు నీయోధులుఁ
దనయులు వినుచుండ ఘోరతరదుర్గము తె
ల్లను గడచి [1]లాభదేశము
సనఁ జొచ్చినవణిజు లట్ల సమ్మదలీలన్.

174. వ. ఒప్పినయప్పురుషసత్తములం గనుంగొని యారథికజనంబులు విస్మయంబునం
[1]దమలో ని ట్లనిరి.

175. తే. పెక్కునదు లీఁది వెడలుట పేర్చుదావ
శిఖలు గడచుట దారుణాశీవిషముల
శారి దప్పుట గాదె కుంభజముఖోగ్ర
శూరయోధుల మిగిలి వచ్చుట దలంప.

---

170. 1. చుట్టును – సూ. కొన్ని ప్రతులు.

171. 1. లా జయద్రథుం – కొన్ని ప్రతులు.

172. 1. లిల నాసురబృందారకులు – వ. 2. సమరువాడ రథము బఱపుము వేగన్ – ఛ. వ. శ.

173. 1. లోభ – వ.

174. 1. విస్మయంబున – పెక్కు ప్రతులు.

176. వ. అనుచు నా[1]కృష్ణుల నుపలక్షించి.

177. క. గురుముఖజవహులరథికశరో
త్కరముఁ చే నైనక్రొత్తగంట్లను సుమనో
భరితనవకర్ణికార
స్ఫురితాచలయుగముభంగిఁ [1]బొలిచిరి చూడన్.

178. క. అని యగ్గించుచు సింధువి
భుని[1]దెస విగతాశు లైరి భూవల్లభ[2]య
వ్వనజాక్షు లెట్టు[3]సెర లో
ప్ప నతని వీక్షించి [4]యార్చి బరవస [5]మలరన్.

*—: కవచధారణంబున దుర్యోధనుం డర్జునుతోఁ దలపడుట :—*

సం 7_76_37

179. వ. [1]కడంగి రంతఁ గురుపతి గూడవచ్చి కుంభసంభవకృతం బగుకవచంబుకతం
బున భయంబు దక్కి బలంబునకుం దలకడచి తనరథంబు జయద్రథు[2]ఘం
డున్నదిక్కున కడ్డంబు[3]గాఁ జొచ్చిన నతని సూరెల నున్న[4]వీరలోకంబు
ముదంబున సింహనాదంబులు సేయ శంఖభేరీస్వనంబులు సెలంగం దమ తేరికిం
గట్టెదు రై నిలిచి[5]నం గని కృష్ణుండు [6]గ్రీడి కి ట్లనియె.

180. క. ఆపద ముట్టినయెడ ని
ల్లెపారఁగ వలదె [1]రథికుఁ డీతఁడు శకవ

---

176. 1. కృష్ణార్జునులనుప - కొన్ని ప్రతులు; జిష్ణుల - ఓ.

177. 1. బోరిరి - వ.

178. 1. యెడలనిరాశు - ఊ. ఏ. 2. భుల - ఊ. ఏ. 3. కనులొప్ప - వ. 4. మిగుల - వ. 5. మెసగన్, మొప్పన్ - వ.

179. 1. కసిమసంగి రివ్విధంబున గురు - ఊ. ఏ. 2. భు(ని)దిక్కున - కొన్ని ప్రతులు; భుని రథంబున - ఐ. ఓ. ఔ. 3. గారానిచ్చి - అ. గ. వ; గాబోనిచ్చి - ఎ. ద. వ గా నిలిపి - ఇ. ఒ. ఓ. వ. 4. శూరలోకం - కొన్ని ప్రతులు. 5. పొలిచినం గని కొన్ని ప్రతులు. 6. గిరీటి - పెక్కు ప్రతులు.

180. 1. ధీరుడే - వ.

తోఁకహో[2]ద్దీప్తుఁడు [3]మాచెసఁ
జాపకళావేది దర్పసంపన్నుండున్.

181. క. గోమునఁ బెరిఁగినవాఁడు మ
హా[1]మానోదగ్రచిత్తుఁ డట్లగుటను సం
[2]గ్రామంబున కలుకం డు
ద్దామభుజావీర్యదుర్మద[3]స్ఫూరితుండున్.

182. క. మనకును నితనికి సైంధవుఁ
డనునొడ్డున నయ్యె జూద మధి[1]కౌద్ధత్యం
బున గెలువుము చిరకాలము
[2]మనమున రారాజు నలుక [3]మ్రందింపు తగన్.

183. ఉ. ఈతఁడు మీకు నాపదల కెల్లను మూలము ధర్మపుత్త్రు[1]దు
ర్ద్యూతమునం బరాభవము [2]నొందఁగ జేసినపాపనిశ్చయుం
డాతరుణీలలామమున కమ్మెయి భంగ మొనర్చె వీఁడు నీ
చేతులలా వెలుంగఁడు విశిష్టశుభం బిది నీకు ఫల్గునా.

184. క. ఎఱిఁగినఁ జేరఁడు చేరుట
యెఱు[1]కువ మై మనకు దైవ మిచ్చినసిరి యి
ట్లఱిమిన [2]యాలో గ్రక్కున
[3]నఱకు మితఁడు దెగిన మనమనఃపీడ దెగున్.

---

2. ద్దితుండుమా – కొన్ని ప్రతులు. 3. మీదెస – పెక్కు ప్రతులు.

181. 1. మహిమోదగ్ర – కొన్ని ప్రతులు; మ్యానగ్రస్తచిత్తు – ఊ. ఏ. ఖ. చ. ల. వ. [illegible]. మ. స. 2. గ్రామమునకునలు, గ్రామమునకునులు, గ్రామమునకు భీకరు డుద్దామ– అని పాఠములు. 3. స్ఫూర్జితుడున్ – ఓ.

182. 1. కౌత్సుక్యం – ఎ. ఒ. ఓ. త. 2. మనంబునను రాజు – కొన్ని ప్రతులు; మనమున వెస రాజు – వ. 3. మండింపు – కొన్ని ప్రతులు; మర్దింపు – అ. ఇ. వ.

183. 1. నింద్యూత – అ. ఆ. వ. 2. దొర్లగ – హ.

184. 1. కమెయిన్ – బ. వ. వీ. ష. సూ. 2. యీలోగ్ర – ద. వీ. సూ. 3. నరుము మితడు – వ.

185. మ. వెరవే సంపదఁ గోరి గాండివగుణావిర్భూతబాణాలి కి
[1]ట్లెర వై యె వచ్చుట యిమ్మహీపతి కితం [2]డేలొక్కొ యత్యంతని
ష్ఠురశౌర్యో[3]న్నతి నిన్నుఁ దాఁక దలఁపం జోద్యంబు నీ డగ్గ మై
దొరకో లర్జున [4]నీకుఁ దొంటి సుకృతస్తోమంబుకల్మిం జుమీ.

186. క. ఇతఁడు వడినఁ బ్రజ విచ్చును
ధృతి సైంధవుఁ [1]డలిమెనేనిఁ దెగు నాతం డు
ద్ధతి విడిచి [2]పాఱిపోయినఁ
[3]బ్రతిన కడియ చాలుఁ గడఁగు పటుశౌర్యనిధీ.

187. వ. అని పెక్కుభంగులం జెప్పిన [1]విని విష్వచ్చుం డచ్యుతు నాలోకించి.

188. ఉ. ద్రౌపది వడ్డబన్నము లుదగ్రత మేదినిఁ బెద్దకాల మి
చ్ఛాపరతంత్రుఁ డై తనవశంబుగఁ జేసిన వీని[1]గర్వముం
గోపము వెంపదే మనము గుందఁగఁ జేయదె యింత సెప్ప నే
లా పొరిగొందు నీతనిఁ జలంబు బలంబును నీవు మెచ్చఁగన్.

189. ఆ. ఒరులదిక్కు [1]సనకయరదంబు నీతని
యున్నయెడకు నడపు మన్న నతఁడు
నట్లు చేయఁ దనకు నభి[2]ముఖు లై వచ్చు
వారిఁ జూచి మనుజవల్లభుండు.

190. క. మనమునఁ గొంకక యెదురుగఁ
జనియె నిజోద్ధతికి మెచ్చి జనపాలకు లె

---

185. 1. ట్లిర వై — వ. 2. డిందొక్కొ డత్యంత — ర. 3. ద్ధతి — వ; న్నతి తోడ దాకె— ఐ. 4. నీదు తొంటి — కొన్ని ప్రతులు.

186. 1. డడ్డ మైన — ద. వ; డడరె నేని — న. అ. 2. డాగిపోయిన — స. కొన్ని ప్రతులు. 3. బ్రతికినదియ — వ.

187. 1. విని — పెక్కు ప్రతులలో లేదు.

188. 1. దర్పముం — న.

189. 1. రథము నరుపక యవ్విభు డున్న యెడకు — ద. వ. 2. ముఖ మై — ద. వ

ల్లను విచ్చలింప సేనా
నినదం బెసఁగఁగ ఘోర[1]నిష్ఠురవృత్తిన్.

191. క. తముఁ బిలుచుచు నివ్విధమున
సమ[1]దాటోపగతి నడరు జనపతిఁ గని చి
త్తము లలర నార్చి నిజశం
ఖము లొత్తిరి శార్ఙ్గధరుఁడు గాండివధరుఁడున్.

192. చ. ఎలమిఁ జెలంగు కృష్ణుల యహీనసముద్ధతిఁ జూచి [1]శోకవి
హ్వాలు లయి మానవేంద్రుదెస నాసలు [2]మాని మృగంబు భ్రాంతి ను
జ్జ్వల[3]దనలంబులో నుఱుకుచందముగాఁ గొని నీదుయోధవీ
రు లకట చచ్చెఁ జచ్చె నని మ్రోయఁగ నాతఁడు వారి కిట్లనున్.

193. క. భయ మేటికి వినుఁడు ధనం
జయునిం గేశవుని నాదుశర[1]కీలాసం
చయమున [2]నేర్చెదఁ జేర్చెద
నయనానందంబు మీ కొనర్చెదఁ [3]గడిమిన్.

194. వ. అని పలికి పార్థుం గనుంగొని యవష్టంభంబున.

### -: దుర్యోధనుఁ డర్జునుం దలపడి యధిక్షేపించుట :-

సం. 7_77_35

195. చ. వినుము కిరీటి దివ్యశరవేది వి నాఁ జను దేను లేనిచో
టను మును సెల్లె నీకు నిచటం జన నిత్తునె యిప్డు నీబలం

---

190. 1. నిశ్చయ వృత్తిన్ – పెక్కు ప్రతులు; నిశ్చయ భంగిన్ – ఓ. జ; నిశ్చయ బుద్ధిన్ – ద. ప.

191. 1. రాటోప – ల. హ; దాటోపమున – న. వ.

192. 1. కోపవి – ఈ; వారువి – వ. 2. మాలి – ప. వ. 3. దహనంబు – హ.

193. 1. లీలా – వ. 2. నెదిర్చి పేర్చెద – వ. హ; నేర్చెద జూడుడు – ఒ. 3. ప్రీతిన్ – వ.

బును హరినేర్పుఁ జూచుటకుఁ బోరికి వచ్చితి నీవు పాండురా
జునకు జనించి తేనిఁ [1]దెగి చూపుము శౌర్యము నస్త్రవీర్యమున్.

196. వ. అనుచుఁ గ్రూరంబు లగుమూఁడు[1]నారాచంబుల నన్నరు నేసి శరచతుష్ట
యంబున హయంబులు నొప్పించి పదిబాణంబులు పద్మనాభునురంబునం
గ్రుచ్చి [2]మునికోల యొక్కకోలం దునిమినం గినిసి క్రీడి యాతనిపైఁ జతు
ర్దశ[3]నిశితప్రదరంబులు వరగించిన నవి యమ్మహీపతిమైమఱువు దాఁకి
మిట్టి[4]పడుటయుం జూచి తొమ్మిదిదూపులతోడం బంచాశుగంబులు నిగిడిం
చిన[5] నవియు నిష్ఫలంబు లగుటయు [6]నిరువదెనిమిది[7]బాణంబు లడరించె
నవ్వాలమ్ములు నమ్మెయిన వమ్మైన విషాదంబున వాసుదేవుండు వాసవి
కిట్లనియె.

197. క. మున్నెన్నఁడు నివ్విధ మేఁ
[1]గన్నది గా దమ్ము [2]లెడలె గాండీవము లా
[3]వున్ని భుజములశక్తియు
మిన్నక పోఁ జిత్ర మిది యమిత్రధ్వంసీ.

198. ఆ. నీకుఁ జూడ ముష్టి నెలవు నాకర్షణ
గాఢతయును బాణగతియుఁ దొంటి
యట్లొ యొండుభంగి యై తోఁచెనో నాకు
నున్నరూపు [1]సెప్ప వన్న పార్థ.

---

195. 1. దగ జూపుము – వ.

196. 1. నారసం – కొన్ని ప్రతులు. 2. ములుకోల – కొన్ని ప్రతులు. 3. విశిఖంబులు వర – వ. 4. పడంజూచి – కొన్ని ప్రతులు; పడుట చూచి – పెక్కు ప్రతులు. 5. యమ్మహాస్త్రంబు లవియు నిష్ఫలంబు – కొన్ని ప్రతులు. 6. నిరువై యెనిమిది – కొన్ని ప్రతులు. 7. నిగుడించిన నవ్వాలమ్ములు వమ్మైన – కొన్ని ప్రతులు.

197. 1. గన్నారగ జూడ లేదుగాం – హ. 2. లడరె – వ; వెడలె – సూ. 3. వున్నిజ భుజ – వ.

198. 1. చెప్పు మన్న – కొన్ని ప్రతులు.

199. చ. పిడుగుల యట్లు తాఁకి రిపుబృందములం దెగటార్చు నాఁటి నె
ప్పుడు భవదీయ[1]దివ్యశరపుంజము [2]లొక్కట నిప్డు [3]పొల్లు వో
యెడు నిది నీవు నిమ్మతివిహీనపుజంతువు [4]నేమి నేట్లకుం
జెడుటకు నొక్కొ విస్మయము సెందెదు డెంద మలంతఁ బొందెడున్.

200. వ. అని యిట్లు దన్ను నిదించుకొనుచు గోవిందుం డడిగిన బురందరనందనుం
డతని కిట్లనియె నిది యొక్కకవచధార[1]ణంబు మున్ను ద్రోణుఁ డొక్క
రుండ యెఱుంగుఁ బదంపడి నాకు నెఱింగించె నిప్పుడు సుయోధనుండును
నెఱుంగు దెఱంగు [2]గావించెం గావలయు నిమ్మోయి మైమఱువు త్రిలోకం
బుల కభేద్యం బగుట[3]యు నీవు నెఱుంగుదు వెఱింగియు నన్నడుగ నేల
భువనత్రయంబునందును [4]వస్తుప్రకారంబులు నీయెఱుంగనియవియుం
గలవే యది యట్లుండె నితండు దీని నగ్గురుకరుణం బడసినవాఁ డై.

201. క. విను మాఁటదివోలెం దన
తనువున కడ్డంబు గాఁగఁ దగిలిచికొన్నాఁ
డనఘ యిటు లైన [1]నె ట్లగు
నని [2]యెఱుఁగడు దీనివిధము లన్నియు దెలియన్.

202. క. నావింటి[1]బలువుఁ జేతుల
లావును జూడు మిదె నీతలం [2]కుడుగఁగ నే
నీవిభునిఁ గవచరహితుఁ
డై [3]విలసిల్లంగ నీక యలఁచెదఁ గృష్ణా.

---

199. 1. దీప్తశర – కొన్ని ప్రతులు. 2. లక్కట యిపు-స. కొన్ని ప్రతులు. 3. పొల్లఁబో – కొన్ని ప్రతులు. 4. నేమిచేతకుం – వీ. స; నేడు నేట్లకుం – హ.

200. 1. ణంబున నైనది మున్ను – న. 2. చేసెం గావ – కొన్ని ప్రతులు. 3. యు – పెక్కు ప్రతులలో లేదు. 4 సమస్తప్రకా – న. య.

201. 1. నీదగునని – వ; నిట్లగు – కొన్ని ప్రతులు. 2. తలపడు – వ; యెరుగుదు – వ. హ; యెరుగుదు మైన విధము – వ.

202. 1. బలిమి – వ; కొలది – ఊ. 2. కుడుగుము – కొన్ని ప్రతులు. 3. విలసిల నీక పీని వలచెద గృష్ణా – వ.

203. వ. అంగిరసుం డమరపతికి నొక్కమహాస్త్రం బిచ్చె దాని నతండు నా కొసంగె నది నిఖిలకవచనిర్భేదనశీలం బై యుండు దాన నిమ్మోయిమలు [1]వలువుల్లు [2]సేసెద.

204. క. అని వెస నాదివ్యశరం
బనూనమంత్ర[1]ప్రకాశ మగునట్టులుగా
గొనయమునఁ [2]జేర్చి తిగిచినఁ
గని యశ్వత్థామ బాహుగర్వం [3]బలరన్.

205. తే. [1]అధిపసర్వాస్త్రఘాతి యై యతిశయిల్లు
నస్త్రమునఁ జిత్రముగఁ [2]దెగయంద తునిమె
నమ్మహాస్త్రంబు న ట్లది వమ్ము [3]గాఁగ
నెఱిఁగి వెఱఁ గంది హరి కతఁ డిట్టు లనియె.

206. వ. ఆచార్యపుత్రు నస్త్రప్రభావంబున నవ్విశిఖంబు వినిహతం బయ్యెఁ బునః ప్రయోగంబు సేసిన నది యొప్పమి [1]సేయు నని వింటి [2]నావింటి[3]బలిమిన సాధించెదం జూడు మను [4]నవసరంబున నయ్యిరువురను దుర్యోధనుండు.

207. క. తొమ్మిది తొమ్మిది [1]వాలిక
యమ్ముల మున్నేసి పటుశరాసారము పైఁ
గ్రమ్మించిన మనదెసఁ దూ
ర్యమ్ములు[2]నుం గీర్తనములు నార్పులుఁ జెలఁగెన్.

---

203. 1. వరువుల్లు(?) – వ. 2. గావించెద – పెక్కు ప్రతులు.

204. 1. ప్రకారమగు – కొన్ని ప్రతులు. 2. బేర్చి – వ. య. ల. పీ. హా. 3. బెసగన్ – ఈ; బమరన్ – ర.

205. 1. అదియు సర్వాస్త్ర – య. 2. నెఱయంగ దునిమె – జ. బ. దెగనంత(దెగయంగ)దునిమె – వ. 3. గావుచెఱిగి – ఈ. ఖ. మ. య. శర; గావుదెరిగి – మ; వోవుచెరిగి – కొన్ని ప్రతులు.

206. 1. యగునని – వ. 2. నావింటి – ర. ప్రతిలో లేదు. 3. బలువున – ద. ప. వ. 4. సమయంబున – పెక్కు ప్రతులు.

207. 1. వాలికె – కొన్ని ప్రతులు. 2. సంకీర్త – వ.

208\. ఆ. అలిగి యవుడు గఱచి యన్నరుఁ డాన్నృపు
తురగములను సూతుఁ [1]దునిమి వైచి
రథము నఱకి యధికరయమునఁ దఱచుగ
నాఁటెఁ గరతలముల నారసములు.

209\. వ. ఇట్లు విరథుండును వికలహస్తుండును నై [1]విషణ్ణుం డగునన్నరనాథుండు వెడం గగుటం గటకటం బడి యాకంకటంబు నిష్ఫలం బనుబుద్ధిం బుచ్చి వైచి యొం[2]డొకకవచంబు దొడిగె నయ్యెడరు గనుంగొని శీఘ్రంబునం దత్సైనికోత్తములు [3]చతురంగబహుబలంబులతోఁ [4]గవిసి కవ్వడిం [5]జుట్టి ముట్టి యలుఁగుల[6]సోనలు గురిసిన నతండు సంరంభవిజృంభితుం డగుటయు.

210\. చ. అఱిముఱిఁ ద్రెళ్లెఁ దేరులు గజావళి [1]గూలెఁ దురంగమాంగము
ల్గిఱికొనియెన్ మహిన్ భటులు లెక్కకు మిక్కిలి సేన [2]పాడుగా
[3]నఱుమయి రప్డ కృష్ణుఁడు నినాదము భూగగనాంతరంబునం
దఱచుగ నొత్తె నిర్మథిత[4]దానవసైన్యముఁ బాంచజన్యమున్.

211\. తే. [1]అట్లు భీషణ మగునర్జునాక్రమంబు
ఘోర మైనమురారిశంఖారవంబు
నధికభయసంభ్రమంబుల నావహింప
నధిప నలుగడఁ [2]బఱచె సైన్యంబు గలఁగి.

212\. వ. [1]ఇత్తెఱంగున.

---

208\. 1. ద్రుంచి - కొన్ని ప్రతులు.

209\. 1. విషన్నుం - ల; వివర్ణుం - వ. 2. డుక(గ)వ - కొన్ని ప్రతులు. 3. తురగస్యందన బహుళంబులగు బలం - వ; చతురంగ బలం - కొన్నిప్రతులు. 4. గదిసి - ఊ. ఖ. హ. 5. జుట్టు ముట్టి - ల. 6. వానలు - కొన్ని ప్రతులు; వాన గురియ - వ.

210\. 1. దూలె - వ. 2. పెల్లుగా - ఉ. 3. నరికె నరుండుకృ - ద. వ; నరకిన యప్డుకృ-ల; నురుమయి రప్డ కృష్ణుడును నొక్కట భూగగ - హ. 4. శాత్రవ సైన్య - వ.

211\. 1. అట్లు - పెక్కు ప్రతులు. 2. బారె - రల.

212\. 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

213. క. మును [1]సంకట[2]పడి మూఁకలు
గనకని [3]విచ్చుటయుఁ బిదప [4]గాండివి [5]మెఱసెం
బొనుఁగుపడి యుండి తగుగా
ఢ్పున [6]మండుమహానలంబుపోల్కి మహీశా.

214. వ. అయ్యవసరంబున సింధురాజరక్షకం బైనబలంబు సంక్షోభసహితం బగును
త్సాహంబునం బొద[1]లి శంఖభేరీపణవాద[2]క్వణనమేదురసింహనాదభరితరోద
సీకుహరం బయ్యె నచ్చిడిముడి[3]పడుట యవలోకించి.

215. క. మందస్మితసుందరవద
నేందు లగుచు హరియు నరుఁడు నేత్రైఁ బ్రియముల్
డెందము[1]లం బొంద భవ
న్నందనుపై నురవడించినం గని [2]కడఁకన్.

–: వృషసేనుండు లోనగు నెనమండ్రురథికు లొక్కపెట్ట యర్జునుపైఁ గవియుట :–

సం. 7–79–1

216. క. వారలఁ బొదువ నడరుబలు
తేరుల మొత్తముల [1]మిగిలి దీప్తపటు[2]రథో
దారు లగుచు నెన[3]మండ్రురు
వీరులు దఱిమిరి నితాంతవేగోజ్జ్వలు లై.

217. వ. [1]వా రెవ్వ రెవ్వ రంటేని.

---

213. 1. సందడి పడి – ఇ; సనకట పడి – వ; సంకుల పడి – న. ప. 2. పడు మూకలు – ర. ల. 3. బరచుటయు – శ. 4. గాండీవి వెసన్ – హ. 5. వొలిచెన్ – వ. 6. బొదలు మహానగంబు – వ.

214. 1. వి – ఘ. చ. బ. 2. రణన – ఒ. న. ల. హ. 3. పాటవలో – న.

215. 1. లొంద(దం) గ(ను) భవన్నందనుపై – కొన్ని ప్రతులు. 2. కినుకన్ – ట.

216. 1. మించి – జ. బ. 2. రవో – కొన్ని ప్రతులు; రయో – న. 3. మండురు – వ. సం. హ.

217. 1. వారెవ్వరం టేని – పెక్కు ప్రతులు; వారెవ్వ రనిన – ర.

218\. క. దండిమగ లైన నృపసే
నుండు [1]శలుఁడు సైంధవుండునుం గృపుఁడును గ
ర్ణుండు గురునందనుఁడు శ
ల్యుండును భూరి[2]శ్రవుండు నుర్వీనాథా.

219\. వ. [1]అందఱు నొక్కమొగ లై.

220\. క. తనదైన ప్రతిన నెఱవుట
కును ముఖ్యోపాయ మది యగుట నట్లు సుయో
ధనుఁ బరిమార్పఁ గడఁగుఫ
ల్గునుఁ దలపడి [1]రాత్మశంఖఘోషంబులతోన్.

221\. క. అట్టియెడ దేవదత్తము
[1]బిట్టొత్తె నరుండు పెక్కుపిడుగుల మ్రోఁతఁ
[2]బెట్టు వఱచుతన్నినదము
పుట్టించెను దిగులు నీదుపుత్రకుసేనన్.

222\. తే. చెవులు బీఁటలు వాఱంగఁ జెలఁగునమ్మ
హారవమ్మున [1]కులుకక యతనిమీఁద
విభుఁడుఁ గర్ణాదులును శరవృష్టి గురిసి
[2]రడరి సైంధవుదిక్కున కడ్డపడుచు.

223\. వ. ఆసమయంబున నశ్వత్థామ [1]యుబ్బి డెబ్బదిమూఁడుమార్గణంబుల మురవైరిని [2]భల్లత్రయంబునం బార్థుని నైదుశరంబులం దురంగంబు[3]లం గేతువు

---

218\. 1. గురుడు – ర. 2. శ్రవసు దుర్వీనాథా – వ.

219\. 1. ఇట్లందరు – వ.

220\. 1. రందరును నకుంఠిత బలులై – ట. వ.

221\. 1. బెట్టొత్తె – వ. 2. బిట్టుపరవు; పట్టువరచు – వ.

222\. 1. కలుకక – ల. 2. రధిప – కొన్ని ప్రతులు.

223\. 1. యు డెబ్బది మూడు – జ. వ. 2. బాణత్రయం – య. 3. లగేతనంబు నొక్క విశిఖంబున నేసిన – వ.

నేసిన నవ్వాసవి యతని [4]నూటయాఱింటను గర్ణునిఁ [5]బదింటను వృషసేనుని [6]మూఁటను నొప్పించి యొక్కకత్తి[7]వాతియమ్మున శల్యు[8]చాపంబు ముష్టికిం ద్రుంచిన.

224. సీ. వేగంబ వేఱొక్కవిలు గొని మద్రేశుఁ డతనిపై దొమ్మిదియమ్ము [1]లేయ
ముప్పదిరెంటను మూఁట నేనిండిను బదియింట [2]నలువదిబాణములను
గర్ణభూరిశ్రవఃకర్ణనందనకృపగురుపుత్రు లేసి రన్నరుని మఱియు
నాతనిమీఁద [3]దివ్యాస్త్రంబు లైదు గో[4]విందుమై సప్తతివిశిఖములును

తే. ద్రౌణి [5]నిగిడించె నట్టిసందడి జయద్ర
థుండు వారలమఱువున నుండి పఱపె
సరథ[6]సముఁగఁ ద్రిసప్తతిసాయకంబు
లమ్మహాబాహుదెసఁ గౌరవాధినాథ.

225. వ. ఇట్లు పెక్కం డ్రొక్కపెట్టపె ల్లేసినం గినుక [1]నూనిన[2]నవ్వు రౌద్ర
రసం[3]బు నలంకరింప.

226. క. వడి రాధేయుని నాతని
కొడుకును బంౘెంట [1]మూఁటఁ గుదియించుచుఁ గ
వ్వడి యొకబలుతూపున నె
క్కుడురయమునఁ [2]దునిమె శల్యుకోదండంబున్.

227. ఆ. తునిమి [1]తోన యతనిఁ దొమ్మిదియమ్ముల
ప్రుక్కఁ జేసి మూఁట సోమదత్త

---

4. నోలి యారింట – వ; నూటరువదింట – న. బదియేనింటను – ఓ. 6. బద మూటను – ద. ప; బదమూడింటను – వ. 7. వాలమ్మున – వ. 8. చాపంబు ద్రుంచిన – ద. ప.

224. 1. లేసె – పెక్కు ప్రతులు. 2. నిరువది – జ. 3. దివ్యాస్త్రంబు – వ. 4. పై – ఐ. బ. ల. 5. నిగుడించె – కొన్ని ప్రతులు. 6. సంబుగ సప్తతి సా – వ.

225. 1. బూనిన – కొన్ని ప్రతులు. 2. రౌద్రంబు నలువంకనలం – అ. 3. బు వదనంబు నలం – మ. ర. వ.

226. 1. రెంట – బ. వ. 2. ద్రుంచె – ఓ.

227. 1. కినుక నతని – అ. జ. బ.

తనయు నెనిమిదింట ద్రౌణిని నిరువదే
నింటఁ గృపుని నొంచి నిలువరించె.

228. వ. మఱియు నిరువది మెఱుంగువాలమ్ము[1]లశ్వత్థామ[2]యంగంబునం గ్రుచ్చె ని ట్లిందఱతోడను గ్రందుకయ్యంబు సేయు[3]సమయంబున నొక్కొక్కమరి వారిపిఱుం[4]ద [5]నోర వాఱం దోఁచుజయద్రథు నేయం [6]దిఱుకున్నం దమ కంబున నెడనెడ నఱిముఱింద ద్రథంబు దెస[7]కు నతఁడు వాఱ విడిచిన విశిఖంబులు నూఱుగల వప్పుడు భూరిశ్రవుండు వాసుదేవుని [8]చేతి[9]మునికోల [10]నొకకోలం దునిమి కడసి క్రీడిమేనం [11]ద్రిస ప్తతిశరంబులు వరగించెం దక్కటివా[12]రును నొక్కమొగిం గ్రూరనారా[13]చంబులు గుప్పించి నొప్పించిన.

229. శా. కోపాటోప[1]మహోగ్రమూర్తి యగుచుం గోదండటంకారలీ
లాపూర్ణం[2]బుగ భూనభోంతర మతం డయ్యోధులఁ బాణజా
లాపాతంబునఁ దూల [3]నేసి చటులవ్యాపారఘోరానిలా
క్షేపక్షోభితవారివాహచయభంగిం జూపె నేపారఁగన్.

230. వ. అట్లు విచ్చియుం [1]గూడికొని [2]మూఁకలం [3]గూర్చికొని యొండొరులం బురి[4]కొల్పికొని.

---

228. 1. నశ్వత్థామ యంగంబున నిరువది(మెరుంగు)వాఁమ్ములు గ్రుచ్చె – ప. వ; నిరువది నాలుగు వా – ఘ. ఝ. ఢ. 2. యురంబునం – కొన్ని ప్రతులు; యరదంబునం – ల; గలయం గ్రుచ్చె – ఊ. ఫ. 3. నవసరంబున – ద. ప. ర. వ; నెడ – ఎ. 4. దన నిల్చి ఘోరనారాచంబు లేయ జయద్రథు – ట. వ. 5. నరవాఱం దోచు – స; నోర పారం దోచు – వ; దోతెంచు జయద్రథు – అ. గ; జారి పారం దోచు – ఆ. ద. వ; సగ పాటు దోచు – ల; వార బోరం దోచు – ర; నరవరగా దోచు – ఒ. 6. దేటపడకున్నం – ద. ప. 7. కుబాఱ – ల. శ. ష. 8. వుండు పట్టిన ముని – ఔ. ఙ; వు మునికోల – పెక్కు ప్రతులు. 9. మును(లు) – కొన్ని ప్రతులు. 10. నొక కోలం – పెక్కు ప్రతులలో లేదు. 11. ద్రి – కొన్ని ప్రతులలో లేదు. 12. ర లొక్కుమ్మడి – ఇ. ట. వ. 13. చ నిచయంబులు – ఖ. చ. వ; చ జాలంబులు – గ. ఘ. బ.

229. 1. సమగ్ర – ఇ. 2. బగు – ఎ. వ. 3. జేసి – కొన్ని ప్రతులు.

230. 1. గూడుకొని – పెక్కు ప్రతులు. 2. మరల మూక – కొన్ని ప్రతులు. 3. గూర్చుకొని – పెక్కు ప్రతులు. 4. కొల్పుకొని – పెక్కు ప్రతులు.

231\. క. అరథి[1]కు లొక్క మొగి న
వ్వీరునిపైఁ [2]గవియుటయును విస్ఫురితశరా
సార మతఁడు [3]నిగిడించిన
వారిబలము లెల్ల రక్తవారిం దేలెన్.

232\. వ. ఇత్తెఱంగునం దెరలచుం [1]బొదువుచు భవదీయసైనికలోకంబు వోక పెనంగె ననిన విని [2]యప్పు డేమేమి యడియాలంబులతో నెవ్వ రెవ్వరి సిడంబులు మెఱసియుండె నని యాంబికేయుం డడిగిన సంజయుం డిట్లనియె.

233\. సీ. ప్రస్ఫురద్వానరపతియును సింహలాంగూలంబు నుజ్జ్వలగోవృషంబు
వారణకక్ష్యయు భూరిమయూరంబు [1]సితయుఁ గాంచనసింధురంబు
[2]రత్నయూపంబును రజతవరాహంబు నుద్దీప్యమానమహోరగంబుఁ
గేతనంబుల నొప్పుఁ గ్రీడికి నాచార్యసుతునకుఁ గృపునకు సూతజునకు

తే. నతనినందనునకును మద్రావనీశ్వ
రునకు శల్యునకు భూరిశ్రవునకు [3]సైంధ
వునకు రారాజునకు నిట్లు దనరి [4]మెఱయుఁ
బడిసిడంబులు నభమునఁ [5]బ్రభలు నిగుడ.

234\. క. మనతోమ్మిదిసిడములకం
టెను నుజ్జ్వల మగుచు [1]నొక్కటియ పెక్కై యెం

---

231\. 1. కోత్తము లొగి నప్పురు షుపై గవియుటయును స్ఫురిత ఘన శరా -వ; కోత్తము లొగి వవ్వీరు - కొన్ని ప్రతులు. 2. బొదువుటయును - కొన్ని ప్రతులు. 3. నిగుడించిన - పెక్కు ప్రతులు; గురిసెను నీ వారి - ఊ. ఏ.

232\. 1. బొదలుచు - హ. 2. యాలంబులో నెవ్వ రెవ్వరి - వ.

233\. 1. శిఖియును - కొన్ని ప్రతులు; సిత కదళియు హేమసింధు - హ; మద్రరాజస్య శల్యస్య...సీతా మప్రతిమాం శుభాం - పి. పి. ఎస్. ద్రోణ. 92-18 2. రత్నమయూఖంబు - కొన్ని ప్రతులు; సౌమదత్తే పునర్యూపో - పి. పి. ఎస్. ద్రోణ 92-22 3. సింధుపతికి నీ యుగ్రసుతునకు బరగి సిడములుజ్జ్వలంబుగ వర్తించె నుగ్రభంగి - ట. వ. 4. వెలుగు, వెలుగె, మెఱయ, మెరసె - అని పాఠములు. 5. బ్రస్ఫుటముగ - ఊ. ఏ.

234\. 1. నెక్కటి యె - ర.

దును ²దాన తోఁచు నయ్యె
ర్జునుసిడము మహోగ్రతం గురుకులనాథా.

235. తే. అనుడు నమ్మేదినీశుఁ డి ట్లనియె నట్లు
క్రీడివిస్మ¹యావహారణక్రీడ సలుప
గురునిదర్పంబుచే నాఁక ²గొనినధర్మ
సూనుసైన్యంబు లె ట్లయ్యె సూతతనయ.

236. వ. అనుటయు సంజయుం డతని కి ట్లనియె.

237. క. ¹అయ్యెడ ఖేచరులకు వెఱఁ
గయ్యెడుచందమున నట్టియవసరమున బ
ల్కయ్యము గురుబలముతో
²నయ్యె యుధిష్ఠిరబలోచ్చయంబున కధిపా.

238. వ. ¹ఆసంకులసమరంబున బృహత్క్షత్త్రుని క్షేమధూర్తియు ధృష్టకేతుని వీరధన్వుండును నకులుని వికర్ణుండును సహదేవుని దుర్ముఖుండును సాత్యకిని వ్యాఘ్రదత్తుండును ²దలపడిరి శల్యుండు ³సేనాముఖంబునకు వచ్చుచుం బోవు⁴చున్నవాఁ డగుట నుచితంబుమెయి ⁵నచ్చటియనికిఁ జొచ్చి ద్రౌపదేయులం దాఁకె భీమసేనుని నలంబుసుండును ధర్మనందను నాచార్యుండును ⁶మార్కొని రప్పు డయ్యుధిష్ఠిరుండు.

---

2. దానె - కొన్ని ప్రతులు.

235. 1. యమగురణ - వ. 2. గొనక - కొన్ని ప్రతులు.

237. 1. అయ్యెడ నభశ్చరుల వెఱ - స. పెక్కు ప్రతులు; అయ్యెడ నభశ్చరులకు - కొన్ని ప్రతులు. 2. నయ్యమనందను బలోచ్ఛయము - హ.

238. 1. అట్టి సంకుల - కొన్ని ప్రతులు. 2. మార్కొని రప్పుడ యుధిష్ఠిరుండు - వ; శలుండు ద్రౌపదేయులను భీమ - హ. 3. సింధురాజు కడనుండి యగ్గలిక మొగ్గరంబు మొగంబు వకువచ్చు - ఓ. త. 4. చుం(నుం)డువాడు - పెక్కు ప్రతులు. 5. నచ్చటి యునికిం జేసి ద్రౌప - ? ఈ. ఉ. 6. దలపడి - కొన్ని ప్రతులు.

-: ధర్మరాజు ద్రోణునితో యుద్ధము సేసి యోడిపోవుట :-

సం. 7-81-18

239. క. గురు[1]మెయిఁ [2]దొంబదిసునిశిత
శరముల నినుచుటయు నతఁడు సక్రోధుం డై
యిరువదియేనిట నాతని
యుర[3]స్థలము నొంచి పొదివె నుగ్రాస్త్రములన్.

240. క. రథమును [1]నశ్వమ్ముల సా
[2]రథిఁ దన్నును గప్పుశరపరంపర లెల్లన్
వృథ సేసెం గర[4]లఘుతా
ప్రథితుం డగు ధర్మసుతుఁడు [4]బాణౌఘములన్.

241. చ. అలిగి గురుండు ధర్మజుశరాసన మేర్తెఱఁ ద్రుంచి [1]పెక్కుల
మ్ముల సతురంగసూతముగ ముంచె రథం బదియెల్లఁ జూచి సే
[2]న లతఁడు పేర్చె నిమ్మనుజనాథుఁడు సచ్చునొ [3]యోడి పాఱునో
బలిమిఁ [4]దొలంగి పట్టువడి పాడటిపోవునొ యంచు నున్నెడన్.

242. క. ఒండొకవిలు గొని ధర్మసు
తుం డా[1]నిబిడాస్త్రసంతతులు రయముమెయిన్
ఖండించి తీవ్రశరమ్ముల
మండెడుఘనశక్తి వైచె మార్తురు దలఁకన్.

---

239. 1. పై - కొన్ని ప్రతులు. 2. తొంబది, తొమ్మిది - అని పాఠములు; నవత్యానత పర్వణాం - పి. పి. ఎస్. ద్రో 93-18. 3. మున్ బగిలించి పొదివె - ఎ.

240. 1. రథ్యంబుల - హ. 2. రథినిం దనుగప్పు - ర. త; రథిని దనుంగప్పు - క. డ. 3. లాఘవ ప్రథి - వ. 4. భార్గవ ముఖ్యా - అ.

241. 1. పెక్కు టమ్ము - చ. వ. 2. నలుగురు డేచె(ర్చె)నిమ్మనుజ - కొన్ని ప్రతులు. 3. పారిపోవునో - హ. 4. దలంకి - పెక్కు ప్రతులు.

242. 1. వివిధాస్త్ర సంత - ఒ. జ. వ.

243\. సీ. శక్తి [1]యాచార్యునిశక్తి మాయించుఁ బోమ్మని చూపఱల్లను నట్టు లెత్తి
రక్కుంభసంభవుఁడపుడు బ్రహ్మాస్త్రప్రయోగంబు సేసిన నుగ్రభంగి
నయ్యస్త్ర మాశక్తి నద్భుతంబుగ నేలఁ [2]గలపి యుధిష్ఠిరు[3]వలను నిగుడ
నమ్మహీవిభుఁడు బ్రహ్మాస్త్రంబునన యదియడఁగు నట్లుగఁ జేసి
యతనిమేన

తే. నైదుదూపులు [4]నాఁటి శరాసనంబు
దునుమ గద గొని వైచె నుద్ధురత నతఁడు
పఱియు గద వైవఁ దత్సన్నిపాత[5]జాత
చటులపావకజ్వాలలు చదల [6]నిగుడ.

244\. వ. ద్రోణుండు కోపించి.

245\. తే. ధర్మతనయురథ్యంబుల ధరణిఁ గూల్చి
ధనువుఁ [1]గేతువుఁ దునుమాడి తనువు నొంప
నాతఁ డరదంబు డిగ్గి నిరాయుధుండు
నూర్ధ్వబాహుండు నై యూరకుండె నధిప.

246\. క. కనుఁగొని గురుఁ డవ్విభు నే
యను [1]బోడువను జేతు లాడ[2]కట పార్శ్వములం
దనచూడ్కిఁ [3]బడినహాయరథ
మనుజద్విప[4]సముదయముల మడి[5]యించె వెసన్.

---

243\. 1. నాచార్యుని – ల. 2. గలిపి – అ. ద. బ. 3. వలన – పెక్కు ప్రతులు. 4. నినిచి – ఓ; నించి – ఒ. 5. భయద – వ. హ. 6. నిగుడె – కొన్ని ప్రతులు.

245\. 1. గేతనమును ద్రుంచి – ఐ.

246\. 1. బోదువను – పెక్కు ప్రతులు; బట్టను – ఇ. ఈ; బోదువంబట్ట జేతులాడక కెలనం– – ఒ. ఓ. ర; బోదువను దవుల జేతులాడక పార్శ్వంబున జూడ్కి – వ. 2. కాళ్చర్శ్వ ముగా – కొన్ని ప్రతులు; కప్పార్శ్వములం – కొన్ని ప్రతులు. 3. బద్ధ – కొన్ని ప్రతులు; బడిన హారిరథ – వ. 4. నిచయములను – వ. 5. యగ జేసెన్ – పెక్కు ప్రతులు.

247. క. [1]పోనీఁడు పొదువుఁ గుంతీ
సూనుని గురుఁ డనుచు నుండఁ జూపఱగము ల
మ్మానవపతి [2]యతిరయమునఁ
దా నెక్కెం [3]బాటి పిన్నతమ్మునిరథమున్.

248. వ. ఇట్లు పాండవాగ్రజుండు సహదేవుని[1]రథం బెక్కి తొలంగం దోలుకొని పోయె నట్టియెడ.

249. తే. క్షేమధూర్తి బృహత్క్షత్త్రుశితశరముల
నొంచి విలు ద్రుంప [1]నొండుధనువు [2]రయంబు
[3]వఱలఁ గొని [4]హయసారథిధ్వజయుతముగ
నతనిమస్తక మిలఁ గూల్చి యార్చె నతఁడు.

250. చ. కడువడి వీరధన్వుఁడు త్రిగర్తులు [1]వొంగఁగ [2]ధృష్టకేతువిల్
నడిమికిఁ ద్రుం[3]చినన్ మొగమునం దళు కొత్తెడు [4]కెంపుసొంపుతోఁ
జిడిముడి[5]పాటు లేక యతిశీఘ్రమునన్ ఘనశక్తి నాతఁ డె
క్కుడు [6]మద మొప్ప నానృపతిఁ గూలఁగ వైచె సురల్ నుతింపఁగన్.

251. వ. సహదేవుండు[1]ను మగిడివచ్చి దుర్ముఖునిం దలపడి దోర్విలాసంబు [2]మెఱయం బోరి పోరి.

---

247. 1. పోనీక – కొన్ని ప్రతులు. 2. యును – ఇ. ఐ. 3. బోయి – కొన్ని ప్రతులు.

248. 1. యరదంబెక్కి – కొన్ని ప్రతులు.

249. 1. రయమున నొండు ధనువు – కొన్ని ప్రతులు; నాతండు నొండువిలు – ఏ; వాతండు నొండు ధనువు – క. 2. రయమున – స. కొన్ని ప్రతులు. 3. గొనుచు హయ రథ సూతకేతన యుతముగ – స. 4. పోయి – ఒ.

250. 1. వోరగ – ఒ. ర. వ. 2. వీరకేతు – వ. 3. చుడున్ – పెక్కు ప్రతులు. 4. నేవు – కొన్ని ప్రతులు. 5. లేక యుండ నతి – వ. 6. మదమొప్ప – పెక్కు ప్రతులు. ముదమొప్ప – వా.

251. 1. ను – పెక్కు ప్రతులలో లేదు; మగుడి – పెక్కు ప్రతులు. 2. నం బోరి పోరి యంత నిలువక – ల.

252. ఉ. కేతువుఁ [1]గూల్చి రథ్యముల గీటడఁగించి శరాసనంబుతోఁ
సూతునికంఠముం దునిమి [2]స్రుక్కఁగ నంగము బాణపంచక
స్యూతము సేయ నీదుతనయుం డరిగెన్ నిరమిత్రుతేరిపైఁ
గాతత[3]సంభ్రముం డయి రయంబునఁ బాండవసైన్య ముబ్బఁగన్.

253. వ. [1]అంత నిలువక.

254. తే. [1]తఱిమి సహదేవుఁ డాత్రిగర్త[2]క్షితీశ
తనయుఁ డగు నిరమిత్రుని దునిమి యొప్పె
ఖరునితలఁ [3]ద్రెవ్వ నేసి రాఘవుఁడు మెఱయు
తెఱఁగు [4]దోఁప నీసేనకు వెఱపు గదుర.

255. క. నకులునిఁ దాఁకి వికర్ణుం
డోక[1]పరి నైనను బెనంగ [2]నోపక [3]తిరిగెన్
సకలబలముఁ జూడఁగ జూ
తికిఁ బైకొని యడరి తగరు [4]దెరలిన మాడ్కిన్.

256. తే. వ్యాఘ్రదత్తుండు సాత్యకి నస్త్రవృష్టి
[1]ముంచె ముంచిన నతఁడు [2]కోపించి సూతుఁ
[3]జఁదపి హయములఁ [4]బొరిగొని చటులవృత్తిఁ
జంపె నమ్మగధక్షితీశ్వరుకుమారు.

---

252. 1. ద్రుంచి – పెక్కు ప్రతులు. 2. స్రుక్కక యంగ – కొన్ని ప్రతులు. 3. లజ్జ తోడు తరయం – ట. వ.

253. 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

254. 1. తరమి – పెక్కు ప్రతులు. 2. క్షితీశు తన – కొన్ని ప్రతులు. 3. దెగనేసి – ణ. 4. దోపంగ సేనకు – కొన్ని ప్రతులు.

255. 1. మరి, వడి – అని పాఠములు. 2. నోర్వక – కొన్ని ప్రతులు. 3. నరిగెన్ – వ. న. 4. తిరిగిన మా – కొన్ని ప్రతులు; దెరలని – తి.

256. 1. ముంచుటయును నతండు – స. కొన్ని ప్రతులు. 2. విర్లుంచి – ఉ. ట. 3. జంపి – పెక్కు ప్రతులు. 4. బోనీక చటుల – ద. వ.

257. వ. [1]శల్యుండు[2]ను ద్రౌపదీపుత్త్రుల నేవురనైదైదుబాణంబుల నేసి మఱి యును[3] మార్గణనికరంబులు [4]నిగిడింపం జలింపక [5]వారాసౌమదత్తి నొక్కు మ్మడిం జుట్టుముట్టిన నతం డందఱ కన్నిరూపులై యేపునం [6]బెనంగుచుండ.

258. చ. హరిసుతసూతి [1]మావుల బకాంతకసూనుఁడు చాపముఁ యుధి
ష్ఠిరతనయుండు గేతువుఁ గడిందిమగంటిమిఁ ద్రుంప సూతునిం
బొరిగొని[2]యెఁ వెనఁ నకులపుత్రకుఁ డిమ్మెయిఁ [3]జిక్కు వడ్డఁ జే
చ్చెర సహదేవనందనుఁడు సేసె శిరంబును [4]మేను [5]వేఱుగన్.

259. సీ. వెస మారుతియు నలంబుసుఁడును బోరుచో నద్దానవేంద్రుని యంపఁ[1]బలువు
చేత నతండు మూర్ఛిల్లి యాలోనన తెలిసి [2]కాటుక[3]కొండ[4]పోలుపు గెలుచు
నాతని మేను [5]పెల్లలరిన మోదు[6]వు తెఱఁగుగా జేసిన నుఱక వాఁడు
మాయావిలాసోగ్రకాయంబు గైకొని యఖిలదిక్కుల దోఁచి [7]నిఖిలబలము

తే. [8]నుఱిపి నెత్తురుసేఱులు వఱపి భీమ
సేన మాయన్న బకుని [9]నాలేని చోట
నట్లు సేసితి గాక నీయలవుఁ [10]జలము
నింక మెఱయంగ[11]వచ్చునె యేను గలుగ.

260. తే. అనిన విని కెంపు గనుఁగవ నడరఁ గినిసి
యుజ్జ్వలాత్త్వష్ట్రబాణప్రయోగమునఁ ద్రు

---

257. 1. శలుండు ద్రౌ - కొన్ని ప్రతులు; శల్యుండు - వా. 2. ను - పెక్కు ప్రతులలో లేదు. 3 ను - పెక్కు ప్రతులలో లేదు. 4. పరగింపం జలిం - క. ఘ. డ. త. 5. వారాతని నొక్కు - హ. 6. జెలంగు చుండ - వ.

258. 1. వాజుల - ఎ. 2. యొప్పె నన్న కుల - కొన్ని ప్రతులు. 3. జిక్కు పెట్టి చె - వ. 4. నట్ట - వ. 5. రెండు గాన్ - ర. వ.

259. 1. బలుపు - ఔ. వ. 2. కాటిక - ఆ. చ. ర. వ. 3. ప్రోవు - పెక్కు ప్రతులు. 4. చెలువు (గెలుచు) దెగడు - కొన్ని ప్రతులు. 5. పెల్లడరిన - కొన్ని ప్రతులు. 6. గు - కొన్ని ప్రతులు. 7. యతని - కొన్ని ప్రతులు. 8. నులిపి - కొన్ని ప్రతులు. 9. నే - కొన్ని ప్రతులు. 10. బలము - వ హ. 11. నిత్తునె - ఖ. చ. వ.

భంజనాత్మజుఁ డమ్మాయ [1]వాయఁ జేసి
[2]తఱిమి [3]యేసి యారక్కసుఁ బఱపె నధిప.

261\. వ. ఇవ్విధంబున మనదిక్కునఁ జేయుం గేడొరలచావును [1]నోటమియుం జూచి మూఁకలు గలంగినం గుంభసంభవుండు రోషసంరక్తలోచనుం డయి తల కడచి సాత్యకిప్రముఖ[2]పాండవపక్షవీరు[3]లఁ గ్రూరనారాచనిచయంబుల నిలువరించి [4]నెఱయంబొలిచి [5]నిలిచి మెఱయుటయును.

262\. చ. [1]తఱిమి ఘటోత్కచుండు బలదర్ప[2]ము లేర్పడ ద్రోణుమీఁద నే
త్తెఱ [3]నడతేరఁ గాంచి చను[4]దెంచి యలంబుసుఁ డమ్మ[5]హాసురుం
[6]గుఱియుఁగఁ [7]జేసె [8]శాతశరకోటికి నడ్డము సొచ్చుసాత్యకిం
బిఱిఁదికి ద్రోచి యద్దనుజు భీమతనూజుఁడు [9]నొంచె నమ్మలన్.

:- అలంబుసుండు ఘటోత్కచునితో యుద్ధంబు సేసి చచ్చుట :-

సం. 7-84-1

263\. తే. [1]భూరిచక్రంబు వెస నలంబుసుఁడు వైవఁ
బెలుచ గద వైచి పొడి సేసె భీమసుతుఁడు
కడుఁదురుబు [2]గవిసి కఱచుకరణి యయ్యో
మూఁక నత్తునియలు [3]వెసఁ దాఁకునపుడు.

---

260\. 1. మాయ - న. 2. బల్లిదుండగు రక్కసు - ఓ. ణ. స. 3. యా రక్కసుని పార బరపె - హ.

261\. 1. నొప్పియు నోటమియుం - ఓ. ల. 2. ప్రతిపక్షవీ - ద. వ. వ; పాండవ వీరుల - ప. వ. 3. లు నిగుడించి - ఒ; ల నొప్పించె మరియు - గ. 4. నొప్పించి మరియును - జ. బ. 5. నిలిచి - పెక్కు ప్రతులలో లేదు.

262\. 1. తరమి - పెక్కు ప్రతులు. 2. మెలర్పగ - ఒ. వ. 3. నడరంగ - కొన్ని ప్రతులు. 4. దెంచె నలం - తి. 5. హాస్త్రముల్ - కొన్ని ప్రతులు. 6. గురియగ - వా. కొన్ని ప్రతులు; గురియుగ - శర. ప. సూ. 7. జేసి - తి. కొన్ని ప్రతులు; జేయ - కొన్ని ప్రతులు. 8. నాత్మ - పెక్కు ప్రతులు. 9. నొంచె - పెక్కు ప్రతులు; ముంచె - వా.

263\. 1. అసమ చక్రంబు - వ. 2. రేగి కరచిన కరణి - హ. 3. వడి-పెక్కు ప్రతులు.

264. క. ఆ[1]చక్రం బట్లయిన ని
శాచరపతి వివిధశక్తిజాలము [2]వఱపం
జూచి ఘటోత్కచుఁ డది [3]వ
మ్మైన్మ చెడ నర్ధేందుశరచయం బడరించెన్.

265. వ. ఇట్లు [1]దొడంగి యయ్యిరువురు దానవేశ్వరులును.

266. మ. బహుహేతిప్రకరంబులన్ బహువిధోపాయంబులన్ విస్ఫుర
ద్బహుమాయాకృతరూపజాలముల శుంభద్విరసఁ[1]రూఢిమై
మహి యల్లాడఁగఁ బోరఁ బాండుతనయుల్ మాత్సర్యధుర్యాత్ములై
సహితోద్యోగత నయ్యలంబుసు [2]శరచ్ఛ[3]న్నాంగునిం జేసినన్.

267. సీ. అతఁడు మాయాబలోద్ధతి నాశరావలి మొఱఁగి దావానల ముక్తమైన
[1]కరివిధంబున ద్రోఁగి యిరువదేనమ్ముల ననిలజు ధర్మనందనుని మూఁట
సహదేవు ద్రౌపదీసంభవులను హిడింబాసుతు నైదైదుబాణములను
నకులు డెబ్బదిమూఁటఁ బ్రకటవిక్రమ మొప్ప నేసి యార్చిన నల్గి
యింతవట్టు

తే. రథికవరులును గిట్టి మార్గణచయంబు
[2]లొక్కమొగిఁ దొరఁగింప వాఁ [3]డుఱక యేటు
లాడఁ గడిసి ఘటోత్కచుఁ డతనిసూతుఁ
ద్రుంచి యరదంబు [4]రూపడఁగించె నధిప.

---

264. 1. చక్రము వమ్మైన నిశా - కొన్ని ప్రతులు; చక్రమట్టులైన నిశా - వ. వ.
2. వరపెం - కొన్ని ప్రతులు. 3. నారాచ పరంపరల చేత రయమున ద్రుంచెన్ - ఙ.

265. 1. దొడరి - కొన్ని ప్రతులు; గడంగి - ద. ల. వ.

266. 1. రంభులై - ఇ. ఒ. న. 2. శరాస్త్రరంబు బోనార్చుచున్ - వ. 3. న్నాత్ము -
ఖ. చ. వ.

267. 1. హరి - న. య. హ. 2. మొగి దొరంగింపగా వాడు మొగసియేటు - వ
3. డుగ్ర గ్రవిశిఖ వితతి నేయ ఘట్వోత్కచు డతని - ఈ. 4. రూపర ద్రుంచె
పెక్కు ప్రతులు.

268\. వ. ఇట్లు విరథుం డయి యలంబుసుం డిలకు లంఘించి [1]మాయ నై కొని సాయ[2]కాసారంబు ఘోరంబుగాఁ గురిసిన నమ్మారుతిసుతుండును దేరు డిగ్గి యగ్గలం బగు మాయాకృతమార్గణజాలంబున [3]నది దూలించి గద వైచిన నక్కిమ్మీరానుజుండు [4]పీడితుం డయి ఖడ్గంబు గొని [5]గగనతలంబున కెగయుటయు హిడింబకొడుకును గృపాణపాణి యై తోడన యెగసె నయ్యిరువురును సుడిగాడ్పునం దొడరి తిరుగుడువడు [6]మొగిళ్లచాడ్పున నొప్పి యొరకుఁ బెనంగు [7]డేగల చందంబునఁ జిత్రగతులం బోరిపోరి భూతల[8]గతు లై యుబ్బునం దలపడినబెబ్బులులకరణి నొండొరుల మేనులు నెత్తుట జొత్తిల్లం జేసి [9]పాసి యొక ళ్లొకళ్లకంఠంబులు లక్ష్యం[10]బుగాఁ గరవాలంబులు [11]వైవ నవి యొండొంటిం దాకి మండుచు మహిం బడిన మల్లయుద్ధసన్నద్ధు లై కిట్టుచుం బట్టుచుఁ దాయుచు వ్రేయుచు [12]నొడుచుచుం [13]బొడుచుచు మఱియు ననేకప్రకారంబుల [14]వీరత్వంబును విశారదత్వంబును సేనలకు వెఱఁగు వుట్టింపం [15]బోరాడి రట్టియెడఁ బకా[16]వరజుండు డస్సినం బవమానపౌత్రుండు పడవైచి తాను మీఁదై జానుకూర్పరముష్టిఘాతంబులు నిర్ఘాతపాతంబులుం బోలెఁ బ్రయోగించి నొప్పించి యతని [17]తొడలు నెమ్ములు నొక్కుమ్మడిం [18]బొడిపొడి సేసి [19]నుఱిపిడికిం జొచ్చినప్రబలహాలికునిలీల నేలం బెట్టి కాలం [20]జమరి చంపి [21]పొంపిరి వోవుమగంటిమిం [22]బేర్చి యార్చినం బాండ[23]బలంబుల సింహనాదంబులుఁ దూర్యనినదంబులుం జెలంగె నప్పు డాఘటోత్కచుండు ధర్మనందనున కభి

---

268\. 1. పై కొని సాయ – వ. 2. కళతంబులు(కంబులు) – న. ప. య. 3. నది రూపు మాప – టొ. ణ. 4. విరథుండయి – కొన్ని ప్రతులు; మహీతలగతుండై ఖడ్గ – కొన్ని ప్రతులు. 5. వియత్తలం – కొన్ని ప్రతులు; ఖతలం – కొన్ని ప్రతులు; గగనంబున – కొన్ని ప్రతులు. 6. మొగుళ్లు – పెక్కు ప్రతులు. 7. బలుడేగ – కొన్ని ప్రతులు. 8. పతితులై – వ. 9. పాసి – కొన్ని ప్రతులలో లేదు. 10. బులుగా – పెక్కు ప్రతులు. 11. వైచిన నవి – కొన్ని ప్రతులు. 12. కుదుముచు, పుదుకుచు, కదియుచు – అని పాఠములు. 13. బొదువుచు – కొన్ని ప్రతులు. 14. ధీర – కొన్ని ప్రతులు. 15. బోరిరట్టి – కొన్ని ప్రతులు. 16. సురానుజుండు – కొన్ని ప్రతులు. 17. తొడవినమైమరువును నెమ్ములు – కొన్ని ప్రతులు. 18. బొడిసేసి – కొన్ని ప్రతులు. 19. నూర్పిడికిం జొచ్చిన – కొన్ని ప్రతులు; నులిపిడి – ద. ల. 20. జమిరి – కొన్ని ప్రతులు. 21. పొలివోవని మగం – హా. 22. బేర్చినం బాండవ – కొన్ని ప్రతులు. 23. సైన్యంబున – పెక్కు ప్రతులు.

వందనంబు సేసిన నతండు సంతుష్టాంతరంగుం డై యాలింగనంబు[24]ను మూర్ధాఘ్రాణంబును జేసి యగ్గించె ననిన విని యాంబికేయుండు సంజ యున కిట్లనియె.

269. ఉ. అంత[1]కుమున్ ఘటోత్కచున కడ్డము సాత్యకి [2]సొచ్చె నంటి వాఁ
డంతకసన్నిభుండు గురుఁ డద్భుతవిక్రముఁ డద్దెసన్ సము
ద్దాంతతఁ బేర్చి [3]వార లటు దార్కొని మిన్నక పోవ [4]నేర్తు రే
కొంతయునన్ రణంబు [5]గల గుం గలభంగి యెఱుంగఁ జెప్పుమా.

270. వ. అనవుడు నాసూతనందనుం [1]డతని కిట్లను సాత్యకి దఱిమి మనమొన నఱుము సేయం [2]దొడంగిన ద్రోణుండు మార్కొని యిరువదేను[3]కుప్పె కోలల నతనిచేత [4]నేటులు వడి మూఁడు[5]నారసంబుల నతని నొప్పిం[6]చె నయ్యాదవ[7]వీరుండు పంచాశద్బాణంబుల [8]నొంచిన [9]ధనుర్ధరుండు దొమ్మి డియమ్మ్ర లెమ్ముల్మలం గీలించి.

271. క. మఱియును శర[1]శతకము [2]మెయిఁ
గిఱిగొలిపిన వృష్ణినరుఁడు గినియఁగ లే కే
[3]పఱియున్నఁ జూచి యార్చుచు
మెఱసిరి నీతనయు లుబ్బు మిగిలి నరేంద్రా.

272. వ. అప్పుడు వినియును గనియును ధర్మతనయుండు ధృష్టద్యుమ్నాది[1]యోధ వరుల నాలోకించి.

---

24. నుమూర్ధాఘ్రాణంబును - పెక్కు ప్రతులలో లేదు.

269. 1. క - పెక్కు ప్రతులు. 2. వచ్చె - కొన్ని ప్రతులు. 3. రట్లు గడు - ఖ. చ. బ. వ. 4. నిత్తురే - ప. వ. 5. గల ఘోరపు భంగి - వ.

270. 1. డిట్లను సాత్య - కొన్ని ప్రతులు 2. గడంగిన - ఉ. త. వ. 3. కుప్పి - కొన్ని ప్రతులు. 4. నేట్లం బడి - కొన్ని ప్రతులు. 5. నారాచంబుల - కొన్ని ప్రతులు; 6. చిననయ్యా - కొన్ని ప్రతులు; చెనయ్యోధవరుండు - కొన్ని ప్రతులు. 7. సింహుండు - ఔ. ర. 8. నొప్పించిన - పెక్కు ప్రతులు. 9. నద్దను ర్ధరుం-కొన్నిప్రతులు.

271. 1. నికరముపై - గ. జ. బ. 2. మేగిఱి - ఖ. వ. శ. 3. మఱియున్నే - కొన్ని ప్రతులు.

272. 1. రథికవరుల - పెక్కు ప్రతులు; వీరరథికుల - ల.

273. ఆ. పులుఁగుఁ ద్రాటఁ [1]గట్టి యలయించి యాడెడు
బాలునట్లు పోలె బాణగురుఁడు
గడఁగి కృష్ణుననుజుఁ గారించు[2]చున్నవాఁ డతనిఁ
బోదువు డితని కడ్డపడుఁడు.

274. వ. భీమసేనపురస్సరులై కవియుం డనుచుం దాను దఱుముటయు [1]నాసై
నికోత్తములు సాత్యకిం [2]గడచి యాచార్యుం [3]గదిసిన.

275. క. విందులఁ [1]గనిన ట్లాతఁడు
మందస్మితుఁ డై యెదిర్చి మార్గణ[2]జాల
స్పందితులఁ [3]జేసె వారల
నందఱ [4]కవ్విధము రోమహర్షణ మయ్యెన్.

276. వ. అట్టియెడ.

277. క. ఇరువది[1]యేవురుపాంచా
లురు నూర్వురు కేకయులు[2]ను లూనాంగకులై
ధరఁ దొరఁ[3]గిరి పెఱమొత్తము
కరినికరము దొంపిఁ [4]బడినగతి నుండె నృపా.

278. వ. ఇట్లు ద్రోణుండు బరవసంబు సేసినం బాండవయోధులు పై బెట్టం జాలక [1]సోలసియున్న సమయంబునం బాంచజన్యధ్వని విని యుధిష్ఠిరుం డక్కడ నాలించి గాండీవగుణఘోషంబు గర్ణగోచరంబు గామికి మనంబు గలంగ నెఱుంగు గుత్తుకం దగుల సాత్యకితో ని ట్లనియె.

---

273. 1. గట్టి యల - ఘ. వ; బడ్డనల - హ. 2. చున్నాడు నతని - వ. హ

274. 1. ను వారిసైని - క. ర. 2. దలగడచి - కొన్ని ప్రతులు. 3. గవిసిన - కొన్ని ప్రతులు; పొదివిన - ఐ.

275. 1. గన్నట్లాతడు - వ. 2. జాలా స్పంది - కొన్ని ప్రతులు. 3. జేసె వారల కందర - వ; జేసి యార్చిన నందర - గ. జ. ట. బ. 4. నవ్విధము - కొన్ని ప్రతులు.

277. 1. వేవురు - పెక్కు ప్రతులు. 2. విలూనాం - ఈ. ఓ. హ. 3. గిన పెను - వ. 4. బడ్డగతి - కొన్ని ప్రతులు.

278. 1. సోలి, సొగసి, నిలిచి, జడిసి - అని పాఠములు.

-: ధర్మరాజు సాత్యకి నర్జునునకుఁ దోడ్పడఁ బొమ్మని ప్రార్థించుట :-

సం. 7-85-41

279. చ. ఒక్కఁడ చన్నవాఁడు విజయుండు మహీరజ మెక్కు డయ్యె [1]న
ద్దిక్కున పాంచజన్యము యుదీర్ణత | మోయఁ దొడంగె నక్కటా
చిక్కెనొ కౌరవాధముల[2]చే నతఁ [3]డియ్యెడ నీవ యొక్కఁడుం
దక్క నొరుండు [4]దీర్పఁగ నుదగ్రుఁడు బంధుఁడు [5]లేమి వేఁడెదన్.

280. క. త్వరిత[1]ముఁగఁ జనుము సఖుఁడు
గ్గురుఁడుఁ గదా నీకు నర్జు[2]నుం డుపకృతిత
త్పరు లై నెగడెదు రుత్తమ
పురుషులు వేచుతటి వచ్చె భుజవీర్యనిధీ.

281. చ. దురమున బంధుమిత్త్రులకుఁ దోడ్పడు తెంపును ధాత్రియెల్ల భూ
సురులకు [2]నర్థి నిచ్చుటయు సూరిజనుల్ సుకృతంబు లెన్నచో
సరియుఁగఁ జేసి చెప్పుదురు శాశ్వతకీర్తియు [3]నిన్ను నొందు నా
హారి [4]నను నాసుహృజ్జనుల నందఱఁ గాంచుటఁ గ్రీడిఁ గావవే.

282. క. గురుపుత్రకర్ణ మద్రే
శ్వరకృపభూరి[1]శ్రవసులు శత్రుజనభయం
కరులు జయద్రథునకు నై
వరుఁ బొదివిన నతఁడు [2]నొచ్చె నాకుం జూడన్.

---

279. 1. నద్దిక్కున - వ. 2. చేత నతం డిట నీవొ - క. సం. పీ. 3. డే యెడరి వొకం డునుం - కొన్ని ప్రతులు; డియ్యెడం నీ వొకండవుం-కొన్ని ప్రతులు; డే తరి నొక్క రుండవుం - కొన్ని ప్రతులు; డే తరి నీవొకండవే తక్క - హ. 4. దీర్పగల దతుడు- ఒ. 5. లేదు - కొన్ని ప్రతులు.

280. 1. గతి జనుము - గ. న. య. ల. హ. 2. నుడుగృతమతితత్వరు - కొన్ని ప్రతులు; నుడుప్రకృతిసుహృత్పరు - హ; నుడుప్రతికృతితత్వరు - కొన్ని ప్రతులు. 3. శౌర్య- తి. కొన్ని ప్రతులు.

281. 1. పెంపును - ఎ. ఓ. వ. 2. భక్తి - త. 3. నొందు నిన్ను - పెక్కు ప్రతులు. 4. క్రియ - పొ. ణ; యును - కొన్ని ప్రతులు.

282. 1. శ్రవులును - ద. వ. 2. నొచ్చి - పెక్కు ప్రతులు.

283. క. ఆమోము నాభుజంబులు
నామేనుం గల[1]దె కేశవానుజ [2]యెచ్చో
నేమగలకు నమ్మూర్తికి
[3]నేమి దలంచునొకో దైవ మెయ్యది [4]దుదియో.

284. ఉ. ద్వైతవనంబునందు [1]గుణ[2]ధన్యుఁడు గాండివి నాకుఁ జెప్పె ని
ర్ధూతవిరోధి సత్యకసుతుండు సహాయుఁడుగా జయింతుఁ బ్ర
ఖ్యాతిగ ధార్తరాష్ట్రబలమంతయు నే నని [3]దానికిం దగం
బ్రీతి యొనర్పవే నరవరేణ్య రయంబునఁ బోయి వానికిన్.

285. క. హరి యొకఁడు వీ వొకం[1]డవుఁ
బరమాస్త్రలు [2]గలిమి [3]నరుఁడు భారపుఁబనికిం
బోర [4]నలుకఁడు నీకూరిమి
పోరపొచ్చెము [5]గాక యుండఁ బోవఁగ [6]వలదే.

286. ఆ. పరమకరుణ నైన బంధుభావంబున
నైన [1]భుజబలంబునతిశయమున
నైన నెల్లభంగి నర్జును రక్షింపఁ
[2]బోవఁ దగు మహానుభావ నీకు.

287. క. [1]అతఁ డొకటి యైన నే నేగతిఁ
[2]బోదుం జెపుమ యెల్లకార్యంబులలో

---

283. 1. వె – కొన్ని ప్రతులు. 2. యచ్చో – కొన్ని ప్రతులు. 3. నేమిదలచునొక్కో దైవ – వీ. శ. ష. స. కొన్ని ప్రతులు. 4. గతియో – న; మదియో – ర. వ.

284. 1. గురువర్యుడు – య. 2. ధైర్యుడు, వర్యుడు, వంద్యుడు – అనిపాఠములు. 3. నంతకుం దగన్ – క. ర.

285. 1. డును – భ. వ. 2. గలుగ – కొన్ని ప్రతులు. 3. నతడు – అ. ట. వ. 4. మలుకడు – కొన్ని ప్రతులు. 5. లేకయుండ – ఐ. ప. వ. 6. వలయున్ – ఉ. ఒ. ద. ప. ల. సూ. హ.

286. 1. సుకృతమునకునైన భక్తినైన – ఆ.

287. 1. అతని కొకటయిననేనే – ఈ. 2. బోవుదు జెపుమ – కొన్ని ప్రతులు; బోందుదు జెపుమ – ర.

నత[3]నికిఁ దోడ్పడఁ బోవుట
యతిముఖ్యము దానిఁ జేయు [4]మనఘవిచారా.

288. క. అలఘుబలుడు సైనేయుఁడు
గలుగఁగఁ బాండవుల గెలువఁగా [1]వచ్చునె వా
రల కతఁడు గోట [2]యంద్రు [3]రి
పులు దానికిఁ దగఁగ నెఱపు భుజ[4]గర్వంబున్.

289. క. హరి గురుఁడు నీకుఁ గ్రీడియు
గురుఁ డిరువుర యెడరు దీర్పఁ గోరి గురు[1]లకున్
గురుఁడ నగు [2]నేన చేసెదఁ
[3]బరమప్రార్థనము దీనిఁ [4]బాటిం[5]పు తగన్.

290. క. కురుబలము సొచ్చి నీదగు
శరములదర్పంబు సూపి చయ్యనఁ జని య
న్నరు గైకొని నాయుల్లము
పరితా[1]పము [2]దీర్పవే నృపాలురు మెచ్చన్.

291. వ. అనిన విని సాత్యకి ధర్మనందనున కిట్లను నీవచనంబు [1]లుచితంబు లేను నప్పార్థునకు రణంబునం బ్రాణంబులు [2]దాఁప విశే[3]షించి నీ [4]వింత ప్రార్థించి [5]పనుప నూర[6]కుండుదునే యతండు సైంధవవధార్థంబుగా నట ననుచుండి కృష్ణుఁడు వినుచుండ నాతోఁ జెప్పిన[7] తెఱంగు [8]విన్నవించెద నవధరింపుము.

---

3. నింగా వగ — ఓ. శ. ష. 4. మమల విచారా — కొన్ని ప్రతులు.

288. 1. వశమేవా — జ. ల. 2. యందురు పొలుపుగ దగ నెరపు నీదుభుజ — ణ. 3. నృపు — ఐ. 4. వీర్యంబున్ — ద. వ.

289. 1. నకున్ — పెక్కు ప్రతులు. 2. నేనుజే — పెక్కు ప్రతులు. 3. బరమంబగు ప్రార్థనంబు పా — గ. జ. బ. 4. భావింపు — ఐ; బాలింపు — ఓ. 5. పదగున్ — కొన్ని ప్రతులు.

290. 1. పం బుడుపవే — పెక్కు ప్రతులు. 2. దేర్పవే — ల; మాన్పవే — న.

291. 1. ల యట్ల యేను పార్థు — ఒ; లుచితంబు ల యేనును నప్పార్థు — కొన్ని ప్రతులు 2. డాప — కొన్ని ప్రతులు. 3. షించియు — కొన్ని ప్రతులు. 4. వింత ప్రొద్దు పార్థించి — వ. 5. పలుక నూర — కొన్ని ప్రతులు. 6. కుండ నగునే — కొన్ని ప్రతులు. 7. విధంబు — కొన్ని ప్రతులు. 8. వినుపించెద — కొన్ని ప్రతులు.

292. క. మనకు నిమిత్తము లెంతయు
నుకూలము లయ్యె గెలుతు మాహవమునఁ [1]నే
జనియెదఁ బ్రతిజ్ఞ దీర్పఁగ
ననఘా ధర్మసుతురక్ష కరుగుము నీవున్.

293. క. విను సింధురాజువధ[1]మును
మనుజాధిపరక్షణంబు మనకు సరియ కా
వున నే నొకపని నీ వొక
[2]పని మేకొని చేయు [3]టరయఁ బాడియ గాదే.

294. ఆ. ఏను నిలిచినట్ల కా నూఱ[1]డిల్లు నీ
వున్న నన్న రేశ్వరోత్తముండు
నిర్భ[2]రుండ వగుము నీవు నాదెస నాకు
హరి గలండు గలఁడె యచట [3]నితఁడు.

295. వ. ఎల్లభంగుల రాజరక్షణార్థంబుగా నీకుం బోవవలయుఁ బరాక్రమధుర్యుం డగునాచార్యుప్రతిన యెఱుంగవె యని [1]చెప్పిన నట్ల కాక యని [2]నిన్నత నిచే నిక్షేపంబుగాఁ గైకొని యేను నీకడకుం జనుదెంచితి గురుండు ప్రతిన నెఱ[3]పునేని విజయుండు జయద్రథుం జంపుట [4]యప్రయోజనంబ కాదే యది యట్లుండనిమ్ము నీచిత్తమ్మున [5]వలవనివెఱపు గట్టుకొనియెదవు కృష్ణసారథికం [6]బగుజిష్ణురథం బప్రతిహతమనోరథం బగుట యెఱుంగ [7]వల వదే యనుటయు నమ్మహీపతి యతని కిట్లనియె.

---

292. 1. కేజనియెదు – స. కొన్ని ప్రతులు.

293. 1. యును – పెక్కు ప్రతులు. 2. పనిగైకొని – ట. వ; పనిజేకొని – ప. 3. డరయ – కొన్ని ప్రతులు.

294. 1. డిల్లి హత్తుకొని మున్న నీవు నరోత్తముండు – న. 2. యుండ – కొన్ని ప్రతులు. 3. నిచట – కొన్ని ప్రతులు.

295. 1. చెప్పె జెప్పిన – కొన్ని ప్రతులు. 2. యతనికి సేమంబుగా – క; నిక్షే పంబుగా – ఝ. వ. వీ. శ. ష. 3. పెనేనియు – కొన్ని ప్రతులు. 4. యునప్రప – కొన్ని ప్రతులు. 5. వలువని – కొన్ని ప్రతులు. 6. బైనయాజిష్ణు – కొన్ని ప్రతులు. 7. వలదే యను – కొన్ని ప్రతులు.

296. క. అది [1]యగు నైననుఁ బెం
పొదవఁగఁ [2]గాచికొని యిచట నుండుటకంటెన్
[3]మది నధికం బై తోఁచిన
యది నీ వర్జునునిపాలి కరుగుట నాకున్.

297. క. కదువడి [1]నీ వరు[2]గఁగ వడ
ముడియును నీవెనుక శ్రీఘ్ర[3]మున నెయిదుం గ
వ్వడి కుశలి యైన విజయం
బొడఁగూడును [4]మనకు దీని కొడఁబడు మనఘా.

298. చ. ద్రుపదవిరాటకేకయులు దోర్బలధుర్యులు ద్రౌపదేయులు
గ్రపులిరుదుల్ ఘటోత్కచుఁ డరాతివిదారి శిఖండి [1]ధైర్యసా
ర[2]పరుషమూర్తి సంగరధురంధరు [3]లిద్దెసఁ దక్కఁ గల్గువా
రపరిమితుల్ గొనందు ద్రుపదాత్మజుఁ డగ్గురుఁ బోరఁ జీరికిన్.

299. క. విను మాధృష్టద్యుమ్నుం
డనలంబునఁ గుంభ[1]భవవధార్థముగాఁ బు
ట్టినవాఁడు గాఁడె నాదెస
[2]ననుమానం బేల యోర్చు నాతం డతనిన్.

---

296. 1. యట్లగునైనను - కొన్ని ప్రతులు; యున్నగు నైనను - ఊ. ఏ. 2. గాచుకొని - కొన్ని ప్రతులు. 3. దుదినధి - క. ర.

297. 1. నీవును నరుగగ వడముడి నీ వెనుక వేగ వచ్చు దగంగ - ఒ. 2. గుమువడ - ట. వ. 3. ముగ - శర. కొన్ని ప్రతులు; మునవచ్చును - ఆ. ట; ముగనేయుడు గవ్వడి - శ. ర. హా. 4. నీవు దీని - గ. జ. బ. వ.

298. 1. శౌర్య - ఊ. ఏ. 2. పరుష - కొన్ని ప్రతులు; పుఘన - ణ. 3. లిద్దర దక్కు - అ; విట్టిరతక్కు - కొన్ని ప్రతులు లుద్ధతి దక్కు - ట. వ; లేకవలిట్లు దక్కువా - ఊ. ఏ; లిందరు - వ. హా

299. 1. జునివధార్థము - ఊ. ఏ. ఝ ల; సంభవార్థము - ఒ. ద. 2. కనుమానం - కొన్ని ప్రతులు.

300. వ. అనవుడు శినిపుంగవుం డొక్కింత [1]చింతించి పార్థుపజ్జం బోవుట [2]బంటుతనం
బున [3]కూనంబుగా దితం డనుం జెద్దయుం [4]దఱిమి [5]పలికెడుఁ బోదువ గాక
యని మనంబున నిశ్చయించి యధిపతియాననం బాలోకించి.

-: సాత్యకి ధర్మరాజు వేఁడినచొప్పున నర్జునకడకుఁ బోవ సమ్మతించుట :-

సం. 7-86-1

301. క. భవదీయరక్ష [1]యిమ్మెయి
సువిహిత మగునేని [2]మేలు పొచ్చెద భేరీ
రవబృంహిత[3]హేషా[4]భై
రవకౌరవసేనఁ గలఁగి క్రందుకొనంగన్.

302. శా. వైరం బాత్మల నిండి [1]యుండ భుజగర్వంబుల్ దలిర్పంగ దు
ర్వారోత్సాహులు వీరె కొందఱు[2]నృపుల్ రా[3]రాజకార్యంబు [4]వి
స్తారోదగ్రము సేయఁ బూని విలసత్సంరంభులై పన్నియు
న్నా రీదట్టపుమూఁక లెట్టు లగునో వాకోల్తలం జూడుమీ.

303. క. ఈసేన[1]లు భేదించి భు
జాసంపద వెలయఁ బార్థసాహాయ్యం బేఁ
జేసెద నీవం పనియెదు
భాసురదీపమున కన్యబలతమ మెదురే.

---

300. 1. విచారించి - వ. 2. బంటతనంబు - కొన్ని ప్రతులు. 3. కనుకూలంబుగా - ఘ. డ. వ. 4. దరమి - కొన్ని ప్రతులు. 5. పల్కెడు బోదు - ఊ. ఎ. ట. వీ.

301. 1. కిమ్మెయి - కొన్ని ప్రతులు. 2. వేగ - ఊ. ఏ; మెలమి - ర. 3. ఘోషా - జ. ఝ. వ; భైరవ కౌరవసేన ధలంగి యవని గ్రందుకొనంగన్ - ఉ.

302. 1. యుండి - డ. త. అ. 2. రిపుల్ - వ. 3. రాజకార్యంబు - వా; రాజు కార్యంబు - పెక్కు ప్రతులు. 4. నిస్తారో - ఉ. మ. య. వ.

303. 1. ల - కొన్ని ప్రతులు; యు - కొన్ని ప్రతులు.

304. క. దవ్వని చూడ[1]కు మార్తుర
[2]క్రొవ్వడఁచెద సింధు[3]విభునిఁ గూల్పఁ గడఁగునా
వివ్వచ్చు మెచ్చుతెఱఁగునఁ
నవ్వుచుఁ [4]గవిసెద మరుద్గణంబులు వొగడన్.

305. వ. రథ్యంబుల [1]దగ యుడుపను సారథి దప్పియుం [2]దీర్పను రథంబు సవిశేష సన్నాహంబు సేయను వలయు ననినం [3]బ్రీతి నొంది యప్పాండవాగ్రజుండు వనుపం దజ్జ్ఞులైన పరిచారకు లత్తురంగంబుల నీరికిం దిగిచి [4]ఖాణం బెత్తి [5]తడవి దారుకానుజుం డగు నా[6]సూతు నుపయుక్తాహారుం జేయుటయు వాఁడును విశిష్టాయుధసమేతంబుగా నయ్యరదంబు [7]సుకల్పితంబు సేసి సింహధ్వజంబు గ్రాలం దెచ్చె నంత[8]కు మున్న సాత్యకియుఁ గృతస్నానుం డై యాప్యాయనమధు[9]పానంబున నెలమిం బొంది యమ్మహీపతి పాదంబులకుం బ్రణతుం డైనం గౌఁగిలించి కొని యతండు దీవించినం [10]బెండ్లికి బో[ ]వులీలం దే రెక్కి యెక్కిడినవిల్లును మెచ్చువచ్చునమ్ములును దొడలపైఁ బెట్టికొని కద[11]లి చనుసమయంబున భీమసేనుండును నగ్రజునకుం బ్రణామంబు వేసి తనతోడన రాఁ [12]గదలినం గని యాశినిపుంగవుం డతని కి ట్లనియె.

306. క. అక్క[1]ట రావలవదు నా
[2]కెక్కటి యీసేన [3]దఱిసి యేఁగుట భరమే

304. 1. క - కొన్ని ప్రతులు. 2. క్రొవ్వడగగ - కొన్ని ప్రతులు. 3. రాజుగూల్ప - పెక్కు ప్రతులు. 4. గదిసెద - కొన్ని ప్రతులు; గడచెద - ఊ. ప.

305. 1. వగరుపును సారథి - ట. వ; దగయును సారథి - పెక్కు ప్రతులు. 2. దేర్ప - కొన్ని ప్రతులు. 3. బ్రీతుండై -ల; దెలివినొంది - ణ. 4. ఘాసంబుమేపి - ఉ; ఖాణంబులు మేపి - కొన్ని ప్రతులు. 5. తడిమి - కొన్ని ప్రతులు; తరమి - కొన్ని ప్రతులు. 6. సూతుండు విశిష్టాయుధ - వ. 7. సవిశేషకల్పితంబు - ర. స. 8. క మున్న - కొన్ని ప్రతులు. 9. ద్రవ్యాన్నపానాదుల - ఎ. ఠ; దధ్యన్నపానం - ఊ. ప. 10. బెళ్లికి - కొన్ని ప్రతులు; 11. లు సమయ - కొన్ని ప్రతులు; లు చున్నసమ - ఊ. ఎ. ప. 12. గడంగినం గని - కొన్ని ప్రతులు.

306. 1. ద - కొన్ని ప్రతులు. 2. కెక్కడి, కెక్కడనీ - స. కొన్ని ప్రతులు. 3. దరమి - ద. ప.

యిక్కడన [4]నిలువు ద్రోణుని
యుక్కునఁ బతి కెడరు పుట్టకుండఁగ వలయున్.

307. వ. అనవుడు నతం డట్లు కాక యేను రాజరక్ష[1]ణంబునకు నిలిచెద నీ వప్రమత్తుండ [2]వయి యరుగు మనిన వదనంబు వికసింప నీయట్టి[3]పెనుఁబ్రాపు గలుగ [4]నా కెదు రెవ్వరు సవ్యసాచి సైంధవుం దెగటార్చినం[5] బేర్చిన కౌతుకంబున [6]వచ్చి నిన్నును మీయన్ననుం [7]గాఁగిలించుకొనియెద నని పలికి యవ్వీరుని నిలిపి తేర్లగమిఁ గనుం[8]గొను [9]బెబ్బులియుం బోలె నీసేనం జూచుచు [10]నడచె నని యిట్లు సంజయుండు సాత్యకి[11]సంరంభంబు ధృతరాష్ట్రునకుం జెప్పె నని చెప్పిన వేడ్క యుల్లంబున నివ్వటిల్లఁ బదంపడి చెల్లినఖండనంబు[12]విధంబు [13]వినిపింపు మనుటయు.

308. ఉ. నిర్మలచిత్తభృంగ[1]రమణీయవికస్వరపుండరీకతా
ధర్మనిరూఢ[2]సంసరణతాపనిరాకరణ[3]ప్రగాఢస
త్కర్మఫలాకృతీ భువన[4]తాపిభవప్రకృతీ [5]తపఃక్రియా
కర్మఠసంయమీశ్వర[6]సఖా [7]సముతా[8]సమవేతచిత్సుఖా.

---

4. నిలువుము ద్రోణుని – కొన్ని ప్రతులు; నిలువుము ద్రోణుని – అ. ఔ. వ.

307. 1. ణార్థంబుగా – ఉ. వ. 2. వై యరుగు – పెక్కు ప్రతులు. 3. పెనుప్రాపు – కొన్ని ప్రతులు. 4. నా కెవ్వ రడ్డంబు – న. 5. వచ్చినం గౌతు – అ; 6. వచ్చి మరికదా నిన్నును – హ; వచ్చిన నిన్నును – క. ర. వ. 7. గాగ – కొన్ని ప్రతులు. 8. గొని యుబ్బ బెబ్బులి – అ; గొని పొంగు బెబ్బులి – ఐ. 9. కోలు పులి – కొన్ని ప్రతులు; క్రోలు పులి – మ. య. 10. బాయవడ నడచె – వ. 11. రభసంబు – వ. 12. విధంబు – కొన్ని ప్రతులలో లేదు. 13. వివరింపు – ఔ. న; వినుపింపు – కొన్ని ప్రతులు.

308. 1. మహనీయ – ఒ. ఘ. వ; మహనీయ కవీశ్వర పుండ – ఒ. 2. సంస్మరణ – కొన్ని ప్రతులు. 3. ప్రవీణ – కొన్ని ప్రతులు. 4. తావిభవత్ప్రకృతీ – స. కొన్ని ప్రతులు; తావిభవప్రకృతీ – కొన్ని ప్రతులు; కారిభవత్ప్రకృతీ – క. ర. 5. స్తవక్రియా – ఉ. ఐ. డ. వ. 6. సుఖా – కొన్ని ప్రతులు; నికాయనుతా – వ. 7. తనుతా, గురుతా, సురతా, మరతా – అని పాఠములు. 8. సముపేత – బ. హ; వనవేదవిత్సుఖా (తా) – ఖ. గ. వ; పసభేద – ల.

309. క. పరిధానప్రావర[1]ణీ
[2]కరణా[3]ధృతపీతవసన[4]గజచర్మ సము
ద్ధురవాహనీకృతోజ్జ్వల
గరుడవృషభ[5]పరమమోక్షకర దురితహరా.

310. మాలిని. నిరుపమగుణరాశీ నిర్గుణత్వప్రకాశీ
భరితభువనకార్యా భవ్యనైష్కర్మ్యధుర్యా
[1]విరత[2]నిరతిభావ్యా విశ్వలోకైకసేవ్యా
స్ఫురితబహుశరీరా శుద్ధ[3]నైరూప్యసాలా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి
తిక్కనసోమయాజి ప్రణీతం బయిన [1]శ్రీమహాభారతంబున
ద్రోణపర్వంబునందుఁ దృతీయాశ్వాసము.



309. 1. ణా – కొన్ని ప్రతులు. 2. కరుణా – కొన్ని ప్రతులు. 3. భృత – కొన్ని ప్రతులు; వృత – ఉ. త; హృత – బ. 4. కరి – బ. మ. వ. 5. పరమ ధర్మ మోక్ష – పెక్కు ప్రతులు.

310. 1. విరతి – ద. మ. య. వ. 2. శయన – ఉ. బ; నిరగ – బ. గ. హా. 3. సంబుద్ధి– అ. వ. య.

311. 1. శ్రీ మహాభారతంబున – పెక్కు ప్రతులలో లేదు

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - చతుర్థాశ్వాసము



1. క. శ్రీమత్త్వాయుష్మత్త్వసు
ధీమత్త్వప్రదకటాక్ష [1]దీపితభక్త
స్తోమారామనసంతా
వ్యామోహప్రశమకరణ హరిహరనాథా.

*-: సాత్యకి మొగ్గరంబు సొరం దొడంగుట :-*

సం. 7_89_38

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3. తే. ధర్మపుత్రుండు వనుప సాత్యకి గడంగి
తనబలము దెస నడచుట వినినయాంబి
కేయుఁ డర్జునుఁ గలయ శైనేయుఁ బోవ
విడిచిరే మనవా రని యడుగుటయును.

4. వ. సంజయుం డతని కిట్లను నట్లు మఱందం [1]బనిచి యుధిష్ఠిరుం డాచార్యు
వల నవలోకించి యాశినివరుపిఱుందన తలిమె నప్పుడు ధృష్టద్యుమ్నుం
డవిష్టంభంబున నెఱం గెత్తి పురికొల్పఁ బాండవసైనికులు గవిసిన మనవా
రును మార్కొనిరి తదనంతరంబ.

---

1. 1. దీప్తా - అ. ఆ. ట; దృఢతర - ఉ. ఏ. ఔ. ఖ. చ. ఝ. శ. ష. శ$_1$.

4. 1. బుచ్చి - క. డ.

5. క. తలలను గరముల వక్షు
స్థ్సలముల జఘనములఁ దొడలఁ జరణంబుల న
య్యలఁ గప్పెడు సాత్యకికో
_ల్తల కోర్వక నీ[1]బలము గలంగం బడియెన్.

6. క. విచ్చినమూఁకల కడ్డము
సొచ్చిన నేడ్వురునృపాలశూరో_త్తములం
బిచ్చె జముం గొలువఁగ వి
వ్వచ్చుమఱఁది పెఱనృపాలవర్గము దెరలన్.

7. సీ. ఆసమయంబున నతని మార్కొని కుంభభవుఁ [1]డేడుతూపులు వఱపె మేన
నతఁ డస్త్రసప్తకహతుఁ జేసె నాతని నగ్గురుఁ డాఱింట నశ్వములను
నూతు నాతని నొంచె నాతఁ డయ్యాచార్యు నేపుమైఁ బదియును నేడునాలు
నెనిమిఁదియును బదునెనిమిదియును శాతశరముల నొప్పించి తురగచయము

అ. నాల్గుసాయకముల [2]నడికించి సారథి
నొక్కమార్గణమున నుబ్బడంచి
యార్చుటయును ద్రోణుఁ డలిగి
వాలమ్ములఁ బొదివెఁ దద్రథంబు మద మెలర్ప.

8. వ. ఇట్లు బాణజాలంబులం గప్పి గురుఁడు సాత్యకి నుపలక్షించి.

9. క. నాచేతి[1]బఱవు గని నీ
యాచార్యుం డోడి తొలఁగి యరిగెను నీవే
త్రోచి యట వోవువాఁడవు
నూచెదు గా కెట్లు నిన్ను బ్రముక్కించెదనో.

---

5. 1. బలంబు తరలం బడియెన్ – ఊ. ఛ. ణ; బలంబు తల్లడ బడియెన్ – న; బలము తలంగం బడియెన్ – శ$_1$.

7. 1. డైదు తూపులు – పెక్కు ప్రతులు. 2. నాటించి – ఇ. ఈ. ఉ. ఖ. చ.

9. 1. బరువు – కొన్ని ప్రతులు; బలువు – వ.

10. క. [1]అనవుడు ధర్మాత్మజుపను
పున నే గాండివికడకుఁ బోయెద నన్నిం
తన నేటికిఁ దడ వయ్యెడు
ననుగ్రహము సేయు మర్హ మది పెద్దలకున్.

11. క. అని పలికి తొలఁగిపోవుట
మనమున నూహించి దైత్యమర్దనుతమ్ముం
డను సూతుతోడ ద్రోణుఁడు
మనలం బోనీక పెనఁగు మాత్సర్యమునన్.

12. వ. తడసినఁ గర్జంబు దప్పు నితనికి నోసరించి పోవవలయు విను మిదియె బాహ్లికబలం బదె యంగసైన్యం బల్లదె దాక్షిణాత్యసేన వీనియం దొక్క సందున వెడలుద మివి గడంగి యడ్డపడిన నొప్పించి చిక్కువఱచి పోద మనిన నట్ల కాక యని యద్దారుకానుజుండు ద్రోణునకుం దొలంగించి తేరు దోలం దీవ్రబాణంబులు గురియుచు నగ్గురుండు వెనుతవుల నయ్యాదవసింహుండు సింహవిక్రమంబున నంగచమూ[1]చ్ఛేదనంబు సేసి చనునెడఁ గృతవర్మ యాతనిఁ దాఁకి.

13. క. ఆఱమ్ము లతనిమేనం
దూఱంగా నేసి నాల్గుతురగాంగములన్.
[1]గీఱించినఁ గని ద్రోణుం
దూఱడి ధర్మజునిదెసకు నున్ముఖుఁ డయ్యెన్.

14. వ. అక్కడ మొగ మయ్యె నిక్కడ నేమఱక యుండె నప్పుడు.

15. క. కృతవర్మయొడల సాత్యకి
శితసాయకములు పదాఱు [1]సెరివినఁ గోపో

---

10. 1. అనుటయు - ట. వ.

12. 1. భేదంబు సేసి - ల. వ. వీ. శ. ష. స.

13. 1. బారించిన - స; గీలించిన - కొన్ని ప్రతులు. (ప్రాసభంగము)

15. 1. జేర్చిన - కొన్ని ప్రతులు.

ద్ధతి మెఱయఁగ బలుదూపుల
నతఁ డాతని నుచ్చి పోవునట్లుగ నేసెన్.

16. వ. వెండియు.

17. చ. విలు దునుమాడి [1]వక్షమున వే పదియమ్ములు నాఁట నాతఁడు
జ్జ్వలఘనశక్తి వైచి కృతవర్మనిబాహువు నొంచి ధైర్యని
శ్చలమతి నొండువిల్లు గొని సారథిఁ జంపిన సూత[2]కృత్యముల్
వలనుగఁ బూని యాహార్దికవర్యుఁడు నిల్చె నిశాంతధీరతన్.

18. వ. నిలిచియు సాత్యకిదెసం దఱుముక భీమసేనపురస్సరం బైనబలంబున కడ్డపడ
నరిగె నవ్విధంబున నతని బెట్టు వఱచి యాశ్శైనేయుం డచటు గడచి చనియె
ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

19. చ. గురుకృతవర్మముఖ్యు లతిఘోరపరాక్రమశీలు రట్టినా
దొరలను సైన్య[1]సాగరము దోర్బలసంపద గాసి సేసె న
న్నరుఁ డది గాక క్రమ్మఱ వినం గడు విస్మయ మిట్లు[2]జయ్యుఁడై
వెరవున లావునం బరిభవించుచు సాత్యకి యేపు సూపెనే.

20. మ. హరియుం బార్థుఁడు నట్లు నేర్పు గలబాహాశక్తిమైఁ జొచ్చుచో
దొరలుం సేనలుఁ బెల్లు గూలుటకు నాదుర్యోధనుం డెంతయా
తురతం బొందెనో దంతిఘోటకపదాతుల్ సాత్యకిస్ఫారదో
స్స్ఫురణం గ్రమ్మగుట కెట్లు దాను ననుజుల్ [1]శోకించెనో యక్కటా.

21. వ. అనవుడు సూతసూనుం డమ్మానవపతి కిట్లనియె.

22. క. నీయవినయంబు పెంపున
నీయాపద సంభవించె [1]నింక వగచినం
బాయునె యితరులక్రియ శో
కాయత్తుఁడ వగుట నీకు నర్హామె యధిపా.

---

17. 1. వక్షమున - ల. 2. వృత్తిమై - పెక్కు ప్రతులు.

19. 1. నాథులను - గ. జ. 2. జేయుడై - కొన్ని ప్రతులు.

20. 1. శోకించిరో - పి. శ. ష. కొన్ని ప్రతులు.

22. 1. నింకిటవగువం - అ. ఆ. బ. వ.

23\. వ. సుస్థిరుండ వై సమరప్రకారంబు వినుము సాత్యకి యత్తెఱంగునం జని
కాంభోజసేనఁ జొచ్చిన నందలి మేటిమగలు దలపడి రట్టియెడం గుంభసం
భవుండు.

24\. క. కని కృతవర్మకు సారథి
నొనర్చి తనకృత్యమునకు నునిచి కడఁగి యా
శినివరు వెనుకొన ధర్మసు
తుని[1]దొర లయ్యస్త్రగురునిఁ దొడర నడరినన్.

25\. క. వారిఁ గృతవర్మ మార్కొని
దారుణశరశిఖల నేర్చి తల్లడపఱుపం
గా రయము గుంది నిలిచిరి
వా రొండొరుఁ జూచుచును వివర్ణాకృతు లై.

26\. వ. ఇట్లు హార్దిక్యుఁ బలువిడి కోహటించినరథికులం బురికొలిపికొని వృకోదరుండు
సోదరపుత్త్రమిత్త్రసహితంబుగా నతనిపైఁ గవిసె న[1]ట్టిసమయంబున నయ్యా
నిలజుండును ధృష్టద్యుమ్నుండును శరత్రయంబులను ధర్మనందనద్రుపదులు
బాణపంచకంబులను హైడింబుం డేడమ్ములను మత్స్యపతి పదియేనింటను
సహదేవుం డిరువదేనింటను శిఖండి యిరువదింటను ద్రౌపదేయులు డెబ్బది
తూపులను నకులుండు సాయకశతంబునను నొక్కుమ్మడి నమ్మేటివిలుకానిం
బొదివిన నతండు.

27\. సీ. ఐదైదుశరముల నందఱ గ్రుక్కించి భీముని నేడింట [1]బెట్టు వఱచి
ధనువుఁ గేతనమును దునిమి డెబ్బదితూపు లతిరయంబున నురమాడ నేయ
సోలిన యమ్మరుత్సుతుఁ జూచి యందఱు నాకృతవర్మపై నడరి రంతఁ
దెలిసి వృకోదరుం డలఘుదారుణసముజ్జ్వలశక్తి నాతని పై నెఱఁడు

తే. మృత్యునియఁ జేయ [2]దొడ్డవి ల్లెత్తి యతని
యొడలు నెత్తురు వఱ్ఱు సేయుటయు నాస

---

24\. 1. బల మాయస్త్రగురుని – ఇ. ఏ. ఓ. త.

26\. 1. యవసరంబున – ఘ. వ. వీ. శ. ష.

27\. 1. బెండువరచి – ఇ. జ. ద. బ. వ. 2. యొండు విల్లెత్తి – వ.

మీరనందనుఁ దక్కటివారి నొంచె
మూఁడుమూఁడమ్ము లేసి యవ్వాఁడిమగఁడు.

28. తే. అందఱును జుట్టిముట్టి తీవ్రాస్త్రజా[1]ల
కములఁ గృతవర్మ నొంప శిఖండి గదిసి
యాక్రమించిన విలు ద్రుంచె నాతఁ డప్పు
డతనిచాపంబు దునిమె నుగ్రాసి వైచి.

29. క. ఆలోనన భోజపతిఁ
వాలమ్ములఁ బొదివి రెల్లవారలు దానం
దూల కతఁడు బలువిలు గొని
గ్రాలుచు నాభీమముఖ్యరథికుల నొంచెన్.

30. వ. అప్పుడు.

31. ఉ. ఒండొకచాప మెత్తికొని [1]యుగ్రత శాంతనవాంతకుండు వే
దండము వోలెఁ గిట్టిన నుదగ్రత సింహన[2]ఖోపమస్ఫుర
త్కాండములం దదంగము రథంబుపయిం బడ నేసె భోజనా
థుం డది యాజికిం దొలఁగఁ దోలె రయంబున సూతుఁ డార్తుఁడై.

32. వ. ఇట్లు శిఖండి గండడంగి పోయినం గని మత్స్యచేదికేకయాదిసైన్యంబులు
బరవసంబు సేసి యురవడించిన నాకృతవర్మ మర్మ[1]భేదనస్ఫారనారాచపరం
పరాప్రవాహంబున వాని నెల్లం [2]గలంచెఁ దత్కలకలం [3]బాలించి సాత్యకి
య ట్లబ్బలంబులు వికలంబు లగుట యాలోకించి విజయునకుం దోడ్పడం
బదంపడి [4]పోఁదగు రాజువల నారయవలయు నని యూహించి తనకు నడ్డ
పడిన భారద్వాజునితోడి సమరంబు సాలించి మరలి యరదంబు దోలుకొని
[5]యరుగుదెంచి కృతవర్మనిం దాఁకి యేసిన నతండునుం బొగలేని మంటచం
దంబున నుద్దీపించి సాయక[6]జ్వాలలు నిగిడించిన నవి మగిడించి యాశై
నేయుండు.

---

28. 1. సప్తకముల — ఊ. ఓ. ఔ. క. మ. య. ర. స. శ$_1$; శస్త్రకముల — వ.

31. 1. యు[illegible] — పెక్కు ప్రతులు 2. ఖోలివిస్ఫు — క. ర. హ.

32. 1. భే[illegible] — కొన్ని ప్రతులు 2. గప్పె — ఊ. ఏ. 3. బాకర్ణించి — పీ. శ. ష.
4. పో[illegible] — [illegible]న్ని ప్రతులు. 5. యురవణించి — ద. వ. 6. జాలంబులు —
కొన్ని [illegible]

33. శా. భల్లం బొక్కట విల్లు ద్రుంచి రయ మొప్పం నాల్గిటన్ వాజులం
ద్రెళ్లన్ బెట్టుగ నేసి సూతుతల సందీప్తైకబాణాహతిన్
డొల్లం జేసి యదల్చి యి ట్లతనియాటోపంబు మాన్పించి యు
త఼్ల్లాస్యుం డయి పోవ నడ్డపడినం ద్రుంచెం [1]త్రిగర్తావళిన్.

34. వ. ఇట్లు కృతవర్మ విరథుం [1]డై న రయంబునం బురికొని యురవడించిన పాండ
వసైన్యంబులం గని కుంభసంభవుం డాశినివరువిక్రమవిహారంబున కడ్డపడం
గడంగక యాసైన్యంబుల సంరంభంబు దనవిజృంభణంబున వారించి నిలిచె
ని త్తెఱంగునం ద్రిగర్తసేనం జిక్కు వఱచి తఱిమి చనునయ్యాదవరత్నంబు
ప్రయత్నంబునకు భంగంబు సేయ నుత్తుంగమాతంగం[2]బును గొలిపి జలసం
ధుండు మదాంధుం డయి మార్కొనుటయు.

**-: జలసంధుం డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట :-**

సం 7_91_24

35. క. ప్రదరప్రవాహమున న
మ్మదవద్ద్విరదంబు పటుగమన ముడిపి ముదం
బొదవిన సాత్యకి విలు బె
ట్టు దునిమె నమ్మగధనాథుఁడు మహోగ్రుం డై.

36. తే. తునిమి నవ్వుచు నేఁబదితూపు లురము
నందు నాఁటిన శై నేయుఁ డలిగి బెట్టి
దంపువిలు గొని యాతనిధనువు నఱకి
యుఱక [1]యఱువదియమ్ములు వఱపె మేన.

37. వ. దానికిం జలింపక జలసంధుండు.

---

33. 1 త్రికర్తావళిన్ – కొన్ని ప్రతులు.

34. 1. డై న వురికొని – కొన్ని ప్రతులు. 2. బును డీకొలిపి – వీ. శ. వ.

36. 1. యురువడి – కొన్ని ప్రతులు.

38. చ. పటుగతి నాశినిప్రవరుబాహువు దోమర[1]కీలితంబు సే
యుట[2]యును గాక త్రుంచె ధను వుగ్రకృపాణము వైచి యాతఁ డు
త్కట మగునల్క నొండువిలు గైకొని [3]వాని నికృత్తహస్తునిం
దుటితశిరస్కునిం బ్రదరధూతమదావళుఁ జేసి యార్చినన్.

39. క. వెలుకుటి యచ్చటిమూఁకలు
గలఁగినఁ [1]గని తనముఖంబు కయ్యంబునకుఁ
బలియురఁ గృతవర్మాదుల
నిలిపి గురుఁడు వచ్చి యాశినిప్రభుఁ దాఁకెన్.

40. వ. ఇవ్విధంబునం గడంగిన కుంభసంభవుం జూచి యతనిప్రాపున దుర్మర్షణ దుస్సహవికర్ణదుర్ముఖ దుశ్శాసనచిత్రసేనప్రముఖు లగు కురుకుమారు లొక్కపెట్ట కవిసి మిక్కుటం బగుతూర్యరవంబులతోఁ బెక్కమ్ముల సాత్య కిం బొదువ నత్తుములంబునకు దుర్యోధనుం డేతెంచి తమ్ములం గలసినం గనుంగొని గురుండు వార లతని కోపుదు రనుబుద్ధిఁ బాండవ[1]సేనాముఖం బునకుం జనుదెంచిన నయ్యచ్యుతానుజుం డారథికు లందఱ కన్నిరూపు లయి వారలశరాసారంబులు నివారించుచు వారి నొకనినొకని ననేకబాణ జాలంబుల నొప్పించుచుండ నక్కౌరవేశ్వరుం డుద్దామగతిని గవిసి వాలమ్ము లాతనితనువునం జొనిపిన నతండు.

41. క. నగచు విలు దునిమి తీవ్రా
శుగముల నొంచుటయు నీదుసుతు లెల్లను నా
మృగపతిపికముష్టైఁ దఱ
చుగ నిగిడించిరి ప్రదీప్తసునిశితశరముల్.

42. క. చిక్కు వడక సాత్యకి యొ
క్కొక్కగు నయిదయిదు దృఢమహోగ్రాస్త్రములఁ

---

38. 1. కీలితంబు – [illegible] 2. యునుగాగ – ఆ. ఏ. వ. కొన్ని ప్రతులు. 3. యవ్విభు కృత్తహస్తునిన్ – [illegible] కొన్ని ప్రతులు; యవ్విభు వీతహస్తునిన్ – ఇ. జా. ణ; [illegible] హస్తునిన్ – ఝా.

39. 1. [illegible] – [illegible]

40. 1. [illegible] – [illegible] కొన్ని ప్రతులు.

ప్రుక్కించి యెనిమిదిటఁ జే
రుక్కున నక్కురు నృపాలు నొడలం గ్రుచ్చెన్.

43. ఉ. అంతటఁ బోక రత్నమయ మైనభుజంగపతాక గూల్చి య
త్యంతరయంబుమై ధనువు నశ్వచయంబును సూతుమేను నిం
తింతలు వ్రయ్యలై పడఁగ నేసిన బెగ్గిలి తేరు డిగ్గి భూ
కాంతుఁడు వాఱె సేన కలఁగంబడి మ్రోయ నతండు నవ్వఁగన్.

44. వ. ఇట్లు వాఱి చిత్రసేనునరదం బెక్కె నక్కోలాహాలం బాలించి కృతవర్మ దన రథంబు రయంబున నద్దెసకుం బఱపం బనిచి యురవడి నరుగుదెంచినం గని శినిపుంగవుండును నిజస్యందనంబు సమ్ముఖంబు సేయించె నయ్యిరువురుం గోలవి గోలవిం దాఁకిన తెఱంగునం దలపడి యొండొరులపైఁ బ్రచండ బాణంబులు పరగించుచుం బోరునెడ జనార్దనానుజుండు హార్దిక్యు నతిక్ర మించి.

45. తే. హయములను సూతు నొంచి శరాసనంబుఁ
ద్రుంచి మెఱుఁగులు [1]వెరిఁగిన దొడ్డనార
సంబు మే నుచ్చిపో నేయఁ జచ్చినట్లు
మూర్ఛ వోయి మోఁకాళులు [2]మోవఁ బడియె.

46. వ. ఇత్తెఱంగునం దేరిపయిఁ గూలినకృతవర్మం [1]దెగియెనకాఁ దలంచి ధనం జయుం గలయం దమకించి సాత్యకి యక్కడఁ బోవ నాభోజపతి దెప్పిఱి సన్నద్ధుం డై మరలి చని యెప్పటినెలవున నిలిచి యనిలతనయప్రముఖుల కడ్డపడినం జూచి యాచార్యుం డచ్చోటి కతనిం జాలించి శౌర్యధుర్యుం డగు నాశినివరుం డట సనుట సైరింపం జాలక రయంబున.

47. క. [1]మగుడఁ జని యాఁగి నిశితము
లగునారాచములు మూఁట నతనినుదుట బె

---

45. 1. గిఱికొను దొడ్డ - ఐ. వీ. ష్క. స. శ$_1$; వెరసిన - ల. కొన్ని ప్రతులు. 2. మ్రొగ్గ బడియె, మోపి పడియె - అని పాఠములు.

46. 1. దెగిన వానిగా దలంచి - ల. వ. శ. ష. స.

47. 1. ఎగువఁజని - అ. ఆ. ఇ. ఈ. ఌ. స. హ.

ట్టుగ నాఁటినఁ ద్రిశిఖరయుత
నగముక్రియం బొలిచె నతఁడు నరవరముఖ్యా.

48. వ. అరథికవరుండును గురునిపైఁ గ్రూరనారాచంబులు నిగిడించె నిట్లు దొడంగి యయ్యిరువురు నొండొరుశరజాలంబులు వారించుచుఁ దురంగంబులయంగంబుల రుధిరంబులు పూరించుచు సారథుల నొప్పించుచు మేనుల వాలమ్ములు గుప్పించుచు నసదృశంబు లగు[1]కరలాఘవంబులు సదృశంబులుగాఁ బోరు నప్పుడు.

49. మ. ధనురాచార్యుఁడు కేశవానుజుధనుర్దండంబు ద్రుంచెన్ గదం
గొని వైచెన్ వడి నాతఁ డగ్గురుఁ డెడం గ్రూరంపుభల్లంబునం
దునుమం గ్రక్కున [1]నొండువిల్లు గొని యాదోర్దర్పదుర్దాంతు మై
ఘనబాణంబుల నొంచె నించె నతఁ డాకాశంబు గర్జాధ్వనిన్.

50. ఆ. అలిగి గురుఁడు శక్తి నడరింప నది విధి
ప్రేరణమునఁ జేసి తేరు దాఁకెఁ
గాని యతనిఁ దాఁకఁ [1]గానద యతఁడు త
ద్బాహుశాఖ నొంచెఁ బటు[2]శరమున.

51. వ. [1]నొంచినం గోపించి.

52. క. చాపాచార్యుఁడు సాత్యకి
చాపము దునుమాడి సూతుసమ్మూర్ఛితుఁగా
నేపారి హయ రథ్య
వ్యాపారము [1]దాన నడపి యతఁ డని సేసెన్.

---

48. 1. శరలాఘవంబులు - కొన్ని ప్రతులు.

49. 1. దొడ్డవిల్లు - కొన్ని ప్రతులు.

50. 1. గానేర దతఁడు - వీ; గానదు తద్బాహు, శాఖ నొంచె తీవ్రశరచయమున గ. జ. ప. బ. శ. 2. రయమున - కొన్ని ప్రతులు.

51. 1. నొప్పించిన - ఎ. ద. బ.

52. 1. దాన గడిపె - న.

53. వ. ఆలోన నతనిరథచోదకుండు దెలిసిన నెలమిం బొంది.

54. క. బలువిడి బహుళభంగుల ను
జ్జ్వలశరములఁ బోరి పోరి శైనేయుఁడు బె
ట్టిలఁ బడ సారథి నేసినఁ
దొలఁగంగాఁ [1]బఱచె ద్రోణుతురగములు వెసన్.

55. ఆ. అచటి రాజలోక మగ్గురునరదంబు
సనినదిక్కు సనుచు సంభ్రమమున
నాఁగికొనుఁడు పట్టుఁ డదలుపుఁ డేయుఁ డ
శ్వముల ననఁగఁ దెరలె సైన్యసమితి.

56. వ. ఇవ్విధంబున నిజరథంబు [1]విఫలమనోరథం బై పోయిన నదియ పోకగాఁ బోయి సన్నద్ధుం డై [2]సముద్ధతం బై నపాంచాలబలంబుచేతం గలంగుతన మూఁకలం బురి కొలిపికొని కుంభసంభవుం డవష్టంభవిజృంభణంబున సేనాముఖంబునం బొలిచి నిలిచె ని త్తెఱంగున ద్రోణకృతవర్మదుర్యోధనాదు లగు జెట్టిజోదుల [3]బెట్టువఱచి చిఱున వ్వొలయ సాత్యకి సారథితో ని ట్లనియె.

57. క. ఇక్కడఁ గృష్ణులతేజము
నక్కడఁ బవమాననందనాదిజనులపే
రుక్కును గెలిపించె మనలఁ
జిక్కక వెడలితిమి శత్రుసేనలచేతన్.

58. వ. అని పలికి యర్జునుం డున్న దిక్కునకు రథంబు [1]రయంబునం [2]బఱపం బంచిన వాఁడును నట్ల చేయ విమలాశ్వవేగంబునం జారుభీషణం బగున త్తేరు నీవారికి దుర్నిరీక్ష్యం బై నభంబున భాను[3]రథంబు సనుచందంబున.

---

54. 1. నీడ్చె - ఒ. ణ. త.

56. 1. వికలంబై పోయిన - ఊ. ఏ. వి మనోరథంబై పోయిన - పెక్కు ప్రతులు. 2. సముద్దండతరం బైన - కొన్ని ప్రతులు. 3. బెండువరచి - ట.

58. 1. బోవంబనిచిన - ఊ. 2. బరపు మ్మనిన - కొన్ని ప్రతులు. 3. మండలంబు సను చందంబున - ఊ. ఎ. ఏ. ఝ.

-: సుదర్శనుఁ డనురాజు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట :-

సం. 7–94–6

59. క. అరుగఁగ సుదర్శనుండను
ధరణీపతి యడ్డపడి[1]యె దర్ప మలర న
య్యిరువురుఁ బెనంగుటయు న
చ్చెరువుం గావించె నచటి సేనలకెల్లన్.

60. వ. అట్టియెడ నమ్మహీనాథుండు.

61. క. పలుతునియలు సేయుచుఁ దూ
పులు దనదెసఁ [1]జేరనీక పోర శినివరుం
డలిగి తురగముల సారథి
నిలఁ గూల్చి తదుత్తమాంగ మేత్తెఱ నఱకెన్.

62. వ. నఱకి నిజసారథిం జూచి.

63. క. గురుఁ డనుజలనిధిఁ గడచితి
నొరు[1]లు దలంపంగ నాకు [2]నులిగాలువ లీ
నరపతుల సరకుగొన నీ
వరదము సననిమ్ము నేఁటి యని కలయకుమీ.

64. వ. అనవుడు వాఁడు నగుచు నీవిక్రమంబునకు నావెరవు [1]సంగడంబు గాదె సంగరంబున నేమి సేయుదు నెవ్వనిపైఁ దేరు నడపుదు ననిన విని శినివరుండు విన్వచ్చుచేతం జచ్చినకరితురగనరనికాయంబులతిట్టలు సూపి యజ్జాడం దేరు [2]వఱపు మదె గాండీవగుణచండనాదంబు వీతెంచుచున్న యది నేఁడు పాండవమధ్యముం డిచ్చిన ధనుర్విద్యావిలాసంబు మెఱయను జాండు

---

59. 1. యదల్చెఁ బెలుచన – ఖ. చ. వీ. శ. ప. స.

61. 1. బెరయ నీక – ఐ. వ. స.

63. 1. లికదలపంగ నాకు – వ. 2. నురి కాలు వలీ – అ. ఐ. ఘ. ఝ. వ? నురుగాలు వలీ – కొన్ని ప్రతులు.

64. 1. సంగతంబు – కొన్ని ప్రతులు. 2. నడపుమదె – కొన్ని ప్రతులు.

సూనుల కేను జేయుభక్తిస్నేహంబులు నెఱపను వలయు నాకడంక గని కురువిభుం డిరువురుఫల్గును లనుబుద్ధి గలంగునట్లు సేసెద నని పలుకునవసరంబున నద్దెసం గాంభోజయవనసైన్యంబు లతనికడ్డపడం గడంగిన నవ్వీరుండు గుణంబు సారించి యబ్బలంబువలనికిం దేరు వఱపించి.

65\. క. నానాస్త్రంబులు [1]ముందఱ
వే నిగుడఁగ బడలు వడిన వీరభటులపై
నేనుంగుల గుట్టంబుల
పీనుంగులమీఁదఁ దేరు పెలుచం బఱపెన్.

66\. వ. ఇవ్విధంబున వెండియుం గిరాతశకబర్బరపారదయవనప్రముఖమ్లేచ్ఛసేనల రూపడంచి నీమూఁకలు గలఁగం [1]దఱిసి చిత్రవర్మంబు మైచాయగా నారాచంబులు నఖంబులుగను విల్లు బలుమొగంబును సై బెబ్బులివోలెం బోవం బోవ దుర్యోధనదుశ్శాసన చిత్రసేనవివింశతి శకునిదుస్సహదుర్ధర్షణక్రథప్రభృతిరథికనికరంబు రభసంబునం బోకుపోకు మనునెలుంగులతోఁ బిఱిందిదెసం దఱిమినం దత్కలకలంబు విని యతండు సూతు నాలోకించి.

67\. క. మందగతిం జనుము నావెను
కందగిలెడుసైన్యజలధి గ్రక్కునశోషిం
పం [1]దీవ్రశరార్చుల నం
దంద వడిం బఱపి నగుచు నరుగుద మనినన్.

68\. క. అతఁ డట్లచేయ నబ్బల
మతిరయమున నెయిది పొదువ [1]నరిగి కరిచతు
శ్శతియు హయ తిశతియు వపు
మతిఁ గూల్చెను శినివరుండు మద మెలరారన్.

---

65\. 1. ముందట - కొన్ని ప్రతులు.

66\. 1. దెరలి - క [illegible] 2 పరాక్రమంబు బలు - కొన్ని ప్రతులు. 3. క్రోధన - కొన్ని ప్రతులు; [illegible] - కొన్ని ప్రతులు

67\. 1. దీప్ర [illegible] - ల [illegible] హా.

68\. 1. నలిగి - కొన్ని ప్రతులు

69. వ. అంత నిలువక చలంబున నాసేన శైనే[1]యుపై బెట్టు గిట్టి నట్టియెడ.

70. క. నరతురగద్విరదరథో
త్కరములలో నతనిశరము దాఁకనిరూపుం
బరికించియుఁ గానం ద
త్త్వరితత్వంబునకు [1]వేఱ వర్ణన యేలా

71. క. నర[1]బాహాస్ఫురణమునకు
సరి యగు నెక్కుడగుఁ గాని సాత్యకిభుజని
స్ఫురణం బల్పము గా దని
సుర[2]నికురుంబంబు పొగడుచుం జూచె నృపా.

72. మ. కురుముఖ్యుండును దోడిసైనికులు పెక్కుల్ దూపు లొక్కుమ్మడిం
గురియం [1]బిన్న టినవ్వుతో నతఁడు తత్కోదండసూతాశ్వకే
తురథంబుల్ వికలత్వముం బొరయఁగా దోర్దర్ప[2]దుర్దాంతుఁ డై
వెఱపుం జేవయు లావునుం దెలిపె సుర్వీనాథ యాసేనకున్.

73. వ. అప్పుడు

74. క. కదిసి నరేంద్రుఁడు సూతుని
మదమును దురగములయుబ్బు [1]మానిచి నిశిత
ప్రదరముల నతనియంగము
పొదివె శకుని దోడుపడఁగ భుజబల మలరన్.

75. వ. పొదివిన నొదవిన[1]కోపంబు నాటోపంబున.

---

69. 1. యుం జుట్టు ముట్టిన - కొన్ని ప్రతులు.

70. 1. చెప్ప - వ.

71. 1. బాహుస్ఫురణంబు - ఔ. గ. థ. ణ; బాణస్ఫురణంబు - ట. ల. 2. నికరం బుబ్బి - గ. బ. వ. శ. ష.

72. 1. విన్నని నవ్వు - హా; చెన్నగు నవ్వు - ఒ; జిన్నెల నవ్వు - ఆ. ట. బ. వ. 2. దుర్వారుడై - పెక్కు ప్రతులు.

74. 1. మాన్చి నిశాత ప్రదర - ల. హ పెక్కు ప్రతులు.

75. 1. కో పాటంబున - వ. వీ. శ. ష. కొన్ని ప్రతులు

76. మ. ధరణీనాథ మురాంతకానుజుఁడు గాంధా[1]రేశుచాపంబునం
గురువంశాగ్రణిసూతుకంఠము నతిక్రూ[2]రాస్త్రపాతంబునం
గర మాశ్చర్యము గాఁగఁ ద్రుంచినఁ దురంగస్తోమ మామేదినీ
శ్వరుతే రచ్చటు వాయ నీడ్చికొని పెల్చం బాఱె దుర్వార మై.

77. వ. ఇత్తెఱంగునం బాఱిన

78. క. తమ్ములు దొరలును [1]నేపఱి
యమ్మనుజాధిపుని[2]పజ్జ కరుగుటయును సై
న్యమ్ము వెఱచఱచి విచ్చిన
నెమ్మదిఁ దనయరుగుదెస శినిప్రభుఁ డరిగెన్.

79. వ. అనిన విని యాంబికేయుండు సంజయున కిట్లనియె.

80. క. పులికిఁ బసులు వాఱినక్రియ
నలవుఁ జలము సిగ్గు విడిచి య ట్లొక్కనికో
త్తల కోర్వక విఱిగినపు
త్రుల నే మని విందు [1]నేను రోయక యింకన్.

81. క. అనుఁడు నతఁ డవ్విభుని కి
ట్లను నీవును నగ్రసుతుఁడు నవినయములు సే
సినఁ బాటిల్లినయాపద
వినకుండఁగ వశమె మీఁదు విను[1]తెలియఁగన్.

82. వ. అట్లు గాసి యై [1]కోపించి నీకొడుకు పురికొల్ప నంబష్ఠశేంకణపారదప్రముఖ
దేశంబులబలంబులు దుశ్శాసనపురస్సరంబుగా రయంబునం జని సాత్యకిం

---

76. 1. రేయు చాపంబు – ఈ. ఎ. ద. మ. వ. హా. 2. రంపుభల్లంబునన్ – కొన్ని ప్రతులు.

78. 1. నొప్పిరి – ల. 2. వలని కరుగుటయు – ఆ. ఇ. ఉ. ల. కొన్ని ప్రతులు.

80. 1. నకట రోయక – ఊ. ఏ. క. హా.

81. 1. మేల్పడగాన్ – య. ర. హ. పెక్కు ప్రతులు.

82. 1. రోషించి – ఇ.

జట్టుముట్టిన నా జెట్టి[2]మగండు నిజభుజవిక్రమాటోపంబునకుం బాటవంబు [3]దలకొల్పిన.

83. మ. విఱిగెం బెక్కురథంబు లొక్క మొగి నుర్విం గూలె శుండాలముల్
దఱచై రాలెఁ దురంగ[1]మావయవసంతానంబు లింతింత లై
కుఱుకుల్ గట్టె భటాంగకంబులు రణక్షోణిం బ్రవాహంబు లై
పఱచెన్ నెత్తురు భూతకోటి విహరింపం బ్రస్తుతింపన్ సురల్.

-: దుశ్శాసనుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి పాఱిపోవుట :-

సం. 7–87–29

84. క. రోషమున దుస్ససేనుఁడు
పాషాణ[1]ప్రథననిపుణపార్వతికతతిన్
భీషణముగఁ గవియింప జి
గీషం బొదువుటయుఁ జూడ్కిఁ గెం పారంగన్.

85. క. శినివరుఁ డాఱా ల్లెల్లను
దునియలుగా నేయ మిగిడి తొరఁగుచు నవి వై
చినవారిన నొప్పింపఁగ
[1]గనుకని నమ్మూఁక విచ్చెఁ గౌరవనాథా.

86. తే. విచ్చుటయు నంటఁ [1]దాఁకి యవ్వీరుఁ డంప
వెల్లిఁ దేల్చిన వెగడంది పెల్లగిల్లి
యధిప దుశ్శాసనుఁడు మొదలైనయోధ
గణములెల్లను ద్రోణునికడకుఁ [2]బఱచె.

---

2. బిరుదు – ద. వ. 3. సమ కొల్పిన – ఊ. ఏ.

83. 1. బృందఘనసంతానంబు – వ.

84. 1. ప్రథన – అ. ఔ. క. చ. ఠ. డ. ణ. వ; ప్రదర – వా. కొన్ని ప్రతులు.

85. 1. గనుగొని యమ్మూఁక విచ్చె – ద. వ. బ.

86. 1. దరమి – ఎ. ఔ. ఝ. 2. బాఱె, జనియె – అని పాఠములు.

87. వ. ఇవ్విధంబునం దనచేరువకుం జనినయాదుశ్శాసనునిం గనుంగొని మున్ను శైనేయు చన్న దెసం బుట్టిన[1]యక్కోలాహలం బాకర్ణించుచున్న యగ్గురుం డిట్లనియె.

88. క. ఏమి యువరాజవిభునకు
సేమమె సైంధవుని నేమి సేసె నరుఁడు నీ
వేమిటి కి ట్లీరథిక
స్తోమముతో విఱిగి తెందుఁ జొచ్చెద వింకన్.

89. క. అడుకులు దిన్నట్లగునే
కడుపునఁ గుట్టెత్తినపుడు గడుఁ బఱచితి నాఁ
డొడ లెఱుఁగక పాండుసుతుల
నుడిగి [1]మడుఁగ వలసె నిప్పు డొకసాత్యకిచేన్.

90. వ. భీమార్జునులబారిం బడి యేమి గాఁ గలవాఁడ వని పలికి యలుక వొడమిన నంత నిలువక.

91. చ. మఱచితె యాసభఁ భువనమాన్యగుణోత్తర యాజ్ఞసేని నీ
పఱచినపాటుఁ బాండవులఁ బల్కినపల్కులు నాఁటి క్రొవ్వు నే
త్తెఱయును నెందుఁ బోయె రణధీరుల వారల నల్గఁజేసి సి
గ్గఱి తుది [1]నిట్టు లైతి తగు నక్కట తియ్యన గావె ప్రాణముల్.

92. ఆ. బ్రదుకఁ దలఁచి తేనిఁ బాండునందనులకు
నింక నైనఁ బుడమి యిచ్చు నట్లు
గాఁగ నన్నతోడఁ గార్యంబుఁ జెప్పు మ
వ్వెడఁగు భీష్ముబుద్ధి వినక చెడియె.

93. వ. ఇట్లు సేయం జాల వైతేని.

---

87. 1. యాకులారావంబు - య. ర. ల. హా. కొన్ని ప్రతులు.

89. 1. మడఁగ - గు. వ. వీ. శ. ప. కొన్ని ప్రతులు.

91. 1. నేడు పాఱు టది కర్జమె తియ్యన - ఈ. గ. ల. వ. శ. ష.

94. క. ఎట వోవవచ్చు నిను ముం
డట నిడుకొని పోర నున్నతగు[1]రాజుల నె
క్కటి దోలెడి సాత్యకి నీ
వట దలుముదు గాక [2]యొదుఁగ నగునే నీకున్.

95. క. అనుటయు నతండు వినియును
విననిచెవులు సేసి మగుడ విక్రమమునకున్
గొనకొని యేమియుఁ బలుకక
చనియె శినిప్రవరు[1]పజ్ఞ సమరంబునకున్.

96. వ. తదనంతరంబ యాచార్యుం డవార్యదోర్వీర్యంబు మెరయం దఱిమి మెఱుంగు వాలమ్ముల వేఁడిమి సూపిన.

97. శా. పాండుక్ష్మావరసూనుసైన్యములు దర్పం [1]బేదుడుఁగ వీరకే
తుం డుగ్రంబునఁ దాఁకి యగ్గురుని సూతుం నొంచి యేనమ్ము లు
ద్దండుం డై తను [2]వాడ సేయుటయు నాతం డగ్ని దీప్తోజ్జ్వల
చ్చండాస్త్రంబునఁ గూల్చె నాద్రుపదసంజాతున్ మహోదగ్రతన్.

98. వ. ఇట్లు వీరకేతుండు పడినం గినిసి యతని యన్నలుం [1]దమ్ములు నగు చిత్రకేతుండును సుధన్వుండును జిత్రవర్మయుఁ జిత్రరథుండును ద్రోణురథంబు బాణమయంబు సేసిన నతండు.

99. క. వారలరథ్యంబులఁ ద
త్సారథులం బొడవడంచి ధరఁ దొరఁగించెన్
వారిశిరంబులు పువ్వుల
వారణ మెయి దుల్పుగంధవహుఁడుం బోలెన్.

---

94. 1. సేనల అ. ఆ. ఇ. ఈ. కొన్ని ప్రతులు; సేనల నీ, వెట పోయెదు - జ. బ. వ. 2. యిట్టు లగునే వగవన్ - వ.

95. 1. దెనక సైన్యయుతుండై - ఔ. స. శ$_1$; దెనకు సొబలయుతుడై - ఇ. ఈ. ఉ. య. ర. ల. వ; దెనకు స్వబలయుతముగాన్ - కొన్ని ప్రతులు.

97. 1. బేర్పడన్ - కొన్ని ప్రతులు. 2. గాఁక, నాట - అని పాఠములు.

98. 1. దమ్ములుం దల మిగిలి - ఎ. ఖ. చ. ఝ. మ. వ. వీ. శ. స. స. శ$_1$.

100. వ. అప్పు డాలోకించి ధృష్టద్యుమ్నుండు గెంజాయ రంజిల్లుకన్నులం గన్నీ[1]రొలుకం గపిసి కుంభసంభవు నురంబునం గ్రూరనారాచంబులు సొనిపిన మనమూఁకలు హాహాకారంబు లెసఁగ నతండు మూర్ఛిల్లిన నప్పాంచాలవరుండు.

101. తే. పలకయును వాలునుం గొని యలఘుజవము
మెఱయ నేలకు లంఘించి మెఱుఁగు మెఱచి
నట్లు సని తల గోయుట కప్పళించి
[1]యెగిరె నగ్గురుతేరిపై కేపు మెఱయ.

102. వ. అంతటం దెకసి యాచార్యుండు ధైర్యధురంధరుం డై యెదురు గదియంబడి నప్పటికి సాధనంబు లగుజేనకొలందితూపుల నతని నొప్పించినం గడుందురులు గఱచిన వెగడుపడునట్లు మొగతిరిగి యాద్రుపదనందనుండు నిజస్యందనంబునకు వచ్చి విల్లు గొని పెల్లేసిన.

103. క. గురుఁ డతనిసూతుఁ దునుముఁడుఁ
దురగములు రథంబు ననికి దొలఁగఁ దిగువ నా
ధరణీసురోత్తముఁడు బం
ధురపాండవసైన్యసమితిఁ దోలెం బెలుచన్.

104. క. కలశజుని తెంపుఁ బెంపును
బలిమియునుం జూచి యపుడు పాండునృపతనూ
జులదెస[1] సైనికు లెవ్వరు
నలవు మెఱసి కడఁగఁ జాల రైరి నరేంద్రా.

105. వ. అట్టియెడ.

106. ఆ. అవ్విధమునఁ బల్కి యాచార్యుఁ డటపుచ్చ
నరిగి దుస్ససేనుఁ డాశినిప్ర

---

100. 1. రు దొరుగం - కొన్ని ప్రతులు.

101. 1. యేగె - కొన్ని ప్రతులు.

104. 1. సైనికులం దెవ్వరు - వ. ష.

చుండె నంత నక్కడఁ గవ్వడియును నయ[1]గాంతకాలరుద్రునికైవడి రౌద్ర
రసమయమూర్తి యై తనమునుము. మొసల బాసమరుచుండె మోహరంబు
మొగంబున గురుండును గాంగేయబలంబులం బోరిగొనుచుండె నివ్విధంబున
నమ్మువ్వురచేతను బ్రజాక్షయం బగుచుండం గురుపతి భారద్వాజు నాజి
యరసి పోవవచ్చి యచ్చటం బాండవసైనికులసంరంభంబుఁ జూచి యేచి
యొక్కరుండును దలకడచి యమ్మొన వనజవనంబు సొచ్చువారణంబును
బోలెఁ దఱియం జొచ్చి భీమసేనుం బదిబాణంబులను నకులసహదేవద్రుపద
విరాటద్రౌపదేయుల సాయకత్రయంబులను గేకయు లేవురను శరద్వయం
బులను ధృష్టద్యుమ్నుని నిరువదింటను శిఖండిని మూఁటను ధర్మనందనుని
నైదుదూపులను నేసి మఱియు ననేకనరతురగద్విరదరథనికరంబులం బటు
ప్రదరశతంబుల నొప్పించె నప్పుడు.

111\. తే. అతనిచాపంబుఁ గుంతీసుతాగ్రజుండు
నఱకఁ బెఱవారు వోదివిన నఱక వారి
నెల్లఁ గుంభజుఁ డమ్ములవెల్లిఁ దేల్చి
[1]యురవడించి యాసైన్యంబు ను బ్బడంచె.

112\. వ. కౌరవపతియు మగిడి యాసైంధవుకడకుం జనియెఁ దదనంతరంబ కేకయ
మహీనాథుండు మార్కొని.

113\. క. గురుఁ డెన్నిశరము లేసిన
వెరపున నన్నింటి నన్ని విశిఖంబులఁ దా
మరలిచి బ్రహ్మాస్త్రపరి
స్ఫురణము సూపినఁ దదస్త్రమున[1]న యడంచెన్.

114\. క. మఱియు నతనిమెయిబాణము
లఱువది [1]గిఱిగొలుప నాబృహత్క్షత్రుం డే

---

110\. 1. గాంత్య – కొన్ని ప్రతులు.

111\. 1. యురము నొంచి యా సైన్యంబు – వ.

113\. 1. నతం డడచెన్ – కొన్ని ప్రతులు; నమరల్చెన్ – వ.

114\. 1. గిల్కొలుప – కొన్ని ప్రతులు.

డ్తెలు సూతు నొంప నాతం
డలిముటి నారాచతతుల నవ్విభుఁ [2]బొదివెన్.

115. తే. చిక్కువడఁ జేసి చనుమఱి యొక్కదొడ్డ
నారసమ్మున బిట్టేయ నరవరుండు
ద్రెళ్లె శిశుపాలతనయుండు ధృష్టకేతుఁ
డమ్మహావీరుపై వీఁక నడరి యపుడు.

116. క. పెనుమంట నుఱుకు శలభం
బునుబోలెం [1]గవిసి కోలుపులిఁ గోలన్ ద్రే
సినమాడ్కి నేసె నఱువది
మనిశితబాణముల నశ్వసూతయుతముగన్.

117. తే. బాణఘట్టనఁ గటకటఁ బడి గురుండు
విల్లు [1]ద్రుంచిన నొండొకవింట నొంచె
నాతఁ డక్కుంభసంభవుఁ డతని విరథుఁ
జేసి యావిలు [1]దునిమినఁ జేవ సెడక.

118. క. గద [1]వైచిన నది ద్రోణుని
ప్రదరంబుల నడఁగఁ దోమరము శక్తియు బె
ట్టిదముఁగ నతఁ డడరించిన
మదమున నయ్యోధవరుఁడు మడియించె నెడన్.

119. వ. ఇట్లు [1]విగతసాధనుం జేసి.

---

2. గప్పెన్ - ఉ. ఊ. ఎ. ప. మ; నొంచెన్ - త. ర.

116. 1. గదిసి - కొన్ని ప్రతులు.

117. 1. ద్రుంచిన - చ. ఝ. వ.

118. 1. వైచె నదియు - ల. కొన్ని ప్రతులు; సాచి మరియు ద్రోణుని - వ.

119. 1. విగత - శ. ష. కొన్ని ప్రతులు; వికల - వా.

120. క. ఆలోచన మెఱుఁగారెడు
వాలికనారసము చేవివరుహృదయమునం
గిలించినఁ [1]బోడ వెగయుచు
నేలం బడి తన్నికొని చనియె జము[2]కడకున్.

121. క. కని యాతని[1]కొడుకు కడలుం
గనలుం బిరికొనఁగఁ దన్నుఁ గవిసినఁ బోదివెన్
ధనురాచార్యుఁడు శీఘ్రం
బున బెబ్బులికొదమ [2]లేడిఁ బోదివిన[3]మాడ్కిన్.

122. తే. పొదివి యవలీల నాతనిఁ బొలియఁ జేయఁ
సమదగతి మాఱుకొని జరాసంధతనయుఁ
డస్త్రగురు నొంచుటయు నతఁ డల్గి యతని
గూల్చెఁ దత్సైనికులు గనుంగొనుచు నుండ.

123. వ. అట్టియెడ వడముడి ధృష్టద్యుమ్నుండు విన నవ్విప్రవరుం డప్రతిహత[1]తప
స్సిద్ధుండు గాకేమి చూపుల దహించునట్లు తూపులవేఁడిమిం బగఱఁ రూప
డంచుచున్నవాఁ డనిన నాద్రుపదనందనుం డతని మార్కొనం గడంగునెడ
నాతనిం దలకడచి.

124. ఆ. క్షత్త్రవర్మ గురునిచాపంబు ద్రుంచిన
వేఱ యొక్కదొడ్డవిల్లు రయము
మెఱయఁ గొని యతండు మెఱుఁగులు గిఱికొను
నారసమున వానినామ మడఁచె.

---

120. 1. బోడిమి సెడి – ట. వ. వీ. శ. ష. స. శ$_1$; పొడవుకె (నె)గసి – ల. కొన్ని ప్రతులు. 2. పురికిన్ – ఘ. ణ. వ.

121. 1. కొడుకు గనుల గనలుం బిరికొన – వ; కొడు కనలము గనుగవ బిరికొన – ఉ. ఠ; కొడుకు కలక గనలుం – ణ. 2. ఏటి బోదివిన – కొన్ని ప్రతులు. 3. భంగిన్ – పెక్కు ప్రతులు.

123. 1. తపస్సిద్ధుండు – ర. ల. శ. ష. కొన్ని ప్రతులు; తపస్సింధుండు – ఇ. ఒ. త. వీ; తపస్తీవ్రుడు – వా.

125. ఉ. అప్పుడు చేకితానుఁడు [1]శితాశుగముల్ గురుమేనఁ గ్రుచ్చి తే
రొప్పఱ సూతు నొంచి తురగోద్ధతి మాన్ప నతండు గన్నులన్
నిప్పులు రాలఁ దద్భుజము నిష్ఠురబాణహతంబు సేసి వే
కప్పె శరాళి సూతుఁ[2]డు దెగన్ హరు లోటమి గ్రేళ్లు వాఱఁగన్.

126. వ. ఇట్లు విరథుం డై చేకితానుం డోటమి కోర్చి యమ్మొయివ తొలంగె
ని త్తెఱంగున.

127. క. పెక్కండ్రుదొరలు దనపే
రుక్కున రూ[1]పఱఁగ ద్రోణుఁ డుద్ధతిఁ దోడ్తో
నెక్కఁగ నితఁడు కుమారుం
డొక్కొ యనఁగ ముదుకఁ డయ్యు [2]నుగ్రత [3]మెఱసెన్.

128. వ. ఆసమయంబునం బాంచాలపతి యీబ్రాహ్మణుండు వృషభంబు[1]లుంబోని
భూపాలుర నెల్లను సృగాలంబుల కాహారంబు సేయుచున్నవాఁడు వారింప
వలదే యని కడంగి మొనలం బురికొలిపికొనుచు నక్కజం బగుకయ్యంబు
సేయుచుండం బాండవాగ్రజుం డాత్మగతంబున.

*-: ధర్మరాజు భీముని నర్జుననకుఁ దోడ్పడఁ బుచ్చుట :-*

సం. 7-102-4

129. ఉ. అర్జునుఁ డొంటి వోయె నని [1]యక్కడఁ బుచ్చితి బాహుసారవి
స్ఫూర్జితు సాత్యకిం బెలుచఁ బోవుటయుం గనుఁగొంటి నిద్దఱున్
దుర్జయశత్రుసైన్యముల దొందడి నేమయిరొక్కొ విక్రమా
వర్జితవైరి భీముఁడును వారికిఁ [2]దోడుగ నేఁగు టెట్లొకో.

---

125. 1. దశాశుగముల్ - పెక్కు ప్రతులు. 2. డడగన్ దురగంబులు గ్రేళ్ళు - ఖ. గ. శ. ష.

127. 1. పఱగ - ఎ. ఝ. ల. 2. నురువడి - పెక్కు ప్రతులు; నుద్ధతి - గ. వ. 3. గవిసెన్ - త. ర.

128. 1. లు వోని - కొన్ని ప్రతులు.

129. 1. యక్కట - వ. 2. దోడ్పడ - కొన్ని ప్రతులు.

130. క. తమ్మునిఁ దలంచి కృష్ణుని
తమ్ముఁ బనిచె నాతనిం బదంపడి తనచి
_త్తమ్మునఁ దలఁపఁడ ధర్మజుఁ
డెమ్మెయివాఁ డొక్కఁ [1]నారె యీయున్నజనుల్.

131. తే. పెక్కుచోటుల నెఱిఁగిన యుక్కులావుఁ
గలుగునీతనిఁ బనుచుట [1]కలుక నేల
యితఁడు గలయ వయ్యిరువుర కెలమివచ్చుఁ
బనుతు [2]నేనటు శోకంబు వాయవలయు.

132. వ. అని బహువిధంబుల విచారించి నిశ్చయించి.

133. ఆ. భీముఁ జేర నరిగి బీభత్సు నీ[1]తమ్ము
నని యెలుంగు గళమునందుఁ దగుల
నశ్రు లొలుక మాట యట సెప్పలేఁ డతఁ
డార్తి [2]సూచి యిట్టు లనియె నతఁడు.

134. క. ఏము గలంగినయప్పుడు
నీమహిమయ మమ్ముఁ దేర్పు నీకును గలఁగన్
భూమీశ తగునె యివ్విధ
మేమిటఁ బాటిల్లెఁ బనుపు మేపని కైనన్.

135. చ. అనవుడు నాతఁ [1] డి ట్లనియె నక్కడ నప్పుడు పాంచజన్యని
స్వనము వినంగ నైన నట సాత్యకిఁ బుచ్చితి నేమి పుట్టెనో
యను[2]వెత నిప్పు డద్దెస భయం[3]బు దిగంబడ నీవు వోయి పా
ర్థునిఁ గని సింహనాదమున రోదసి నింపుము మాకు నింపుగన్.

---

130. 1. యనరె – ల. పీ. శ. ష. కొన్ని ప్రతులు.

131. 1. కులుక నేల – ఐ. జ. బ. వ. 2. నెట్లు నా శోకంబు – పెక్కు ప్రతులు.

133. 1. తమ్ముడని – కొన్ని ప్రతులు. 2. సూచి యన్న కాత డనియె – ట.

135. 1. డిట్టు లను – కొన్ని ప్రతులు. 2. వెర – పెక్కు ప్రతులు. 3. బుడిపింపగ – ల. స. శ$_1$; బుడుగం బడ – వ.

136. క. నీతమ్ముఁగుఱ్ఱ రూపసి
నీతివిదుఁడు సకలసుగుణనిధి మద్భక్తుం
డాతని కెడ రగునో యను
చేతోగతి పల్లటిల్లఁ జేయదె తాల్మిన్.

137. ఆ. 'అనిన భీముఁ డిట్టు లనియెఁ దద్రథము ర
థ్యముల సారథిని శరాసనంబు
నెఱుఁగు దతనికోలఁది యెఱిఁగిన[1]యదియ నీ
కేల వగవ నిపుడ యేను బోదు.

138. వ. దేవరయాజ్ఞఁ దల [1]నిడికొని చని యాకృష్ణులఁ గృష్ణానుజునిం గలసి యిక్కడ కెఱుక సేయుదు నని పలికి పాంచాలనందనుం గనుంగొని కుంభ సంభవు బలిమియు నతనిప్రతిజ్ఞ తెఱంగును నెఱుంగుదు వేమఱ కుండుము నాకుం [2]బోక గర్జంబు గాదు గా కున్న నేలినవానియానతి నడపవలయు ననవుడు నతండు.

139. క. వినుము భవత్సేనాపతి
తనువునఁ బ్రాణములు గలుగ ధర్మజు[1]దెసకుం
జనుదెంచువాఁడె ద్రోణుం
డనుమానము దక్కి యరుగు మర్జునుకడకున్.

140. వ. అనిన ధృష్టద్యుమ్ను పలుకుల కూఱడిల్లి యనిలతనయుం డన్న చరణంబులకుం బ్రణతుం డై యాలింగనంబును నాశీర్వాదంబునుం బడసియున్నయప్పుడు శౌరి[1]శంఖవిరావంబు వీతెంచిన నవ్విభుం డవ్వీరున కి ట్లనియె.

141. క. విను పాంచజన్యపటుని
స్వన మదె [1]యిది మఱది యెదరుసై రింపక కృ

---

137. 1. యధిప – ల.

138. 1. మోచికొని – ద. వ. 2. బోవుట – కొన్ని ప్రతులు.

139. 1. గడకున్ – త. ద. ర.

140. 1. శంఖారావంబు – ద. ప. బ.

141. 1. యట, తన(మఱది) – అని పాఠములు.

ష్ణునిరణము సేయురథసం
బని తలఁచెద [2]నెద్దు మెద్దు మధికరయమునన్.

142. వ. అనవుడు సవిశేషకల్పితం బగురథంబు రవంబును దూర్యనినదంబును దన సింహనాదంబునుం జెలంగ విశోకునిసారథ్యసామర్థ్యంబున రథ్యంబులు నెఱయ మెఱయం గదలి గొనయంబు సారించి కురుబలంబు నవలోకించుచు నడరు నవ్వడముడిం దలపడి నీకొడుకులు దుశ్శలచిత్రసేనకుండభేదివివింశతి దుర్ముఖ[1]దుస్సహులును వికర్ణశలవిందానువింద సుముఖదీర్ఘబాహుసుదర్శ బృందారకులును సుహస్తసుషేణదీర్ఘలోచనాభయరౌద్రకర్మసుశర్మదుర్వి మోచనులును వివిధవిశిఖంబులు వరగించుటయు శేల్లగమిం జూచి పొంగు సింగంబుచందంబునం జెలంగి యాశరంబులు వారించుచు వారిం గదిసి బృందారకుం దెగఁ జూచి యభయరౌద్రకర్మదుర్విమోచను లనుమువ్వుర మూఁడువెడంద[2]దూపులం దునిమిన.

143. క. చలమునఁ బోవక [1]పెనఁగిన
నల వేర్పడ నతఁడు విందు ననువిందసుశ
ర్మలఁ జంపి సుదర్శను బె
ట్టిలపైఁ బడి యపుడు సావ నేసె నరేంద్రా.

144. క. పెఱవారు వెఱచి నలుగడఁ
బఱచిన వాయుసుతుఁ డార్చి పఱపె రథం బా
తెఱపిన యరుగుట గని గురుఁ
డుఱక యతనిఁ దాఁకి కప్పె నుగ్రాస్త్రములన్.

145. వ. ఇట్లు నిలువరించి నిటలంబున నారాచంబు నాఁటించి యక్కుంభసంభవుండు దనమనంబున వీఁడు విప్వచ్చునట్లు [1]నన్ననుసరింపఁ గలవాఁ డని తలంచి యప్పవనతనయు నుద్దేశించి.

---

2. యేగు మేగు మధిక – ద.

142. 1. దుష్ప్రహులును – పెక్కు ప్రతులు. 2. వాతియమ్ములం – త.

143. 1. పొదివిన – ఐ. ఓ. ణ. ద. ర. వ.

145. 1. నన్ను (తన్ను) నోసరింప – గ. బ.

146. క. నను గెలిచి కాక నీ కి
మ్మొన పొరఁగా నెట్లువచ్చు మును నీతమ్ముం
డనుమతుఁ డై కాదే చొరఁ
గనియె ననుడు నతఁడు గన్నుఁగవఁ గెంపారన్.

147. క. నరుఁ డొకరథికుని యనుమతిఁ
జొరఁ దలఁచునె మనుజసేన పురబలమైనం
దెరలిచికొని విచ్చలవిడి
నరుగుం దన[1]వలయునెడకు నది యట్లుండెన్.

148. చ. ప్రియములు వల్కి నిన్ననుసరింపఁగఁ బార్థుఁడు గాఁడు సుమ్ము దు
ర్జయభుజశక్తి నిర్మథితశత్రుఁడు భీముఁడు గాని నీవు దం
డ్రియు గురుఁడుం బ్రియుండు నని ప్రీతి [1]యొనర్చెదఁ బూని వైరికిన్
జయ మొనరింతు గాక యని సైఁతునె దర్పము సూప కుందునే.

149. వ. అని పలికి.

150. మ. గద సారించి చెలంగి వైచిన భుజాగర్వంబు సాలించి య
మ్మదకం డుర్వికి దాఁటి పోయె నది రశ్మిల్ మింటఁ బర్వంగ బె
ట్టిద మై మ్రోయుచు వచ్చి బల్విడుగు మాడ్కిం దాఁకుడున్ గుఱ్ఱముల్
సదిసెఁ సారథి మ్రగ్గెఁ దేరు వొలిసెఁ సైన్యంబు [1]భీతిల్లఁగన్.

151. వ. అప్పు డమ్మేటిమగండు.

152. క. మనమూఁక దటిసి యుద్ధతిఁ
జనఁ జన నీనందనులు వెసం దాఁకియు ను
బ్బినయతనిపీఁక కోర్వక
కనుకని సిగ్గు సెడి పాఱఁగా గురుఁ [1]డంతన్.

---

147. 1. వలచి నెడకు — వా; వలసి నెడకు — అ. బొ. ల; వలయు —, పెక్కు ప్రతులు.

148. 1. యొనర్చినఁ బూని — వ. బ. పీ. శ. ప.

150. 1. దైన్యంబుగాన్ — బొ. ఝ. య. హా.

152. 1. డలుకన్ — జ. బ.

153. క. ఒండొకతే రెక్కి సము
ద్దండతఁ జని భీమసేనుఁ దాఁకి శరము లొం
డొండ నిగిడించి నొంచిన
గం డడఁగక యతఁడు కనలు గదిరినమదితోన్.

154. చ. అరదము డిగ్గి యప్పటుశరావళి కోర్చి మొగంబు వాంచి స
త్వరుఁ డయి వాన పైఁ గురియ వంచినమస్తక మొప్పఁ బోవుసుం
దరవృషభంబు [1]లీలఁ జని దర్ప మెలర్పఁగ నొక్కచే నొగల్
వెరవునఁ బట్టి తేరు ప్రజ విస్మయ మందఁగ [2]పీచి వైచినన్.

-: భీముఁడు ద్రోణాదిరథికుల నతిక్రమించి యర్జునుఁ జేరఁబోవుట :-

సం. 7_102_88

155. ఆ. నుగ్గునూచ మైన నగ్గురుఁ డొండొక
యరద మెక్కి యల్ల నరిగె సేన
మొగమునకు రయంబు మిగుల విశోకుఁడు
దేర భీముఁ డెక్కెఁ దేరు ప్రీతి.

156. వ. ఇవ్విధంబున ధనురాచార్యు [1]బెట్టు వఱచి బిట్టు సనునాతెట్టిబిరుదున [2]కెదుర్పం జాలక భోజబలంబును గాంభోజానీకంబును యవనాదిమ్లేచ్ఛసైన్యంబులునుం బసులు పులికిం బాఱు తెఱంగునం గలంగి పఱచె న ట్లప్రతిహత గతిం బోయి సాత్యకిసమరోల్లాసంబు గనుంగొనుచు నట కడచి యవ్వడముడి దివ్యరథంబు మెఱయఁ గౌరవ్యయోధులతోడం [3]బెనంగుసవ్యసాచిం [4]జూచి సింహనాదంబు సేసిన నతనిం గనుంగొని ప్రియంబున నయ్యర్జునుండును హరియును గర్జారవంబుల గగనంబు నినిచి రమ్మహారవంబు లాకర్ణించి యుధిష్ఠిరుఁడు భీమసంజ్ఞాపనంబునకు సంతుష్టాంతరంగుం డై తన లోనన యతని నగ్గించి యన్నరనారాయణుల యెలుంగులు వినం గనుట

---

154. 1. చాడ్పునను – వ. 2. త్రిప్పివైచినన్ – ట. వ.

156. 1. బెండు వరచి – ద. 2. కెదురం జాలక – పెక్కు ప్రతులు. 3. బోరు – బొ. పి. శ. ష. కొన్ని ప్రతులు. 4. జూచి ప్రేల్మిడి సింహ – వ.

కుం బొంగుచు నప్పార్థుండు దన[5]ప్రతిజ్ఞ నెఱపి వచ్చి తన్నుం గౌగిలించి కొనుటం గోరు[6]చుం గౌరవపతి యిమ్మెయిం దమ్ములు బంధులుం దెగం బోలియుట దెలిసి యయునను వీరునకుం జొచ్చి యున్నవారి సైనం గాంచి కొనునొకో[7] యని యూహించుచుఁ గయ్యంబు సేయుచుండె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

157. ఆ. ఇట్లు సింహనాద మిచ్చిన భీముని
మాఱ్కొనంగ మగఁడు [1]మనబలమునఁ
గలిగెనేని మదాత్మజులఁ [2]గాల్పఁ బుట్టిన
చిచ్చు వాఁడు వానిఁ జెనయు టరిది.

158. చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మనుజేంద్రున కప్పు కర్ణుఁ డ
య్యనిలతనూజు మాఱ్కొని రయంబున వింశతిసాయకంబు లే
సిన నతఁ డేడుతొమ్మిదులు చెచ్చెర నేసి [1]సిడం బొకంట నే
పునఁ గుదియించె సారథికపుంగవు లట్లు దొడంగి యుద్ధతిన్.

159. వ. పెనంగునెడ భీమసేనుండు.

160. క. సూతసుతువిల్లు ద్రుంచిన
నాతఁడు బలువింట గొంచె నతని వెస మరు
త్సూతి యదియుఁ ద్రుంచుచుఁ ద
త్సూతునిఁ దురగములఁ ద్రుంచె దుర్దమలీలన్.

161. ఆ. విరథుఁ డై యతండు వృషసేనురథ [1]మెక్కఁ
బాఱుటయును గలఁగఁ బాఱె సేన

5. ప్రతిన – కొన్ని ప్రతులు. 6. చుండె – శ. కొన్ని ప్రతులు. 7. దీనతకుం జొచ్చి – జొ; తెరంగునకు – ట. బ.

157. 1. మనల యందు – ఇ. 2. గూల్ప – వ.

158. 1. శరం బొకంట నేపున నిగుడించి – శ. ష. హ. కొన్ని ప్రతులు; ననంప వెల్లి యేపున – ఆ. గ.

161. 1. మెక్కి పారుటయును – ఉ. వ. శ. ష.

లట్టియెడ నృపాలుఁ డాచార్యుపాలికిఁ
జనియెఁ దేరు దోలికొని రయమున.

-: దుర్యోధనుఁడు ద్రోణుని దూఱనాడుట :-

సం. 7_166_1

162. వ. చని యడిచిపాటు గదుర నతనితో ని ట్లనియె.

163. క. నరుఁడును సాత్యకియు వృకో
దరుఁడును మనసేనఁ గలఁచెదరు సైంధవుఁ జే
రిరి నీకుఁ దగునె నరునిం
జొరనిచ్చితయేని వారిఁ జొర నీ ననఘా.

164. క. సమరంబున నీ వోడుట
సముద్ర మింకుట జయించె సాత్యకి గురుఁ గ
య్యమున నని యెసఁగుజనవా
దమ మేలుగఁ దలఁచితొకొ్కొ ధనురాచార్యా.

165. క. ఈభంగి నీ వడంగుట
మాభాగ్యము గాక యింక మాటలు వల దీ
శోభం బెట్టు లుడుగుఁ జెపు
మా భవదీయబలశౌర్యమతులకుఁ దగఁగన్.

166. చ. అనవుడు వాతఁ [1]డిట్టు లను నక్కడ నిక్కడ నొక్కరూపునఁ
మనమొన కైనయీయెడరు మాన్పఁగ నోపినయంత మాన్పెద
న్వినుమ[2]ము విశిష్టకార్య మవనీవర సైంధవుఁ గాచికోల య
ర్జునునకు నీకునుం గలిగె జూదము [3]నేఁ డధికంపుటొడ్డుగన్.

166. 1 డిట్లనియె - కొన్ని ప్రతులు. 2. మవశిష్టకార్య - అ. చ. భాపూ. 3. నేడధి కంపు టొడ్డుగాన్ - మ. ర. వ. హ. కొన్ని ప్రతులు. వా దధికంపుటొడ్డుగాన్ - ఖ. చ. ఝ. య. వ. శ. ష; నాడధికంపు - వా. ష.

167. క. మును శకుని బుద్ధిమై గెలి
చినయది యస్థిరపు గెలుపు [1]సెడ కిజూదం
బున వెడలఁ జాటు సూవే
మనవెరవును లావుకలిమి మనుజాధీశా.

168. వ. కావున నీవు సుస్థిరోత్సాహుండ వై సాహాయ్యంబునకు నద్దేవ నున్న కర్ణాదులం గొని కవ్వడి మొదలగు నమ్మువ్వురకుం జాలి సింధు[1]రాజరక్షణంబు నిర్వహింపు మేను [2]సేనాముఖంబున నిలిచి తక్కినయందఱ నిలువరించుట మేలు నీతో వచ్చుట కర్జంబు గాదు పొమ్మనుటయు నతండు మరలి తన్నుం దాన పురికొలిపికొనుచు నట సనియె నప్పుడు యుధామన్యుండు నుత్తమౌజుండును మున్ను కృతవర్మచేత నివారితు లై నరుని[3]తోడి వఱుమం జనక కెలని కుఱికి యతిముఱి మనమొన దెరల్చికొని బయలికి వెడలి కపిధ్వజగాండీవగుణరావంబులకతంబున నతనియున్నయెడ యుపలక్షించి తిరిగివచ్చి బలువున మనబలంబు వాయఁ జాపికొని చొచ్చి విన్వచ్చుం జేరవచ్చుచున్నం గని యక్కురువిభుండు వారల వారింపం గడంగిన.

169. క. ఆయిరువురతో నజ్జన
నాయకునకు నయ్యె దారుణం బగురణ మం
[1]దాయతనృపచాపము రో
షాయత్తత నుత్తమౌజుఁ డార్చుచుఁ [2]దునిమెన్.

170. తే. తునిమి తోడన యురమ మాడ సునిశితాస్త్ర
చయము నిగిడింప రా జొండు చాప మెత్తి
యతనిహయముల సారథి నవనిఁ గూల్చె
నాతఁ డరిగె యుధామన్యునరదమునకు.

---

167. 1. సెడమికి జూదంబు - ర; సింధుజ జూదంబు - ఖ. చ. ఠ. ప. వ; (సమాసము చింత్యము) సింధుజు జూదం - శ.

168. 1. రాజు ప్రాణంబులు - ఖ. ఘ. మ. వ. వీ. శ. ష. స. శ$_1$. 2. సేన మొగంబున - ఈ. ఉ. ప. వీ. శ$_1$. ష. 3. తోడ నతుగం బడక - పెక్కు ప్రతులు.

169. 1. దాయెడ నృపుచాపము - అ. ఆ. ఉ. ఊ. కొన్ని ప్రతులు; దాయత నృపు చాపము - కొన్ని ప్రతులు. (పాఠమంత సరసముగా లేదు). 2. ద్రుంచెన్ - ఒ. ట. వ.

171. క. అరిగి తురగముల సూతుం
బొరిగొన విరథుఁ డయి నృపతి పొలి వోవక యు
ద్ధురగతి గద గొని చని త
త్తురగంబుల సారథిని జిదుర్పలు సేసెన్.

172. తే. రథము డిగ్గి తొలంగి సారథికు లమ్మ
హీశుఁ డేతెంచి యెక్క మద్రేశు[1]తేరు
వారు నీయోధు లిరువుర బారిసమరి
యారథము లెక్కి యర్జునుఁ జేరఁ జనిరి.

173. వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లను మనవా రెల్లం గర్ణుండు గౌంతేయుల గెలుచు నని యాసపడుదు రాధర్మతనయుం డాతనియాటో పంబు [1]దలంచి రేలెల్లను గన్ను [2]మూయండు.

174. ఆ. అట్టిజెట్టి యనిలుపట్టిచే విరథుఁ డై
పోయి పోయి[1]నట్లు పోయెఁ గాని
మరలి కయ్యమునకుఁ జొరఁ డెట్టు లాతని
తెఱఁగు సెప్పు నాకుఁ దేటపడఁగ.

175. చ. అనవుడు నాతఁ డిట్టు లను నన్నరనాథున కట్లు సూతనం
దనుఁ బొరివుచ్చి భీముఁడు [1]మదంబున నర్జునుదిక్కు వోవఁగా
గని యతఁ డాయితం బయి తగం దనపే రెలుఁగెత్తి పిల్చె నా
[2]ధ్వని విని యావృకోదరుఁ డుదగ్రగతిన్ మరలెన్ మహీశ్వరా.

176. వ. అట్లు [1]దార్కొని యర్కప్రతాపు లగునయ్యిరువురు నొండొరువుల శరంబులు దూలించుచుఁ దురంగంబులయంగంబులం దూపులఁ గీలించుచు సార

---

172. 1. రథము – కొన్ని ప్రతులు.

173. 1. దలంచి పగలును రేలును – ఇ. ఉ. ఒ. ఘ. డ. వ. 2. మూయకుండు – కొన్ని ప్రతులు.

174. 1. నట్లపోయె – కొన్ని ప్రతులు.

175. 1. ముదంబున – అ. ఆ. ఇ ఈ. ల. హ. కొన్ని ప్రతులు. 2. తనివిని – అ. ఆ. ఇ. ఉ. కొన్ని ప్రతులు.

176. 1. మార్కొని – ఒ. వ.

ఘుల బెట్టు వఱుచుచుఁ జాపంబులు విఱుచుచు మైమఱువు లఱువుగ్గ
సేయుచు మేనులు నెత్తుట జొత్తిల్లఁ జేయుచు నొండొరులకు వేఁడిమి
సూపి యేపునం బెనంగునెడ నయ్యనిలతనయుండు.

177. క. విలు దుమురు సేసి గుఱ్ఱం
బుల సూతునిఁ బిలుకుమార్చి భుజగనిభశరం
బులఁ [1]జేడ్పఱిచిన సిగ్గఱి
కలఁగి పఱచి యొండురథముఁ గర్ణుం డెక్కెన్.

178. క. అన విని ధృతరాష్ట్రుం డి
ట్లను నమ్మినబంటు పిఱికి యై యిటు పఱవం
గని మందబుద్ధి దుర్యో
ధనుఁ డేమని తలఁచె నొక్కొ తన[1]చిత్తమునన్.

179. వ. అది య ట్లుండె నాకర్ణునిబింకంబు [1]పిదప నెట్లయ్యె ననవుడు సంజయుం
డతని కి ట్లనియె.

180. తే. ఆననంబునఁ గ్రోధమహానలంబు
భీషణముగ రాధేయుండు భీముదెసకు
మరలి [1]యురవడిఁ గవియ నయ్యిరువురకు మ
మహాద్భుతం బగుసంగ్రామ మయ్యెనధిప.

181. క. బలుదేగలక్రై వడి బె
బ్బులుల[1]పగిది మత్తకరులపోలిక దర్పో
జ్జ్వలసింహంబులచాడ్పున
నలవుఁ జలము మెఱయఁ బెనఁగి రారథికవరుల్.

---

177. 1. గిడ్వరచిన - ఇ.

178. 1. యుల్లములోన్ - త.

179. 1. పదంపడి - ఐ.

180. 1. యురువడి - పెక్కు ప్రతులు.

181. 1. గతిన్, కరణి - అని పాఠములు.

182\. క. పెనఁగునెడం గర్ణునిది
క్కునఁ జతురంగములు బెట్టుగో_ల్తల వాటీ
మునిమీఁదఁ గవిసి మంత్రిం
చినయట్లులు గూలె నతనిచేతి[1]బలువునన్.

183\. వ. అవ్వుడు నాంబికేయుండు.

184\. క. తొడరెడుకొలఁదియె వానికి
వడముడిభుజవిక్రమం[1]బు వారల మన మె
ప్పుడు వినమొ కర్ణు వినమో
యడిబీరపుఁ దులువ గెలుచునటే పాండవులన్.

185\. ఉ. సూతసుతుండు పాండునృపసూనులఁ బోర జయించు నంచు గ
ర్వాతిశయంబునన్ [1]మనమదాంధుఁడు కృష్ణుఁ దృణీకరించి సం
ప్రీతిగ సంధి సేయఁడ యపేతకళంకులు వారు వారి కే
లా తగ వేది దైవము దలంచు రణంబునఁ జేటు సంజయా.

186\. వ. తానును దమ్ములుం జెడుదు రింతియ కాక యొండు గలదే యది య
ట్లుండె ఖండనంబుతెఱంగు సెప్పు మనిన నమ్మనుజపతికి వానూతసంభవుం
డి ట్లనియె.

187\. చ. పమసినసేనఁ జూచి రథసంబునఁ గర్ణుఁడు భీముఁ గిట్టి ద
ర్పము సిగురొత్త ముప్పదిశరంబుల నొంచినఁ గెంపుసొంపు వ
క్త్రమునకు [1]నొప్ప సేయఁగ నతండు వెసన్ విలు ద్రుంచి సూతుప్రా
ణముఁ గొనినం జలం [2]బెదఁ బెనంగొన వాహనచోదకుండు నై.

188\. వ. [1]కర్ణుండు శక్తి [2]వైచిన.

---

182\. 1. బలుపునన్ – పీ. కొన్ని ప్రతులు.

184\. 1. బవార్యబలము నేర్పడ – ఎ. జ. ట. బ.

185\. 1. ఘనమదాంధుడు – అ. గ. ద.

187\. 1. జెన్ను సేయగ – ఇ. 2. బెడ – వ. కొన్ని ప్రతులు.

188\. 1. కర్ణుండు – ఊ. ప. త; అతండు – వా. కొన్ని ప్రతులు. 2. యడరించిన – త.

189. క. ఎనిమిదితునియలుగా నది
దునిమి మరున్నందనుండు తొమ్మిదిశరముల్
తను వాడ సేయ బలువిలు
గొని యన్నియ కర్ణుఁ డేసెఁ గ్రూరాస్త్రంబుల్.

190. క. వాని నెడ నఱికి యప్పవ
మానతనూభవుఁడు నిశితమార్గణములు పై
పై నిగిడింపఁగ రాధా
సూనుండును సాయకముల [1]సోనలు గురిసెన్.

191. క. [1]చెలఁగుపటుసింహనాదం
బులు ఱంకెలు గాఁగ వారు పొలిచిరి వృషభం
బులక్రియ నొండొరులకు మా
ర్మలయుచుఁ దాకుచు నుదాత్త[2]రభసోజ్జ్వలు లై.

192. ఉ. అత్తఱిఁ గర్ణువిల్లును హయంబులు నుగ్గుగఁ జేసి నెత్తుటన్
జొత్తిల మేన బాణములు సొన్పి మరుత్సుతుఁ డార్చె నార్చినం
జిత్తము దల్లడిల్లఁ గురుసింహుఁడు దుర్జయుఁ [1]బన్ప నాతఁ డ
త్యుత్తమసాహసప్రకటితోద్ధతి నాజగజెట్టిఁ దాఁకినన్.

193. తే. బలము లచ్చెరు వంద నట్లలవు మెఱయ
నీసుతుఁ డనిలసుతుఁ దాఁకి నిశితసాయ
కముల నొప్పించి రథతురంగముల నొంచి
సూతు [1]నొనేయఁ గ్రోధవిస్ఫూర్తి నతఁడు.

194. క. తురగములతలలు సూతుని
శిరము నతనిమస్తకంబు శితశర[1]షట్క

---

190. 1. సోనగ గురిసెన్ - వ. స. $శ_1$.

191. 1. చెలగి - పెక్కు ప్రతులు. 2. మహిమోజ్జ్వలు లై - వ.

192. 1. బన్చె, బుచ్చె - అని పాఠములు.

193. 1. నేయుడు - ఐ.

194. 1. వర్ష - ఓ. ఐ.

స్ఫురణమున ధరణిమీఁదం
దొరఁగించెం గర్ణుఁ డేడ్పుతోఁ గనుఁగొనఁగన్.

195. వ. ఆలోనన సూతసూనుండు రథంబు సన్నద్ధంబు సేసికొనినవాఁ డగుట [1]నప్పాండుతనయుం దలపడియె నమ్మేటిమగలు కోపంబులు నాటోపంబులు బలంబులుఁ జలంబులు శౌర్యంబులు ధైర్యంబులు మెఱయ తెఱంగునం బెనంగి రట్టియెడ.

196. మ. ఖరనారాచము భీమువక్షమున నాకర్ణుండు శాహోబలా
భరణుం డై నిగిడింప నుచ్చి చని భూభాగంబు నాఁటంగ నా
తురతం బొందక తండు నిష్ఠురగదం ద్రుంచెం దురంగంబులన్.
ధరణిం గూల్చె ధనుర్విలాస [1]మలరం దత్సూతునిం గేతువున్.

197. మ. విరథుం డయ్యును రాధనందనుఁడు [1]దోర్వీర్యం బవార్యంబుగా
శరజాలంబుల భీముఁ గప్పుట మహాశ్చర్యంబు గావించె భూ
వరుఁ డంతం దనతమ్మునారథికుఁ గావం బంచె నాదుర్ముఖుం
డు రయం బారఁగఁ దాఁకె [2]భీమునకు నాటోపంబు దీపింపఁగన్.

198. క. అయ్యంగరాజుతోడం
గయ్యము సేయుచును దుర్ము[1]ఖప్రాణంబుల్
సయ్యనఁ దొమ్మిదియమ్ములఁ
[2]గ్రుయ్యక డయ్యక యతండు గొనియె నరేంద్రా.

199. వ. ఇట్లు భవదాత్మజుండు పడుటయు.

200. ఉ. ఆతనిఁ జూచి కన్నుఁగవ నశ్రులు గ్రమ్మఁగ సూతసూతి శో
కాతురుఁ డై తదీయరథ మల్లన యెక్కఁగ భీమసేనుఁ డు

---

195. 1. నప్పాండవ సింహుం - ఇ. బ. వ. వీ. శ. ష.

196. 1. మదరన్, మమరన్ - అని పాఠములు.

197. 1. దోర్వీరత్వ మేపార - ఎ. 2. భీముడును - ఉ. శ.

198. 1. ఖు - కొన్ని ప్రతులు. 2. గుయ్యక - ఔ. క. ద. వీ. శ. ష.

ద్ధోద్ధతిం హేమభూషితచతుర్దశమార్గణవిద్ధుఁ జేయుఁడు
న్నాతశరంబు లన్ని వెస నాఁటె సతండును [1]దద్భుతంబులన్.

201. వ. దానం గనలి యనిలతనయుండు

202. ఆ. వాఁడినారసములు మూఁడు కర్ణునిఁ బొమ్మ
గాఁడ నేయ [1]నాన గడచి నొవ్వ
భయముఁ గదురఁ జేయ రయమున నరదంబు
దోలికొని యతఁడు దొలఁగఁ బాఱె.

203. వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

204. క. విను పౌరుషము నిరర్థక
మనుమానము లేదు దైవ [1]మధికంబు మరు
త్తనయునిచే నారాధా
తనయుం డిట్లగుట నెవ్విధంబునఁ దలఁపన్.

205. క. అట్టన నేల మహాబలు
పట్టికి సురఖచరదనుజపన్నగులును మా
[1]ర్వెట్ట రనినఁ గర్ణాదుల
కెట్టు నిలువవచ్చు వాని యెదురం దిర మై.

206. క. పాండవుల[1]గెలుచునాజి ని
తం డని యగ్గించు సూతతనయుని మత్పు
త్రుం డతఁడు భీము[2]నేపున
గం డడఁగినఁ జూచి మనసు గందక యున్నే.

---

200. 1. నద్భుతంబుగన్ – ఇ.

202. 1. లజ్జ – అ. జ. ట. బ. వ. శ; దాన గలుగు నొవ్వ – ఊ. ష. బి.

204. 1. మగ్గలము – ఎ. ఔ. ఖ. చ. జ. ద. బ. వ.

205. 1. ర్వెట్ట రనిన – కొన్ని ప్రతులు.

206. 1. గెల్చు నని నీతం డని – ద. వ. 2. నెపమున – ఒ. ఝ. న.

207. క. [1]వినఁడె జరాసంధాదులఁ
దునుముట మనదుర్జయుండు దుర్ముఖుఁడును నీ
మునితోడఁ బెనఁగువా రే
మని కర్ణునిఁ గావఁ బనిచె నబ్బాలకులన్.

208. క. పవనజుఁ డొక్కఁడె పెఱపాం
డవులును సాత్యకియు హరియు డాఁతురె యుగ్రా
హవమునఁ [1]బ్రాణము లావున
నవిజయ్యులు వారిఁ [2]దొడర నగునే తనకున్.

209. చ. అని పలుమాట లాడుటయు నమ్మనుజేంద్రునితోడ నాతఁ డి
ట్లను విష మెత్తి క్రోలి యది యంగము నారటపెట్ట నన్యులం
గినిసినయట్ల మీఁదు పరికింపక యమ్మెయి నీవు పాండునం
దనులకుఁ జెట్టవై హృదయతాపము వచ్చి[1]నఁ బల్కె దొండులన్.

210. వ. ఊరక బవరంబు తెఱంగు వినుము నీతనయులు దుర్మర్షణుండును [1]దుర్మ
దుండును దుస్సహుండును విజయుండును విచిత్రుండును గర్ణునోటమి
సయిరింపం జాలక వడముడిం దొడరి తూపు లడరించినం జూచి యాసూత
సూనుండు దానును నతనిపయిం గవిసి యేసినఁ దద్విశిఖంబుల వారించుచు
మారుతనందనుండు.

211. ఆ. ఏచి కురుకుమారు లేవురఁ దురగసా
రథులతోడఁ గూడ రయము మెఱయ
వసుధఁ గూల్చె మెఱుఁగు వాలారు తూపు[1]లా
ఱాఱు నిగుడఁ జేసి యద్భుతముగ.

---

207. 1. వినమె - అ.

208. 1. బ్రాణంబులు విను మవిజేయులు - ల. పీ. శ. ష. స. శ$_{1}$. 2. తోడ నగునే - పీ. శ. ష.

209. 1. నవొడ్ల(ర్ల) బల్కుడే - వ. పీ. శ. ష. స. శ$_{1}$; న బల్కె దొడ్డులన్ - కొన్ని ప్రతులు.

210. 1. దుష్ప్రహుండును - కొన్ని ప్రతులు.

211. 1. ల నారు దొరుగ జేసి - ప.

212. క. అనిఁ బడినరాచకొడుకులఁ
గని కర్ణుం డేటిబ్రదుకుగా బ్రదికెద నే
నని యింక నెన్నఁటికి లా
వని భీముని నొంపవలదె యని [1]తెం పెసఁగన్.

213. ఆ. కదిసి దెబ్బదేనుకాండంబు లాతని
మేనఁ బఱపి యుబ్బు మిగిలి నవ్వ
నతఁడు నూటయేను శితవిశిఖంబుల
నతని నేసి చాపయష్టిఁ ద్రుంచె.

214. మ. రయమారన్ బలువిల్లు [1]పుచ్చుకొని యారాధాసుతుం డేయ దు
ర్జయుఁ డమ్మారుతి వొంగి సూతుని వెసం జానేసి విల్ ద్రుంచుచున్.
హయసందోహముఁ గూల్చి [2]హాస్యమునకున్ హాసంబు సేయన్ గద
న్నృయదాకారత వైచె నాతఁ డది భగ్నం బయ్యె నాభీముచేన్.

215. వ. ఇట్లు గద ద్రుంచి పైపై నేయు పావని [1]బరవసంబునకుం [2]దెరలక యొండుకోదండంబు గొని కర్ణుం డతనితనుత్రాణంబు దునియలు సేసి వెల్లే సిన నతండును దదీయకంకటంబును భుజంబును భేదించె నిప్పరుసునఁ జాద చారి యై వెనంగు నయ్యోధవరుం జూచి భూవరుండు సత్వరుం డై పను పం జిత్రవిచిత్రచిత్రాయుధచారుచిత్రులును [3]జిత్రధ్వజచిత్రాయుధచిత్రకర్మ [4]లును శరాసారంబులు బరగించుచు ధర్మపుత్రానుజుం దాఁకిన నతండు మహావాతపతిత భూరుహప్రతతిభంగి దోఁప నక్కుమారసప్తకంబును [5]రథ సప్తిసారథిసహితంబుగాఁ [6]బోడ వడంగంజేసె నానందునఁ గల్పితస్యందనుం డై యాసూతనందనుం డప్పాండునందనునిపై నురవడించిన.

---

212. 1. తెం పొలయన్ – ద. వ.

214. 1. వుచ్చికొని – శ. ష. 2. యాస్యమునకున్ హాస్యంబు – వీ. ష. స. $శ_1$; హాసమునకున్ హాస్యంబు – శ. పెక్కు ప్రతులు.

215. 1. రథసంబునకు – ఆ. జ. బ. శ. ష; బవరంబునకు – ఇ. క. ద. వ. వ. 2. దలంకక – గ. 3. చిత్రశరాసన – కొన్ని ప్రతులు. 4. లును శరాసారంబులుబరగించుచు ధర్మ – ఊ. ఏ. ణ; లును ధర్మ – వా. 5. రథాశ్వ – వీ. శ. ష. కొన్ని ప్రతులు. 6. బడలు వడంజేసె – వ. కొన్ని ప్రతులు.

216. క. అటిముటి నిరుపురశరములు
తటుచుగ నొండొరుల బెట్టు దాఁకిన నయ్యు
ద్ధటు నెత్తుటఁ దోఁగి కడుఁ గ
[1]వటులిరి కల్పాంతనవదివాకరుబ్రక్రియున్.

217. క. అరదములు చిత్రగతులం
జరియింపఁగ ధైర్యములును శౌర్యంబులు ను
ద్ధురబాహావీర్యంబులు
సరి యై మెఱయంగ నధిక[1]సంరంభము[2]లన్.

218. ఉ. ఒండొరుమీఁద సాయకము లొక్క మొగిం బరగింతు రేపు మై
నొండొరుబాణముల్ నఱకి యుర్విపయిం నెఱయింతు రుగ్రు లై
యొండొరు మేనులన్ శరము లుచ్చి చనన్ నిగిడింతు రిట్టు లు
ద్దండతఁ బోరి రాఱనిమదంబుల నొండొరు మీఱునాసలన్.

219. క. మరుదాత్మజుఁ డేచిన న
న్నరుఁడు హరియు సంతసంబునం బొదలుదు రు
ద్ధురతం గర్ణుఁడు మిగిలినఁ
గర ముబ్బు విభుండు దమ్ముగమియుం దానున్.

220. తే. సూతనందనునకు నెడ సొచ్చి చొచ్చి
సమదుఁ డగుభీమసేనుచేఁ జచ్చి చచ్చి
బలము లఱుగ నాకర్ణుండు దొలఁగిపోవఁ
[1]జూచుఁ దెగిపోఁడు పడిన నీసుతులఁ జూచి.

221. వ. శోకంబునం గోపంబునం [1]గర్ణువిక్రమాటోపంబు దీపించిన.

---

216. 1. మెరసిరి కల్పాంతకముల మిత్రుల మాడ్కిన్ – ఓ.

217. 1. సంభ్రమమునన్ – వ. 2. నన్ – కొన్ని ప్రతులు.

220. 1. జూచి తెగి పొనుగు వడిన – ల. శ. వ; జూచి తెగి మ్రోడు వడిన – వీ. స. శ$_2$.

221. 1. కర్ణుడు విక్రమా – ల. వీ.

222. క. గొడుగునను నింటికొమ్ముల
సిడమున నాదంబునందు సెల లనిసి కడుఁ
బడి నిగిడెడు చాడ్పున న
వ్వడముడి దెస నమ్ము లడరె వసుధాధీశా.

223. క. దానికి మనమున నించుక
యైనను దలఁకక సమీరణాత్మజుఁ డవి పై
రానీక నిలిపి యతనిం
దా నిరువదినారసములఁ [1]దఱరఁగఁ జేసెన్.

224. వ. అప్పుడు.

225. క. మనవారు వారివారలు
ననిలతనయు విక్రమంబు నగ్గింప సుయో
ధనుఁడు దన యొద్ది యోధుల
ననుజులనుం గర్ణుఁ గావుఁ డని పనుచుటయున్.

*-: భీమసేనుచేత శత్రుంజయాదికురుకుమారులు చచ్చుట :-*

సం. 7_112_30

226. వ. అప్పుడు శత్రుంజయుండును శత్రుసహుండును సుదేహుండును [1]మదనుం
డును ద్రుముండును చిత్రబాహుండును వికర్ణుండును గర్ణరక్షణపరు లై
కడిమి [2]వెఱయఁ దలకడచి యొక్కట భీమసేనుం దాఁకి ధరాధరంబు నంబు
ధారలం గప్పు జలధరంబుల చందంబున నతని నతినిబిడశరపరంపరల బొద
వినం బెరిఁగిన దర్పంబునం బొదలి యతండు దృఢైకముష్టి నిర్ముక్తమార్గణ
సప్తకంబున వారిం బిలుకుమార్చి యార్చిన నాసింహనాదంబు విని ధర్మ
తనయుం డది విజయాగ్రజుండు నిజవిజయం బెఱింగించునట్లుగా నెఱింగి
మనంబునం బొంగి ద్రోణుదెసకుఁ దఱిమి కయ్యంబు సేసె నట్లు పలువురు
దమ్ములు వొలిసిన దుర్యోధనుండు దనమనంబున జూదంబునప్పుడు విదు

223. 1. దరలఁగఁ జేసెన్ — ఝ. అ. వీ. శ.

226. 1. నందకుండును — ఖ. గ. బ. 2. మెఱయ — వ. వీ. శ. ష. కొన్ని ప్రతులు.

రుండు సెప్పినట్ల యగుచున్న దని విషాదంబు నొంది యాసభ నమ్మెయిఁ
బాండవు[1]లం బఱిచిన పాపఫలం బనుభవించె ననవుడు వైచిత్రవీర్యుండు.

227. క. గతవృత్తములకు వగవం
గత మేమి యతండు వెట్టికార్యము నాదు
ర్మతిఁ దప్పె నోర్చి కొడుకుల
కత వినియెదఁ జెప్పు చెప్పఁ గలయది యెల్లన్.

228. వ. అనిన నతనికి సంజయుం డిట్లను నట్లనిలజుం డార్చినం బేర్చి కర్ణుం డతని
పయిం గవిసి ఘోరసంగ్రామంబు సేయుచుండ నీసేన భీమసేనుఁ జుట్టు
ముట్టిన నతండు బెట్టిదంబు లగు భల్లప్రముఖబాణంబులఁ గేతుచ్ఛత్త్రచామ
రంబులు సూతరథరథ్యరథికావయవంబులుఁ దురంగమాతంగసుభటాంగం
బులుఁ దునియ లై తొరఁగి పెరుగు నెత్తురుటేఱుల వెంబడిం బాఱం
జేయుటయుఁ [1]బతితశేషం బగునబ్బలం బిరుగెలంకులం దొలంగి యంప
[2]పెట్టునేల కవుల సని చూచుచుండె నెండియు రాధేయుండు రయంబున
నతనిం దాఁకి పోరె నట్టియెడ నమ్మారుతనందనుండు.

229. క. ఆభీలతఁ గర్ణునిక
ర్ణాభరణము చుక్కవడినయట్లు పడఁగ సం
శోభితశరమున నేసి మ
హాభల్ల మురస్థలమ్ము నాఁడగ నేసెన్.

230. క. ఆలోచన యారథికుని
ఫాల[1]స్థలి నోలి నెనయఁ బదినారసముల్
గీలించిన నని యచ్చట
నీలోత్పలమాల పోలె నెఱియం బొలిచెన్.

---

[1]. లఱెడం జేసిన పాప - పెక్కు ప్రతులు.

228. 1. హత శేషం - పెక్కు ప్రతులు. 2. పెట్టు కొలది కవుల - జ. రఘు. వ. స. శ[1].
కొన్ని ప్రతులు.

230. 1. స్థలి నొవ్వనేయ - ద. ప: స్థల మోలినేయ - వ; స్థలి నొప్పి నొలయ - ల.

231. తే. అలిగి [1]బాణశతంబున నాతఁ డతని
నొంచె నవ్వీరుచాపంబు ద్రుంచె నతఁడు
పఱపె బలువింటఁ గర్ణుండు పటుశరములఁ
బట్టి పవలింటిసూర్యుని [2]ప్రభలు వోలయ.

232. వ. ఇట్లేయు నాసూతనందనువిల్లు [1]విదుర్పు దోఁపక గుడుసువడుటఁ జక్రాకృతిం బోలుచు ననలశిఖలచెలువు దాల్చె నట్టిరయంబునకు భయంబు గొనక భీముండు నిగిడించు హేమలిప్త[2]నారాచధారలు గగనలక్ష్మికనకాభరణంబులచెన్ను చేకొనియె నప్పుడు కోపంబు రూపంబు గైకొన్నకైవడి నుదీర్ణుం డై యక్కర్ణుండు.

233. చ. పవనజుచాపముం బాఱుల పగ్గములం దునుమాడి కాఁడితో
నవి [1]పెనఁగాడఁగా వెడఁదయమ్మునఁ గేతువు గూల్చి సూతు మే
నవియఁగ నేసినం బఱచె నాతఁడు ఫల్గునుచక్ర[2]రక్షు తే
రివెనుక కుగ్రశక్తి యడరించెఁ జలింపక భీముఁ [3]డ త్తఱిన్.

234. క. అది సూతనందనుఁడు దొ
మ్మిదిశరములఁ దునుముటయు సమీరసుతుఁడు జె
ట్టిదముగ వాలుఁ బలుకయు
న్మదమునఁ గొన నతఁడు పలక [1]నఱకె నఱికినన్.

235. మ. కరవాలంబున వైచి యారథికువిల్ ఖండింప నొండొక్కని
ష్ఠురచాపం బతఁ డెత్తునంతకు జవాటోపంబుఁ గోపంబు మ
చ్చరముం దేటపడన్ వియచ్చరులు మెచ్చన్ భీముఁ డాసూతసూ
తిరథం బల్లల నాడ దానిపయిఁ గెం దెం పొప్పు లంఘించినన్.

---

231. 1. బాణాష్టకంబున - ద. వ. 2. పగిది నిగుడ - వ; ప్రభలు బోదల - ఆ. బొ; ప్రభల బోల - కొన్ని ప్రతులు.

232. 1. నిడువు - ఉ. ఎ. స. శ$_1$; నిలువు - స. శ$_1$; విడువు - వ. 2. నారాచంబులు - కొన్ని ప్రతులు.

233. 1. వెసగూల - బ. 2. రక్షు - ఓ. ద. న. వ. బ. మ. ర. ల. వి. శ. ష. శ. హ; దక్షు - వా. కొన్ని ప్రతులు. 3. డుద్ధతిన్ - ఝ. న.

234. 1. మడియించె వెసన్ - ఆ. జ. న. ఖ. వ.

236. వ. అతండు కేతనంబునకుం గుదురుగాఁ బెను పొనరం గాపించినపీఠంబు [1]నడుగున [2]నొదింగినం దేరెపయి నతనిం గానక భీమసేనుండు నలుదిక్కులుం బరికించి యతని పొలుటయు లేకున్న నయ్యరదంబు క్రిందఁ [3]దూఱె నను తలంపున నతని బట్టికొనువాఁడై డిగ్గ నుఱుకుటయుం దోడన తోఁచి రాధేయుండు రథచిత్రగతులు మెఱయ రయంబారఁ బెక్కునారాచంబు లొక్కమొగిం దనువునఁ జొనుపుచు నేచిన నయ్యనిలతనయుండు సాధన వైకల్యంబున [4]వెడంగుపడియును వెన్నిక మున్ను విన్వచ్చుచేతం జచ్చిన సామజంబులహయంబులఁ బుచ్చికొని డాచేత నొడ్డుకొనుచు వలచేత వైచుచుఁ బెనంగె నవియును వివిధవిశిఖంబులఁ దునియలు సేయుచు నెఱఁ కులు నోనేయుచుఁ గర్ణుండు గదిసి తఱుమఁ దదీయస్యందనంబునకు దుర్గ మం బగు నని యతం డర్జునాస్త్రపతితంబు లైన చతురంగంబులతిట్టల యోలంబు సొచ్చిన.

237. తే. మొనలతోడను దనతోడ మున్ను పెనఁగి
శ్రమము [1]వొందియు నట్లరదమున [2]కరిగి
వెండియును బోరి కడు డస్సి బెండు వడిన
యన్నిరాయుధుఁ జూచి సూతాత్మజుండు.

238. క. మనమునఁ గుంతీవాక్యం
బును నొలసిన నేయు టుడిగిపోయి కదిసి న
వ్వున మో మొప్ప నతని కి
ట్లను వింటం గడుపు లీల నల్లఁ బొడుచుచున్.

---

236. 1. నొదుకు(గు)న – కొన్ని ప్రతులు; మరుగు(వు)న – ఐ. ఝ. య. 2. నడికిన – న. 3. పొచ్చె – అ. జ ట. ప. బ. వ. 4. వెగడు – ఝ. న.

237. 1. బొందిపదాతి యై రథము కెరగి – ఊ; వొందియు విరథుడై రథము కెరగి – ఝ య. 2. కెరగి – ర. ల. వ. హ. కొన్ని ప్రతులు; కెగరి – చ. వ. శ. ష; కేగి – ఎ. ద. బ.

-: కర్ణుఁడు భీమసేను నవమానించి నీచోక్తులు పలుకుట :-

సం. 7-114-69

239. ఆ. తిండిపోత నీకు భండనం బేటికిఁ
గడవఁ జేరి మనసు కాంతు దీఱ
నోపు కొలఁది మ్రింగి యూరక నీ వింటి
[1]కడన యుండు మింక నడచిపడక.

240. వ. అని మఱియును.

241. క. వనమున ఫలమూలంబులు
దిని ముని వై [1]యుందు గాక ధీరోద్ధతి మై
నని సేయ నీకు వచ్చునె
చను మచటికి [2]నుడిఁగి మడఁగి శాంతుఁడవోలెన్.

242. వ. అట్లు నీ యెడ లుండదేని.

243. క. చేయలఁ[1]తిం గని సమరము
సేయుము ననుఁ బోఁటితోడఁ జెనయకు నరనా
రాయణులు వారె యచటికిఁ
బోయెద వేఁబోయి బ్రదుకు పొంక ముడుగుమీ.

244. క. అని పలికె నట్టియెడఁ గృ
ష్ణుని పనుపున నర్జునుండు సునిశితనారా
చనితాంతపాతములఁ నా
తనిబిఱుసనఁ జేసి భీముదైన్యము వాపెన్.

245. క. మండెడుబలునారసముల
వెండియు నారజ్జు లాని వివ్వచ్చుం డు

239. 1. కడవ - సూ

241. 1. యుండ - వా; యుందు - ద. ప. 2. నడగి మడగి - న. వ. పీ.

243. 1. తి నూచి కయ్యము - ఝ. య; తియైన సమరము - ఇ. ల.

ద్దండత నేసినయెడ నవి
ఖండించెను గురుసుతుండు గర్వం బలరన్.

246. వ. అప్పు డశ్వత్థామ యఱువదినాల్గునారసంబుల నొప్పించిన నన్నరుండు నిలు నిలు మని యదలించినం దెరలి యతండు కరులగమిఁ జొచ్చె నాలోన యమ్మారుతిసారథి యగు విశోకుండు తే రాయితంబు సేసి తెచ్చిన నెక్కి యాతండు విన్ననిమొగంబుతోడఁ గవ్వడికడకుఁ జనియె నప్పుడు సాత్యకియు నద్దిక్కునకు సగర్వగమనంబునం బోయె ననిన విని వైచిత్రవీర్యుండు సంజయునితో ని ట్లనియె.

247. క. బలియురతోఁ బగ గొనినం
గలుగునె మే లెల్లభంగిఁ గొంతేయులకుం
గల పాలిఁ దగుఁ దోడ్తోఁ
గలిమియుఁ గీర్తియును బొలియఁగా విన వశమే.

248. క. విను మడుగులపైఁ బడి యై
నను నెంగిలి గుడిచి యైన నరులకుఁ బగ లోఁ
గొని యరుల [1]కిను వడఁచి బ్రదు
కనవలయు నిహమ్ముఁ బరముఁ గలుగునె చెడినన్.

249. క. తా నెఱుఁగఁ డొరులు సెప్పిన
నైనను విన నేరఁ డట్టియతిబాలిశు నిం
కే నే మందుఁ గొడుకు దు
ర్మాని గనునె బ్రదుకుపోకరాకలు దెలియన్.

250. వ. అది య ట్లుండె.

251. ఆ. గురునిఁ గడచి నరుఁడు కురుసేన సొచ్చిన
యపుడ [1]తెగియెఁ గార్య మదియుఁ గాక

---

248. 1. వెను వడచి - వ. పీ. శ. వ. స. శ₁; కిను మడచి - భాకూ. వ; నే వడచి - ఉ. ల.

251. 1. తెలియ - ట. బ. వ.

కలసి దట్టిబల్లిదులు భీమసాత్యకు
లకట సైంధవుండు హతుఁడ కాఁడె.

252. వ. సమరవిశేషంబు తెలియం గెలింగింపు మనిన నమ్మహీపతి కతం డిట్లను నట్లు శైనేయుండు గాంతేయులఁ గూడంబోవ నలంబుసుం డనురాజు బలంబు మెఱయ నతని మార్కొనిన నయ్యిరువురకుఁ బరస్పరబాణఖండనంబును [1]వర్మవిదారణంబును మర్మభేదనంబును ధనుర్దళనంబును భూచరఖేచరవిస్మయకరంబును నగు సంగరం బయ్యె నొక్కింతసేపునకు నాశినిపుంగవుండు.

253. క. [1]తురగములఁ జంపి సారథి
శిరము దునిమి కుండలములఁ జెలు వారెడున
న్నరపతితల యిలఁ బడ ను
ద్ధురభంగి వెడందవాతితూపుల నేసెన్.

254. క. ఏసి యెలమి నరుగఁగ దు
శ్శాసనుఁడు మొగంబుగా వెసన్ నీకొడుకుల్.
డాసిన నవ్వీరుఁ డనా
యాసంబున దుస్ససేనుహయములఁ జంపెన్.

255. వ. చంపి యతనిరథంబునకు గవియుడుఁ ద్రిగర్తు లనేకు లడ్డంబు సొచ్చిన [1]నతండు సేయం గలవారిం బంచశతరథికులం బంచత్వంబు నొందించి బలంబుల బడలు వడంజేయఁ జెలువారు విలీగిన నాసత్యకసుతుండును మెఱసి చన శూరసేనసైనికులు దొడరుటయు దోర్వ్యాలాసంబు నెఱపి పఱపి కళింగులు గవిసినన్ గం డడంచి కడచి గాండీవిం గనుంగొని జలాశయంబు వెలువడి సింధురంబు పుస్థలంబు సేరిన ట్లాశ్వాసించుచున్న నచ్యుతుం డయ్యోధవరు నాలోకించి వరు నుద్దేశించి.

---

252. 1. మర్మవిదారణంబును - ఖ. ర. వ. ఘ.

253. 1. హయముల బడ నేసి - జ. ట. బ. వ. స. శ$_1$.

255. 1. నందు సేయంగల వారి - ఝ. ట. త. బ. 2. నట్లు విశ్రాంతంబగు నంతరంగంబునం బొదలు - ఝ. స. 3 శ్వాసితుండుగా - వీ. స. శ$_1$.

256. మ. కృతవర్మాదులఁ జెప్ప నేల గురునక్షీణ[1]ప్రభావంబు ము
న్నితఁ డెబ్భంగి నడంచె నొక్కొ యొకరుం డిట్లేపుమై రాకకుం
గత మాధర్మజుపంపు నీదెస సమగ్రస్నేహముం జూపెఁ జూ
చితె నీశిష్యుని సాత్యకిం బటుభుజశ్రీగర్వనిర్వాహకున్.

257. వ. మన కింత ప్రియం బగునే యనిన నతనికి నయ్యింద్రనందనుం డిట్లను నితని రాక నా కప్రియం బై తోఁచె నెట్లంటేని ధర్మరాజరక్షణంబున కితనిం జాలించి వచ్చితి మీరథికుం డచ్చట లేమి నతం డే మగునో యెఱుంగ మాభూపతియును భారద్వాజుబారి నున్నవాఁడు సైంధవుండును నేలకు వ్రాలండు ప్రొద్దునుం బెద్దయు వ్రాలె నది య ట్లుండె బలసారోదారు లైన [1]గురుకృతవర్మాదు లగు ననేకయోధవీరులతోడం బోరి రథ్యసారథి సహితంబుగా నిప్పరు[2]షార్థవరుఁడు డప్పిం బడి [3]తెప్పిఱం గాననియాలో వన కయ్యంబున డయ్యనివాఁడును సహాయసంపన్నుండును నగుభూరి[4]శ్రవుం డదె తలపడఁ గడంగెడు నక్కురుసింహుండు శక్తి[5]చాతుర్యశౌర్య ధైర్యాస్త్రవీర్యసమగ్రుండునుం గావున నిది సాత్యకికిఁ జాల [6]దెప్పరం బైన తెఱంగు వాటిల్లెఁ బాండవాగ్రజుం డీయన నిక్కడ కేల పుత్తెంచె గురుం డామిషంబునకు వేచు డేగ చందంబునఁ దనకు వేచుట దలంప వలవదే యనుచున్న సమయంబున నాసోమదత్తసూనుండు శైనేయున కడ్డంబు వచ్చి నిలు నిలు మని యదల్చి వెండియు.

-: భూరిశ్రవుండు సాత్యకితో యుద్ధంబు చేసి మడియుట :-

సం. 7_117_1

258. సీ. తేఁకువ లేక పుత్తెంచిన[1]యప్పాండవజ్యేష్ఠునకుఁ దలవంపు గాఁగ
వచ్చుచో మార్కొని చచ్చినవారల బంధులోకమునకుఁ బ్రమద మెసఁగ

---

256. 1. ప్రతాపంబు - ద. బ.

257. 1. గురుకృతవర్మాదులగు - పెక్కు ప్రతులలో లేదు. 2. పార్థవరుండు - వీ. ప. కొన్ని ప్రతులు; పార్థవరుండు - హ. కొన్ని ప్రతులు. 3. తెప్పిఱిలం గానని - వీ. 4. శ్రవసుండు - కొన్ని ప్రతులు. 5. చాతుర్య - పెక్కు ప్రతులలో లేదు. 6. దెప్పరంబైన - కొన్ని ప్రతులు.

258. 1. పాండవాగ్రజునకు గడు తలమ్రాన్ప(పు)గాగ - ఇ. క. ఘ. త.

నంతంతఁ జనుదేర [2]నాదటఁ గనుఁగొనుఁ శౌరికిఁ [3]ప్రాణంబు [4]జల్లనంగఁ
బెనఁగించి గెలిపింతు నని యాస సేయుకిరీటికి నాలావు దేట పడఁగ

తే. నాయుధంబులఁ దునిమి రథ్యములఁ గూల్చి
సూతుఁ దెగటార్చి తనువున శోణితంబు
వఱపి పలుపుడు నిలిచిన నుఱకపట్టి
వ్రచ్చి పడవైతు నెందుఁ బోవచ్చు నీకు.

259. క. అనిన విని నవ్వి నాతో
నని సేతకుఁ దెంపు సేసి యడరెడురథికుం
గనుట యది నాకుఁ బండువు
వినవే మీకెల్ల వేరువి త్తని నన్నున్.

260. వ. అని పలికి సాత్యకి మఱియును.

261. ఆ. ఎదుర నుండ వెఱచి మద మఱి దవ్వుగా
వచ్చి యొదిఁగి తేల పెచ్చు వెఱిగి
వ్రేలె దిపుడ పట్టి నాలుక గోసెద
మాను మాను రి త్తమాట లేల.

262. వ. అనియె నట్లయ్యిరువురు నొండొరులఁ [1]బరుసంబులు వలుకుచుఁ దలపడి వలు
దెఱంగుల మెఱుంగుటమ్ము లొండొరుల[2]పై నిగిడించుచు నొకళ్లొకళ్ల
మార్గణంబులు మగిడించుచు వర్మంబులు వ్రయ్య నేయుచుఁ దనువులు
నెత్తుట జొత్తిల్లం జేయుచుఁ దమ్ము [3]సేన లేనిక పోరు సూచునట్లు
సూడం బోరిపోరి పరస్పరతురంగవిదారణంబును [4]మిథస్సూతమారణంబును
నన్యోన్యధ్వజపాతనంబును నితరేతర[5]ధనుశ్ఛేదనంబునుం జేసి యీాపునం
గరవాలంబులఁ బలకలుం గొని పాదచారు లై చేరి వివిధచిత్రగతులం

---

2. నారట - వ. 3. ధైర్యంబు - వ. 4. ఝల్లనంగ - పెక్కు ప్రతులు.

262. 1. బరుషంబులు, పౌరుషంబులే - అని ప్పాఠములు. 2. నొంచుచు - ఓ. ణ. త; మేనుల గీలించుచు - గ. 3. సైనికులేనిక - మ. 4. రథ సూత మారణంబును - ఇ. ఘ. డ. చ; మిథస్సూతహారణంబును - ఊ. ఏ. ర. వ. హ; మిథస్సూతహననంబును - ఔ. 5. ధనుశ్ఛేదనంబును - ఇ. ఈ. ఉ. ఐ. ఘ. ల. వీ. శ. ష. హ; ధనుశ్ఖాతనమును - వా. ధనుర్దళనంబు, ధనుఃఖండనంబు - అని పాఠములు.

బెనంగి పాసి యుంచుక సేపు డప్పి [6]దీర్చికొని క్రమ్మఱం గడిసి పలకలు పఱి యలు గావించి యలుఁగుల నొడ్డనంబుల నంగవంచనం[7]బులను వ్రేటు పోటుల[8] సవదరింప కుండం గాచికొనునోజ మెఱయుచుండి విన్నాణం[9]బు తగులున మేనులు బెరసిన మల్లయుద్ధప్రకారం బగు పెనఁకువకుఁ జొచ్చి రప్పు డాభూరిశ్రవుండు మేలుచే[10] యయి పోరుట గనుంగొని కృష్ణుండు జిష్ణున కిట్లనియె.

263. చ. పెనుమొనతోడ మున్ను పెనఁగి పెద్దయు డయ్యుటఁ జేసి సోమద
త్తునిసుతుచేతఁ [1]జిక్కి కడుదుర్దశఁ బొందె శినిప్రవీరుఁ డీ
తనిఁ దగుఁ గావ నీకయి కదా యిట రాక మృగేంద్రుబారిఁ జొ
చ్చినకరివోలె నయ్యె వెసఁ జేకొని [2]కావుము పాండవోత్తమా.

264. క. అనునెడ భూరిశ్రవసుం
డనూనబల మొప్ప దానవాంతకు ననుజ
న్మునిఁ బట్టి పుడమి[1]పై వై
చినఁ గ్రిందై యోపినంత సేయుచు నుండెన్.

265. వ. అమ్మురహారుండు [1]మఱియుం దఱిమి ధనంజయుతో నీకుం దోడ్పడ వచ్చి నీశిష్యుం డొరులచేత దురవస్థం బొంద నూరకునికి యుచితం బగునే యనిన నతం డతని కిట్లనియె.

266. తే. ఒండుదెసఁ [1]జక్కఁ జూడరాకుండునట్లు
గాఁగ రథములు పయిపయిఁ గ్రమ్మ వార

---

6. దీర్చుకొని-పెక్కు తాళపత్ర ప్రతులు. 7. బున - పెక్కు ప్రతులు. 8. నదరింప కుండంగాచికొను - అ. ఉ. ఊ. ఏ. ర; సడలింప కుండం దమ్ము గాచికొను - య; కోసరించి తాక కుండం గాచికొని యోజ - వీ. 9. బగు గతుల - ఝ. 10 చేయి గైకొని కదియం బోరుట - ఆ. ఝ. య. వ. శ. స. శ[1].

263. 1. జిక్కువడి - ఈ. 2. నిల్పుము - ద.

264. 1. బడవైచి - ల. వ. కొన్ని ప్రతులు.

265. 1. వెండియుం - కొన్ని ప్రతులు

266. 1. దేరిచూడ - ట. బ. వ. హ.

లెక్కసెక్కటి పోరెద [2]నిపుడు నాకు
నేయఁగా [3]దగ దీరెండు నిట్టు లుండ.

267. వ. నెచ్చెలి [1]చావునుం జూడం జాల నీరథికులను వారించెద నయ్యోధవరునిం గాచెద ననియె నప్పుడు సాత్యకి చాల డస్సిన సౌమదత్తి యతిక్రమించి యెగసి పడవైచి వానివలచేయు నురంబును నిరుగాలం ద్రొక్కి యెక్కుడు మదంబున మణికంకణకిరణస్ఫురణసుందరం బగుకరంబు మెఱయం గృపాణం బెత్తి [2]గళంబు దునియ వేయువాఁడై పూఁచిన నాభుజం బింద్రధ్వజం బునుంబోలెఁ [3]బొలిచి నీసైనికుల చూడ్కులకు వేడ్కలు సేయ వాసు దేవుండు [4]వేగిరపడి యేయు మేయు మని పలికినఁ బార్థుం డక్కారవో త్తముం జిత్తంబున నగ్గించుచు వెడంద[5]వాఁడియమ్ము గ్రక్కునం దొడగి గాఢాకర్షణంబును దీవ్రతేజంబును రయంబునుం [6]బరగం జేసి యేసినం దునిసిపడి యబ్బాహువు మహోభుజంగంబుచందంబున శోభిల్లె నిచ్చటిసేన లెల్ల [7]దురపిల్లె నాభూరిశ్రవుండు దన్ను [8]నఫలితప్రయత్నుం జేసిన వాఁడు గాండీవి యగు టెఱింగి యాఱనికోపంబున గర్హించు మనంబుతో నతని దిక్కు సూచి తగునెలుంగున ని ట్లనియె.

268. ఉ. నీదెసఁ జూడ నొండొకరినిం దగ మూరొ్కని పోరుచుండఁ బెం
[1]పేది పనీచకర్మమున కియ్యకొనం దగునే భవాదృశుం
డీదురుపాయ మగ్గురుఁడొ యింద్రుఁడొ రుద్రుఁడొ నీకుఁ [2]జెప్పె దా
మోదరుఁ డింతపాపమున [3]కోర్వఁగఁ జేయునె నిన్ను నర్జునా.

269. వ. అనిన విని యతం డబ్బాహ్లికపౌత్రు నాలోకించి.

---

2. రెడవునాగు — అ. ఆ. ఏ. క. చ. జ. ర. వ. 3. దీర దది — ఇ. ఈ. ఘ. డ.

267. 1. చావం(వుం)జూడజాల — ఇ. ఈ. ఉ. ఊ. కొన్ని ప్రతులు. 2. కంఠంబు — ఔ. ఖ. వ. వీ. శ. ష. 3. బొలిచె — కొన్ని ప్రతులు. 4. వెరగుపడి — పెక్కు ప్రతులు. 5 వాడియమ్ము — ళ్. 6. మెరయం — కొన్ని ప్రతులు. 7. దురటిల్లె — శ. ష. — కొన్ని ప్రతులు. 8. విఫలప్రయత్నుం — వీ; విఫలీకృత, విఫలిత — అని పాఠములు.

268. 1. పేదితినీచ — అ. ఇ. ఖ. చ. జ. ల; పేదిననీచ — వీ. ష; పేదిటునీచ — ఓ. గ. ఘ. జ. ట. ర హ. 2. జెప్పు — ఞ. 3. కొప్పగ — ఉ. ఊ. ఏ. ర.

270. చ. నృపతులు సొచ్చి పోరునెడ నెయ్యురు బంధులు దోడుపాటు నీ
చపుఁబనియే నినుం బగలు సంపఁగఁ గావఁగ లేని మీబలా
ధిపతులు దూఱు సాత్యకి యతిశ్రమ మొందినచోటఁ దాఁకి క
ష్టపటిచి చంపె దీ వతఁడు సచ్చునె [1]యూఱడి యేను గల్గఁగన్.

271. వ. మీరందఱు నట్లు [1]కాదే యధర్మపరు లయి యభిమన్యు ననుచితంపుఁ జంపు చంపితి రని నిరుత్తరుం జేసి యప్పుడు దన్ను నీకొడుకులుం గొందఱు రాజులును నిందించిన నత్తెఱంగునన పలికి వారలపలుకుల నుడిపి యాపో మదత్తి నుపలక్షించి శోకించి యతనికుందు మాన్పం దలంచి.

272. తే. క్షత్త్రధర్మంబు[1]కీడునఁ గటకటా మ
హాత్మ నీయట్టివాని కి ట్లధికపీడ
సేయ వలసె నా ప్రతిన చర్చింపు మెల్ల
పనులకును మూల మాసుయోధనుఁడ [2]సూవె.

273. వ. అన్నరపతి నరకం[1]బునం బడంగలవాఁడు నీవు సద్గతిం బొందు మనవుడు నతండు నై నేయు విడిచి [2]యపసవ్యకరంబున శరంబులు వఱుచుకొని ప్రాయోపవేశనమతినుండి ప్రాణాయామ[3]పరాయణుం డై యోగయుక్తుం డయ్యె నంత నొడలి కుత్సాహంబు వచ్చి లేచి సాత్యకి గరవాలం బమర్చికొని మాధవధనంజయభీమాశ్వత్థామకృపకర్ణులు వలదు వల దని యెలుంగెత్తి వారింపఁ గ్రోధోన్మాదంబున శిరశ్ఛేదనంబు సేసిన భూరిశ్రవుండు సిద్ధచారణ గ[4]ణాభినందితుం డగుచుఁ బుణ్యలోకంబున కరిగె నాశిని వరుండు దన్ను వారించిన వారల నుద్దేశించి యభిమన్యువధప్రకారం బుపన్యసించె నప్పుడు మనసైనికు లిట్టు దగునే యనువారును గోపం బేమిసే

---

270. 1. యూఱక – వ.

271. 1. కాదే ధర్మపరు లయి యభిమన్యు నుచి తంపు చంపు చంపిరే యని – పెక్కు తాళపత్త్ర ప్రతులు.

272. 1. కతమున – ట. ఎ. శ. 2. సువ్వె, సుమ్ము – అనిపాఠములు.

273. 1. బున నుండగలవాడు–వ. శ.ష; బున కరుగం గలవాడు-ఓ. శ. ర. 2. యప – పెక్కు తాళపత్త్రప్రతులందు లేదు. 3. పరుండై – వ. న. వ. 4. ణవందితు డగుచు–ఎ.

యింప దనువారును నతనిచేతఁ బడినవాఁ డుడుగునే యనువారును నిది విధివశంబు పొమ్మనువారును నై రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కి ట్లనియె.

274. క. గురుకృతవర్మాదిరథిక
వరులకు న[1]విజయ్యుఁ డైనవాఁడు శినివరుం
డరయఁగ మహాద్భుతం బ
క్కురు[2]వరుచే నాతఁ డి ట్లగుట సూతసుతా.

-: సంజయుఁడు ధృతరాష్ట్రునకు సాత్యకిపరాభవకారణంబు చెప్పుట :-

సం. 7_119_1

275. వ. అనవుడు నతఁ డమ్మహీపతి కి ట్లను దీనికిం గారణంబు గల దాకర్ణింపుము సోమవంశ[1]వరుం డగుయయాతినందనుం డయినయదునికులంబున జనియించిన దేవమీఢునకుఁ బుట్టినశూరునికొడుకు వసుదేవుండు రూపగుణంబులం బ్రసిద్ధుం డై పెరుఁగుచుండ దేవకుం డనుభూవల్లభుండు దనపుత్రికి దేవకీదేవికి స్వయంవరమహోత్స[2]వం బాచరించిన నవ్వసుదేవునకై యయ్యాదవాన్వయజాతుం డగుశిని యవ్వనితఁ బరాక్రమంబునఁ దేరఁగూడిన రాజలోకంబుఁ [3]దొడరి పోరంజాలక [4]నిలిచిన సోమదత్తుం డొక్కరుండును బోక పెనంగె నయ్యిరువురు నొండొరులచేత విరథు లై కృపాణంబులు గొని ధరణికి లంఘించి పోరునెడ నయ్యదువీరుం డాక్రమించి బాహ్లికతనయుం గొప్పు వట్టి యొఱగం దిగిచి యనుకంపపెంపునం జంప నొల్లక తన్ను విడిచినం బోయి సిగ్గుపెంపునఁ దల యెత్తి తిరుగ నేరక పనంబునకరిగి వారు నుద్దేశించి పెద్దకాలంబు దపంబు సేసిన నప్పురమేశ్వరుండు ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనినఁ దత్కాలంబునకు శినియును దదీయసుతుండును గడచనుటం జేసి శినిమనుమని ననిం బడ వైచి తన్నం జాలు

274. 1. విజేయు డైన — ల. వ. శ. ష పెక్కు ప్రతులు. 2. వీరుని చేత నిట్లగుట — ఇ. ఉ. ఊ. ప. ఐ. ర. హ.

275. 1. కరుం డయిన — కొన్ని ప్రతులు. 2. వంబు గావించిన — కొన్ని ప్రతులు. 3. దెరలి చాలక నిలిచిన — ర; దొడరం జాలక — కొన్ని ప్రతులు. 4. విచ్చిన-వ

తనయు [5]సేవలయు నని యడిగిన నద్దేవుం డట్ల యగుం గాక యని యాన తిచ్చి యంతర్హితుం డయ్యెఁ దద్వరప్రభావంబున భూరిశ్రవుండు సాత్యకి నిట్లు సేసె నని చెప్పిన నాంబికేయుండు గయ్యం బటమీఁద నెట్లు సెల్లె ననుటయు సంజయుం డతని కిట్లనియె.

276. ఆ. సౌమదత్తి యిట్లు సచ్చిన దదనంత
రంబు రథము సింధురాజు[1]దెసకు
నరుఁడు [2]నడపఁ బంచె నారాయణు నపుడు
గురుసుతాదిరథికవరులు [3]నృపుఁడు.

277. వ. [1]బరవసంబు సేసి యడ్డపడి రట్టియెడఁ గర్ణసాత్యకులకుఁ గయ్యం బయ్యె నత్తెఱంగు వివరించెద వినుము కృష్ణుండు త్రికాలవేది యగుటఁ దనతమ్ము నికి భూరి[2]శ్రవునివలనం బుట్టు నెడరు తెఱం గెఱింగి తొలునాఁటిరాత్రి నిజ సారథి యగుదారుకునితోడఁ [3]బార్థునిప్రతిన నెరపం బూని పలుకునెపంబున మనయరదం బాయితంబు [4]సేసికొని యెల్లి గయ్యంబునకుం గొని రమ్మని చెప్పె నప్పు డెట్టియెడియాలంబులతోఁ బాంచజన్యంబు పూరింపం గలవాఁ డై పలికె నాచందంబున నంతకుమున్న యాసూతునకు నేతేరవలయు తడవు గనుంగొని శంఖంబు పూరించిన వాఁడును [5]శైబ్యసుగ్రీవమేఘ పుష్పవలాహకంబు లనువాహంబులవేగంబు నెఱయ మెఱయుం బొలుచు గరుడకేతనంబు గ్రాలఁ దేరు తత్కాలంబున కొదవ నాలంబులోనికిం దెచ్చిన నయ్యచ్యుతుండు మెచ్చుచు నాశైనేయున కిచ్చినం జూచి కౌంతే యుం డచ్చెరు వందిన నతనికి నవ్విధంబు గొంత సూచించె నిట్లు సాత్యకి సన్నద్ధుం డై.

278. తే. ఏచి న[illegible]నకు సాహాయ్య మాచరించు
కౌతుకంబున నేతేఁ గర్ణుఁ డతని

5. గృప సేయవలయు నని - కొన్ని ప్రతులు.

276. 1. కడకు - ఆ. ఐ. 2. బనుప బనిచె - అ. ఓ. ఛ. చ. 3. కూడి - ఊ. ఏ.

277. 1. బవరంబు - అ. ఇ. 2. శ్రవసుని - కొన్ని ప్రతులు. 3. బార్థుని (దు) పట్టిన ప్రతిన - కొన్ని ప్రతులు. 4. సేసుకొని - పెక్కు తాళపత్రప్రతులు. 5. సైన్య సుగ్రీవ - శ. ష. కొన్ని ప్రతులు.

నధికసంరంభమునఁ దాఁకె నక్కిరీటి
కని జనార్దనుతోడ ని ట్లనియె నగుచు.

279. క. భూరిశ్రవుండు సచ్చుట
సైరింపక సూతసుతుఁడు సాత్యకితోడం
బోరం దొడంగె మనము వి
చారింపక [1]యెద్దువలయు సరిగొనకుండన్.

280. ఆ. అనుఁడు [1]నతడు సాలు నతనికి నాచక్ర
రథకులు గడంగి రయము మెఱయఁ
గదిసి తోడుపడిరి కావున నక్కడి
చింత [2]వలవ దని మురాంతకుండు.

281. వ. తేరు సైంధవుని [1]దెసకుం దఱిమె నప్పుడు శైనేయరాధేయులపో రెల్ల వారును [2]వెఱఁగుపడి చూచుచుండ [3]రత్తెఱంగు సంగరంబు సురాసుర గంధర్వులయందునుం గలుగదు విను మట్లు పోరిపోరి యవ్వైరాయణాము ఖుండు.

## —: కర్ణుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి యోడిపోవుట :—

సం. 7—120.

282. చ. నిరుపమశక్తిఁ గర్ణుమెయి నెత్తురు వఱ్ఱుగఁ జేసి సూతునిం
దురగములన్ సిడంబు వెసఁ ద్రుంచి రథంబును నాతపత్రముం
దర మిడి నుగ్గు సేసె వసుధావర తమ్ములు రాజుఁ జూడ న
ప్పరుసత సూచి చేయఁ గలపార్థివు లాతనిఁ జుట్టుముట్టినన్.

---

279. 1. యేయ వలయు, యెగ్గువ వలయు — అని పాఠములు.

280. 1. నతడ సాలు — కొన్ని ప్రతులు. 2. మాను మనె మురాంతకుండు — జ. బి.

281. 1. దిక్కునకు — పెక్కు ప్రతులు. 2. వెగడుపడి — చ. 3. రత్తెరంగున సంగ రంబు — ఏ. ఘ. ద. న. వ.

283. క. శరవేగము రథ[1]గమన
స్ఫురణవిచిత్రతయు మెఱయఁ బోరి యతం డ
య్యరదములగములు సుడివడఁ
దెరల మరలఁ బఱవఁ జేసి దీపెంచె నృపా.

284. క. అనుటయు ధృతరాష్ట్రుఁడు కృ
ష్ణునిరథమును రథ్యములును సూతుఁడు నగుటన్
శినివరునకు నుత్సాహం
బనూన మయి చూపె యంత యధి[1]కుం డయ్యెన్.

285. వ. అనిన విని సంజయుం డతని కిట్లను నట్టియెడ మున్ను దారకుండు దేరు దెచ్చుసంరంభంబు సూచి యది కృష్ణునిపను పని యెఱుంగనివాఁ డగుటఁ గయ్యంబు గజిబిజిగాఁ దలంచుచు వానిపిన్నతమ్ముండు మేలిమిరథంబునం దగు తురంగంబులం బూన్చికొని వివిధాయుధంబు లమర్చికొని కేతనోద్ద్యోతితంబు సేసి యారథంబు వచ్చినజాడ నేతెంచి సన్నిహితుం డగుటయు సాత్యకి సముచితం[1]బుగా నయ్యరదం బెక్కి విక్రమాటోపంబు సూపు[2]చుండ రథాంగ[3]ధరుని సారథిరథసహితంబుగా నతనికడకుం జనియె నీకొడుకులు కర్ణుం గల్పితరథోదీర్ణుం గావించి రనవుడు నాంబికేయుం డట్లు కిరీటిం గలసి భీముం డేమి సేసె నని యడిగిన.

286 తే. ఆతనికి సంజయుం డిట్టు లనియెఁ గర్ణు
చేత నవమానితుం డయి చిన్నఁ బోయి
పార్థుపాలికి నరిగియుఁ బలుక కుండెఁ
గినుక [1]నెరియుమనంబుతో మనుజనాథ.

---

283. 1. వేగ - ఊ. ఏ. ఐ.

284. 1. కంబయ్యెన్ - కొన్ని ప్రతులు.

285. 1. బగునయ్యరదం - కొన్ని ప్రతులు. 2. చుండె - కొన్ని ప్రతులు. 3. పాణి - కొన్ని ప్రతులు.

286. 1. గదిరివమనముతో - ఔ. చ. వ. వీ. శ. ష.

287. వ. పదంపడి తన్నా సూతపుత్రుండు పలికినపలుకు లాఘల్గునుతో నుగ్గడించి వానిం దొడరి యే నెల్లభంగులం బరిమార్తు ననిన నాతం డవి నాచెవి [1]సోఁక నాడుట నన్నుఁ బలుకుట గాక నీకుం బని యేమి నీ వటుండు మని పలికి రాధేయురథంబున కభిముఖుం డై.

288. ఉ. ఏమిర కర్ణ భీము నటు లేటికిఁ దిట్టి తతండు దోల సి
గ్గేమియు లేక పాఱునెడ నెవ్వరు దిట్టిరి నిన్ను [1]గెల్పు సం
గ్రామములోనఁ [2]దప్పిదము గల్గిన యంతన యింతగర్వ మే
లా మును నిన్నెఱుంగమె చలంబున సాత్యకి యిప్డు గెల్వఁడే.

289. క. గెలుపును నోటమి[1]యును ననిఁ
గలుగవె [2]యెడపెట్టి యెట్టిఘనులకు నిమ్మెఁ
బలుకుదురే తగువారిం
దులువా నీ[3]కులము గుణముఁ దోఁచెం బ్రజకున్.

290. వ. ఇంతవట్టును వెలారింతు నీమాటలు మఱవకుండు మిదియునుం గాక నాయసన్నిధి నధర్మంబున నభిమన్యువిల్లు దునిమితివి దానికి నీవు గనుంగొనుచుండ ధర్మ[1]ప్రకారంబున వృషసేనుతల దునుముదు మఱియు నీతోడం గూడ నప్పు డప్పాపం బాచరించినవారిని నిన్నును నెట్లు సేసెదనో యటు చూడు మని పలికి తఱిమిన మనసైన్యంబు లఱిముఱి నతనిపైఁ గవిసినఁ దత్సమరవిహారంబు దారుణప్రకారం బయ్యె మిహిరుండును మందరశ్మి యగుచు వచ్చె నాసమయంబున సుయోధనుండు రాధేయున కిట్లనియె.

291. సీ. శైనేయుఁడును భీమసేనుండు నిరుదెస రా నర్జునుఁడు సింధురాజుదెనకు నేడ్తెఱఁ దఱిమెడు నింక నొక్కించుక ప్రొద్దాఁగి పెనఁగినఁ బ్రొద్దు దాను

---

287. 1. సోఁకంబల్కుట – ఉ. ఏ.

288. 1. గెల్వ – ల. వ. 2. బెట్టిదము – ట; దప్పిదరి – సం.

289. 1. యిమ్మెయి – జ. బ. వ; యనిలోఁ–ఆ. గ. ఝ. 2. సూరులకు నిట్టి కటు(ణ)కవచనముల్ – ఆ. ఊ. గ. వ. 3. కొలదిగుణము – ఓ. ద. వ. వ.

290. 1. క్రమంబున – ద. ప. వ.

నస్తమించెడును నీయట్టిజోదునకు శల్యుండును గురునందనుండు గృపుఁడు
దుశ్శాసనుఁడు నేనుఁ దోడ్పడ నతనికిఁ జేయార్పవచ్చునె చేటుకాల

ఆ. మైనఁ బ్రతిన వట్టె [1]నంతియ తనతోడి
వారసోదరులును వీరు పనిన
నేల యెల్ల మనము యేలుద మిత్త్రఱి
నలువుఁ [2]జవముఁ జూపవలయు నీవు.

292. వ. అనిన సూతనందనుం డమ్మానవపతి నాలోకించి.

293. చ. అనిలతనూజుబాణముల నంగము లెల్లను జాల నొచ్చె నై
నను నను మీఱ వచ్చునె రణంబునఁ గ్రీడికి మేదినీశుమ
న్నన గల[1]మేటిబంటు ప్రథనంబున [2]నింతలు సేయ కున్న నొ
ప్పునె యనిఁ దేర్చువాఁ డనట భూవర [3]దైవము నేర్చు నావుడున్.

294. వ. ఆతండు ప్రీతుం డయ్యె నయ్యవసరంబున భీమసాత్యకిసహాయుం డగునాసవ్యసాచి గాడ్పు[1]తోడు గల యగ్నిదేవుండునుం బోలె దేజరిల్లి భల్లాదిబాణంబులు నీబలంబులపై నిగిడింపఁ జతురంగంబులయవయవంబులుఁ జామరచ్ఛత్త్రకేతుశకలంబులుఁ గోదండగదాదండాదిహేతిఖండంబులుం గీడ్పెరసి పాఱునెత్తురుటేఱులఁ దెట్టువలు గట్టె నట్టియెడ దుర్యోధనకర్ణవృషసేనశల్యకృపాశ్వత్థామలు గడంగి తమతోడన తఱుముజయద్రథుం బిఱిందికిఁ ద్రోచికొని ప్రొద్దు లావునం జేవ యెక్క యక్కిరీటిం దాఁకి తీవ్రశరంబులు వరగించిన నవి యతం డొక్కొక్కటిం బెక్కుతునియలుఁ జేయం దఱిమి యందఱు నొక్కుమ్మడి నొక్కొక్కరుండు పెక్కుమ్మలమ్మధుసూదనధనంజయులతనువులం బఱపిన నన్నరుం డుఱక యొక్కొక్కరినిం బెక్కునారాచంబుల [2]ప్రుక్కించి.

---

291. 1. నంత నతనితోడి – శ. ష. కొన్ని ప్రతులు. 2. బలము – కొన్ని ప్రతులు.

293. 1. బంట నన్ను – వ. 2. వింతలు – ఓ. ష. స. శ$_1$. 3. చూచెద గాక – ఐ. ఊ.

294. 1. తోడ్పడం గల – కొన్ని ప్రతులు. 2. నొప్పించి – ల. పెక్కు ప్రతులు.

## –: కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము :–

సం. 7–120

295. క. సింధుపతిదెసకు మదవ
త్సింధురగతిఁ గవియఁ జూచి ధీరోద్ధతిఁ గో
పాంధ[1]మతి నడ్డపడియె వ
సుంధర గ్రక్కదల సూతసూనుం డధిపా.

296. వ. అప్పుడు.

297. ఆ. పదియు నేనునిశితబాణంబు లర్జునుఁ
డనిలనందనుండు శినివరుండు
మూఁడుమూఁడు మెఱుఁగువాఁడితూపులు మేను
గాఁడ నేయ నొచ్చి కర్ణుఁడలిగి.

298. క. అఱువదియఱువదియమ్ముల
నెఱుకులు నొనాడ నేసి నిలిపి తనరయం
బెఱిఁగించె ముష్పురకు న
త్తెఱఁ గద్భుతరసము వెల్లిఁ దేల్చ జనములన్.

299. ఆ. నరుఁడు నూఱు[1]తీవ్రశరముల నయ్యోధ
వరునితనువు రక్తవారిఁ దోఁప
నాటఁ డట్టినూఱు లై దడరించె న
వ్వేగమునకు రోషవివశుఁ డగుచు.

300. క. ఆవిజయుఁడు గర్ణునివిలు
వావిరిఁ దునుమాడి విపులవక్షము నవబా
ణా[1]విద్ధము సేసి యతని
జీవము గొనునట్టిఘనవిశిఖ మేసె వడిన్.

295. 1. గతి – ఒ. ట. ణ. ర.

299. 1. దివ్య – ఇ.

300. 1. విద్ధు జేసి యాతని – కొన్ని ప్రతులు.

301. వ. అది యర్ధచంద్రసాయకంబున నశ్వత్థామ త్రుంచె నంతం గాంచనభాసితం
బగుశరాసనంబు గొని రాధేయుండు రయంబునఁ దీవ్రశరంబులు [1]వరగింప
నర్జునుండు నిలునిలు కర్ణ యర్జును నెఱుంగవే యనుచు ననేకచండకాండం
బులం గప్పినఁ గర్ణుండు నిలునిలు మర్జున కర్ణు నెఱుంగవే యనుచు నతని
[2]బహుపటుప్రదరంబులం బొదివె నట్లయ్యిరువురు నొండొరుల కదృశ్య
మూర్తులై పర లగ్గింపం బోరుచుండం గౌరవపతి తనవారి నెలుంగెత్తి
కర్ణునకు దోడ్పడుం డని వనిచె నక్కాలందికిం గిరీటి గోపాటోపంబున.

302. మ. తురగవ్రాతముఁ [1]గూల్చి సూతు[2]తనువుం దున్మాడి విద్వేషి శీ
కరనారాచపరంపరానిహతి [3]సంగం బార్తి నొందింప నా
తురుఁడై కర్ణుఁడు దర్పహీనుఁ డగుడున్ ద్రోణాత్మజుం డెద్ది యా
త్మరథస్థుండుగఁ జేసి యేసె విజయుణ్ మద్రేశుఁడుం దోడ్పడన్.

303. తే. కృపుఁడు వృషసేనుఁడును వారిగెడన కూడి
పార్థతనువునఁ దూపులు పఱపి రట్లు
పొదువునలువురపిఱుఁదను [1]బొంచి సింధు
వరుఁడు నిగిడించె నమ్ములు నరునిమీఁద.

304. క. గురుతనయప్రముఖరథిక
వరులభుజావిక్రమంబు వారించుచు ని
ర్భరరోషమునం బార్థుఁడు
శరంబు లటిముటి నిగిడ్చె సైంధవుమీఁదన్.

305. వ. ఆసమయంబున సుయోధనుండు సేనలకుం జేయి వీచిన నొక్కుమ్మడిం
గవ్వడిఁ గదిసి వివిధహేతివ్రాతంబులు మేన నించి నొంచినఁ గలంక లేక
కడంగి.

---

301. 1. దొరవఁగ – పెక్కు ప్రతులు, 2. బహువిధ ప్రదరంబుల – పెక్కు ప్రతులు.

302. 1. ద్రుంచి – ఉ. శ. 2. తలయుం – ల. 3. మగ్రవ్యాప్తి నొందింప – అ. గ. వ; వాకంబు నొందింప – ల.

303. 1. బొదివి, పొంగి – అని పాఠములు.

806. శా. గాండీవంబు గుణంబు ఘోరరవ మాకాశంబునం బర్వ వే
దండస్యందన ఘోటకంబులు మహోగ్రక్రూరపాతంబుల
న్ఖండీభూతములుఁ విదారితములు న్భగ్నంబులుం గా సము
ద్దండుం డై యడరం గలంగి పఱచెం దత్సైన్యసంతానముల్.

807. వ. ఇట్లు ప్రచండమూర్తి యై మధ్యందినమార్తాండుండునుం బోలె వెలింగి వివ్వచ్చుండు వియచ్చరుల [1]కచ్చెరు వందించె వెండియు దొరలందఱు నొక్కటఁ దఱుమ నతం డదల్చి యమ్మొలవెల్లిం దేల్చి తెరల్చి దీప్తబాణ పాతపూర్వకంబుగా జయద్రథునకుం గవిసిన నమ్మహారథుండు.

808. క. పావక హాయకేతనగాం
డీవములం బార్థుమేఁ గడిందివడిన్ సై
న్యావళియు దేవతలు నా
నావిధములఁ బొగడ నాఁడె నారాచంబుల్.

809. క. విజయుం డతనివరాహ
ధ్వజమును సారథిశిరంబు ధర నొక్కట న
క్కజముగఁ బడ నేసిన నీ
ప్రజ తామరపాకునీటిభంగిం దలఁకెన్.

810. క. ప్రాణములు గలుగునంతకుఁ
ద్రాణపరాయణత నీదురథికోత్తము ల
క్షీణ[1]జవమునఁ బ్రసారిత
బాణు లగుచు నతని కడ్డపడిరి నరేంద్రా.

811. వ. ఇవ్విధంబునఁ [1]గృపాశ్వత్థామశల్యవృషసేనులు దెంపు సేసి సైంధవున కడ్డం బైనం జూచి యాసవ్యసాచి యతనిఁ దెగఁ[2]జూడ నెడ గానక యవుడు గఱచుచుఁ బ్రొద్దుదిక్కు గనుంగొనినఁ గేశవుం డి ట్లనియె.

---

307. 1. నచ్చెరు వందించె - ఈ. డ. ణ. దీ. ప. ల. వ.

310. 1. జవంబున ప్రచలిత - ట. వ.

311. 1. గర్ణాశ్వత్థామ - ఉ. ఠ. 2. జూడ గానక - ఉ. బొ. ఘ. ఠ. డ. వ.

312. ఆ. [1]చక్కఁ [2]జలము పెనఁగఁ జన దింక నినుఁడు ప
శ్చిమధరాధరంబు సేర బోయె
దీని కొకయుపాయ [3]మేను గల్పించెద
దానఁ జేసి కాని [4]దాయ వడఁడు.

313. వ. అది యెయ్యది యంటేని.

314. క. ఇనమండలంబు మఱువడ
నొనరించెదఁ దమము పాండవోత్తమ యది గ్రుం
కినచంద మైన సైంధవుఁ
డును గౌరవయోధులుం గ[1]డుం బ్రమదమునన్.

315. వ. ప్రతిజ్ఞాభంగం బయ్యె నని కయ్యంబు కడంక దక్కి విచ్చలవిడి [1]నొండొరుల మెచ్చుచుఁ బొంగి చెలంగుదు రప్పుడు నీవూన్కి దీర్చికొమ్మని పలికినం బరాక్రమంబు సవ్యాజం బయ్యె నని మనోవ్యథం జెందు సవ్యసాచిం గనుం గొనుచు నమ్మాధవుండు మాయాతిమిరంబునఁ దిమిరవైరిం గప్పిన.

316. క. అది రవి [1]గ్రుంకుటగాఁ గొని
మద మెసకం బెసఁగ నార్చి మనసైన్యంబుల్
వొదలెఁ దల యెత్తి హర్షా
స్పదమతి సింధుపతి యపుడు పడమర సూచెన్.

317. వ. [1]తదవసరంబున.

---

312. 1. చలము పట్టి పెనగ - ఒ. వ. 2. జాగి-బొ. స-శ$_1$; చెలగి - ట. బ. వ. జాల-వ. 3. మే నొనరించెద - అ. ట. ర. ద; మేను గావించెద - డ. వ. 4. డాయప(బ)డదు - ట. ప. న. వ.

314. 1. డున్ ముద మొదవన్ - ఊ. ప; డున్ బ్రియమలరన్ - గ. ద. న.

315. 1. నొండొరువుల - కొన్ని ప్రతులు.

316. 1. గ్రుంకిన చందమై - బొ.

317. 1. తదనంతరంబున - కొన్ని ప్రతులు.

318. ఆ. [1]ఎలమిఁ దేరిమీఁద నిలుచుండి పడమర
త్రుత్తి చూచుచున్న యిద్దురాత్ము
మస్తకంబు దునుము మసలక యని యర్జు
ననకుఁ జూపె సైంధవుని మురారి.

-: అర్జునుఁడు సైంధవుని తల దునుముట :-

సం. 7-121-31

319. క. అతఁడు గని గంధమాల్యా
ర్చిత మై దొన మెఱయుచున్న శితశర ముగ్రో
ద్ధతి నేయ డేగ పులుఁగును
గతిఁ గొనుక్రియ నది హరించె గ్రక్కున శిరమున్.

320. వ. అప్పుడు సత్వరుం డై.

321. ఆ. శౌరి పార్థుపార్థసైంధవుతల యిలఁ
బడిన నొప్ప దది నభంబునంద
నిలువఁ జేయు మేను నీ కెఱింగించెద
నత్తెఱంగు దెలియ [1]ననిన నతఁడు.

322. క. పటుశరముల మీఁదికి డా
పటికిన్ వలపటికి నపరభాగమునకు ముం
దటికిఁ జదల నడపె [1]సము
త్కటరయమున శిరముఁ గందుకక్రీడగతిన్.

323. వ. అట్టియెడ.

324. క. మాయపుఁజీఁకటి విరియుడుఁ
దోయజమిత్త్రుండు మగుడఁ దోఁచెఁ బ్రజకుఁ గో

318. 1. ఎలమి దేరు మీఁద - కొన్ని ప్రతులు; బలిమి తేరి మీఁద - వ.

321. 1. ననుడు నతడు - కొన్ని ప్రతులు.

322. 1. ననుత్కటరయమున - ఈ. ఒ. ట. ఔ. క. ఘ. న య. ల. స. శ[1].

పాయత్తు లై [1]బలంబులఁ
జేయంగలవారు గడఁగి [2]శితబాణములన్.

825. క. సరుఁ బొదివి రతఁడు వారల
యురవడి వివిధాస్త్రతతుల నుడుపుచు నింగిం
[1]దిరుగ మను నడుపుచుండెడు
శిరమును నేమరక యుండెఁ జిత్రప్ఫురణన్.

826. వ. ఇ ట్లత్యాశ్చర్యకరణ పరిణతబాహువీర్యుం డై విక్రమవిహారంబు సలుపుచుండి.

827. ఆ. దనుజవైరి యెంతదడ [1]వింక నిలుపంగ
వలయు సింధురాజుతల నభమున
నెచట వైచువాఁడ నేమిటి కివ్విధ
మాచరింపవలసె ననిన నతఁడు.

828. వ. వినుము వృద్ధక్షత్త్రుం డనుసింధుదేశాధీశుఁడు సంతాన[1]కరతపోవిశేషంబున నీజయద్రథుం బడసె నితండు కుమారుండై వర్తిల్లుసమయంబున నొక్కనాఁ డశరీరవాణి వీఁడు సంగ్రామంబున నేమఱి తల దునుమం బడు నని [2]యాదేశించిన నతం డెల్లవారును విన వీనిమస్తకంబు మహింబడ నెవ్వఁ డేసె వానిశిరంబు [3]శకలశతం బయ్యెడు మని తనతపంబు బలిమిం బలికి యతనిఁ బట్టంబు గట్టి వనంబునకు నియతుం డై యరిగె నట్లు గావున.

829. క. ఈతల పుడిమిం బడనీ
కాతనితొడ మీఁద వైచునది యావని వి

---

324. 1. చలంబున - వ. వీ. ష. స. శ$_1$. 2. చే వాడి వెసన్ - ఝ; చేపారి వెసన్ - కొన్ని ప్రతులు; శితవిశిఖములన్ - అ. ఆ. వ.

325. 1. దిరముగను నిలుచు నట్లుగ - ఊ$_2$. ఏ.

327. 1. వాక్కొ - ఇ. ఢ.

328. 1. కరతపో - పెక్కు ప్రతులు; కరణతపో - వా. వీ. శ. ష. 2. యానతిచ్చిన - ట. 3. నూరువ్రయ్య లయ్యెడు మని - ఝ. న.

ఖ్యాతం బగుపాశుపతము
చేతన యగుఁ గాక యెుంటఁ జెల్లునె మనకున్.

830. వ. అవ్వృద్ధక్షత్త్రుండు శమంతపంచకసమీపంబున నుండుని[1]వమ్మహాని యాస్త్రంబు నాశ్రయింపు మనవుడు నర్జునుం డట్ల కాక యని భక్తియుక్తంబుగా నియతమతిం దత్ప్రయోగం బాచరించిన నద్దివ్యసాధనంబు సాయకపరంపరాకారం బయి యాశిరం బట గొని చని తదాశ్రమద్వారంబు [2]సొచ్చునప్పు డజ్జనపతి జపయుక్తుం డై యుండ నమ్మహాస్త్రంబు [3]మాహాత్మ్యంబున నమ్మస్తకం బతనితొడమీఁదఁ బడిననతండు తదీయస్పర్శంబున నెఱింగి దిగ్గన లేచుచుం ద్రోచిన నది భూతలపతితం బగుటయు.

831. తే. పగిలి యాతనితల నూఱు [1]పఱియ లయ్యె
శౌరి విజయుని నగ్గించె సకలభూత
ములు మహాద్భుతరసమున ము[2]నిఁగె నపుడు
సంహరించె నయ్యస్త్ర మాసవ్యసాచి.

832. క. ఇవ్విధమున సైంధవుతలఁ
గవ్వడి యట నడపుశక్తి గనుఁగొని సేనల్
నివ్వెఱఁ గందె మనంబుల
గ్రొవ్వడఁగెను దొరల కెల్లఁ గురువంశనిధీ.

833. సీ. సైంధవుఘోరకబంధంబుదల యిలఁ బడునంతకును దేరిపైన నిలచి
మఱి కూలుటయును విస్మయము గావించెఁ జూపఱ కట్లు పార్థుండు ప్రతిన నెఱపె
నీతనూభవులు గన్నీళ్లు దొరఁగ నత్యంతశోకముఁ బొంది రచ్యుతుండు
నన్నరుండును బరమానందకందళితాత్ము లై రత్తఱి ననిలసుతుఁడు

---

830. 1. వమ్మహీయాస్త్రంబు - వ. 2. సొనుపు నప్పుడు - కొన్ని ప్రతులు. 3. మహాత్వంబున - ఆ. ద.

831. 1. ప్రయ్య లయ్యె - వ. జొ. శ. త. బ. వ. స. శ₁; బ్రద్ద లయ్యె - కొన్ని ప్రతులు.
2. నుగగ నుపసంహారించె - ఆ. ఇ.

ఆ. నలిఁ జెలంగి సింహనాదంబు సేసిన
విని యుధిష్ఠిరుండు విజయుపూన్కి
[1]నెఱయ నెఱిఁగి హర్షనిర్భరాకృతి యయ్యె
నుల్లసిల్లి రథనియోధు లెల్ల.

334 వ. అచ్చట నార్పులుఁ దూర్యనినదంబులుఁ జెలంగెఁ దద్బలంబులుఁ బరమ ప్రమోదంబునం బొందె నని సంజయుండు సైంధవవధప్రకారంబు ధృతరాష్ట్రున కెఱింగించె నని చెప్పినఁ జిత్తంబు గౌతుకాయత్తం బగుచుండ నటమీఁదివృత్తాం[1]తం బెఱింగింపు మనుటయు.

335. ఉ. వింధు [1]చిదాత్మనాదమయపీఠచతు[2]ష్కలసద్విహారని
ష్యందిసుధాకృతీ పరమసౌఖ్యవిధా[3]యకచిత్స్వరూప ని
ష్పందనిరంజనాస్ఖలితశాశ్వతనిర్మలవైభవా మహా
నందరసైక[4]తాత్మలయనక్రమనిష్కల బోధపుష్కలా.

336. క. ఆస్తికచేతస్సహితా
కౌస్తుభరత్నాస్థిమాలికా[1]శబలితవ
క్షస్థల సుమహితనిగమ
ప్రస్తవనీయప్రకార [2]పరమోదారా.

337. మాలిని. శ్రుతిఫలరసభావస్తుత్యమూర్తీ నతార్తి
ప్రతిహననని తాంతప్రౌఢహేలావినోదా.

---

333. 1. నెరువు లెరిగి - ఉ. ఊ. ఐ. ఓ. ఘ. వ. హ.

334. 1. తంబు వివరింపు మని - కొన్ని ప్రతులు.

335. 1. విదాత్మనాద - భాకూ. శ. కొన్ని ప్రతులు. 2. ర్దళ సద్విహార - ఉ. ఏ. ఒ. ఘ. ట. ళ. డ ఙ. 3. యితపస్స్వరూప - ఈ. ర. న. శ$_1$. 4. తాంతలయన - ఆ. క. ఘ. త. డ. త. మ. ర. ల. స. హ. శ$_1$; కాంతి - ఝ. న.

336. 1. వలలిత - ఐ. ఙ; శుభతర - త. 2. వరమోంకారా - చ. భాకూ. శ; వరమామోదా - ట.

యుతభువన వితానాహీన [1]నిర్వాహమోహ
వ్యతికరతిమిరప్రధ్వంస[2]నాదీపరూపా.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బయిన శ్రీ
మహాభారతంబున ద్రోణపర్వంబునందుఁ జతుర్థాశ్వాసము.



337. 1. నిర్వారమోహ - స. 2. నోద్దీపరూపా - ర.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## ద్రోణపర్వము - పంచమాశ్వాసము



1. క. శ్రీధామలసదపాంగ
వ్యాధూతప్రణతదురితవర్గ[1]నిరోహా
ద్వైధాత్మక[2]దేహా జగ
దాధారవిహారనిపుణ హరిహరనాథా.

*-: కృష్ణార్జునులు సల్లాపంబు లొనరించుచు ధర్మజుకడ కరుగుచుండుట :-*

సం. 7-122-1

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లద్భు[1]తోదారం బగు నర[2]నారాయణుల విక్రమవిహారంబు [3]విని వెఱఁగంది యాంబికే యుండు సంజయుదిక్కు మొగం బై.

3. క. ఇవ్విధమున సైంధవుఁ డా
కవ్వడి[1]చేఁ బడిన పిదపఁ గౌరవు [2]లె ట్లై
[3]రవ్వార్త సెప్పు మనవుడు
నవ్విభునకు నాతఁ డిట్టు లనియె నరేంద్రా.

---

1. 1. నిరీహా - స; నిరీహా - వ; నిరోధా - అ. ద. స; నిరాసో - ఈ. క. ణ. స. 2. దేవా - వ.

2. 1. తోత్సాహాలగు - ణ. 2. నారాయణుల విహారంబు - పెక్కు ప్రతులు. 3. విని యాంబికేయుండు - మ.

3. 1. చేజన్న - వ. 2. లేమై - ఇ. 3. రవ్వార్తలు సెప్పు మనుడు - కొన్ని ప్రతులు

4. వ. అట్లు పాండవబలంబులు పొంగి కడంగి కుంభసంభవుమీఁదం గవిసి కయ్యంబు [1]సేసె నాసమయంబున నిక్కడ.

5. చ. కృపుఁడును ద్రౌణియుం [1]గడఁగి క్రీడిపయిన్ శరవర్షముల్ మహో
గ్రపురభసంబునం గురియఁగా నవి మాన్చి యతండు వారలం
గుపితుఁడు గాక [2]యున్ విశిఖకోటుల నల్లన [3]కప్పు[4]పెల్లునం
గృపునిశరీర మొయ్య నొఱఁగెన్ రుధిర[5]చ్యుతి మూర్ఛ వచ్చినన్.

6. వ. ఇట్లు కృపాచార్యుండు రథంబుమీఁదం బడినఁ దత్సారథి [1]దేరు దొలంగం దోలుకొని పోయె నశ్వత్థామయు నోహటించి [2]తొలంగెఁ [3]దక్కటిరథికులు [4]పైఁబెట్టం జాలక యంతంత నిలిచి [5]రట్లు శారద్వతుండు దనయమ్మామ మూర్ఛిల్లుట సూచి సవ్యసాచి వగచె నప్పు డన్నరునిఁ గౌఁగిలించుకొని నారాయణుం డిట్లనియె.

7. క. కురుబలముఁ [1]దొడరి [2]గెలువఁగ
సుర[3]గణముల కైన [4]నరిది శూరో త్తమ నీ
[5]పురవడి గెలిచి[6]తి భాగ్య
స్ఫురణంబును బాహుబలముఁ [7]బొగడం దగదే.

8. క. ఆవృద్ధకుత్స్త్ర [1]తపము
వావిరి నోర్వంగ నీకు వచ్చినటుల [2]దు

---

4. 1. సేసిరా - జ. వ; సేయుచుండ - ఊ. ర.

5. 1. దరమి, దరిమి - కొన్ని ప్రతులు. 2. యవ్విశిఖ - గ. 3. దొప్పు - వ; రొప్పు - చ. 4. పెంపునం - గ. శ. 5. స్రుతి - త. య. వ; చ్ఛవి - ఊ.

6. 1. యత్తేరు - కొన్ని ప్రతులు. 2. తలంగె - ఊ. ర. 3. దక్కిన - కొన్ని ప్రతులు. 4. పైపెట్టక - ద. న. ప. ల. 5. రంత - వా; రట్లు - పెక్కు ప్రతులు.

7. 1. తోడ - ర; దొడ్డవి - వ. 2. యొదుపగ - ఖ. బ. వ. 3. బలమున కైన - కొన్ని ప్రతులు. 4. నలవె - ర. 5. వురువడి - ర. ల. వ. హ. కొన్ని ప్రతులు. 6. తుదార - వ. 7. బొగడగ వలదే - ఆ. జ. వ; బొగడగ దరమే - ఐ. గ. ల; బొగడొం దెగదే - చ. ణ; బొగడగ వశమే - న.

8. 1. తపంబావిరి - వ 2. దుర్భావుడగు - ఝ. న; "ఏవమేవ హతే కర్ణే సానుబంధే దురాత్మని" పి. పి ఎస్. 7-127-37. పీరావవహునిఁ గర్ణు - వా. పెక్కు ప్రతులు.

ర్భావుఁ డగు కర్ణు నోర్వం
గా వచ్చినఁ గాదె నాకుఁ గడుఁ బ్రీతి యగున్.

9. చ. అనవుడు నాతఁ డిట్లను మహాత్మ భవత్కరుణం బ్రతిజ్ఞ యే
[1]ను నెఱపఁ గంటిఁ [2]బాండవమనోరథసిద్ధి భవద్దయాసమృ
ద్ధి నగుట వింతయే భవదధీనులకున్ విజయంబు ప్రాఁతె నీ
పను పొనరించువార మట భారము నీయది [3]గాదె [4]యెప్పుడున్.

10. తే. అనుడు నుద్గతమం దస్మితాస్యుఁ డగుచు
దనుజమర్దనుఁ డతనితో [1]ధర్మతనయుఁ
గానఁ బోవంగ వలయు భాస్కరుఁడు గ్రుంకు
చున్నవాఁ డని పలికిన నన్నరుండు.

11. వ. అట్లు కాక యనుటయుఁ [1]గదిలి భీమసేనుండును సాత్యకియును యుధా
మన్యుండును [2]నుత్తమౌజుండును సముచిత సల్లాపంబులు [2]సేయుచుఁ దో
నేతేర సాంద్రశోణితపూర[3]సేకంబున ఘోరం బైనసంగ్రామతలంబునం జని
చని శౌరి సవ్యసాచి నాలోకించి.

12. చ. కరులు రథంబు లశ్వములు గాలుబలంబు చమూపతుల్ మహీ
శ్వరు లఖిలాస్త్ర[1]శస్త్రములు చామరముల్ గొడుగుల్ సిడంబు లా
భరణము [2]లిత్తెఱంగునను బార్థ కడుం జెలువొందెఁ [3]జూడ సం
గర[4]మహిచిత్రవస్త్రమునఁ గప్పినచందముఁ దోఁపఁ జేయుచున్.

---

9. 1. నొనరుప – వ; నొనరగ – ఏ. ల. 2. బాంధవ – ర. 3. యొందునె – కొన్ని ప్రతులు. 4. యెయ్యెడన్ – స.

10. 1. మనము ధర్మ, తనయుఁ గానఁ బోవల వదే యినుఁడు గ్రుంకు – ర. ల. స. కొన్ని ప్రతులు..

11. 1. గదిసి – వ. 2. నేయ సాంద్రశోణిత – వ. స. కొన్ని ప్రతులు. 3. ప్రకరంబున – ణ; సిక్తంబున – ద.

12. 1. విత్తములు – ఐ. 2. లున్న యిత్తెరగు – పెక్కు ప్రతులు. 3. జూడు – ఘ. బ. ర. వ. వా. 4. మహి చిత్రా – ద. న. ప. ల; మహిఁ జిత్ర – వా.

13. వ. భవదీయ[1]బాహావిహారంబు నుదారత్వం [2]బిట్లుండునే యని యగ్గించుచు
నరిగి సమయోచితం బగుట[3]యును బ్రతియోధులు విచ్చవడి యునికిం
జేసియు సమరంబు సాలించి తమరాక [4]కెదురుచూచుచుం గూడికొని
యున్నయుధిష్ఠిరాదుల సమీపం బగుటయుం [5]బాంచజన్యంబు పూరించినం
బాండవాగ్రజుండు.

-: సైంధవుని సంహరించి కృష్ణార్జునులు వచ్చి ధర్మజునకు నమస్కరించుట :-

సం 7_124_1

14. తే. రథము డిగ్గి హర్షాశ్రులు గ్రమ్ముదేర
నెదురు[1]కొనుటయు సంభ్రమ మెసకమెసఁగఁ
బార్థుఁడును గేశవుండును బాదచారు
లై రయంబునఁ జని మ్రొక్కి రవ్విభునకు.

15. వ. ఇట్లు [1]ప్రణమిల్లిన.

16. క. నరపతి యానందాశ్రులు
[1]గరసరసిరుహముల నొత్తి కను దనియఁగ న
య్యిరువురఁ జూచుచు మేనులు
గరు పాఱఁగ గ్రుచ్చి [2]యొక్క కౌఁగిటఁ జేర్చెన్.

---

13. 1. బాహావీర్యవిహారంబును - ర; బాహువీర్యవిలాసంబును - ఇ; బాహు వీర్యంబును - ఏ. ఐ. త; బాహువీర్యోదార్యంబు - న; బాహాసంరంభంబును - బ; బాహారంభంబును - వ. బాహావిభవంబునుదార - ద. వ; బాహు విహారంబును - ల. 2. బును నిట్లుండునే - ఓ. ద; బు నిట్లుండునే - ప. వ. 3. నుం బ్రతి - అ. ల. 4. కెదుళ్లు - కొన్ని ప్రతులు. 5. పాంచజన్యదేవదత్తంబులు పూరించిన నప్పాండవాగ్రజుండు - కొన్ని ప్రతులు.

14. 1. కొనినను - గ.

15. 1. ప్రణతిసే (చే)సిన - కొన్ని ప్రతులు.

16. 1. గరసరసీజముల నొత్తి - వ; గరసరసిజములను నొత్తి - టొ. త. 2. యొత్తి - ఈ. ఐ. ఓ. గ. ఘ. డ.ద. న; యొకట గౌగిట - ల.

17. వ. ఇవ్విధంబున నాలింగనంబు సేసి యర్జునుతో [1]నిట్లనియె.

18. క. చేసెత్తురు గాకుండం
గా నాసైంధవునిఁ జంపి క్రమ్మఱ మీరల్
రా నోఁచితి నాభాగ్యం
బేన పొగడునట్టి దయ్యె [1]నీతని[2]కరుణన్.

19. క. అని వాసుదేవుఁ [1]జూపిన
విని యాతఁడు నీదు[2]కోపవేగంబున దు
ర్జనుఁ [3]డాజయద్రథుఁడు [4]వాలి
సిన నెవ్వరి కెట్లు సేయఁ జెల్లదె యనినన్.

20. వ. అమ్మహీపతి [1]యమ్మహాత్ము నుద్దేశించి.

21. క. దేవాసుర[1]సంఘంబులు
నీ వలిగిన రూపడంగు నీకూరిమి సౌ
ఖ్యావహ [2]మఖిల[3]జగములకు
దేవ భవద్భక్తు లరులఁ దీర్చుట యరుదే.

22. వ. అని [1]మఱియు [2]ననేకప్రకారంబులం బ్రస్తుతించి భీష్మాదు లతని[3]కతన మడియుట యుగ్గడించి నీవు [4]కోపించినట్లు [5]వర్తించుటఁ గౌరవులు [6]సెడిర

---

17. 1. నతం డిట్లనియె - వా; అతండు - పెక్కు ప్రతులలో లేదు.

18. 1. నితని కతమునన్ - కొన్ని ప్రతులు. 2. కతనన్ - కొన్ని ప్రతులు

19. 1. జూచిన - ర. వ. 2. రోషవేగంబున - ఙ. 3. డగు జయద్రథుడు - వ.
4. వాలిసెను - కొన్ని ప్రతులు. 5. కిట్లు - కొన్ని ప్రతులు; నెట్లు - ఏ.

20. 1. వెండియు నమ్మహాత్ము - ఊ ఎ. ర.

21. 1. సంఘములును - పెక్కు ప్రతులు 2. ము నఖిలజనులకు - వ. 3. జనులకును - ఙ. జనములకు - శ.

22. 1. యనేక ప్రకారంబులం - వ. 2. నానాప్రకారంబులం - ఊ. 3. కతంబున - పెక్కు ప్రతులు. 4. కోపించునట్లు - పెక్కు ప్రతులు. 5. పర్తిలుటం జేసి, వర్తించుటం జేసి - కొన్ని ప్రతులు. 6. సెడుట కా దలంచెద - ఙ. ర. వ; చెడిన వారలు కా దలంచెద - ఊ. ఓ; మడిసెదరు కా దలంచెద - ర.

కాఁ [7]దలంచెద ననుటయు నచ్యుతుం డాభూపాలు నాలోకించి ధర్మో త్కృష్టుండ వగునీకు [8]నరిష్టం [9]బాచరించినవారికిఁ జెడకుండ వచ్చునే యనునెడ ననిలసుతుండును సాత్యకియును దనువు[10]లఁ [11]గ్రొత్తగంట్లు [12]గొమరారా నద్ధరణీపతిచరణంబులకుఁ [13]బ్రణతులై న నతం డెత్తి [14]కౌఁగ లిం[15]చుకొని వారలు కుంభసంభవకృతవర్మాదులసంరంభంబు [16]మర్దించుట పేర్కొని యభినందిం[17]చె యుధామన్యుండును నుత్తమౌజుండును దగిన తెఱంగునం గాంచిన[18]వారి నుచితవచనంబుల సంభావించెఁ దదీయసైన్యం బెల్లను బ్రమోద[19]భరితం బై కయ్యంబునకుం గాలుద్రవ్వుచుండె నాసమ యంబున [20]శోకవిస్మయవివశుం డగుచు దుర్యోధనుం డంతర్గతంబున.

23. ఉ. ద్రోణుఁడు గర్ణుఁడుం గృపుఁడు ద్రోణి[1]సుతుండును నేల వాని గీ
ర్వాణులకై ననుం జెనయవచ్చునె యెవ్వరు నాఁడెఁ గౌరవ
త్రాణపరాయణత్వ[2]మున దర్పము సూపఁగ లేమి దెల్ల మ
క్షీణపరాక్రముం డయిన క్రీడికి నిక్కువుటల్కఁ వచ్చినన్.

24. వ. అనుచు నుత్సాహరహితం బై నచిత్తం బుత్తలపడఁ గుంభసంభవుపాలికిం బోయి పరిభవలజ్జయుంబును దమ[1]వారు [2]సమయుటయు నుగ్గడించి మఱియును.

25. సీ. బల్లిదుఁ డగుభీష్ముఁ బడ వైచి సోదరవర్గంబుఁ దాను ననర్గళముగఁ
గ్రాలెడు నేచి శిఖండి యింతకు మున్న పాలిసె నే [1]డక్షౌహిణులు గిరీటి

---

7. దలంచుచున్నవాడ - ల. 8. ననిష్టం బాచరించిన - కొన్ని ప్రతులు. 9. బొన రించిన - క. 10. న(ం)గ్రొత్త - కొన్ని ప్రతులు. 11 గ్రొగ్గంట్లు - కొన్ని ప్రతులు. 12. దనరార - కొన్ని ప్రతులు. 13. బ్రణమిల్లిన - వ. 14. కవుంగిలించికొని - వ. 15. చివీరలు - పెక్కు ప్రతులు. 16. వారించుట - ద. వ. 17. చి-పెక్కు ప్రతులు. 18. వారలను - అ. ల. 19. భరితులై - న. వ. 20. శోకవివశుం డగుచు - వ.

23. 1. తనూజుడు నేల - వ. 2. ఘనదర్పము - ల.

24. 1. వారి పాటును నుగ్గడించి - వ. 2. మడియుటయు - ఈ. బొలియుటయు - ణ; పెక్కండ్రు సమయుట యుగ్గడించి - హ.

25. 1. డక్షోహిణులు - ద. న. ప.

చేత సైంధవు[2]పాటు సెప్ప [3]జిట్టలు నాకుఁ బూని యేతెంచి కాంభోజవిభుఁడు
జలసంధుఁడును సుదర్శనుఁడును లోనుగాఁ గలుగు భూపతులు
పెక్కండ్రు నేఁడు

తే. గలనఁ గూలిరి [4]వీరిలోకంబ [5]యైన
నొండెఁ [6]బాంచాల[7]బలమును బాండవులను
[8]దండిసై తెగఁ బూచిన నొండెఁ గాక
[9]యెట్లు [10]వాయు [11]నాకింద ఋణము సెపుమ

26. క. నరుఁ [1]డనుఁగు[2]బంటు గావునఁ
[3]బోరిగొనఁ బోర వీవు సూతపుత్త్రుఁ డొకఁడ మా
ర్తుర మార్కొనియెడు నతనికి
[4]వెరవును [5]గఱతలును లేవు వీరుండగుటన్.

27. వ. అతఁడునుం బోరి పోరి చేడ్పడి సైంధవుం గోలుపోయె ననవుడుఁ గటగటం
బడి యాచార్యుం డతని కిట్లనియె.

28. చ. నను మది [1]దూఁటు వోవువచనంబుల నేటికి [2]నిట్లు నొంప న
ర్జునునిజయింపరామి పలుచోటులఁ జెప్పనె దేవకోటికై

---

2. చావు - అ. 3. జెట్టలు - త. ద. ష. స; జుట్టలు - న. వ. 4. యధిక
శోకంబ యైన నొండె - వ. 5. యయ్యెనొండె - హ. 6. బాంచాలురను బాండ
వులనుగూడ - బ. వ. 7. కులమును - కొన్ని ప్రతులు. 8. దండివై - ఱ. ద.
బ. వ. శ. 9. వినుము పాయునె యంతఱ ఋణము నాకు - వ; తగులునే నాకు
నేడు నిందఱి ఋణంబు - వ. 10. దీరు - గ. 11. నా కిందఱి యీఋణంబు-
అ. జ. ఝ. వ; నె నాకెందు నీ ఋణంబు - ఐ.

26. 1. డు గడుజెట్టి గావున - వ. 2. జుట్ట - ద. ప. హ; దిట్ట - బ. "భవా ను
పేణా న్కురుతే శిష్యత్వా దర్జునస్య వై" పి. పి. ఎస్. ద్రోణ - 128-28. దీనిని బట్టి
'అనుఁగుజుట్టు' అను పాఠము సరియైనట్లు తోచును. 3. బోరిమార్పవు నీవు సూత-
హ; బోరిమాల్పవు నీవు సూత - క; బోరి గొనుటకు జోరవు సూత - వ. 4. వెర
పున గరుదులును - క. ప. ర. వ. 5. మరపులును - ద. శ; గరదలును(?) -
న. ల వ.

28. 1. దూలపోవు - ఉ. ప. ర. 2. నీవు - అ.

నను [3]నవిజయ్యు భీష్ముఁ బ్రథనంబున నాతఁడు [4]సంపఁ గౌరవుల్
మన రని తోఁచె [5]నాకు నభిమానముఁ గాచుటకై పెనంగెదన్.

29. ఆ. శకునిచేతి యడ్డసాళ్లు[1]లు నేఁడు గాం
డీవముక్తబహుపటిష్ఠబాణ
మూర్తిఁ [2]గవిసి నీకు నార్తి యొనర్పంగ
నాఁక గొనఁగ నెట్టు లగుఁ గుమార.

30. క. భూరమణ విదురుఁ డమ్మెయి
వారింపఁగ నతులపుణ్యవతిఁ గృష్ణను మీ
వారెల్లఁ బూడఁ [1]బఱచిన
[2]క్రూరపుఁ [3]బాపంబు [4]ఫలంబు గుడుపక యున్నే.

31. క. ఆసభ నీవును [1]మీదు
శ్శాసనుండును గర్ణుఁడును [2]బ్రశస్తచరిత్రో
ద్భాసితు లగు పాండవులకుఁ
జేసిన [3]కీడెల్ల[4]భంగిఁ జెలుపదె మిమ్మున్.

32. ఉ. అన్నివిధంబులం బటిచి యైనను నక్కటికంబు లేక వా
రి న్నెటి [1]మాలి కానలఁ జరింపఁగఁ బంచినఁ బోయి వచ్చి య

---

3. నవిజేయు – పెక్కు ప్రతులు. 4. గూల్ప గౌరవుల్ – కొన్ని ప్రతులు. 5. నాదు – ల.

29. 1. నుగావు – కొన్ని ప్రతులు. 2. గదిసి మీకు – ఉ. ఐ. న. 3. మాన్ప నెట్టు లగుఁ గుమార నాకు – వీ. స;. నాకు గెలువ నెట్టులగు – ఐ; నాక గొలుప నెట్టు లగు – మ. ల. స.

30. 1. బనిచిన – బ. వ; బరచిన – ఉ. ద. వ. 2. క్రూర పుపాటిట్టి ఫలము – హ; క్రూర పురాకృత ఫలంబు – ఒ; క్రూరవుపాటీ ఫలంబు – వ. 3. బాటుల – ర; పావంబు ఫలము – ఇ. ల; బాపపు ఫలంబు – వా. కొన్ని ప్రతులు. 4. ఫలము బొందక యున్నె – ఝ.

31. 1. నీ – వ. 2. బ్రసిద్ధచరిత్రో – వ. 3. పాటెల్ల – బ. ప. 4. మిమ్ము జెరపక యున్నె – బ.

32. 1. మాల్చి – ర. హ.

య్యన్నయుఁ దమ్ములుం దమకు నయ్యె సగం [2]బిల వేఁడి కాన [3]కి
ట్లున్నను వారి [4]మార్కొనుట కోర్చితి నే నొక బ్రాహ్మణుండనే.

33. క. నీవును నచ్చటఁ బన్నిన
నీవారును సైంధవుని ననిం బడకుండం
గావఁగ [1]జాలర యేనును
నీవాఁడన కానె యేల నిందింపంగన్.

34. వ. అని [1]పీడనాడి వెండియు.

35. క. పాంచాలురుఁ బాండవులు ను
దంచితగర్వమున [1]ననికిఁ దఱిమి యొడలు [2]మం
డించుచు నుండఁగ ని ట్లుడి
కించెద వొకవలన నీవుఁ గిడుపలుకులన్.

*-: ద్రోణుఁడు పాంచాలురఁ జంపక కవచంబు విడువ నని ప్రతిజ్ఞ సేయుట :-*

సం. 7_126_32

36. వ. అని పగతురయుత్సాహం బుపన్యసించి.

37. క. పలుకులఁ బనిలే [1]దీ రే
తలపెట్టక పోరు[2]వా రుదగ్రత నేనుం
[3]జలము [4]మెఱయఁ బాంచాలురఁ
[5]బొలియింపక కత్తళంబు పుచ్చ నరేంద్రా.

---

2. బటు(ట) - బ. వ; బినువేడి - వ. 3. రిట్లున్నను - క. హా. 4. మార్కొనగ నోర్చితి - ల.

33. 1. జాలిరె - ద. వ హా.

34. 1. విడియ నాడి - ల.

35. 1. నంటఁ దఱిమి - ల. ష; నంటన్దాకి - వ. 2. మ్రుండించు - వ.

37. 1. దింకన్ దల - ఖ. ర. హా. 2. నీవుదగ్రత - హా; మత్త్యుదగ్రత - వ. 3. జలి యించక పాంచాలుర - వ; జలముమెయిం బాంచాలుర - ఫ. 4. నెఱయ - క. డ. ద. బ. హా. 5. బొలిపుచ్చక - ఆ.

38. క. గ్కావున మనసైన్యంబులు
[1]సేవ సెడక సంగరంబు సేయునటులుగా
నీ వుత్సహించి [2]నిజబా
హావిభవము సూపు శక్తి కనురూపముగన్.

39. వ. అని తెంపు సేసి.

40. క. భూసురభక్తియు వృద్ధో
పాసనముం గలిగి ధర్మపథవర్తనని
త్యాసక్తుఁడ వగు [1]మనఘా
నాసుతు బోధింపు వగపునకుఁ జోరకుండన్.

41. వ. [1]నాచేతఁ [2]దెగనిపాంచాలురు [3]గలిగి రేనియు వారిం బోనీక పొదివి తెగఁ జూచునది యని చెప్పుము.

42. క. అని పలికి గాఢనిశ్చయ
మున వదనం బెలమిఁ బొంద మును [1]కలఁగిననీ
మొన లెల్ల నొక్క[2]మొగముగ
నొనరిచి తలకొలిపె భూసురోత్తముఁ డనికిన్.

43. వ. అట్లాచార్యుండు [1]పురికొల్పినం గౌరవపతి సమరసముత్సాహ[2]రహితం బగు మనంబుతో సూతనందనుఁ [3]జేర నరిగి యి ట్లనియె.

---

38. 1. చేవ చెడక – పెక్కు ప్రతులు. 2. నీ బాహా – కొన్ని ప్రతులు; యని బాహా – ఒ. ల.

40. 1. మనుమీ నాసుతు – కొన్ని ప్రతులు; మనుచును నాసుతు – వ.

41. 1. అని మరియు నాచేత – వ; మరియు నాచేత – కొన్ని ప్రతులు. 2. దెగిన – బ. 3. మిగిలిరేని – బ; గలిగిరేని – వ.

42. 1. కలఁగి కలంగని మొన లొక్కమొగ్గముగా – న; కలఁచి కళంగిన మొన లొక్క మొగంబుగ – ప. బ. వ. 2. మొనగా నొనరించి – హా.

43. 1. దిలకొల్పినం – అ. ప. బ. వ. 2. సహితంబగు – ఝ. ద. ప. ర. ల. వ. హా. 3. జూచి – ఈ.

44. క. అరుల [1]కభేద్యం బగు[2]న
ప్పురుసున బలుమోహరంబు వన్నించి [3]తుదిం
[4]జొర విడిచెఁ గాని గురుఁడ
న్నరు నాఁగఁడ యతఁడు గీడు నాకుం జూడన్.

45. క. ఒకఁ డట్లు సొచ్చి భూప
ప్రకరంబులఁ [1]గూల్చి సింధురాజుఁ దునిమె నె
ట్లొకొ యతనికడిమి కుంభజు
నికి వారింపంగ రామి [2]నిక్కం బరయన్.

46. క. తనమాట నమ్మి సైంధవు
మొనకుం దెచ్చితిమి [1]గాక మున్నెఱిఁగిన నా
తని నింటఁ బెట్టి వత్తుము
మనసేనయు [2]నివ్విధమున మడియక [3]యుండున్.

47. క. మన మెంత [1]సెట్టిలమొ ఫ
ల్గునుపై నాతనికి నంత గూర్మి[2]గలిగె నే
మనఁగల దింక నతనిఁగొని
యని సేయుద మనుట కార్యమగునే మనకున్.

48. చ. [1]అన విని కర్ణుఁ డి ట్లనియె నగ్గురు దూఱఁగ నేల యాతఁ డో
[2]పినటుల పోరుఁ గాక నరుబీరము లావును నెక్కు డైన వా
ని [3]నుడుపవచ్చునే విధియ నేర్చు [4]విషం బిడి యిల్లు గాల్చి కా
[5]ననమున కేఁగఁ జేసి యొకనాశముఁ గంటిమె గొంతిసంతతిన్.

---

44. 1. కభేద్యంబుగ – వ. 2. నవ్వరుసన – వ 3. మదిం – వ. 4. జొరనిచ్చె – ప. వ.

45. 1. గూల్చె – వ. 2. నిక్కమె(మ) యరయన్ – ఊ. వ.

46. 1. గాని – వ. 2. నింతవట్టు – మ 3. యుండన్ – వ.

47. 1. చెట్టలమొ – జ. ద. ల; చెనటులమొ – పే. 2. మిగిలె – వ. 3. సేయుట – ప; సేయగ నుచితకార్య – ఐ.

48. 1. అనవుడు – ల. 2. పినగతి – వ. పీ. శ; పినయటు – ట. ప. బ ల. 3. నడప – అ 4. నెపం బిడి – హా. 5. ననముల నుండ జేసి – ఏ.

49 క. కావున మన[1]సైంధవునిఁ
దైవము తెగటార్చె [2]వంతఁ దలరి [3]మనమునం
జేవ సెడ నేల పోరం
[4]గా విధి [5]పంచినటు లయ్యెఁ [6]గడఁగన వలయున్.

50. క: అనునెడఁ బాండవసేనలు
మొనసి [1]కదియ నడచె నీదుమొనలుం దగ మా
ర్కొనియె నిటు లుభయబలములు
ననిమిషులకు వేడ్క [2]పుట్టునట్లుగఁ దాఁకెన్.

51. క. తురగము తురగముఁ గరి కరి
[1]నరుఁడు నరుఁడు దేరు తేరు నలిఁ దాఁకినయ
ప్పరుసఁదన మేమి సెప్పుదుఁ
బోరి మిడుఁగురులు [2]లెగసి కైదువులపొడి రాలెన్.

52. వ. అట్టియెడ నీకొడుకు సైంధవుని[1]చావునకు దుఃఖితుం డగుటఁ బ్రాణంబుల దెస నిరపేక్షుం డయి కడంగినం గని ద్రోణకృపకర్ణులు [2]వారింపం ద్రోచి తలకడచి దర్పప్రచండగతిం [3]బాండవసైన్యంబు సొచ్చి నిశితవివిధవిశిఖపరంపరలు పరగించినఁ జతురంగంబులయంగంబులు ధరం దొరఁగి చిక్కువడి మదకలమాతంగంబు గలంచినకమలాకరంబుచందం బయ్యె నప్పు డందుఁ జేయంగలబలుమగ లెల్ల నొక్కమొగిం గవిసి యమ్మహీపతిం బొదివిన నతండు భీమసేనుఁ బదిబాణంబులను నకులసహదేవద్రుపదవిరాటద్రౌపదేయుల మూఁడుమూఁడుమార్గణంబులను శిఖండిని నూటను ధృష్టద్యుమ్ను నెబ్బదింటను ధర్మపుత్రసాత్యకుల నైదైదమ్ములను ఘటోత్కచు నఱువది

49. 1. సైంధవు నని - అ. 2. నింత - ఊ. ణ. ద. ప. వ. 3. మనములం - ఐ. వ. 4. గావిధి యెటుపంచె నట్లు కడగన వలయున్ - స; గావిధి కృత మైన యట్లు గాక నరేంద్రా - ఎ. ఐ. 5. గతి దప్ప దనికి గడగనవలయున్ - ల. 6. గడవగ వశమే - అ. ఆ. గ. బ వ; గెలఁగఁగఁ దగునే - ఖ. వ. పీ. శ. ష.

50. 1. కదిసి - వ. 2. సేయు - బ. వ.

51. 1. నరు నరుడును - ర; నిరుని నర్కుడ - వ. 2. లెగసె - ఈ. ఝ. బ. వ లెసగ - డ.

52. 1. చావున దుఃఖితుం - బ. ర. 2. వారింప దలఁడచి - కొన్ని ప్రతులు. 3. బాండవ బలంబు మీద - ఝ. న.

నాలుగింటను నొప్పించి కేకయచేదిప్రముఖయోధ[4]వరుల ననేకసాయకంబుల [5]బెట్టు వఱిచి సింహనాదంబు సేసిన.

53. క. ఆధర్మనందనుఁడు స
క్రోధాత్ముం డగుచు నేసెఁ గోదండము ను
గ్రై ధరఁ దొరఁగఁగ [1]నాతఁ డ
బోధంబునఁ దేరిమీఁదఁ బొలుపఱి వ్రాలెన్.

54. తే. ఇట్లు [1]మూర్ఛిల్లుటయుఁ [2]గౌరవేశ్వరుండు
సచ్చె ననియెడు నెలుఁగులు శంఖకాహ
[3]ళారవంబులు సెలఁగఁ బ్రియంబు నొందె
వారిబలములు ద్రోణుఁ డేపారి కదిసె.

55. వ. అంత.

56. క. తెలివొంది [1]యుధిష్ఠిర నిలు
నిలు మని రథసము[2]నఁ దాఁకు నీమతుఁ గని యా
బల మేచిన నీబలముం
బెలుచ [3]నిగుడ నపుడు [4]రణము భీషణ మయ్యెన్.

57. వ. అనిన విని ధృతరాష్ట్రుం డట్టియెడ నాచార్యుం డెవ్విధంబున నరివధంబు [1]సేసె నిందలియందలి చేయంగల సైనికోత్తము [2]లెత్తెఱంగునం [3]బెనంగిరి [4]చెప్పు మనవుడు సంజయుం డిట్లను వ ట్లుభయబలంబులుఁ బురికొని [5]పోరుచు నుద్దండరయంబు మెఱసి యుధిష్ఠిరప్రముఖపాండవులును సైనే

---

4. వీరుల – వ. 5. బెండువఱిచి – ద. వ; బిట్టు పఱిచి – ల.

53. 1. నత డంభోధరమన – ద. ప. బ.

54. 1. మూర్ఛిల్లుటకు – ర. 2. గౌరవేంద్రు డపుడు – వ. 3. ళాదిరవములు – ల. వ.

56. 1. యుధిష్ఠిరు – ల, హ. 2. నదూకు – వ. 3. నిగుడు నపుడు – వ. 4. వోరు – ణ.

57. 1. బోనరించె – ఇ. 2. లెవ్విధంబునం – వ. 3. గడంగిరి – హ. 4. వివరింపు మనవుడు – ఊ. ఏ. 5. పోరుచుండ – ల.

యాదియాదవులును ద్రుపద[6]ప్రభృతిపాంచాలురును విరాటపురస్సరమాత్స్యులును [7]గుమారవర్గంబును మఱియు ననేకదండనాయకులును సాయకాసారంబు పరగించుచు భారద్వాజు [8]పై నడరిన నతం డత్యుదీర్ణుం డయి కర్ణుండు మొదలుగాఁ గలబలుమగ లిరుగెలంకుల సంరంభంబునం దఱుమ విజృంభించె నయ్యవసరంబున నెగసినధరణీపరాగంబు జనంబులచూడ్కులు నిగుడ నీక యుండె నాలోనన శుండాలసుభట[9]ఘోటకంబులయంగంబులం గ్రమ్మ్రదెంచురుధిరం బది యడంచిన నమ్మొనలకడంక రెట్టించె నప్పుడు కౌరవులదిక్కున ఘూకసృగాలరవంబులు సెలంగ వారది సరకు[10]సేయక [11]సమరోన్మత్తులై నెత్తురుటేఱులు వాఱఁ గేలి సలిపి రాసమయంబునఁ గేకయరథికులను ధృష్టద్యుమ్నతనయులును లోనగువారిం బెక్కండ్ర నక్కుంభసంభవుం[12]డు నుఱిపియు మఱియుఁ బలువురఁ బఱపియుఁ గడిమి [13]నెఱపం బ్రతాపశీలుం డగుశిబి సాహసరసికుం డై.

58. క. [1]ఉరవడిఁ దాఁకుటయును బది
శరము లతనిమేనఁ గ్రుచ్చె సాయకగురుఁ డ
[2]చ్చెరు వగుమగఁటిమి నతఁ డు
ద్ధురుఁ డై తత్సూతు[3]శిరము ద్రుంచెం బెలుచన్.

59. తే. త్రుంచి తోడన ముప్పదితూపు లతని
[1]యొడల నాటుడు హయములమెడలు సూతు
గళము నజ్జనపతికుత్తుకయును దునిమె
ఘోరభల్లపట్కమ్మునఁ గుంభభవుఁడు.

60. వ. [1]అప్పుడు.

---

6. ప్రముఖ – వ. 7. గురువర్గంబును – వ. 8. పయింబడిన – ల. 9. ఘోటక శరీరంబుల – ఇ. 10. గొనక – గ. జ. వ. 11. సమరోత్సాహోన్మత్తులై – ర. 12. దుడిపియు – వ. 13. నెరపిన – వ.

58. 1. ఉరువడి – ద. న. ప. బ. ర. వ. 2. చ్చెరువుగ – ర. 3. రథము – వ.

59, 1. తొడల – వ.

60. 1. పై వచనము కొన్ని ప్రతులలో లేదు.

61. తే. భానుమంతునిఁ జంపినపగ మనమునఁ
బెట్టికొని యుండి యాతని పట్టి భీము
సేనుపై [1]వడిఁ గాళింగసేనతోడ
గవిసి నారాచధారలఁ గప్పి యొప్పె.

62. క. కినిసి బకమర్దనుఁడు వెసఁ
దన[1]యరదము వానితేరు దాఁక బఱపి యా
తనిమీఁద నుఱికి [2]క్రుమ్మెం
గనుకని నెంపపొడి సెదరఁ గాలం [3]గేలన్.

### -: భీమసేనుఁడు దుర్మదదుష్కర్ణులం జంపుట :-

సం 7_130_22

63. వ. అమ్మహోగ్రసముద్ధతిం జూచి పాంచాలసైనికులు సింహనాదంబులు సేసిన సహింపక సూతసుతుండును దత్సోదరులును నవ్వీరుం బొదివిన [1]నతం డద్భుతంబుగా [2]ధ్రువునరదంబుమీఁదికి లంఘించి [3]వానిఁ బిడికిటి[4]పోటునఁ జావం బొడిచి [5]జయరాతునిపైఁ గవిసి యాతని నతనిసూతునిఁ గాళ్లు లిరుగేలం బట్టి [6]బెట్టిలపై వ్రేసి గతాసులం జేసిన నలిగి కర్ణుండు శక్తి వైవ మలంగి వెరవున నొడిసికొని దానిన యవ్వడముడి యతని[7]పై వైచినం గని గాంధారమహీవల్లభుండు భల్లంబున నడుమన నఱకె నంత గురుకుమారు లమ్మారుతిం జుట్టుముట్టి [8]విశిఖంబులు నిగిడించిన గోపించి [9]దుర్మదునితేరి కురవడించి తురంగంబులం బొరివుచ్చి సారథిం జదిపిన

---

61. 1. వెస - వ; బడి - స. న.

62. 1. తేరును వానితేరు - ప. బ. ర. ల. హా. 2. క్రమ్మెం - వ. శ. 3. చేతన్ - ఆ. ఠ. ద. బ. ల.

63. 1. నంతధ్రువు - కొన్ని ప్రతులు. 2. ధ్రుమునరదం - స. పెక్కు ప్రతులు. 3. మతండు వాని - కొన్ని ప్రతులు. 4. తోడన చావం - కొన్ని ప్రతులు. 5. జయంతుని - న. య. ర. 6. బెట్టిలతో నేసి, బెట్టిలవ్రేసి - స; బెట్టిలలో వ్రేసి - కొన్ని ప్రతులు. 7. వైచినం - ద. న. హ. 8 విశిఖ శిఖలం గోపించి, గుప్పినవిశిఖంబులు గుదియించినఁ గోపించి-స; విశిఖశిఖలం గుందించినం - కొన్ని ప్రతులు; విశిఖశిఖలం గప్పినం- ఐ. జొ; విశిఖంబు లడరించిన - మ; విశిఖశిఖ లడరించిన - ఝ. న. 9. దుష్ప్రహుని - కొన్ని ప్రతులు.

న్నాతండు దుష్కర్ణుస్యందనం బెక్కె నయ్యిరువురు నప్పాండుతనయు తనువున మెఱుంగుటమ్ములు గిఱి[10]గొలుపం గిట్టి యారథంబు గూల నవ లీలం దన్ని దుర్యోధనద్రౌణికృపకృతవర్మకర్ణశల్యశాల్వాదులు సూచుచుండ నక్కుమారుల నిద్దఱం గాల నొక్కనిం గేల నొక్కనింగా సమయించె నివ్విధంబునం జిత్రవధవిహారంబున విజృంభించు నాభీమసేనుం జూచి రుద్రుండు రథసోద్రేకంబునం ఖాండవేయులకుఁ దోడ్పడం జనుదెంచెం [11]గాక మానవు లిట్టివారునుం గలరే యనుచు నీవారెల్లను [12]వెఱచఱచి యిద్ద ఱొక్కతెరువునం బోకపఱచి రక్కుమారకంఠీరవుం డుక్కునం దమసేనదిక్కు సూచి యెఱ్ఱవిరిదామరలం దెగడుకన్నులం గౌంతేయా గ్రజు నుపలక్షించి కేలుమొగిచి ఫాలంబునం జేర్చునప్పుడు తన్మూర్తినతం డును నకులసహదేవద్రుపదవిరాటులును దేఱిచూడ శంకించి మాఱుమొగంబు లతో నగ్గించి రాసమయంబున.

64. క. కడువడి గురుఁ డనిలజుపై
నడరినరాధాతనూభవాదులు దోడై
కడఁగుటయుఁ గనుంగొని నీ
కొడుకుగమియుఁ [1] గదిసె నుదితకోపస్ఫురణన్.

65. తే. వారిఁ దలపడి పోరిరి దారుణముగ
ధర్మసుతుఁడును గవలు నుద్దండవృత్తిఁ
దఱుమ ద్రుపదవిరాటసాత్యకులు మఱియుఁ
జేయఁ గలయట్టి మేదినీనాయకులును.

66. వ. అయ్యవసరంబున సోమదత్తుండు దనకు సాత్యకి సన్నిహితుం డగుటయు నతనితో ని ట్లనుఁ బ్రాయోపవిష్టుం డగు భూరి[1]శ్రవుం జంపి తది బోయ చం[2]దంబు గాక [3]రాజధర్మం బగునే యీ రేయి నీవు నాచేత బ్రదికిపోవుదా?

---

10. కొలుపం – బ. వ. పీ. హ. 11. గావలయు మానవు – వ. 12. వెరచి పరచి రక్కుమార – వ.

64. 1. గవిసె – కొన్ని ప్రతులు.

66. 1. శ్రవసుం – కొన్ని ప్రతులు. 2. దం బగుగాక – ఈ. 3. రాచధర్మం బగునే – శ. ప. పెక్కు ప్రతులు.

డవే యని పలికి సింహనాదంబు సేసి శంఖం[4]బు పూరించిన న్నాశైనేయుఁడు భూరిశ్ర[5]వుండు సచ్చుట యొప్పదేని [6]నీ వొప్పెడునట్లు సంపెద నిట్లు రమ్ము [7]శలుని[8]చా వొప్పు నొప్పదని యుగ్గడింప [9]వది యేమి నీ [10]కెట్లయినం గాని కాదని భంగించె నిత్తెఱంగున నొండొరుల నోనాడి యేటులాడం దొడంగి రప్పుడు నీకొడుకు ఘోటకస్యందనసందోహసమేతంబుగా నక్కొఱవునకుం దోడ్పడియె శకునియుఁ దనబలంబునుం దానును నాతనిం గూడుకొనియె [11]నవ్విధంబునం బలువు రొక్కనిపైఁ గవిసినం గని ధృష్టద్యుమ్నుండు భూరిసైన్యసమేతుం డై వారల నెదుర్కొ[12]నం బోరు ఘోరం బయ్యె నట్టియెడ.

67. తే. సోమదత్తుండు తొమ్మిది సునిశితాస్త్ర
ములఁ శినిప్రభు నేసిన నలిగి [1]యతఁడు
నతని [2]నన్నియమ్ములన మూర్ఛితునిఁ జేయ
రథము దొలఁగంగఁ దోలె సారథి [3]గలంగి.

68. మ. కని ద్రోణాత్మజుఁ డేచి సాత్యకిభుజాగర్వంబు [1]మాన్పింతుఁ బొ
మ్మని [2]పోఁ బో నడుమన్ ఘటోత్కచుఁడు ఘోరాకారదైత్యవ్రజం
బును దానుం బటుభంగిఁ దాఁకుటయు నీపుత్త్రుండుఁ గర్ణుండుఁ ద
క్కినవారున్ [3]వెలి వానితోడియనికిం [4]గ్రిడించి రుర్వీశ్వరా.

---

4. బొత్తిన - పెక్కు ప్రతులు. 5. వుని జంపుట - ఐ క. ఞ. బ. 6. నొప్పెడు నట్లు - కొన్ని ప్రతులు 7. సౌభద్రుని - ఉ ఒ ఠ. వ. ఇచ్చట మూలమున శలుఁడనియే యున్నది. "హతో భూరిశ్రవా వీర స్తవపుత్రో మహారథః। శల శ్చైవ మహారాజ భ్రాతృవ్యసనకర్శితః - 7-156-15. చిత్రశాలాప్రతి. చావొప్పదని - కొన్ని ప్రతులు. 9. ఐది - కొన్ని ప్రతులు. 10. కట్లయి - కొన్ని ప్రతులు. 11. నివ్వి- కొన్ని ప్రతులు. 12. నినంబోరు - పెక్కు ప్రతులు.

67. 1. యాత డతని - పెక్కు ప్రతులు. 2. బదిసాయకముల మూర్ఛ - స. పెక్కు ప్రతులు 3. గడం (ణం) గి - కొన్ని ప్రతులు.

68. 1. మానింతు - అ. ఆ. క. ఝ. ఞ; మాయింతు - ఏ. గ. న. వ. 2. పోగా - ఓ. గ: పోబో గని యాఘటో - వ; పోపో నడుమన్ - న. శ. ష. 3. బెలివారి తోడి - స; దగ వాని తోడి - ర; వెరఁ౦ది కుంది - న. 4. గేడించి - పెక్కు ప్రతులు

69. వ. అట్టు సంధ్యాసమయసంవర్ధితబలుం డగు నప్పూర్వగీర్వాణునికొత్తల
కోర్వక మేటిమగ లెల్లం [1]దొలంగిన.

70. క. గురుసుతుఁ డొక్కరుఁడును సు
స్థిరుఁ డై తద్బాణ[1]నిహతిఁ దెరలక యతిని
ష్ఠుర[2]నారాచంబులు [3]పది
యురమున [4]నాటింప దానవోత్తముఁ డలుకన్.

71. క. వడిఁ జక్రంబున వైచిన
నడుమన గురు[1]నందనుండు నఱకెం బుణ్యుం
బెడలిన నరుసంకల్పము
వడువున నది వమ్మ గాఁగ [2]వసుధాధీశా.

-: అంజనపర్వుం డశ్వత్థామతో యుద్ధంబు సేసి చచ్చుట :-

సం. 7-131-44

72. వ. అప్పు డద్దనుజునితనయుం డంజనపర్వుం డశ్వత్థామం దలపడి బలుతూపులం
బొదివిన [1]బెదరక యతం డయ్యసుర[2]వీరునివిల్లు ద్రుంచి విరథుం జేయు
టయు వాఁడు కరవాలంబు [3]గొనినం దునిమె గద వైచిన దుమురు సేసె
నింగి కెగసి [4]మ్రోఁగుచుం బాషాణవర్షంబు [5]గురియ నదియును వారించి
యమ్మాయావిమేన మేఘంబున గిఱికొను తరణికిరణంబులం గ్రేణిసేయు
పటుబాణంబుల నిగిడించె [6]మగిడి యొండురథంబున [7]నరుదెంచి[8]నఁ దల
ద్రెంచె నిట్లు గురుపుత్రుం[9]డు వానిం బరిమార్చి పేర్చి పాండవ[10]బలంబులఁ

69. 1. గలంగిన - ఏ. ఖ.

70. 1. హతికిదెర - ఇ. ఝ; వితతిదెర - ద. వ. 2. తరబాణంబులు - ఈ. 3. వడి - కొన్ని ప్రతులు. 4. నాటుటయు దాన - ఝ.

71. 1. సుతుడు దాని నరకె - ఈ. 2. వసుధం గూలెన్ - మ.

72. 1. బదరి - పెక్కు ప్రతులు. 2. వరుని - పెక్కు ప్రతులు; వల్లభు - కొన్ని ప్రతులు. 3. వైచినం - ల. 4. పొంగుచుం - ఓ. 5. గురిసిన్న - పెక్కు ప్రతులు; గురియించి సైన్యంబు సమయింపం దొడంగిన నమ్మాయావి - ఏ. 6. మగుడి - పెక్కు ప్రతులు. 7. కరుదెంచి - పెక్కు ప్రతులు. 8. న వాని తల - బ. 9. డయ్యసుర కుమారుం - ట. ప. 10. సైన్యంబు సమయింపదొడం - పెక్కు ప్రతులు.

బరిమార్పం దొడంగినం [11]గని కడంగి హిడింబానందనుండు నిలు నిలు నాబారిం బడి [12]యెందుఁబో వచ్చు ననవుడు నారథికుం డతని [13]నవలోకించి.

73. ఆ. వలదు [1]రన్న పిన్నవాఁడవు దండ్రి నే
నకట నిన్ను జూచి [2]యలుగ రాదు
వెనఁగు మొరులతోడ ననవుడుఁ బుత్ర[3]శో
కాభితప్తుఁ డైన యతఁడు [4]గనలి.

74 క. ఎక్కడి తండ్రివి [1]నీ వే
నక్కొంతేయులకుఁ గొడుక నై పగతుర పే
రుక్కు సహింతునె తనయుం
గ్రక్కించెద నిపుడ పట్టి కండలు దిందున్.

75. క. అని [1]పలికి యిరుసులంతలు
సునిసితబాణమ్ము లేయుచుం దఱిమిన ద్రో
ణునికొడుకు వాని నన్నిటిఁ
దునుమ నసురమాయఁ బెఱిగి [2]దుర్దాంతగతిన్.

76. క. గిరి యై పఱతేర నశని
శరమును మేఘత్వ మొంది సాయకవృష్టిం
గురిసినఁ బవనాస్త్రంబును
బరువడి నిగిడించి [1]గురునిపట్టి దెరల్చెన్.

---

11. గని - పెక్కు ప్రతులలో లేదు. గని కడంగి - కొన్ని ప్రతులలో లేదు.
12. తెందు - కొన్ని ప్రతులు. 13. నాలోకించి - పెక్కు ప్రతులు.

73. 1. రోరి - న. య; వలదు - ఇ. ఓ. 2. యలుక రాదు - ర. ల. స. హా. పెక్కు ప్రతులు. 3. శోకాగ్ని - ద. వ. 4. నలిగి - కొన్ని ప్రతులు.

74. 1. వినువే - వ.

75. 1. పలుకుచు దానవపతి - పీ. స. దుర్వారగతిన్ - ఔ; దుర్వారుం డై - న.

76. 1. ద్రోణుపట్టి - కొన్ని ప్రతులు.

77. సీ. హైడింబుఁ డల్గి యుగ్రాకృతిఁ గవిసిన దనుజగణంబు మాతంగతురగ
రథనివహంబుతో రారాజుమొన లెల్ల [1]నొక్కెత్తుగాఁ [2]బేల్చి యురవడింప
నన్నరనాథుండు [3]విన్నఁబోయిన గురుతనయుండు నీకు నీయనికి నేమి
పని నీవు [4]సంభమింపకుము దానవుల నక్కడిమానవులను [5]వ్రేల్మిడి నడంతు

ఆ. ననిన సంతసిల్లి యతఁడు సౌబలుఁ జూచి
వీరె ద్రౌణిబాణదారితాంగు
లైరి పాండుసుతులు దేరిగములతోడ
సత్వరముగ [6]నరిగి జయము గొనుము.

78. వ. అని యవ్వలను జూపి కృపకృతవర్మకర్ణవృషసేనులను దుశ్శాసనప్రముఖు
లైనకొందఱు దమ్ములను నిరూపించి వీరును నీవును గూడుకొని కవియుం
డని పనిచిన నతండును బింకంబుతోడం బోయె నశ్వత్థామభీమనందనుల
[1]సంగ్రామంబు భీమం బయ్యె నట్టియెడ నాఘటోత్కచుండు.

79. మ. పటుబాణాహతి ద్రౌణియంగము చలింపం జేసి తచ్చాపము
త్కటవేగంబునఁ [1]ద్రుంచినం గినిసి యాతం డొండువి ల్లెత్తి యు
ద్భటబాహాబలశౌర్యముల్ నెఱపె నాదైత్యుండు సైన్యంబు నొ
చ్చుటయుం జచ్చుటయుఁ మహీపతికి మెచ్చుం బ్రీతియుం జేయఁగన్.

80. వ. ఇట్లసురబలంబు నశ్వత్థామ సించి చెండాడం బాండవ [1]బలంబులు దర్పం
బేది మాఱ్పెట్ట లేక చూచుచుండ నుద్దండపరాక్రముం డగు నాఘటో
త్కచుండు [2]దర్పంబున నెక్కటెక్కటి తలపడి పరిఘంబున వైచినం
బట్టుకొని యతండు [3]దానిన యద్దానవు పై వైచుటయు వాఁడు

---

77. 1. నువ్వెత్తుగా - ఆ. ట. వ. బ. పీ. స. 2. బేర్చి - అ. ఆ. ఇ. ఈ. ఉ. పెక్కు ప్రతులు. 3. చిన్నబోయిన - పెక్కు ప్రతులు. 4. సంశయింపకుము - ఏ. వ. 5. ద్రుంతు - కొన్ని ప్రతులు. 6. నడిరి - పెక్కు ప్రతులు.

78. 1. పరాక్రమంబు - ఆ. ఆ. టి. వ. బ.

79. 1. దున్మినన్ - ద. ప. వ.

80. 1. సైనికులు - పెక్కు ప్రతులు. 2. దర్పంబున - పెక్కు ప్రతులలో లేదు. 3. దాన నద్దానవుని - పెక్కు ప్రతులు.

దొలంగ నుఱికి ద్రుపదనందనస్యందనంబునకుం బోయె నయ్యుగ్రసాధనం బతనితురంగసా[4]రథిరథంబుల రూపడంచిన.

81. ఆ. ఒక్కతేరిమీఁద నుండి ధృష్టద్యుమ్న
భీమసేనసుతులు పెనఁగి రస్త్ర
గురుతనూజుమీఁకఁ దెరలక యంత ను
ద్దామసేనతోడ భీముఁ డడరె

82. వ. అప్పు డశ్వత్థామ నవ్వుచు నమ్మువ్వురం గ్రొవ్వఱ నేసి [1]భాసమాన మార్గ ణంబులు నిగిడించిన.

83. మ. భటగాత్రంబుల ఘోటకాంగముల శుంభత్కుంభికాయంబులం
జటులస్యందన ఖండసంచయములన్ సంగ్రామరంగంబు గ
ప్పుట చూడన్ వెఱఁగయ్యె నబ్బలములుం బో[81]కేచి క్రమ్మంగ నె
త్తుటఁ దేల్చెం బోరి[2]మార్చె నాతఁ [3]డడరం ద్రుంచెన్ [4]మథించెం గడున్.

84. వ. ఇట్లేకాక్షౌహిణీబలత్రయం బాపాదించి యాతపత్ర [1]శతపత్త్రంబును జామ రమరాళంబును గేశశైవాలంబును వాయుధమీనంబును మాంసమేదో మస్తిష్కపంకంబును రక్తజలోద్రిక్తంబును నగునదీప్రవాహంబు నుత్పా దించె నప్పుడు దర్పంబున సురథుండును శత్రుంజయుండును బలానీకుండును [2]బృషధ్రుండును జయానీకుండును జయుఁడును జంద్రసేనుండును జండ రయంబున గదిసి బాణంబులు వరగించిన నప్పాంచాలకుమారుల నమానుష విక్రమంబున సమయించినం గోపించి కుంతిభోజతనూజు లొక్కపెట్ట పదు మువ్వు [3]రతనిం బొదివిన బదుమూఁడు మేటితూపులం గీటడంచి కెరలి జము చందంబున గర్జిల్లి ఘటోత్కచుం గాలదండంబుఁ బోని కోలం దేరిపైఁ ద్రెళ్ళి

4. రక్తసించితంబుగా రథంబు రూపణంచిన – అ. హొ. ట.

82. 1. భానుసమానమార్గణవర్గంబులు – హ.

83. 1. కేచిసన్ జేర్చె నెత్తుట – స. 2. మార్చె – కొన్ని ప్రతులు. 3. డదయన్ – పెక్కుప్రతులు. 4. గడున్నుగ్రుడై – ఉ. ర.

84. 1. పుండరీకంబులును – ఇ. ద. 2. బృధుండును – శ. ష. పెక్కు ప్రతులు. మూలము నందు పృషధ్రుఁ డనియేయున్నది. "జఘానస పృషధ్రంచ చంద్రసేనం చ మారిష" 7–158–83. చిత్రశాలాప్రతి. 3. రుద్రన్ను బొదివిన – పెక్కు ప్రతులు.

మ్మూర్ఛిల్ల నేసిన నోసరిల నయ్యరదంబు దోడన ధృష్టద్యుమ్నుండు గొని పోవుటయుఁ బొంగి సింగంబుచాడ్పున గర్జిల్లిన నిర్జరు లగ్గురునందను నగ్గించి రంతయుం గనుంగొని.

85. ఆ. పాండవాగ్రజుండు పవనాత్మజునిఁ గూడి
తలిమి సాత్యకియును దాను [1]గవిసె
నంత మూర్ఛదేఱి హైడింబుఁ డొక్కతే
రనువుగాఁగఁ జేసికొని కడంగె.

86. వ. తోడన ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినం దత్సైన్యంబు లొక్క మొగిన [1]మొనయుటయును మనమూకలును సోమదత్తబాహ్లికపురస్సరంబుగా నురవడించిన సందడికయ్యం బయ్యె నందు [2]సంజచీకటి చూపునకుఁ జొరవ యీకున్నను సైనికనికరవివిధాభరణమణికిరణకలాపంబులుఁ జర్మవర్మాతపత్ర[3]కేతుకీలితరత్న రశ్మిజాలంబులు నాలోకనంబు నాపాదించె న ట్లిరువాఁగును గలయ బెరసి పోరు నప్పుడు.

-: భీమసేనునిచేత బాహ్లికుఁడు సచ్చుట :-

సం. 7_152_8

87. క. శినివరుఁడు సోమదత్తుఁడు
బెనఁగఁగ దోడ్పడియె వచ్చి భీముఁడు గడఁకం
దనమఱఁదికి నక్కారవుఁ
డెన[1]యే యని [2]బిరుదులాడి యేత్తెఱ నొంచెన్.

88. వ. అట్టియెడ.

85. 1. గవిసి రంత - పెక్కు తాళపత్రప్రతులు.

86. 1. గవియుటయు, దరుముటయు, నడరుటయు - అని పాఠములు. 2. సందెచీకటి- ఉ. ఏ. త; సంధ్యాచీకటి - రా. ల. హా., కొన్ని ప్రతులు. 3. కేతుకిరీటకీలిత - ఊ. ఏ; కేయూరకిరీట - ఒ.

87. 1. బిరుదులతోడి యనికి నేత్తెఱ నోర్చెన్ - శ. వ. పెక్కు ప్రతులు. 2. బిరుదులాడి- ఓ. స; బిరుదువాడి - వా.

89. క. అనలశిఖ వోని నారస
మున సాత్యకి [1]యేయు నెడను ముద్గరమున [2]భీ
మునికొడుకు వైచె రెంటం
దునువున నొవ్వడరి సోమదత్తుఁడు సోలన్.

90. చ. తనయుఁడు మూర్ఛవోయిన నుదగ్రత బాహ్లికుఁ డచ్యుతానుజ
[1]న్మని దలపడ్డ నాతనికి మించి వృకోదరుఁ డన్నరేంద్రు నే
సిన నతఁ డుగ్రశక్తి [2]వయిచెన్ [3]మెయి నాటుడు సోలి యంతలో
నన తెలివొంది ముద్గరమునం బవనాత్మజుఁ డేచి వైచినన్.

91. క. తల[1]వ్రయ్యలైన నిష్ఠుర
కులి[2]శహతిం బగిలి కూలుకులపర్వతముం
దలపించుచుఁ గురువృద్ధుం
డిలఁ గూలెం బ్రతిబలంబు లే పారంగన్.

92. వ. అయ్యవసరంబున [1]దశరథసుతసన్నిభుం బగుభవత్కుమారదశకం బా కిమ్మీ
రవైరిం బొదువుటయు దశనిశితబాణంబులం బ్రాణంబులు గొనియెఁ
గర్ణానుజుం డగు[2]వృకరథుండు గడంగి వచ్చినం బోరివుచ్చె సౌబలసోదరులు
పన్నిరువురు బరవసంబు సేసినం బడ నేసె నిట్లు పటుపరాక్రమంబునం బేర్చిన
భీమసేనుమీఁద శూరసేనవసాతి మాళవత్రిగర్త[3]బాహ్లికప్రముఖంబు లగు
దేశంబులబలంబు[4]లు బలువిడిం గవిసినం గని కౌంతేయాగ్రజుండు సైన్యసం

---

89. 1. యేయునపుడు – కొన్ని ప్రతులు 2. సోమదత్తునిమీద పరిఘ ప్రయోగించిన వాడు భీమసేనుఁ డని మూలము.

90. 1. న్మని దలపడ్డ......మించివృకో – ర. శ. ప. స. కొన్ని ప్రతులు. అనుజన్మి యను రూపము క్రొత్తగా తోచుచున్నది. గుణి, ధని - మున్నగు రూపముల వంటిదిగా నున్నది 2. మెయి చేకొని – అ. ఆ. ఓ. జ. స. కొన్ని ప్రతులు.

91. 1. వ్రయ్యలయ్యె – ఈ. ట. ద; వ్రక్కలైన – వ 2. శాహతి బగిలి కూలు – వ; శనిహతి బగిలి – కొన్ని ప్రతులు.

92. 1. దశవ:న (ముఖ) సన్నిభం బగు – ఊ. ఏ. ఝ. 2. వృషరథుడు. వృషధరుడు. వృషసేనుడు – అని పాఠములు. ఇచ్చట మూలమునందు వృకరథుఁడు అనియే కలదు. "తతో వృకరథో నామ భ్రాతా కర్ణస్య విశ్రుతః" 7-157-21 చిత్రశాలాప్రతి. 3. బ్రాహ్లిక – కొన్ని పతులలో లేదు. 4. లురవడిం గవిసిన – కొన్ని ప్రతులు.

శ్వాసనమేతంబుగా నురవడించి భుజాటోపంబు సూపిన నవి మడిసియుఁ జడిసియు జిక్కువడియు నుక్కుమడిగియు వెఱంగుపడి చూచుచుండ నాచార్యుని దుర్యోధనుండు పురికొల్పిన నతం డుత్సాహదీప్తుం డై యాధర్మతనయుఁ దాఁకి వాయవ్యయామ్య వారుణాగ్నేయత్వాష్ట్ర సావిత్రంబు లగు సాయకంబులు వరుస నేయ నయ్యయ్యస్త్రంబుల నవ్విభుండు [5]ప్రత్యస్త్రంబుల వారించిన నతం డైంద్రాస్త్రంబున నిజప్రతిజ్ఞ నెఱపం జూచిన నదియు నట్ల యడంగుటయుం గోపించి సకలభూతభయంకరం బగు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించిన నమ్మహీపతియు నమ్మహనీయాస్త్రంబునన [6]నమయించె నంత ధృష్టద్యుమ్నుం డతని కడ్డపడిన నారథికుతోడి [7]యనికిం గ్రీడించి కుంభసంభవుండు.

93. చ. ద్రుపదుని సేన [1]పై నడరి [2]తోలినఁ జూచి వృకోదరుండు దే
వపతిసుతుండుఁ దాఁకి యనివారణ నగ్గురు నొంప నేచి యు
గ్రపు[3]వడి మాత్స్యకేకయముఖం బగు పాండవసైన్య మొక్కపె
ట్ట పరగి నీబలంబులకడంక యడంచి మదించి పేర్చినన్.

94. వ. కనుంగొని కౌరవేశ్వరుండు కర్ణుని కి ట్లనియె.

95. క. పాండవపాంచాలాదులు
గండుమిగిలి బెట్టు దఱుమఁ గౌరవబల మొం
డొండ కలంగెడు [1]నీదగు
దండితనము సూపి కావఁదగుతఱి వచ్చెన్.

96. వ. అనవుడు.

97. శా. చంపం జాలుదు నేన్యొకండన భుజాశక్తిన్ నరుఁ వెండి మ
ర్దింపం జుల్కన భీమముఖ్యుల భవత్తేజంబు రాజ్యంబుఁ బా

---

5. ప్రత్యస్త్రంబుల–పెక్కు ప్రతులలో లేదు. 6. మాన్చె, వారించె – అని పాఠములు. 7. పోరికి – కొన్ని ప్రతులు.

93. 1. పైకడరి – వ. 2. త్రోచిన – ఖ. డ. వ. 3. గతి మాత్స్య – శ. ష. కొన్ని ప్రతులు.

95. 1. నదె నీదండితనము – ఖ. చ. వ. శ. ష. సూ.

లింపం బూనిన యేను గల్గఁగ రిపు ల్జృంభింతురే చూడు నా
తెంపుం బెంపు[1]ను నంచుఁ గర్ణుఁడు మహోద్దీర్ఘాకృతిం బొల్చినన్.

-: కృపాచార్యుండు గర్ణు నుపాలంభించుట :-

సం 7_118_12

98. వ. కనుంగొని కృపాచార్యుం డలంతినవ్వుతో నతని కి ట్లనియె.

99. చ. అగు నగు మేలుమేలు మనుజాధిపుఁడుం మహి యేలుమాటల
న్మగఁటిమి యిమ్మెయిం నెఱపినం జెడుఁ బాండుతనూజకోటియుం
దగు మును ఘోషయాత్రను బదంపడి గోగ్రహణంబు నందుఁ బే
రు గొనిన నీకు ని ట్లనుట [1]క్రొవ్వులు దక్కుము సాలు నిన్నియున్.

100. వ. అని వెండియు.

101. క. నిన్నును బాండుతనూజుల
నెన్నండును బోరఁ జూచి యెఱుఁగని వారిం
గన్నట్లు [1]వలుక నేటికి
[2]నిన్ని నెనఁటిరజ్జు లనికి నివి దోడ్పడునే.

102. క. క్రీడికి మును మన మందఱు
నోడు టెఱుఁగు దన్నలును ఘటోత్కచుఁడుఁ దగం
దోడుపడ బంధునృపతులుఁ
గూడి నడవ మనకు గెలుపుగొన నెట్టు లగున్.

103. చ. అనవుడుఁ గర్ణుఁ [1]డిట్టులను నాడినయంతయుఁ జేయఁ జాలుబం
టున కెటులన్న నేమగుఁ గడుం బెలుచం మును ప్రమోసి కాదె దృ

---

97. 1. నటంచు - కొన్ని ప్రతులు.

99. 1. క్రొవ్విన పలుకులు సాలు - వీ; క్రొవ్వులు పల్కకు సాలు - కొన్ని ప్రతులు.

101. 1. వలుకు దేటికి - కొన్ని ప్రతులు. 2. నెన్నగ నీరజ్జు లనికి - వ. వీ. స.

103. 1. డిట్టు లను - అ. ఐ. జ. ద; డి ట్లనియె - వా. కొన్ని ప్రతులు.

ష్టి నిగుడఁజేయు నంబుదము సెల్లదు నీపలు కింతపట్టు సైఁ
పన తగునింక నేమనినఁ బాఱుఁడ నాలుక గోయుదుం జుమీ.

104. వ. అని పలికి మఱియును.

105. క. నరు నద్దెసఁ గలవారిని
గురుబల ముబ్బు సెడఁ[1]బొగడి కొఱకొఱగాఁగఁ
గురుని గురుతనయు మద్రే
శ్వరునను నేమిటికిఁ గానివారిం [2]జేయన్.

106. క. అని మామఁ బలుకుపలుకులు
విని యశ్వత్థామ క్రోధవివశుం డయి గ్ర
క్కున వాలు వెఱికికొని క
ర్ణుని[1]దెసకుం గవియ భూవరుం డెడసొచ్చెన్.

107. ఆ. నృపతితోడఁ గూడి కృపుడును నెడసొచ్చె
వార లతనిఁ బట్టి వలదు రోష
ముడుగవలయు ననిన నుగ్రత నాతఁడు
పెనఁగఁ గర్ణుఁ డిట్టు లనియెఁ గనలి.

108. క. [1]విడు విడు మాతం డిమ్మెయి
నడిచిపడఁగ నేల పట్టె దవనీశ్వర నీ
వుడిపెడుతెఱఁగున [2]నాబిరు
దుడుగునె నాచేయిదాఁకి యుడిగినభంగిన్.

109. క. అనుడుఁ గృపాచార్యుం డి
జ్జనపతికిం గాఁగ నేను సైరిం[1]చిన నే

---

105. 1. బొగడ గోరె దెపుడుతా - కొన్ని ప్రతులు; బొగడి గొనకొని యిచటన్ - న; బొగ(డు)కొనె నిప్పుడు - శ. కొన్ని ప్రతులు. 2. జేసెన్ - శ. ష. పెక్కు ప్రతులు.

106. 1. మీదం గవియ - కొన్ని ప్రతులు.

108. 1. విడువు విడువు వాడిమ్మెయి - వ. 2. నాతం డుడుగునె - ల.

109. 1. చితి నేమని - ఇ. ఉ. ఊ. ఐ. ర. ల. హ.

మని పలికితేని నీకుం
[2]జనియెం బొమ్మింక వలదు సంభ్రమ మనియెన్.

110. వ. అప్పు డక్కురుపతి గురుపుత్రు నుద్దేశించి.

111. క. గురుఁడును నీవును మద్రే
శ్వరుఁడును గర్ణుండుఁ గృపుఁడు సౌబలుఁడు ననుఁ
ధర యేలింపఁగ నున్నా
రరు మీకుం దగునె [1]సంగరములోఁ గలఁగన్.

112. క. క్షమియింపు మనుడు నతఁ [1]డురు
శమ మొందిన గర్ణుఁడుం బ్రశాంతుం డై వి
క్రమకేలి సలుపఁ బ్రతినై
న్యము దెస మొగ మయ్యెఁ బటుగుణధ్వని సెలఁగన్.

113. వ. ఇట్లు గడంగినం బ్రత్యర్థి పార్థివు లయ్యోధవరు నాలోకించి పాండవులకుఁ బాటిల్లిన యనర్థంబుల కెల్లను మూలంబు వీఁడ కాఁడే వీనిం బొదువుఁడు [1]పోనీకుఁడు పడవైవుం డనుచుఁ దలపడిన నాసూతసూనుఁడు నిజనామాంకితంబు లగునారాచంబుల నన్నరపతులఁ గరుల నరులఁ దురంగంబుల నరదంబుల రూపుమాపి యేపునఁ దదీయాంగంబులు రుధిరంబున మునుంగునట్లు సేసినం జూచి సవ్యసాచి సాయకజాలంబులు [2]నిగిడించుచుం గవిసిన నతండు మూఁడుమార్గణంబు[3]లు దన తనువునఁ జొనుపుటయుం గినిసి యక్కిరీటి ముప్పదిశరంబుల నొప్పించి భుజశిఖరంబున బలునారసంబులు నాఁటించినం జేతివిల్లు వడియెం బడుటకుఁ దలంకక యక్కర్ణుం డాక్షణంబ విల్లుపుచ్చుకొని విప్పచ్చుండు [4]వెడంగుపడు నట్టి వేగంబున వివిధవిశిఖంబులు నిగిడించిన.

---

2. జనియెం బొమ్మెలరిత్త జగడము మనకున్ - న. య.

111. 1. సంభ్రమంబున - ఉ. ర.

112. 1. డుపశమ్ము మొంది - ఇ. ఓ. ఘ. శ. ష.

113. 1. పోనీక పడవైవుడు - పీ. శ. ష; పొదివి పడవైవుడు - ర. 2. గవియించుచు - పెక్కు ప్రతులు. 3. లతనితనువున - పెక్కు ప్రతులు. 4. వెరగుపడునట్టి - కొన్ని ప్రతులు.

114. మ. కడక న్నెట్టనిచెల్వుఁ దాల్పె నతఁ డుగ్రస్ఫూర్తి విల్ ద్రుంచి యె
క్కుడువేగంబున సూతుమస్తకముతోఁ గూడం దురంగాంగముల్
గడి[1]కండంబులు సేసి యారథికు మైఁ గాఁడంగ బెక్కమ్ము లే
యుదు నొవ్వారినఁ జాటి యెక్కెఁ గృపుతే రుర్వీశ నిర్లజ్జుఁడై.

115. వ. ఇవ్విధంబున రాధేయుం డోడి పాఱిన [1]నీడంబోవు మనసై నికులం గనుం గొని కురువిభుండు.

116. క. నిలువుఁడు వెఱ పేటికి నేఁ
గలుగఁగ గాండీవిఁ దక్కఁగలపాండవులన్
గెలిచెద నిదె చూడుఁడు నా
యలవుఁ జలము ననుచు [1]నడచె నన్నరుమీఁదన్.

117. వ. అప్పుడు కృపాచార్యుం డాచార్యనందనున కిట్లనియె.

118. చ. శలభము వహ్నిమీఁదఁ జనుచందము గాదె నృపాలుఁ డర్జునుం
దలపడఁ బోక యాతని శితప్రదరంబులబారి కగ్గమై
[1]యెలసినఁ గావఁగా వశమె యీతని నీవును నేను నుండి మొ
క్కలమునఁ బోవనీఁ దగదు [2]గ్రమ్మన నెద్దుము నిల్పు మవ్విభున్.

119. క. అనుటయు గురునందనుఁ డ
మ్మనుజాధిపు నెయిది యేను మాన్పెద భీభ
త్సుని[1]కడఁక యేమి మూఁడినఁ
జనియెదు తలకడిచి సాహస[2]క్రియ ననుడున్.

---

114. 1. ఖండంబులు - శ. ప. పెక్కు ప్రతులు.

115. 1. తలగ - ఉ. ర. హ.

116. 1. నడరె నన్నరు మీఁదన్ - కొన్ని ప్రతులు

118. 1. యలసిన .... యాతని - అ ఇ. ఉ. ఊ. ల. కొన్ని ప్రతులు. 2. గ్రక్కున - కొన్ని ప్రతులు.

119. 1. కడిమి - జా. 2. క్రియ కనుఁడున్ - పెక్కు ప్రతులు.

120. ఆ. గురుఁడు పాండవులకుఁ గూర్చు నీవును దాని
నెఱిఁగి బవరమున నుపేక్ష సేయు
[1]దిది మదీయభాగ్యహీనత గాక నీ
వేచితేని నెవ్వ రెదురు సెపుమ.

121. క. పలువురుబంధులు నాకై
పొలిసిరి మీ రింకఁ బాండుపుత్త్రుల దెస రా
వలవదు పాంచాలాదుల
వలన నిలిచి గెలువుఁ డేను వారల దీర్తున్.

122. వ. అనిన విని యశ్వత్థామ భూమీశ్వరున కిట్లనియె.

123. క. గురునకు నాకును బాండవు
లరయఁగఁ గూరిమికిఁ [1]బాత్ర మగుదుర యైనన్
దురమునఁ జుట్టరికం బను
గరు సిడికొను శేల కలుగుఁ గౌరవనాథా.

124. ఉ. పెక్కురణంబులం గనియుఁ బెద్దయు నమ్మవు నన్ను [1]మద్గురుం
దక్కినవారు మేము విను దాఁపను ప్రాణము లోపినట్లు వే
రుక్కునఁ బోర దైవగతి యున్నటు లుండెడుఁ గాక పాండవుల్
మిక్కిలి వారు నీతలఁపు మే గెలువన్ వశమే మహీశ్వరా.

125. వ. మా కిరువురకుం దోడు కృపకర్ణకృతవర్మమద్రపతులు గల రెట్లును బాం
డవసైన్యంబు సమయింతు మూఱడు మని వెండియు.

126. తే. మమ్మ కాదు నీ వెవ్వరి నమ్మ వెట్లు
నమ్మకున్నను నే మగు నరవరేణ్య
ప్రతిబలంబులలోనికిఁ బసులనడుము
సొచ్చుపులివోలెఁ జొచ్చెదఁ జూడు నన్ను.

---

120. 1. టిది మదీయ - పెక్కు ప్రతులు.

123. 1. బాత్రు లగుదుర - కొన్ని ప్రతులు.

124. 1. నగ్గురుం - కొన్ని ప్రతులు.

127. వ. నీ చెప్పినపాంచాలురం బఱపెదఁ దక్కినబలంబులం గలంచెదం గౌంతే
యులు [1]దార్కొనినను మార్కొని నిలువరించెద నని పలికి తలకడచి నడచె
నప్పుడు గడంగిన [2]కవ్వడికి మించి పాంచాలకేకయప్రభృతిసేన లొక్క
పెట్ట కవియుటయు నాజెట్టిబిరుదు వివిధవిశిఖపరంపరలు వఱగించినఁ బడలు
వడియును బలుదెసలం బాఱియు నబ్బలంబులు వికలంబు లైనఁ బదుండ్రు
రాజులు నిలునిలు మనుచు బరవసంబు సేసిన [3]వారల జమునివశంబు సేసి
యేచినయయ్యాచార్యసుతుం జూచి [4]రోషావిష్టుం డై ధృష్టద్యుమ్నుండు
దాఁకి నీవు గొందఱ నిర్జించితి నని దుర్జయత్వం బెక్కించుకొనకు మేను
జుమ్మి వచ్చినవాఁడ ననుటయు నతఁడు నిన్న కాదె వెదకెద మద్బాణం
బులకుఁ బ్రాణంబు లిత్తుగా కనవుడు నప్పాంచాలవరుం డతని నుపలక్షించి.

128. క. మీతండ్రికి నే మృత్యువ
నై తోఁచినవాఁడ నగుట యట్లుండె నినుం
జూత మట [1]సనక డగ్గఱి
మా తలఁకక వలదు రిత్తమాటలు మనకున్.

129. వ. అని మెన యట్లయ్యిరువురు నొండొరులం బరుసంబులు వలుకుచుం బలుదెఱం
గుల మెఱుంగుటమ్ముల నేట్లా[1]డి రట్టియెడ.

130. మ. ధనువుం గేతువుఁ ద్రుంచి సారథిని రథ్యవ్రాతముం గూల్చి యే
పునఁ బాంచాలతనూజువెగ్గొడుగు సొంపున్[1]వమ్ము గావించి యా
తనిపార్శ్వంబుల యోధవీరశతముం దన్మాన్యులన్ ముప్వురం
దునిమెన్ ద్రోణసుతుండు రాజు వొగడన్ దోర్గర్వదుర్వారుఁ డై.

---

127. 1. మార్కొనిన నే నెదుర్కొని నిలువ — వ. 2. వడముడికి మించి — ఇ. ఞ. త.
3. నగ్గురుసుతుం డు వారిం బడనేసి — ఐ. 4. రోషోద్దీపితుం డయి — ఓ.

128. 1. యిట్లు డగ్గఱుమా — కొన్ని ప్రతులు

129. 1. డుచున్నట్టి సమయంబున — ఉ. త.

130. 1. వమ్ముగావించి — పీ. స; జింపి — వా. కొన్ని ప్రతులు; జెంపు (జింపి) మాయించి —
ఐ. ఞ. ష.

131. వ. ఇవ్విధంబున వైరివధం బాపాదించి సింహనాదంబు సేసిన యశ్వత్థామకట్టె
దుర నిలువ లేక పాండవపాంచాలసైనికులు సెల్లాచెదరైనం [1]గని ధర్మజ
సమీరసూనులు ససైన్యంబుగా నతనిం బొదివినం గురుపతియును గురు
సమేతుం డయి సేనలతోడ నడరినన్ బలుకయ్యం బయ్యె నప్పుడు విజ
యుండును మనప్రజమీఁదఁ గవిసె నాసమయంబున నంబష్ఠశిబివంగాది దేశం
బులబలంబులు భీమసేనుచేత ప్రమగ్గె నాసమయంబున మగధమద్ర[2]వంగాంబ
ష్ఠాదిదేశంబులబలంబుల సవ్యసాచి సమయించినం గని కినిసి ద్రోణుండు
వాయవ్యబాణంబునఁ గౌంతేయుల[3] మొనలఁ జొక్కాకులచందంబునం
దూలం జేసిన.

## -: సోమదత్తుఁడు సాత్యకితో యుద్ధంబు సేసి చచ్చుట :-

సం. 7_136_12

132. క. అలిగి నరుఁడు భీముఁడు నిరు
గెలఁకుల నయ్యస్త్రగురునిఁ గిట్టి శరౌఘం
బులఁ దేల్చిన మగుడ ననికి
దలకొని వడి నురవడించెఁ దత్సైన్యంబుల్.

133. తే. అధిపతియు నస్త్రగుఁరుడు బేరగ్గలికలఁ
దఱుమఁ జతురంగములుఁ బేర్చి యుఱుక వారి
మొనలతోఁ దాఁకి గాండీవముక్తవిశిఖ
శిఖల వేఁడిమి [1]కోటఱి చెదరి పఱచె.

134. వ. అట్టియెడ సోమదత్తుండు సమరోల్లాసంబునం బాండవసైనికుల నిలునిలు
మని యదల్చుచు [1]నిల్చినం గనుంగొని సాత్యకి యతనితోడం దలపడినం
దత్సంగ్రామంబు భీమం బయ్యె నందు.

---

131. 1. దరమి - పెక్కు ప్రతులు. 2. ప్రముఖానీకంబులు - కొన్ని ప్రతులు. 3. బలంబులఁ - ఛీ. శ. ష స్త. కొన్ని ప్రతులు.

133. 1. కోర్వక - ఓ. ఘ. వ; కోటరి - ఒ. శ. ష. స.

134. 1. నడరం గని - పీ.

135. సీ. సాత్యకివి ల్లర్ధచంద్రబాణంబున నఱికి యాబాహ్లీకనందనుండు
ముప్పదేనమ్ముల నొప్పింప నతఁ డొండువిలు గొని యాతని నలుఁగుటమ్ము
లైందింట నేసి మహారజతధ్వజం బిలఁ గూల్చి ధనువు సెక్కలుగఁ జేసెఁ
జిఱునవ్వుతో [1]నాతఁ డుఱక వేఱొకవింట నే ట్లాడఁగా భీముఁ డేసె
[2]నపుడు

తే. దాఁకి మీతండ్రిపై ఘటోత్కచుఁడు వైచెఁ
బరిఘమును నది దునిమె నక్కురువరేణ్యుఁ
డపుడు హయసారథులఁ జంపి యతని[3]యుసుఱు
గొనియె బలునారసమున నాశినివరుండు.

136. క. మారుతి యిమ్మెయి నక్కురు
వీరునిఁ జంపించి మోము వికసిల్లఁగఁ దాఁ
బోరెడు నెప్పటిమునుము మ
హీరమణులమీఁదఁ దఱిమె నిభపురనాథా.

137. ఉ. చచ్చినసోమదత్తుఁ గని సాత్యకిపై మనవారు గ్రమ్మినం
జెచ్చెర ధర్మజుం డతనిఁ జేకొని వారలఁ దూలఁ దోలుడుఁ
వచ్చి గురుండు విల్ నఱికి వైచి సిడంబును ద్రొల్లఁ జేసి మే
నుచ్చి చనంగ నేయ నతఁ డుద్భటరోషమహోగ్ర[1]మూర్తి యై.

138. క. వేఱొకవిలు గొని యెమ్ముల
[1]గిఱి మెఱుఁగునారసములు గిఱికొలిపిన నో
టాఱి మెయిం గ్రొన్నెత్తురు
వాఱ నతఁడు దేరి మీఁదఁ బడి మూర్ఛిల్లెన్.

139. వ. కొండొకసేపునకు సేద దేఱి యక్కుంభసంభవుండు విజృంభించి వాయు
దైవత్యం బగుశరం బేయుటయు నాభూవిభుండు దద్దేవతాకం బగుసా
యకంబున శమియింపం జేసి వెల్లేసినం గని కృష్ణుం డతని కిట్లనియె.

---

135. 1. నేయ నుర(ఱ)క - పెక్కు ప్రతులు. 2. నెడవుదాకి - ఆ. ఇ. ఓ. జ. డ. త. బదిట - ణ. 3. యసువు గొనియె - చి. జ. ఠ. ద.

137. 1. ఛిత్తుడై - గ.

138. 1. గిరి - కొన్ని ప్రతులు.

140. క. నినుఁ బట్టఁ గుంభజుండు ప్ర
తినసేయు టెఱుంగు దతనిఁ దేకువ సెడి మా
ర్కొనఁ దగదు నీకు క్షేముం
డని సేయు[1] మొగమునఁ బోదువు మక్కురుసేనన్.

141. తే. ఇతని వధియించుటకు జనియించె నెవ్వఁ
డతఁడ యాతనితోడఁ బోరాడుఁ గాక
యనుడు నొక్కింత యూహించి యానృపాలుఁ
డరిగె ద్రోణుండు ద్రుపదుసైన్యమున కడరె.

142. వ. ఇట్లు సని యుధిష్ఠిరుండు దనతమ్మునకుఁ బెను[1]ద్రా పయ్యె నయ్యనిలసు
తుండును సాత్యకియు ధృష్టద్యుమ్నుండును బరవసంబు సేసినఁ గృపకర్ణ
కలశభవులు గడఁగి రయ్యుభయసైనికోత్తములు సంరంభంబునం బేర్చిన
సైన్యద్వయంబును రయంబునం గలయఁ బెరసినం [2]బెందూళి యెగసి
తఱితోఁ గవియుదెంచు[3]తమంబునకుం దోడుపడి చూడ్కులు నిగుడనీకున్నను
దమకంబునం దమతమపేళ్లు బిరుదులు నుగ్గడించుచు నగ్గలికసొంపునను
సన్నల నుద్దేశంబుల నద్దెసనిద్దెస వీరులు వోరుచుండ నంధకారం బతిసాంద్రం
బై చిక్కువఱిచె నట్టియెడ [4]బిట్టదరి పాండవు లుద్దండబాహాసంపదలు
సూపిన నేపరి కౌరవబలంబులు గలంగి చీకాకుపడి చీఁకటికతంబునం గూడు
కొనం గానక పలుదెసలం దొలంగి పొలుపఱిన నయ్యాచార్యుండు ధైర్యంబు
మెఱయ దుర్యోధనుం గూర్చుకొని యుద్దామసామర్థ్యంబున సకలచతురం
గంబులం [5]బూఁచున ట్లొనర్చి యొక్క మోహరంబుగా నమర్చి యందగ్ర
భాగంబునం దాను నిలిచి యిరుగెలంకుల నశ్వత్థామసౌబలుల [6]నునిచి నడు
కొన శల్యు నిలిపి యన్నరేంద్రుఁడు వెన్నుదన్ని నిలుచునట్లు సేసె నను
టయు ధృతరాష్ట్రుండు సంజయునితో నిత్తెఱంగునం బన్ని బహులతిమి
రంబున సమరం బెట్లు సేసి రని యడిగిన నతం డతని కిట్లను నాసమయం
బున నక్కురుభూపాలుండు దమకాలుబలంబుల నెల్ల నాయుధంబులు వెట్టి
దివియలు పట్ట [7]నియోగించిన.

---

140. 1. ముఖమున – పెక్కు ప్రతులు.

142. 1. ద్రాపైయుండె – కొన్ని ప్రతులు. 2. బెంధూళి – పెక్కు తాళపత్త్ర ప్రతులు. 3. సంతమసంబు – కొన్ని ప్రతులు. 4. బెట్టదరి – కొన్ని ప్రతులు. 5. గూడు న ట్లొనర్చి – శ. ప. పెక్కు ప్రతులు. 6. నిలిపి – కొన్ని ప్రతులు. 7. నియమించిన – ఓ. ఔ.

143. క. మున్నాపని మానుసు[1]లం
ద్రగన్నన పతి సంఘటింపఁగాఁ బనిచిన సం
పన్నంబుగ నొడఁ గూర్చిన
నున్నతకరదీపనికర ముజ్జ్వలితముగన్.

144. వ. చేసికొని యప్పదాతివర్గంబులు దివియలు దెచ్చిన న[1]ద్ధరణీవరుండు రథం
బున [2]కైదును గరికి మూఁడును దురంగంబున కొండును నియతంబుగాఁ
బట్టించి మఱియు వానికెలంకులను గేతనంబులకును దగం బట్టునట్లు సేసి
వెండియు మోహరంబు ముందటను బార్శ్వంబులను బిఱుందను బ్రభలు
నిగుడం బొడవుగా నెత్తి పట్టం బనిచిన నవ్వెలుంగు నింగికి నేలకుం జాలి
పొలిచె నట్టియెడ మణిభూషణంబులను రత్నకేతనంబులను వివిధాయుధం
బులను బ్రతిప్రభలు ప్రజ్వరిల్ల శోభిల్లి నీసైన్యం బొప్పె నప్పుడు పాండవ
బలంబునను [3]రథంబునకుం బదియును గరి కేడును దురంగంబునకు రెండును
గాఁ దత్ప్రకారంబునం గరగదీపికా[4]లోకం బాలోకనీయం బయ్యె నయ్యే
వసరంబున నయ్యస్త్రగురుండు మధ్యందినమార్తాండుపగిదిం బ్రదీప్త
మూర్తి యై వెలుంగ నమ్మనుజపతి యనుజన్ములతో ని ట్లనియె.

145. తే. శల్యకృతవర్మముఖయోధసమితిఁ గూర్చి
కొని మహోద్యోగమున మీరు కుంభజన్ము
చెంత కాద్రుపదాత్మజుఁ జేరకుండ
నాఁగుఁ డొరు లెల్లవారల నతఁడు గెలుచు.

---

143. 1. లదగన్నరపతి - కొన్ని ప్రతులు.

144. 1. ద్ధరణీవరుండు - పీ. శ. ష. కొన్ని ప్రతులు. 2. పదియు - శ. ష. పెక్కు ప్రతులు. ఇచ్చట వావిళ్ల పాఠమే మూలానుసారముగా నున్నది "రథేరథే పంచవిదీపకాస్తు। ప్రదీపకా స్త్రత్ర గజే త్రయ శ్చ॥ ప్రత్యశ్వ మేక శ్చ మహాప్రదీపః । కృతా స్తు తైః పాండవైః కౌరవేయైః 7-163-16, 17 చిత్రశాలాప్రతి. భండార్కరు ప్రతియందీ శ్లోకములు పాదసూచియం దీయనైనవి. 3. పాండవు లెత్తించిన కరదీపికలసంఖ్య అన్ని తాళపత్రప్రతులయందును శ.ష. ప్రతులందును విడువబడినది.భండార్కరుప్రతియందిది చెప్పబడినది. "గజేగజేః సప్తకృతాః ప్రదీపా । రథేరథే చైవ దశ ప్రదీపాః ద్వావశ్వపృష్ఠేపరిపార్శ్వతోఽన్యేధ్వజేషు చాన్యే, జఘనేషు చాన్యే - 7-138-25. 4. నికరంబా లోక - కొన్ని ప్రతులు.

-: పాండవ కౌరవ వీరుల ద్వంద్వయుద్ధము :-

సం. 7-139-22

146. వ. పదంపడి యాధృష్టద్యుమ్నుం బరిమార్పుఁ గిరీటిం గర్ణుండును భీమసేనుని నేనును గెలుతు మని పలికి బలంబులకుఁ జేయి వీచి కడంగిన నెదిరిసేనయు నురవడింప నెన్నండును జూడ వినంబడనియట్టి బవరం బయ్యెఁ బాండవాగ్రజుండుఁ దనదొరల ద్రోణుమీఁదం గవియుం డని పనిచి తానును దలిమిన నమ్మనుజపతిం గృతవర్మయు సాత్యకిని భూరియు సహదేవు రాధేయుం డును వాయుసూను సుయోధనుండును నకులుని శకునియు శిఖండిఁ గృపాచార్యుండును బ్రతివింధ్యుని దుశ్శాసనుండును ఘటోత్కచుని గురు పుత్రుండును బాంచాలవిభుని వృషసేనుండును మత్స్యరాజును మద్రేశ్వ రుండును శతానీకునిఁ జిత్రసేనుండును నర్జునని [1]యలంబుసుండునుం దలపడి రిట్లు గురుని [2]నొంపను రక్షింపను బూని మఱియు ననేకు లనేకులఁ దార్కొనిరి సోమకసైన్యంబు నమయించు నక్కుంభసంభవుని ధృష్టద్యు మ్నుండు మార్కొనియె నట్టియెడ.

147. సీ. పాండవాగ్రజునిచాపము ద్రుంచెఁ గృతవర్మ యతఁ డొండువిలు గొని యతని నొంచె
ధనువును దునిమి హస్తం బుచ్చిపోఁ శక్తి యడరింప వేఱొకరాసనంబు
గొని హాయసూతులఁ గోదండమును బోడి సేసి హార్దిక్యుండు నెలఁగి [1]యేసె
నరనాయకుడుఁ గృపాణము గొన్న నఱకెఁ దోమరముఁ [2]బూనిన రూపుమాపి మఱుపుఁ

---

146. 1. ఇచ్చట యర్జునునితో తలపడినవాఁడు అలంబుసుం డని మూలము. 'వీ' ప్రతియం దును నిట్లే యున్నది. "అర్జునం చ యుధాం శ్రేష్ఠమ్। ప్రాద్రవంతం మహారథమ్ అలంబు సో మహారాజ। రాక్షసేంద్రోన్యవారయత్" 7-165-16. చిత్రశాలాప్రతి. 7-140-16. భండార్కరుప్రతి. 'భం' ప్రతిపాఠసూచియందు మాత్రము అలాయుధుఁ డని పాఠ మున్నది. సోరెన్సన్ మహాభారతనామానుక్రమణికయందు 'అలాయుధుని' ప్రశంస కలదు (పుట. 29) హాలాయుధుండు - వా. శ. ష. పెక్కు ప్రతులు. 2. నొప్పింపను - కొన్ని ప్రతులు.

147. 1. యార్చె - కొన్ని ప్రతులు. 2. బూన్చిన - కొన్ని ప్రతులు.

తే. బిఱియలుగఁ జేసి తనువునఁ బఱపె నార
సంబు లిట్లమ్మహాబలు చటులవిక్ర
మంబు దుస్సహ మగుడు నమ్మానవేంద్రుఁ
డనికిఁ దొలఁగిన గురుబల మలరె నధిప.

148. క. భూరియు శినివరుఁడు శరా
సారము లొండొరులమీఁద సరిఁ బఱపి వడిం
బోరునెడ భల్లమున నా
కౌరవుువిలు ద్రుంచె సత్యకసుతుం డధిపా.

149. ఆ. త్రుంచి మేను గాఁడఁ దూపులు నిగిడింప
నాతఁ డొండువింట నతని నొంచి
ధనువు దునుమిఁ గోప మినుమడి యై శక్తిఁ
ద్రెళ్ల వైచె శినివరేణ్యుఁ [1]డతని.

150. వ. ఇట్లు సాత్యకిచేతం జచ్చినభూరిం జూచి భారద్వాజపుత్రుం డతనిపయిం గవి
యుటయు ఘటోత్కచుండు నిలునిలు మని [1]యెలుంగుసూపి దొడ్డతూపు
లడరించిన నతం డవి మగిడించి పెల్లేసిన నేదు వెఱిగి నట్లయ్యసురవరుండు
దశవిశిఖంబులు రయంబున నురంబున గ్రుచ్చిన మూర్ఛ వచ్చి యమ్మేటి
జోదు కేతుదండం బవలంబించి.

151. క. ఆలోనన తెలిసి మెఱుఁగు
వాలికనారసము [1]దైత్యువతమున వేసం
గీలించిన వరదమ్మువై
సోల్లి [2]పడుఁడుఁ దేరు దొలఁగ సూతుఁడు దోలెన్.

152. క. భీముఁడుఁ గురుపతియు శర
స్తోమము లొండొరుల మీఁదఁ దొరఁగించుచు ను

149. 1. డతని – పెక్కు ప్రతులు; డధిప – వా.

150. 1. యదల్చి – ఐ.

151. 1. దైదు వతమున – వ. వీ. శ. ప. కొన్ని ప్రతులు. 2. న దద్రథము దొలగ – గ. జ.

ద్దామాంభోదపిహితరవి
సోములచందమున నొప్పుచుం బోరువెడన్.

153. చ. ధనువు సిడంబుఁ ద్రుంచి సముదగ్రత భీముఁడు మేను నొంప న
మ్మనుజవిభుండు వేఱొకసముగ్రబలం బగుచాప మెత్తి యా
యనమెయిఁ గాఁడ విల్ విఱుగునట్లుగ [1]నేసిన నొండువింట న
య్యనిలజుఁ డేడునారసము లాన్నృపుగాత్రమునందుఁ గ్రుచ్చుచున్.

154. చ. విలు దునుమాడి వెండియును [1]విందులు నాల్గతఁ డెత్త నెత్త ను
త్తలముగఁ ద్రుంచి వైచె గదఁ దత్తురగంబుల సూతుఁ [2]జావ న
గ్గల మగుఖీతి రాజు దొలఁగఁ జెవ [3]దాఁటుడుఁ గాన కాతడుం
బోలిసెనకాఁ దలంచి మదిఁ బొంగి వృకోదరుఁ డార్చె నార్చినన్.

155. వ. మనమూఁకలు నట్లకాఁ దలంచి హాహాకారంబులతో నాకులతం బొందె నందలిజనంబులు ప్రమదంబునం జెలంగి రక్కౌరవేంద్రుండు వేఱొక్కతేరెక్కి తోఁచినం గని యెల్లవారును డిందుపడిరి కర్ణసహదేవులు సముదీర్ణవిక్రమంబు వెలయం బెనంగునప్పుడు.

156. క. అమ్మాద్రీసుతుఁ డేపునఁ
దొమ్మిదివాలమ్ము లొడలఁ దూర్చిన నతి[1]రో
షమ్మునఁ గర్ణుండు దదం
గమ్ములు నొప్పించెఁ దీవ్రకాండశతమునన్.

157. వ. ఇట్లు సహదేవుం బొదివి రాధేయుండు.

158. చ. రయమున విల్లు ద్రుంచినఁ బరాక్రమము మెఱుంగొకవింటఁ జేయఁగా
హయముల సూతుఁ జంపుటయు నాతఁడు ఖడ్గము ఖేటకంబు ని
ర్భయముగఁ బుచ్చుకొన్న బహుబాణములం దునుమాడె నన్యదు
ర్జయ మగులావునం గడువెసఁ గద వైవ నడంచె నవ్వుచున్.

---

153. 1. జేసిన - కొన్ని ప్రతులు.

154. 1. విండ్లును - కొన్ని ప్రతులు. 2. జంప - కొన్ని ప్రతులు. 3. దాటుట గాన డాతడున్ - కొన్ని ప్రతులు.

156. 1. కోపమ్మున - కొన్ని ప్రతులు.

159. వ. దానం బెండువడక యప్పాండునందనుండు.

-: కర్ణుఁడు సహదేవుని వింటికోపునం బొడుచుచు నవమానించుట :-

సం. 7_141_12

160. ఆ. శక్తి వైవ నిశితచక్రంబు నిగిడింప
వరుస నదియు నిదియు వ్రయ్య లయ్యెఁ
[1]దునియ లయ్యె నేలఁ దొరగంగఁ జేసి పె
ల్లేసి తెరలుటయును నెర్ధె నతఁడు.

161. వ. ఇత్తెఱంగునఁ గర్ణుండు గదిసి నిశ్చేష్టితుం డగుసహదేవు నాలోకించి కుంతి మాటలు దలంచి యొండు సేయ నొల్లక యల్లన వింటి[1]కోపునం గడుపు వొడిచి నవ్వుచు నెక్కు డైనపగఱ నుక్కునం దలపడకు మల్లవాఁడె నరుండు గురుసేనతోడ బిరు దై పెనంగెడు నతనికడకుం [2]బొ మ్మని పలికి పోయె నక్కుమారుండును నట్లు గర్ణు[3]నేటులను మాటలను గడు నొచ్చి తనబ్రదుకునకు రోయుచుం బోయి వేఱొక్కరథం బెక్కె మత్స్యమద్రేశ్వరులు జంభవాసవుల చందంబున సమరంబు సేయుసమయంబున నాశల్యుండు.

162. క. హరులను సూతునిఁ జంపిన
విరటుఁడు పొలివోక వివిధవిశిఖచయంబుల్
గురియ శతానీకుఁడు శ
ల్యురథం బస్త్రములఁ బొదివె [1]నుద్ధతభంగిన్.

163. వ. ఇట్లు మత్స్యానుజుండు దాఁకిన.

164. తే. అతనిఁ గూల్చె మద్రేశుఁ డయ్యరద మెక్కి
విరటుఁ [1]డడలును గినుకయుఁ బిరి గొనంగ

---

160. 1. దునకలయ్యె - ఇ. ఈ. ఉ. ఊ. హా. కొన్ని ప్రతులు.

161. 1. కొప్పు, కొమ్ము - అని పాఠములు. 2. బోయి బ్రతుకు మనియె - ఐ. 3. దే(నే)టులను మాటల నొప్పించిన మనంబున - పీ. శ. ష.

162. 1. నుద్ధురభంగిన్ - పెక్కు ప్రతులు.

164. 1. డలుకయు గడ(ఐ)కయు - ఇ. ఉ. ఊ. ఏ.

ముట్టె నాతని నాతండు మూర్ఛ వోవ
[2]నేయ సారథి దొలగంగ నెగచె రథము.

165. వ. ఇవ్విధంబున విరటుండు వికలుం డగుటయు నాచక్కటిసైన్యంబులు శల్యు మురవడికిం గాక [1]చెరలినం దఱిమి ధనంజయుండు నిలువరించిన బలాఢ్యుం డగు [2]నలంబుసుం డతనిమేన మార్గణంబులు గ్రుచ్చి పేర్చిన నప్పాండవ మధ్యముండు.

166. ఉ. చాపముఁ గేతువుం దునిమి సారథి నశ్వములన్ వధిం[1]ప ను
త్కోపవికారుఁడై యసుర క్రూరకృపాణము గొన్న నేసె నుఁ
గ్గై పృథివీస్థలిం దొరఁగున ట్లలయించి [2]చతుశ్శతిన్ సమా
టోపము సూప నాతఁడు గడుఁ వెసఁ బాఱె భయార్తమూర్తి యై.

167. సీ. నకులనందనుఁడు నీనందనుతోఁ బోరునెడ నాళతానీకుఁ డేచి యతని
కంకట మంగంబు గ్రక్కునఁ బాసి పోఁబడ నేసి విల్లును నిడమ్ముఁ ద్రుంప
దలఁకక యొండుకోదండంబు గొని నీదుపుత్త్రుండు నొంప నా చిత్రసేను
శరముల కోర్చి తత్తురగంబులను సూతు ధరఁ గూల్చె వెస
భవత్పౌత్త్రుఁ డపుడు

తే. [1]గలఁక లేక యతండు శీఘ్రమున నిరువ
దేనుదూపుల నొంచిన నెనకమెసఁగఁ
[2]గనుక నాతఁ డాధనువును దునుము నక్కు
మారుఁ డేఁగె హార్దిక్యుని తేరికైకి.

---

2. వేసె - కొన్ని ప్రతులు.

165. 1. చెదరిన - ఊ. 2. చూడుడు ద్రోణ - 6 - 146 పాదసూచి.

166. 1. చినన్, గోపవికారుఁడై - పి. శ. వ. కొన్ని ప్రతులు. 2. చతుశ్శిలీముఖాటోపము - వ. కొన్ని ప్రతులు; కనకచ్ఛరాసనాటోపము - శ. కొన్ని ప్రతులు.

167. 1. గలగ కతడును నతనిని శీఘ్రమున - వ. 2. తోమరంబును గొని ధన్వి దునుమ - ఊ. ఏ; ధన్వారూపము శ్రుతిహీనమ్ముగా లేదు.

168. క. ద్రుపదుఁడు వృషసేనుండును
నుపమా[1]నాతీతఘోరయుద్ధంబున బా
ణపరీతశోణి[2]తప్లుత
వపురుజ్జ్వలు లైరి కౌరవక్షితినాథా.

169. వ. అట్టియెడ నాకర్ణపట్టిచేయి బెట్టిదం బయి వచ్చినం బాంచాలబలంబు నిజ పతికిం దలకడచి యతనిం బొదివి యానైనికోత్తము నంపసోన కోటఱి పఱచినం [1]బ్రదీప్తుం డై యతండు మెఱసె దుశ్శాసనుండు ధర్మనందన నందనుండును బోరునెడ నప్పాండుపౌత్త్రుం డతనిఫాలంబున వాలికనార సంబులు మూఁడు నాటించినం ద్రిశిఖరయుతశైలంబులీల నయ్యువరా జొప్పి యవ్వీరుం గ్రూరశరంబులం గప్పి కేతుసారథిరథంబులఁ దిలప్రమాణ కలంబులు సేసిన.

170. క. వింధ్యాద్రివోలె నాప్రతి
వింధ్యుఁ డచలితోగ్రమూర్తి వెలయ నిలిచి [1]ద
ర్పాంధ్యమతి నడరి దీప్తా
వంధ్యాస్త్రము లక్కుమారవరుపైఁ బఱపెన్.

171. ఆ. అడిగి వెడఁదవాతియమ్మున నాతని
ధనువుఁ దునియ సేసి తనువునందు
నిశితవిశిఖచయము నిగిడించె నీకొడు
కంతఁ దత్సహోదరాళి [1]గదిసి.

172. వ. కయ్యంబు సేయ నందు భీమసేననందనుం డగుశ్రుతసోము నేరదం బయ్యు ధిష్ఠిరతనయుం డెక్కి యొక్కసముద్దండం బగుకోదండంబు పుచ్చికొని ఖండనంబు సేసె మనవాఁడు నయ్యువరాజున కడ్డంబు సొచ్చి పెనంగిరి నకు

---

168. 1. తీతాతిఘోర - పెక్కు ప్రతులు. 2. తాప్లుత - కొన్ని ప్రతులు.

169. 1. ప్రదీప్తమూర్తి యై - పీ. శ. ష.

170. 1. గర్వాంధ్యమ రథముగ - పెక్కు ప్రతులు.

171. 1. గవిసె - పెక్కు ప్రతులు.

లుండును శకునియు [1]సమానవిక్రమంబుల సమరంబు సేయునెడ శా
సౌబలుండు.

173. చ. ఒకబలు[1]తూపురంబు గొని యుచ్చి చనం గర మల్లి యేయుడుఁ
నకులుఁడు మూర్ఛ వోవుటయు నాదము రోదసి నిండ నార్చె నం
తకుఁ దెలి వొంది చాపముఁ బతాకయుఁ ద్రుంచి యతండు నీమఱిం
దికి నరసా వొనర్చె ఘనతీవ్రసముజ్జ్వలమార్గణంబులన్.

174. వ. ఇట్లు గాంధారపతి పడుటయుఁ దత్సారథి దేరు దొలంగఁ దోలుకొని పోయెఁ గృపాచార్యుతోడ రణక్రీడఁ జలుపుచుండ శిఖండికోదండంబు బిసకాండంబుగా ఖండించి యతండు శక్తి వైవ నదియును దునిమిన ఘనం బగుధనువు గొని తోరంపునారసంబున నతనిం దేర్పై సొగయ నేసి యగ్గా తముండు గోపంబునం [1]జంపఁ దలం పెత్తి వెండియు నేయ నిగుడునంతకు నద్దెసయోధులు పలువు రొక్కట నుక్కన నురువడించిన మనదిక్కునై నికులు శారద్వతుం గడచి కడిమి నెఱయఁ బోరిరి మఱియు ననేకద్వంద్వ యుద్ధంబులు సెల్లుచుండ సంకులసమరం బయ్యె నయ్యవసరంబున.

175. సీ. పచి ధృష్టద్యుమ్నుఁ డాచార్యునురమున వెస నాఁటె నైదునారసము లాతఁ
డాతని నిరువదేనమ్ముల నొంచి విల్ దునిమిన నొండువిల్ గొని యతండు
మంటలు గ్రమ్మెడు మహాశాస్త్ర మేయుడుఁ గాలంబు [1]గా కిది కలశజున్నకు
ననుచు నీవారు భయం బంద నేకాద శాస్త్రంబు లోకముష్టి నలవరించి

తే. యేసి కర్ణుండు దునియలు సేసె నడుమ
నంతఁ గురురాజు యువరాజు నడర గురుసు
తుండు శకునియు శల్యుండుఁ దోడుపడిరి
వార [2]లేద్వురశాఁకు నవ్వీరుఁ డోర్చె.

---

172. 1. ససమాన విక్రమంబుల – ల. పీ. శ. ష. కొన్ని ప్రతులు.

173. 1. నారసఁబు – ఊ. ప; తోమరంబు – ణ త.

174. 1. జంపుతలం పెత్తి – కొన్ని ప్రతులు.

175. 1. పమకూరె – ఊ. ప. 2. లేవుర, లార్వుర – అని పాఠములు.

176. క. ద్రుమసేనుఁ డడరి పటుశా
ణము పద్ధతిఁ బఱపె సూతనందనుపైఁ గో
పము గదిరి యతఁడు వానిశి
రము గుండలదీప్తమై [1]ధరం బడ నేసెన్.

177. వ. ఇట్లు ద్రుమసేనుండు సచ్చినం జేచ్చెన[1]కోపంబునం గర్ణుకోదండంబు దునిమి ధృష్టద్యుమ్నుండు [2]సటిమిన నొండుబలువింటం బెనంగునతనిం గూడుకొని కురురాజు మొదలగు నేగురురథికులు పెలుచ నేసి రాసమయంబున సాత్యకి సమదగతిం గవిసి నిలు నిలు మని యదల్చి రాధేయుం దలపడియె నయ్యిరువుర యుక్కును నొక్కరూపున నక్కజం బై యుండె నట్టియెడ వృషసేనుండు వచ్చి కైసేయు నేయుటయు నతండు వాలమ్ములు నిగిడించి వానిం దేరివయిం ద్రెళ్లి మూర్ఛిల్లం జేసినం బుత్త్రశోకపీడితుం డగుసూతపుత్త్రుఁ డచ్యుతానుజు నానాస్త్రపీడితుం గావించె నంతకుం దెలిసి తనయుండునుం దోడుపడియె న ట్లడరునయ్యిద్దఱ వాశినివరుండు గినుక యెక్కిన యేత్తెఱం జిక్కు వఱిచె నప్పుడు గాండీవగుణ దేవదత్తమహారావంబును మహాకారంబున వీతెంచిన నయ్యంగరాజు రారాజున కి ట్లనియె.

-: కర్ణదుర్యోధనులు దురాలోచన సేసి సాత్యకిం దలపడుట :-

సం. 7-145-66

178. క. అదె పార్థుఁడు దనమునుమున
కొదవినసేనలఁ గలంచునులి వతఁ డితనిం
గదియఁగ రాకుండగ మును
పొదువుదమే సాత్యకిం బ్రభూతబలముతోన్.

179. వ. అ ట్లయిన వీఁ డభిమన్యుపోయినపోకం బోవునది నీకు విజయంబునకుఁ గారణం బగు వీనిం బలువురు పట్టుముట్టుట యెఱింగెనేని విష్వచ్చుండు వచ్చునతం డెఱుంగకుండ నక్కడ నిలువరించి పోరం జాలుబల్లిదుల నట పుచ్చ

---

176. 1. ధరం దొరగించెన్ - ఘ. ఠ.

177. 1. రోషంబునం - కొన్ని ప్రతులు. 2. దరమిన - పెక్కు ప్రతులు.

వలయు ననుటయు నమ్మనుజవిభుం డిది లెస్సకర్జం బని గాంధారపతిం గనుంగొని నీవు పదివేలేనుంగులు నన్నియరదంబులుం గొని దుశ్శాసన మహాబాహు[1]దుష్ప్రధర్షణదుర్విషహులు దోడుగాఁ గ్రీడిపై నడచి కయ్యంబు సేయు మద్దిక్కునం దక్కిన పాండవులు నున్నవా రయ్యన్నదమ్ములం బొదివి గెలువు మనిన నతం డమ్మెయికిం జనియెఁ దదనంతరంబ.

180. క. చేయ గలరథికులును రా
ధేయుఁడు బలయుతము గాఁగఁ దెప్పదెరల కై
నేయుపయిఁ గవిసి బహువిధ
సాయకములు గురిసి రథికసంరంభమునన్.

181. వ. అతండును గోపాటోపంబున.

182. క. కరులకరంబులు హయంబుల
శిరములు రథసంచయంబు చెక్కలును సమి
ద్ధరఁ గప్పి క్రమ్మఱఁగ నె
త్తురుటేఱులు వఱపి వానిఁ దొలఁగం ద్రోచెన్.

183. క. శినివరునద్భుతవిక్రమ
మున [1]కోర్వక కలఁగఁబడిన మొనఁ గనుఁగొని నీ
తనయుఁడు దనయరదము నా
తనియరదముమీఁద నత్యుదగ్రతఁ [2]బఱపెన్.

184. వ. అయ్యిరువురు నక్కజం బగుకయ్యంబు సేయునెడ నాకై నేయుండు.

185. క. తురగముల సూతుఁ జంపినఁ
గురుపతి పాలివోక యతని [1]గురుసున నేయం
గర మలిగి ధనువు దునుముడు
బరవస మఱి యొరుని తేరుపైకిం బోయెన్.

---

179. 1. దుష్ప్రహా దుర్మర్షణ – కొన్ని ప్రతులు.

183. 1. కోర్వమి – కొన్ని ప్రతులు. 2. దోలెన్ – ద. ప.

185. 1. గురుసర – కొన్ని ప్రతులు.

186. వ. ఇవ్విధంబున.

187. తే. పతి [1]గలంగ సైన్యము దబ్బలము శాణ
నిహతిఁ దూలించె నక్కడ నీమఱంది
యదరి యర్జునుతో విస్మయావహముగ
నాహవము సేసెఁ దగు[2]సహాయంబు [3]కలిమి.

188. చ. అతనిసుతుం డులూకుఁడు మదగ్రతఁ గృష్ణునిమేనఁ బార్థుపై
శితశరకోటి నించి విలసిల్లఁగ సౌబలుసూతుఁ జంపి యు
ద్ధతిఁ దురగంబులం దునిమి తద్ఘనచాపము ద్రుంచె నన్నరుం
డతఁడు దనూజుతేరిపయి [1]కాత్మ [2]చలింపఁగఁ బోయి వెండియున్.

189. తే. వాఁడుఁ దోడ్పడఁ గడగి విద్వచ్చు సేసె
నతఁడు వారలు [1]సేద్పడునట్లు గాఁగ
గడఁక గలయోధవీరులు బడలు వడఁగ
బలము సెడి పాఱఁ దనవింటి[2]బలువు సూపె.

190. వ ఇట్లు విద్వచ్చుండు పేర్చినయాసమయంబున ధృష్టద్యుమ్నుండు.

191. క. తఱిమి గురువింటిగొనయం
బఱిముఱిఁ దునియంగ నేయ నతఁ డాతని నే
ర్తెఱ నొండువింట నేసిన
నుఱక తునిమె నాతఁ డమ్మహోగ్రశరంబుల్.

192. వ. వెండియు నాచార్యుం డేయుసాయకంబులు ద్రుంచుచు నంగంబులు నొంచుచు మిగిలి [1]మార్గణజాలంబుల సైన్యంబు దైన్యంబు నొందించె నట్లు సాత్యకి సవ్యసాచిధృష్టద్యుమ్నులచేతం గలయం గలంగి కౌరవా[1]నీ

---

187. 1. గలంచి - స. 2. సహాయత కలిమి - పీ. 3. కలిగి - కొన్ని ప్రతులు.

188. 1. కార్తి జనింపగ - వ. 2. చలింపకపోయె - కొన్ని ప్రతులు.

189. 1. నొచ్చెడునటు - మ. 2 బలము - కొన్ని ప్రతులు.

192. 1. నీకంబులు కాందిశీకంబు లగుటయు - కొన్ని ప్రతులు.

కంబు గాండివశీకం బగుటయుఁ బాంచజన్య దేవదత్తాదిశంఖరవంబులు సెలంగం బాండవబలంబులు గూడికొని [2]వెన్నడిం గవిసినం గని భీషణరోషాతిరేక విధేయుం డయి రాధేయుండు.

193. మ. తలలుం జేతులుఁ గాళ్లునుం దనువులున్ ధాత్రీస్థలిం బెక్కుతి
ట్టలు గావించి రథప్రశానములు ఘోటశ్రేణులున్ వారణా
వలులుం [1]జేడ్పడ పైపయిం దఱిమి దుర్వారైకదర్పోద్ధతిం
బలముం జేవయుఁ జూపి నుద్భటభుజాసంరంభరౌద్రంబుగన్.

194. వ. ఇవ్విధంబున విజృంభించి నొంచినం బఱిపఱి యై పఱచునవ్వాహినుల వెను కొను నాసూతనందనుం జూచి తలంకి ధర్మతనయుం డర్జునునితో ని ట్లనియె.

195. క. నడురేయి తీవ్రభానుఁడు
పుడమి వెలసె ననుతలంపు పుట్టించుచు [1]ను
గ్గడు వగు తేజంబున వెలిఁ
గెడుఁ గర్ణుఁడు బాణరుచులు గిఱికొన దెసలన్.

196. ఆ. ఇట్లు దఱిమె నేని యిప్పుడ యీతఁ డి
ద్దిక్కువారి నెల్ల నొక్కయెత్తు
గాఁగ విలుకుమార్చుఁ గావున నెమ్మెయి
నైనఁ బ్రతివిధాన మాచరింపు.

197. వ. అనిన విని యతం డచ్యుతు నాలోకించి రాధేయురథసంబున కిమ్మోహారం బోహటించిన భూపతి భీతుం డయ్యె భారద్వాజుండును బై కొని యొక్క వలన మొనలఁ దెరల్చెడి నే నదల్చి యిక్కర్ణును క్కడించి యక్కుంభసంభ వుసంరంభంబు వారించెదఁ దేరు నడపు మనుటయు నద్దనుజమర్దనుం డతని కి ట్లనియె.

---

2 వెన్నాడి – ఈ. ఊ. ఐ. ణ. త న.

193. 1. జేడ్పడ పైపయిం దఱిమి – పీ. శ. మ. పెక్కు ప్రతులు; గీడ్పెర సైవడం దఱిమి – వా.

195. 1. మన్ గడువగు తేజంబున – కొన్ని ప్రతులు.

198. క. వినుము నిశాసమయంబున
దనుజులకుం బేర్చు బాహుదర్పము శౌర్యం
బును గావున హైడింబుం
డనిఁ గర్ణుని నోర్చుఁ [1]బనుత మతని [2]నతనికిన్.

199. వ. అని వెండియు.

200. క. మన మంతకు వేఱొకది
క్కున నడతము భీమసుతునకును మాయలుఁ బెం
పొనరినదివ్యాస్త్రంబులు
నెనేకములు గలవు వలవ దనుమానింపన్.

201. వ. అని చెప్పి ఘటోత్కచుం బిలిచిన నతం[1]డు సన్నాహసంరంభమూర్తిస్ఫూర్తి
మెఱయం జనుదెంచి పని యేమి యనుటయు.

202. ఉ. పాండవసైన్యముల్ [1]సెదరి పాఱెడుఁ గర్ణునిచేత నొచ్చి యు
ద్దండత నీదుశౌర్యమును దర్పము నేర్పడ నిల్వరింపు మీ
తం డని రాత్రి నీకుఁ గడుఁ దక్కువ దంద్రులకుఁ జయంబు పు
త్రుం డొనఁగంగఁ గాన్పు మహి రూఢికి నెక్కుడె గెల్వు మీతనిన్.

–: అలంబుసుండు ఘటోత్కచునిచేతఁ జచ్చుట :–

సం, 7–149–15

203. వ. అనియె ధనంజయుండును దదనురూపంబు లైనయాలాపంబుల ననుమతి
సేసినం గడంగి ఘటోత్కచుండు గర్ణుదెసకుం గవిసె నట్టియెడ జటాసుర
సుతుం డగు[1]నలంబుసుం డేతెంచి కురుపతిం గాంచి నాకు బాండవులదెసం
బూర్వవైరంబు గలదు నీకును బ్రియంబుగా వారిని వారివారిని వధియించెద

---

198. 1. బనుపు మతని – కొన్ని ప్రతులు. 2. నచటికిన్ – కొన్ని ప్రతులు.

201. 1. డును సంగరంబు సేతకు ననురూపంబైన ఘనమూర్తిస్ఫూర్తి – ఈ.

202. 1. గలిగి – ఇ. ట. త.

203. 1. భండార్కరు ప్రతియందు 'అలంబలుండ' నిరలదు. 7–149–15:

నని పలికి యతండు ప్రీతుం డై యభినందింప నాసూతనందనుం గలసి తల
కడచి హిడింబానందనుం దాఁకిన దారుణరణం బయ్యె నయ్యిరువురును వివిధ
విశిఖస్ఫురణంబుల నొండొరులఁ [2]దెరల్పం జాలక రథికు లగుట యుడిగి
మాయలకుం జొచ్చి మహోరగగరుడాకారంబులను [3]హరణకంఠీరవ
రూపంబులను రవిసైంహికేయాకృతులను మేఘమారుతమూర్తులను
మఱియు బహు[4]విధవికారాకారంబులను జూపుచుం బోరి యేపునం గదిసి
[5]బాహాబాహిం బెనంగునపుడు మేనులు బెరసిన నాభిమనందనుండు.

204. క. పట్టి బలువుగ జటాసురు
పట్టిం బడవైచి యురము పాద[1]మున గడుఁ
బిట్టుగఁ ద్రొక్కి యతనితల
యట్టకుఁ బాయంగఁ జేసి యార్చెం బెలుచన్.

205. ఆ. ఆర్చి నెత్తురుట్ట నమ్మస్తకము వట్టి
కొని యతం డుదాత్తఘోరభంగి
బ్రమరి వాటి కురున్నృపాలకునరదంబు
నందు వైచి యిట్టు లనియె నధిప.

206. క. కొను మిదె నీమిత్రునితల
విను మిట్టుల మాఱులేని విక్రమమునఁ గ
ర్ణునిఁ ద్రుంచెద వరుసం బోరి
గొనియెద విను భీమసేనుకొడుక నెఱుఁగవే.

207. వ. అని పలికి యసురవరుం [1]దరుణం బగుతనయరదం బెక్కి గృధ్రకేతనంబు
గ్రాల నీలోన్నతం బయినతనరూపంబున కనురూపం బైనదంష్ట్రాయుగళం
బును బింగ[2]ళోద్బద్ధజటాకేశకలాపంబును భీషణంబులుగాఁ గనకభూషణం
బుల కతంబునఁ దటిల్లతావికటం బగునంబుదంబుకై వడిఁ గర్ణుపయిం గవిసి

---

2. మరల్పంజాలక - ఇ. ఔ. 3. దారుణ - కొన్ని ప్రతులు. 4. విధాకారంబుల - కొన్ని ప్రతులు. 5. ఖడాఖడ్గిం - కొన్ని ప్రతులు.

204. 1. తలమునన్ - ఖ. చ. ఝ. శ. ష.

207. 1. దురూకుం బగు - ట బ. 2. ళోదత్కేళ (జటా) కల్యా - వి. స; ళోద్వృత్త నయన - న. 3. సహితం బగు - ఝ. వ; రాజితం బగు - ఓ.

ఘనశరంబు లేయ నతం[4]డను జండభంగి నెదుర్కొని నిశితనారాచంబులఁ గప్పె నిప్పరుసునం దలపడి యమ్మనుజదనుజులు మహాద్భుతకరం బగు సంగరంబు సేయునెడ వివిధాయుధవ్యాపారఘోరవిచేష్టితవిగళితరక్తసిక్తంబు లగునంగంబులయుచలత్వంబున గైరికగిరిద్వయంబుచందంబున నొప్పిర తెక్కువతక్కువలు లేక పోరిపోరి రాధేయుండొక్కదివ్యాస్త్రంబు ప్రయోగించిన నది భైమసేని ప్రత్యస్త్రంబున నడంచి మాయాసైన్యం బడరించిన నమ్మాయాసైన్యంబు సాయకశూలముద్గరాదిహేతివ్రాతంబులు[5]ను బలలవర్షంబులునుం గురియం గురువాహిని గలంగి పాఱిన నాసూతసూనుం డొక్కరుండును నవష్టంభవిజృంభణంబు మెఱయ నిలిచి మహనీయాస్త్రబలంబున నమ్మాయ మాయించుటయు హైడింబుండు చక్రంబు వైచినం జక్కడిచె గద నిగిడించిన మగిడించె గగనంబున [6]కరిగి తరుపాషాణపటలంబులు వరగించినం దునిమి ధరం దొరగించె మఱియు రథికత్వంబునం గడంగిన నయ్యోధవరుండు తురగసారథిసహితంబుగా రథంబు శకలంబులు సేసి యతనితను వేదు వెఱిగినతెఱంగుగా మెఱుంగుటమ్ములు గిఱిగొల్పినం గెరలి యన్నిశాచరనాథుండు.

208. సీ. మాయా[1]ముఖంబున మార్గణజాలంబు ద్రావఁ గర్ణుం డది ద్రయ్య నేసి
చెలఁగినఁ గడుబెక్కుశిరములతోడి మహాకృతి గైకొన నదియుఁ దునుమ
జచ్చె వీఁ డని మనసైన్యంబు లుబ్బంగఁ బడియుండి వివిధరూపములు దాల్చి
భంగించె నవియును [2]ద్రుంగఁగ నేసిన శైలమై తద్వజ్రసాయకమున

తే. సమసి రథికుఁడై తనచుట్టుఁ జాతురంగ
మైనబల మేచి [3]తఱుమంగ నడరి దీప్త
భూరిశరముల నాసూతపుత్త్రు నొంచి
యెక్కుడై క్రుంచె నతనివి ల్లక్కజముగ.

209. వ. ఆసమయంబున బకునితోడంబుట్టు వగు[1]నలాయుధుం డనుదనుజేంద్రుండు

---

4. డాశుభంగి - ఘా. ప. 5. నుపలలవర్షంబును - స. పెక్కు ప్రతులు. 6. కెగసి - కొన్ని ప్రతులు.

208. 1. బలంబున - ఒ. ఓ. 2. భగ్నంబు - ఖ. చ. 3. నడువంగ - ద. ప.

209. 1. హాలాయుధుండను - శ. ష. పెక్కు ప్రతులు.

వడముడివలనివైరంబు పెద్దకాలం బేనియు మనం బెరియింపం దఱి వేచి కొని యుండి యన్నిశాసంగ్రామంబునకు ససైన్యంబుగాఁ జనుదెంచి దుర్యోధనుం గని తన్నెఱింగించుకొని యతనితో నిట్లనియె.

—: అలాయుధాసురుండు ఘటోత్కచునితో యుద్ధంబు సేసి చచ్చుట :—

సం. 7–151–1

210. క. భీమునిఁ దత్సోదరులను
భూమీశ్వర యిపుడ పట్టి పొరిపుచ్చెద ను
ద్దామత మ్రింగెదఁ గృష్ణుని
తో మిత్త్రగణంబుతో సుతులతోఁ గూడన్.

211. వ. నీకును నీవారికిం గయ్యంపుటలజడి గాకుండునట్లుగా నరిసేన సమయించెద ననియె నప్పుడు ద్రోణద్రౌణికృపకృతవర్మమద్రపతిప్రముఖయోధవీరులు వెఱఁగుపడి చూచుచుండం జేర్చి హైడింబుండు గవిసినం గర్ణుదెస నఖిల జనంబులును నిరాశులైరి సుయోధనుం డలాయుధు నాలోకించి.

212. తే. భీమతనయుండు మాయపుఁ బెనఁకువలను
గర్ణు నొప్పించుచున్నాఁడు గడఁగి వానిఁ
దాఁకి గెలువు నీ వనవుడు దైత్యవిభుఁడు
దగ్రగతిఁ జని తాఁకె నాదైత్య[1]విభుని.

213. క. [1]అరదము మొదలైన సకల
పరికరములు రూపునేపుఁ బ్రాయంబును న
య్యిరువురు దనుజాధిపులకు
సరియై యొప్పారెఁ జూడ [2]జగతీనాథా.

214. వ. ఇ ట్లేపుమెఱయ నిరువురుం దలపడి పోరువారలం జూచి సూతసూనుండు మరుత్సూనుపయిం గవిసిన నతండు దనసుతుం డలాయుధుచేత నొచ్చునో యనుతలంపునఁ గర్ణునిం గ్రేడించి యమ్మోటిరక్కసునిమీఁద నాటోపంబున

---

212. 1. వరుని – కొన్ని ప్రతులు.

213. 1. అరదమ్ము మొదలుగాఁ గల పరి – వి. 2. సంగరభూమిన్ – ఉ.

నడరుటయుఁ దదనుచరు లగునిశాచరు లనేకు లొక్కమొగి నతనిం బొది

విన నొదవిన కినుక నమ్మొలగములు [1]వఱపి యవ్వీరుండు వారిం బఱపిన.

215. తే. పోక నిలిచి యమ్మారుతపుత్త్రుఁ డేయు

సాయకంబులఁ గొన్నింటిఁ జంచదగ్ర

కుంఠితంబులఁ గానించి కొన్ని యురము

నందు డిందంగ మెఱసె నయ్యసురవరుఁడు.

216. క. భీముఁడు గద వైచిన ను

ద్దామగదాప్రహతి నది య[1]తండు [2]సదిపి యు

గ్రామేయవివిధవిశిఖ

స్తోమంబుల నతని నొంచె దుర్జయలీలన్.

217. వ. నిజబలంబులం బురికొల్పిన నవి పాంచాలసైన్యంబుల బడలువఱిచె నప్పుడు శౌరి సవ్యసాచిం జూచి రాత్రియుద్ధంబున రాక్షసులు వేర్చిరి వీరి మరల్ప నకులసహదేవసాత్యకిప్రభృతుల నియోగింపుము కర్ణుదెసకు శిఖండిధృష్టద్యుమ్నప్రముఖులం బనుపుము గురునిప్రాపున నురవడించునరపతుల నీవు నిలువరింపు మనునెడ నలాయుధుం డనిలతనయుధనువు [1]దునిమి యతండు వేఱొక్కవిల్లెత్తికొను నందున సారథిరథ్యంబుల నోల నేసినం బొలివోవక యబ్బలుఁమగండు గదాహస్తుం డయి [2]గొదకొన వాఁడును గద గొని మార్కొని ఘోరంబుగాఁ బోర గదలు దుము రగుటయు రథావయవంబులుఁ గరిదంతంబులు లోనుగా దొరకొన్నవియ సాధనంబులుగా నొండొరుల నొప్పింపం దొడంగిన.

218. క. కని హరి గర్ణునితోడం

బెనఁగుఘటోత్కచునిఁ [1]బిలిచి భీముఁడు వలది

---

214. 1. పరగించి – కొన్ని ప్రతులు.

216. 1. తడు ?దిపిమహా భీమంబు లై నవిశిఖ – పీ. ప. స. 2. నిలిపి – పెక్కు ప్రతులు.

217. 1. ద్రంచిన నతండు – కొన్ని ప్రతులు. 2. గొద గొనిన – కొన్ని ప్రతులు.

218. 1. బనిచె – పెక్కు ప్రతులు.

ద్దనుజుని మర్దింపుము నీ
వన నాతం డతని విడిచి [2]యతనికిఁ గవిసెన్.

219. క. నకులాదులు నాదైత్య
ప్రకరంబుఁ దెరల్చి రేఁచి రాధేయుఁడు నే
లకుఁ గోలకుఁ దెచ్చెను సో
మకుల శిఖం[1]డ్యాదిరథికమర్దనుఁ డగుచున్.

220. వ. ఆవిక్రమంబు వీక్షించి సన్నద్ధుం డయి సమీరనందనుం డాసూతనందనుం దలపడినం దోడ్పడి నకులాదులు నానాస్త్రంబులు గురిసిరి కిరీటి పాంచాలురం గూర్చికొని కుంభసంభవసైన్యంబుఁ బొదివి సమయించుచుండె నలాయుధుండు ఘటోత్కచునిం బరిఘు[1]పాతనంబున సోలం జేసిన నాలోన తెలిసి యతండు.

221. క. గద ద్రిప్పి బెట్టు వైచిన
నది రథ్యంబులను సూతునరదము సిడముం
బిదురుపలు సేయఁ నతఁ డం
బుద మై గర్జిల్లె నభము బూరటిలంగన్.

222. వ. ఇట్లు మాయ గైకొని నెత్తురుసోనతోఁ బిడుగులు వడంజేయ వాయుతనయతనయుండును దివి కెగసి తనమాయ నమ్మాయ మాయించినఁ గ్రమ్మఱ బకభ్రాత భూచారి యయినఁ దోడన హైడింబుండును డిగ్గి పన్నయ్యిరువురకుం దరువులఁ బాషాణంబుల భీషణం బగురణంబు వాలిసుగ్రీ[1]వసమరసమం బై చెల్లె మగుడ వివిధాయుధంబుల నాయోధు లాయోధనంబు సేసి రట్టియెడఁ గర[2]వాలంబు గొని నుదంబునఁ గవిసినచో ఘటోత్కచుం డలాయుధుం దల వట్టి బలువిడి నిల్లంబడఁ దిగిచి మెడ దెగ వ్రేసి

---

2. యాతనిఁ దాఁకెన్ - వీ. ష.

219. 1. డి ముఖరథికమర్దను - పెక్కు ప్రతులు.

220. 1. తాడనంబున - వీ; పాతంబున - కొన్ని ప్రతులు.

222. 1. వులచందమై చెల్లె, వుల సమరంబై చెల్లె - అని పాఠములు. 2. వాలుగొని - కొన్ని ప్రతులు.

యార్చినం బేర్చినపాండవబలంబులం దూర్యనినదంబులు సింహనాదంబులుం జెలంగె నప్పుడు.

223. క. పటుగతిఁ జని కురుపతియుం
దట వైచెం జేతనున్నతల రౌద్రం బు
ద్భటముగ ఘటోత్కచుం డు
త్కటశోకము వొంది రతఁడుఁ దత్సైనికులున్.

224. క. మును బకునను జునివలనం
దనతమ్ములు దాను బ్రదుకఁ దలఁ[1]చి యతఁడు స
చ్చిన విభుఁడు భీమసేను[2]ప్ర
తిన [2]పారం బెద్దు నని మదిం దలఁచె నృపా.

225. వ. అట్టియెడఁ గర్ణుండు కౌంతేయసైన్యసంతానంబు నానాస్త్రఘట్టనంబుల విఘటితంబు సేయుచున్న నచ్చాయుసందనసందనుండు నిజస్యందనం బెక్కి యుక్కుమెఱయం దలపడియె నయ్యిద్దఱుం బెద్దసేపు శరపరంపరల సరియై సంగరంబు సేసిరి పదంపడి రాధేయుండు రథ్యంబులం జంపిన రథనమేతంబుగా నాఘటోత్కచుం డదృశ్యుం డైన నీసైనికులు దల్లడిల్లి యెక్కడ వచ్చి యెవ్వరి నేమి సేయునో యనుచు మేనులు వడంక నలుగడలుం గనుంగొనుచుండిరి హైడింబుండును మహాంబుదంబుచందంబునఁ జదలం దోఁచి [1]మెఱుముచు నుఱుముచు బాణకృపాణముసలముద్గరకుంతచురికాదిహేతివ్రాతంబు[2]లుం బరుషోపలపటలంబులుం దొరఁగింపం దొడఁగి దానవులు మొగిళ్లయి యెక్కమొగి నట్ల చేయ నాసూతసుతునకుం బ్రతివిధానం బాచరింప నలవిగామిఁ గౌరవబలంబున రథంబులు గజంబులుఁ దురగంబులుఁ ద్రెళ్లను గూలను డొల్లను దొడంగె నొండుగడకుం గడంగుతలంపులు దక్కి తలలు

---

224. 1. చెనతడు-కొన్ని ప్రతులు; చె విభుడుభీమునికొడుకె వాని జంపగ । తను భీము ప్రతిజ్ఞ మదిని దలచెన్నృపాలా - వే. 2. సెల్లె నటంచు తనమదిం - ఇ. ఓ; దలచి కలంగి తన మదిం దలకె నృపా - ఘు. ద. వ; పారం బేదు నని - కొన్ని ప్రతులు.

225. 1. మెరచుచును - కొన్ని ప్రతులు. 2. లుం బరుషోపల - వ. శ. మ. హా. కొన్ని ప్రతులు; లు వర్షోపల - వా. పీ.

[3]గుట్టుకొని యుండి యోధులు భగ్నాపరభాగులై పడం జొచ్చి రప్పు
డిద్దెసవా రెల్ల నాఖండలప్రముఖబృందారకులు పాండునందనులకుం దోడ్పడి
యిట్లు [4]సేసెద రనునగ వెగడంది కలంగంబడి రయ్యవసరంబున.

226\. శా. ధీరత్వం [1]బోకఁడుఁ [2]సహాయముగ రాధేయుండు దివ్యాస్త్రసం
చారోల్లాసము సూపెఁ జూపుటయు రక్షస్సంచయానేకమా
యారూపావలి భాస్కరాంశుల నదృశ్యాకారమై పోవునీ
హారంబుం దలఁపించుచుఁ విరిసె [3]నే నాశ్చర్యముం బొందితిన్.

227\. చ. మగుడఁగ [1]దానవప్రవరుమాయ [2]సమంచితదివ్యబాణశ
క్తిఁ గుదియఁ జేసి తొంటితనతీవ్రత గైకొని నీదుసైన్యముల్
బెగడువడన్ మదించి యతిభీమసముద్ధతి నింక నెమ్మెయిం
దెగఁ డనుభీతి యోధులమదిన్ జనియింపఁగ నాక్రమించినన్.

228\. వ. వార లందఱు సూతనందనుం జూచి యాతండు గలంగమికి నచ్చెరువందుచు నగ్గించి యతని నుద్దేశించి యిన్నిశాచరుం డిందఱ సమయింపకుండం గాచికొనుము నీవును బ్రదుకు మాఖండలుండు గవచకుండలంబులు గొనునప్పుడు నీకు నొసంగిన మహాశక్తి యింక నెన్నఁటికి భీమార్జునులు నిన్నేమి సేసెద రిప్పుడు బ్రదికిన మఱి చూచికొంద మప్పరమసాధనంబు వీని పైఁదం బ్రయోగింపు మనునెడ నారక్కసుం డామేటిమగని గిటడం చువాఁడై యాటోపంబునం గదిసి తదీయరథ్యంబులఁ బటుగదాపాతంబునం బొలియించె నట్లవ్వీరుండు విరథుం డగుటయుం దఱిమి యద్దనుజుండు గదాంతరపాతాభితాడితుం జేసిన [1]నోసరిలి యతం డాసైనికుల యాలాపంబుల నాలించి తనకుఁ జావు దప్పించుకొన నది దప్ప నొండుపాయంబు లేమిం జేసి.

---

3\. గప్పికొని – శ. ష; – (గట్టుకొని) కొన్ని ప్రతులు; వంచికొని – త. మ. 4. సేసెదరుగాక మానవు లిట్టివారునుం గలరే యనువగ – ఐ.

226\. 1. బు కడున్ సహాయముగ – వ. హా. 2. సహాయుడుగ – ష; సహాయుడగు రాధేయుండు – చ. వ. శ. 3. నత్యాశ్చర్యముం బొందగాన్ – వ. స. హా. కొన్ని ప్రతులు.

227\. 1. దానవాధిపుని – ఉ. ఊ. ఘ. ఠ. ల. కొన్ని ప్రతులు. 2. యడంచి తదీయబాణ – వ.

228\. 1. నొచ్చి – ఐ. ర. పీ. శ. ష.

-: కర్ణుఁ డింద్రదత్తం బైనశక్తిచేత ఘటోత్కచునిం జంపుట :-

సం. 7_154_5

229. ఉ. వైరివినాశనక్రియకు వాసవుఁ డిచ్చిన [1]డాఁచి యున్నయా
ఘోరపుశక్తి నాలుకలు గ్రోయ మెఱుంగులు ప్రజ్వరిల్ల ఘం
టారవ మభ్రవీథి నిగుడం దగఁ గేల నమర్చి పేర్చి య
వ్వైరికిఁ [2]బూఁచినం దలఁకి వాఁడు [3]మహోన్నతఘూర్ణితాకృతిన్.

230. తే. తెరలి పాఱఁగఁ దలచుచో దృష్టితోడఁ
[1]గూడికొను ముష్టి మృత్యువు తోడఁబుట్టు
వనఁగఁ జాలునద్దివ్యసాధనము వైచె
గగన[2]తలమున భూతసంఘములు మ్రోయ.

231. వ. ఇవ్విధంబున రాధేయుండు మహోగ్రంబుగా వైచిన.

232. క. మును మాయ మ్రింగి దనుజేం
ద్రునియురము వగిల్చికొనుచు దుర్భరగతి వీఁ
పున వెడలి శక్తి యెగసెను
వినువీ[1]థికి నుడుగణంబు [2]వెలుకం బాఱన్.

233. వ. అప్పుడు.

234. క. [1]సోలుచు బోరగిలం బడి
నాలుక వెడలంగఁ బెట్టి నడుము గఱచుచున్

---

229. 1. డాఁచి (దాఁచి) యున్న — మ. య. శ. ష. సూ. హా. పెక్కు ప్రతులు; నుంచి యున్న — వా. 2. బూన్చినన్ — ఇ. ఈ. ఐ. ఒ. ల. కొన్ని ప్రతులు. 3. మహో గ్రత — ర. హా.

230. 1. గూడికొన (ని) ముష్టి-కొన్ని ప్రతులు. 2. భూతలభూత — ఊ. ఏ. క. ర. హా.

232. 1. థిని నుడు గుణంబు — ద. స; ధి మరుద్గణంబు — వ. వీ; థీ నమర్త్యగణంబు — స. హా. 2. వెలువెల బారన్ — ఈ. ఊ. ఏ. స. హా.

234. 1. రోలుచు — ఇ. ఈ. ఉ. య. ర. ల.

లాలలు గ్రమ్మఁగ రథుఁ
పాలుఁడు వికృతాస్యుఁ డగుచుఁ బ్రాణము విడిచెన్.

285. వ. ఇట్లు ఘటోత్కచుండు పడిన మనసైన్యంబున శంఖభేరీస్వనసహితంబు లగు సింహనాదంబు నెలంగె నీపుత్త్రుండు బంధుమిత్రసమేతంబుగాఁ [1]బ్రమోదంబు నొంది సూతనందనుం గౌఁగిలించి తనయరథం బెక్కించికొని యుల్లసిల్లె ననిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

286. క. బలు[1]మాయాబలశాలి
బలములు గలవాఁడు భీముపట్టి పడిన న
గ్గల మగుశోకముం గోపము
[2]నలఁచుం బాండవుల నెట్లు లైరో వారల్.

287. వ. అని యడిగిన నమ్మహీపతికి నతం డిట్లను నట్లు మృతుం డైన హిడింబాసుతుం జూచి కౌంతేయు లత్యంతదీనమానసు లై కన్నీరు గడలుకొన నడలునఁ గుందిరి గోవిందుండు ప్రమోదంబు నొంది సింహనాదంబు సేసి శంఖంబు పూరించి పగ్గంబుల నొగల ముడిచి మందమారుతాందోళితం బగు మందారంబుచందంబు దోఁప నర్తించుచు నరదంబునడిమి కరిగి కిరీటిం గౌఁగిలించికొని వీఁ పప్పళించి వెండియు నార్చిన నాతం డయ్యుపేంద్రు నుపలక్షించి.

288. ఉ. చచ్చె ఘటోత్కచుండు మనసైన్యము లెల్లఁ గలంగి నల్గడ
న్విచ్చుటఁ జూచి యేము వగ నెక్కొన నుండెద మిప్పు డిమ్మెయిన్
వచ్చెఁ బ్రమోద మెట్లు గరువంపుఁ జరిత్రము దక్కి లాఘవం
బచ్చుపడం దెలంగెదు మహాపురుషా యిది యేమి చెప్పవే.

285. 1. కుబ్బున్నం బొంగుచు – హ.

286. 1. శౌర్యోద్ధతి మాయా – ఆ. గ. 2. నలఁపఁగఁ బాండుసుతు లెట్లు – ఖ. ఝ. వీ. శ. ప. స.

-:. కృష్ణుండు ఘటోత్కచుండు పడఁ దాను సంతసించుటకు నిమిత్తం
బర్జునుతోఁ జెప్పుట :-

సం. 7-165-11

239. వ. అనుటయు నయ్యచ్యుతుం డతని కిట్లను నింద్రుండు గుండలంబులు [1]కొను చుండి కర్ణుని కిచ్చినశక్తి యతనికడ నున్నంతకాలంబును నిన్ను బ్రదికించుట దుష్కరం బని తలంచుచుండుదు నేఁడు హిడింబానందను మీఁద నది వోయినం బ్రమోదంబు నొందితి నాసూతనందనుం డదినేత నుండె[2]నేనిఁ జక్రగాండీవధరులమై మన మిరువురముం గవిసితి మేనియు [3]జయించు నతండు దేవసన్నిభుండు దివిజపతి వేఁడినఁ గవచకుండలంబులు [4]వికృత్తం బులు సేసి యిచ్చుటవైకర్తనుం డనం బరగె నీకై మీతండ్రి యిట్లు సేయఁ డయ్యె నేని వాని కెదు రెవ్వరు కవచకుండలవిహీనుం డై మానవ సామాన్యంబు నొందుటను శక్రదత్తసాధనంబు లేమిం జేసియు నింక నీకు గెలువ వచ్చు నిట్ల యేకలవ్యశిశుపాలజరాసంధాదు లీక కానొక్కొక్క తెఱంగునం [5]బిలుకుమార్చితి నిత్తఱి వార లున్నఁ గౌరవపతి వారలం దెచ్చుకొను నమ్మువ్వురుఁ గూడిన నెవ్వరికి నోర్వరాకుండు ఘటోత్క చుండును గిమ్మీరబకహిడింబులతోడివాఁడ ధర్మద్వేషంబును రోషంబును గలిమిం జేసి యొక్కప్పు డొప్పమి వచ్చుం గావున నద్దానవులయట్ల వీని బొలిసిపోకయు నాకభిమతంబు వీఁడు రావణు[6]నట్టివాఁ డగుట నిపుడు సావకుండెనేనిఁ బదంపడి నాకుం జంపవలయు నిది సంతోషకాలంబు గాని శోకసమయంబు గాదు మనమొనలు గలంగెఁ గురుబలంబు పైకొనియెడు నీవుఁ దెలిసి యుత్సాహంబు వాటింపు మనియె నని చెప్పిన విని ధృత రాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై.

---

239. 1. గొనునప్పుడు - పీ. 2. నేని చక్ర - ఔ. ఖ. జ. ఞ. ద. న. ప. బ. ఇట్లు కొన్ని తాళపత్ర ప్రతులలో 'పని' శబ్దము కలగా కన్పించుచున్నది. • 3. గెలుచు - కొన్ని ప్రతులు. 4. వికర్తనంబులు - రీ. పీ 5. దీర్చితి - ఆ. ఈ. ఐ. ఔ. య. ల. కొన్ని ప్రతులు; గడతేర్చిరి - ద. వ; నిర్జించితి - ర. 6. నంతవాఁ డగుట నిప్పుడు తెరలకుండెనేని - బ.

240. చ. [1]ఒకనిని జంపి యిట్లు సనునుజ్జ్వలశక్తి నెఱింగి కర్ణుఁ డే
టికి నరుమీఁద దాని నిగిడింపక యిన్నిదినంబు లప్రయో
జకముగఁ జేసెఁ గయ్యము భుజాబలశాలి నరుండు వడ్డఁ బో
రికి మఱి యుత్సహింపఁ గలరే పెఱవారలు సూతనందనా.

241. క. పిలిచికొని యైనఁ బార్థుం
బొలియింపఁడ శక్తి నతఁడు పోరికి నెవ్వా
రలు రమ్మన్నను [1]వ్రత మయి
తలకొని చనుఁ గర్ణుఁ డేల [2]తప్పంజేసెన్.

242. వ. అని వెండియు.

243. తే. నాతనూజులు దుర్బుద్ధు లీతెఱంగు
నీవుఁ దలఁపవ యాశక్తి నీరజాక్షుఁ
డొడిచికొనియెనె [1]మొఱకుచే నున్నతియ్య
పండు వెస నాఁచికొనిన నేర్పరియుఁ బోలె.

244. వ. అనిన నమ్మహీపతికి సంజయుం డిట్లనియె.

245. తే. రాత్రు లీపని కర్ణుతో రాజు ననుజ
సమితియును నేనుఁ దగఁ జెప్పుదుము నరేంద్ర
యతఁడు లెస్సగ విని యెల్లి యక్కిరీటి
నచ్చుఁ బటుశక్తి నని బాస యిచ్చు మాకు.

246. వ. ఏము వెండియు నాకర్ణునితో నిట్లందుము వివ్వచ్చుండు నచ్చినం దక్కటి
పాండవులం [1]దొక్కనిఁ బద్మనాభుండు పట్టంబు గట్టుం గావున ననర్థ
మూలం బగు నమ్మాధవుండు దెగినఁ జగతీరాజ్యంబు మనకు దక్కు నింద్ర
దత్తం బయినశక్తి నతని సమయించుట గార్యంబు.

---

240. 1. ఒకరుని – ర. వ.

241. 1. శూరత ?లగొని – య. 2 తప్పెం జెపుమా – కొన్ని ప్రతులు.

243. 1. శిశువుచే నున్న – ఊ. బ వ. స; మూఢుచేనున్న – ఈ. ద. ల. హా.

246. 1. దొక్క[illegible] – కొన్ని ప్రతులు

247. క. అని చెప్పినయమ్మాటలు
విని యెల్లవిధముల గృష్ణవిజయులలో నొ
క్కనిం బొరివుచ్చెదం జూడుం
డనుచుం జనుఱ సూతసుతుం డహంకారముతోన్.

248. తే. వినుము వేగిన సంగ్రామమునకుం బోయి
నప్పు డక్కర్ణునకు మాకు నందఱకును
దోంప దాబుద్ధి వెండియుం దోంచి మగిడి
వచ్చి శిబిరంబు సొరంగ దైవంబుకతన.

249. వ. దైవం [1]బన వేఱొకండు గలదె కృష్ణుండ యది యెట్లనిన నట్లర్జును
శోధించునప్పుడు సాత్యకి శౌరితో నాసూతసుతుం డీశక్తి యిన్ని దినంబులు
ధనంజయుమీందం బ్రయోగింపమికిం గారణం బేమి యని యడిగిన నతండు.

250. తే. వానివా రెల్ల నీపసివాని కెపుడుం
గఱపుదురు వాండుం బూన్కి మైం గడంగి వచ్చు
దాంకుదల నేను వారలందఱును మఱచు
నట్లు సేయుదు నరునకునై కుమార.

251. వ. అని పలికి ధృష్టద్యుమ్నాదులం బేర్కొని యాతనిం గలిపికొని సాత్యకి
నుద్దేశించి.

252. క. మీరును బ్రాణములు ద్రిలో
కీరాజ్యము నాదుబుద్ధికిం బార్థుక్రియం
గూరిమికిం బాత్రంబులె
యీరేయి గదా సుఖించి యే నిద్రింతున్.

253. వ. అని చెప్పె నట్లు గావున [1]మనకుం బశ్చాత్తాపంబు వలవ దనుటయు ధృత
రాష్ట్రుండు మీరు దైవోపహతుల రమ్మహాశక్తి దృణీభూతుం డగుఘటో
త్కచునకుగా వమ్మయ్యె నింక మీవా రెవ్వరు నెప్పరుపున బ్రతికెదరు
చేయునది లే దట మీందివృత్తాంతంబు సెప్పు మనవుడు నజ్జనపతికి సంజయుం
డి ట్లనియె.

---

249. 1. బు వేఱొకండు లేదు – ఏ. ఐ. ఒ. ఓ. బ. య. ర. ల. కొన్ని ప్రతులు.

253. 1. మన మనంబునం బశ్చాత్తాపంబు – ల. వ.

254\. తే. భీమనందనుచావునఁ బ్రేముడించి
ధర్మతనయుండు బాష్పాంబుధార [1]లడర
మేను డిల్లంబుగాఁ దేరిమీఁద వివశుఁ
డగుచుఁ జదికిలఁ బడుటయు నచ్యుతుండు.

255\. వ. రయంబునం జని కరంబులం బొదివి యతని నాలోకించి.

256\. క. ప్రకృతిజనునట్టు లిమ్మెయి
వికృతిం బొందంగఁ దగునె విను మిట్లయినం
జకితం బగు నీసైన్యము
సకలము లె మ్ముత్సహింపు సమరంబునకున్.

257\. వ. నీవు వహించుగురు[1]భారంబు దలంపక యింతయలంత నొందిన జయంబు సేకుఱునే యనిన నతండు గన్నీరు కరతలంబున నొత్తికొని మెత్తనిమాటల ఘటోత్కచుగుణంబులు గణుతించి కామ్యకవనంబునను గంధమాదన యాత్రను దమకుఁ జేసినసాహాయ్యం బుగ్గడించె వాఁడు నాకు భక్తుం డేనును సహదేవుకంటెను వానికిం గూర్తు నట్టిపట్టి లే కున్న నాకు శోకంబు గాకుండునే యని తత్ప్రతివీరుని దెసకు నెలసిన యంతరంగంబు రోషాక్రాంతం బగుటయు నిక్కుమారు నిట్లు సేసిన యీదుర్జాతుండ కాఁడె మున్ను నభిమన్యువిల్లు నఱికి చిక్కువఱచి యబ్బాలునిం బలు[2]వుర చేతఁ జంపించె నప్పుడు దవ్వుల నున్నసైంధవుని సవ్యసాచి సమయించె నది దానికి మాఱుగా దీరెండుక్రూరకర్మంబులకుఁ గర్ణునిఁ గడికండలు సేయక శాంతిం బొంద నేర్తునే యని బిగువుటెలుంగునం బలికి దిగ్గన లేచి [3]యాద్రోహికి నిన్నయు నేఁడును దోడ్పడినద్రోణుం దెగటార్పవలయు నప్పనికిఁ బావని [4]పోవునే సూతసూనుం డున్నెడకుం బోయెద నని శంఖం బొత్తి చాపంబు పుచ్చికొని రథంబు నడప సూతు నియమించి చనుచుండె నప్పు డచ్యుతుండు దమ తేరిపైకి వచ్చి వివ్వచ్చు నీక్షించి.

---

254\. 1. లోలుక - ఐ. ఒ. క.

257\. 1. భారకార్యంబు - హ. 2. పురం బనిచి (బంచి) చంపించె - అ. ఒ. క. ఘ. ఙ. ణ. య. ర. ల. వ. హ. 3. ద్రోహునకు - శ. ష. పెక్కు ప్రతులు. 4. యోవునే - ఊ. జ. ఐ.

258\. క. తనచేతన సూతసుతుం
దునుముఁడుఁ గా కనుచు నలుకతోడ రయమునం
జనియెడు ధర్మసుతుం డీ
తని నూరక చూచుచునికి దగునే [1]మనకున్.

259\. ఆ. అని రథంబు వెలుచఁ జన నిచ్చె నట్లు క్రో
ధాంధవృత్తి నరుగునవ్విభునకు
సమ్ముఖంబు గాఁగ సత్యవతీసుతు
డరుగుదెంచి కరుణ నాదరించి.

260\. వ. అతండు ప్రణతుం డైన దీవించి యి ట్లనియె.

261\. సీ. అనిమిషనాథుఁ డిచ్చినశక్తి యర్జును సమయింపఁ గర్ణుండు సంగ్రహించె
నది యున్న దాన నయ్యాపద వాటిల్లె నేని నయ్యలఁత సహింప వశమె
యీఘటోత్కచునకు నింతియ కాల మై యీ వెపంబునఁ దెగటాఱెఁ జూవె
యిట్లు మే లిది దైవ మిచ్చినదురితనిస్తారంబు [1]నీకింత దలఁచి నీవు

ఆ. సంభ్రమంబు దక్కి సైన్యంబు దోడ్పడ
మనుజపతులఁ దమ్ములను సుహృజ్జ
నములఁ గూర్చికొని రణంబు సేయుము కురు
ప్రతతితోడ నీదుబలము [2]మెఱయ.

262\. క. కలఁక యుడిపి చిత్తము ని
ర్మలధర్మోదాత్తముగ నమర్చి నెగడు మె
వ్వలనఁ గలుగు ధర్మం బ
వ్వలనికి [1]జయమంగళము లవశ్యముఁ గలుగున్.

---

258\. 1. నీకున్ - మ.

259\. 1. సరవి నెద్దురు గాఁగ - వ.

261\. 1. వాక్కింత దలచి - వ; మీ కింత దలచి - ల. స; మీ దింత దలచి - న. 2. వెలయ - కొన్ని ప్రతులు.

262\. 1. జయ మగ్గలం బవశ్యము - న.

263. వ. అని హితోపదేశంబు సేసి.

264. క. విను మేనగుదివసంబున
నినుఁ బొందు [1]ననూనమేదినీరాజ్యశ్రీ
యనుమాన మేమియును లే
దని గ్రక్కున నమ్మునీంద్రుఁ డరిగె నరేంద్రా.

265. వ. ఇట్లమ్మహాముని సనుటయు సావధానుం డై పాండవాగ్రజుండు ధృష్ట ద్యుమ్నుం గనుంగొని గురునిపురోభాగంబునఁ గౌరవసేన భీమసేనుండు దాఁకి తెరల్చుచున్నవాఁడు నీ వక్కుంభసంభవుసంరంభంబు మాన్పుము తద్వినాశం బాచరించుట కయి యనలంబున జనియించినవాఁడవు శిఖండి ప్రముఖపాంచాలకుమారులం గొని యరవాయి గొనక యడరు మని పలికి కెలంకుల నున్న నకులసహదేవద్రుపదవిరాటద్రౌపదేయశైనేయకేకయుల నాలోకించి మీరును ఫల్గునపురస్సరంబుగా ద్రోణవధంబునకుం గడంగుఁ డనుటయు.

266. క. వారలు దమతమబలములుఁ
దారును గవియుటయు నత్యుదగ్రత గురుఁ డ
వ్వీరానీకము మార్కొని
పోరికిఁ దనసైన్యసమితిఁ బురికొల్పి తగన్.

267. వ. బరవసంబు వాటించెఁ గురువిభుండును గోల్తల సేసె నప్పు డిరుదెఱంగుల నాహినులును దగ యెత్తి తూలంజొచ్చె నీసైనికులు డప్పియు నిదురయుం గదిరి మేను లలయం గొందలంపడి రెల్లవారికి నాత్రియామ సహస్రయామ యయి తోఁచె నట్లైనను నిజధర్మంబు ప్రతిపా[1]లింప నదరి పెనంగుచుండిరి నిద్రాపరవశత్వంబున దివియలవారును హీనప్రయత్నులైనం దమంబు గవియం దొడంగె నట్టియెడం [2]గునికి కునికి యాయుధంబులు వడ [3]విడుచు

264. 1. ను సకలమేదినీ – బ.

267. 1. లించు పెనంకువం బెనంగుచుండిరి – వ. శ. స. హ. కొన్ని ప్రతులు.
2. గూరికి యాయుధంబులు – పెక్కు ప్రతులు. 3. వైచువారును – బొ. గ. వ.

వారును వాహనంబులు వోయినట్లు పోవం [4]దెరలువారును [5]జొక్కునం దమవారిం దామ యెదిరి పొడుచువారును మఱియు ననేకప్రకారంబు లగువికలసంచారంబుల గాసి యగువారును నగుటయుం గని గాండీవి యిరువాఁగు నుద్దేశించి యెలుంగెత్తి.

268. క. అడరెడునిద్రా[1]భరమునఁ
గడు డస్సితి రెల్లవారుఁ గలనను జాడ్యం
బెడలఁగ జొక్కుమడుఁపుఁ డి
ప్పుడ చంద్రుఁడు వొడుచు వెండి పోరుట యొప్పున్.

269. వ. అనిన విని మనవారలందఱు నట్లు మే లని కర్ణదుశ్శాసనుల యనుమతి వడసి విశ్రమించిరి పాండవసైన్యంబును విశ్రామంబు నొందె గగనంబున దేవగణంబు ధనంజయు ధర్మజ్ఞత్వంబు ప్రస్తుతించె నయ్యవసరంబున.

270. ఆ. కరుణ గలవు మమ్ము గారవంబున సుఖా
న్వితులఁ జేసి తనఘ నీకు సురలు
వరము లెపుడు నిచ్చువారు గావుత మనో
రథముఁ బొందు మమరరాజతనయ.

271. క. అని యక్కౌరవసైన్యము
జనములు సంప్రీతి సవ్యసాచికిఁ బలుదీ
వన లిచ్చుచు నాతనిఁ గీ
ర్తన సేయుచు నిద్ర వొందె ధరణీనాథా.

272. వ. ఆసమయంబున నుభయబలంబులయందును.

273. క. తరుణులకుచములపై రతి
పరవశులై యొఱగుపతులపగిది సమరసం

---

4. నిదుర వోవువారును - అ. ఉ. శ. వ. కొన్ని ప్రతులు. 5. రోలుచు - ఉ. ర; రొప్పుచు - క. ర; రొచ్చుచు - అ. ఆ. ఇ. ల. కొన్ని ప్రతులు. శ. ర. లో యిట్టి ధాతువు కనబడలేదు.

268. 1. వశమున - ఊ. ఏ. ఒ. క. య. ల. హ; వేశము - ఇ. ఈ. ఉ. ఠ. డ. ర. వ.

భరితశ్రమమున నిద్రిం
చిరి కరికుంభములఁ [1]జెంది చెన్నుగ జోదుల్.

274. క. తురగంబులపై నాశ్వికు
లరదంబులమీఁద రథికు లప్పుడు నిద్రం
బొరసిరి [1]కొందఱు భూస్థలి
నిరవుగ సుఖనిద్ర సేసి రి ట్లున్నంతన్.

275. సీ. నలువ చెందొవలఁ జేకులకు [1]నన్నువు వెట్టఁ గోరి కావించినగుళిక యనఁగ
నఖిలద్విజశ్రేష్ఠ మగుచకోరచయంబు తపము[2]సముల్లసత్ఫల మనంగఁ
జిగురుఁ జొంపము ననుజిగి [3]యొప్ప నుదయాద్రిఁ బొలుపారు నవకల్పభూజ మనఁగఁ
బూర్వపయోరాశి పొంతఁ గెంజాయచె న్నొందవిన పవడంపుఁ [4]బోద యనంగ

తే. నరుణరుచిఁ దనమండల మతిశయిల్లఁ
బొడిచి దివిఁ బ్రాఁకి దీధితు లడరఁ జేసి
యంతకంతకు నెక్కుచు సంతమసముఁ
[5]గాలుకొన నీక చంద్రుఁడు గ్రాలె నధిప.

276. వ. ఇట్లు ప్రౌఢుం డై కామినీగండపాండుచ్ఛవిం దొట్టి కుముదంబులకు జగన్నేత్రంబులకు నానందం బాపాదించుచుఁ జంద్రుఁడు మహేంద్రప్రముఖదిఙ్ముఖంబు లలంకరింపఁ గౌరవపాండవబలంబులు మేలుకని యాలంబునకుఁ దొడఁగె నప్పుడు కురురాజు గురునికడకుం జని యతనియస్త్రవీర్య

273. 1. మీద - కొన్ని ప్రతులు.

274. 1. భటులును - హ.

275. 1. నన్నియ - ఇ. గ. స. హ; నన్నువ - పెక్కు ప్రతులు. అర్థము విచార్యము. 2. సంపుల్లసత్ఫల - న. 3. యొప్పు, సొంపు - అని పాఠములు. 4. బోదె యనగ - ఊ. ఐ. ఔ. ద. స. 5. గడలు కొననీక చంద్రుడు పొడిచె నధిప - కొన్ని ప్రతులు.

శౌర్యంబు [1]లగ్గించి యిట్టివాఁడవు నీకు సరిగానివారిం బాండవులఁ బెద్ద సేసికొని శిష్యత్వంబు వాటించి పోటునకుం జొరక తిరుగుట నాభాగ్యంబు చందంబు గాక నే నేమి సేయవచ్చు ననవుడు నతండు గనలి యర్జునుండు శిష్యుం డని మన్నించియ కాదె ఖాండవం బాఖండలుండు గోలుపోయె ఘోషయాత్రఁ జిత్రసేనాదిగంధర్వులు నిన్ను [2]విడిచి వలియం బాఱిరి నివాతకవచకాలకేయాదులు వ్రాలిసి [3]రిది యేల వలవనిదురుక్తు లనుటయు నమ్మనుజపతి గోపించి సంరంభంబుగా నక్కుంభసంభవుతో నీవు సవ్యసాచికిఁ జాలవేనిం జాలవ కాక నిలువుము కొంతసైన్యంబు గొని నీయోపినవారి తోడం బెనంగు మేనును దుశ్శాసనశకునికర్ణులు నాకవ్వడిం గూల్చెద మనిన నవ్వి యవ్విరుం డట్ల చేయుం డిది గర్జం బత్తెఱంగునన గెలుతురు గాని పొం డని పలికి వెండియు.

277\. క. కుడిచితి కట్టితి [1]పెట్టితి
పుడమి సమస్తంబు [2]నఖిలభోగంబుల నె
క్కుడుపేర్మి ననుభవించితి
తొడరుము వెఱ పుడిగి పార్థుతోడఁ గుమారా.

278\. వ. అని యప్పాంచాలబలంబు[1]దిక్కు [2]పేరుక్కున నడచెఁ గౌరవపతి యును బాండవులవలసికి నురవడించె నిట్లు [3]వేకువజామున సంగ్రామంబు సెల్లఁ బదంపడి తూర్పెల్ల నగుచు వచ్చె నప్పు డచ్యుతుం డర్జును నాలోకించి [4]రెండు[5]మైల గండు మిగిలి వచ్చి [6]పోరెదు నిమ్మోఁకల నన్నిఁటిని డాపట నిడి తలుపువలయు నని యుతం దొడంబడ నమ్మోయి నరదంబు [7]నడపె భీముండును [8]బరవసంపుమాటల బీభత్సునిం బురికొలిపె నివ్విధంబున గడం గినగాండీవిం బొదివి దుర్యోధనదుశ్శాసనశకునికర్ణులు పెల్లేసిన నయ్యోధ వరుం డందఱ కన్నిరూపులై యెట్లాడ నిరువాఁగును బెరసి [9]తలలు వట్టి కొని పోట్లాడెఁ దదనంతరంబ.

---

276\. 1. లుగ్గడించి - కొన్ని ప్రతులు. 2. విడిచి విరియంబాఱిరి, విడిచి వినువీధి జీవంబుతో పాఱిరి - అని పాఠములు. 3. రివి యెల్లను వలవని - కొన్ని ప్రతులు.

277\. 1. పెరిగితి - హా. 2. సకల - వీ. శ. ష; నిఖిల - ఒ. గ. బ. హా.

278\. 1. దెసకుం - ఒ. 2. బేరుక్కున నడపె - శ. ష. 3. వేగుజామున - కొన్ని ప్రతులు. 4. ద్రోణుప్రాపున గండుమిగిలి - జ. ట. వ. 5. మేయిల - పెక్కు ప్రతులు. 6. పోరెద రిమ్మోఁకల - ఊ. ఏ. ఔ. ఝ. 7. వరపి - కొన్ని ప్రతులు. 8. బవరంపు మాటల-పెక్కు ప్రతులు; బీరంపు-ద. వ. 9. యని తలం దలకొని-వీ. స.

279\. క. మొనలోఁ నిలువక యుత్తర
మునకై చని యేకతంబు మొనసినగురునిం
గని పాండవసైన్యము పులిఁ
గనిన[1]హరిణకులమునట్లు కంపము నొందెన్.

280\. వ. ఇత్తెఱంగున [1]నెఱి గలిగి యద్దెసవారిం బిలిచిన నాసైనికు లచ్చెరువడువారును గోపించువారును గడంకలు [2]దెచ్చుకొనువారును నివ్వెఱఁ గందువారును నయి రందు విరాటద్రుపదులును ద్రుపదు [3]మనుమలలోన మువ్వురును గేకయపతులును సబలంబుగా బలువిడిం గవిసి యక్కుంభసంభవుం జుట్టుముట్టిన నతండు.

281\. మ. ప్రజ నెల్లం దునుమాడి యుగ్రముఖుఁడై పాంచాలపౌత్రత్రయం
బు జముం జేరఁగఁ బుచ్చి కేకయుల కేపుం జేవయుం జూపి యం
బుజముల్ గోసినకైవడిం దలలు సంఫుల్లాస్యభల్లంబు ల
క్కజ మైయుండ నిగిడ్చి త్రుంచెఁ బటుదోర్గర్వం బఖర్వంబుగన్.

282\. వ. వెండియు.

-: విరాటద్రుపదులు ద్రోణునిచేతఁ జచ్చుట :-

సం. 7-161-34

283\. శా. చంచద్బాణపరంపరాప్రహతులన్ సైన్యంబుఁ గ్రూరోద్ధతిం
జించెం జించిన నింక నెన్నఁటికి నిస్సీ భూరిబాహాబలం
బంచుం గూడి కడంగి నొంపఁ గుపితుం డై మత్స్యభూవల్లభుం
బాంచాలక్షితినాథునిం దునిమె దర్పస్ఫూర్తి శోభిల్లఁగన్.

---

279\. 1. హరిణచయము - పెక్కు ప్రతులు.

280\. 1. నరిగి, యేగి, దరిమి, యెడగలిగి - అని పాఠములు. 2. దేర్చుకొను వారును - ఆ. ఉ. ర. వ. 3. కొడుకులలోన - శ. ప. స. పెక్కు ప్రతులు. ఇచ్చట మూలమునందు పౌత్రులనియే కలదు 'తథాచరంతం సంగ్రామే భృశం సమరదుర్జయమ్, ద్రుపదస్యతతః పౌత్రాస్త్రయ ఏవ విశాంపతే' చిత్రశాలాప్రతి ద్రోణ - 186 - 32.

284. వ. ఇవ్విధంబున విరాటద్రుపదులు పడినం జూచి ధృష్టద్యుమ్నుండు ద్రోణుం జంప నయితినేనిం గులా[1]చారధర్మంబులకుఁ దప్పినవాఁడ నగుదు నని పలు వురు విన బాస యిచ్చి పాంచాలసేనాసమన్వితుం డై యతనిపయిం గవిసినం గురుపతి కర్ణాదులుం దానును నడ్డపడి పెనంగెఁ బెనంగినం దవులంబడిన యాద్రుపదనందనుం గనుంగొని యనిలతనయుం డదల్చి నన్నుఁ జూడు మనుచు నడరిన నప్పార్షతుండును గూడికొనిన నక్కౌరవేశ్వరుండును బరవసంబు సేయుటయు నుభయబలంబులుం బురికొని తలపడిన సంకుల సమరం బయ్యె నంత.

285. క. విరియించి [1]తామరలలో
నరు[2]ణాంశులు సొచ్చి శుభగ మగు సౌందర్య
స్ఫురణము నొందఁగఁ దోఁచెం
దరణి యుదయశిఖరిమీఁద ధరణీనాథా.

286. వ. అప్పు[1]డు రెండుదెఱంగులజనంబులుం గాలోచితకృత్యంబులు సలిపి క్రమ్మఱఁ గయ్యంబు సేయం దొడంగిరి ప్రొద్దెక్కిన నెండతాఁకును రేయింటియలజడియు నప్పటియాఁకలియు నొడళ్లు డిల్లపడం జేసినను మొగంబులు వెడంగు పఱపినను బోలివోనిపౌరుషంబుల నయ్యిరువాఁగునుం గడంగి కలయం బెరసి పెనంగు నారభసంబునం [2]బెల్లెసఁగుధూళికతంబునం బోయినరాత్రి మగుడ వచ్చె ననుబుద్ధి యెల్లవారికిం బుట్టె నట్టియెడ ద్రోణధనంజయులు మిసిమింతులు గాక సేనలం జీకాకుపడ నీక పొదివి పోరించిరి బెట్టిదంబు లగు వివిధాస్త్రశస్త్రపాతంబులం గరితురగపదాతివ్రాతంబుల శరీరంబులం దొరం గురుధిరం బారేణువు నడంచిన కొలఁది నిలువక బహుళప్రవాహంబుల నుత్పాదించె సార్పులు బొబ్బలుం [3]బోట్లనొఱలు చప్పుళ్లును బిందంబుల మ్రోఁతయు బెరసి పరగి నలుదిక్కులుం బిక్కటిల్లె నాసమయంబున.

---

284. 1. చారంబునకుం దప్పిన్ - కొన్ని ప్రతులు.

285. 1. తామరలతో - వా (1965) ఊ. మ. య. వ. 2. ణచ్ఛవి జొచ్చి - బ. వ.

286. 1. డిరుదెరంగుల - ఊ. ఏ. 2. బెల్లెగయు, బిట్టెగయు - అని పాఠములు.
3. భేరీధ్వనులును - గ. జ.

287. తే. పతియు యువరాజుఁ గవలను పార్థు గురుఁడు
భీముఁ గర్ణుండుఁ దాఁకి రుద్ధామలీల
వారి రథబహుగతులు దుర్వారవిశిఖ
[1]విసరణంబులు నద్భుతవిధము లయ్యె.

288. క. నకులుఁడు నృపతి[1]యు నొక్కం
డొకనిం జుట్టుకొని వచ్చు[2]నొప్పును బలుపుం
[3]బ్రకటీకృత శౌర్యమ్మును
సకలజనముఁ బ్రస్తుతించె జగతీనాథా.

289. క. విను సహదేవుఁడు దుశ్శాసనుసూతునిఁ
దునుమ నతఁడు సారథికృత్యం
బును బలుపుచు నేయుచుఁ [1]గవి
సిన నాతఁడు నొంపఁ బఱచెఁ జెడి తురగంబుల్.

290. ఉ. భీముఁడుఁ గర్ణుఁడుం గదిసి భీమ[1]సముద్ధతి నేటు లాడి రు
ద్దామగదాని[2]పాతనవిధంబులు నప్పుడు గగ్గె నయ్యెడన్
భీమునివాజులన్ రయము పెంపునఁ గర్ణుఁడు గూల్చె మార్గణ
స్తోమమునం గురుప్రతతి చూడ్కులకుం బ్రమదం బొనర్చుచున్.

-: ద్రోణార్జునుల ద్వంద్వయుద్ధము :-

సం. 7-163-20

291. వ. పవననందనుండు నకులస్యందనం బెక్కె గురుండును గిరీటియు వివిధ[1]బాణా
సారంబుల నంబరంబు గప్పుచు సమరవిహారంబు సలిపి రట్టియెడ.

---

287. 1. విస్ఫులింగంబు లద్భుత - గ. ట. బ. వ; వి స్తరంబులు నద్భుత - వ.

288. 1. యును నొకళ్ళొకళ్ళ జుట్టికొని - పెక్కు ప్రతులు. 2. నొరవును - ఊ.
3. ప్రకటిత శౌర్యము గనుగొని - ఓ. స.

289. 1. నిలిచిన, అలసిన - అని పాఠములు.

290. 1. బలంబులు - ఊ. వ. 2. పాతముల దల్పులుఁ జప్పుడుఁ గగ్గె - స.

291. 1. బాణ ప్రసారంబుల, బాణ ప్రహరణంబుల - అని పాఠములు.

292. క. గురుఁ డేయ నరుఁడు ద్రుంపఁగ
నరుఁ డేయఁగ గురుఁడు ద్రుంప నానావిశిఖ
స్ఫురణ[1]పరిహారణముల క
చ్చెరు వందుచు నుండి రుభయసేనలజనముల్.

293. చ. దొరకొని దివ్యబాణములు ద్రోణుఁడు బల్విడి నైంద్ర మాదిగా
నరుపయి నేయ నాతఁడు మనంబునఁ గొంకక తత్తదస్త్రము
ల్వెరవున నేసి [1]యేసి [2]యఫలీకరణం బొనరించి పేర్చుఁ ద
ద్వరశరజాలముల్ గురునివారిత మై [3]యడఁగుం బొరింబొరిన్.

294. వ. ఇట్లు సదృశంబు లగుశస్త్రబలబాహువీర్యశౌర్యంబు లసదృశంబుగాఁ బోరు నగ్గురుశిష్యుల నుపలక్షించి సురఖచరవిద్యాధరులు దమలోన.

295. క. హరుఁడు వినోదా[1]ర్థముగా
నిరుమే నయి రణ మొనర్చె నింతియ కా కి
ప్పురుషున నక్కజ మగుసం
గర మొనరింపంగ [2]నొరులఁ గంటిమె యెందున్.

296. వ. అనుచుండి రప్పుడు.

297. మ. క్షితియుం బర్వతకోటియున్ వడఁకె నగ్నిచ్ఛాయ లయ్యెన్ దిశ
ల్చతురంభోనిధులుం గలంగె భయలోలం బయ్యె దేవవ్రజం
బతిసంక్షోభము నొందె నొక్కుమ్మడి సైన్యద్వంద్వముల్ ద్రోణుఁ డు
ద్ధతి బ్రహ్మాస్త్రము మౌర్వితో నియతమంత్రస్ఫూర్తి సంధించినన్.

298. వ. ఇట్లు [1]సువిహితసంధానుం డై యతం డమ్మహాస్త్రంబుఁ బ్రయోగించిన.

---

292. 1. కరణ పరిణతి కచ్చెరువు — ఖ. చ. ఝ. వ. శ. స.

293. 1. యగ్గలిక పీరరణంబొ — అ. గ; యగ్గలిక వేచి రణం బొ — ఊ. ఏ. ఝ. 2. యతివిస్ఫురణం బొనర్చు — ఆ. ఖ. చ. వ. 3. యడరంగ బోరిలోన్ — ఒ. ట. బ. వ.

295. 1. ర్థంబుగ — వ. కొన్ని ప్రతులు. 2. నరుల గంటిమె — వ.

298. 1. నియతసంధానుం డై — స; సన్నిహిత — ర. ల.

299. తే. అంతరంగంబునం దొక యింతయేని
[1]యలుకు లేక తనర్చి బ్రహ్మాస్త్రమునన
వేడుకకు [2]మరలించినవిధము దోఁప
నద్భుతంబుగ వారించె నర్జునుండు.

300. వ. ఇత్తెఱంగున గెలు[1]పోటమియు లేక యయ్యిరువురుఁ బోరుటయు నత్తఱిం గెరలిన సందడికయ్యంబుకతంబున మాని యగ్గురుపార్థులు పాంచాలకౌరవ బలంబులపై దఱిమి రాసంకులసమరంబున దుశ్శాసనుండు ధృష్టద్యుమ్నుఁ దాఁకి యోర్వలేక తొలంగె నతండు ద్రోణుమీఁదం గవిసినఁ గవలును దోడ్పడం గృతవర్మ యడ్డపడి పెనంగె సుయోధనుండును సాత్యకియుఁ దార్కొని తమశైశవక్రీడలు [2]దలంచి యుగ్గడించి రాజధర్మం బిట్టిద కాక యని తలంచి పోరం జొచ్చి రట్టియెడ నాళీనివరుండు భూవరువిల్లు ద్రుంచి మేను [3]నొంచిన నోహటించి యోసరించి డప్పి దీర్చికొని మగుడ నమ్మాధ వానుజుం దలపడి యెప్పటియట్ల [4]పెనంగం జొచ్చినం జూచి రాధేయుఁ డయ్యోధవరుదెసకు నడరినం గని వడముడి యతని మార్కొని తూపులు నిగిడించిన నవి నిలువరించి నవ్వుచు నాతం డవ్వీరు సారథి సొగయను శరాసనంబు దునియలై [5]తొరఁగను జేసిన నాబల్లిదుండు బలుగద ద్రిప్పి బిట్టువైచిన సూతుండును రథంబును బొడియైననుం దెరలక సూతసుతుండు శరవ్రాతంబు [6]నిగిడించె నప్పు డనేకచతురంగంబు లెడసొచ్చె ధర్మతన యుండు మాత్స్యాదిబలంబులం బురికొల్పుకొని కుంభసంభవుదిక్కున కురవ డించె నంత మధ్యాహ్నం బగుచు వచ్చె నాసమయంబున నకులసహాదేవ సమీరనందను లర్జును నుద్దేశించి యెలుంగెత్తి.

301. తే. కోలుపుసఁగి గురుండు పాంచాలసేన
నేలకును గోలకును దెచ్చె నీవు గడఁగి

---

299. 1. నలుక లేక – కొన్ని ప్రతులు. 2. విశ్రమించిన – కొన్ని ప్రతులు; విక్ర మించిన – క.

300. 1. పోటుములు – జొ. ఖ. గ. పీ. శ. మ. 2. పలికి – కొన్ని ప్రతులు. 3. నొప్పిం చిన – ఆ. జ. త. బ. 4. కలంగం జొచ్చి – వా; పెనంగం జొచ్చి – ఖ. గ. చ. ఝ. వ. వీ. శ. వ. 5. తొరుగను – కొన్ని ప్రతులు. 6. పరగించె – కొన్ని ప్రతులు.

కౌరవులఁ బాయవఱపు మేకతమ యైన
నతనిఁ బరిమార్పుఁ [1]బై కొని యబ్బలంబు.

302. వ. అనుచు నయ్యాచార్యుపైఁ గవిసి రిట్లు పెక్కుబలంబులు గ్రమ్మినఁ బటు ప్రదరజాలంబులు వఱపి పొడిసేయు నమ్మహాత్ము నాలోకించి ధర్మతనయ భీమసేనమాద్రీతనయులు గూడికొని తమలోన.

303. మ. కరులం [1]గూల్చుచుఁ దేరులన్ నఱకుచున్ గర్జిల్లి ఘోటమ్ములన్
నరులన్ నెత్తుటఁ దేల్చుచున్ దొరల నానారూపఖండంబు లై
తొరఁగం జేయుచుఁ గుంభజుండు విలస[2]ద్దోర్దండచండాకృతిం
[3]దెరలం బైఁ జనుదెంచు నేపు మనలం దీర్పంగ నోపుం దుదిన్.

304. వ. ఎవ్వరికిని నిలువరింప నలవి గాదు నరుండును ధర్మపరుం డై యూరకున్న వాఁడు దెగువకుఁ జోరం డనుచుఁ దలంకిరి వారి తెఱంగు గనుంగొని కమలనాభుండు దమ తేరు వారలకడకుం గొనిపోయి కిరీటితో ని ట్లనియె.

305. చ. అనిమొన దేవదానవులకైనను గెల్వ నశక్యు మిమ్మహా
త్ముని నొకమందు సెప్పెద [1]సుతున్ హతుఁ డయ్యె ననంగ విన్నయం
తన యితఁ డాయుధంబు దిగఁ ద్రావి యచేష్టతఁ బొందు నప్పు డీ
తనిఁ బరిమార్ప వచ్చు నిది తప్ప నుపాయము గల్గ [2]దెమ్మెయిన్.

306. వ. కావున నశ్వత్థామ సచ్చె నని యొక్కరుం డతనికిఁ జెప్పుటయ కర్జం బనిన విని యచ్చటియందఱు నిదియ మే లని రర్జునుండు దాని కొడంబడక యుండెఁ బాండవాగ్రజుండు విషాదంబుతో విచారించెఁ దదనంతరంబ.

307. క. భీమునిచే నని నశ్వ
త్థామ యనం బరగుభద్రదంతి పడిన ను

---

301. 1. బై కొని - పెక్కు ప్రతులు; జేకొని - వా.

303. 1. గూర్చి రథంబులన్ - రు. 2. ద్దోర్గర్వచండాకృతిన్ - బ. వ. 3. తిర మై వే జనుదెంచునేపు - బ. వ.

305. 1. సుతుండు మృతుండ (హతుండ) యనంగ విన్న - త. వ. స. 2. దేమియున్ - కొన్ని ప్రతులు.

ద్దామగతి [1]నన్నెవమ్మోగ
నామాతుతపుత్రుఁ డేఁగి యగ్గురుతోడన్.

308. వ. అశ్వత్థామ సచ్చె నని చెప్పుటయుఁ జిత్తంబు జల్లని చెదర బెదరియు నతండు దనకొడుకు నస్త్ర[1]వీర్యాదిగుణంబులు గణుతించి యప్పలుకులు పెడచెవులం బెట్టి కలంక లేక ధృష్టద్యుమ్నుపైఁ గవిసి పెల్లేసి యతని కడ్డ పడిన పాంచాలరథికుల నిరువదివేవుర వధియించి మాత్స్యబలంబున కుటిక యేనూఱురథంబులఁ బదివేలుమాతంగంబుల నన్నియతురంగంబులం బోరి గొని తెజరిల్లి రాజులగముల[2]కు నాదిగొనునప్పుడు విశ్వామిత్ర జమదగ్ని భరద్వాజగౌతమ కశ్యపవసిష్ఠాత్రిప్రభృతిమునివరప్రకరం బాతని పాలి కేతెంచి భారద్వాజా నీవు బ్రాహ్మణుండవు [3]వేదవేదాంగవిదుండవు నీకు సంగ్రామంబు సేయ ధర్మం బగునే యింతకు మున్ను చేసితేనియుఁ జేసితి గాని కాలంబు పూర్ణం బయ్యెఁ గాన నింక సమరంబు నుడుగుట మేలు మామాటలు పట్టి యాయుధంబులు వెట్టి శాంతిఁ బొందు మని చెప్పి యంతర్ధానంబు సేసిన నవ్విప్రవరుండు వారలపలుకు [4]లూహించి భీమసేను వచనంబులం దలంచి యగ్రభాగంబునకు వచ్చియున్న ధృష్టద్యుమ్నుం గనుంగొని వికలచిత్తుండును శోకాయత్తుండును నగుచు నిజపుత్రుండు సచ్చుట బ్రదుకుట యజాతశత్రువలన నున్నయాపు దెలియువాఁ డై యతని నడిగె నయ్యవసరంబున వాసుదేవుం డవ్వసుమతీపతి కి ట్లనియె.

309. తే. అడరి యీదివసము నప[1]రాహ్ణమునను
ద్రోణుఁ డని సేసిన శైనుఁ ద్రుంగిపోక
యుండ నేర్తురె యిక్కడి యోధు లెవ్వ
రైన [2]విను [3]నుతి గాదు సత్యమ్ము సుమ్ము.

---

307. 1. నదినెవమ్మోగ – పీ. శ. ష.

308. 1. విద్యాదిగుణంబులు – కొన్ని ప్రతులు. 2. కు గొదగొను నప్పుడు, కురుకు నప్పుడు – అని పాఠములు. 3. సకలామ్నాయవేదివి – ట. బి. వ. 4. లు హి తంబుగాఁ దలంచి – ఇ.

309. 1. రాంశమున – స. కొన్ని ప్రతులు. 2. సన్నుతి కాదు – ఖ. శ. ష. 3. మిథ్య గాదు – అ. వీ; మృష గాదు – ర.

310. క. సము నీతని కొప్పింపక
సముచితముగఁ గాచికొను మసత్యవచనదో
షము లేదు ప్రాణరక్షణ
సమయంబున నతనికొడుకు సచ్చెన యనుమీ.

311. వ. అని [1]పనిచె నట్టియెడ నయ్యుధిష్ఠిరుతో భీమసేనుం డే నప్పుడు కృష్ణుండు చెప్ప నయ్యోధవరు వధియించునుపాయంబు విని యదియ మనంబున నుండ మాళవేంద్రుం డగునింద్రవర్మవారణం బశ్వత్థామ యనుపేరిటిది నాచేతఁ జచ్చె నది నెపంబుగ నతనికి నశ్వత్థామ సచ్చె నని చెప్పితిఁ జెప్పిన నొక్కింత విచారించి యమ్మాటదెస ననాదరంబు సేసె నీకు విజయంబు గోరి హితం బుపదేశించు నీగోవిందునివాక్యం బుల్లంఘింపక నీవు నట్ల చెప్పుము నీవచనమ్ము నమ్ము నమ్మి యతండు గయ్యంబు సేయఁ జేయాడక చెడు నని యొత్తి చెప్పుటయు.

–: ధర్మజుఁడు ద్రోణునితో నశ్వత్థామ సచ్చె నని యేనుఁగు నెపంబునఁ జెప్పుట :–

సం. 7–164–165

312. క. మది నయ్యిరువురమాటలుఁ
బదిలంబుగఁ బట్టికొనుటఁ బట్టియు నెట్లుం
దుది నది యట్టుల కాఁగల
యది యై యుండుటను దాని కతఁ డొడఁబడియెన్.

313. వ. ఇట్లు సమ్మతించి

314. క. అనృతభయము నాజి జయముఁ
గొనియెడు తమకంబు పెంపు గుదియింపఁగఁ దాం
డునరేంద్రునగ్రతనయుం
డనుమానము వాయఁ బెట్టి యస్త్రగురునితోన్.

315. తే. వలయుకొలఁది నెలుం గెత్తి పక్షసమితి
యచ్చుపడఁగ నశ్వత్థామ సచ్చె ననియె

---

311. 1. పలికె – కొన్ని ప్రతులు.

నని పదంపడి యల్లన యతనిచెవికి
[1]వినఁగ రాకుండఁ గుంజర మనిరె నధిప.

316. వ. ఇవ్విధంబునం బలుకుటయు.

317. క. నేలకు నల్లెఁడు పొడువునఁ
గ్రాలుచు మును మెఱయు గురునిరథ[1]చక్రము ల
క్కాలంబున సమరజయ
శ్రీలోపము దెలియ [2]నంటనిలఁ బడిరె నృపా.

318. వ. అప్పుడు.

319. క. తనుఁ బాండుతనయులకు ద్రో
హునిఁగా నక్కుంభజన్ముఁ డూహించుచు న
మ్మునను లట్టు నెప్పి రటు గా
వునఁ గాకేమి యిది దగ వవుం బొమ్మనుచున్.

320. శా. ధృష్టద్యుమ్నునిఁ జూచుచుఁ రణసముద్రేకంబు బాహాబలా
వష్టంభంబును శౌర్యనిర్వహణగర్వస్ఫూర్తియుం దొంటియు
త్కృష్టత్వంబును దక్కి [1]ముక్కి వగ బుద్ధిం బిఁకువిఁ గాడఁగాఁ
జేష్టాహీనతఁ బొంది యగ్గురుఁడు సంక్షిప్తాంగుఁడై యున్నెడన్.

321. వ. అతని[1]వధంబునకై పాంచాలవిభుని వేలిమిం బుట్టినవాఁడగుట నప్పార్ష
తుండు దత్సమయజనితోత్సాహరోషవిశేషాయత్త చిత్తుండగుచు నమ్మ
హీసురవరుమీఁదం గవిసి యేసిన ననికి నొల్లని[2]యుల్లంబును బరుని[3]యుల్లా
సంబు సహింపలేనితేజంబును బురికొనిన యతండు వోరం దొడంగిన
దివ్యాస్త్రంబులు ప్రతిభాసింపక యుండె నట్లయినను మనసుబలిమికలిమిం

315. 1. తెలియకుండ కుంజర మని పలికె నధిప – ర. కొన్ని ప్రతులు.

317. 1. సత్తమము – కొన్ని ప్రతులు. 2. నంటి నిఱబడిరె – కొన్ని ప్రతులు.

320. 1. మ్రగ్గి – కొన్ని ప్రతులు.

321. 1. వధియించుటకై – ఐ. 2. యుల్లం బయ్యును బరని – ప. ఖ. వ. శ. ష.
3. యుత్సాహంబు – ఐ. త. న.

బకృతిబాణంబుల నాతనిబాణబాణాసనరథరథ్యసూతకేతనంబులు వోడిసేసె నాధృష్టద్యుమ్నుండు గద గొనినం దునియలు గావించెఁ బలకయు వాలు నుం గొని వచ్చి యవ్వీరుండు సారథితురంగంబులయంగంబుల వ్రయ్య నేయఁ దత్కరవాలఖేటపాటనంబు సేసి తనువునం బండకాండంబులు నించె [4]నట్లు నించి నొంచినం గని శినివరుుండు గృపకర్ణకృతవర్మలతోడం బెనంగు చుండియుఁ గ్రూరనారాచదశకం బయ్యాచార్యుమేన నిగిడించె నంత నత్యంతరయంబునం బనుదెంచి యనిలనందనుండు ద్రుపదనందనుఁ గుంభసం భవుంబారికిం [5]దప్పించుకొని పోయినం బో పొమ్మని పలికి డెందం బెప్పటి చందం బగుటయు నిశ్చలభావం బొందె నివ్విధంబున నాలుగుదివసంబులు నొక్కరాత్రియు నేనగుదివసంబులో నిరువదిగడియలు నిరువదియొక్కవే లట్టి తాడ ఖండనంబు సేసి పాండవబలంబుల నుబుమాడి పేరడవి [6]గొని కాల్చి పొనుంగువడిన కార్చిచ్చుపై వడిం [7]గుదిసి యమ్మహాత్ముండు.

322\. సీ. సంగరంబునఁ దన్వి సని శాంతిఁ బొందిన చిత్తంబుతోఁ [1]దమసేనదిక్కు
గనుఁగొని [2]పెలుచ నోకర్ణ యోకృప యోసుయోధన [3]పోర
నన్నొత్తి యెపుడుఁ
[4]జెప్పుదు రేను నాచే నయినంతయుఁ జేసితి నింక నిశ్చింతవృత్తి
సుగతికిఁ జనఁ గోరి తగ నుజ్జగించెద బాణాసనంబును బాణములును

తే. దెలివి గలిగి మనుం డని పలికి శరశ
రాసనము [5]లూడ్చి తేరిపై ననఘమూర్తి
యొప్పఁ గూర్చుండి సంభృతయోగనిష్ఠ
నొంది తేజోమయాత్ముఁడై యుండె నధిప.

323\. వ. అట్టియెడ ధృష్టద్యుమ్నుండు గృపాణపాణియుఁ బాదచారియునై భార ద్వాజుదెసకుం గవియుటయు నుభయసైన్యంబుల హాహాకారంబు లెసఁగె

---

4\. నట్లు నొచ్చినం గని - కొన్ని ప్రతులు. 5. దొలంగ గొని పోయినం - కొన్ని ప్రతులు. 6. దరికొని కాల్చి - ఒ. ళ. డ. న. ల. 7. గల్గి - ఇ.

322\. 1. తనసేన, మనసేన - అని పాఠములు. 2. పిలిచి యోకర్ణ - ఒ. అ. వ. 3. వినుడు మీ కొక్క హితము (వు) - ఔ. చ. ఝ. వ. పీ. శ. ష. 4. సెప్పెద నేను - వ. పీ. ష. 5. విడి తేరిపై - పెక్కు ప్రతులు.

[1]నంతం దనువు విడిచి యప్పుణ్యపురుషుండు [2]ప్రకటజ్యోతీరూపంబున నెగసి పరమస్థానంబునకుం జనియెఁ ద త్తేజోమూర్తి యేను గంటిఁ గృష్ణార్జున ధర్మనందనకృపాచార్యులునుం గనిరి దక్కటిమానవులు గానరు సురలు సూచి సంతసంబునం బొదలి ర ట్లడరిన యాద్రుపదనందనుండు.

-: ధృష్టద్యుమ్నుఁడు మృతుం డైన ద్రోణునికంఠంబు దునుముట :-

సం. 7_165_47

324. చ. అరదముపైకి దాఁటి [1]కుపితాత్మత ద్రోణుశవంబు కేశముల్
గరమున బెట్టువుర్చికొని ఖడ్గహతిఁ మెడ [2]ద్రుంచి వైచె స
త్వరముగ మాను మాను మనువాక్యముతో నరుఁ డేఁగఁ [3]దప్పు ను
మ్మర యని ధర్మజుండు దివి ముట్టునెలుంగున బి ట్టదల్పఁగన్.

325. వ. ఇత్తెఱంగునం దునిమి యతం డయ్యట్టయుం దలయును ధరణీతలగతంబు సేసె [1]నిట్లు శతవృద్ధుం డగునయ్యస్త్రగురుండు నీదుర్మంత్రంబునఁ ద్రుంగి పోయినం బొంగి పాండవానీకంబు పైకొని తఱిమిన మనమొనలు వెఱచఱచి కనుకనిం బఱచెం బఱచిన మనంబు గలంగి యప్పుడు నీకొడుకు [2]లేటమొగంబులు వడుదొరలతోడం గూడఁ దిరిగె నట్టియెడ దుర్యోధన దుశ్శాసనకృపకర్ణకృతవర్మమద్రేశ్వరులు మాతంగంబులం దురంగంబుల ముందఱ వెట్టికొని కటకటా యనుచు నింత పుట్టునే యనుచు నింక నేమి గల దనుచు నెట్లు సేయం గలవార మనుచు నేది దుది యనుచు మరలి మరలి చూచుచుం జనుచుండఁ దక్కినయలంతిమానుసు లెల్లను దలచీర వాటించు తలంపు లేక యొండొరుల నిలునిలు మని పలుకుచుం గాలు నిలువక పలు

---

323. 1. నంతకుమున్న – పెక్కు ప్రతులు. 2. పరంజ్యోతి రూపంబున; ప్రకటజ్యోతి స్స్వరూపంబున – అని పాఠములు.

324. 1. కుటిలాత్మత – ఇ. ఒ. ద. ల. 2. ద్రుంచెవచ్చిన, త్వరమ్ముడ – కొన్ని ప్రతులు. 3. ఫల్గునుమ్మర –వ. వీ. శ. ష. స. కొన్ని ప్రతులు

325. 1. ని ట్లతివృద్ధుం డగు – కొన్ని ప్రతులు. 2. బేలమొగంబులు, వెడమొగంబులు – అని పాఠములు. 3. ను వెర చరచి తలచీర వాటించు – ఇ.

[4]దిక్కులకుం బాఱి రత్తఱి నశ్వత్థామ ము న్నొక్కకెలనం గయ్యంబు సేయుచుండి నీసేన [5]య ట్లగుట గనుంగొని యక్కురుపతికడకుం జని యతని కి ట్లనియె.

326. తే. బలము లిది యేమి నలుగడఁ బాఱఁ జొచ్చె
గర్ణకృపముఖ్యు లేటికిఁ గలఁగి రేట
మొగము వడి రేల నీవును మున్ను వోలె
నిలువరింపంగ దగియెదు [1]నిలు[2]పు లేవ.

327. వ. అని యడిగిన నతం డతనిమొగంబు సూచి యాచార్యుతెగుట సెప్పం బోయి డగ్గుత్తికవడి యూరకుండె శారద్వతుండు వెలువెలం బాఱుచు నెట్టకేలకు నెలుంగు దెచ్చికొని.

328. సీ. పాంచాలపాండవప్రముఖసైన్యంబుల ద్రోణుండు బలువిడిఁ [1]ద్రుంచుటయును
నుక్కఱి పాండవు లొక్కచోటికి వచ్చి నిలువరింపఁగ లేక [2]తలఁకుటయును
వాయుతనూజుఁ డశ్వత్థామ సచ్చెఁ బొ మ్మని కుంభజునితోడ నాడుటయును
నమ్మాట గానక ధర్మాత్మజు నవ్వార్త యాచార్యుఁ డేర్పడ నడుగుటయును

తే. భీముచేత నశ్వత్థామనామగజము
మున్ను [3]చచ్చుటకతమున నన్నరాధి
పతియు నది నెపముగ నట్లు పలుకఁ బాల
నడలి యతఁ డాయుధంబులు విడుచుటయును.

---

4. దెసలకుం, దెరంగులం — అని పాఠములు. 5. గలంగుట గనుంగొని — ఛ. ఖ. చ. న. బ. శ. ష.

326. 1. నేర్పులేవ — ఊ. ఏ. ద. వ. 2. ప వేల, పు లేకొ — అని పాఠములు.

328. 1. ద్రుంచుటయును — పెక్కు ప్రతులు; ద్రుంచుచుండ — వా. 2. కలగుట యును — కొన్ని ప్రతులు. 3. చచ్చిన కతమున — బ.

329. వ. అప్పుడు

330. క. గురుఁ డమలయోగనిష్ఠం
దిరమై యుండంగ వచ్చి ధృష్టద్యుమ్నుం
డరదము మీఁది [1]కెగసి త
చ్ఛిరోజములు [2]పట్టికొని యసిం దునుమఁటయున్.

331. వ. చెప్పి యప్పుడు ధర్మనందనధనంజయులు వారింప నతం డుడుగక యట్లు సేసె ననియు నెఱింగించి యిట్లు భారద్వాజుండు పడిన బలంబులు విఱిగె నేమును నిరుత్సాహుల మయితి మేనుంగుపేరినెపంబుగా నట్టిమాట పుట్టుట కృష్ణకృతం బయినకపటోపాయంబు గానోపు నని [1]యంతయు నేర్పడం బలికె ననుటయు ధృతరాష్ట్రుండు సంజయుదిక్కు మొగం బై.

332. మ. వరదివ్యాస్త్రవిదుండు బాహు[1]ఘనుఁ డశ్వత్థామ శ్రీరాముతో
సరి సేయం దగువాఁడు దండ్రితల పాంచాలాత్మజుం డట్లు ని
ష్ఠురుఁ డై పట్టె ననంగ ద్రుంచె నన వించుణ వారితోఁ గూడ నా
తురుఁ డై పోయెనొ పోక నిల్చి [2]యలుకణ దోర్దర్పముం జూపెనో.

333. క. తను నాధృష్టద్యుమ్నుం
దునుమఁటకై కోరి [1]కనియె ద్రోణుఁడు పరమా
స్త్రనిరూఢిఁ బరశురాముఁ డ
తని కిచ్చినయంతవట్టు దన కతఁ డిచ్చెన్.

334. వ. అట్టిజనకు నాద్రుపదనందనుం డట్లు సేసిన నక్కొడు కెట్లు సేసెనో విన వలతుం జెప్పు మనవుడు నమ్మహీపతి కతఁ డిట్లనియె.

---

330. 1. కెగరి, కెగసి, కుటికి – అని పాఠములు; కరిగి – వా. 2. వట్టిదల యసిం దునుమఁటయున్ – ఇ. న. ర. ల.

331. 1. యెల్ల నేర్పడం – కొన్ని ప్రతులు.

332. 1. బలు డశ్వత్థామ – కొన్ని ప్రతులు. 2. విలసద్దోర్దర్పముం జూపెనో – ఊ. ఏ.

333. 1. కొనియె – ఔ. ల.

335. తే. కృపునిపలుకులు విని [1]దట్టకెంపు గదురు
గన్నుఁగవ నశ్రుజలములు గ్రమ్ముదేరఁ
బాణితలమున నొత్తి యాద్రోణతనయుఁ
డిట్టు లనుఁ దగఁ గౌరవాధిపుతోడ.

336. ఉ. చావులు తేవె యెందు ననిఁ జచ్చుట యొప్పదె యిట్లు లోకసం
భావితు నమ్మహాత్ముఁ దల పట్టె నొకం డను[1]వాఁడిమాట య
మ్మై వడిఁ దాఁకి చిత్తమున కార్తి యొనర్ప సహింపరాదు గా
[2]కే విన నున్కి వాఁ డెఱుఁగఁడే నను నిమ్మెయి భంగపెట్టునే.

337. క. నాదివ్యాస్త్రంబులు బా
హాదర్పము [1]నింకఁ గాల్పనా గురుఁ డాజిం
దా దిక్కుమాలి పగతుని
చే దైన్యముఁ బొందె నశె యిసీ యేమందున్.

338. క. దీనికి మూలము ధర్మజుఁ
డానిక్కము గల్గురాజు నని దండితుఁగా
నే నెట్లు సేసి పుత్త్రునొ
కో నా[1]చిత్తము కలంకయును నెవ్వగయున్.

339. ఆ. పుత్త్రుఁ గమట యెల్ల శత్రునిచేఁ దల
పట్టి తాను దునుమఁ బడుట కయ్యొ
నస్త్రగురున కింక నన నేమి గలదు నా
యిచ్చపాస కౌరవేంద్ర వినుము.

---

335. 1. దొడ్డకెంపు - అ.

336. 1. రెవేడిమాట - ఊ. ప. ద. ర. వ. హా. 2. కే విధి నోర్చువాడ నను నిమ్మెయి దైవము - వి.

337. 1. గాల్చు టొప్పు - కొన్ని ప్రతులు; కాల్పు కాల్పు - స. కొన్ని ప్రతులు.

338. 1. చిత్తంబు నలుకయును - కొన్ని ప్రతులు.

840. మ. హరియుం బాండవులుఁ మదీయపటుబాహా[1]శక్తిదివ్యాస్త్రని
ర్భరసంతాపపరీతులై యెదుఁగ ఘోరస్ఫారసంక్రీడఁ ద
త్తురగస్యందన వారణప్రకరముల్ ద్రుంగఁగ విజృంభించెద
నప్పరసంఘంబులు వచ్చి యడ్డుపడిన న్దుర్వారదర్పోద్ధతిన్.

841. క. తనుఁ దాన చెప్పికొను టొ
ప్పనిపని యగునైనఁ దండ్రిపరిభవము
గనలు గదిరి యి ట్లంటిని
విను మే నే మనిన [1]నేమి వృథ[2]వో దధిపా.

-: అశ్వత్థామప్రూన్కివలనఁ గౌరవయోధులు మరల ననికిఁ గడంగుట :-

సం. 7_166_43

842. వ. అని పలికి మఱియు ని ట్లను మాతండ్రి నారాయణు నారాధించి [1]యొక్కమహాస్త్రంబు వడసె నది నాకు నిచ్చె నద్దివ్యసాధనంబు వధ్యు లవధ్యు లను [2]విభాగంబు లేక విరోధివిధ్వంసనంబు సేయుఁ దత్ప్రయోగం బున జయంబు సేకొని యెదం జూడు మనుటయు నమ్మహీపతియు ననుజుల సేనాపతులును శంఖంబులు పూరించి సింహనాదంబులు సేసి మరలిన భేరీమృదంగాది తూర్యధ్వనులు నింగిముట్టఁ దురంగరింఖారథనేమిగజపద ఘట్టనంబుల నేల గ్రక్కదల మనసైన్యంబులు మరలి యురవడించె ననిన విని ధృతరాష్ట్రుండు.

843. ఆ. అట్లు గడఁగుకౌరవానీకములఁ గని
పాండుపుత్రు లేమిభంగివార
లై తెలుంగఁ జెప్పు మనవుడు నమ్మహీ
శ్వరున కిట్టు లనియె సంజయుండు.

---

840. 1. ముక్త - కొన్ని ప్రతులు.

841. 1. యంత్ర - ఐ. చ. 2. గా దధిపా - అ. ఆ. న. ఐ.

842. 1. నారాయణాస్త్రంబు - ఊ. ఏ. ఖ. వ. 2. విభేదంబు, విచారంబు - అని పాఠములు.

344. వ. ఇత్తెఱంగునం గురుబలంబులు పురికొనం గౌంతేయులుం గూడుకొని సైన్యంబు [1]సుసంగతంబు సేసికొని సంగరక్రీడ కమరి రప్పుడు గ్రీడి నాలోకించి ధర్మతనయుండు.

345. క. గురుఁడు పడిన నవ్విధమునఁ
బరమభయాకులతఁ బొంది పఱచియు నట వే
తిరిగి కురుబలము పోరికిఁ
గర ముద్ధతి [1]నగ్గలింపఁ గత మెయ్యదియో.

346. క. ఇలయును నింగియు నద్రువం
జెలఁగె [1]మహారవము వారిసేనల గురుచా
వలుక నొనర్చిన నక్కడ
బలరిపుఁ డేతెంచి [2]తోడుపడి నడచెనొకో.

347. వ. అనిన విని యమ్మనుజపతికి నతం డిట్లనియె.

348. ఆ. న్యస్తశస్త్రుఁ డైనయాచార్యుఁ జంపిన
నెవ్వ రొక్కొ వారి కివ్విధంబు
బలిమి గలుగఁ జేసి రలుక మై ననుచు సం
దియము పడఁగ నేల తెలియ వినుము.

349. చ. జనకు నధర్మవృత్తి మెయిఁ జంపుటకై తల వట్టె నొక్కరుం
డన విని రిత్త వోవునె మహాద్భుతశౌర్యము నస్త్రవీర్యముం
[1]మనము జగంబుఁ గన్న యతిమానుషవిక్రమశాలి వీని నె
వ్వని [2]కెదురంగ రా దనఁగ వ్రాలిన ద్రోణసుతుండు భూవరా.

---

344. 1. బురికొల్పుకొని - ట. బ.

345. 1. సంఘటింప - అ. ఆ. ట. బ; గవయు తెరంగు - గ.

346. 1. మహాధ్వానము - గు. 2. తోడుపడ నడచె - కొన్ని ప్రతులు.

349. 1. మనము బలంబునుం గల యమానుష - ర. స. హ; మనమి చలంబును గలయమానుష-కొన్ని ప్రతులు; మనమున నమ్మియుండినయమానుష - వ. 2. కి జయింప రా దనగ - ద. ప. వ.

350. తే. జన్మవేళన యాతఁ డుచ్చైఃశ్రవంబు
భంగి [1]హేషించెఁ బృథివి గంపంబు నొంద
నప్పు డతని కశ్వత్థామ యని యొనర్చెఁ
బేరు జనములు విన నశరీరవాణి.

351. వ. అతఁడు నూవె కౌరవసైన్యంబు నిష్పటిసంరంభంబునకుం గారణం బని చెప్పి వెండియు.

352. ఆ. అనఘ నిన్ను శిష్యుఁడును ధార్మికుండు స
త్య[1]వ్రతుండు నని మహాదరమున
నడిగె నీవు ధర్మహానికి నోర్చిన
గురుఁడు నిశ్చయించెఁ గొడుకుచావు.

353. క. చలము గొని యిట్లు వడయఁగ
వలయునె [1]రాజ్యంబు దీన వచ్చినకలిమిం
గలుగునె పెంపుం బేరును
వెలి యైతిమి లోకమునకు వేయును నేలా.

354. వ. అదియునుం గాక.

355. మ. వల దిట్లే లని యేను బేరెలుఁగునన్ వారించుచుం బాఱఁగాఁ
దల యిట్లేటికిఁ బట్టి త్రెవ్వ నడిచెన్ ధర్మ[1]ప్రణాశం బెదం
దలఁపం డాగ్రహవృత్తిఁ బార్షతుఁడు దద్దైన్యంబునం గ్రోధవి
హ్వలుఁ డై యీతనిపై వడిం బడక యశ్వత్థామ సైరించునే.

356. క. మనసేనల నొక్కెత్తునఁ
గొనఁ దలఁచి కడంగి వచ్చుగురుపుత్రుని మా

---

350. 1. ఘోషించె - పెక్కు ప్రతులు.

352. 1. వ్రతుండ వని - ఒ. ఘ. త. న.

353. 1. విజయంబు - ర.

355. 1. ప్రకారం బెదం - ఉ. ఐ. త.

ర్కొన ధృష్టద్యుమ్నునిఁ గా
వను శక్యమె నీకు నిఖిలవారికి నధిపా.

357. వ. అనినం గోపించి యనిలనందనుం డాసంక్రందననందనున కిట్లనియె.

358. చ. అడవుల నుండుతాపసులయట్టులు వల్కెదు రాజనీతి యి
ట్టొడఁబడి చేయ వచ్చి వధ కొల్లమి యొప్పునె ధర్మనిష్ఠ యె
క్కడఁ గల దాసభ ద్రుపదకన్యకపాటున కిట్టి వెన్నియుం
గడుకొని చేసినఁ మనలఁ గల్మష మొందఁగ నేర దర్జునా.

359. తే. అరులు మనమీఁద నురవడి నరుగుదేర
నేము సిడిముడిపడుచుండ నిట్టు లనుట
యొప్ప దురిసినపుండుల మప్పు వెట్టె
దరయ దీనికి నిన్ను నే మందుఁ బార్థ.

360. క. కురువీరు లెఱుఁగుదురు ననుఁ
గురువీరుల తెఱఁగు నేనుఁ గొంత యెఱుఁగుదుఁ
శర[1]పరిఘప్రహరణములఁ
బొరిగొని యెదఁ గాక వారిఁ బోనిచ్చెదనే.

361. వ. అని పలికె నప్పుడు ధృష్టద్యుమ్నుండు బీభత్సున కిట్లనియె.

362. చ. వెరవును లావు లేనిప్రజ వేయువిధంబుల దివ్యబాణవి
స్ఫురణము సూపిచూపి పొరివుచ్చె మహోగ్రత ధార్మికుండె య
గ్గురుఁ డది గాక యే నతనిఁ గూల్పను పుట్టినవాఁడ నింతప
ట్టరయక నన్ను నిట్లు సెడనాడుట పాడియె నీకు వావవి.

363. క. పితృసఖుఁ డగుభగదత్తునిఁ
బితామహుం డైనవృద్ధు భీష్ముని నీవు
ద్ధతిఁ జంపుట పుణ్యంబె
ప్రతివీరునిఁ జంపు టేల పాపం బయ్యెన్.

---

360. 1. పరికర పరిఘుంబుల - ష.

364. క. భూనాథుఁడు వొంకఁడు వినుఁ
మేనును ధర్మంబు దప్ప నిది యేటికి మి
థ్యానింద [1]శిష్యవంచకుఁ
డైన గురుఁడు వచ్చె గెలువు మరి సైన్యంబున్.

365. ఆ. అనియె ననుడు సంజయున కాంబికేయుఁ డి
ట్లను మునీంద్రజాతుఁ డైన ద్రోణు
నట్లు నేసి యద్దురాత్ముఁ డమ్మెయిఁ [1]బల్క
వినుచు నచటివారు గనల రెట్లు.

-: ద్రోణుపరిభవంబునకుఁ గోపించి సాత్యకి ధృష్టద్యుమ్ను నాక్షేపించుట :-

సం. 7_169_8

366. సీ. అనుటయు నాసూతతనయుఁ డవ్విభునకు ని ట్లను నతని రూక్షేక్షణముల
నరుఁ డువలక్షించి తొరఁగు[1]కన్నీరితో నిట్టూర్పు నిగిడించి యిట్టి రోఁత
మాట లేటికి నన మాఱు వల్కక హరి ధర్మపుత్రాదులు దలలు [2]వంప
నలిగి సాత్యకి ద్రుపదాత్మజుఁ గనుఁగొని నీజిహ్వ దునియదు నీశిరంబు

తే. వగుల దమ్మెయి గురునకుఁ బరిభవంబు
నేసి యిమ్మెయిఁ బలుకంగఁ జేయునదియుఁ
గలదె యీరాజసన్నిధిఁ గాన బ్రదికి
తింకఁ బలికిన నోరు వ్రేయింతుఁ జుమ్ము.

367. క. తనమాటె యని గంగా
తనయు శిఖండియ వధించెఁ దత్కార్యం బా
తనికిఁ బ్రియ మైనఁ బనిచెం
దన మనుమనిఁ బనుపు నేత దగదె నరునకున్.

---

364. 1. శిష్యమత్సరు డైన – చ.

365. 1. బలుకంగ నచటి వారలు గనలరెట్లు – కొన్ని ప్రతులు.

366. 1. కన్నీటితో – ట. ఙ. వ; కన్నీళ్ళతో – న. 2. వాల్ప – ర.

368. వ. ఆశిఖండియు నీవు నుద్భవించి పాంచాలకులంబు గీర్తికిం బుణ్యలోకంబునకుం బాపితి రనిన ధృష్టద్యుమ్నుండు నవ్వుచు నతని నవలోకించి.

369. క. సైరించిన నెఱుఁగవు నీ
చారిత్రము దలఁప [1]నన్యశరకృత్తకరుఁ
భూరిశ్రవుఁ జంపి తదియు
వీర[2]వ్యవహారమే వివేకవిహీనా.

370. తే. అతఁడు నీయొమ్ము ద్రొక్కిన యపు డొకండుఁ
జేయఁ జాలవ యగ్గురుసాయకములఁ
బాండవానీకములు విచ్చి పాఱ నెన్ని
యెడల మార్కొంటి వాతని నెఱుఁగ వెట్లు.

371. క. వలవని ప్రేలరిమాటల
నలిగింపకు నన్ను నేమి యాడిన నింకం
దల ద్రెవ్వ నేయుదుం గురు
బల మదె [1]పురణించె బడలుపఱుతము రమ్మా.

372. వ. అని పలికిన శినివరుండు [1]రోషారుణితలోచనుం డై కోదండంబు రథంబున నిడి గద పుచ్చికొని మాటల నలిగె దేని ప్రేటున శిక్షించెద ననుచు ధరణికి లంఘించి కవిసినం గని కేశవుండు పనుపం బవనతనయుండు రథంబు డిగ్గి రయంబునం జని పట్టి యాఱడుగులకొలఁది నిలువరించె నట్టియెడ సహదేవుం డాశైనేయు నుద్దేశించి మిమ్మును బాంచాలురం గడచినబంధువులు మాకును మమ్మును మిమ్మును మిగిలినబాంధవు లాపాంచాలురకును వారలకంటె మాకంటె నెక్కుడు సుహృజ్జనులు మీకును లే కునికి దెల్లం బిట్టిమీలో మీ[2]రెరవుపడం దగునే యలుక [3]దక్కు మనునెడ నాధృష్టద్యుమ్నుండు వడముడితో నతనిం బట్టక విడువుము నాచేతంగాని నీచేత నిలు

---

369. 1. వన్యశర కృత్త —కొన్ని ప్రతులు. 2. వ్యాపారమెయిది విక్రమహీనా—ద. వ.

371. 1. పురుడించె — హో. ల.

372. 1. రోషలోహితనేత్రుం డై — పెక్కు ప్రతులు. 2. రేవపడుట — వ. 3. మాఁద(మ)నునెడ — ఉ. ఊ. ఏ. త.

వండు నేనొక్కచేతి భూరిశ్రవుండనే యేల యడిచిపడియెదు ననవుడు నాభిమనేను బాహువులలోనం దిరుగుడువడుచు నురగంబుచందంబున సాత్యకి రోజు చున్నం గృష్ణయుధిష్ఠిరు లయ్యిరుపురం బ్రయత్నంబున వారించిరి తదనంతరంబ.

373. క. భేరీమృదంగశంఖమ
హా[1]రవములు సెలఁగ బాండవానీకంబుం
గౌరవసైన్యముఁ దాకెను
వారిధు లొండొంటిఁ దాఁకువడు [2]వమరంగన్.

374. క. మునుద్రోణునిఁ [1]బొలియించితి
మని పాండవబలము [2]బలియు నశ్వత్థామం
గొని కురుసేనయు నత్తఱి
ననూనగర్వమున నుద్భటాటోపమునన్.

375. వ. పెనంగం దొడంగె నప్పుడు ద్రౌణి దుర్యోధనుం గనుంగొని.

376. క. అనృతంబు పలికి బ్రదికెద
మని చూచినరాజుమూఁక లన్నియు నెత్తై
యనిఁ బడియెదునొ యెమ్మెయి
గనుకనిఁ [1]బఱచెదునొ చూడు కన్నారంగన్.

377. వ. అని పలికి నియతుం డయి యతండు నారాయణాస్త్రంబు ప్రయోగించిన.

378. మ. ధరణీచక్రము దిర్దరం దిరిగె మార్తాండుండు గుంభీభవ
త్కిరణుం డయ్యె దిశావితానము వడంకెన్ మిన్నదిర్చెన్ మహీ

---

373. 1. రావము సెలంగ - కొన్ని ప్రతులు. 2. వున గడిమిన్, వున మరలన్ - అని పాఠములు.

374. 1. వధియించితిమి, బొరియించితిమి - అని పాఠములు. 2. లెల్ల నశ్వత్థామం - వ. పి. శ. ప. కొన్ని ప్రతులు.

376. 1. పారెడినొ - పెక్కు ప్రతులు.

ధరసంతానము [1]లోలి గ్రక్కదలె నుద్భ్రాంతంబులై యంబుధు
ల్వొరలెం గట్టులమీఁద బిట్టపిడుగు [2]ల్మ్రోసెఁ [3]మహోదగ్రతన్.

379\. వ. ఇట్లు [1]భీకరప్రాదుర్భావం బైన యద్దివ్యసాధనంబు మండలార్ధచంద్రభల్ల నారాచతురప్రముఖంబులు ననలమయంబులు నగుననేకదేదీప్యమానమార్గణమూర్తులు గైకొని కౌంతేయసైన్యసంతానం బంతయు నొక్కపాయగాఁ గవిసినం గని తెంపుపెంపునం దత్సైనికనికరంబులు వివిధవిశిఖంబులఁ బరపుచు నయ్యాయిముఖంబుల మగిడించుచు [2]బలువునం గడంగినం బొంగుచు నింగిని నేలను నడుమను నాభీలజ్వాలాచ్ఛటాజటిలంబుగాఁ బైపయి నడరి యమ్మహాస్త్రంబు చతురంగంబులం ద్రుంగించుచు నెదురెంతెంత పెనంగె నంతంతియ పేర్చి యేర్చుచుం బఱవం దొడంగిన నమ్మోనలు పఱవం దొడంగె నప్పుడు నరుం డూరకునికి సూచి నారాయణుండును నతండును వినుచుండ ధర్మసూనుండు సాత్యకిధృష్టద్యుమ్నుల నాలోకించి యి ట్లనియె.

380\. సీ. ఆసభఁ బాంచాలి గాసిసేయఁగ నుపేక్షకుఁ డయి చూచెఁ బెక్కండ్రఁ గూర్చి
కొని బాలు నభిమన్యుఁ గూల్చె నించుకవడి యాఁగిన నర్జునుఁ డగ్నిఁ జొచ్చు
ననువగ మనల నాతనికిఁ దోడ్పడఁ బోవనీ కాఁగె నమ్మెయి నిట్టిధర్మ
పరుఁ డైనకలశసంభవుతోడ సరివచ్చు టుచితంబె యీవచ్చునుజ్జ్వలాగ్ని

తే. వలని కరిగెద మీరు మీవాహినులును
బాఱిపొం డెక్కడేని నప్పార్థుకోర్కి
యంత సఫలతఁ బొందెడు నచ్యుతుండు
నెట్లు [1]దనకు రుచించెఁ దా నట్లుసేయు.

---

378\. 1. గ్రక్కునం గదలె – పెక్కు ప్రతులు. 2. ల్మ్రోసె న్నమోఘోగ్రతన్ – చ. వ. (ద్రుతద్విత్వ సంధిగా చూడవలెను;) ల్మ్రోసె న్నితాంతధ్వనిన్ – వీర 3. విమేఘోగ్రతన్ – ర; విమోఘోగ్రతన్ – కొన్ని ప్రతులు.

379\. 1. భీకరప్రాదుర్భావం బైన యద్దివ్య–పెక్కు ప్రతులు; భీకరాకారం బై దుర్వారం బయిన యద్దివ్య – వా. 2. బలువునం గడంగిన – కొన్ని ప్రతులు.

380\. 1. దనకును రుచియించునట్లు సేయు – పెక్కు ప్రతులు.

881. వ. అనిన విని జనార్దనుండు సత్వరుం డై పెద్దయెలుంగున నెల్లవారును విన సైనికులారా సామజహయరథంబులు డిగ్గి యాయుధంబులు వెట్టి నిలువుండు భూమిగతు లగునిరాయుధుల నిమ్మహాస్త్రం బేమియుం జేయ దది యెట్లనిన నిట్లగుట దీనికిఁ బ్రతివిధానంబుగా దీని నొసంగినమహాత్ముండు విధియించె ననుటయు సకలజనంబులు నమ్మాట కియ్యకొని యట్లు సేయం జూచినసమయంబున సమీరనందనుండు.

882. చ. డిగకుఁడు వాహనంబులు గడిందిమగంటిమి గోలుపోవ మీ
రు గడఁక దక్కి వెట్టకుఁడు రూపఱ నాయుధముల్ మహాస్త్రశ
క్తి గెలుతు [1]గోత్రభిత్కులిశతీవ్రశరంబుల[2]వై భవంబు భూ
రిగదవిహారభంగియు నరిప్రకరంబులు పిచ్చలింపఁగన్.

883. వ. [1]అని బరవసంబు సేసి శంఖం బొత్తి మల్ల చఱిచి సింహనాదంబు నెలంగ నశ్వత్థామకు మార్కొనుటయు [2]నవ్వీరుం డదల్పుతో [3]నన్నారయణాస్త్రంబు నిగుడం జేసిన.

884. క. అనలశిఖాసదృశము లగు
ననేకబాణములు భీమునరదము వొదువం
గని యమ్మొనయోధులు వా
హనములు వెస డిగ్గివెట్టి [1]రాయుధము లిలన్.

885. వ. పదాతిజనంబులుం [1]గై దువులు [1]వెట్టి రప్పు డద్దివ్యసాధనం బెవ్వరికి బాధకంబు గాక యాభీమసేనుదెసకు మొగం బగుటయు.

886. క. నరుఁడు గని సత్వరంబుగ
వరుణాస్త్రం బేయుటయును వావిరి నది త

---

882. 1. సంపతత్కులిశతీవ్ర – చ. తి; నేన మత్కులిశతీవ్ర – ఊ. ఏ. ఖ. చ. శ. ష.
2. ధీరబుద్ధిభూరిగను విహార – తి.

883. 1. ర. ప్రతిలో ఈ వచనము లేదు 2. ను – కొన్ని ప్రతులు. 3. నవ్వి యతం డదల్పుతో –శ. ష. పెక్కు ప్రతులు.

884. 1. రాయుధచయముల్ – కొన్ని ప్రతులు.

885. 1. వై చిరి, విడిచిరి – అని పాఠములు 2. కమోఘం బగుటయు – ఈ. ఒ. డ. త.

త్పరుషత మాపెడునట్లుగఁ
బరగిన గురుసుతుఁడు పెద్దప్రబలం జేసెన్.

-: నారాయణాస్త్రపీడితుం డగుభీముఁ గృష్ణార్జునులు రథంబు డిగ్గఁ జేయుట :-

సం. 7-171-12

387. వ. ఇవ్విధంబున నశ్వత్థామ యమ్మహాస్త్రంబు దీపింపం జేసిన నది పేర్చి
కార్చిచ్చు వోదవుచందంబున సమీరనందనుం జుట్టుముట్టె నట్లు సమరవిముఖు
లై యేమియుం గాకున్న ధర్మనందనాదులను బలిమి [1]వదలనిచలంబున
ననలంబుచేతం బొదువంబడినవృకోదరునిం గని కృష్ణార్జునులు దేరు డిగ్గి
[2]రిత్తచేతులం బాఱి వారుణాస్త్రంబుకతంబునం బెద్ద గాలక యున్నయా
భీముని రథంబు డిగ్గఁ ద్రోవ డిగక బిగిసిన నచ్యుతుం డతని కిట్లనియె.

388. తే. ఇమ్మహాస్త్రంబుఁ గడిమిమైఁ గ్రమ్మఱింప
నెవ్వరికి రామిఁ జేసి కా కేమి శక్య
మైన నూరక యుండుదు మయ్యా వలవ
దుడుగు నాబుద్ధి విని డిగనుఱుకు తేరు.

389. వ. అనుచు నతని నిరాయుధుం జేసి యర్జునుండును దోడ్పడ నరదంబు డిగ్గఁ
ద్రోచె నిత్తెఱంగునఁ బాండవసైన్యం బంతయు దైన్యంబు నొందుటయు
నారాయణాస్త్రంబు ప్ర[1]శాంతిం బొందెఁ దదనంతరంబ.

390. క. హరి వనుప వారిబలములు
పురికొని వాహన[1]వితానములు శస్త్రాస్త్రో
ద్ధురభంగి నొప్ప నడరెం
గురుసేనలమీఁదఁ దూర్యఘోషము [2]సెలఁగన్.

---

387. 1. వదలమి ననలంబుచేత - ల. శ. ష. - పెక్కు ప్రతులు. 2. చేతులు మొగిచి రయంబునం బారి - డ.

389. 1. శాంతం బయ్యె, శాంతత నొందె - అని పాఠములు.

390. 1. విలాసములు - కొన్ని ప్రతులు. 2. లెసగన్ - శ. ష. కొన్ని ప్రతులు.

